శ్రీః

హరిః ఓమ్

శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీబెల్లంకొండ రామరాయ కవీంద్ర విరచితా

# వేదాన్తముక్తావళీ

దినకర్యనువాదకర్త

**మేళ్లచెర్వు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి**

సంపాదకః

రావి మోహనరాయః, M.Sc., M.A.(Sanskrit),

ప్రకాశకులు

శ్రీ అరుళానంద ట్రస్ట్

శ్రీ లలితానందాశ్రమము

వాడరేవు - చీరాల - 523 157.

శ్రీః

శ్రీబెల్లంకొండ రామరాయ కవీంద్ర విరచితా

# వేదాన్తముక్తావళీ

దినకర్యనువాదకర్త

**మేళ్లచెర్వు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, తెనాలి**

Cell : 99081 63627

ప్రథమ ముద్రణ : 22.10.2015, విజయదశమి
ప్రతులు : 500
మూల్యము రూ. : 200.00
పేజీలు : 512

© **రావి మోహనరాయః,** M.Sc., M.A.(Sanskrit),
404, Janjanam Complex., Opp: 1 Town Police Station,
CHIRALA - 523 157. Cell : 9440115411.

D.T.P.:
**P.PARVATHI**
CELL: 7416586775

Printed by :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.



ప్రకాశం జిల్లా, వినోదరాయనిపాలెం గ్రామస్తులగు

**డా॥నడిపినేని సూర్యనారాయణ ధర్మపత్ని కోటేశ్వరమ్మ గార్ల**

ఆర్థిక సహాయంతో ఈ గ్రంథము ముద్రింపబడినది.



## "నవ శార్దూలీ"

శా॥ పూర్వం యః ప్రకటీచకార కలయన్ జ్ఞానామృతాబ్ధీః శ్రుతీః
బ్రహ్మాత్మైక్యమనశ్వరం తదితరన్మిథ్యా జగన్నశ్వరమ్ ।
సోయం శంకరమందరః స్వరచనాప్రత్యజ్మతీన్ ద్వైతినో
మందేహాన్ తమసాంధితాత్మధిషణాన్ దృష్ట్వా విజేతుం బభౌ॥ 1

*బెల్లంకొండ కులోదయాద్రి మిహిరః శ్రీరామ విద్వత్కవిః*

శా॥ తత్తత్ద్వైతబుధబ్రువార్పితమృషామాలిన్య ధన్యేతరాం
అద్వైతావనిజాం పవిత్రచరణాం త్రాతుం నవాం రామతామ్ ।
స్వీకుర్వన్నవధూయ నైష్కుటికతాం శ్రీశంకరాచార్యరాట్
జజ్ఞే పమ్మిడిపాడుగ్రామ హృదయే గుంటూరు సీమ్ని స్థితే॥ 2

*బెల్లంకొండ కులోదయాద్రి మిహిరః శ్రీరామ విద్వత్కవిః*

శా॥ యే లోకాయత జైన బౌద్ధ ధిషణాః స్వర్గాది లుబ్ధాశ్చ యే
తాం స్తాన్ బ్రహ్మశిరోస్త్ర సత్య మహసా నిర్మూలయన్ శిక్షయన్ ।
మోక్షార్థ్యన్యతమత్వ హేతుముదితః తూష్ణీం జహౌ యాన్ బుధాన్
తానుద్దిశ్య సమగ్ర బోధనకృతే జాతః త్రిలింగావనౌ ॥ 3

*బెల్లంకొండ కులోదయాద్రి మిహిరః శ్రీరామ విద్వత్కవిః*

శా॥ భాష్యాదిష్వనియత్కటుత్వవచనైః యానక్షిపద్దేవతా
భక్తాన్ భాగవతాదిమాన్ గురువరః శ్రీశంకరస్సంయమీ ।

దృష్ట్వాద్య శ్రుతి భామినీ కుచపటీ దుశ్శాసనాన్ కృష్ణవత్
తన్మానావనతః త్రిలింగ ధరణౌ ఆవిర్బభూవాధునా ॥ 4

*బెల్లంకొండ కులోదయాద్రి మిహిరః శ్రీరామ విద్వత్కవిః*

శా॥ తర్కన్యాయకలాకలాపనిపుణాః శ్రుత్యర్థదూరాశయాః
అద్వైతాం శ్రుతిమాతరం వ్యదుహత ద్వైతార్థ జాలం ధియా ।
భంగా భంగ కవిత్వ విత్త్వ కుశలాః శ్లేషేంద్రజాలస్ఫురాః
తేషాం శాంబర డాంబరీం శమయితుం జాతః త్రిలింగావనౌ॥ 5

*బెల్లంకొండ కులోదయాద్రి మిహిరః శ్రీరామ విద్వత్కవిః*

శా॥ ప్రస్థానత్రయభేరివాదనకళా దుశ్శిక్షితైః తార్కికైః
వేదాంతస్వరభంజనైః సముచితం దుర్జ్ఞాన వృత్రాసురమ్।
వేదాంతాంబుధిఫేన రూషితవచోవజ్రాంచలైః ఘాతకః
నిష్పన్నో విబుధేశ్వరః శతమఖోయజ్ఞాయితైః పుస్తకైః ॥ 6

*బెల్లంకొండ కులోదయాద్రి మిహిరః శ్రీరామ విద్వత్కవిః*

శా॥ అద్వైతద్రుమబుధ్న సాంద్ర నిగమాంతారణ్య గాహన్యతః
యేఽహన్యంత బుధా ద్విధావశమతౌ వ్యాలోలజిహ్వాయుధైః ।
కించిల్లుంఛిత పల్లవా విదధితే ద్వైతోటజం గేహతః
తాన్నిస్సారయతీహ శంకరగురుః శార్దూలవిక్రీడితైః ॥ 7

*బెల్లంకొండ కులోదయాద్రి మిహిరః శ్రీరామ విద్వత్కవిః*

శా॥ ప్రజ్ఞాం త్రే కియతీం దిశేద్యది హయగ్రీవః ప్రసన్నోత్ర నః
దృష్టాంతః శ్రుతిశాస్త్రధర్మ కలితా యోగాది దక్షాస్య ధీః ।
సేనాన్యం శ్రుతి మాతురప్యతిరథం ప్రజ్ఞాస్వయంజ్యోతిషమ్
పప్యం ద్వైతతుషారతామసతతేః "గ్రంథప్రవాహం" నుమః ॥ 8

*బెల్లంకొండ కులోదయాద్రి మిహిరః శ్రీరామ విద్వత్కవిః*

శా॥ శార్దూలానధిరుహ్య శంకరగిరో దుర్గాః అమూం పౌరుషీం
శ్రిత్వా మూర్తి మమానుషేణ తరసా శ్రుత్యక్షరైః బృంహితాః ।
వాజిగ్రీవవిజృంభణాసహకృతాః శ్రుత్యర్థ పాటచ్చరాన్
శృంగద్వైతధరాన్, సుయుక్తి విశిఖైః నిఘ్నంత్యహో! కాసరాన్ ॥ 9

*బెల్లంకొండ కులోదయాద్రి మిహిరః శ్రీరామ విద్వత్కవిః*



**ఓం**

**నమో బ్రహ్మాదిభ్యో**

**బ్రహ్మావిద్యాసంప్రదాయకర్తృభ్యో**

**వంశఋషిభ్యో**

**నమో గురుభ్యః**

Dedicated to
Brahma and the Rishis
The Great Teachers
Who handed down Brahmavidya
Through Generations.

*This work is brought out with the complete financial assistance of **Dr. Nadipineni Suryanarayana** (Retd. Principal) and his beloved wife **Mrs. Koteswaramma**. I pray the al-mighty to grant boons to the translator of this work, Sri. **M.V. Subrahmanya Sastry and Donar - couple.***

- రామోరా, సంపాదకుడు.

# పూర్వార్ధ - విషయసూచికా

## పూర్వార్ధే - ఈశాదిచ్ఛాన్దోగ్యాన్తానాం ఉపనిషదాం వివృతిః. శ్లోకాః 424

పూర్వార్ధమ్ సమాప్తమ్

**ఉత్తరార్ధమ్ : శ్లోకాః 366**

బృహదారణ్యక, ఐతరేయ, కైవల్య, శ్వేతాశ్వతరాణాం చతసృణాముపనిషదాం వివృతిః

**శ్రీ బెల్లంకొండ రామరాయ కవీంద్రునిచే** రచింపబడిన **'దినకరీవ్యాఖ్యాసహిత వేదాన్తముక్తావళీ'** గ్రంథము ఇటీవలే పునర్ముద్రింపబడినది. **ఆంధ్ర 'దినకరి'**ని అందించిన **శ్రీ మేళ్లచెఱ్ఱు వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు** కడు ధన్యులు.

**అరుళానందట్రస్ట్** తరఫున ఈ గ్రంథము వెలువడుటకు అనుజ్ఞను ఇచ్చిన స్వామి **శ్రీ అరుళానందవారికి** నమస్సులు.

**- రామోరా.**

హరిః ఓమ్
శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీబెల్లంకొండ రామరాయ కవీంద్ర విరచితా

# వేదాన్తముక్తావళీ

దినకర్యనువాదకర్త

**మేళ్లచెర్వు వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రి**

## ఈశావాస్యోపనిషత్

శ్లో॥ శ్రీరామశ్రుతిశుక్తిగర్భజనితాన్యేతాని ముక్తాఫలా
న్యాసన్ద్రుభ్య సునిర్మలాని లలితైశ్శార్దూలవిక్రీడితైః ।
సూత్రై స్తే గళమర్పితుం కలయతే చిత్తం మదీయం ముదా
కారుణ్యాదనుకూలతామ్మయి భజ త్వన్మేఽస్తి నాన్యాగతిః ॥

శ్లో॥ భిత్త్వా తమోఖిలపదార్థవిభాసకస్సన్ పద్మాన్తరజ్గసువికాసవిధాయకో యః।
బ్రహ్మోస్పదాధిగతయే బుధమణ్డలస్య ద్వారాయతే దినకరస్స గతిర్మమాస్తు ॥

భా॥ రామా! వేదమను ముత్యపుచిప్పనుండి బయటపడిన ముక్తాఫలములీ ఉపనిషత్తులు. నిర్మలమయిన జ్ఞానప్రకాశమయిన ఈ తెల్లని ముక్తి ఫలములయిన ముక్తాఫలములను వరసగా శార్దూలవిక్రీడితవృత్తములతో గుదిగ్రుచ్చుచుంటిని. ఈ ముత్యాలమాలను నీమెడలో అలంకరించ వలయునని నా మనస్సు ఉవ్విళ్లూరుచున్నది. దేవ! దయతో దీనికి నీవు అనుకూలించుము. నీవు తప్ప నాకు మరొక గతిలేదు.

2

తమస్సును చీల్చి అఖిల పదార్థములను ప్రకాశింపజేయుచు, ప్రత్యేకముగా పద్మాం తరమును వికసింపజేయుచు, స గుణ బ్రహ్మోపాసకులయిన యోగులకు (అర్చిరాది మార్గములో) ద్వారముగానుండు ఆదిత్యుడు నాకును ఉత్తమగతి ప్రదుడగుగాక!

విశే : 1. అధిష్ఠానం తథా కర్తాకరణంచ పృథగ్విధమ్, వివిధాచ పృథక్చేష్టా దైవంచైవాత్ర పంచమమ్ । (గీత). కార్యసిద్ధికి చివరికారణము - దైవము. అందువలన దైవప్రార్థన

2. పద్మాంతరంగ= లక్ష్మి మనస్సుకు అని సూర్యుని నారాయణునిగా భావించిన అర్థము. గ్రంథముగా/బ్రహ్మముగా అయితే పద్మసంఖ్యగల అంతరంగములను వికసింపచేయును. - సహస్రాంతరంగములన్నట్లు -

3. వ్యాఖ్యాన గ్రంథము పేరు దినకరి. కనుక 'దినకరము' ముద్రాలంకారము.

4. సూర్యాశ్వైః మసజాః తతాః సగురవః శార్దూలవిక్రీడితమ్.

**శ్లో॥ ఈశావాస్యమిదం సమస్తభువనం త్యక్త్వార్థగేహాదికం**
**బ్రహ్మణ్యేవ ముముక్షుణాఽనవరతం నిష్ఠా విధేయాత్మని ।**
**అర్థత్వాయ చ తత్ర కర్మ విహితం కార్యం పురా నిష్ఫలం**
**విద్వానిత్థముపాచరన్ హి భజతే నిర్లేప ఆత్మేశ్వరమ్ ॥** **1**

భా॥ ఈ సమస్త లోకము ఈశ్వరునిచేత వ్యాప్తమయినది. కనుక ధనము గృహము మొదలగువాని మీద సంగమును వదలి ముముక్షువయినవాడు బ్రహ్మమునందే అనగా ఆత్మయందే నిత్యము 'నిష్ఠ' ఉంచవలయును. అందులో ముందుగా జ్ఞానార్థతకొఱకు ఫలవాంఛారహితమయిన నిష్కామకర్మ విహితమయినది. దానిని ఆచరింపవలయును. ఎటువంటి కర్మలేపము లేని విద్వాంసుడు ఈ విధముగా ఆచరించినచో ఈశ్వరాభిన్నమయిన ఆత్మను పొందగలడు.

పీఠిక

విశే॥ 1. అజరామరత్వాది లక్షణములుగల బ్రహ్మం సామాన్యుల అనుభవంలో అందకపోయినా జ్ఞానుల అనుభవంలో ఉన్న విషయమే. కనుక బ్రహ్మబోధకమయిన వేదములు ప్రమాణములే.

2. బ్రహ్మం సిద్ధమయితే దానిని సాధ్యముగా బోధించటం ఎందుకంటే, అది వివిదిషతో సాధ్యం అవుతుంది. అయితే సాధ్యం అయినంతమాత్రమున బ్రహ్మం అనిత్యంకాదు. అవిద్యవలన అది తెలియటం లేదు కనుక దానిని సాధ్యం అన్నాము - కంఠచామీకరన్యాయం ఇది.

3. ఆమ్నాయములు క్రియార్థమయితేనే ప్రామాణ్యం వస్తుంది. సిద్ధవస్తుబోధకమయినను వేదాంతములు ఆసిద్ధవస్తువుకు ఆవరణంగా ఉన్న అవిద్య తొలగటం అను క్రియను చేస్తాయి గనుక ఇవిగూడ ప్రమాణమే.

4. ప్రవృత్తిలాగానే నివృత్తి గూడ క్రియయే. 'అకర్మణి చ కర్మయః' అన్నారు గదా! లేదా, నివారించటం క్రియ అందాము. పైగా వేదాంతములు బ్రహ్మాకార మనోవృత్తిని కల్పిస్తాయి. **వృత్తి జ్ఞానం క్రియయే. అది మనోవ్యాపారం కదా!**

5. బ్రహ్మజ్ఞానం వ్యర్థము కాదు. దానికి సంసార నివృత్తి రూపమయిన ఫలితమున్నది. లేదా బ్రహ్మానందరూప ఫలమయినా ఉన్నది. అయితే బ్రహ్మానందం స్వరూపతః నిత్యప్రాప్తము. కాని అవిద్యావరణం వలన తెలియదు. కనుక ఆనందప్రాప్తి ఒకక్రియ. అదే మోక్షము.

6. బ్రహ్మము/మోక్షము నిత్యము. ధర్మార్థకామములు క్రియా సాధ్యములు. కృతకములు. అట్టివి అనిత్యంగానే కనబడుతున్నాయి.

7. మోక్షం జ్ఞానలభ్యము. అయినా జ్ఞానకార్యంకాదు. కనుక కృతకం కాదు. అది నిత్యము నిరతిశయము. పరమపురుషార్థము. వేదాంతైకసాధ్యము. కనుక వేదాంతములు ప్రమాణమే. (జ్ఞానం వలన జరిగేది "అజ్ఞాన భంగం" అను, కార్యము. దానివలన మోక్షం కనుక మోక్షం జ్ఞాన కార్యం కాదు.)

8. తర్కాదిశాస్త్రములు బ్రహ్మజ్ఞానమును ఇవ్వలేవు. అవి సాదులు. పురుషబుద్ధి కృతములు. వేదాంతము అనాది అపౌరుషేయము. అనాది అయిన వేదాంతములను సాదులయిన తర్కాదిశాస్త్రములు అపవాదం చేయలేవు. వేదాంతశాస్త్రమే వానిని అపవదిస్తుంది.

9. వేదాంతములు అనుభవంలోలేని, విరుద్ధమయిన విషయమును చెప్పటంలేదు. అది జ్ఞానుల అనుభవంలో ఉన్న విషయమే. జీవుడు సంసారికాదు. శుద్ధ చైతన్యమే అని జ్ఞానుల అనుభవము. అజ్ఞానులకయినా సుషుప్తిలో సుఖానుభవం సాక్షి అయిన జ్ఞానమున్ను తెలుసు.

10. జనకయాజ్ఞవల్క్యాది సంభాషణలున్నంతమాత్రాన వేదం 'సాది' కాదు. "త్రికాల దర్శిని" అయిన శ్రుతి భవిష్యత్కాల సంబంధి అయిన ఆ సంవాదమును ముందుగానే ఉదాహరించింది. వేదం ఈశ్వర నిర్మితం గనుక 'సాది' అనరాదు. ఈశ్వరుడు పూర్వ కల్పవేదమును ఈ కల్పములో మనకు స్మరించి ప్రసాదిస్తాడు. అపౌరుషేయమనగా గురుశిష్య పరంపరగా 'ఉచ్చారణ - అనూచ్చారణ' మాత్రము జరుగుతున్నది గనుక ఎవరో ఒక పురుషుని నిర్మాణం కాదు గనుక అపౌరుషేయం అన్నారు.

11. ఇక అనాదిత్వం విషయం - బ్రహ్మం దృష్ట్యా అంతా సాదియే. ప్రపంచం దృష్ట్యా మాత్రం వేదం అనాది, అపౌరుషేయం. బ్రహ్మం తప్ప అన్నీ సాదులే.

12. వేదాంతములు అన్యోన్యవిరుద్ధార్థములను చెప్పుతున్నాయి. చూ॥

(ఎ) ఏకమేవాద్వితీయం బ్రహ్మ, నేహ నానాస్తి కించన, మృత్యోస్స మృత్యుమాప్నోతి, య ఇహ నానేవ పశ్యతి - ఇవి ప్రపంచం లేదంటున్నాయి.

కాని

"యతోవా ఇమాని భూతాని జాయంతే-'

"ఆత్మన ఆకాశః సంభూతః", ససర్వజ్ఞః సర్వవిత్" - సర్వం, ప్రపంచం ఉన్నదంటున్నాయి.

(బి). ద్వాసుపర్ణాసయుజాసఖాయా - అని జీవేశ్వరభేదం చెప్తున్నాయి.

కాని

"తత్త్వమసి", "అయమాత్మా బ్రహ్మ" ఇవి అద్వైతమును చెప్తున్నాయి.

(సి) అక్షయ్యగ్ంహివై చాతుర్మాస్యయాజినః సుకృతం భవతి - ఇది కర్మకు నిత్యఫలం చెప్తున్నది.

కాని

"తద్యధేహకర్మచితోలోకఃక్షీయతే-" అని కర్మఫలము శాశ్వతము కాదని చెప్తున్నవి

సమా

(ఎ) ప్రపంచం ఉన్నది - వ్యవహారదశలో; ప్రపంచం లేదన్నది - పరమార్థమయిన జ్ఞానదశలో. ఇందులో వ్యవహారదశ మాయా మయమయినది భ్రాంతిదశ. రజ్జుసర్పంలాగా ప్రపంచం కనబడుతుంది. కాని మిథ్య. మాయాతీతమయిన పరమార్థదశలోను, సుషుప్తి మొదలగు అజ్ఞాన దశలలోను ప్రపంచం కనబడదు. సాక్షిగా ఆత్మ దొఱకుతుంది. కనుక రెండు శ్రుతులు రెండు దశలను బోధిస్తున్నాయి కనుక విరోధం లేదు.

(బి) ఇక జీవేశ్వర భేదం - విషయం. అదీ ఇంతే. మాయ ఉపాధిగా ఈశ్వరుడు, అవిద్య ఉపాధిగా జీవుడు వ్యవహారదశలో ప్రపంచ దశలో ఉంటారు. పరమార్థదశలో శుద్ధ చైతన్యం తప్ప ఏదీ లేదు.

(సి) కర్మ ఫలమును ఒక్కచోట నిత్యమనటం ఆ కర్మయొక్క స్తుతికోసము. ఇతర కర్మల కన్న అది దాని గొప్పతనమే తప్ప వాస్తవం కాదు. సర్వకర్మఫలములు అనిత్యములే. కనుక అర్థవాద వలన మంత్రమునకు విరోధము లేదు.

13. ఉపనిషత్తులు, భాష్యాలు సూత్రాలు ఉన్నా మరల నాగ్రంథం ఎందుకంటే, సరలబోధ కొఱకు, సర్వజాతుల అధ్యయనముకొఱకు ఉపయోగపడుతుంది. ఇది విషయము.

14. ప్రారంభకారణం సరలబోధ, సర్వజాతి బోధ. ప్రయోజనం బ్రహ్మజ్ఞానము. అధికారి సన్న్యాసి ముముక్షువు, శాంతచిత్తుడు, సంబంధం ఈ గ్రంథము ఆ విషయమును బాగా ప్రతిపాదించటం. కనుక **అనుబంధ చతుష్టయము** కుదిరినది.

'అధికారి, సంబంధము, విషయం, ప్రయోజనము - 4'

15. ఉపనిషత్తులు 108 ప్రసిద్ధమయినవి. అందు 10 ఉపనిషత్తులు ముఖ్యములు. ఈశ (ఈశావాస్యం) కేన కఠ ప్రశ్న ముణ్డ మాండూక్య తిత్తిరిః, ఛాందోగ్యం బృహదారణ్య మైతరేయంచ" అని పది.

ఇందులో వేదాంతముక్తావళి ప్రధమార్ధములో '8' వ్యాఖ్యానింపబడును. ఉత్తరార్ధములో బృహదారణ్యం ఐతరేయం మొదలగునవి వ్యాఖ్యానింపబడును.

ప్రథమశ్లోక వ్యాఖ్య – విశేషములు

16. ఈశ్వరుని చేత వ్యాప్తములేక ఆచ్ఛాదితమయినదీ ప్రపంచము. రజ్జువునందు పుట్టిన సర్పము రజ్జు జ్ఞానముచేత (పరమార్ధదశలో) ఆచ్ఛాదింపబడును. అనగా లేనిదగును. అంటే మాయా కారణముగా బ్రహ్మమునందు పుట్టిన యీ జగము బ్రహ్మజ్ఞానముచేత ఆచ్ఛాదితమగును. కబళింపబడును. ఈశ్వరుడు అనగా చైతన్యము. కనుక రెండే పదార్థములు 1) దృక్ 2) దృశ్యము. అందులో దృక్ సత్యము చైతన్యము. దృశ్యము నశ్యము. జడము.

కనుక వ్యాపకుడయిన ఈశుడు తప్ప జీవుడు విడిగా లేడని సూచన. ఆ ఈశ్వరుడే జీవుడుగా దేహ ప్రవేశం చేసినట్లు తైత్తిరీయాదులలో వ్యక్తమయినది. అలాకాక జీవుడు ఈశ్వర భిన్నంగా ఉంటే దృశ్యం కనుక జడం, అనిత్యం మిథ్య అవుతుంది. వ్యాప్యమయితే పరిమితంకనుక మిథ్య అవుతుంది. కాని జీవుడు గూడా అజుడు నిత్యుడు విభువు. అని చెప్పబడినది. కనుక ఈశుడంటే ప్రత్యగాత్మయే అయిన ఈశ్వరుడే.

17. "యేన సర్వమిదం తతమ్" అని జీవుడు గూడ విభువు అనగా సర్వవ్యాప్తుడని చెప్పబడినది. దేహపరిమితుడే అనుకొనటం భ్రాంతియే. దేహపరిమితం అంతఃకరణమే. కనుకనే జీవేశ్వరులు మిథ్యకారు. వారిద్దఱు ద్రష్టలే "సలిల ఏకో ద్రష్టాద్వైతః"అని ద్రష్టను ఒక్కడిగానే చెప్పింది శ్రుతి. "నాన్యోతోస్తి ద్రష్టా" అని శ్రుతి మరొక ద్రష్ట లేడన్నది.

18. ఇద్దఱు ద్రష్టలున్నారనటం కుదరదు. ఎవరు దృశ్యుడు? ఎవరు నశ్యుడు? ఎవరు ద్రష్ట? ఎవరు నిత్యుడు? అన్న సంకటం వస్తుంది. కనుక అద్వైతమే అభేదమే. ఇద్దరూ చైతన్యరూపులు కనుక ఏకత్వమే యుక్తము.

19. ఈ చైతన్యము స్వతంత్రము. మిగిలినది జడము పరతంత్రము. జడము చేతనునకు పరతంత్రము – అని అనుభవ సత్యము. కనుకనే 'ఈట్'. అట్టి 'ఈట్' అనగా ఈశ్వరుడు, వ్యాపకుడు. ప్రపంచము వ్యాప్యము. వ్యాపకమునకు వ్యాప్యము పరతంత్రము. సృష్ట్యాది కర్త కనుక ఈశ్వరుడే వ్యాపకుడు. **మట్టి వ్యాపకం, ఘటం వ్యాప్యం కావటానికి అదే గదా! కారణము. వ్యాప్యము కన్న వ్యాపకము తత్త్వతః భిన్నం కాదు. కారణం కార్యం కన్న భిన్నం కాదు**. భిన్నం అయితే వ్యాపకం వ్యాపకమే కాదు. ఈశ్వరుడు లేనిదే జగత్తు లేదు. కనుక ప్రపంచము ఈశావాస్యం – ఆచ్ఛాదనీయం. కబళీకృతం. కనుకనే జగత్తు మిథ్య. మూలం లేనిదే దాని శాఖ ఉండదు. కారణం అయిన మట్టిలేనిదే కార్యం అయిన కుండ ఉండదు. వ్యాపకం లేని వ్యాప్యం ఉండదు. కనుక జగత్తు మిథ్య. ఇలా దృశ్యం మిథ్య కనుక ద్రష్ట ఒక్కడే సత్యమని తేలును. ఎన్ని మిథ్యావస్తువులున్నా అవి తత్త్వతః సత్యం కావు. నామరూపమాత్రమయిన అస్తిత్వమే. కనుక బ్రహ్మం సత్యం. కనుక

"ఈశావాస్య మిదం సర్వం" (భువనం) అన్న వాక్యము "బ్రహ్మ సత్యం – జగన్మిథ్య" అన్న విషయం చెప్తున్నది.

20. ఆత్మయే బ్రహ్మం. "యత్సాక్షాదపరోక్షాత్" అని శ్రుతి. "అయమాత్మా బ్రహ్మ" వీరి అభేదం చైతన్యైకరూపత్వం. భేదం సంసారం వలన. ఆ సంసారం ఉపాధి అయిన అంతః కరణం/ లింగ శరీరం వలన. ఆత్మ మాత్రం నిరుపాధికము.

21. బ్రహ్మనిష్ఠావిధి వలన బ్రహ్మోపదేశం వలన కర్మకాండ వ్యర్థం కాదు. అది అధికారికి అర్హతా కారణము. ముముక్షువు అసంగుడై ఫలవాంఛారహితంగా చేయు పనులవలన అతనికి చిత్తశుద్ధి రూపమయిన అర్హత లభిస్తుంది. పైగా కర్మనిష్ఠయందు అజ్ఞానులకే అధికారము. అది ప్రవృత్తిమార్గము. జ్ఞాననిష్ఠయందు శుద్ధచిత్తులయిన గృహస్థులకు, సన్న్యాసులకు అధికారము. అది నివృత్తి మార్గము. కర్మనిష్ఠ జ్ఞాననిష్ఠకు పూర్వసోపానము. కనుక ఈ రెండూ కలిసి మోక్షమునకు కారణము కాదు. జ్ఞానమాత్రమే మోక్ష కారణము. అందువలన జ్ఞానకర్మ సముచ్చయము కుదరదు. శుకాదుల వద్ద కర్మలు కనబడవు. కనుక జ్ఞానమార్గప్రవేశయోగ్యత అయిన వివిదిష/ జిజ్ఞాసను పుట్టించుటకు కర్మయోగం అవసరం. "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి..." అని కదా!

22. బ్రహ్మనిష్ఠ చివరిది. దానివలన పరమాత్మప్రాప్తి. బ్రహ్మాత్మైక్య - అనుభవము. "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" గదా! శుక వామదేవాదులంతే కదా! అందుకని ముముక్షువు నిత్యం బ్రహ్మరూపమయిన ఆత్మనిష్ఠతో నుండవలయును.

ఇలా ఈ శ్లోకములో అధికారి ముముక్షువని, ఫలం బ్రహ్మాత్మైక్యమని, విషయం జీవేశ్వరాభేదమని చెప్పబడినవి. ఇవే విషయాలు ముందు శ్లోకాలలో వివరింపబడును. ఇది సర్వ మూలమయిన విషయసారము. "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అను సూత్రానికిది పర్యాయ వాక్యము. 1

**శ్లో॥ భిన్నోఽస్మాద్విషయాశయోఽన్ధతమసో లోకాన్ప్రయాత్యాత్మహా**
**సంసారం యదవిద్యయా కలయతే స్వాత్మన్యయం హ్యాత్మహా ।**
**తత్త్వం నిశ్చలమాత్మనోఽపి జవవచ్చిత్తాద్భుతాతీన్ద్రియం**
**సర్వవ్యాప్యపవిక్రియం రవిమరుద్వహ్న్యాదిచేష్టా దధత్ ॥ 2**

భా॥ జ్ఞానికన్న భిన్నుడయిన యీ అజ్ఞాని విషయాసక్తుడై అంధతామిస్రమయిన లోకమును చేరును. ఆవిధముగా అతడు తన ఆత్మను చెడగొట్టి "ఆత్మహా" అగును. అలాగే తన ఆత్మస్వరూపమునందు అవిద్యతో సంసారమును అధ్యాస చేయువాడు "ఆత్మహా" అగును. ఆత్మతత్త్వము ఆచంచలమయినా అది మనస్సుకన్న వేగమయినది. అది ఇంద్రియాతీతమయినది, అయినా సర్వవ్యాపకమయినది. నిర్వికారమయినది. అయినను సూర్య, వాయు, వహ్ని - మొదలగు ఆకార కృత్యములను పొందును.

విశే॥ 1. అనాదికాలము నుండి అనాది కర్మ బద్ధుడయిన జీవుడు ఆయా కర్మవశమున

84లక్షల జీవరాశులలో ఏదో ఒక జన్మ పొందుచు తనను ఉద్ధరించు కర్మగాని జ్ఞానముగాని దొరకక దుఃఖాలను అనుభవించి చివరకు ఏదో పుణ్యవశమున ఈ మానవజన్మను ఎత్తును. అందులో గర్భంలో ఉన్నపుడే తాను జన్మించిన తరువాత ఏమిచేసి బాగుపడాలో యోచించును. గర్భమునుండి బయట పడినంతనే కర్మలతో భక్తితో ఈశ్వరుని సేవించి ఆయన అనుగ్రహముతో మోక్షము పొందెదనని భావించును. కాని జననం తరువాత ఆ వివేకం పోతుంది. బాల్యంలో ఆటలతో వయస్సులో కామములతో ముసలితనములో దిగుళ్ళతో కాలం గడుపుతాడు. మఱల పాపాలు చేసి పుణ్యాలు చేయక, కర్తవ్యమును వదలి చివరకు నరకానికి పోతాడు. లేదు పశు పర్వతాది జన్మలను ఎత్తుతాడు. మనుష్య జన్మకాని దేవజన్మకాని వానికి దుర్లభము. అవి పుణ్యఫలముగా వస్తాయి.

కనుక యోగ్యమయిన నరజన్మ పొందిగూడా, మోక్షసాధనానుష్ఠానం చేయక, తన ఆత్మను బంధము నుండి విడిపింపక మరల సంసార నరక కూపములలో పడవేయువాడు "ఆత్మహా" యే గదా! తనను బావిలో పడవేసికొని చచ్చువాడు గూడా "ఆత్మహా" కదా! ఇదీ అంతే. కనుక విద్యతో విడిపించికొని బాగుపడువాడు ఆత్మబంధువు. అలాగే

2. అవిద్యతో తనమీద సంసారమును ఆరోపించికొనువాడుగూడా "ఆత్మహా". వాడు తనకు తాను శత్రువే కదా!

"అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్" – గీత.

అంతేగాక దేహమే ఆత్మ అని భావించువాడు ప్రారబ్ధాంతములో ఆదేహమును పోగొట్టుకొని మరల మరోదేహం అలా జన్మజన్మకు అంతులేని దేహాలను చంపుకొంటాడు. కనుక వాడు ఆత్మహా.

3. ఇలా ఆత్మహత్యాదోషములు తగులుతాయి కనుక మోక్షసాధన చేయాలి. జన్మరాహిత్యానికి ప్రయత్నించాలి. విషయవాంఛలు వదలాలి. స్థాయికి తగిన విధముగా మోక్షసాధనలను చేయాలి. చూ॥ భాగవతం "లబ్ధ్వాసుదుర్లభమిదం బహుసంభవాంతే మానుష్యమర్థదమనిత్యమపీహ ధీరః తూర్ణం యతేత న పతేదనుమృత్యు యావన్నిశ్శ్రేయసాయ విషయః ఖలు సర్వతః స్యాత్" – బాగవతము.

4. అయ్యా! అట్టి మోక్షదాయకమయిన ఈశ్వర తత్త్వము ఏమిటి? తత్త్వం నారాయణ స్వరూపము. "తత్త్వం నారాయణః పరః" గదా! తత్ = బ్రహ్మం – ఓం తత్సదితినిర్దేశః

బ్రహ్మణః త్రివిధః స్మృతః – గీత. బ్రహ్మత్వము బ్రహ్మమే. దానికి ధర్మములు లేవు. ఆ బ్రహ్మము నీవే అని మరొక అర్థం.

5. ఆత్మతత్త్వము నిశ్చలము – కాని వేగవంతము. ఇది ఇలా కుదురుతుంది. ఒక గ్రామమునకు బయలుదేరిన వారిద్దరిలో ఒకడు ఆగ్రామము చేరుసరికి రెండవవాడు అచ్చట కనబడినచో అర్థమేమి? (వినాయక చవితి కథలో కుమారస్వామికి వినాయకుడట్లే కనబడినాడు)

మొదటి వానికన్న రెండవవాడు వేగంగావెళ్లినట్లు భావించాలి కదా! అలాగే సర్వవ్యాపి అయిన ఆత్మ మనస్సు చేరిన ప్రతిచోట ముందే అక్కడ ఉన్నట్లు కనబడుతుంది – అందువలన ఆత్మతత్త్వము మనసుకు ఇంద్రియాలకు అందనిది. గుఱ్ఱంకన్న వేగమయిన జింకను దున్నలు అందుకొన లేవుగదా! సర్వవ్యాపి కనుక వాస్తవంగా చలనముండదు. కనుక నిశ్చలము.

6. నిర్వికారము. జననమరణాలు లేకపోవటం వలన నిర్వికారము. పూర్ణమయిన వస్తువుకు రాకపోకలుండవు గదా! అది సర్వతః వ్యాప్తమే కదా? జననమరణములు లేవు. జననం ఉంటే షడ్భావ వికారాలుండవచ్చును. "అస్తి – వర్ధతే – విపరిణమతే – అపక్షీయతే నశ్యతి".

7. సత్త బ్రహ్మధర్మము కదా! – జన్మాధీన సత్త బ్రహ్మధర్మము కాదు. "అది కాలత్రయ సత్త. లేదా ఇంద్రియాధీన సత్త విషయ సత్త. అతీంద్రియసత్త బ్రహ్మసత్త. ఈ సత్త భావవికారాలలోది కాదు. బ్రహ్మం పుట్టదు గదా!

8. అతీంద్రియవస్తువయినా ఉన్నదనటానికి కారణం సూర్యాదుల వలన వాటిని శిల్పంగా మలచినస్థపతి ఉన్నట్లు గుర్తింపు. అచేతనమునకు చేతనం నాయకం కదా! ఉలిని పని చేయించటానికి వడ్రంగి అవసరం కదా! నియామ్యమయిన ప్రపంచమునుబట్టి నియామక తత్త్వమును ఊహించవలయును. లేదా, నిర్వికారమయినా బ్రహ్మము సూర్యాది శరీరములు దాల్చి ఆయా పనులు చేస్తున్నదనవచ్చును. లేదా – వారిని వారినామరూప కర్మములను పోషించును. ఆరోప్యమయిన జగత్తువలన అధిష్ఠానమునూహించెదము. లేదా సూత్రాత్మరూప మయిన బ్రహ్మమే సూర్యాది కృత్యములు చేయును. కాగా హిరణ్యగర్భునిబట్టి ఆయనకు ఆత్మ అయిన బ్రహ్మమునూహింపవలయును. 2

**శ్లో॥ నేదీయో విదుషాం విభాత్యవిదుషాం దూరస్థవద్యత్పునః**
**సర్వాన్తర్బహిరాస్థితం తదయతే భూతేషు సర్వేషు యః ।**
**భూతాన్యాత్మని తత్ర పశ్యతి చ యో భూతాని యస్యాప్యసా-**
**వాత్మైవాస్తి యదా తదాస్య విదుషః కశ్శోకమోహోదయః ॥ 3**

భావ॥ ఆ బ్రహ్మము జ్ఞానులకు అత్యంత సమీపంగా (ఆత్మరూపంగా) భాసిస్తుంది. అజ్ఞానులకు అతిదూరంగా ఉన్నట్లు భాసిస్తుంది. సర్వభూతములందు ఆ బ్రహ్మము బాహ్యాంతరములయందు ప్రకాశిస్తున్నది. అట్టి ఆత్మయందే సమస్తభూతములుగలవని, సమస్త భూతములు ఆత్మరూపములేనని, గమనించి ఆ ఏకత్వమును అనుభవమునకు తెచ్చికొనగల జ్ఞానికి శోకము మోహము ఎలా కలుగుతాయి?

విశే॥ 1. అజ్ఞానులకు బ్రహ్మం 'మఱచిపోయిన మెడలో గొలుసు వంటిది' కంఠచామీకర న్యాయము.

2. "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" గదా!

3. ఆత్మయందు వివర్తరూపంగా కల్పితమయిననే ఈ భూతములు. అవి మిథ్య కనుక ఆత్మమినహా వాటికి తత్త్వం లేదు. మట్టికుండయందు మట్టిని తొలగిస్తే కుండ మిగలదుగదా! కనుక అనుగతమయిన అధిష్ఠానమయిన ఆత్మయే ఇదంతా అని భావించాలి. "ఆత్మైవేదం సర్వం" అన్న భావన. ఇక ద్వితీయ వస్తువు లేదు. మరి అతనికి శోకం ఎవరివలన? మోహం ఎవరిమీద? దేనికొఱకు? – కనుక అవి ఉండవు. 3

**శ్లో॥ ఆత్మాసౌ విభురప్రవత్ప్వవిమలో భాస్వానలిఙ్గోఽ తను–**
**శ్శుద్ధోఽ పాపహతః ప్రభుస్సకలదృఙ్ముక్తో మనీషీ ధ్రువః ।**
**సర్వేషాం పరిభూః స్వభూః సమమయస్సంవత్సరాఖ్యప్రజా–**
**నాథేభ్యో విదధద్యథోచితమిమానర్థాన్ సమీష్టే స్వయమ్ ॥ 4**

భా॥ ఆత్మస్వరూపమిది. ఆత్మ వ్యాపకము. ఆకాశము వలె నిర్మలము. కాని స్వయం ప్రకాశుడు. అందుకని జీవుడుకాడు. ఎందుకంటే లింగశరీరము లేదు. స్థూల శరీరమూ లేదు. కనుకనే శుద్ధుడు అపాపహతుడూ అనగా పాపరహితుడు – య ఆత్మా అపహత పాప్మా – గదా. ప్రభువు కనుకనే సర్వజ్ఞుడు. కనుకనే మనీషి. అనగా సర్వబుద్ధులకు అందువాడు. కాని బుద్ధిధర్మాలు ఆయనకు అంటవు. శాశ్వతుడు. ప్రభువు కనుక అందరిని తలదన్నిన వాడు అందరూ ఆయనకు భయపడవలసిన వారే. 'న తత్ర సూర్యోభాతి – ' గదా! "భీషాస్మాత్ వాతః పవతే" అనిగదా! స్వభూః అనగా (స్వయంభూః) అజుడు. అన్నియు ఈయననుంచియే పుట్టినవి కనుక ఆయన అజుడు. సర్వాత్మకుడు, ఈ ఆత్మ సంవత్సరరూపులయిన ప్రజాపతులకు యథోచితముగా ఈ అర్థములను కలిగించుచు స్వయముగా ఈశ్వరుడగును. మనీషి = మనస్సుకు ప్రభువు, పరిభూః = అందరిపైన ఉండువాడు. కర్మఫలసాధనములయిన కర్మలను సంవత్సరము లకు విభజించి యిచ్చినాడు (శంకరభాష్యంనుంచి) 4

**శ్లో॥ ఆత్మానం య ఉపాసతే దధతి తే స్వాభావికీం బ్రహ్మతాం**
**కార్యం బ్రహ్మ తు యే భజన్తి త ఇమే హైరణ్యగర్భం పదమ్ ।**
**యేఽ విద్యాం సముపాసతే మలదృశో గచ్ఛన్తి తేఽ న్ధం తమో**
**దేవాదీనపి యన్తి హన్త కుధియో దేవాదిపూజాపరాః ॥ 5**

భావ॥ "అహం బ్రహ్మాస్మి" అని ఆత్మోపాసన చేయువారు సహజమయిన తమ బ్రహ్మస్థితినే పొందెదరు. ఉపాధిసహితమయిన సగుణ బ్రహ్మమును గొలుచువారు "హిరణ్యగర్భలోకమును" పొందెదరు. మలిన దర్శనులయి అవిద్యను ఉపాసించువారు అంధతామిస్రలోకములను చేరెదరు. బుద్ధి ఉండియు వక్రించినవారు ఏదో కోరికలతో అభినివేశములతో ఇతర దేవతారాధనలు చేసి ఆ దేవతలనే పొందెదరు. కనుక అందరు ఆత్మోపాసన చేసి అత్యుత్తమమయిన ఆత్మసాయుజ్యమునే పొందవలయునని కవి భావన. 5

**శ్లో॥ యో భానోరపి మణ్డలాన్తరగతం స్వావామనేత్రస్య చ**
**ఖ్యాతం ధ్యాయతి కాఞ్చనాఙ్గపురుషం బ్రహ్మాత్మకం స్వాభిదా ।**
**ఏకర్షే! యమ! వైధస! ప్రకటయ చ్ఛన్నం ముఖం బ్రహ్మణః**
**సూర్యోస్రానుపసంహరేతి కలయన్నన్తే స యాతీశ్వరమ్ ॥ 6**

భావ॥ సూర్యమండలాంతరములోను, పురుషుని దక్షిణనేత్రాంతరంలోను "ఉత్" అని ప్రసిద్ధుడయిన హిరణ్మయపురుషుడు బ్రహ్మ స్వరూపుడు. అతనిని ఆత్మతో అభిన్నముగా నుపాసించువాడు - చివరకు "ఏకర్షీ! యమ! ప్రజాపతీ! హిరణ్మయ పాత్రతో ఆచ్ఛాదితమయిన బ్రహ్మముఖమును ప్రకటింపుము". హే సూర్య! నీ కిరణములనుపసంహరింపుము - అని పలుకుచు ఈశ్వరుని చేరును. అనగా సగుణబ్రహ్మను చేరును. 6

ఇతీశావాస్యోపనిషద్వ్యాఖ్యాతా.

ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః.

శ్రీః

# కేనోపనిషత్

**శ్లో॥ యశ్చిత్తేన్ద్రియమారుతేరణకరో నేత్రస్య నేత్రం చ తం**
**శ్రోత్ర శ్రోత్రమిమం హృదోఽపి హృదయం వాచశ్చ వాచమ్పరమ్ ।**
**ప్రాణప్రాణమిహాధిగత్య కుశలా ఆత్మానమస్తైషణా-**
**స్త్యక్త్వేమాం తనుమాప్నువన్తి పరమం విష్ణోః పదం శాశ్వతమ్ ॥ 7**

భావ॥ ఈశావాస్యంలో సగుణబ్రహ్మోపాసకునికి ఈశ్వరప్రాప్తి చెప్పబడినది. బ్రహ్మాత్మైక్యవేత్తకు విదేహకైవల్యం ఇందులో ప్రస్తావింపబడినది.

ఆ పరమాత్మ మనస్సును ఇంద్రియములను వాయువును ప్రేరణచేయును. నేత్రమునకు గూడా ఆయనయే నేత్రము. కర్ణమునకు కర్ణము. మనస్సుకు మనస్సు, బుద్ధికి బుద్ధి. వాక్కుకు వాక్కు. ప్రాణమునకు ప్రాణము. అట్టి పరమాత్మను ఈ జన్మలోను ఈ దేహములోను పొందిన యోగనిపుణులు జ్ఞానులై సర్వకామత్యాగులయి, ఈ శరీరమును వదలి శాశ్వతమయిన పరమ విష్ణుస్థానమును పొందెదరు.

విశే ॥ 1. “రసోప్యస్య పరందృష్ట్వా నివర్తతే” అని గీత. బ్రహ్మదర్శనంతో సర్వకామనివృత్తి కలుగును.

2. దారేషణ పుత్రేషణ విత్తేషణ వంటి సర్వేషణలు నశించినవానికే జ్ఞానాధికారము. శరీరత్యాగం అంటే ప్రారబ్ధావసానం తరువాత జరిగే సహజ మరణము. జ్ఞానమునకు స్వకామత్యాగము ప్రధానాంగము. అదే జ్ఞానికి గుర్తుగూడ. వచ్చే మోక్షానికి అదే సూచన.

“యదా సర్వే ప్రముచ్యంతే కామాయేస్య హృదిస్థితాః” శ్రుతి.

3. బ్రహ్మం/ఆత్మతత్త్వం ఏమంటే; చిత్త, ఇంద్రియ ప్రాణాది ప్రేరణ, నేత్రాదులకు నేత్రాది రూపం కావటం

4. నేత్రమునకు నేత్రము అంటే వ్యర్థపదం కదా! కాదంటే దానికి మరోనేత్రం అని అనవస్థ - కదా - సమా - నేత్రాదులు తమ తమ విషయాలయిన రూప రసాదులను గ్రహించటానికి కారణము ఆత్మ చైతన్యం అందులో ప్రతిబింబించటం కదా! అదే నేత్రాలకు నేత్రత్వం, ప్రాణాలకు ప్రాణత్వము. ఇలా జ్ఞాన క్రియాశక్తులుగల ఆత్మచైతన్యము యొక్క అనుగ్రహముతో ఇంద్రియాలు విధి నిర్వహణ చేస్తాయి. అట్టి ఆత్మను తెలిసికొన్న ధీరుడు ముక్తినిపొందును. 7

**శ్లో॥ చక్షుర్నాఽఽప్నోతి యత్ర వాగపి మనో జ్ఞాతాద్యదన్యత్తథాఽ**
**జ్ఞాతాద్యన్నగిరోదితం సముదితా వాణీ చ యేన స్వయమ్ ।**
**బుద్ధ్యా యన్న మతం చ యేన తు మతా బుద్ధిశ్శ్రవశ్చక్షుషీ**
**యజ్జానాతి న యద్యతోఽనితి మరుత్తద్బ్రహ్మ నోపాసితమ్ ॥ 8**

భావ॥ ఆ బ్రహ్మము విషయములో నేత్రాదీంద్రియములు పనిచేయవు బ్రహ్మమే వాటికి ప్రవర్తక చైతన్యము కదా! అంతేకాదు, వాక్కు మనస్సు బ్రహ్మమును అందుకొనలేవు. అది జ్ఞాతమయిన దృశ్యప్రపంచముకన్న (అనాత్మ) భిన్నమయినది. అజ్ఞాతము కన్ననూ అది భిన్నమయినదే. జ్ఞాతకు గూడా అది ఆత్మకదా! దానిని వాక్కు పలకదు. కాని దానినుండియే వాక్కు ఆవిర్భవించును. అది బుద్ధికి గోచరం కాదు. బుద్ధిగూడా చైతన్యం వలననే తెలుస్తుంది. బ్రహ్మమునకు నేత్ర కర్ణములు తెలియును. కాని వాటికి మాత్రము బ్రహ్మము తెలియదు. ప్రాణముగూడా ఆ బ్రహ్మం వలననే ఊపిరితీసికొనును. అదే బ్రహ్మము. అంతేగాని ఉపాసింపబడునది బ్రహ్మము కాదు. ఎందుకంటే హృదయేంద్రియాతీతమయిన బ్రహ్మమును హృదయేంద్రియములతో ఉపాసింప సాధ్యము కాదు. కనుక ఉపాసితము ఔపాధికమే. కనుక ఉపాసకునికి ఆత్మయే బ్రహ్మము. వేరు కాదు. 8

**శ్లో॥ వేదాహం బృహదిత్యవైతి మనసా యో వేద దభ్రం స త**
**న్నో వేదాస్మి న వేద నేతి మనుతే యో వేద సమ్యక్స తత్ ।**
**విజ్ఞాతం త్వవిజానతాం బృహదవిజ్ఞాతం పునర్జానతాం**
**జ్ఞాతం మే ప్రతిబోధమేతదితి తన్మత్వాఽమృతం విన్దతే ॥ 9**

భావ॥ “నేను బ్రహ్మము నెఱుగుదును” అని మనస్సుతో తనజ్ఞానమును భావిస్తాడో వానికి తెలిసినది అల్పమే బ్రహ్మము కాదు. లేదా బ్రహ్మం గూర్చి అల్పమే తెలియును. ఎవడయితే తనకు బ్రహ్మం తెలుసునని గాని తెలియదనిగాని భావించడో వానికి బ్రహ్మం బాగా తెలియును. కనుక తెలియనివారికి తెలిసినది, తెలిసిన వారికి తెలియనిది ఆ బ్రహ్మము. ప్రతి ఒక్క బోధమునందు ఆ బ్రహ్మము జ్ఞాతమని తెలిసినవాడు అమృతరూపుడగును.

విశే॥ 1. “నేదం యదిద ముపాసతే” అని నముపాసించునది శుద్ధబ్రహ్మము కాదు

అని చెప్పబడినది. "మేము బ్రహ్మమును ఎఱిగిన వారము" అని ఎవరు బ్రహ్మమును జ్ఞేయము జ్ఞాతము అన్నారో వారికి స్వస్వరూపము జ్ఞాత, జ్ఞానము అయిన బ్రహ్మము తెలియనట్లే.

బ్రహ్మము అజ్ఞేయము. సాక్షిగా జ్ఞాత ద్రష్ట. అసలయితే బ్రహ్మం కేవలము "జ్ఞానమే" అట్టిది జ్ఞేయం కావటం అంటే తాను జీవుడుగా విడిగా ఉండి బ్రహ్మమును త్రిపుటిలో జ్ఞేయంగా జ్ఞానంతో గ్రహించినట్లే కనుక వానికి తెలిసినది సవికల్పమయిన ఏదో అల్పము. అసలయిన తత్త్వము కాదు. అందులో త్రిపుటి ఉండదు – జ్ఞానమే ఉంటుంది. అదియును స్వస్వరూపమే. తానే బ్రహ్మమునని ఎఱిగినవాడు నేను బ్రహ్మముననుకొనవలెనుగాని నేను బ్రహ్మము నెఱిగితిననడు.

2. సమ్యక్ జ్ఞానులు **తాము చూచామని అనుకొనే జ్ఞేయముగాని జ్ఞాతముకాని కేవలము బ్రహ్మము నందారోపింపబడిన బుద్ధివృత్తులేనని బ్రహ్మము కాదని నిజమునకు చూచామను కొంటున్న తామే బ్రహ్మము అని గ్రహించెదరు**. కనుక వారికి బ్రహ్మము తెలియదంటాము. తెలిసిందంటే వారికి నిజంగా తెలియదనే అర్థము. ఉదా॥ శుక్తితత్త్వం తెలిసినవారికి అధ్యస్తమయిన భ్రాంతిరజతం తెలియదు. భ్రాంతిరజతం తెలిసిన వారికి శుక్తి తెలియదు. కనుక **తెలిసినది అంటే బ్రహ్మమునందారోపింపబడిన అహంకారాదికమేతప్ప "బ్రహ్మం" కాదు**. 'జ్ఞాతము, జ్ఞాత' ఒకరే అవటం కుదరదు. బ్రహ్మమే జ్ఞాత కనుక అది జ్ఞాతం లేదా జ్ఞేయం కాదు.

3 (ఎ) ప్రతి బోధయందు బ్రహ్మము తెలిసినదనుకొనటం జ్ఞానిలక్షణం అన్నారు గదా! ఈ శ్లోకంలో మరల ఈ విరుద్ధ కథనం ఏమిటి? అనగా బ్రహ్మాకారబుద్ధివృత్తి కలిగినపుడల్లా అతనికి బ్రహ్మాత్మాభేదం అపరోక్షంగా అనుభవం అవుతుంది. అపుడతనికి బ్రహ్మం తెలిసినదని తెలుస్తున్నది. మరి అతడు బ్రహ్మజ్ఞుడుగాడని యింతకు ముందన్నారు. ఇపుడందుకు విరుద్ధముగా అతనిని బ్రహ్మజ్ఞుడంటున్నారు.

సమా – జ్ఞాతత్వం రెండు రకాలు. 1. ఫలవ్యాప్యం 2. బుద్ధి వ్యాప్యం

శ్రవణాదుల వలన ఆత్మ బుద్ధివృత్తికి అందుతుంది. వానికి ఆత్మ విదితము. వీనికి ఆత్మయందు జ్ఞాతత్వం ఉంటుంది. కనుక వీడు మూడుడే. సమాధియందు ఆత్మదర్శనం అవుతుంది. **అది ఫలవ్యాప్యమయిన జ్ఞాతత్త్వం. అందులో వానికి తనస్వరూపమే ఆత్మ అవుతుంది.** వానికి తెలిసినది ఆత్మకాదు. తెలిసికొన్నవాడే ఆత్మ. ఆ తెలివే ఆత్మ. కనుక వానికి "ఆత్మ తెలియటం" అన్న భావన రాదు. లేదా ప్రతిబుద్ధిలోను ఉన్నట్లు తెలిసినది బుద్ధిసాక్షిగా ఉన్న ఆత్మ. **ఆ బ్రహ్మమే శేషిస్తుంది**. అదే తానని తన స్వరూపమని తెలుస్తుంది. (దశమజ్ఞానం వంటిదే)

3 (బి) జ్ఞాతం అనగా రెండు అర్థాలు 1. తెలియబడినది. కర్మార్థము. 2. తెలివి తెలియుట – భావార్థము

మొదటిది బ్రహ్మము కాదు. అల్పము. రెండవది బ్రహ్మమే - అదే తన స్వరూపము. కనుక ప్రతిబోధయందును సమానంగా లభించు జ్ఞానము బ్రహ్మమని అర్థము చెప్పవచ్చును. 9

**శ్లో॥ జానాత్యేతదిహైవ యోఽస్తి స సదా బ్రహ్మాత్మనా సర్వతో**
**నో జానాతి తు యో వినాశమయతే భూయాంసమజ్ఞ స్స నా ।**
**జ్ఞాత్వైవం కుశలా విచిన్త్య పరమం భూతేషు భూతేషు త-**
**ద్బ్రహ్మాస్మ్యేకమితి ప్రపద్య పరిహాయాఙ్గం భజన్తేఽమృతమ్॥ 10**

భావ॥ ఆత్మస్వరూపమయిన బ్రహ్మమే సర్వవ్యాప్తమని ఈ లోకములోనే యీ దేహమునందే ఎవడెఱుగునో వాడే సర్వత్ర బ్రహ్మభావముతో నుండును. బ్రహ్మజ్ఞానము లేనివాడు పరమ వినాశమయిన నరక పాత సంసారపాతాదుల పొందును. ఈ విషయమునెఱిగిన పెద్దలు సర్వజీవులయందు వాటి ఉపాధిభేదమును వదలి మాటిమాటికి పరబ్రహ్మమునే ధ్యానించిరి. అట్టి 'అఖండాద్వితీయ సర్వవ్యాప్తబ్రహ్మమును నేనే' అను బ్రహ్మాత్మైక్య భావమును భావింప వలయును. అట్లు అమృతబ్రహ్మభావమును పొందెదరు. 10

**శ్లో॥ యస్యానుగ్రహతో విజిగ్యురసురానిన్ద్రాదయో దేవతాః**
**శక్నోతి స్మ తృణం న దగ్ధుమనలః క్షేప్తుం చ నైవానిలః ।**
**యస్యానుగ్రహవర్జనాదధిగతం దేవైరుమాభాషితా-**
**ద్యక్షాకారధరం చ యల్లసతి తద్విద్యోతనం విద్యుతామ్ ॥ 11**

భావ॥ ఇంద్రాదిదేవతలు ఆ బ్రహ్మచైతన్యానుగ్రహం వలననే అసురులను జయించారు. కాని తామే అసురులను జయించినట్లు గర్వపడుచున్న అంతటి దేవతలలో అగ్ని ఒక్క తృణమును గూడ దహింపలేకపోయెను. వాయుదేవుడు అదే తృణమును కదలింపలేక పోయెను. తమతమ అశక్తతలకు అవమానపడిన దేవతలకు బహుశోభమాన అయిన ఉమాదేవి సానుగ్రహయై బ్రహ్మతత్త్వమునుపదేశించెను. విద్యుత్తులకే విద్యోతనమయిన ఆ యక్షరూప పరబ్రహ్మమును ధ్యానించెదను.

విశే॥ 1. అగ్ని మొదలగువారికి అస్తిత్వంతో పాటు తన శక్తులను గూడ ప్రసాదించిన ఆ సనాతన బ్రహ్మతత్త్వమును వాయువహ్నిసూర్యాదుల ద్వారా గ్రహింపవలసినదని సూచన.

2. ఒక యుద్ధములో దేవతలు రాక్షసులను గెలిచిరి. ఆ విజయోత్సవములో గర్వోత్సాహములలో నున్న దేవతల యెదుట ఒక మహాలింగము ఆవిర్భవించెను. దానిని 'యక్షము' అనిరి. దేవతలు ఆశ్చర్యపడిరి. ఆ యక్షము వారిని ప్రశ్నించింది. ఒక తృణము వారి ముందఉనుంచి దానిని దహింపుమని అగ్నికి, కదిలింపుమని వాయువుకు సవాలు విసిరింది. కాని వారు అలా చేయలేకపోయినారు. తరువాత ఆ రూపం అదృశ్యమయింది. అపుడు

ఆకాశములో ఉమాదేవి కనబడి బ్రహ్మతత్త్వము చెప్పి దేవతలను సమాధాన పఱచింది. ఇది కేనోపనిషత్తులోని కథ. 11

**శ్లో॥ విద్యుద్వచ్చ నిమేషవద్ద్రుతతరం యద్భాసతే వ్యజ్యతే**
**సఙ్కల్పస్మరణాదివృత్తినిచయైస్స్వాన్తస్య శాన్తాశయాః ।**
**తద్ధ్యాయన్తి వనం జనైరితి సదా సంసేవనీయన్తు యే**
**ప్రత్యగ్భూతమమూన్ సమాని విబుధాన్భూతాని వాఞ్ఛన్తి తాన్ ॥ 12**

భావ॥ మనస్సుయొక్క సంకల్పము స్మరణము మొదలగు వృత్తి పరంపరలలో ఏది వ్యక్త మవుతుందో, ఏది విద్యుత్తువలె రెప్పపాటువలె క్షణకాలము భాసిస్తుందో (క్షణిక సమాధి) అదే స్వరూపచైతన్యమయిన బ్రహ్మము ఆత్మ. అచేతనమయిన మనస్సు మొదలగునవి సచేతనం కావాలంటే చైతన్యానుగ్రహం తప్పదు. శాంతచిత్తులయిన జ్ఞానులు సర్వజన సేవనీయమయిన ఆ బ్రహ్మ/ ఆత్మ తత్త్వమును "వనం" అని సేవించెదరు. అదే ప్రత్యగాత్మ. అట్టి జ్ఞానులు బ్రహ్మరూపులు గనుక ఆశ్రితవాంఛాపూరకులు గనుక ప్రాణులు వారివద్ద తమతమ ప్రార్థనలు వెల్లడింతురు. "బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి" గదా!

విశే॥ 'వనం' అనగా – సంభజనీయం అని అర్థము. అందరు కలిసి సేవింపదగినది. బాగా సేవింపదగినది. వను – సంభక్తౌ – ధాతువు. 12

**శ్లో॥ స్వాధ్యాయశ్చ శమో దమశ్శుచి తపః కర్మాపి సత్యం గురౌ**
**దేవే భక్తిరమానితా చ ఋజుతా హింసా క్షమా హ్రీర్ధృతిః ।**
**యస్యైతాని తు సాధనాని పురుషస్స క్షీణపాపోఽయతే**
**విద్యాం వేద చ యస్త్విమాం సుఖమయే బ్రహ్మణ్యయం తిష్ఠతి ॥ 13**

భావ॥ స్వాధ్యాయము అనగా అర్థ, జ్ఞాన పూర్వకవేదాధ్యయనము, అంతరింద్రియ (జ్ఞానేంద్రియ) నిగ్రహమయిన శమము బాహ్యేంద్రియ (కర్మేంద్రియ) నిగ్రహరూపమయిన దమము, పరపీడన చేయని తపస్సు అట్టి కర్మ, సత్యము, గురుదేవతలందు భక్తి, మానరాహిత్యము, కుటిలతా రాహిత్యము, అహింస, శీతోష్ణాది (రాగ ద్వేష) ద్వంద్వ సహనశక్తి, అకార్య విముఖత్వరూపమయిన సిగ్గు, ధైర్యం (నిర్వికారత) – ఇవి విద్యాసాధనమయిన దైవీ సంపద. దీనివలన పుణ్యాత్ముడయిన పురుషుడు బ్రహ్మజ్ఞాని యగును. అట్టి జ్ఞాని సదానందమయమయిన బ్రహ్మమునందు నిలుచును. తిరిగిరాడు. 13

కేనోపనిషత్తు – సమాప్తము.

వేదాంతముక్తావళీ – శ్రీ బెల్లంకొండ రామరాయవిద్వత్కవి.

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః.

శ్రీః

# కఠోపనిషత్

**శ్లో॥ యచ్ఛ్రేయోఽభిలషత్యవాప్తుమనఘో మోక్షాత్మకం ధీమతా**
**తేనార్థేషు గృహేషు బన్ధుషు సుతభ్రాతృజ్ఞనాసు క్వచిత్ ।**
**ఉద్యానేషు రథేషు భూమిషు తనౌ స్వర్గోపభోగేష్వపి**
**ప్రీత్యాశే అవిధాయ శాన్తమనసా శుశ్రూషణీయో గురుః ॥ 14**

భావ॥ మోక్షరూపమయిన శ్రేయమును కోరు అనఘుడు ముందుగా అర్థముల యందు, గృహములయందు, బంధువులయందు, సోదరాది బంధువులయందు, స్త్రీలయందు, రథ, ఉద్యాన, భూములయందు శరీరమునందు స్వర్గభోగములందు ప్రీతిని, ఆశను వదలాలి. అవిలేని శాంతచిత్తముతో గురువును శుశ్రూష కొఱకు సమీపించవలయును. తద్వారా విద్యను సంపాదింపవలయును.

విశే॥ 1. 'గురుశుశ్రూషయా విద్యా' అని సంప్రదాయము

2. పూర్వ ప్రస్తుత జన్మలందు పాపములు లేని వాడు అనఘుడు.

3. లబ్ధ అర్థములయందు ప్రీతి, అప్రాప్తములందు ఆశ. 14

**శ్లో॥ స్త్రీపుత్రార్థగృహాదిసంసృతిమయప్రేయఃఫలైకాశ్రయాఽ**
**విద్యామార్గవిలక్షణో లసతి స శ్రేయోదవిద్యాపథః ।**
**భ్రాన్తాః పణ్డితమానినో గతిభృతోఽవిద్యాపథేఽ న్ధాశ్రయాః**
**కూపేఽన్ధా ఇవ సంసృతౌ పరిపతన్త్యన్యే పురం బ్రహ్మణః ॥ 15**

భావ॥ స్త్రీలు పుత్రులు అర్థము గృహము మొదలగు సంసారమయమయిన ఇష్ట ఫలములను ఇచ్చునది అవిద్యామార్గము. దానికి భిన్నమయినది విద్యామార్గము. అది శ్రేయస్కరము. భ్రాంతులు పండితమ్మన్యులు అవిద్యా మార్గమునందు సంచరించు వారు

"అంధుని మార్గదర్శనమున నడచు అంధులు బావిలో పడినట్లు" (అంధపరంపరాన్యాయము) సంసారమునందు పడెదరు. శ్రేయస్కరమయిన విద్యామార్గమున నడుచువారు బ్రహ్మపురమున ప్రవేశించెదరు.

విశే॥ 1. ప్రేయః = ప్రియమయినది; శ్రేయః = హితమయినది; మార్గములు రెండు. విద్యామార్గము (శ్రేయస్కరము) అవిద్యా మార్గము ప్రేయస్కరము. శ్రేయః = సచ్చిదానంద స్వరూపమయిన పరమపురుషార్థము. ప్రేయః = దుఃఖమయమయిన సంసారము. భోగరూపము. ధర్మార్థ కామములు సంసారములోనివే.

2. కర్మలు నిత్యనైమిత్తిక కార్యములు. ఫలం స్వర్గాది రూపము. కర్తభోక్తగా ఆత్మ. ఇట్టివారికి బ్రహ్మత్వము కలలోగూడా అందదు. సుఖమయిన విషయములను వదలరాదని, పూర్వులయిన మరీచి మొదలగువారు కర్మఠులని, కర్మత్యాగము దోషమని స్వర్గభోగానందము కన్న బ్రహ్మానందము గొప్పదికాదని భావించువీరు అంధపరంపరగా పితృపితామహుల ఆచరణనే అనుసరిస్తారు. కాని జ్ఞానులయిన సన్న్యాసులు మాత్రము బ్రహ్మపురం చేరుతారు. 15

**శ్లో॥ లోకోఽయం పశుపుత్రగేహధరణీధాన్యాదిరూపోఽస్తి త-**
**ద్భిన్నః కోఽపి పరో న చాస్తి హి తతస్తల్లాభవాఞ్ఛా వృథా ।**
**నష్టం దేహమయం ప్రతి స్వపితరం విత్తాది నాశ్యం న త-**
**త్ప్రాజ్ఞేనేత్యభిమన్యతే యమవశం యాత్యప్యవిద్యావశః ॥ 16**

భావ॥ పశు పుత్ర గృహ ధరణీ ధాన్యాది రూపమయిన ఈలోకము మాత్రమే ఉన్నది. ఇందుకు భిన్నంగా పరలోకము లేదు. కనుక పరలోకవాంఛ వ్యర్థము. దేహస్వరూపుడయిన తమ తండ్రి మరణించిన తరువాత ఆయన తద్దినాదుల కొఱకు బుద్ధిమంతుడెవడూ ధనవ్యయం చేయరాదు - అని భావించి వాదించు నాస్తికుడు అవిద్యావశుడై యమునికి చిక్కును.

విశే॥ 1. ఆస్తికులలో కర్మఠులు అవిద్యామార్గములోనూ, జ్ఞానులు (సన్న్యాసులు) జ్ఞాన (కర్మసన్న్యాస) మార్గములోను నడుస్తారు. నాస్తికులు మాత్రం తమోమార్గములో వెళ్తారు.

2. నాస్తికులకు 'దేహమే ఆత్మ' అని భావము. దేహత్యాగమే వారి మోక్షము. వీరు కర్మలనూ నమ్మరు. జ్ఞానమునూ అంగీకరించరు. కనుక మరణానంతరము వీరికి అధమ జన్మలు లభించును. లేదా నరకం లభించును. 16

**శ్లో॥ విద్యామార్గముపైతి కోఽపి పురుషః ప్రక్షీణపాపో రమా**
**రామానుగ్రహతో యతోఽయమమృతః శ్రోతుం ప్రవక్తుం నృణామ్ ।**
**జ్ఞాతుం ద్రష్టుమపి ప్రదుర్లభతరః ప్రోక్తోఽప్యసమ్యగ్విదా**
**న జ్ఞేయో బహుచిన్తయాప్యణుతరోఽ తర్క్యో యదాత్మా పరః ॥ 17**

భావ॥ ఈశ్వరానుగ్రహంవలన నూటికో కోటికో ఒక పుణ్యాత్ముడు ఈ విద్యామార్గములోకి వస్తాడు. ఎందుకంటే అమృతస్వరూపమయిన ఈ పరమాత్మను వినటం, చెప్పటం, తెలిసికొనటం, దర్శించటం - ఏదయినా అత్యంత దుర్లభము. సమ్యగ్జ్ఞానం లేని గురువు చెప్పినా, లేక శిష్యుడు స్వయముగా విచారణ చేసినా బ్రహ్మతత్త్వము దుర్లభమే. కారణము - ఆత్మతత్త్వము ఇంద్రియాతీతము అత్యంత గహనము.

విశే॥ 1. "ఈశ్వరానుగ్రహాదేవపుంసామద్వైత వాసనా"అని స్మృతి. ఈ జిజ్ఞాస అందరికీ రాదు. అచ్యుతానుగ్రహం కలగాలి.

2. అత్యంత గహనము కనుక ఈ ఆత్మతత్త్వమును తెలిసికొని అనుభవపూర్వకముగా చెప్పగల సమ్యగ్ - జ్ఞాని దుర్లభం. అందువలన వక్త, శ్రోత, జ్ఞాత ద్రష్ట దుర్లభులు.

3. "ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినః తత్త్వ దర్శినః" - గీత. కనుక తత్త్వదర్శనుడు మాత్రమే జ్ఞానోపదేశము చేయగలడు. కేవల శబ్దజ్ఞానముగల వేదాంతశాస్త్రసాధకులు తత్త్వద్రష్టలు కానందున వారు చెప్పలేరు. శ్రమమాత్రమే ఫలితము.

"శబ్దబ్రహ్మణి నిష్ణాతః, ననిష్ణాయాత్పరేయది, శ్రమస్తస్య శ్రమఫలోహ్యధేనుమివరక్షతః"

4. అత్యంతగహనం కనుకనే దీనిలోకి ఎవరూ రారు. వచ్చినా అనుభవం అసాధ్యము. కనుకనే "మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతిసిద్ధయే, యతతామపి సిద్ధానాం కశ్చిన్మాంవేత్తి తత్త్వతః" 17

**శ్లో॥ వేదాన్తప్రతిపాదితాత్మవిషయా నైవాపనేయా మతి**
**స్తర్కేణాన్యసమీరణేన చ బుధా విష్ణుప్రసాదాదితా ।**
**ప్రాప్యైనామపి హన్త మృత్యురపి హా చిత్వాఽగ్ని మాప త్పదం**
**యామ్యం స్వర్గ మతో న కామవిషయో భూయాద్విపశ్చిత్క్వచిత్ ॥ 18**

(బుధా = పండితుని చేత)(భుత్= తృతీయా)

భావ॥ ఈశ్వరానుగ్రహలబ్ధమయిన ఈ వేదాంత ప్రాప్తమయిన ఆత్మబుద్ధిని తర్కము చేతగాని మీమాంసాది - ఇతర శాస్త్రప్రభావము చేతగాని పొరపాటునయినా పోగొట్టికొనరాదు. ఎందుకంటే నచికేతోపాఖ్యానం ప్రకారం చూస్తే, యమదేవుడు గొప్ప ఆత్మజ్ఞాని. అయినా సంకట ప్రదమయిన అగ్నిచయనము చేసి చివఱకు స్వర్గంలో యమలోక శాఖను పొందాడు. ఆత్మైక్యం చెందవలసిన జ్ఞాని కర్మఫలభోక్త అయి ఇంద్రదాసుడయినాడు. కనుక జ్ఞాని ఎపుడయినను కామ, కర్మముల జోలికి వెళ్లరాదు. నేను జ్ఞానినిగదా! కర్మలవలన నాకేమి? అని ప్రవర్తించరాదు. కర్మఫలసంగం తగిలే ప్రమాదం ఉన్నది. అది సంసారమూలము. 18

**శ్లో॥ తం దుర్దర్శమనుప్రవిష్టమమలం గూఢం గుహాయాం స్థితం**
**ప్రత్నం గహ్వరగం జహాతి కుశలో జ్ఞాత్వా తు హర్షం శుచమ్ ।**

**శ్రుత్వా బ్రహ్మ గురోర్ముఖాదణుతరం ధర్మ్యం పృథక్కృత్య త-**
**త్స్వాజ్ఞాదేర్మననాదినాఽత్మవిభవాద్ జ్ఞేయో హి ధీరేణ సః ॥ 19**

భావ॥ విషయ – వికారములమధ్య ప్రచ్ఛన్నమయియున్నవాడు, కనుక ఎచ్చటనో హృదయ గుహలో దుర్లభంగా నున్నవాడు, అనాద్యనంతుడు దుర్లభదర్శనుడు నిర్మలుడు నిర్వికారుడు అయిన పరమాత్మ యొక్క తత్త్వము నెఱిగి హర్షశోకములను వదలును. అనగా బ్రహ్మం నిర్వికారముకనుక బ్రహ్మం తన తత్త్వం (ఆత్మ) ఒక్కటే కనుక మనోవృత్తిరూపమయిన సుఖ-దుఃఖములకు దూరుడై అఖండ సుఖస్వరూపుడగును. కనుక అత్యంత సూక్ష్మము పరమానంద సాధనమయిన (ధర్మ్యం) ఆ బ్రహ్మతత్త్వమును గురుముఖతః గ్రహించవలయును. దానిని తన దేహేంద్రియ ప్రాణమనోబుద్ధ్యాదుల కన్న అతీతమని గ్రహించాలి. "నాహం దేహో నేంద్రియాణి" అని భావించాలి. తన బుద్ధి వైభవము కొలదిగా ధీరుడయిన పండితుడు మననాది సాధనములతో ఆత్మజ్ఞానమును పొందాలి. శుక జనకాదులు అలాగే పొందినారు గదా!

విశే॥ 1. గుహ = బుద్ధి గుహ

2. నాస్తికుల దేహాత్మవాదము, కర్మవాదుల కర్తృత్వ భోక్తృత్వ వాదము నిరాకరింపబడినవి. చూ॥

3. దేహం ఆత్మ కాదు. దేహ భిన్నంగా ఒక కర్త భోక్త స్వప్నంలో కనబడుతున్నాడు. కర్తగా, భోక్తగా కనబడే మన – ఇంద్రియాది స్వరూపమయిన శరీరంగూడ ఆత్మకాదు. సుషుప్తిలో ఇవేవీ లేని ఆనందమయమయిన ఆత్మ ఉన్నది గదా! సుషుప్తిలో ఎవరూ లేరనిపించినా సుషుప్తి సుఖమునకు అజ్ఞానమునకు 'సాక్షి' అయిన 'ఆత్మ' ఉన్నది. లేదంటే నిద్రలేచిన తరువాత "తనకు ఒళ్లే తెలియని నిద్ర పట్టిందని, చాల సుఖపడినానని' వ్యక్తి చెప్పలేడు. సుషుప్తిలో అజ్ఞానము జడము కనుక అది సాక్షికాదు. పైగా 'నాకు తెలియలేదు' అన్న ఆ అజ్ఞానమును గూడా గ్రహించు 'సాక్షి' ఉన్నట్లే. కనుక కర్త, భోక్త కాని చైతన్యమొకటి యున్నదని తేలుచున్నది.

4. ఇది దేహాదులకన్న భిన్నమని ఇలా గుర్తించాలని భాష్యకారులు చెప్పారు. "నాహందేహోనేంద్రియాణ్యంతరంగోనాహంకారః ప్రాణవర్గో న బుద్ధిః, దారాపత్యక్షేత్ర విత్తాదిదూరః సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోహమ్" 19

**శ్లో॥ ఓమిత్యేతదయం పదం శ్రుతిగణో బ్రూతే సమస్తస్తప-**
**స్స్తోమోఽదఃప్రతిపత్తయే భవతి వా తద్బ్రహ్మచర్యం బుధాః ।**
**కామేనాస్య చరన్త్యతః పరమిదం బ్రహ్మోక్షరం చాపరం**
**శ్రేష్ఠాలమ్బనమేతదేత్య భజతే విద్వాన్పరం బ్రహ్మణః ॥ 20**

భావ॥ ముముక్షువయిన వానికి బ్రహ్మప్రాప్తికి "ఓంకారము" సాధనము. సమస్త వేదసమూహము "ఓం" అను పదమును చెప్పును. ఇదే పరబ్రహ్మమని అపరబ్రహ్మమని చెప్ప

బడినది. "ఓంకార" రూప బ్రహ్మప్రాప్తికి రకరకాలతపస్సులు ఉపాసనలు బ్రహ్మచర్యాది వ్రతములు చేయబడుచున్నవి. పండితులు ఓంకార వాంఛతోనే వీటిని ఆచరిస్తారు. ఈ ఓంకారమే పరబ్రహ్మము. అపరబ్రహ్మమయిన హిరణ్యగర్భుడుగూడా ఇదే. అత్యంత శ్రేష్ఠమయిన యీ **ఓంకారమును ఆధారముగా గ్రహించి విద్వాంసుడు అపరబ్రహ్మగానుపాసించినచో హిరణ్యగర్భ లోకమును, పూర్ణబ్రహ్మముగా నుపాసించినచో బ్రహ్మాత్మైక్య జ్ఞానరూపమోక్షమును పొందును.** 20

**శ్లో॥ ధర్మాధర్మకృతాకృతాగతగతాయాస్యత్పదార్థేతరో**
**నోత్పన్నో న మృతోఽక్షరో న జనకో జన్యో న నిత్యో ధ్రువః ।**
**ఆత్మాఽసౌ నిహతే వపుష్యనిహతోఽ కర్తా పురాణః పుమాన్**
**హన్తారం చ హతం య ఏనమయతే మూఢస్స దేహాత్మదృక్ ॥ 21**

భావ॥ ఆత్మ అకర్త, అభోక్త, దేహాద్యతీతుడు. ధర్మము, అధర్మము, కృతకర్మలు, కర్మ నివృత్తి లేదా కార్యము, కారణము, భూత భవిష్యద్వర్తమాన పదార్థములు – వీటికన్న అతీతుడు, ఎందుకంటే, ఆత్మ ఉత్పన్నము కాదు. మరణించదు. ధర్మాధర్మాదులయితే పుట్తాయి. నశిస్తాయి. ఆత్మ అక్షరం. నశించదు. అది దేనినీ పుట్టించదు. అనగా కారణం కాదు. అది జగత్తు కయినా స్వయంగా కారణం కాదు. మాయ ద్వారా మాత్రమే కారణము. ఆత్మ జన్యము కాదు. అనగా కార్యమున్ను కాదు. అది కార్యకారణ రూపమూ కాదు. కార్యకారణములు గలదీకాదు. అది నిత్యము. కాలత్రయంలోనూ ఉంటుంది. అది ధ్రువము. అచంచలము. శాశ్వతము. శరీరాతీతము. కనుక శరీరం పోయినా ఆత్మ పోదు. అకర్త. అనాది. ఆత్మను హంతగాను హతునిగాను భావించువాడు మూఢుడు. అతనికి 'దేహమే ఆత్మ' అన్న భావన కలదు. కనుక అజ్ఞాని.

విశే॥ 1. లోకమునందు కార్యకారణవస్తువులయిన ఘటమృత్తికాదులు గూడా ఆత్మ/ బ్రహ్మం కావు.

2. పురాణః = పురా పి నవః = పూర్వముగూడ నూతనుడు.

3. అకర్త అభోక్త అనికూడ అర్థము. అనగా కర్త అయితేనే భోక్త అవుతాడు.

3. "హంతాచేన్మన్యతే హంతుం హతశ్చేన్మన్యతే హతమ్ ఉభౌతౌ న విజానీతః నాయం హంతి న హన్యతే"

4. కనుక నాస్తికమతము కర్మవాదము ఆదరణీయము కావు. 21

**శ్లో॥ యోణీయానణుతో మహాంశ్చ మహతో జన్తోర్గుహాయాం స్థితో**
**నిష్కామోఽ యతి ధాత్వనుగ్రహవశాద్యం శోకనాశం తతః ।**
**అసీనోఽపి సుదూరమేతి చ శయన్ యస్సర్వతో యాత్యహో**
**కస్తం వేత్తు మదామదం రవిసుతాద్దేవం పరోఽర్వాక్తనః ॥ 22**

భావ॥ ఆ పరమాత్మ అణువుకన్న అణువు. మహత్తు కన్న మహత్తు. జీవుల బుద్ధిగుహలో దాగియున్నాడు. సర్వకామరహితుడయిన జ్ఞాని ఈశ్వరానుగ్రహముచేత ఆయనను పొంది అందువలన సర్వశోకములను దాటి ఆనందపడతాడు. ఆత్మ ఆసీనుడయినా మనోవశమున దూరంగా పోగలడు. పరుండిగూడా సర్వదిక్కులకు పోగలడు. ఆహా! ఒకనియందే ఇన్ని విరుద్ధ ధర్మములున్నాయి గదా! సగర్వుడు అగర్వుడు, సహర్షుడు అహర్షుడు అయిన ఆ పరమాత్మను నచికేతగురువయిన యమధర్మరాజు తప్ప తరువాత వారు ఎవరు చక్కగా తెలిసికొనగలరు.

విశే॥ 1. ఆత్మతత్త్వం అత్యంతగహనము. దానిని తెలియలేనివారు దేహాత్మభ్రాంతిలో కర్తగా భోక్తగా వ్యవహరించటం సహజమే.

2. అణుమహత్త్వాలు రెండూ ఒకచోట ఉండటం అసాధ్యము. కనుక ఆత్మ అఖండమని అర్థము.

3. ధాతుః = పోషకుడు ఈశ్వరుడు. ధాతలాగ. లేదా ధాతువులు ప్రసన్నంగావటంచేత (రక్తాది సప్తధాతువులు) నిర్మల మనస్సువలన అని అర్థము.

4. మదం = గర్వము, సంతోషము అని రెండర్థములు. మదీ హర్షగేపనయోః. ఇవంతా ఆత్మకు మనస్సుతో తాదాత్మ్యం వలన ఉపాధిగతంగా వచ్చినవి. విరుద్ధధర్మాలు కనుక ఇట్టి గుణములు లేని వాడని అర్థము. ఔపాధికములేగాని వాస్తవములుగావని అర్థము.

5. యమునికన్నా ముందు బ్రహ్మ సనక సనందనాదులు యముని తరువాత శుకాదులు ఆత్మజ్ఞులే. అయినా మనవంటి వారు తెలిసికొనజాలరని చెప్పటానికి ఆత్మతత్త్వం గహనమనటానికి యముని పొగడటానికి చెప్పినమాట – "యముని తరువాత ఎవరు ఆత్మజ్ఞులు లేరు". 22

**శ్లో॥ తిష్ఠన్తం త్వనవస్థితాసు తనుషు స్వాత్మానమేకం విభుం**
**యో దేహాఙ్చ మహాన్తమేతి కుశలస్సోఽయం న శోచత్యపి ।**
**నో లభ్యః ప్రవచోభిరేష పురుషో నో మేధయా న శ్రుతై–**
**రాత్మప్రార్థనయా శమాదిసహితజ్ఞానేన లభ్యః పునః ॥ 23**

భావ॥ ఆత్మ గహనమయినా తెలిసికొనటం ఆత్యవసరం. అదే అసలైన పురుషార్థం కదా! అసంఖ్యాకమయిన అస్థిర శరీరములలోనుండువాడు, ఆత్మరూపుడు, ఏకరూపుడు, విభువు (సర్వవ్యాపి), స్వయంగా దేహరహితుడయిన ఆ మహాపురుషుని చేరు నేర్పుగలవాడు ఇక దుఃఖింపడు. వాడు భవసాగరమును తరిస్తాడు గదా!

ఈ పురుషుడు ప్రవచనాలకు దొఱకడు. మేధకు అందడు. శాస్త్రములకు వశము కాడు. శమదమాది సహిత జ్ఞానము, ఆత్మను పొందవలెనన్న వాంఛ గల ప్రపన్నునకే ఆయన లభించును.

విశే॥ 1. కట్టెలలో అగ్నిశక్తివలె మాయచేత దేవమనుష్యాది శరీరములందుండువాడు.

2. వ్యాపకుడు కనుక సర్వశరీరాలయందుండును. అయినా దేహరహితుడు.

3. ఏకజీవవాదము సరి. అనేక జీవవాదము ప్రమాణరహితం. బుద్ధి మొదలగు ఉపాధులవలన అనగా క్షేత్రముల వలన ఘటాకాశముల వలె అనేకత్వం కనబడుతుంది.

"క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" - గీత. దీనిని బట్టి జీవేశ్వరభేదం లేదు.

4. సర్వసంకల్ప రహితుడై శమదమాదులు కలిగియుండి, కేవలాత్మవాంఛతోనున్న వాడు శ్రవణాదిసాధనముల ద్వారా జ్ఞానికాగలడు. 23

**శ్లో॥ యోఽశాన్తో న సమాహితో న విరతో దుష్కర్మణోఽశాన్తహృ-**
**న్నాత్మార్థీ న పరాత్మవిత్స పురుషం జానాతు తం వా కథమ్ ।**
**సర్వం యస్య జగ త్త్రయాత్యశనతాం బ్రహ్మేన్ద్రరుద్రాదికం**
**స్తమ్భాన్తం చ తథోపసేచనపదం మృత్యుశ్చ యస్యాఞ్చతి ॥ 24**

భావ॥ పైన శ్లోకములో చెప్పినట్లు శమదమాది సాధన సహితుడైన ఆత్మకాముడే ఆత్మజ్ఞాని కాగలడు. లేనివాడు జ్ఞాని కాలేడు. అశాంతుడు, చిత్తసమాధి (ఏకాగ్రత) లేనివాడు, దుష్కర్మ నివృత్తిలేనివాడు, అశాంతచిత్తుడు, పరోక్షమయిన ఆత్మజ్ఞానముగూడ లేనివాడు, - ఆ మహాపురుషుని ఎట్లు తెలిసికొనగలడు? ఆ మహాపురుషుడే బ్రహ్మము. ఈ బ్రహ్మము సామాన్యమయినది కాదు. త్రిమూర్తులు ఇంద్రాది దేవతలు మొదలు తృణ పర్యంతము ఉన్న యీ సమస్త ప్రపంచము దానికి గ్రాసము కాగలదు. సర్వ గ్రాసమయిన మృత్యువు గూడా ఆ బ్రహ్మమునకు ఈ ప్రపంచభోజనములలో ఒక కూర ముక్క కాగలదు.

విశే॥ అశాంతి = ఇంద్రియ చాంచల్యము. అశాంత హృదయుడు కనుకనే ఆత్మకాముడు కాడు. పరాత్మ అనగా పరోక్షాత్మజ్ఞానముగూడ లేనివాడు. పరమయిన ఆత్మ అనగా పరమాత్మ కాదు. స్వస్వరూపానుభవం లేకపోయినను 'ఆత్మ' ఒక్కటియున్నదన్న పర - ఆత్మ జ్ఞానమయినా ఉండాలి. తరువాత విషయం కదా! అనుభవం.

2. భౌతికంగా కాని జ్ఞానపరంగా గాని, సుషుప్తిలోగాని, దృశ్య ప్రపంచమంతా లయము చేయువాడు. కనుక చరాచర భక్షకుడు. సర్వలయసాక్షి. మృత్యువు భోజనంగా గూడా చాలదు. కేవలం ఒక నంజుడు మాత్రమే. "మృత్యుమృత్యువు" అవుతాడు. 24

**శ్లో॥ దేహేఽస్మిన్ పరమం నభః పరపదం బుద్ధిప్రవిశ్య స్థితౌ**
**గూఢౌ ద్వౌ పురుషౌ పరస్పరపరౌ ఛాయాప్రకాశావివ ।**
**ఏకస్తత్ర ఫలం కృతస్య మధురం భుఙ్క్తే పరః పశ్యతి**
**బ్రహ్మజ్ఞా ఇతి సమ్భణన్తి కృతినః పఞ్చాగ్నయోఽపి స్ఫుటమ్ ॥ 25**

భావ॥ ఈ దేహమున 'బుద్ధి' అను పరమాకాశముగలదు. అది పరబ్రహ్మస్థానము. దానియందు ఇద్దఱు పురుషులు ప్రవేశించి, గూఢముగా నుండిరి. వారిద్దఱు అన్యోన్యం భిన్నముగా/ఆసక్తిగానుండిరి. వారి అనుబంధము వెలుగు నీడల అనుబంధము వంటిది. అందులో

ఒకడు తనకర్మఫలమును మధురఫలముగా భావించి అనుభవించుచుండును. మఱొకడు ఈ మొత్తమునకు సాక్షిగా నుండి గమనించును. వాడు భుజింపడు. పంచాగ్ని విద్యావేత్తలు, అగ్నిత్రయానుష్ఠానపరులు – కృతార్థులు – అయిన బ్రహ్మవేత్తలు ఇలా స్పష్టంగా వ్యాఖ్యానించు చున్నారు. కనుక సందేహము వలదు.

విశే॥ 1. ఇంతవఱకు పై శ్లోకములలో చెప్పబడిన ఆ మహాపురుషుడు ఎవరు? జీవుడా? ఈశ్వరుడా? – అని శంక.

2. బుద్ధి ప్రవిష్టుడు బుద్ధితో కలిసి భుజించువాడు జీవుడు. బుద్ధితోనున్నా దాని భోగమునకు కలియక ఉండు సాక్షి ఈశ్వరుడు. 25

**శ్లో॥ యత్సేతుః కృతినాం నృణామపరమం దుఃఖాబ్ధిసన్తారణే**
**యత్సంసారసముద్రతారణహృదాం భూయః పరఞ్చాభయమ్ ।**
**బ్రహ్మైతద్ద్వివిధం తదక్షరమిహ జ్ఞాతుం నృభిశ్శక్యతే**
**చేతుం చాప్యపరం న తత్ర విధినా నో నాచికేతాత్మకమ్ ॥ 26**

భావ॥ జీవుని కర్తవ్యమిది. ఆ బ్రహ్మము రెండు విధములు. పరము అపరము. కర్మపరులయిన వారికి దుఃఖసముద్రమును దాటించగల సేతువు (వంతెన) అపర బ్రహ్మము. సంసార సముద్రమును తరించవలయునన్న వారికి నిర్భయమయిన రామసేతువు పరబ్రహ్మము. ఈ ద్వివిధమయిన 'పర – అపర బ్రహ్మము" అక్షరమయినదే. అనగా వినాశరహితమయినదే. ఇది నరులకు జ్ఞానశక్యము. ఈ బ్రహ్మద్వయములో నాచికేతస్వరూపమయినది అపర బ్రహ్మము. అది అగ్ని. అది విధిప్రకారము ఇష్టకాది చయనముతో ఆరాధింపశక్యమయినది. కనుక కర్మవేత్తలకు బ్రహ్మవేత్తలకు ఆశ్రయింపదగిన ఈ రెండు బ్రహ్మములలో ఒకటి చేయము (చయనమునకు దగినది) గూడా. పరము జ్ఞేయము మాత్రమే 26

**శ్లో॥ బుద్ధ్యా సారథినా మనోరశనయా సఙ్గృహ్యమాణేన్ద్రియ–**
**స్తోమాశ్వైరనుకృష్యమాణమధిరుహ్యాత్మా శరీరం రథమ్ ।**
**శబ్దాదీన్విషయాన్యతోఽనుభవతి ప్రజ్ఞానినోఽముం తతో**
**భోక్తారం బ్రువతే హృదిన్ద్రియశరీరోపాధిసంయోగతః ॥ 27**

భావ॥ జీవుడు 'భోక్త' అన్న విషయము చెప్తాము. ఈ శరీరము రథము. బుద్ధి దానికి సారథి. మనస్సు పగ్గము. ఇంద్రియములు గుఱ్ఱము. వాటిని ఈ పగ్గంతో పట్టి అదుపుచేయాలి. ఈ గుఱ్ఱములు లాగే యీ రథమును అధిరోహించిన ఆత్మ శబ్దాది విషయములను అనుభవించును. అందువలన ప్రజ్ఞానులయిన పెద్దలు ఆత్మను భోక్తగా చెప్తారు. అనగా స్వయంగా కాదు. శరీరము మనస్సు ఇంద్రియములు అను ఉపాధులతో కలియటం వలన భోక్తగా చెప్తారు. నిజంగా భోక్త కాదు. 27

**శ్లో॥ విజ్ఞానఞ్చ సమాహితఞ్చ హృదయం నో బుద్ధిసూతస్య చే-**
**ద్వశ్యా స్యాత్కథ మిన్ద్రియాశ్వవితతిర్యద్యస్తి వశ్యా తు సా ।**
**విజ్ఞానేన సమాహితేన మనసా యుక్తస్తు యత్సారథిః**
**స ప్రాప్నోతి యియాసితం పరపదం నాన్యస్తు దుస్సారథిః ॥ 28**

భావ॥ ఔపాధికముగానయినా తగులుకొన్న భోక్తృత్వము మొదలగు వానిని వదలి జీవుడు స్వాభావికమయిన ఈశ్వరత్వమును ఎలా పొందుతాడు? అని శంక. సమా -

బుద్ధిరూపమయిన సారథికి నిపుణత ఏకాగ్రమయిన మనస్సులేనిచో ఇంద్రియాశ్వ సమూహము స్వాధీనము కాదు. ఒకవేళ అలా ఉంటే స్వాధీనమవుతుంది. ఎవరిసారథికి అనగా బుద్ధికి నిపుణత శ్రద్ధగా ఆసక్తమయిన హృదయము గలవో వాడే రథికుడు. అట్టి రథికుడే తన గమ్యమయిన బ్రహ్మాత్మైక్యపదమును చేరగలడు. సరయిన సారథి లేనివాడు పరమ పదమును చేరలేడు. కనుక "దేహి" శ్రద్ధానైపుణ్యములుగల బుద్ధి గలిగియున్నచో పరమగమ్యమును చేరగలడు. 28

**శ్లో॥ విజ్ఞానీ శుచిరాత్మవాంస్తు పురుషస్సంసారమార్గస్య త-**
**త్పారం విష్ణుపదం ప్రయాతి న పునస్సంసారమాపద్యతే ।**
**విజ్ఞానేన సమాహితేన మనసా రిక్తః పునశ్చాశుచి-**
**స్తద్విష్ణోః పరమం పదం న భజతే సంసార ఏవ స్థితః ॥ 29**

భావ॥ నిపుణుడు, నిర్మలుడు, నిగ్రహవంతుడు, నిష్ఠాపరుడు అయిన పురుషుడు సంసార మార్గమును దాటి ఆవలనున్న విష్ణుపదమును పొందును. మఱల ఆతడు సంసారమును పొందడు. అట్టి విజ్ఞానము శ్రద్ధగల మనస్సులేని కల్మషుడు విష్ణుపదమును పొందలేడు. కేవలం సంసారములోనే నిలిచియుండును.

విశే॥ 1. బుద్ధితో ఆత్మ - అనాత్మలను వివేచించి జ్ఞానము ఏకాగ్ర చిత్తము గలవాడై జీవుడు అవిద్యాకృతమయిన భోక్తృత్వాదులను వదలి తన సహజమయిన ఈశ్వరత్వమును పొందును. ఇక వాడు మరల కర్తృత్వ భోక్తృత్వాదులను పొందడు. కారణమయిన అజ్ఞానము నశించినది గదా? భ్రాంతి వలన రజ్జువు సర్పమయినట్లు అవిద్యవలన దేవుడు జీవుడుగా కనబడుతున్నాడు. భ్రాంతి పోతే రజ్జువు నుంచి సర్పత్వం పోతుంది. అలాగే దేవునినుంచి జీవత్వం పోతుంది - అని రహస్యము.

2. బుద్ధిలో ఇద్దఱు పురుషులున్నారు గదా! మఱి యిపుడు ఒకే పురుషుడు ఈశ్వరుడని జీవుడుగా కనబడుతున్నాడని జ్ఞానముతో జీవత్వం పోయి ఈశ్వరత్వం మిగులుతుందని అనటం విరుద్ధం గదా? - సమా - ఈశ్వరుడు మొత్తంగా జీవుడు కాలేదు. ఆయనలోని ఒకప్రదేశం ఉపాధి బద్ధమయి జీవుడుగా కనబడుతున్నది. "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః"

అని గీత. కాదంటే ఇక సంసార రహితుడయిన ఈశ్వరుడూ ఉండడు. ఈశ్వరుడే సంసారి అవుతాడు. జీవునకు మోక్షమూ లేదు. కనుక నిరంశమయిన ఆకాశం ఘటంలో ఘటాకాశం గానూ (బుడగలో బుడగాకాశంగాను) ఉన్నట్లు, **ఈశ్వరుడు బుద్ధితో కలిసి జీవుడుగాను, బుద్ధికి బయట ఈశ్వరుడుగాను ఉండును**.

3. బుద్ధిలో ప్రవేశించినను దానికి సాక్షిగా ఉండువాడు ఈశ్వరుడు. బుద్ధితో కలిసిపోయి సుఖదుఃఖాదులను అనుభవించువాడు ఈశ్వరుడు. ఇతడే ప్రత్యగాత్మ, సాక్షి. సంసారరహితుడు. కనుక ఈశ్వరత్వం రావాలంటే అవిద్యారోపితమయిన జీవత్వం తొలగించుకొనాలి. అందుకు జ్ఞానమార్గం అవసరం. 29

**శ్లో॥ స్థూలాదిన్ద్రియసఙ్ఘయాత్ఖలు పరస్సూక్ష్మోఽర్థసఙ్ఘో మన-**
**స్తస్మాచ్చాపి పరం తతోఽపి ధిషణా తస్యాః పరో వై మహాన్ ।**
**అవ్యక్తం మహతః పరం హి పురుషోఽ వ్యక్తాత్పరస్తత్పరం**
**నో కిఞ్చిత్స పరాగతిస్స చ పరా కాష్ఠా హి సర్వాన్తరః ॥ 30**

భావ॥ ఇంద్రియ సమూహము స్థూలమయినది. దానికన్న పరమయినది సూక్ష్మమయినది శబ్దస్పర్శరూపరసగంధాది విషయసమూహము. దానికన్న మనస్సు పరమయినది. సూక్ష్మ మయినది. దానికన్న బుద్ధి అంతే. దానికన్న పరమయిన మహత్తు అనగా హిరణ్యగర్భ (ప్రాణ) తత్త్వము. లేదా సాంఖ్యులు చెప్పిన మహత్తత్త్వము. ఈ మహత్తుకన్న పరమయినది సూక్ష్మమయినది ప్రకృతి. అది ఈశ్వరోపాధి. అవ్యక్తంకన్న పురుషుడు పరతత్త్వము. సూక్ష్మమయిన ఆత్మతత్త్వము. ఈ పురుషుడే ప్రత్యగాత్మ. ఈశ్వరుడు. బ్రహ్మము - ఇంతకుమించి పరము సూక్ష్మము అయిన ఆత్మతత్త్వము లేదు. ఆయనయే పరమగమ్యము. ఆయనయే పరాకాష్ఠ. ఎందుకంటే వీటన్నింటికి ఆయనయే అంతర్యామి గదా!

విశే॥ 1. పురుషోత్తముడు ఈశ్వరుడు. పురుషుడు జీవుడు. కాని మీరు పై (29) శ్లోకములో జీవుడే యీశ్వరుడని చెప్పటం సరికాదు అని ప్రశ్న. అందుకు సమాధానమీ శ్లోకము.

2. కార్యకారణములలో కార్యము స్థూలము కారణము పరము సూక్ష్మము మహత్తు = ఆత్మ. అలాగే గ్రాహ్యగ్రాహకములలో గ్రాహ్యము స్థూలము. గ్రాహకము సూక్ష్మము పరము ఆత్మ. పరము అనగా ఉత్కృష్టము. ఎందుకంటే గ్రాహకమును బట్టి గ్రాహ్యము, కారణమును బట్టి కార్యము ఉంటాయి. అనగా అధీనసత్తాకములు. (సత్తా = ఉనికి)

కార్యకారణము : 1. ఇంద్రియాలు కార్యాలు - శబ్దస్పర్శాది తన్మాత్రలు కారణాలు

2. విషయాలు గ్రాహ్యాలు - మనస్సు గ్రాహకం

3. మనస్సుకు బుద్ధి పరము సూక్ష్మము ఆత్మ - అది బుద్ధికి పరతంత్రము గదా! కనుక బుద్ధి ఆత్మ. బుద్ధికి అధిష్ఠాత కనుక హిరణ్యగర్భుడు పరుడు. అలాగే మహత్తు ప్రకృతి

కార్యము. హిరణ్యగర్భుని ఉపాధి ప్రకృతి కార్యము. అవ్యక్తము పురుషునకు ఉపాధి. అది పురుషుని వలననే ప్రకాశిస్తుంది కనుక దాని సత్త (ఉనికి) పురుషాధీనము. "**ఏది దేనికి అంతరముగానుండునో అది దానికన్న పరము సూక్ష్మము మహత్తు, ఆత్మ**" "ఘటము - మట్టిలాగా"

4. ఈ పురుషునికి మించి మఱొకరు లేరు. సూక్ష్మత్వ మహత్త్వం ప్రత్యగాత్మత్వం ఆయన వద్దనే ఆగిపోతుంది. ఇతడే సర్వాంతరుడు. ఇతడే ప్రత్యగాత్మ, బ్రహ్మం, ఈశ్వరుడు.

5. అయ్యా! **పురుషుడనగా జీవుడు. అతనికి అంతరాత్మ పురుషోత్తముడు**. అంతర్యామి బ్రాహ్మణం అలాగే చెప్పింది - సమా - "పురుష ఏవ పరాకాష్ఠా" అని చెప్పిన యీ కఠశ్రుతి విరోధిస్తుంది. అంతర్యామి బ్రాహ్మణం గూడా ప్రస్తుత ప్రత్యగాత్మను గూర్చియే చెప్పింది. కఠ శ్రుతిలోని పురుష శబ్దానికర్థం పరమాత్మ అనటం కుదరదు. ఎందుకంటే ప్రత్యగాత్మను అనగా మీ లెక్కలో జీవుని చెప్పే పదం లేదు. **ఒక్క పురుషశబ్దమే యీ శ్రుతిలో ఉన్నది.**

6. అసలు ప్రత్యగాత్మకు (మీపక్షంలో జీవునికి) పరమాత్మను అంతరుడుగా ఎందుకు చెప్పాలి?

(ఎ) పరమాత్మ కారణము - ప్రత్యగాత్మ కార్యము, అనియా? సమా - కాదు. ప్రత్యగాత్మగూడా అజుడే. కనుక కార్యం కాదు.

(బి) పరమాత్మ యొక్క అంశ ప్రత్యగాత్మ అనియా? అంశరహిత పరమాత్మలో అంశాంశిభావం కుదరదు. వీరిద్దఱు ఘటాకాశమహాకాశములవలె అభిన్నులని చెప్పటానికి 'మమైవాంశో-' అన్నారు.

(సి) పరమాత్మ నియామకుడు. ప్రత్యగాత్మ నియామ్యుడనియా? సుషుప్తి మృతి మూర్ఛాదులలో ప్రత్యగాత్మమీద పరమాత్మ నియామకత్వం కనబడటం లేదు. జాగరణాలలో బుద్ధ్యాది తాదాత్మ్యం వలన జీవుడు నియమితుడుగా కనబడతాడు.

(డి) పరమాత్మ వ్యాపి - ప్రత్యగాత్మ వ్యాప్యుడనియా?

నిరవయవము విభువు అనగా వ్యాపకుడు అయిన ప్రత్యగాత్మయందు వ్యాప్యత్వం కుదరదు. **కనుక ఇచ్చట పురుషః అనగా బ్రహ్మాభిన్నమయిన ఆత్మ.** 30

**శ్లో॥ గూఢోఽత్మా భువనేష్వయం న సకలైర్జ్ఞేయో వృతో మాయయా**
**బుద్ధ్యా సూక్ష్మికయాఽగ్ర్యయా పున రయం సూక్ష్మేక్షణైర్దృశ్యతే ।**
**విద్వాన్ హృద్యుపసంహరేద్గిరమిదం చిత్తం చ బుద్ధౌ మహ-**
**త్యేనాం తం చ మహాన్తమాన్తరతమే శాన్తే ప్రతీచ్యాత్మని ॥ 31**

భావ॥ ఆత్మ మన బుద్ధిలోనే ఉన్న సంగతి నిజమయితే మనకెందుకు తెలియదు? అదే యీ శ్లోకంలో చెప్తున్నారు. ఈ పురుషుడు సమస్త భువనములయందు గూఢంగా ఆత్మరూపంలో

వ్యాపించి ఉంటాడు. కాని ఆయన అందరకు అందడు. కారణం మాయావరణము. కాని నిశితమయిన సూక్ష్మమయిన జ్ఞానముగలవారు తమ సూక్ష్మదృష్టిచే చూడగలరు. జ్ఞాని అయినవాడు తన వాక్కును మనస్సునందు కలుపవలెను. వాక్కు మనస్సు వలననే బయలుదేఱును (పరాపశ్యంతీ మధ్యమావైఖరీ) గదా! మనస్సును ఏకాగ్రముచేసి బుద్ధిని దానియందు కట్టిపడవేయ వలయును. ఈ బుద్ధిని మహత్తత్త్వమునందు, దానిని మరింత అంతరమయిన నిస్తరంగ సముద్రము వలె శాంతమయిన ప్రత్యగాత్మయందు కలుపవలయును. అనగా నిలుపవలయును. అందువలన ప్రత్యగాత్మ స్వరూపముగా జీవుడు నిలుచును.

విశే॥ 1. గూఢోత్మా – వృషోదరాదిగణము – సాధువు – గూఢమయిన ఆత్మ.

2. 'యోగమాయా సమావృతః' అని గీత.

3. అగ్ర్యః = ఏకాగ్రమయిన

4. సూక్ష్మదర్శనులయిన యోగులకు లభించును గనుక ఆత్మ సత్యమే. కుందేటి కొమ్ము వంటిది కాదు.

5. బుద్ధి అనగా మహత్తత్త్వము యొక్క కార్యమే. మహత్తుకు కారణము అవ్యక్తము.

6. ఆత్మ తప్ప మరేదీ సత్యముగా లేదు. ఇదంతా ఆత్మయే. ఆ ఆత్మను నేనే అని ఉండవలెను. లేదా సర్వము వరసగా లయంచేసి చివఱకు మిగిలిన ఆత్మను తన స్వరూపముగా తెలిసికొని అందు నిర్వికల్పముగా సమాధిగతుడు కావలెను. కనుక విచారణ, నిదిధ్యాసనలో ఆత్మను దర్శించ వలయును. 31

**శ్లో॥ యద్జ్ఞానం బత దుర్గమం సునిశితా శస్త్రస్య ధారా యథాఽ**
**శబ్దస్పర్శమరూపమవ్యయమజం నిత్యం ధ్రువం చారసమ్ ।**
**నిర్గన్ధం యదనన్తమేత్య పురుషో మృత్యోర్ముఖాన్ముచ్యతేఽ**
**విద్యాసుప్తిత ఆశు జాగృత నరాస్తత్ప్రాప్తుమాచార్యిణః ॥ 32**

భావ॥ ఈ ఆత్మ తత్త్వజ్ఞానము అతి దుర్గమము. అది పదునయిన శస్త్రధారవలె అతి సూక్ష్మమయినది. దుర్గమము. ఎందుకనగా – శబ్దాది విషయ పంచకము లేనిది గనుక ఇంద్రియములకు అందదు – అశబ్దము, అస్పర్శము, అరూపము, అవ్యయము, అజము, నిత్యము, ధ్రువము, అరసము, అవికారి, అగంధము, అనంతము. అట్టి జ్ఞానస్వరూపమును దర్శించినవాడు మృత్యుముఖమునుండి బయటపడును. అమృతుడగును. కనుక, ఓ నరులారా! శీఘ్రమే లెండి. శరీరం నశ్వరం గదా! ఎపుడెలా పోవునో తెలియదు. అవిద్యానిద్రను వదలండి. తత్త్వవేత్తలయిన ఉత్తమాచార్యులను పొంది మేల్కొనండి.

విశే॥ 1. అవ్యయం : వికారములు పొందనిది వి+ఏతి = వ్యేతి, శబ్దాదులుంటే వికారములుంటాయి. పుట్టినవానికే వృద్ధి మొదలగు వికారములు. పుట్టులేదు గనుకనే మరణము

లేని నిత్యపదార్థము. "జాతస్య హి ధ్రువో మృత్యుః" కనుక ధ్రువము త్రికాలములయందు సర్వత్ర "ఉనికి" (సత్త) తప్పనిది. కనుక 'సత్' సత్త అను బ్రహ్మలక్షణము సర్వత్ర ఉన్నదే గదా! కనుకనే అనంతము. దేశకాల వస్తు పరిమితి లేనిది. అంతటా ఉన్నది.

2. ఆత్మజ్ఞానం వలన మహాఫలము. అదే అమృతత్వము. అల్పఫలం కోసం కాదు. ఎలుకను పట్టటానికి కొండను త్రవ్వము.

3. అజ్ఞాన నిద్ర వదలవలెను. అతినిద్రాలోలుడు అలసుడు ఏమీ సాధించలేడు. ఈ అనాది నిద్రను వదలి మేల్కొనండి. తత్త్వవేత్త వద్దకు చేరండి. పురుషార్థమును పొందండి. శరీరం అనిత్యం కనుక - అదేదో - తొందరగా కానీయండి. 32

**శ్లో॥ శ్రోత్రాదీన్ద్రియసఞ్చయం స భగవాన్ శబ్దాదిబాహ్యార్థగం**
**చక్రే యత్తదసౌ పుమాన్బహిరిమాన్ భుఙ్క్తే స్వకైరిన్ద్రియైః ।**
**ధీరః కోఽపి యతేన్ద్రియోఽనుభవతి స్వం ప్రత్యగాత్మానమ-**
**ప్రాప్తుం మోక్షముశన్నధీరహృదయః కామీ తు మృత్యోర్వశః ॥ 33**

భావ॥ భగవంతుడు మన శ్రవణాది - ఇంద్రియములను బహిర్ముఖముగా సృష్టించెను. అవి శబ్దస్పర్శరూపాది బాహ్యవిషయములనే దర్శింపగలవు. కనుకనే జీవుడు దేహాభిమానియై బాహ్యేంద్రియములతో బాహ్య విషయాలనే ఆస్వాదిస్తాడు. కాని ఎవడో ముముక్ష గల ఇంద్రియ విజేత, నిర్వికారచిత్తుడు మాత్రము అంతర్ముఖ మనస్సుతో బాహ్యేంద్రియములను కట్టడి చేసి తనలోనే ప్రత్యగాత్మ అయిన తన స్వరూపమును కనుగొనును. స్వస్వరూపానుభవము పొందును. కనుకనే నిర్వికల్పక స్వరూపమయిన సచ్చిదానందాత్మ జ్ఞానులకనుభవ సిద్ధమే. కనుక అది ఉన్నదా లేదా అని సందేహము వలదు. సంశయాత్ముడు నశించును అనగా జనన మరణచక్రమున పడి మృత్యువశమగును. కోరికలకు విషయ చాంచల్యమునకు మరణమే ఫలము. సంసరణమే గతి. 33

**శ్లో॥ లోకో యేన సమీక్షతే ధ్వనిరసస్పర్శాంశ్చ దుఃఖం సుఖం**
**రూపం గన్ధగుణం చ జాగ్రతి తథా స్వప్నే సుషుప్తావపి ।**
**అజ్ఞానం హృదయేన్ద్రియాద్యవిదితం యస్యాస్తి నో కిఞ్చన**
**జ్ఞాత్వాస్యాత్మమహేశ్వరం మధుభుజం ధీరో న శోచత్యముమ్ ॥ 34**

భావ॥ ఈలోకములో ప్రమాతలయిన ప్రాణులు ఆత్మద్వారానే తమతమ గ్రాహ్యములను గ్రహించును. ధ్వనిరసస్పర్శాది - ఇంద్రియ విషయములను ఇంద్రియములు గ్రహించును. సుఖదుఃఖాలను గంధాదిగుణములను, గ్రహించును. ఇదంతా జాగరణంలో సంగతి. ఇక స్వప్నములో నయినా ఇంద్రియ మనస్సులు నిద్రిస్తున్నా వాసనా రూపముగా ఈ విషయాలను, వాటి వలన కలుగు సుఖదుఃఖాలను గ్రహించును. సుషుప్తిలో అజ్ఞానమును, నిద్రానందమును

గ్రహించుసాక్షి ఈ ఆత్మయే. అలాగే సర్వంగ్రహించునట్టి యీ మనస్సుకు ఇంద్రియాలకు గూడా అతడే గ్రాహకుడు. (ప్రాణస్య ప్రాణః, చక్షుషశ్చక్షుః, కేనేషితం పతతి ప్రేషితం మనః). ఈ ఆత్మకు సర్వభూతాంతరుడు కనుక తెలియనిది లేదు. కనుక ఈ సర్వ ప్రపంచ – ఆత్మ అయిన ఆ మహేశ్వర పదార్థము కర్మ ఫలరూపమయిన మధువును ఆస్వాదించని జీవునితో అభేదంపొందును. ఆ ఈశ్వరుని గ్రహించు ధీరుడు దుఃఖము పొందడు. స్వరూపానంద నిమగ్నుడగును. ప్రపంచరహితమయిన ఆత్మయందు శోకహేతువయిన సంసారము లేదు గదా!

విశే॥ 1. ఆత్మ పదార్థము దుర్గమము. కనుక లేదన్న సందేహము వలదు. సర్వ విషయజ్ఞాన సాక్షి ఆయన. మనవంటి జీవుల అంతఃకరణములో ప్రతిబింబించి ఆ చైతన్యమే ఇంద్రియములద్వారా బాహ్యవృత్తిగా బయటకుపోయి విషయములను, అంతరవృత్తిగా సుఖదుఃఖములను గ్రహించును. అనగా బయట వస్తురూపముగాను, లోపల సుఖదుఃఖాది రూపముగాను పరిణమించును. **ఈ పరిణామమే వృత్తి**. ఇది సహజముగా జడము. అందు చైతన్యము చేరటం వలన, చేతనమయి విషయాది జ్ఞానం కలుగజేస్తుంది. కనుక శబ్దాది జ్ఞానసాధనంగా చివఱకు వృత్తి చైతన్యమే అవుతుంది.

2. స్వరూప చైతన్యం కర్త కదా! అట్టి ఆత్మ కరణంగా సాధనంగా ఎలా అవుతుంది? పైగా ఆత్మ కర్తగూడా కాదంటారు గదా! – సమా – అది అకర్తయే. అకరణమే. కాని **అంతః కరణంలో అహంకారములో చేరి కర్త గానూ బుద్ధిలో చేరి వృత్తి ద్వారా కరణంగానూ అవుతున్నది**.

3. స్వప్నంలోనూ అంతే. అచ్చట **తైజసమను ప్రాతిభాసిక జీవుడవుతాడు**. అచ్చట **అవిద్యావృత్తితో ద్రష్ట అవుతాడు**. నిద్రాకల్పిత విషయాలను చూస్తాడు.

4. సుషుప్తిలో ప్రాజ్ఞుడయిన జీవుడు **అవిద్యా వృత్తితో కలిసిపోయి తన అజ్ఞానమును ఆనందమును గమనిస్తాడు.** కనుకనే మేల్కొని "సుఖంగా నిద్రించితిని, ఒళ్లు తెలియదు" అని ఆనందమును, అజ్ఞానమును చెప్పగలుగుతున్నాడు. కనుక సుషుప్తిలోనూ ఆత్మ సాక్షిగా నున్నట్లు నిశ్చయము.

5. మనస్సు, ఇంద్రియాదులు విషయగ్రహణంచేస్తున్నాయంటే సరిపోతుంది గదా? ఈ ఆత్మదాకా ఎందుకు? – సమా – హృదయము, ఇంద్రియాదులన్నీ ఆ ఆత్మ వలననే భాసిస్తాయి. (తస్యభాసా సర్వమిదం విభాతి) – అందువలన అవి జడములు. స్వయంగా భాసించవు. కనుక వాటి భాసకంగా ఆత్మ ఉన్నది. **అయితే ఇంద్రియాలు కరణములనటం ఎందుకు? – భ్రాంతి. లాంతరునే దీపమన్నట్లు జ్ఞానభరితమయిన నేత్రాదివృత్తులను చూచి నేత్రములే కరణములంటాము.** అవి లోపలి కాంతిని బయటకు పంపు ఘట రంధ్రముల వంటివి. అదే వాటి కరణత్వము.

6. చైతన్యమువలన శబ్దాదికము సామాన్యంగా తెలుస్తుంది. (కన్నులు మూసిన వానికి

వెలుగు, వ్యక్తుల నీడలు తెలిసినట్లు). కాని ఇంద్రియ వృత్తులవలన స్పష్ట విశేషజ్ఞానం కలుగుతుంది. (సూర్యకాంతి వేడి కలిగిస్తుంది. కాని సౌరశక్తి – యంత్రము వెలుగును వేడిని విశేషంగా ఇచ్చి దీపముగా, వంట పొయ్యిగా ఉపయోగపడుతుంది). అలాగే ఎండ అద్దంలోకి, భూతద్దంలోకి ఎక్కినచో విశేషశక్తిని కనబరుస్తుంది. కనుక అలాగే, నేత్రాది ఉపాధివలన అదే ఆత్మ చైతన్యం మరింత ప్రభావవంతంగా పనిచేస్తుంది. కనుక చైతన్యం సర్వావభాసకం. ఉపాధి దానికి యంత్రం వలె సహాయకం. (మనకు మన కారులాగా).

7. చైతన్యమునకు తెలియనిది లేదు. తెలియదంటే అది లేనట్లే గదా! కుందేటి కొమ్ము చైతన్యమునకు తెలియదు. అనగా అదిలేదు. (ఎ) భాస్యము వలన భాసక పదార్థమునూహిస్తాము. కనుక చైతన్యరూపమయిన 'ఆత్మ' కలదు. (బి) పాలనీయమయిన జగత్తు వలన పాలకుని ఊహించెదము. జడము సృష్టి – మొదలగునవి చేయజాలదు గదా! ఆత్మ – అనగా 'అతతి' వ్యాపించునుగాన – విభువు (సి) కనుక వ్యాప్యమయిన జగత్తునుబట్టి వ్యాపకమయిన ఆత్మ ఊహింపబడును. (డి) కర్మఫలం భోగ్యం కనుక భోక్త అయిన ఆత్మనూహిస్తాము. "అహంసుఖీ దుఃఖీ" అని అనుభవము కదా! 34

**శ్లో॥ అద్భ్యో యః ప్రథమం మహానుదభవత్సర్వేశ్వరాద్బ్రహ్మణో**
**భూతైస్సాకమిహ ప్రవిశ్య హృదయాకాశం చ యస్తిష్ఠతి ।**
**యః ప్రాణోఽదితినామకోఽర్థగిళనాద్యస్సర్వదేవాత్మకః**
**సర్వాత్మానమముం తమేతి పురుషో యో బ్రహ్మ జానాతి సః ॥ 35**

భావ॥ ప్రత్యగాత్మయే పరమాత్మ – అని నిశ్చయింపబడినది. ఆయనయే సర్వాత్మ అని చెప్పుచున్నాము. సర్వేశ్వరుడయిన బ్రహ్మమునుండి జలాది పంచభూతములతో సహా (పంచీకృతములయిన తరువాత) (అవి తమలో తాము కార్యకారణములు) ప్రథమముగా పుట్టిన జీవుడు హిరణ్యగర్భుడు. అన్ని అర్థములను ప్రాణరూపముతో తినువాడు గనుక "అదితి" అను ప్రాణశక్తి అతడే. అతడు సర్వదేవస్వరూపుడు. ఆతడు ఈ భూతములతో కలిసి హృదయాకాశమున నుండును. ఆయన సర్వమునకు అంతరాత్మగా ఉండువాడు. ఆయన యొక్క తత్త్వమునెరిగిన వాడయినా బ్రహ్మవేత్తయే అగును.

విశే॥ 1. సువర్ణకుండలము తెలిసినచో సువర్ణం తెలిసినట్లే బ్రహ్మనుండి ప్రథమ జన్ముడయిన హిరణ్యగర్భుని గ్రహించినచో బ్రహ్మను తెలిసికొన్నట్లే.

2. ప్రత్యగాత్మను సర్వాత్మగా చెప్పబోతూ మధ్యలో హిరణ్యగర్భునిగూర్చి బ్రహ్మరూపుడని సర్వాత్మకుడని చెప్పటం ఎందుకు? – సమా – బుద్ధిగుహలో లింగశరీరముతో కలిసియుండువాడు ప్రత్యగాత్మ అన్నది నిజము. ఆయన ఒక్కడా అనేకమా? అన్న సందేహము దీనితో తీరుతుంది. "సర్వాత్మ, ఏకరూపుడయిన హిరణ్యగర్భుడు సర్వజీవుల హృదయగుహలో భూతములతో సహా

ఉండునని" చెప్పాము కదా! కనుక **సమష్టి లింగోపాధులలోనున్న ప్రత్యగాత్మయే హిరణ్యగర్భుడు.** కనుక హిరణ్యగర్భవిషయం అవసరమే.

3. వ్యష్టి పురుషుడు ప్రత్యగాత్మ అని, సమష్టి పురుషుడు హిరణ్యగర్భుడని వేరుగా అనరాదు. వీరులేకుండా వారు వారు లేకుండా వీరు ఏర్పడరుగదా! (రాష్ట్రం – జిల్లాలు లాగా) విభువయిన ప్రత్యగాత్మ వ్యష్టిగా పరిమితుడుగాడు.

4. జీవుడొక్కడే అయినందున సుఖదుఃఖాదులు సర్వజీవులకు కలిసిపోవు. అంతఃకరణరూప – ఉపాధి భేదము వలన విడిగానే ఉంటాయి.

5. ప్రత్యగాత్మ అజుడు గనుక పరమాత్మయే. ప్రథమావిర్భూతుడు కనుక హిరణ్యగర్భుడు ప్రత్యగాత్మ కాదు – అని అనరాదు. హిరణ్యగర్భుడూ అజుడే. పరమాత్మయే. ఉపాధిని బట్టి మాత్రమే ప్రథమజాతుడు. కనుక ప్రత్యగాత్మ ఒక్కడే – సమష్టిని బట్టి హిరణ్యగర్భుడు. వ్యష్టిని బట్టి ఇంద్రుడు చంద్రుడు మొ॥ పిలువబడును.

6. ప్రత్యగాత్మ అయినా పరమాత్మ అయినా ఒక్కడే. ఇద్దఱు సర్వాంతరులు పూర్ణులు ఇద్దఱు పరములు, దేహాది విలక్షణులు, సూక్ష్ములు, మహత్తులు అందువలన పేరులో మాత్రమే భేదం. ఘటము కుంభము అన్నట్లు.

7. కనుక ప్రత్యగాత్మయే హిరణ్యగర్భరూపముతో సర్వాత్మ. హిరణ్యగర్భుడు సర్వజీవ సమష్టిగా సర్వాత్మ. 35

**శ్లో॥ యోఽరణ్యోర్నిహితోఽగ్నిరాత్మని మహాయోగైర్భృతో గర్భవ–**
**న్నారీభిర్జఠరేఽ ప్యహన్యహని యః స్తుత్యో బుధైః కర్మిభిః ॥**
**జాగ్రద్భిర్హవిరాశ్రయైః స్వహృదయే యజ్ఞే చ స బ్రహ్మ త–**
**ద్ధ్యానో ర్జన్మలయౌ యతో యత ఇమే దేవాస్తదత్యేతి కః ॥ 36**

భావ॥ హిరణ్యగర్భుడు అగ్నిరూపుడు. అతడు అరణులయందు నిలచిన అగ్ని. స్త్రీలు ఉదరమున గర్భమును ధరించినట్లు మహాయోగులు ఆయనను తనయందు నిలిపికొనెదరు. ప్రతిదినము అప్రమత్తులయి ఉంటూ యోగులు కర్మఠులు హవిస్సులతో ధ్యానభావనలతో ఈయనను తమహృదయములలో యజ్ఞములలోను గౌరవించెదరు. అటువంటి అగ్ని యీ బ్రహ్మమే. ఈయన నుంచియే సూర్యునికి ఉదయాస్తమయములు ఏర్పడినవి. ఈయన ప్రాణ స్వరూపుడు. అంతేగాదు ఈయన సర్వదేవరూపుడు. అట్టి యీ హిరణ్యగర్భ బ్రహ్మమును ఎవరు తప్పించికొనగలరు. అంతర్యామి అయిన యీ బ్రహ్మము మన నీడవలె దాటశక్యము కానివాడు. 36

**శ్లో॥ యో బ్రహ్మాదితృణాన్తదేహనిహితో నానాఘటస్థాభ్రవ–**
**జ్జీవోఽయం నిరుపాధికామలసుఖజ్ఞానస్వరూపం బృహత్ ।**

**యోఽవిద్యాతిమిరప్రదూషితదృశో నానేహ పశ్యత్యపి**
**బ్రహ్మణ్యేష స మృత్యుమఋ్చతి పునర్మృత్యోర్జనేర్జన్మ చ ॥ 37**

భావ॥ ప్రత్యగాత్మయే అఖండ, అద్వితీయ బ్రహ్మము. నానా ఘటములందున్నట్లున్న ఆకాశమువలె బ్రహ్మాది తృణాంతముగా అనేక శరీరములందున్నట్లు పరిచ్ఛిన్నముగా కనబడు ఈ జీవుడు ఉపాధిరహితస్థితిలో నిర్మలానందజ్ఞానస్వరూపమయిన బ్రహ్మమే. ఇట్టి బ్రహ్మమయిగూడా అవిద్యాంధకారమువలన జ్ఞానదృష్టిని చెఱచికొన్నమూఢుడు బ్రహ్మమునందు అనేక భావమును అనగా భేదములను దర్శిస్తాడు. అట్టివాడు మృత్యువు నుండి మృత్యువును, జన్మనుండి జన్మను చక్రభ్రమణరీతిలో పొందుచునే యుండును. అనగా సంసారములో "జాయస్వ, మ్రియస్వ" పద్ధతిలో తిరుగుచుండును. 37

**శ్లో॥ ఆచార్యాగమసంస్కృతేన మనసైవాప్తవ్యమేతద్భృహ-**
**ద్వైతం నాస్త్యపి కిఞ్చిదత్ర హి తతో భేదం న పశ్యేన్మనాక్ ।**
**దేహాన్తర్హృదయాబ్జగేన మనసా యోఽఙ్గుష్ఠమాత్రః పుమా-**
**నాస్తే సర్వమహేశ్వరస్తమముకం బ్రహ్మైత్య విజ్ఞోఽభయః ॥ 38**

భావ॥ ఆత్మభేదదర్శికి మరల సంసారపతనము తప్పదని ఇందు హెచ్చరించుచున్నాడు. ధూమరహితమయిన అగ్నివలె నిర్మలుడు కాంతిమయుడు, హృదయస్థితుడు కనుక అందుకు తగినట్లు అంగుష్ఠ ప్రమాణంగా దొరకువాడు, పురుషుడు, భూతవర్తమాన భవిష్యత్ప్రపంచమునకు ఈశ్వరుడు, మూడు కాలములయందున్ను శాశ్వతముగా నుండువాడు, అటువంటి జీవుడు బ్రహ్మమే. ఎవడయితే యీ మిథ్యా శరీరములను నమ్మి ఆత్మలు శరీరభేదభిన్నములని అనేకములని భావిస్తాడో వాడు కొండ శిఖరం మీద కురిసిన నీరు క్రిందకు జారినట్లు సంసారములోనికి మరల జారిపడును. కనుక దేహభేదమే తప్ప ఆత్మభేదము లేదు. 38

**శ్లో॥ నిర్ధూమాగ్నిరివామలో ద్యుతిమయోఽఙ్గుష్ఠప్రమాణః పుమా-**
**నీశానోఽస్య చ భూతభవ్యభవితుః కాలత్రయవ్యాపకః ।**
**స బ్రహ్మైవ శరీరభేదమను యో నానాఽఽత్మనః పశ్యతి**
**భ్రశ్యత్యేష యథోదకం గిరిశిరే వృష్టం తతోఽధః పతత్ ॥ 39**

భావ॥ పురుషుడు పొగలేని నిప్పువలె నిర్మలజ్యోతి (కరెంటు దీపంలాగా) స్వరూపుడు జ్ఞానమూర్తి, అంగుష్ఠపరిమితమయిన హృదయపద్మగుహలో లభ్యమగువాడు. భూతభవిష్యత్ వర్తమాన మయిన యీ జగత్తుకు ఈశ్వరుడు, కాలత్రయ వ్యాపి, అయిన పురుషుడు అనగా జీవుడు బ్రహ్మమే. కాని శరీరభేదములనుబట్టి ఆత్మలో భేదములను గమనించువాడు, కొండనుండి సెలయేరు జారినట్లు ఉన్నత బ్రహ్మాత్మైక్య స్థాయినుండి పతనము పొందును. బ్రహ్మం ఒక్కటే

జీవుడు బ్రహ్మమే. కనుక అనేక జీవదర్శనము తప్పు. కనుక దేహములలో భేదమేగాని ఆత్మభేదము లేదు. 39

**శ్లో॥ శుద్ధే శుద్ధజలం జలే వినిహితం శుద్ధం యథా జాయతే**
**బ్రహ్మాత్మైక్యవిదేవమేవ భవతి బ్రహ్మేతి నిస్సంశయమ్ ।**
**ఏతస్యాస్తి పరాత్మనః కిల పురం హ్యేకాదశద్వారకం**
**నిత్యజ్ఞానసుఖాత్మనోఽమమనఘో ధ్యాత్వాఽభయో ముచ్యతే ॥ 40**

భావ॥ శుద్ధజలములో పోసిన శుద్ధజలము శుద్ధముగానే ఎలా అవుతుందో అలాగే బ్రహ్మము నందు ఐక్యము పొందిన ఆత్మగూడ బ్రహ్మయే అవుతుంది. అయితే అది ఆత్మ జ్ఞానం వలననే అవుతుంది. అది నిశ్చయము. నిత్యజ్ఞాన సుఖరూపుడయిన యీ పరమాత్మను 11 ద్వారాలు గల ఒక పట్టణము అనగా దేహము కలదు. ఈ బ్రహ్మమును ధ్యానించిన అనఘుడు సంసార భయరహితుడై ముక్తి నొందును.

విశే॥ 1. బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" కదా! ఘటం పగిలితే ఘటాకాశము మహాకాశము కాగలదు. అట్లే లింగశరీరరూప - ఆవరణము భంగమయితే జీవుడు బ్రహ్మమే అగును.

2. దేహేంద్రియాది సంఘాతం జీవుడు కాదు. అది జీవుని పట్టణము. అందులో దశేంద్రియాలు మనస్సు అని 11 ద్వారాలున్నాయి. ద్వారములు అనగా చేరుకొను సాధనములు. ఆ పురము మాయామయము. అందుకే 'కిల' అనటం. 'కిల' అనగా ఊహ. సంభావన. దేహేంద్రియ సంఘాతం జీవుని కొఱకు ఏర్పడినది. దానికి రాజు అతడే. కనుక అతను సంఘాతం కాదు. దానికి భిన్నంగా అధిపతిగా నున్నవాడు. 40

**శ్లో॥ హంసోఽయం దివి భాస్కరోఽమ్బరతలే వాయుశ్చ వేద్యాం శుచిః**
**సోమో వా కలశే గృహే సదతిథిస్సన్ వర్తతే బ్రాహ్మణః ।**
**మర్త్యస్వర్గఋతాహవామ్బరగతో వార్జావనీజాత్మకో**
**యజ్ఞాఙ్గో గిరిజాత్మకస్సమమయస్సత్యస్వభావో మహాన్ ॥ 41**

భావ॥ ఈ ఆత్మ ఏకశరీర నగర మాత్ర వ్యాపి కాదు. సర్వశరీర వ్యాపి. ఆకాశమున భాస్కరుడు, అంతరిక్షమున వాయువు వేదిక యందు అగ్ని, కలశమునందు సోమరసము, గృహమునందు జ్ఞాని అయిన మంచి అతిథి. మర్త్యులలోను, స్వర్గములోను, ఋతములోను, యజ్ఞములలోను, అంబరమునందును అంతర్యామి అయినవాడు, జలజన్యములు, భూ జన్యములు తనే అయినవాడు, యజ్ఞాంగమయిన యూపస్తంభాది స్వరూపమయినవాడు, పర్వతజన్యమయిన నది మొదలగు పదార్థములు తనస్వరూపమయినవాడు. అది ఇది యననేల? సమస్త స్వరూపుడు సత్య స్వభావుడు మహారూపుడు - ఆ ఈశ్వరుడు.

విశే॥ 1. అంతరిక్షము = భూమి స్వర్గములనడుమనున్న నక్షత్రాది లోకము = భువర్లోకము.

2. హంసః = హంతి సర్వం వ్యాపించువాడు. 'సోహం' అను ఆత్మస్వరూపుడు.

3. ఆదిత్యుడు మొదలగు వస్తువులు ఉపాధిగా తనే వెలుగువాడు. ఈశ్వరుడు ఆదిత్యాదులు 'వత్తి' వంటి వారు. రూపభేదమున్నా సర్వకారణుడు గనుక సత్యతత్త్వము. తాత్త్వికముగా అఖండరూపము. 41

**శ్లో॥ ఊర్ధ్వం ప్రాణమయం నయత్యపి తథాఽపానం క్షిపత్యప్యధో**
**మధ్యే తిష్ఠతి సేవ్యమేనమఖిలా దేవాస్సదోపాసతే ।**
**ఉత్క్రాన్తే వపుషోఽత్ర దేహిని పరే నో శిష్యతే కిఞ్చన**
**ప్రాణాపానవశాన్న జీవతి జనో జీవత్యతోఽనుశ్రితాత్ ॥ 42**

భావ॥ జగత్తుకు ప్రాణము జీవకము కాదు. ఆ ప్రాణమునకు గూడా ఈ జీవుడే పోషకుడు. 'ప్రాణస్య ప్రాణః'. కనుక ఈ జీవసన్నిధివలన – అయస్కాంతసన్నిధిలో సూదులు ఆడినట్లు – ప్రాణము ఊర్ధ్వమయిన శ్వాసక్రియను కలిగించును. భీషాస్మాద్వాయుః పవతే – అనిగదా! అపానము శరీరములోని క్రింది కార్యక్రమమును చక్కపఱచును. వీటన్నింటి మధ్యనున్న హృదయ పద్మమున ఈ ప్రత్యగాత్మ ఉండును. ఇంద్రియ రూపమయిన దేవతలు ఈయనను ఉపాసించెదరు. "మధ్యే వామనమాసీనం విశ్వేదేవా ఉపాసతే" అచేతనమయిన ప్రాణాపానాదులు సచేతనమయి తమ విధులను పాటించును. దేహోపాధిగానున్న యీ జీవుడు దేహము నుండి బయటకు వెళ్లినచో ఈ ప్రాణాపానేంద్రియాది కలాపమంతయు నశించును. ఏమియు మిగలదు. జన్మించిన ఏ ప్రాణి అయినా ప్రాణాపానమువలన బ్రతుకదు. ప్రాణములకే ఆశ్రితుడయిన యీ చైతన్యమువలననే బ్రతుకును. కనుక జగత్తుకు ఆత్మ జీవుడే. 42

**శ్లో॥ మూఢాః కేచన శుక్రబీజసహితా యోనిమ్భజన్తే తనోః**
**స్వీకారాయ యథాశ్రుతం కృతమను స్థాణుత్వమన్యే పునః ।**
**సుప్తే దేవగణే య ఏష పురుషో జాగర్తి కామాన్ సృజన్**
**యత్రేదం భువనం శ్రితం తమమృతం శుక్రం బృహద్వేత్తు కః ॥ 43**

భావ॥ తమతమ ప్రజ్ఞలనుబట్టి కర్మలనుబట్టి మూఢులయిన జీవులు శుక్రశోణిత యోగమున గర్భకోశమును చేరి తమతమ యోగ్య శరీరమును స్వీకరించెదరు. మరింత పాపులు స్థావర జన్మమును పొందెదరు. వీటికి కారణము ఈశ్వరుడే. ఇంద్రియరూప దేవతలు నిద్రలో పడిన సమయములలో ఈ పురుషుడే స్వప్నములో రథాది కామ్యపదార్థములను సృజించును. ఆయనయందే స్వప్నజాగరణాత్మకమయిన దశలలోని లోకాలు ఆశ్రయించి ఉన్నాయి. అట్టి అమృతుడు, శుద్ధుడు అయిన బ్రహ్మమును ఎవడు ఎఱుగును. ఆయన అచింతనీయ మహిముడు. 43

విశే॥ 1. రకరకాల పాపాలవలన జన్మలు వస్తాయి.

" వాచికైః పక్షి మృగతాం మానసైరంత్యజాతితామ్,
శరీరజైః కర్మదోషైః యాతి స్థావరతాం నరః "

2. దేహేంద్రియాతీతుడయిన ఒక ఆత్మ ఉన్నదని దీనినిబట్టి తేలినది. అతడు బృహత్ బ్రహ్మమే.

**శ్లో॥ ఏకోఽగ్నిః ప్రతిరూపవాన్ బహిరభూల్లోకం ప్రవిష్టో యథా**
**రూపం రూపమథానిలశ్చ భగవాన్ సర్వాన్తరాత్మా తథా ।**
**సూర్యో లోకవిలోచనం నయనగైర్దోషైర్న లిప్తో యథా**
**సర్వాత్మా పురుషశ్చ లోకశమలై రేకో న లిప్తస్తథా ॥ 44**

భావ॥ ఒకే అగ్ని, ఒకే వాయువు బాహ్య రూపముతో లోకమున, ప్రాణ, జఠరాగ్నిరూపముతో అంతర్యామిరూపముతో జీవులయందును ప్రవేశించినవి. అట్లే ప్రతిదేహమున భగవంతుడు లోన వెలుపలను వ్యాపించియున్నాడు. అయినను అతనికి లోకశోకములు ఏవీ అంటవు. సూర్యుని మీద ఎన్ని చూపులు బడినను వాటి దోషములు సూర్యుని కంటవు. అలాగే సర్వాత్మ అంతరాత్మ అయినను ఈ పురుషునకు లోక కశ్మలములు, శుభాశుభములు అంటవు.

విశే॥ 1. అగ్ని, వాయువులు చెక్క మొదలగు సర్వ - ఉపాధుల యందును వాటిని అనుసరించియుండును. అయినను వాటి దోషములు వీటికి అంటవు. వాయువు బయట గాలిగా లోపల ప్రాణముగా, అగ్ని బయట వెలుగుగా లోపల వేడిగా ఉంటాడు. అలాగే పరమాత్మ ఉంటాడు. బయట బ్రహ్మం లోపల జీవుడు. "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" - నారములు అనగా జీవులు. ఆయన జీవులకు ఆయనము. జీవులే ఆయనకు ఆయనము.

2. జీవబ్రహ్మములు వేరయితే బ్రహ్మకు సర్వవ్యాప్తి లేదనాలి.

3. లోక శమలైః శమలం = మలము. "లోకదుఃఖైర్న బాహ్యైః" అన్నదానికి అనుసరణము. అందువలన శమలం = దుఃఖము అని అర్థము. లేదా శ= సుఖము మలం = దుఃఖము - లోక సుఖదుఃఖములు ఏవీ బ్రహ్మమునకు అంటవు. 44

**శ్లో॥ ఏకోఽయం పరమేశ్వరస్సకలగస్సర్వాన్తరాత్మా వశీ**
**స్వాత్మానం బహుధా కరోతి భువనాకారేణ మాయావశాత్ ।**
**బ్రహ్మాద్యాఖిలచేతనేప్సితకరో నిత్యస్స్వబుద్ధౌ స్థితం**
**యే పశ్యన్త్యముమత్ర యాన్తి త ఇమే శాన్తిం సుఖం నేతరే ॥ 45**

భావ॥ ఆత్మకు ఉపాధిగా ఉన్న యీ ప్రపంచమును మరెవరో సృష్టించలేదు. ఈ పరమేశ్వరుడొక్కడే. ఈయనకు ఉపాధులు సృష్టించువారు మరొకరు లేరు. ఆయన సర్వవ్యాపి,

సర్వాంతర్యామి, సర్వనియంత. సర్వభువనములను ఆయనయే సృష్టిస్తాడు. మాయావశమున ఆయనయే ఆట్టి ఆకారములతో కనబడుతాడు. "బహుస్యాం ప్రజాయేయ" బ్రహ్మాది సమస్త జీవులకు సర్వ వాంఛాప్రదుడు. నిత్యుడు. అట్టి యీ బ్రహ్మము తన బుద్ధియందే ఉన్న ప్రత్యగాత్మగా దర్శించు జీవన్ముక్తుడు శాంతిని పొందును. సర్వసంసార భ్రాంతి బాధోపశాంతిని పొందును. అట్లుగాక ద్వైతమును చూచువారు శాంతిని పొందలేరు. 45

విశే॥ 1. మాయావచ్ఛిన్న చైతన్యస్వరూపమయిన ఆత్మయే జగత్తుకు నిమిత్తము. మాయ ద్వారా ఉపాదానము. కనుక సర్వజగత్తులో వ్యాపిస్తాడు. సర్వాంతర్యామిగా ఉంటాడు. ఎందుకంటే ఉపాదానకారణమయిన వస్తువు ఏదయినా – మట్టి కుండలో వ్యాపించినట్లు – తనకార్యమంతటి యందు వ్యాపించియుండును. దాని కంతరాత్మ అంతర్యామిగూడా అదే.

2. పరమాత్మ, జీవుడు – ఇద్దరు సచ్చిదానందరూపులే. కనుక పరమాత్మయే జీవుడు కావచ్చును. కాని పరమాత్మ జడదుఃఖాత్మకమయిన ప్రపంచరూపుడు ఎలా అవుతాడు? – సమా – మాయవలన అవుతాడు. మాయ జడదుఃఖాత్మకము. మాయవలన రజ్జువు సర్పంగా కనబడుతుంది. ఆకాశం రూపరహితమయినా – నీలరూపంగా కనబడుతుంది. మన స్వప్నం మాయకు ప్రతిరూపముగదా! అందులో ఆత్మయే రథ గజాది – అనేక రూపాలతో కనబడుతుంది.

**శ్లో॥ మన్యన్తే యతయస్తదేతదితి చానిర్దేశ్యముచ్చైస్సుఖం**
**జానీయాం తదహం కథన్విితి బుధః కుర్యాద్విచారం ధియా ।**
**సూర్యేన్ద్వగ్న్యుడువిద్యుతోఽత్ర న లసన్త్యేనం హ్యనుద్యోతతే**
**భాన్తం సర్వమిదం రుచాస్య లసతి బ్రహ్మైతదేషోఽస్మ్యహమ్ ॥46**

భావ॥ ఆ పరమాత్మ ఇది యది యని చెప్పరానిది. అయినను అత్యున్నత సుఖ స్వరూపమనియు యతులు చెప్పుచున్నారు. కనుక పండితుడు శుకాదులు గ్రహించిన ఆ బ్రహ్మమును ఎలా తెలిసికొనవలెనో అని నిత్య విచారణ చేయవలయును. ఆ బ్రహ్మము ముందర యీ సూర్యచంద్ర తారకలుగాని అగ్నులు గాని భాసించవు. వాటి ప్రకాశము బ్రహ్మ ప్రకాశమునకు ఆత్మ ప్రకాశమునకు అనుసరణగావచ్చునదే. సూర్యునివలన మనము చంద్రుడు, ప్రకాశించినట్లు వారు ప్రకాశించెదరు. ఈ సమస్త ప్రపంచము ఆ బ్రహ్మ ప్రకాశముతోనూ లేదా, ఈ ఆత్మ ప్రకాశముతోనూ ప్రకాశించును. అట్టి బ్రహ్మమును నేనే అని విచారించవలయును.

విశే॥ 1. 'న తత్ర సూర్యో–' అన్న మంత్రములోని విషయమును ఆత్మపరముగా సమన్వయం చేసికొనాలి. మన సుషుప్తిలో మనకు సూర్యాదులు కనబడరు. నేను జాగరణంలో భాసించునపుడు సూర్యాదులు గూడా భాసిస్తారు. వారు శవమునకు, కోమాలో ఉన్నవారికి భాసించరు గదా! కనుక ఆత్మవలననే భాసిస్తారు. కనుక సర్వభాసకమయిన బ్రహ్మము నేనే "తత్తేజోవిద్ధి మామకమ్" 46

శ్లో॥ మాయాబీజభవః స్పృహామ్బుకలితో బ్రహ్మాఙ్కురః ప్రాణభృ-
ల్లిఙ్గస్కన్ధధరస్సురాదిమతనూశాఖస్త్రయీపత్రభృత్ ।
నైకాత్మా విషయప్రవాళకలితో యజ్ఞాదిపుష్పస్సుఖై-
ర్దుఃఖైశ్చాపి ఫలైర్యుతోఽఖిలజగన్నీడశ్చ భూతాణ్డజః ॥ 47

శ్లో॥ నానాశబ్దసమాగమాతితుములధ్వానశ్చ కర్మానిలై-
ర్ధున్నశ్చఞ్చల ఏష సంసృతిమహీజోఽస్తే హ్యభావాత్మకః ।
సమ్యగ్జ్ఞానమయాసినా సుకరణీయోచ్ఛేద ఏతస్య త-
న్మూలం బ్రహ్మ సదేవ శుక్రమమృతం మిథ్యైష మర్త్యః పునః ॥ 48

భావ॥ బ్రహ్మం కనబడదు. అది ఉన్నదని ఎలా తెలుస్తుంది? లోకంలో తూలం (అనగా గంగరావిచెట్టు, గడ్డిదుబ్బు) చూచినపుడు దానికి మూలం ఉన్నదని ఊహిస్తాము. అలాగే సంసార (ప్రపంచ) వృక్షమును చూస్తున్నాము కనుక దాని మూలమయిన బ్రహ్మము గూడా ఉన్నదని ఊహించాలి. సంసారవృక్షస్వరూపమిది.

దాని బీజము అవ్యాకృతమయిన మాయ. దీనికి నీరు తృష్ణ అనగా మన కోరికలు. హిరణ్యగర్భబ్రహ్మయే మొలక. ప్రాణులు ధరించే లింగశరీరాలు ఆ వృక్షమునకు స్కంధములు. దేవమనుష్యాది స్థూల శరీరములు దాని కొమ్మలు. వేద త్రయము స్మృతులు మొదలగునవి దాని ఆకులు. అది అనేక విధములయినది. శబ్దాది విషయములు దాని చిగురులు. యజ్ఞాది క్రియలు పుష్పములు. సుఖదుఃఖములు ఫలములు. అని అనేకవిధాలు గనుక అనేక సంఖ్యగలవి. 14 భువనములు ఆచెట్టునందున్న గూడులు. బ్రహ్మాది - తృణ పర్యంతముగల జీవులు ఆ చెట్టుపయి పక్షులు. సుఖదుఃఖ హర్ష భయాశ్చర్యాదులతోను, రకరకాల భాషలతోనూ ప్రాణులు చేయు శబ్దములే యీ వృక్షముపై పక్షుల కిలకిలారావములు, కర్మలు ఈ చెట్టు వీచు గాలులు, ఈ చెట్టును ఊపు గాలులు, కాని చివరకు మిగిలేది "అభావము"

ఇలా ప్రత్యక్షంగా కనబడే యీ సంసార రూప - అశ్వత్థ వృక్షమును తత్త్వజ్ఞానమను ఖడ్గముతో నఱికివేయవలయును. అనగా ప్రపంచాధారముగా ఏర్పడిన భ్రాంతిని పోగొట్టుకొనవలయును. (అంతే తప్ప భార్యాబిడ్డలను నఱికితే సంసారం పోదు. పైగా నరకం వస్తుంది) ఈ సంసార వృక్షమునకు మూలము అమృతం. స్వయం ప్రకాశము అయిన 'సత్' బ్రహ్మమే. మూలములేని వృక్షం ఉండదు గదా! కాని యీ సంసారము మిథ్య. మరణ సహితము. అసత్యం అనిత్యం. కనుకనే దీనిని జ్ఞానముతో సులభముగా నఱకవచ్చును. రజ్జు జ్ఞానంతో మిథ్యా సర్పజ్ఞానం అనగా అజ్ఞానం పోతుంది గదా!

కనుక ముముక్షువు బ్రహ్మాత్మజ్ఞానమును సంపాదింపవలయును. 47-48

**శ్లో॥ కార్యం కారణ ఏవ తిష్ఠతి చ తన్నాత్యేతి మృత్కుమ్భవ-**
**త్తస్మాద్బ్రహ్మణి కారణేఽస్తి సకలం నాత్యేతి తత్కిఞ్చన ।**
**లోకోఽయం నను కమ్పతే సతి బృహత్యస్మిన్నతో నిర్గతో**
**భీతోఽస్మాత్పరముద్యతాదివ పవేరేతద్విదన్తోఽమృతాః ॥ 49**

భావ॥ బ్రహ్మ ఉన్నదన్న విషయం దీనివలనగూడా మరింత స్పష్టమవుతుంది. కార్య-మయిన ఘటాది వస్తువులు కారణమయిన మట్టియందు నిలిచియుండును. దానిని మించవు. అట్లే కారణమయిన బ్రహ్మమునందే కార్యమయిన సకల ప్రపంచము నిలిచియుండును. దానికి మించి ఏదియును ఉండదు. ఈ "బ్రహ్మం" ఉన్నది కనుకనే అందునుండి వచ్చిన ఈ లోకము మీదకు ఎత్తిన వజ్రము నుండి బయటపడినట్లు భయభక్తులతో నడుచుచున్నది. ఈశ్వరుని తమకు భిన్నముగా పరునిగా చూడటం వలననే భయము కలుగుచున్నది. కనుక ఈ బ్రహ్మమును ఆత్మరూపముగా చూచువారు అమృతులగుదురు. వారు నిర్భయులు. అట్టి బ్రహ్మం ఉన్నది గనుకనే సంసారమంతయు క్రమముదప్పక నడుచుచున్నది. 49

**శ్లో॥ భీతోఽగ్నిర్దహతి ప్రభోస్తపతి కస్తాపం నిహన్త్యమ్బుజో**
**జిష్ణుర్వర్షతి కమ్పతేఽపి పవనశ్శమ్పా క్షణం ద్యోతతే ।**
**సర్వం భూస్సహతే పయోనిధిరహో నాగచ్ఛతి స్వావధే-**
**ర్లోకాన్పాన్తి చ లోకపా ను బహునా మృత్యుః పరం ధావతి ॥ 50**

భావ॥ ప్రకృతి శక్తుల క్రమశిక్షణనే వివరించుచున్నాడు. ఆ మహాప్రభువుకు భయపడి అగ్ని దహనక్రియను, సూర్యుడు తపన క్రియను చేయును. చంద్రుడు వెన్నెలతో తాపమును పోగొట్టును. ఇంద్రుడు వర్షించును. గాలి కంపించును. మెఱుపు క్షణమే మెఱయును. భూమి సర్వంసహయై క్షమాగుణముతో మనలను భరిస్తున్నది. సముద్రము చెలియలికట్టదాటకుండగ బ్రతుకుచున్నది. లోకపాలకులు లోకములను పరిపాలించుచున్నారు. ఇంత చెప్పనేల? మృత్యువుగూడ వేగంగా పరుగెత్తుచున్నది. 50

**శ్లో॥ ఏతత్సాధ్వసకారణం కలయితుం ప్రాగ్దేహపాతాద్బుధ-**
**శ్చేచ్ఛక్నోతి విముచ్యతే న యది హా సర్గేష్వధీర్జాయతే ।**
**ఆదర్శే ముఖమీక్షతే హి పురుషః స్పష్టం న తోయే పున-**
**స్తద్వన్మానవజన్మని స్ఫుటతరం నాన్యత్ర సద్దర్శనమ్. 51**

భావ॥ ఇంతటి భయకారణమయిన బ్రహపదార్థమునాత్మపదార్థముగా తెలియవలసిన అవసరం ఉన్నది. అదిగూడా మరణాత్ పూర్వమే జరగాలి. అలా జరిగితేనే ముక్తుడవుతాడు. లేనిచో ప్రతిసృష్టిలోనూ మరల మరల ఆ బుద్ధిరహితుడు పుట్టుంటాడు. మానవజన్మలోనే జ్ఞానం వస్తుంది. మరోజన్మలో రాదు. ఈ జన్మలో మనస్సుకు గ్రాహక శక్తి అధికము.

ఇతరజన్మలలో అది మందము. పురుషునకు అద్దంలో మొగము కనబడినంత స్వచ్ఛంగా ఇతర (నీరు – మొదలగు) వస్తువులలో కనబడదు గదా! కనుక సద్దర్శనముగల మానవజన్మలోనే ముక్తి ప్రయత్నం జరగాలి. 51

**శ్లో॥ జాగ్రత్యాత్మని నిర్మలే పరపదం స్పష్టం యథా భాసతే**
**తద్వన్మానవజన్మని స్ఫుటతరో బ్రహ్మాత్మబోధో నృణామ్ ।**
**స్వప్నే ఽస్పష్టమిదం విభాతి తు యథా తద్వత్పితౄణామ్పదే**
**గాన్ధర్వేఽపి చ దైవతే స్ఫుటతమం సత్యే తు తద్దుర్లభమ్ ॥ 52**

భావ॥ జాగరణదశలో పరబ్రహ్మస్థానమయిన యీ ప్రపంచము లేదా ఆకాశాదికము నిర్మలమనస్సులో స్పష్టంగా కనబడుతుంది. అట్లే మానవజన్మలో జీవులకు బ్రహ్మజ్ఞానం స్పష్టంగా కలుగుతుంది. ఇతర జన్మలలో అలా కలుగదు. (గజేంద్రాదులు వేఱు) అదే స్వప్నమునందు విషయాలు అలా స్పష్టంగా తెలియవు. అలాగే పితృలోకమునందు గాంధర్వలోకమునందు అస్పష్టముగా నుండును. కాని సత్యలోకమునందు మనుష్యలోకమునందు కన్న అతిస్పష్టముగా ప్రకాశించును. కాని ఆ సత్యలోకము అసలే దుర్లభము. మానవజన్మగూడా తేలికగా లభించేది కాదు. కనుక మానవజన్మలోనే మరణాత్ పూర్వమే ముక్తి ప్రయత్నముచేయవలయును. ఉదాసీనత పనికిరాదు. విషయములందు మాత్రము ఉదాసీనత అవసరమే. 52

**శ్లో॥ త్వక్చక్షుశ్శ్రుతిరాసనం నిపుణధీర్ఘ్రాణం చ దృష్ట్వోదితం**
**వాయ్వర్చిర్వియదమ్బుభూభ్య ఇతరత్సచ్చిత్సుఖాదాత్మనః ।**
**ఏషాం జాగ్రతి సమ్భవం చ విలయం స్వాపే తథా సాక్షిణం**
**స్వాత్మానం పరమవ్యయం ధ్రువమజం బ్రహ్మాఽథ నో శోచతి ॥ 53**

భావ॥ తత్త్వబోధలో మానవజన్మ ప్రత్యేకత ఏమిటి? సమా – వాయు, అగ్ని, ఆకాశ, జల, భూముల నుంచి పుట్టిన చర్మ, నేత్ర, శ్రవణ, జిహ్వా, నాసికలు పుట్టిన విషయం తెలిసిన నిపుణుడు, అట్లే సచ్చిదానందస్వరూపమయిన ఆత్మనుండి అందుకు భిన్నమయిన అనృత జడ దుఃఖస్వరూపమయిన యీ జగత్తు పుట్టినట్లు గ్రహిస్తాడు. ఈ ఇంద్రియాదులన్నియు జాగరణంలో తెలియటం నిద్రలో తెలియకుండా పోవటం, అన్నింటకి తాను సాక్షిగా ఉండటం గమనిస్తాడు విద్వాంసుడు. అట్టి సాక్షి, తనకు ఆత్మ, అనంతుడు, శాశ్వతుడు, అజుడు అయిన పరబ్రహ్మమును గుర్తెఱింగిన జ్ఞాని దుఃఖింపడు.

విశే॥ 1. రసనం = రాసనం = నాలుక,

2. స్వప్నదృష్టాంతం ప్రకారం జాగరణంలోని ప్రపంచానుభవమును పోల్చి చూచికొని ఇదిగూడా స్వప్న ప్రపంచంవలె మిథ్య అని భావించాలి. తాను సత్యమయిన అద్వితీయ బ్రహ్మముతో అభిన్నమని భావించి, తరించునవకాశము మానవులకే కలదు. దేవజాతులకు

నిద్రలేదు. స్వప్నం రాదు. కనుక దృష్టాంతం ఉండదు. పశువులకు అసలు బుద్ధిశక్తియే మందము. కనుక మానవజన్మయే శ్రేయస్సుకు సాధనముగా పనికివచ్చును. 53

**శ్లో॥ యోఽసావిన్ద్రియచిత్తసన్మతిమహన్మాయాపరో వ్యాపకోఽ**
**లిఙ్గస్సన్ పురుషోఽస్య తస్య తు పదం నో దృక్పథే తిష్ఠతి ।**
**నైనం పశ్యతి కశ్చనేన్ద్రియగణైర్యః కోఽపి ధన్యః పున-**
**ర్బుద్ధ్యా హృత్థితయా విచార్య లభతే యో వేద తతోఽమృతః ॥ 54**

భావ॥ ఈ బ్రహ్మం/ఆత్మ ఇంద్రియములు, మనస్సు, బుద్ధి మహత్తు, మాయ, వీటికన్న అతీతమయినది. వ్యాపకమయినది. లింగరహితమయినది. అట్టి యీ పురుషుని స్థానం మనకు అందదు. చాలకష్టము. ఎవడును ఈయనను ఇంద్రియముల ద్వారా చూడలేడు. కేవలము హృదయగతమయిన శాస్త్రవిచారకుశలమయిన బుద్ధితో విచారించినవాడే యీయనను పొందును. అట్లు పొందినవాడే అమృతుడగును. 54

**శ్లో॥ సాకం యత్ర హృదేన్ద్రియాణి విషయవ్యావర్తితాన్యాసతే**
**తూష్ణీం యత్ర న చేష్టతే చ ధిషణా యత్రాప్రమత్తః పుమాన్ ।**
**తస్మిన్నాత్మని న స్ఫురత్యవిషయో వాచో హృదోఽపి స్వయం**
**యస్మాదేతదభూద్వినశ్యతి యతశ్శూన్యం తు తత్స్యాత్కథమ్ ॥ 55**

భావ॥ విషయములనుంచి అంతరాత్మవైపు తిరిగిన మనస్సు ఇంద్రియములు ఆ ఆత్మ సన్నిధిలో లీనమయి మౌనముగా నుండును. బుద్ధిగూడ నిశ్చలమవుతుంది. అచ్చటనే పురుషుడు అప్రమత్తుడు అవుతాడు. అనగా అజ్ఞానమును వీడుతాడు. నిద్రారహితుడవుతాడు. అట్టి తురీయదశలో (జాగరణ స్వప్న సుషుప్తులుకాని కాలము) అవాఙ్మానస గోచరుడయిన ఆ పరమాత్మ స్వయంగా ఆత్మ రూపమున ప్రత్యక్షమవుతాడు. కనుకనే ఇది శూన్యవాదము కాదు. ఏ మహతత్త్వము నుండి ఈ ప్రపంచము పుట్టి అందుననే లయమవుతున్నదో ఆ నిమిత్తోపాదాన తత్త్వము శూన్యమెట్లగును? 55

**శ్లో॥ కార్యస్యాస్య నిదర్శనాదుపలభేతాస్తీతి హేతుం పరం**
**స్వాత్మానం ప్రథమం తతో నిరుపధేస్తత్త్వం స్ఫుటమ్భాసతే ।**
**సమ్యగ్జ్ఞానిన ఏవమత్ర తు యదా కామా వినష్టాస్సమే**
**హృత్స్థా ఏష తదాఽమృతో భవతి వా బ్రహ్మైవ సమ్పద్యతే ॥ 56**

భావ॥ కార్యమయిన ప్రపంచం కనబడుతున్నది కనుక దానికి కారణమయిన పరమాత్మ బ్రహ్మం ఉన్నదని తెలియవలయును. ముందు అలా తెలిసికొన్నతరువాత జ్ఞానికి ఆ నిరుపాధిక మయిన బ్రహ్మతత్త్వం క్రమముగా స్పష్టముగా భాసిస్తుంది. అట్టి దివ్యసమాధి తప్పక కలుగగలదు.

ఎపుడయితే సమస్త కామములు క్రమముగా నశించునో అటువంటి జ్ఞాని తప్పక అమృతుడు కాగలడు. ఎందుకంటే అతడు బ్రహ్మమే అవుతాడు గదా!

విశే॥ 1. కార్యలింగముచేత మాయ ఉపాధిగా గల ఈశ్వరుని ఊహింపగలము. కాని నిరుపాధిక బ్రహ్మము ప్రత్యక్షానుమానాలతో సిద్ధించదు. అది శ్రవణమననాదుల వలన 56

**శ్లో॥ మర్త్యోఽహం ముఖజోఽస్మి మే వపురిదం గేహాదికం మామకం**
**యజ్ఞోఽహం ధనికోఽస్మి చేతి హృదయగ్రన్థిర్యదా భిద్యతే ।**
**మాయాప్రత్యయరూప ఏష విదుషస్సర్వోఽపి కామస్తదా**
**నష్టస్స్యాదమృతో భవత్యథ బుధో వేదోపదేశస్త్వియాన్ ॥ 57**

భావ॥ విద్వాంసునకు సర్వకామములు తొలగును. ఆ సర్వకామములు ఇవి. నేను మనిషిని, నేను బ్రాహ్మణుడను, అని జాత్యాది – అహంకారములు. ఇది నా శరీరము. ఇది నా ఇల్లు నా ధాన్యము మొదలయినవి మమకారములు. నేను యజ్ఞుడను అని నామాభిమానము. ధనికుడనని ధనాభిమానము. ఇంకా ఇట్టివే సౌందర్యాద్యభిమానములు. ఇట్టివన్నీ హృదయంలో నిలిచియున్న అభిమానగ్రంథులు. బంధాలు. ఈ బంధాలు మిథ్యాభావనలు. సత్యదర్శనంతో ఈ గ్రంథులు పటాపంచలవుతాయి. "భిద్యతే హృదయగ్రంథిః" – కదా! దానిలో సర్వకామాలు నశిస్తాయి. అతడు పూర్ణకాముడు. అంతట అధ్యాసవదలుతుంది. ఆ జ్ఞాని అమృతుడవుతాడు. ఇదే వేదం చేసిన ఉపదేశము.

విశే॥ 1. ఈ అభిమానాలన్నీ మాయామయములు. మిథ్యా ప్రపంచములో ఏర్పడినవే గదా! మమకారములూ అంతే. ఇవి అన్నీ అధ్యాసవలన ఏర్పడుతాయి. ఆత్మకు అనాత్మ అయిన అంతఃకరణమునకు మధ్య మిథ్యాసంబంధం ఏర్పడినందువలన ఈ ఆత్మేతర మిథ్యాపదార్థము లందు కోరికలు వస్తాయి. తత్త్వజ్ఞానంతో నిర్వీర్యం అవుతాయి.

కనుక మోక్షగామి అనాత్మల యందు అహంకార మమకారములు మానవలెను. 57

**శ్లో॥ యస్త్వన్యస్సగుణం బృహత్కలయతే నాడ్యా శతాదన్యయా**
**మూర్ధానం ప్రతియాతయా హృదయతో గచ్ఛన్నుపర్యేష సః ।**
**విద్వాన్ బ్రహ్మపదం ప్రయాతి కృతినః కర్మానురూపం పున–**
**ర్నాడీభిస్త్వితరాభిరుత్క్రమణగా విష్వగ్గభస్తే గతీః ॥ 58**

భావ॥ "ద్వే బ్రహ్మణీ వేదితవ్యే" అని రెండు బ్రహ్మములు చెప్పబడినవి. సగుణ బ్రహ్మ మొక్కటి. నిర్గుణ బ్రహ్మమొక్కటి. అందులో నిర్గుణబ్రహ్మం విషయం చెప్పబడినది. ఇక సగుణ బ్రహ్మ విషయం ఇందులో చెప్పబడినది. సగుణ బ్రహ్మోపాసనకు బ్రహ్మలోకయానం ఉన్నది. సగుణబ్రహ్మమును హృదయమునన నిలిపిన యోగి పుంగవుడు హృదయమునుంచి మాడుదాకా సాగిన 101వ నాడి అయిన సుషుమ్న ద్వారా ఊర్ధ్వయానము చేయుచు బ్రహ్మపదమును

పొందును. కాని యజ్ఞాది కర్మఠులు మాత్రము ఇతరనాడుల ద్వారా తమతమ కర్మల కనురూపమయిన ఉత్క్రాంతి గతులను పొందును. ఆయా కర్మఫలములయిన లోకములకు పోవును. జన్మలకు పోవును. దేవమనుష్య పశుపక్ష్యాది జన్మలను పొందును. 58

**శ్లో॥ భూతానాం హృదయే స్థితస్స పురుషోఽఙ్గుష్ఠప్రమాణస్సదా**
**దేహోత్థం సకలాన్తరం ప్రవిభజేన్ముఞ్జాదిషీకామివ ।**
**ధైర్యేణ స్థిరదర్శనోఽథ తమయేదాత్మానమాద్యం బృహ-**
**ద్బ్రహ్మాత్మైక్యవిదేవమేతి పరమం బ్రహ్మామృతం నిర్మలమ్ ॥ 59**

భావ॥ ఆ పురుషుడు హృదయప్రమాణములను బట్టి అదే కొలతలో అంగుష్ఠప్రమాణుడై భూత హృదయములయందు నిత్యముండును. సకలాంతరుడయిన ఆయనను "ముంజగడ్డినుండి ఈనెను" బయటకు లాగినట్లు (ముంజేషికాన్యాయం) విడదీసి గమనింపవలయును. అనగా "నేతి నేతి" భావనలతో పరిశేషన్యాయమున ఆ అతీతసత్యవస్తువును గుర్తింపవలయును. ధీరుడై ఇంద్రియనిగ్రహంతో స్థిరదర్శనుడై ఆ పరమాత్మ అయిన సనాతన బ్రహ్మమును పొందవలయును. ఈవిధంగా బ్రహ్మాత్మైక్యమును అనుభవించిన వాడు పరమనిర్మలమయిన ఆ అమృతస్వరూప మయిన బ్రహ్మమును పొందును.

విశే॥ కనుక ప్రాజ్ఞుడు క్రమముక్తి కారణమయిన సగుణోపాసనను, ఇతరలోక ఇతరజన్మలకు కారణమయిన కర్మమార్గమును కోరక నేరుగా ముక్తినిచ్చు నిర్గుణబ్రహ్మాత్మైక్య జ్ఞానమునే సాధింపవలయును. 59

కఠోపనిషత్తు - పూర్తి

శ్రీః

# ప్రశ్నోపనిషత్

## ప్రశ్నోపనిషత్తు – భూమిక

1. పిప్పలాదమహర్షి వద్దకు అయిదుగురు ఋషులు వచ్చిరి.

కాత్యాయనుడయిన కబంధి, వైదర్భి అయిన భార్గవుడు, కౌశల్యుడయిన అశ్వలాయనుడు, గార్గ్యుడయిన సౌర్యాయణి, శైబ్యుడయిన సత్యకాముడు, భారద్వాజుడయిన సుకేశుడు.

వీరు అపరబ్రహ్మవేత్తలు. కాని పరబ్రహ్మజ్ఞానము కొఱకు పిప్పలాదుని వద్దకు వచ్చి 6 ప్రశ్నలు సంధించారు.

1. కబంధి : **శ్లో 60 నుంచి**

ప్రజాజన్మ గూర్చి, ప్రాణవిషయం గురించి సంవత్సరాదికాల విభాగము – ప్రజాపతి, రయిప్రాణసృష్టి. ఇవి విషయాలు.

2. భార్గవుడు : **శ్లో 63 నుంచి**

శరీరధారులయిన దేవతలు, బుద్ధీంద్రియ వరిష్ఠ ముఖ్యప్రాణప్రాశస్త్యము. ప్రాణ ప్రజాపతి etc

3. కౌశల్యుడు : **శ్లో 69 నుంచి**

ప్రాణము పుట్టుక, ఉత్క్రాంతి, చావు, అధ్యాత్మ క్రియలు, ప్రాణము బ్రహ్మచ్ఛాయ, ఇంద్రియ ప్రాణనియోక్త. లింగాత్మ మరణ కాలస్మరణనుబట్టి పరలోకప్రాప్తి.

4. సౌర్యాయణి : **శ్లో 72 నుంచి**

ఇంద్రియభోగి, సుషుప్తిసుఖము, స్వప్నదర్శనము, ఇంద్రియాలు సుషుప్తిలో లీనత, మనస్సులోనే లీనత మొదలగు తత్త్వపదార్థశోధన.

5. సత్యకాముడు : **శ్లో 76 నుంచి**

ఓంకారోపాసన. పరాపరబ్రహ్మలు

6. సుకేశుడు : **శ్లో 80 నుంచి**
16 కలలపురుషుడు. హిరణ్యగర్భసృష్టి మొదలగునవి.
వివరాలు ఆయా శ్లోకాలలో.

### ప్రశ్నోపనిషత్తు

**శ్లో॥ స్రష్టుం లోకమిమం విధాయ పరమం బ్రహ్మా తపః ప్రాగ్రయిం**
**ప్రాణం చ వ్యసృజత్మిలేతి మిథునం మూర్త్యన్నచన్ద్రా రయిః ।**
**ప్రాణోఽత్తాగ్నిరమూర్తిరర్క ఇతి తత్సూర్యేన్దుయుగ్మాదభూ-**
**త్కాలోఽబ్దాయనమాసపక్షదినరాత్ర్యాద్యాత్మకోఽయం మహాన్ ॥ 60**

భావ॥ పరవిద్యసఫలంగా వర్ణింపబడినది. అపరవిద్య కర్మసముచ్చితమయినపుడు, సముచ్చితము (రెండూకలిపి చూడటం సముచ్చయం) కానపుడు వాటి కార్యము, వాటి గతి వివరించటానికే యీ ఉపనిషత్తు.

ఈలోకమును సృజించుటకు బ్రహ్మ తీవ్ర ఆలోచనా రూపమయిన తపస్సు చేశాడు. ఆయన రయిని ప్రాణమును ముందుగా సృష్టించాడట. ఆ జంటలో 'రయి' అనగా మూర్తి(స్థూలం) అన్నము చంద్రుడు. 'ప్రాణము' అనగా అత్త, అమూర్తి (సూక్ష్మం) అర్కుడు అని అంటారు. ఈ సూర్య చంద్రుల జంటనుండి కాలము వచ్చింది. ఆ మహాకాలము సంవత్సరము, అది ఆయనము (ఉత్తర, దక్షిణ)లుగాను, అవి మాసములుగాను, మాసములు పక్షముగాను, పక్షములు దినరాత్రులుగాను ఏర్పడును.

విశే॥ 1. దినరాత్రులు ఘడియలుగా, ఘడియలు విఘడియలుగా - అలా ఏర్పడుతాయి. కాలము సూర్యచంద్రుల వలన ఏర్పడుతుంది.

2. ప్రాజాపత్యవ్రతము. సర్వజగత్తు ప్రజాపతియే అనగా. బ్రహ్మయే. అని అనుసంధానము చేయటం. అయితే జగత్తు ప్రజాపతి ఎలా అవుతుంది? అని సందేహము. ప్రజాపతి యొక్క కార్యం కనుక - అని సమాధానము. జగత్తు ఎలా ప్రజాపతి కార్యమో చూపటం యీ శ్లోకాల గమ్యం. 60

**శ్లో॥ ఏతస్మాద్దినరాత్రిరూపసమయాద్వ్రీహ్యాదిరాసీత్తత-**
**శ్చాన్నం శుక్రమథాన్నతస్సమభవన్ లోకాస్తదేతన్మహాన్ ।**
**ప్రాజాపత్యమిదం వ్రతం చరతి యస్స ద్వన్ద్వసూర్జాయతే**
**సత్యం యత్ర తపశ్చ దక్షిణపథేనేన్దోఃపదం యాతి సః ॥ 61**

భావ॥ ఈ దినరాత్రి రూపసమయ ప్రభావము వలననే "వ్రీహి" మొదలయిన ఓషధులు పుట్టును. దానినుంచి అన్నము, దానినుంచి శుక్రము కలుగును. అన్నమునుండియే ఈలోకములు పుట్టినవి. అదే యీ ప్రజాపతి (మహాన్) ఇట్లు ప్రాజాపత్య వ్రతమును పూని ఆచరించువాడు

ద్వంద్వమును కనును. అతనియందు సత్యము తపస్సు దానితోపాటు యీ ప్రాజాపత్య వ్రతం గూడా ఉన్నవాడు తప్పక దక్షిణమయిన చంద్రమార్గమునుండి ఊర్ధ్వలోకములకు పయనించును.

విశే॥ 1. అహోరాత్రములలోనే గదా ఏది జరిగినా. అందువలన వ్రీహ్యాదులున్ను అంతే.

2. ప్రజాపతి సృష్టికి అభిన్ననిమిత్తోపాదానకారణము. అనగా ఘటమునకు కుమ్మరివలె నిమిత్తకారణము. మట్టివలె ఉపాదానకారణము. కనుక జగత్తు ప్రజాపతి అవుతుంది. ఘటం మాత్రం కులాలుడు గాదు. ఈశ్వరరూపుడే ప్రజాపతి.

3. తపస్సు = తీవ్ర ఆలోచన, బ్రహ్మచర్యము. దక్షిణమార్గము అనగా పితృయానము. ఇది కర్మపరులు మరణానంతరము పోవు మార్గము. ఈ మార్గమున పోయినవారు పుణ్యక్షయము తరువాత మరల యీలోకమునకు జన్మకు వస్తారు. 61

**శ్లో॥ మాయా యేషు న విద్యతే కుటిలతా ౭సత్యం చ సత్యం తపో**
**జ్ఞానం యేషు చ విద్యతే విరజసస్తే వా గృహస్థేతరే ।**
**యోగాద్దేవపథేన యాన్తి విమలం హైరణ్యగర్భం పదం**
**నావృత్తిం చ తతః ప్రయాన్తి కుశలైస్సాధ్యం తదేతత్పదమ్ ॥ 62**

భావ॥ కర్మపరులయిన గృహస్థులు దక్షిణమార్గమున పితృయానముతో చంద్రలోకమునకు పోయెదరు. గృహస్థేతరులు ఉత్తరమార్గమున దేవయానంతో హిరణ్యగర్భ(బ్రహ్మ)లోకమునకు పోయెదరు.

ఎవరియందు మాయ (వంచన) కుటిలత అసత్యము లేవో, అందుకు బదులుగా సత్యము, తపస్సు, జ్ఞానము ఉండునో, అట్టి విరజసులయిన (పాపరహితులు) బ్రహ్మచారి, వానప్రస్థ సన్న్యాసులు యోగశక్తితో బ్రహ్మరంధ్రభేదముచేసి దేవయానమున ఉత్తరమార్గమున రజస్తమో మల శూన్యమయిన హిరణ్యగర్భలోకమునకు పోయెదరు. ఆ లోకమునుండి యిక వారు తిరిగి జన్మకురారు. కనుక కుశలులయిన వారు పునరావృత్తిరహితమయిన యీ లోకమును చేరుటకు, ప్రయత్నింప వలయును. 62

**శ్లో॥ వాయ్వగ్న్యమ్బుధరానభో౭క్షివచనశ్రోత్రాత్మభిర్ధార్యతే**
**దేహో౭యం న హి కిన్తు పఞ్చవిధసత్ప్రాణేన సన్ధార్యతే ।**
**ప్రాణే౭జ్ఞాత్పరముద్యియాసతి సముద్గచ్ఛన్తి సర్వే పరే**
**ప్రాణే తిష్ఠతి సంవసన్తి చ తనౌ ప్రాణస్తదేషాం వరః ॥ 63**

భావ॥ వాయువు, అగ్ని, జలము, భూమి, ఆకాశము అను పంచభూతములుగాని, నేత్రములు, వాక్కు, శ్రవణములు, మనస్సు అను జ్ఞానేంద్రియ కర్మేంద్రియములుగాని యీ శరీరమును నిలుపజాలవు. ప్రాణాపానవ్యాన ఉదాన సమానములను పంచప్రాణములు మాత్రమే ఈ శరీరమును నిలుపును. ప్రాణములు గనుక శరీరమునుండి లేచిపోయినచో ఇతరములయిన

భూత, ఇంద్రియ సమూహము భూకంపమువచ్చినట్లు భయపడి ప్రాణము వెంట బయలుదేరును. ఏకారణం చేతనయినా ప్రాణములు నిలిచినచో అవి యన్నియు మరల శరీరములో నిలుచును. కనుక ప్రాణము వీటన్నింటిలోకి శ్రేష్ఠము.

విశే॥ 1. ప్రాణము అత్త (తినువాడయిన) ప్రజాపతి. ఆయన ఆత్మ, ప్రజాపతి అన్న లక్షణములను శరీరమునందు సమన్వయించుచున్నాడు. ప్రజాపతి సర్వదేవోత్తముడు - అన్నది సుస్పష్టము. సర్వ శరీరధారకమయినది ప్రాణమే కదా!

2. ప్రాణములు లేచినపుడు శరీరంలో ఇంద్రియాలు పనిచేయకపోయినా వాయ్వాది భూతములుంటాయి కదా! ధనంజయ వాయువు, నీరు, పార్థివదేహం, ఆకాశం ఉంటాయి గదా? - సమా - అవి ఉంటాయి. కాని వాటి అధిష్ఠానదేవతలు పోతారు. గంగ, హిమవంతుడు మొదలగువాటికి అభిమానదేవతలున్నట్లు పురాణాదులలో ప్రసిద్ధమేకదా!

3. మహాన్ - మహత్తత్త్వము ప్రాణమే అదే హిరణ్యగర్భుడు. 63

**శ్లో॥ అగ్నిస్సన్ జ్వలతి ప్రదీప్యతి రవిర్భూత్వాఽమ్బుదస్సన్నయం**
**ప్రాణో వర్షతి పాలయత్యపి జనాన్ దేవేన్ద్రరూపో భవన్ ।**
**మేఘోడ్వభ్రసరిన్ముఖా స్వహతి వా వాయ్వాత్మనా భూర్భవన్**
**ధత్తే సర్వమిదం శశీ చ సదసత్పుష్ణాతి దేవోఽమృతమ్ ॥ 64**

భావ॥ ఈ ప్రాణమే అగ్నిగా జ్వలించును. సూర్యుడై వెలుగును. మేఘమయి వర్షించును. దేవేంద్రరూపుడై జనులను పాలించును. వాయురూపుడై మేఘమును, నక్షత్రములను, దేవనదిని, ఇంకా చంద్రాదులను ఆకాశమున భరించుచున్నాడు. భూమిగా అయి ఈ సమస్త చరాచరములను మోయుచున్నాడు. చంద్రుడయి సత్తును (మూర్తిగల పదార్థములను) అసత్తును (మూర్తిరహిత పదార్థమును) పోషించును. ఈ ప్రాణదేవుడు దేవతలకు అమృతమగును.

విశే॥ ఇది ప్రాణోపాసనకు సంబంధించిన స్తుతి. లేదా, ప్రాణి చేయుపనులన్నీ అందుకు కారణమయిన ప్రాణమునకు జతపఱచడమే. ప్రాణము లేనిదే ఆయా దేవతలు గూడా ఆయాపనులు చేయలేరు. అగ్ని మొదలగు దేవతల పని వారిలోని ప్రాణశక్తిదే. అగ్ని - మొదలగు దేవతా స్వరూపము ప్రాణము. ప్రాణము అమృతం కావటం అంటే, భోక్త - భోగ్యముల మధ్య అభేదోపచారము. కనుక తత్త్వకథనము. ప్రాణము భోక్త. దానిని నిలుపు భోగ్యము అమృతము. 64

**శ్లో॥ ప్రాణే సర్వమిదం ప్రతిష్ఠితమరా నాభౌ రథాఙ్గస్య వా**
**వేదానాం త్రితయం కృతం చ ముఖజః ప్రాణ స్తథా క్షత్రియః ।**
**ప్రాణోఽయం హి విరా ట్పితుశ్చరతివా గర్భే రసాత్మా శిశు-**
**ర్మాతుశ్చ ప్రతిజాయతే సుతమయోఽముష్మై బలిం తన్వతే ॥ 65**

భావ॥ చక్రము యొక్క మధ్యనున్న కుండ (నాభి) యందు ఆకులు (అడ్డకడ్డీలు) పొదిగినట్లు ఈ సమస్త ప్రపంచము ప్రాణమునందు పొదగబడినది. వేదత్రయము ప్రాణస్వరూపమే. శబ్దము ప్రాణాధీనము కదా! బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు ప్రాణస్వరూపులే. ప్రాణమువలన నెరవేరేవి కనుక కర్మలన్నీ ప్రాణములే. ఈ ప్రాణమే స్థూలజగద్రూపమయిన విరాట్పురుషుడు. పితృ వీర్యము వీర్యరూపాత్మ ప్రాణమే. మాతృగర్భమున తిరుగాడు వీర్య పిండ స్వరూపమయిన శిశువు ప్రాణమే. మాతృ పితృ బీజ ప్రతిరూపుడై పుట్టు సుతుడు ప్రాణమే. అట్టి ప్రాణాత్మకు అందఱును కానుకలు (ఆహారాదులు) సమర్పించెదరు. 65

**శ్లో॥ దేవానామపి హవ్యవాట్పితృతతేరేష స్వధాప్రాపకోఽ-**
**థర్వా చాఙ్గిరసర్షి సత్యచరితం రుద్రో మహేన్ద్రోఽవితా ।**
**సూర్యోఽయం దివి తేజసాంపతిరపో వర్షత్యముష్మిన్ప్రజా**
**ఆనన్దన్తి యథాభిలాషమితి నో భూయోఽన్నముత్పత్స్యతే ॥ 66**

భావ॥ ఈ ప్రాణ ప్రజాపతియే దేవతలకు హవ్యమును చేర్చు స్వాహాకారప్రాపకుడయిన అగ్ని. పితరులకు కవ్యమును చేర్చు స్వధా ప్రాపకుడయిన అగ్ని. ఇతడే అధర్వవేదము. అధర్వ ఋషి యితడే. అంగిరస ఋషి అనగా అంగిరసములయిన నేత్రాదులు – అనబడు ఋషులు ఈ ప్రాణమే. అలాగే ప్రాణములు చేత నెరవేరేవన్ని ప్రాణమే. నేత్రాదులు నిర్వహించే దేహ–ధారణాది సత్యచరిత్ర ప్రాణముదే. (అంగిరసములు అంటే సప్తధాతువులు. ఋషులు అంటే ద్రష్టలయిన జ్ఞానేంద్రియములుగూడా వచ్చును – అనువాదకుడు). ఇవన్నియు ప్రాణంతోనే జరుగుతుంటాయి కనుక ప్రాణ ప్రజాపతియే. ఈ ప్రాణమే ఇంద్రుడు, మహేంద్రుడు, రుద్రుడు, రక్షకుడు, సూర్యుడు. ఇతడే కాంతిపతి అయిన సూర్యుడై వర్షకారణుడగును. మేఘుమై వర్షించును. ఈ వర్షమును చూచి ప్రజలు తమకోరికల మేఱకు "అన్నసమృద్ధి" గలుగునని ఆనందించెదరు. 66

**శ్లో॥ ఏకర్షిర్విమలస్సమస్తహవిషా మత్తాఽస్య సాధుః పతిః**
**ప్రాణోఽస్య హ్యదనీయదాయిన ఇమే శ్రోత్రాదయో దేవతాః ।**
**వాయోరేష పితా చ సర్వజగతో వాచి స్థితాఽదస్తనూః**
**శ్రోత్రే చక్షుషి మానసే చ వివిధాశ్చేష్టా విధత్తే శివా ॥ 67**

భావ॥ ఈ ప్రాణము విమలమయినది. పాపరహితమయినది. ఏకర్షి అనగా ఆపేరు గల అగ్ని. సమస్త హవ్యకవ్యములకు ఆయనయే భోక్త. ఈ ప్రపంచమునకు మంచి ప్రభువు. శ్రోత్రము (చెవి) మొదలగు దేవతలు ఈ ప్రాణమునకే ఆహారమును అందించెదరు. అనగా ఇంద్రియ విషయమయిన శబ్దస్పర్శాదులు ప్రాణానికి అందే ఆహారములే. వాయువుకు, సర్వజగత్తుకు ఈ ప్రాణమే భర్త. ఈ ప్రాణము యొక్క మంగళమయమయిన శరీరము

వాక్కునందు, శ్రోత్రమునందు, నేత్రమునందు మనస్సునందు నిలచినది. ఆయా చేష్టల రూపమున కనబడుచుండును. శ్రవణమననాదులను చేయుచుండును.

విశే॥ దేవతా శబ్దం స్త్రీలింగం కనుక దాయిన్యః అని ఉండాలి. కనుక శబ్దం ఏలింగమయిన అర్థమయిన అభిమాన దేవతలలో అగ్ని మొదలగువారు పురుషులు కనుక 'దాయినః' అని పుంలింగము వాడబడినది. 67

**శ్లో॥ లోకేఽస్మిన్ త్రిదివే నృణాం దివిషదాం యశ్చోపభోగోఽఖిలః**
**ప్రాణస్తస్య హి రక్షితా తత ఇమం మాతేవ పుత్రాన్ ప్రభో ।**
**రక్షాస్మాన్ కలయ శ్రియో వితర నః ప్రజ్ఞామితి ప్రార్థయ-**
**న్త్యల్పజ్ఞాస్తదుపాసకాస్సముపయన్త్యాత్మేప్సితార్థాదికమ్ ॥ 68**

భావ॥ ఇహలోకమున నరులకు, స్వర్గలోకమున దేవతలకు ఉన్న సర్వభోగములకు ప్రాణమే రక్షకము. అందువలన ప్రజలు ముఖ్యంగా అల్పజ్ఞులయినవారు ఆ ప్రాణదేవతనిట్లు ప్రార్థించెదరు.

ప్రభూ! తల్లి పుత్రులను రక్షించినట్లు మమ్ములను రక్షింపుము. సంపదలను ప్రసాదించుము. ప్రజ్ఞను అనుగ్రహించుము అని ప్రార్థించెదరు. ప్రాణదేవతా? వారు నిన్నుపాసించి తమకు అభీష్టమయిన అర్థాదులను పొందెదరు. 68

**శ్లో॥ ప్రాణోఽత్రాపి విరాడయం ప్రభవతి బ్రహ్మాత్మనో బ్రహ్మణి**
**ప్రాణోఽనాతపవచ్ఛ్రితో హి పురుషేఽజ్గే కర్మణా యాత్యయమ్ ।**
**భూపాలోఽధికృతానివైష పరమః ప్రాణాన్నియుఙ్క్తే పరాన్**
**వాగాదీంస్స్వమిహావసేతి సకలాన్ భేదానపి స్వాత్మనః ॥ 69**

భావ॥ ప్రాణము చరాచర భక్షకుడయిన అత్త. విరాట్, వరిష్ఠుడు. బ్రహ్మమే అయిన ఆత్మనుండి పుట్టును. బ్రహ్మమునందే 'సూర్యునికినీడవలె' ఆశ్రయించియుండును. శిరస్సు మొదలగు శరీరపిండరూపమయిన బ్రహ్మమునందు ఛాయవలె ఆశ్రయించియుండును. శరీరమునందు ప్రారబ్ధకర్మ నిమిత్తముగా ఈ ప్రాణము చేరును. మహారాజు తన అధికారులను నియమించినట్లు ఈ ప్రాణప్రజాపతి పరమాధికారియై ఇతర ప్రాణములను, వాగాదీంద్రియములను తమతమ స్థానములందు నియమించి శరీరాదిలోకములను నడుపును. ఈ ప్రాణములు ప్రాణప్రజాపతి స్వరూపములేగాని మఱొకటి కావు. 69

**శ్లో॥ పాయూపస్థగతం హ్యపానమకరోచ్చక్షుశ్శ్రవస్థం తథా**
**ప్రాణం మధ్యగతం సమానమధిహృద్వ్యానం చ నాడీగణే ।**
**యేనోత్క్రామతి తం హ్యుదానమకరోత్ప్రాణస్సుషుమ్నాగతం**
**బాహ్యప్రాణమయోఽర్యమా కలయతే భాసాఽక్షిగానుగ్రహమ్ ॥ 70**

భావ॥ ప్రాణమును నేత్రశ్రోత్రములయందు నిలిపెను. అపానమును ఆసనమునందు లింగయోనులందు నిలిపెను. నాభియందు సమానవాయువును, హృదయమునందు నాడీగణము నందు వ్యానవాయువును, **ప్రాణములుత్క్రమించు మార్గమయిన సుషుమ్నయందు ఉదానమును నిలిపెను.** బాహ్యప్రాణరూపుడయిన సూర్యుడు తనకాంతితో నేత్రగతప్రాణములను రూపాది దర్శనముతో అనుగ్రహించును. 70

**శ్లో॥ యం సఙ్కల్పమముష్య చిత్తమయతే మర్త్యస్య తు ప్రాయణే**
**తేనాయం విగతేన్ద్రియవ్యవహృతిః ప్రాణాత్మనా తిష్ఠతి ।**
**సోదానోఽథ స ఈశ్వరం నయతి తం సఙ్కల్పసిద్ధం పదం**
**ప్రాణం వేద య ఏవమస్య తు కులం నో హీయతే సోఽమృతః ॥71**

భావ॥ నిర్యాణకాలమున జీవుని సంకల్పము ప్రాణమునందు నిలుచును. ఆ సంకల్పజీవుడు ఇంద్రియవ్యాపారములు మాని ప్రాణస్వరూపముగా (సుషుప్తిలో లాగా?) మిగులుతాడు. ఉదాన రూప ప్రాణమహిమచేత ఆ ప్రాణము ఈ ప్రాణేశ్వరుడు దేహేశ్వరుడూ అయిన జీవుని వాని సంకల్పానుసారము ఆయా స్థానములకు తీసికొనిపోవును. ప్రాణముయొక్క ఈప్రభావమును తెలిసికొన్నవానికి కులహాని లేదు. వానికి అమృతత్వము సంభవించును. 71

**శ్లో॥ సూర్యస్యాఽస్తముపాయతో ఘృణిగణా బిమ్బే యథైకీభవ-**
**న్త్యుద్యాతః ప్రచరన్తి చేన్ద్రియగణా దేవే తథా మానసే ।**
**లీయన్తే న తతః శృణోతి పురుషో నాలోకతే జిఘ్రతి**
**స్పర్శం నైతి రసం చ నో గిరతి నాదత్తే స్వపిత్యభ్రమః ॥ 72**

భావ॥ సూర్యుడస్తమించునపుడు ఆయన కిరణములు ఆయన బింబమునందే లీనమగును. మఱల ఉదయించునపుడు అయననుంచియే ప్రసరించును. అట్లే సుషుప్తి, నిర్యాణకాలములలో మన ఇంద్రియగణము మన మనోదేవునియందు లీనమగును. అట్లే జాగరణ, జనన కాలములందు ఆ మనస్సునుండియే అన్నియు ప్రసరించును. కనుకనే నిర్యాణకాలమున జీవుడు చూడడు, వాసన గ్రహించడు, స్పర్శ తెలియదు. రుచులు అందికొనడు. మాటలాడడు. స్వీకరించడు, విసర్జింపడు. అన్నియు ప్రాణము నందే లీనమగును. అందువలన స్వప్నరహితుడై, చలనరహితుడై పరుండి యుండును. 72

**శ్లో॥ సుప్తే త్విన్ద్రియసఞ్చయే పురి తదా ప్రాణాగ్నయో జాగ్రతి**
**స్వాన్తాఖ్యం యజమానమేష నయతి బ్రహ్మ హ్యుదానో దివమ్ ।**
**స్వప్నే త్వేష మనోమయః కలయతే దృష్టం శ్రుతఞ్చేహ వా**
**ప్రాగ్జన్మన్యపి వాసనాత్మకమసద్దృశ్యం స్వయమ్భాసనః ॥ 73**

భావ॥ సుషుప్తి నిర్యాణ సమయములయందు, ఇంద్రియ సమూహము నిద్రించును. నిశ్చలమగును. అపుడు ప్రాణాగ్నులు మేల్కొనును. అంతట ఉదానవాయువు 'మనస్సు' అను యజమానుని అనగా జీవుని బ్రహ్మము వద్దకు (లేదా ప్రాజ్ఞుని వద్దకు) తీసికొని పోవును. లేదా జీవరూపబ్రహ్మమును స్వర్గమునకు చేర్చును. సుషుప్తి మరణములలో ఇది బ్రహ్మసాయుజ్యము. యజ్ఞాది యజమానుని, మరణానంతరము స్వర్గమునకు చేర్చటం దీనికుదాహరణము.

ఇదే జీవుడు స్వప్నంలో ఇంద్రియాది సహాయము లేకుండానే మనోమయుడై స్వయంగా సకలేంద్రియ కార్యములను చేయును. పూర్వ వర్తమాన జన్మ వాసనలతో వచ్చు మిథ్యాదృశ్య విషయమును అనుభవించును. కనుక "అత్రాయం స్వయంజ్యోతిః పురుషః" అన్నారు. ఇచ్చట సూర్యాది జ్యోతులు ఇంద్రియవృత్తులు లేకున్నా అన్ని అనుభవాలు వచ్చును.

ఈ విషయములు బృహదారణ్యక వ్యాఖ్యలో వివరింపగలము. 73

**శ్లో॥ దేవోఽయం హృదయాత్మకః పురి భవేత్తేజోఽభిభూతో యదా**
**స్వప్నాన్నేష తదా న పశ్యతి వయాంస్యావాసవృక్షం యథా ।**
**భూతాని ద్వివిధాని సర్వవిషయాశ్చాత్మేన్ద్రియాణి ప్రభుం**
**బ్రహ్మాత్మానమయన్తి సుప్తిసుఖభాగానన్దకోశః పునః ॥ 74**

భావ॥ మనోమయ జీవుడను దేవుడు, పిత్తరస ప్రాభవము పెరుగగా స్వప్నములను చూడడు. అనగా స్వప్నములు లేకపోవును. అట్టి సందర్భమున స్థూలసూక్ష్మభూతములు రెండు, సమస్త విషయములు, మనస్సు, ఇంద్రియములు, – పక్షులు తమ సహజ – ఆశ్రయవృక్షమును సాయంకాలమున చేరినట్లు – బ్రహ్మమును చేరును. అపుడు ఆనందమయకోశజీవుడు సుషుప్తి – ఆనందమును నిశ్చలముగా అనుభవించుచుండును. 74

**శ్లో॥ దృష్టిస్స్పృష్టిమతిక్రియాసు పరమః కర్తా సుషుప్తౌ పుమాన్**
**విజ్ఞానాత్మక ఏష సేన్ద్రియమనఃప్రాణశ్చ యత్రైకతామ్ ।**
**ఆయాతి ప్రతిపద్య తద్బృహదపచ్ఛాయాజ్గరూపం పరం**
**శుభ్రం చాక్షరమేతి తత్త్వవిదసౌ సర్వజ్ఞతాం సర్వతామ్ ॥ 75**

భావ॥ సుషుప్తిలో జీవుడు పొందునది బ్రహ్మ సాయుజ్యమే. దర్శనం, స్పర్శ, మననం మొదలగు క్రియలకు కర్త అయిన ఈపరమపురుషుడు, విజ్ఞానమయజీవుడు. ఆయన ఇంద్రియ–ప్రాణమనస్సహితుడై సుషుప్తిలో బ్రహ్మసాయుజ్యము పొందును. ఆ బ్రహ్మము శరీరము, చాయ, రూపము లేనిది. పరమయినది. నిర్మలమయినది. అక్షరమయినది. అట్టి బ్రహ్మమును అనుభవించిన తత్త్వవేత్త సర్వజ్ఞుడగును. సర్వరూపుడగును. బ్రహ్మ సర్వజ్ఞము. సర్వరూపము కనుక బ్రహ్మభిన్నమయిన ఆత్మగూడ అంతే. కనుక నిర్గుణబ్రహ్మమే తెలిసికొనదగినది. 75

**శ్లో॥ బ్రహ్మోద్యమ్పరమక్షరం ప్రథమజం బ్రహ్మ పరం చోమితి**
**ధ్యాత్వేదం పరమేతి చాపరమపి ధ్యానానురూపం బృహత్ ।**
**అస్యాఙ్గం ప్రథమం విచిన్తయతి యస్తం మర్త్యలోకం నరం**
**భూయో నిత్యఋచో నయన్తి స తతశ్శ్రద్ధాతపోభిర్మహాన్ ॥ 76**

భావ॥ ప్రాణోపాసన తరువాత ప్రణవోపాసన చెప్పబడుచున్నది. 'ఓం' అనునది పరాపర బ్రహ్మస్వరూపము. అది వేదాది వర్ణము. అక్షరం. దానిని పరబ్రహ్మముగా అపరమయిన ప్రథమ జీవి అయిన హిరణ్యగర్భునిగా ఉపాసించువాడు తమ ఉపాసనానురూపముగా పరబ్రహ్మనుగాని అపరబ్రహ్మమునుగాని పొందును. అనగా హిరణ్యగర్భలోకమును పొందును. ఈ ఓంకారము 'అ ఉ మ్' అని త్రివర్ణ రూపము. అందు ప్రథమ స్వరము అకారము. దానిని ధ్యానించువాడు మనుష్యలోకమును చేరును. ఈ అకారము ఋగ్వేద రూపము. అందువలన ఋక్కులు వానిని మనుష్యలోకమునకు చేర్చును. ఆ జన్మలో అతడు శ్రద్ధాతపస్సులతో మహితాత్ముడగును. 76

**శ్లో॥ ఓఙ్కారావయవం ద్వితీయముమథాసమ్పత్తి యో ధ్యాయతి**
**గ్లోలోకం గమితో యజుర్భిరమితాన్ భుక్త్వాత్ర భోగాన్పునః ।**
**స ప్రాప్నోతి మనుష్యలోకమథ యో మాత్రాత్రయం ధ్యాయతి**
**బ్రహ్మస్థానముపైతి సామభిరయం తత్రేక్షతే బ్రహ్మ తత్. 77**

భావ॥ ఓంకారావయవమయిన 'ఉకార'మును మరణపర్యంతం (ఆ సంపత్తి) ఉపాసన చేయువాడు చంద్రలోకము చేరును. యజుర్వేదం "ఉకార రూపము". అందువలన యజుర్మంత్రములు వానిని చంద్రలోకము చేర్చును. అచ్చట అమితముగా చంద్రలోకభోగములను అనుభవించి అతడు మనుష్యలోకమును చేరును. ఓంకారావయవాలు మూడింటిని ఉపాసించు వాడు సామవేదం ద్వారా బ్రహ్మలోకమును చేరును. సామవేదం మకార రూపము. అనగా బ్రహ్మోపదేశం (ఓం) తో అతడు పరబ్రహ్మసాక్షాత్కారము పొందును. 77

**శ్లో॥ స్థూలం జాగరితం హ్యకారమయతే విశ్వం చ వైశ్వానరం**
**సూక్ష్మం స్వప్నముమేతి తైజసమథో హైరణ్యగర్భాత్మకమ్ ।**
**మాయాం సుప్తిపదం చ మం కలయతే ప్రాజ్ఞఇఙ్చ యోఽపీశ్వరం**
**ప్రాజ్ఞోఽయం న హి కమ్పతే భవతి యత్సర్వాత్మభూతః పుమాన్ ॥78**

భావ॥ అకారము స్థూల విశ్వమునకు జాగరణ దశకు విశ్వజీవునకు వైశ్వానరునకు సంకేతము. ఉకారము సూక్ష్మ ప్రపంచమునకు స్వప్నదశకు తైజస జీవునకు హిరణ్యగర్భునకు సంకేతము. మకారము మాయకు (శక్తి) సుషుప్తికి, ప్రాజ్ఞజీవునకు, ఈశ్వరునకు సంకేతము.

ఇట్లు ఓంకారమాత్రత్రయోపాసనతో పరబ్రహ్మసాక్షాత్కారము పొందినవాడు సర్వాత్మభూతుడు కనుక అతడు నిర్భయుడు విభువు కనక వణకడు, కదలడు. 78

**శ్లో॥ ఏవం యస్సమవేక్ష్య చిన్తయతి నా త్వోఙ్కారమాద్యం బృహ-**
**త్సో౭నేనాయతనేన వా నిపుణధీరన్వేతి విష్ణోః పదమ్ ।**
**యత్తచ్ఛాన్తమజం పరం చ విజరం నిర్విక్రియం నిర్మలం**
**శుద్ధం బుద్ధమనన్తమాద్యమమృతం సత్యం బృహచ్ఛాశ్వతమ్ ॥ 79**

భావ॥ ఇట్లు భావనాపూర్వకముగా ఓంకారమును బ్రహ్మముగా చింతనచేయువాడు, ఓంకారస్థానం ద్వారానే ఆ విష్ణుపదమును పొందును. విష్ణుపదమనగా వైకుంఠము కాదు. మఱేమనగా, శాంతము నిర్వికారము, అజము, జరారహితము, సర్వాతీతము, నిర్వికారము, నిర్మలము, శుద్ధము, బుద్ధము అనగా జ్ఞానరూపము, సనాతనము. కనుకనే అనంతము, అమృతము, సత్యము, శాశ్వతము అయిన పరబ్రహ్మమే విష్ణుపదము. ఏదో ఒక పరిమితలోకము కాదు. 79

**శ్లో॥ ఉత్క్రాన్తిర్మమకస్య చోత్క్రమణతో నిష్ఠా చ కస్య స్థితే-**
**రిత్యాలోచ్య పరః పుమాన్ సమసృజత్ప్రాణం మహాన్తం తతః ।**
**శ్రద్ధాం ఖం మరుదర్చిరమ్బుపృథివీస్తద్బుద్ధికర్మేన్ద్రియం**
**చేతో౭న్నం చ రసం తపో మనుగణం కర్మాథ లోకాన్పదమ్ ॥ 80**

భావ॥ నిర్గుణ బ్రహ్మజ్ఞానము వలన ముక్తి కలుగును. ఆనిర్గుణ బ్రహ్మం అద్వితీయము, నిర్విశేషము, శుద్ధం. దానిని నేరుగా బోధింపలేము. కనుక అధ్యారోప అపవాదములచే అధిష్ఠానముగా అవధిగా దానిని ప్రతిపాదించుచున్నాడు. అందుకు భూమికగా ముందు బ్రహ్మమునందు సృష్టి సంకల్పము వలన జరిగిన ప్రాణాది కలల ఆరోపము ప్రస్తావింపబడినది.

నాకు అనగా ప్రత్యగాత్మకు శరీరమునుండి జన్మస్థితిలయములు కలుగుటకు ఒక (కస్య) కారణపదార్థమును సృష్టింపవలయును - అని దేవుడు సంకల్పించి మహత్తయిన ప్రాణమును సృజించెను. అదే హిరణ్యగర్భ బ్రహ్మ, ప్రజాపతి ప్రాణ సమష్టియే హిరణ్యగర్భుడు. అచ్చటనుంచి శ్రద్ధను దానినుంచి ఆకాశమును వాయ్వాది భూతములను, జ్ఞాన కర్మేంద్రియములను, మనస్సును, అన్నమును, శుక్రమును సృజించెను. తరువాత శుద్ధిసాధనమయిన తపస్సును, మంత్రగణమును, కర్మను, లోకములను, దేవదత్తాది నామములను సృజించెను. 80

**శ్లో॥ అన్తం యాన్తి సముద్రమేత్య తు యథా నద్యస్సముద్రాయణా**
**స్తాసాం నశ్యతి నామ రూపమపి తద్వస్తూచ్యతే సాగరః ।**
**ప్రాణాద్యాః పురుషాయణా ఇతి కలాస్తాష్షోడశ ప్రాప్య తం**
**నాశం యాన్తి చ నామ రూపమపి తద్వస్తూచ్యతే పూరుషః ॥ 81**

భావ॥ పురుషుని యందు ఇంతకు ముందు శ్లోకములో విశ్వరూపమయిన కళల ఆరోపము చెప్పబడినది. దీనిలో వానికి అపవాదము చెప్పబడుచున్నది. సముద్రగామినులయిన

జీవనదులు సముద్రమును చేరిన తరువాత అవి అదృశ్యమవుతాయి. వాటి నామరూపములు నశిస్తాయి. కేవలము సముద్రమే కనబడుతుంది. అలాగే పురుషగామినులుగా చెప్పబడిన 16 కలలు (ప్రాణ, శ్రద్ధ, పంచభూతములు, ఇంద్రియములు, చిత్తము, అన్నము, వీర్యము, తపము, మంత్రము, కర్మము, లోకము, నామము) పురుషుని చేరి లయము పొందును. ఆ కలలకు నామరూపములు గూడా నశించును. అపుడు అవి కేవలము పురుషుడుగానే కనబడును. 81

**శ్లో॥ తా యస్మిన్ రథచక్రనాభివదరాస్సమ్యక్ప్రవిశ్య స్థితా-**
**స్తం వేద్యం పురుషన్తు షోడశకలం మాయావశాన్నిష్కలమ్ ।**
**భాన్తం యోఽమృతమేనమత్ర పరమం జానాత్యసౌ సోఽమృతో**
**బ్రహ్మైతావదితి ప్రబోధయతి యస్సోఽయం పితా తారకః ॥ 82**

భావ॥ మాయాకారణముగా ప్రపంచస్వరూపుడయిన ఆపురుషునియందు రథచక్రనాభియందు - ఆకులవలె యీ 16కలలు ప్రవేశించి వ్యాపించియున్నవి. కాని సృష్టి చక్రాధిష్ఠానమయిన ఈ పురుషుడు వాస్తవముగా కలారహితుడే. నిష్కలుడే. ఇట్లు నిష్కలుడై అమృతుడై స్వయంజ్యోతి అయిన ఆ పరమ తత్త్వమును ఈజన్మలోనే ఈదేహములోనే గ్రహించినవాడు అమృతుడగును. బ్రహ్మమే అగునుగదా! బ్రహ్మమిట్టిదని బోధించినవాడు తరింపజేయుతండ్రి. అసలు తండ్రి జన్మమూలమున సంసారమున పడవేయును. బంధకుడే. “తండ్రి! హరిజేరుమనియెడి తండ్రి తండ్రి” గదా!

విశే॥ బ్రహ్మజ్ఞానము సులభమే - కనుకనే “ఏతావత్ - ఈ మాత్రము” అన్నారు. దానికి కావలసిన ‘శమదమాది సంపత్తి’ యే చాల దుర్లభము. బ్రహ్మం ఆత్మయే కనుక బ్రహ్మజ్ఞానం కంఠచామీకరం లాగా సులభమే. అజ్ఞానం అడ్డం. జ్ఞానం లబ్ధి అంతే గదా! కనుకనే జ్ఞానం కోసం ప్రయత్నించాలి. 82

ఇతి ప్రశ్నోపనిషద్వ్యాఖ్యాతా.

శ్రీః

# ముండకోపనిషత్

**శ్లో॥ దేవానాం ప్రథమో మహాసుదభవద్బ్రహ్మా పురా బ్రహ్మణః**
**కర్తా పాలయితా చ సర్వజగతో విద్యాం వరిష్ఠామగాత్ ।**
**తాం ప్రోవాచ సుతాయ చాగ్రజనుషే సోఽథర్వణే సోఽజ్గిరే**
**భారద్వాజకసత్యవాహ ఋషయే సోఽగాత్తతస్త్వఙ్గిరాః ॥ 83**

భావ॥ బ్రహ్మమునుండి దేవతా ప్రధముడయిన హిరణ్యగర్భుడను బ్రహ్మ పుట్టెను. ఆయన సర్వజగత్కర్త. సర్వజగత్పాలయిత. హర్త. ఆయన బ్రహ్మమునుండి ఉత్తమమయిన వేద విద్యను పొందెను. ఆ హిరణ్యగర్భుడు తన జ్యేష్ఠసుతుడయిన అధర్వునకు అతడు అంగిరునకు, అంగిరుడు భారద్వాజుడయిన సత్యవాహునకు ఉపదేశించెను. సత్యవాహుడు అంగిరసునకు బోధించెను. 83

**శ్లో॥ స ప్రోవాచ చ శౌనకాయ విధివత్ప్రాప్తాయ జిజ్ఞాసవే**
**తాం యో వేద గురోర్ముఖాద్భవతి స బ్రహ్మామృతం నిర్భయమ్ ।**
**ద్వే విద్యే హి పరాపరేతి విదుషా సంవేదితవ్యే తయో-**
**రేకా వేదమయీ తు కర్మవిషయా విద్యా పరా బ్రహ్మగా ॥ 84**

భావ॥ సంప్రదాయరీత్యా సమిత్పాణియై తన వద్దకు వచ్చిన శౌనకునకు ఆ అంగిరసుడు పైన చెప్పబడిన బ్రహ్మవిద్యనుపదేశించెను. గురుముఖమునుండి సంప్రదాయ పద్ధతిలో ఈ విద్యను నేర్చినవాడు అమృతము నిర్భయము అయిన అఖండ బ్రహ్మమగును. విద్యలు రెండు. పర – అపర. వానిలో "అపర" వేదమునందలి కర్మకాండరూపమయినది. "పర" అను విద్య బ్రహ్మవిద్య. మొదటిది ఋగ్యజుస్సామాధర్వణ రూపమయినది. రెండవది కేనాద్యుపనిషత్తుల

రూపమున నున్నది. ఇది జ్ఞానకాండ. పరవిద్యను పొందదగిన చిత్తశుద్ధి కావలసినవాడు అపర విద్యను తెలిసికొనవలయును. ఫలవాంఛారహితముగా కర్మయోగమును అనుష్ఠింప వలయును. 84

**శ్లో॥ యత్తద్బుద్ధికృతేన్ద్రియాద్యవిషయం గోత్రేణ వర్ణైర్గుణై-**
**రిక్తం దృక్ఛ్రుతిపాణిపాదరహితం న గ్రాహ్యమగ్రాహకమ్ ।**
**నిత్యం సర్వగతం సుసూక్ష్మమఖిలవ్యాప్యవ్యయం కారణం**
**భూతానాం విబుధో యయా కలయతే విద్యా పరా సా మతా ॥ 85**

భావ॥ జ్ఞానేంద్రియ కర్మేంద్రియములకు అందనిది, నామము వంశము కులము గోత్రము కామాది గుణములు లేనిది, నేత్ర శ్రోత్ర పాణిపాదాది – ఇంద్రియములులేనిది. గ్రాహ్యము కానిది, గ్రాహకము కానిది (అసంగం), నిత్యము ఆకాశము వలె సర్వగతము, సూక్ష్మముకన్న సూక్ష్మము, మహత్తుకన్న మహత్తు, అఖిలవ్యాపి, నాశరహితము, భూతములకు కారణము అయిన బ్రహ్మమును తెలుపునట్టి విద్య పరావిద్య. 85

**శ్లో॥ తన్తూనుద్వమతి స్వయం గిళతి వా కావూర్ణనాభిర్యథా**
**భూతా న్యుత్సృజతి ప్రసంహరతి చ స్వస్మిన్ స్వయం బ్రహ్మ తత్ ।**
**భూమ్యామోషధివజ్జగద్భవతి చ బ్రహ్మణ్యథో లీయతే**
**దేహాన్మూర్ధజలోమవచ్చితిభృతో లోకోఽక్షరాజ్జాయతే ॥ 86**

భావ॥ భూలోకమునందు 'సాలిపురుగు' (ఊర్ణనాభి) తననుంచి దారాలు తీసి వాటితో ప్రపంచము నిర్మించి మఱల తన దారములను తనే మింగుతుంది. అదే విధంగా బ్రహ్మం స్వయంగా తననుంచియే భూతములను సృజించును. తనలోనికి ఉపసంహరించును. భూమినుండి ఓషధులు మొలిచినట్లు బ్రహ్మం నుండి ప్రపంచము పుట్టును. తరువాత బ్రహ్మము నందే లీనమగును. చైతన్యయుక్తమయిన దేహమునుండి కేశరోమములు పుట్టినట్లు అక్షర పరబ్రహ్మమునుండి యీ లోకము జన్మించుచున్నది.

విశే॥ 1. కార్యమయిన ప్రపంచమును బట్టి కారణమయిన బ్రహ్మమును నిరూపించుచున్నాడు.

2. లూతా దృష్టాంతం వలన లూతలాగా జగత్తుకు బ్రహ్మం అభిన్ననిమిత్తోపాదాన కారణమని నిరూపణ కుదిరినది. కనుక జగత్తున్నదంటే బ్రహ్మం ఉన్నట్లే ఊహించాలి.

3. మనకన్న అభిన్నమయిన మనస్వరూపానికి మనం ఉపాదాన కారణం కాదు. అలాగే బ్రహ్మంకన్న జగత్తు భిన్నంకాదు గనుక జగత్తుకు బ్రహ్మం ఉపాదానం కాదు. అందుకుదాహరణ భూమి – ఓషధులు.

4. బ్రహ్మం ఉపాదానమయితే జగత్తు జడం కారాదు. కనుక బ్రహ్మమునుండి జగత్తు

పుట్టలేదు – సమా – చేతనంగా ఉన్న దేహమునుండి అచేతనమయిన కేశరోమాలు పుట్టుతున్నాయి గదా! 86

**శ్లో॥ సర్వజ్ఞోఽపి చ సర్వవిత్స తపసా జ్ఞానాత్మనాఽ చీయతా**
**వ్యక్తం తత్సమభూత్తతస్స చ మహాన్ ప్రాణస్తతోఽభూన్మనః ।**
**తస్మాద్భూతగణస్తతోఽణ్డమభవల్లోకాశ్చ తత్రాభవన్**
**మర్త్యాద్యాసుభృతః కృతాని చ ఫలం నామాకృతిశ్చేశ్వరాత్ ॥ 87**

భావ॥ ఆయన సర్వము తెలిసినవాడు. సర్వమును విశేషంగా తెలిసినవాడు. ఆయన జ్ఞానరూపమయిన తపస్సుతో (నీటితో గింజ ఉబ్బినట్లు) (గర్భముతో కడుపుబ్బినట్లు) ఎదిగెను. ఆయననుండి అవ్యక్తమయిన అనగా అవయవాది విభాగములేనిదిగా ఒక ఆకారము పుట్టెను. దానినుండి మహత్తత్త్వము అనగా ప్రాణరూపహిరణ్యగర్భుడు పుట్టెను. దానినుండి భూత సమూహము దానినుండి బ్రహ్మాండము దానియందు లోకములు ఆవిర్భవించినవి. ఆలోకములలో మనుష్యాది ప్రాణులు, వారి కర్మలు కర్మఫలము, నామరూపములు – అన్ని ఈశ్వరునివలన వచ్చినవి. 87

**శ్లో॥ అజ్ఞో యోఽపరవిద్యయా సముదితం కర్మాగ్ని హోత్రాదికం**
**కుర్వన్నగ్నిశిఖాసు నిక్షిపతి నా కాలే తు యా ఆహుతీః ।**
**తాస్సూర్యస్య మరీచితాముపగతా ఏహీతి వాచం ప్రియాం**
**జల్పన్త్యస్సహ పూజనైః ఖలు నయన్త్యేనం సురేన్ద్రక్షితిమ్ ॥ 88**

భావ॥ అజ్ఞాని (అనగా బ్రహ్మజ్ఞానములేని) అయిన కర్మఠుడు అపరవిద్య అయిన కర్మకాండను ఆశ్రయించి అందు చెప్పిన అగ్నిహోత్రాది కర్మలను ఆచరించుచు అందులో సకాలంలో చేయు హోమాహుతులు, అతని మరణకాలములో అవి సూర్యకిరణాలుగా మారి అతనిని "రమ్మని" మధుర స్వాగత వచనములను పలుకుచు సగౌరవముగా ఆ కర్మఠుని స్వర్గమునకు చేర్చును. 88

**శ్లో॥ యజ్ఞోఽష్టాదశమర్త్యసంశ్రయతయా మర్త్యోఽస్య మర్త్యం ఫలం**
**శ్రేయో నన్దతి యస్త్విదం స విమనా మృత్యుం పునర్యాతి చ ।**
**అజ్ఞానే తమసి స్థితస్స విబుధః కృత్యస్మి యజ్ఞాదికా-**
**చ్ఛ్రేయో నాన్యదితి భ్రమాత్కృతకృతస్స్వర్గం గతస్తచ్చ్యుతః ॥ 89**

భావ॥ 18 మంది కలిసి యజ్ఞం చేయాలి. (అందులో 16 ఋత్విక్కులు యజమాని అతని ధర్మపత్ని = 18) 18 మర్త్యులను ఆశ్రయించి పుట్టిన యజ్ఞము నశ్యమే. దాని ఫలమూ నశ్వరమే. ఇదంతా శ్రేయస్సని ఆనందించు ఆ బుద్ధిహీనుడు చివఱకు వైమనస్యముతో మఱల మృత్యువును పొందును. అజ్ఞానాంధకారంలో ఉన్న ఆ కర్మపండితుడు "యజ్ఞాది – ఆచరణ

వలన కృతకృత్యుడయితిని, ఇంతకన్న శ్రేయస్కరమయిన పనియేమి కలదు” అని భ్రమపడి చేసినదే చేసి మఱల స్వర్గమునకు పోయి మరల క్రిందకు పడుతుంటాడు. కనుక కర్మబోధక మయిన అపరవిద్య అనిత్య ఫలకారిణి. 89

**శ్లో॥ దారాపత్యగవాదిసస్యతనవో యద్వచ్ఛితాః కర్మణాఽ**
**నిత్యా అత్ర తథా పరత్ర పరమాః స్వర్గాదిలోకా అపి ।**
**నిశ్చిత్యేతి కృతేన కిం మమ పరబ్రహ్మార్థినో బ్రాహ్మణో**
**నిర్విణ్ణస్సమిత్కరో గురుమయేద్బ్రహ్మాప్తయే బ్రహ్మగమ్ ॥ 90**

భావ॥ ఈలోకంలో కర్మఫలంగా మనం ఏర్పఱచికొన్న పత్ని, సంతానము, గవాది పశుసంపద అనిత్యములు కదా! అలాగే యజ్ఞాది కర్మఫలములయిన స్వర్గసుఖములు గూడా పరలోకములో అనిత్యములే. ఇలా నిశ్చయించికొనిన బ్రాహ్మణుడు “పరబ్రహ్మ జ్ఞాన కాముడనయిన నాకు ఈ కర్మలెందుకని” నిర్వేదము చెంది, సమిధలు కానుకలుగా తీసికొని బ్రహ్మజ్ఞాని అయిన గురువు వద్దకు బ్రహ్మవిద్యార్థియై వెళ్లవలయును.

విశే॥ 1. “అక్షయ్యగ్ం హి వై చాతుర్మాస్య యాజినః సుకృతం భవతి”
“అపామ సోమ మమృతా అభూమ”

2. “ప్లవాహ్యేతే అదృఢాయజ్ఞరూపాః” “కిం ప్రజయాకరిష్యామః” – వీటి (1) వలన కర్మఫలము నిత్యమని తరువాత (2) వలన అనిత్యమని తేలుతున్నది. 90

**శ్లో॥ ఆత్మానం సముపాగతాయ స గురుస్సమ్యక్ప్రశాన్తాత్మనే**
**సన్న్యాసాదిసమస్తసాధనవతే విద్యాం వదేద్బ్రహ్మణే ।**
**విద్యాదేష యయాఽక్షరం పరతరం శుద్ధం పుమాంసం ధ్రువం**
**స్వాత్మానం తదసావహం బృహదితి ప్రత్యక్షమఙ్చేన్ముదమ్ ॥ 91**

భావ॥ ప్రశాంతచిత్తుడై సన్న్యాసాది సమస్తసాధనములు (శమదమాదులు వైరాగ్యం) గల ఆ బ్రాహ్మణుడు శిష్యుడై బ్రహ్మవిద్య కొఱకు తనవద్దకు రాగా గురువు తప్పక బ్రహ్మవిద్యను చెప్పవలయును. దానివలన అతడు అక్షరుడు పరాత్పరుడు శుద్ధుడు అయిన స్వాత్మరూపుడయిన పురుషుని తెలిసికొనును. అందువలన “తాను ఆ బ్రహ్మమునే” అని ప్రత్యక్షముగా అపరోక్షజ్ఞానము కలిగి పరమానంద స్వరూపుడగును. 91

**శ్లో॥ యైర్మర్త్యాః ప్రతియాన్తి కర్మభిరపి శ్రద్ధాతపోభిః పరాన్**
**లోకాంశ్చన్ద్రమహేన్ద్రభాస్కరముఖాధీశానపి బ్రహ్మణః ।**
**విద్యా తత్ప్రతిపాదికేయమపరా సంసారదాత్రీ నృణాం**
**బ్రహ్మాత్మప్రతిపత్తిదా ఖలు పరా విద్యా హి మోక్షప్రదా ॥ 92**

భావ॥ కర్మలు శ్రద్ధ, తపస్సు - ఇట్టి వాటితో మానవులు చంద్ర, ఇంద్ర, ఈశ్వర, సూర్య లోకాదులను చేరుతారు. అలాగే సగుణోపాసనలను బట్టి, హిణ్యగర్భ బ్రహ్మలోకమునుగూడా చేరెదరు. ఇదంతా అపరవిద్య. ఇది నరులకు మరల సంసారము నిచ్చునట్టిదే. పరావిద్య మాత్రము ఔపనిషదము. బ్రహ్మాత్మ తత్త్వజ్ఞానమును, బ్రహ్మాత్మైక్యజ్ఞానమును కలిగించును. తద్ద్వారా అది మోక్షప్రదము. కనుకనే అది 'పరా విద్య' అనబడును. 92

**శ్లో॥ నిస్సారస్య చ తస్య సంసృతితరోర్మూలం యదేవాక్షరం**
**తత్సత్యం తత ఏతి జీవనికరస్సాత్మా తతో లీయతే ।**
**దీప్తాద్వాయుసఖాత్స్ఫులిఙ్గనికరస్సాత్మా యథా జాయతే**
**తత్రైవాపి చ లీయతే గగనతః కుణ్డామ్బరం వా యథా ॥ 93**

భావ॥ మిథ్య అయిన యీ సారహీనసంసారవృక్షమునకు మూలము ఆ అక్షరపర బ్రహ్మము. అదే సత్యము. దానినుండియే సమానలక్షణమయిన (చైతన్యరూపం) జీవసమూహం వస్తుంది. చివరకు అందులోనే లయం అవుతుంది. దీప్తమయిన అగ్నినుండి సమాన లక్షణమయిన రవ్వలగుంపు లేచినట్లు అలాగే ఆకాశమునుండి ఏర్పడిన ఘటాకాశము ఘటనాశం తరువాత ఆకాశమునందే లీనమయినట్లు జీవనికరం బ్రహ్మమునందే పుట్టి లీనమగును.

విశే॥ 1. జీవుడే బ్రహ్మము. మోక్షపురుషార్థం ఒకటే నిత్యము. మోక్షమనగా బ్రహ్మత్వం పొందటమే. కనుక మోక్షం నిత్యం.

2. సాత్మా = సమానమయిన సచ్చిదానందాది లక్షణములు గలవాడు.

3. అగ్ని స్ఫులింగములు కారణ కార్యములు - మరియు సావయవములు. కాని బ్రహ్మం జీవులు నిరవయవము. ఏకపదార్థము. కార్య కారణభావము లేదు. అందువలన ఘటాకాశ దృష్టాంతంగూడా చెప్పబడినది.

4. జీవునకు జన్మలయములు ఉపాధినిబట్టి జరుగును. వాస్తవములు కావు. అలాగే అగ్ని స్ఫులింగములు, ఆకాశ ఘటాకాశములు ఏకతత్త్వములే. 93

**శ్లో॥ నిత్యోఽయం పురుషోఽ జనిశ్చ పరతోఽవ్యక్తాదమూర్తః పరః**
**శుభ్రోఽప్రాణమనా వికారరహితో దివ్యస్సబాహ్యాన్తరః ।**
**ప్రాణోఽస్మాన్మనఇన్ద్రియాణి గగనం వాయుశ్చ తేజోమ్బుభూ-**
**ర్విశ్వస్యాస్య విధారిణీ చ సకలం దృశ్యం యతో జాయతే ॥ 94**

భావ॥ బ్రహ్మం ఒకటే సత్యం. ఎందుకంటే అదే నిత్యం కదా! కనుక ప్రత్యగాత్మయే అయిన ఈ పురుషుడు నిత్యుడు. కాని బ్రహ్మం నిత్యం సత్యం. కాని జీవుడు జనన మరణాలు గలవాడు గదా! ఎలా బ్రహ్మతో అభేదం కుదురుతుంది? ఈ జీవుడనే పురుషుడున్ను నిత్యుడే. కనుక సత్యమయినవాడే. అభేదం కుదురుతుంది. ఇతడు నిర్వికారుడు. వికారం కలది అనిత్యం.

లేనిది నిత్యం. ఘటం ఉదాహరణం – జనన మరణ వికారములు లేవు. జన్మిస్తే భావవికారా లుంటాయి. ఆత్మ అవ్యక్తముకన్న పరమయినది. అమూర్తము నిరవయవము, అవ్యక్తము సావయవమో నిరవయవమో తేలని సంపిండిత పదార్థము. దానినుండి వచ్చిన ఆకాశం సావయవం అనాలి. పుట్టినది గనుక సావయవము. శుభ్రుడు, అసంగుడు, ప్రాణమనస్సులు లేనివాడు. ఎందుకంటే ఆయననుండియే ప్రాణమనస్సులు పుట్టినవి. దివ్యుడు అనగా స్వయంజ్యోతిగా అంతరంగ బహిరంగములలో వెలుగువాడు. (అంతరంగం పరమాకాశం = బుద్ధిగుహ) తన మహిమలోనున్నవాడు. ప్రాణములు, మనస్సు, ఇంద్రియాలు, ఆకాశము మొదలగు పంచభూతములు మొదలయిన సకల దృశ్యములు ఆయన నుంచియే పుట్టునవి. 94

**శ్లో॥ అణ్డే ప్రాణభవే విరాడుదభవ త్త్రైలోక్యదేహః పుమాన్**
**సర్వాత్మాఽస్య శిరోఽగ్నిరిన్దుమిహిరౌ నేత్రే దిశశ్చ శ్రుతీ ।**
**వేదా వాగసవో మరుత్త్రిభువనం చిత్తం చ పాదౌ ధరా**
**సర్వం పశ్యతి సంశృణోతి మనుతే సర్వేన్ద్రియాత్మా హ్యసౌ ॥ 95**

భావ॥ ఇంతవఱకు నిర్విశేషబ్రహ్మను వివరించి ఇక సవిశేష బ్రహ్మ గూర్చి వివరించు చున్నాడు. ప్రాణరూపుడయిన హిరణ్యగర్భుని నుండి అండము పుట్టినది. దానినుండి విరాట్పురుషుడు అనగా వైశ్వానరుడు పుట్టినాడు. ఇతడు లోకత్రయవ్యాప్తుడు. అదే అతని దేహము. అతడు సర్వరూపుడు. ఆయనకు శిరస్సు అగ్ని, చంద్రసూర్యులు నేత్రములు. దిక్కులు చెవులు, వేదములు వాక్కు. ప్రాణములు వాయువు. లోకత్రయము మనస్సు. భూమి పాదములు. ఆయన సర్వేంద్రియాత్మకుడు కనుకనే సర్వద్రష్ట, సర్వశ్రోత, సర్వమంత – అని తెలుస్తున్నది.

విశే॥ పరమాత్మ – తరువాత మాయోపాధిగా ఈశ్వరుడు, ఆయనయే లింగోపాధిగా హిరణ్యగర్భుడు, ఆయనయే స్థూలోపాధిగా విరాట్పురుషుడు – ఇదీ వరస. 95

**శ్లో॥ అగ్నిర్ద్యౌరుదభూత్తతోఽస్య సమిధస్సూర్యశ్చ సోమాదితో**
**నిష్పన్నాజ్జలదోఽనలోఽపి చ తతస్సర్వౌషధీనాఙ్గణః ।**
**భూమ్యగ్నౌ పురుషానలేఽథ సుహుతాద్రేతస్తతస్సిఞ్చతి**
**స్త్రీవహ్నౌ పురుషస్తదేవమముతో బహ్వీ ప్రజా జాయతే ॥ 96**

భావ॥ ఈ విరాట్పురుషుడు ప్రజాపతి. సృష్టికర్త. ఈయననుండి ద్యులోక (స్వర్గం) రూపమయిన అగ్ని పుట్టెను. ఈ అగ్ని నుండి సూర్యుడు పుట్టెను. అదే అగ్ని నుండి సోముడు అతని నుంచి మేఘరూపమయిన అగ్ని, ఈ మేఘమునుండి భూమిరూపమయిన అగ్ని దానినుండి ఓషధీగణము వచ్చెను. పురుషాగ్నులయందు బాగా హుతమయిన ఓషధిగణము (వ్రీహియవాది – అన్నం) నుండి రేతస్సు పుట్టెను. అరేతస్సు 'స్త్రీ' అను అగ్నియందు పడును. ఇలా ఈ ఈశ్వరుని వలన నానా ప్రజలు జన్మించిరి. 96

**శ్లో|| ఏతస్మాత్పురుషాత్త్రయీ సమభవద్యజ్ఞః క్రతుర్దక్షిణా**
**దీక్షాఽబ్దో యజమాన ఇన్దురరుణో యత్రైష లోకవ్రజః ।**
**దేవాస్సాధ్యమనుష్యపక్షిపశవః ప్రాణా యవా వ్రీహయః**
**శ్రద్ధాసత్యతపాంసి శాస్త్రవిధయస్తద్బ్రహ్మచర్యం తథా ॥ 97**

భావ|| ఈ విరాట్పురుషుని నుంచియే ఆవిర్భవించినవి ఇవి.

వేదత్రయము, యజ్ఞము (సోమసహితము) క్రతువు (సోమరహితము) దక్షిణ, దీక్ష, సంవత్సరం, యజమానుడు, సూర్యచంద్రులు, లోకసమూహము, దేవతలు, సాధ్యులు, మనుష్యులు, పక్షులు, పశువులు, ప్రాణములు, యవలు, వ్రీహులు, శ్రద్ధ, సత్యము, తపస్సు, శాస్త్రవిధులు, బ్రహ్మచర్యము. 97

**శ్లో|| ఏతస్మాత్ప్రభవన్తి శీర్షనిలయాస్సప్తేన్ద్రియాత్మాగ్నయ**
**స్సప్తైషామపి దీప్తయశ్చ సమిధస్సప్తాపి శబ్దాదయః ।**
**హోమా స్సప్త చ బుద్ధయో విషయగాస్థానాని సప్తాపి వా**
**యేష్వన్తర్హృదయేశయా వినిహితాస్సప్తాపి ధాత్రాఽగ్నయః ॥ 98**

భావ|| ఈ విరాట్టునుండే ఉద్భవించునవి మఱికొన్ని గలవు.

శిరస్సునందున్న ఇంద్రియరూప - అగ్నులు 7. "నేత్రద్వయం - శ్రోత్ర ద్వయం - నాసికారంధ్రద్వయం - ముఖం - 7.

ఈ అగ్నులు జ్వాలలు (విషయగతవృత్తులు) వీటికి సమిధలయిన శబ్ద రూప రసాదులు 7. అనగా ఇంద్రియస్థానాలనుబట్టి వీటినిగూడా ఏడుగా చెప్పారు. విషయగతమయిన ఇంద్రియ జ్ఞానములే ఏడు హోమములు. నిద్రలో హృదయమునందు బ్రహ్మదేవుడు ఈ అగ్నులు నివసించుటకు నిర్మించిన 7 స్థానములు అన్ని విరాట్టు నుండి ఆవిర్భవించినవే. 98

**శ్లో|| ఏతస్మాల్లవణోదధిప్రభృతయస్సప్తాబ్ధయో జజ్ఞిరే**
**భూమిధ్రా హిమవన్ముఖా స్త్రిపథగా ముఖ్యా స్తథా సిన్ధవః ।**
**సర్వా ఓషధయో రసా అపి చ తే యైః పఞ్చభూతావృతం**
**లిఙ్గం తిష్ఠతి సర్వమేవ పురుషో నాస్మాత్పరం కిఞ్చన ॥ 99**

భావ|| ఈ విరాట్పురుషునినుంచియే లవణసముద్రము మొదలగు సప్తసముద్రములు, హిమాలయము మొదలగు పర్వతములు, గంగానది మొదలగు మహానదులు, సమస్త ఓషధులు, పంచభూతావృతమయిన లింగశరీరమునావరించిన రసములు (మధురాది షడ్రసములు) పుట్టినవి. ఇంతకు మించి మరేదియు లేదు. 99

**శ్లో|| విజ్ఞాతేఽఖిలకారణేఽత్ర పురుషే జ్ఞాతం సమస్తమ్భవేత్**
**జ్ఞాతాయాం మృది కిం ఘటాదివికృతిస్సర్వాపి న జ్ఞాయతే ।**

**సర్వప్రాణిగుహాశయం పరమముం బ్రహ్మాత్మకం వేద యః**
**ప్రత్యఞ్చం పురుషం క్షిపత్యయమిహ గ్రన్థిం హ్యావిద్యామయీమ్ 100**

భావ॥ అఖిలకారణుడయిన ఈ పురుషుని తెలిసికొన్నచో సర్వము తెలిసినదగును. మట్టిని తెలిసికొన్నవానికి ఆ మట్టివలన తయారయిన ఘటాది వికార పదార్థములన్నియు తెలియవా? బ్రహ్మాత్మస్వరూపుడయిన సర్వ ప్రజా బుద్ధిగుహలలో కొలువు దీఱిన ఆ ప్రత్యగాత్మ అయిన మహాపురుషుని గ్రహించిన వాని అజ్ఞాన గ్రంథి ఇచ్చటనే విడిపోవును. వాడు అవిద్యా రహితుడై ముక్తుడగును.

ఆ పురుషుని కన్న మఱొకరు లేరు కనుక ఆ పురుషజ్ఞానమే సర్వజ్ఞత. ముక్తికారణము. 100

**శ్లో॥ యచ్చిత్తేన్ద్రియబుద్ధ్యుపాధ్యుపహితం ధర్మైస్తదీయైః పునః**
**సఙ్కల్పశ్రవణేక్షణాధ్యవసితిప్రష్టైశ్చ శబ్దాదిభుక్ ।**
**బాభాత్యాత్మని సంస్థితం మహతి యత్రైతత్సమస్తం శ్రితం**
**సర్వం యత్పరమం వరేణ్యమమృతం బుద్ధేః పరం తద్భజేత్ ॥ 101**

భావ॥ సర్వజ్ఞత్వాది మహాఫలితాల కోసం పురుషుడే ధ్యానింపదగినవాడు. ఈ పురుష నామకమయిన తేజస్సు మనస్సు, ఇంద్రియములు, బుద్ధి అను ఉపాధులలో నిలిచినదై ఆ ధర్మములయిన సంకల్పము, దర్శనము, శ్రవణము, నిశ్చయము మొదలగు వానితో శబ్దాది విషయములను అనుభవించుచు ఆ పురుషుడు ఈ బుద్ధియందే ఉండి స్ఫురించుచుండును. ఈ పురుషునియందే సమస్తము ఆశ్రయించి యున్నది. సర్వరూపుడు, పరమ వరణీయుడు అమృతుడు, బుద్ధికవతలి వాడూ అయిన ఆ పరతత్త్వమును ధ్యానింపవలయును.

విశే॥ ఉపాధియందుండటం = మాయచేత తనయందు అనాత్మ అయిన అహంకారమును, దానిధర్మములను అధ్యాస చేసికొనియుండటం. జీవరూపంగా బుద్ధియందుండటం. సర్వరూపుడు కావటం అనగా – ఆయనకు భిన్నముగా 'సమస్తము' లేదు గనుక ఆయనయే అట్లు వివర్తరూపంగా కనబడుచున్నాడు కనుక. బుద్ధికి పరము అనగా లౌకికజ్ఞానమునకు అందనివాడు. నిత్యసుఖస్వరూపుడు కనుక వరణీయులలో శ్రేష్ఠుడు. చివఱివాడు. పరాకాష్ఠ. 101

**శ్లో॥ యద్దీప్త్యాపి జగద్విభాసకమిదం తేజస్త్రయం దీప్యతే**
**యత్సూక్ష్మాదపి సూక్ష్మమఙ్గ మహతో యద్వై మహద్యత్ర వా ।**
**లోకాస్సప్త చ లోకినోఽపి నిహితాః ప్రాణో మనో వాక్చ త-**
**ద్బ్రహ్మోఙ్కారశరాసనాహితమనోబాణేన హన్యాద్బుధః ॥ 102**

భావ॥ ప్రపంచ ప్రకాశక వస్తువులయిన సూర్యచంద్రాగ్నులుగూడా బ్రహ్మప్రకాశం వలననే ప్రకాశిస్తాయి. అది సూక్ష్మంకన్న సూక్ష్మమయినది అనగా దురవగాహమయినది. మహత్తుకన్న

మహత్తు అయినది. అత్యంత వ్యాప్తమయినది. సప్తలోకములు సప్తలోక ప్రజలు బ్రహ్మమునందే ఉన్నారు. ప్రాణము మనస్సు, వాక్కు ఆయనయందే ఉన్నాయి. కనుక పండితుడు సర్వాధిష్ఠానమయిన ఆబ్రహ్మమును లక్ష్యముజేసి ఓంకారధనుస్సులో తన మనోబాణమునుపెట్టి ఛేదింపవలయును. అనగా బ్రహ్మమునందు ఓంకారోపాసనద్వారా నాదలీనమయిన మనస్సును నిలుపవలయును. 102

**శ్లో॥ లక్ష్యే బ్రహ్మణి బిమ్బభూతచితి సాధ్వోఙ్కారచాపాహితం**
**స్వాత్మానం ప్రతిబిమ్బచిన్మయమిషుం ధీరోఽప్రమత్తః పుమాన్ ।**
**ఏకాగ్రాశయ ఆయతేన్ద్రియగణస్సర్వత్ర వైరాగ్యవాన్**
**సన్న్యాసీ పరిపాతయేదథ భవేద్బాణో యథా తన్మయః ॥ 103**

భావ॥ ధైర్య (ఇంద్రియనిగ్రహం)శాలి అయిన సాధకపురుషుడు ఏకాగ్రమానసుడై, జితేంద్రియుడై, సర్వత్ర వైరాగ్యము గలవాడై, సన్యాసియై అప్రమత్తుడై ప్రతిబింబరూప జ్ఞానభరితమయిన తనను బాణముగా భావించి బింబజ్ఞానమయిన బ్రహ్మచైతన్యమును లక్ష్యంగా గురిపెట్టి ఓంకారధనుస్సు ద్వారా స్వాత్మబాణమును విడువ వలయును. ఈ బాణము లక్ష్యమయిన బ్రహ్మముతో ఐక్యం పొందవలెను.

విశే॥ 1. ఇంతకుముందు మనస్సు బాణముగా చెప్పబడినది. ఇపుడు ఆ మనస్సులో నున్న జీవుడు బాణముగా చెప్పబడుచున్నాడు. వైరాగ్యం అనగా ఇహపరలోకభోగవిరక్తి. విలుకానికి ఏకాగ్రత అవసరం. ప్రమాదం - వ్యగ్రత - పనికిరాదు.

2. ప్రతిబింబం బింబంతో అభిన్నంకనుక "నేను బ్రహ్మాభిన్నుడను" అని గ్రహించవలయును. బాణము బ్రహ్మలో గ్రుచ్చటం కాదు. బ్రహ్మమయం కావలయును. "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" గదా! మామూలు బాణం వద్ద బాణం లక్ష్యంలో గ్రుచ్చుకొనటం మాత్రమే. ఇచ్చట మాత్రం బాణం లక్ష్యమయం కావాలి. కనుక జీవునకు బ్రహ్మసాయుజ్యము.

3. సాయుజ్యం ఎలా అంటే, జీవబ్రహ్మములు ఎ) అవయవరహితములు బి) విభువులు సి) సచ్చిదానంద రూపులు డి) అసంగులు కనుక ఏకమే.

కనుక అన్యోన్య సంయోగం కుదరదు. లేదంటే బాణములాగా జీవుడు సావయవుడు కావాలి. లక్ష్యంకన్న బాణంలాగా భిన్నం కావాలి. అలా అయితే బ్రహ్మభిన్నుడు కనుక జీవుడు జడదుఃఖ స్వరూపుడవుతాడు. 103

**శ్లో॥ యస్మిన్ ద్యౌః పృథివీ నభశ్చ హృదయం ప్రాణేన్ద్రియం చార్పితం**
**తం జ్ఞాత్వైకమముం త్యజేత్తదితరా వాచోఽమృతప్రాపకః ।**
**సేతుః సంసృతిసాగరస్య యదయం హ్యేనం హృదన్తః స్థితం**
**స్వాత్మానం బహుభావమోమితి భజేదజ్ఞానపారాయ నా ॥ 104**

భావ॥ ఆ బ్రహ్మమునందు ద్యులోకము, భూమి, ఆకాశము, హృదయము, ప్రాణాలు, ఇంద్రియాలు ఉంచబడినవి. అట్టి యీ పరమాత్మను ఒక్కనిని తెలిసికొని ఇతరములయిన అనాత్మవచనములను వదలవలెను. ఈ పరమాత్మ అమృతత్త్వమును చేర్చువాడు. సంసార సాగరమునకు సేతువు. హృదయాంతరమున కొలువు దీరినవాడు. ఉపాధివశమున బహు రూపముగా నున్నను ఆత్మరూపముగా నొక్కడే అయిన ఆ పరమాత్మను ఓంకారముతో సేవింప వలయును. దానివలన అజ్ఞానమును దాటగలము. 104

**శ్లో॥ అజ్ఞానామ్బుధిపారవర్త్యఖిలవిత్సర్వజ్ఞ ఏష ప్రభు-**
**ర్దివ్యే బ్రహ్మపురే హృదమ్బుజనభస్యాసీనవద్భాసతే ।**
**సూర్యేన్ద్వబ్ధిసరిన్మరుద్గిరిధరాద్యోలోకభృత్ప్రాణినో**
**యస్యాజ్ఞామయరజ్జుబద్ధహరిణా మాహాత్మ్యసమ్బోధనాః ॥ 105**

భావ॥ అజ్ఞానాంబుధికి అవతల ఉన్నవాడు (తమసః పరమో ధాతా) అఖిలవేత్త, సామాన్యంగా సర్వజ్ఞుడు, అయిన ప్రభువు దివ్యమయిన చైతన్యపురమయిన హృదయపుండరీక (అష్టదళపద్మం)ము నందలి ఆకాశరూపమయిన మనస్సునందు కొలువుదీరినట్లు కనబడును. సూర్యచంద్రులు, నదీసముద్రములు, భూ భూధరములు, వాయువు, ద్యులోకము, లోకపాలకులు ఇతర ప్రాణులు – అందఱు ఆయన ఆజ్ఞకు కట్టుబడిన జింకలు. వీరు ఆయన వైభవమునకు సూచనలు గదా!

విశే॥ 1. ఈశ్వరుడు అజ్ఞానమయమయిన బుద్ధిగుహలోనున్నాడు. అజ్ఞానమునకు అవలి ఒడ్డున లేడు. ఆయన ఎట్లు అజ్ఞానమును దాటింపగలడు? దానికి సమాధానము ఆయన అజ్ఞానాతీతుడు. ఉపాధిగతంగా అజ్ఞానంలో ఉన్నా అది ఆయనకు అధీనమయినదే.

2. హృదయమునందున్నట్లు కనబడుతాడనటం వలన జీవుడు ఈశ్వరుడేనని, అది మిథ్యయని చెప్పినట్లు. 105

**శ్లో॥ హృత్స్థో హ్యేష మనోమయశ్చ మనసో వృత్త్యా యతో భావ్యతే**
**స్థూలాత్సూక్ష్మశరీరమేష నయతి స్థూలాన్తరం కర్మభిః ।**
**దేహేఽత్రైష ధియం హృదబ్జకుహరే సంస్థాప్య సన్తిష్ఠతి**
**జ్ఞానేనైనమయన్తి శాన్తహృదయాః పూర్ణం సుఖం స్వప్రభమ్ ॥ 106**

భావ॥ హృదయాకాశంలో ఉన్నట్లు భాసించేది ఈశ్వరుడు – అనగా ఈశ్వరుడే జీవుడుగా ఉన్నాడని పైశ్లోకములో చెప్పబడినది. ఈ హృదయగతపురుషుడు మనోమయుడుగూడా అవుతాడు. ఎందువలన? అతడు మనోవృత్తులయిన కామాదులచే వృత్తిమంతుడుగా కనబడును. ఇతడే కర్మఫలముగా ఈ లింగశరీరమును ఒక స్థూలదేహము నుండి మఱొక స్థూలదేహమునకు తీసికొనిపోవును. ఇతడే ఈ దేహమున హృదయపద్మ గుహలో బుద్ధిని నిలిపి ఉంచును. శాంత

హృదయులయిన జ్ఞానులు తమ జ్ఞానముతోనే యీ పూర్ణస్వయంప్రకాశానంద స్వరూపమును పొందెదరు.

విశే॥ అఖండ బ్రహ్మాకారవృత్తితో సచ్చిదానందస్వరూపమును దర్శించెదరు. లేదా జ్ఞానమువలన ఈ జీవుని స్వయంప్రకాశానందఘనుడయిన బ్రహ్మముగా గ్రహించెదరు. జ్ఞానమనగా 'ఆత్మ – అనాత్మ' వివేకము. అనాత్మలతో తాదాత్మ్య రూపముగా అధ్యాస చెందుట వలన ఈశ్వరుడు జీవుడయినాడు. ఆత్మ – అనాత్మ వివేకము కలిగితే వచ్చే ఆత్మజ్ఞానముతో జీవభావన పోతుంది. బ్రహ్మాత్మైక్యభావన "తత్త్వమసి", "అహంబ్రహ్మాస్మి" వస్తుంది. 106

**శ్లో॥ దృష్టేఽస్మిన్పురుషే పరావరమయే సాక్షాత్స ఏషోఽహమి-**
**త్యజ్ఞానప్రభవాత్మసంశ్రయదృఢగ్రన్థిర్బుధో భిద్యతే ।**
**ఛిద్యన్తేఽఖిలసంశయా బహుభవేష్వత్తాని కర్మాణ్యపి**
**క్షీయన్తే పరిముచ్యతేఽసుఖకరాత్సంసారబన్ధాదయమ్ ॥ 107**

(బుధః = భుత్ షష్ఠి)

భావ॥ జ్ఞానంద్వారా ఈ పురుషుని చేరిన వారికి ముక్తియే. చూడండి. పరులు హిరణ్యగర్భాదులు, అవరులు, మనవంటి జీవులు, లేదా హిరణ్యగర్భునికన్న ముందు వాడు – కనుక పరావరమయుడయిన ఆ పురుషుని అపరోక్షముగా పొందిన వానికి "తానే బ్రహ్మమునన్న' జ్ఞానము కలుగును. అంతవఱకు – తానే జీవుడను, సంసారిని, కర్తను – అని అజ్ఞానంవలన ఏర్పడిన దృఢమయిన దేహాత్మభావగ్రంథి పగిలిపోవును. అఖిల సందేహములు (జీవేశ్వరులు ఒక్కరా? అనేకులా? సంసారియా? అసంసారియా? మొదలయినవి) విచ్ఛిన్నమయిపోవును. అనేక జన్మార్జితమయిన సంచితాగాములు క్షీణమగును. దుఃఖకరమయిన సంసారబంధము నుంచి విడివడి జీవన్ముక్తుడగును. ప్రారబ్ధానంతరము విదేహముక్తి పొందును. 107

**శ్లో॥ కోశేఽస్మిన్ హిరణ్మయే రుచిమయే యద్దృశ్యతే చాత్మని**
**బ్రహ్మైతద్విమలం విశుద్ధమకలం జ్యోతిశ్చ తజ్జ్యోతిషామ్ ।**
**సూర్యాదిర్న హి తత్ర భాతి సకలం తచ్చానుభాత్యుల్లస-**
**ద్భాసా తస్య విభాతి సర్వమపి తత్సోఽవైతి యస్త్వాత్మవిత్ ॥ 108**

భావ॥ బంగారు కాంతులనీనుచున్న ఒరలో కత్తివలె (ముంజమున ఇషీకవలె) మనస్సులో పరబ్రహ్మం ఉన్నది. అది నిర్మలం, శుద్ధం, నిష్కలం. అది వెలుగుకు వెలుగు. ఆ వెలుగుముందఱ సూర్యుడు వెలుగడు. సమస్తము దానినిబట్టియే వెలుగును. సమస్తమునకు అదే వెలుగు. ఈవిషయము నెఱిగినవాడు ఆత్మవేత్త.

విశే॥ ఆత్మసాక్షాత్కారం వలన మోక్షమా – రాదు. అది బ్రహ్మవేత్తకే మోక్షమని శ్రుతి గదా! బ్రహ్మసాక్షాత్కారం వల్లను మోక్షము రాదు. ఎందుకంటే పరోక్షబ్రహ్మ ఏనాటికి ప్రత్యక్షము

కాదు. అని ప్రశ్న. సమా – ఆత్మదర్శియే ఆత్మవేత్త. అది బుద్ధిగతం అది సర్వాంతరాత్మ. దాని వేదనం దాని సాక్షాత్కారం. 108

**శ్లో॥ పూర్వస్యాం దిశి యద్విభాత్యవిదుషాం భూమ్యాదిరూపేణ త–**
**ద్బ్రహ్మైవోరగవద్విభాత్యవిదుషాం యత్తద్యథా వా గుణః ।**
**ఏవం పశ్చిమదక్షిణోత్తరదిశాసూర్ధ్వాన్తరాధస్తలే–**
**ష్వజ్ఞానాం జగదాత్మనా లసతి యద్బ్రహ్మైవ తత్సద్ధ్రువమ్ ॥ 109**

భావ॥ బ్రహ్మ ప్రత్యక్షం బాహ్యంలో గూడా అవుతుంది. తూర్పుదిక్కున అజ్ఞానులకు కనబడేది భూమ్యాకాశాదులు. నిజానికి అవి బ్రహ్మమే. రజ్జువు సర్పంలాగా కనబడినట్లు లేదా సర్పధర్మంతో కనబడినట్లు, బ్రహ్మమే భ్రాంతివలన అలా ఇతర పదార్థంగా కనబడుతుంది. ఒక్క తూర్పుదిక్కు మాత్రమే కాదు. పశ్చిమ, దక్షిణ, ఉత్తర, ఊర్ధ్వ, అధః, అంతరాళ దిక్కు లన్నియును అంతే. సర్వత్ర బ్రహ్మమే జగద్రూపంతో మాయా ప్రభావం చేత కనబడుతున్నది. బ్రహ్మమే శాశ్వతమయిన 'సత్' పదార్థము. కనుక 'ఉన్నట్లు' కనబడుతున్నదల్లా బ్రహ్మమే. అధిష్ఠానం (రజ్జువు/బ్రహ్మం) కనబడనివారికే ఆరోప్యమయిన (ప్రపంచం/సర్పం) కనబడుతుంది. ప్రపంచం కనబడే సమయంలోనయినా బ్రహ్మం అచ్చట ఉన్నట్లే. సర్పభ్రాంతి సమయంలో వాస్తవంగా ఉన్నది రజ్జువే. 109

**శ్లో॥ దేహం వృక్షమిమం శ్రితౌ సుపతనౌ ద్వౌ పక్షిణౌ సఙ్గతా–**
**వన్యోన్యం సుహృదావనాదినిధనౌ జీవేశ్వరౌ చిన్మయౌ ।**
**ఏకస్తత్ర తు లిఙ్గవాన్ కృతఫలం భుఙ్క్తే చ దుఃఖం సుఖం**
**మాయోపాధిభృదీశ్వరస్స తు పరోఽనశ్నన్నిదం పశ్యతి ॥ 110**

భావ॥ 'జీవుడు ఈశ్వరుడు' ఒకేతత్త్వం అని చెప్పబోవుచు ముందు వారి స్వరూపమును చెప్తున్నారు. దేహమును ఈ వృక్షం మీద సుపర్ణములయిన రెండు పక్షులున్నాయి. అవి రెండు యుగయుగాలుగా కలిసియే యున్నాయి. వాటికి ఆద్యంతములు జనన మరణములు లేవు. అవి జ్ఞానమయమయినవి. ఆ పక్షుల పేరు జీవేశ్వరులు. అందులో జీవుడను పక్షి లింగ (సూక్ష్మ) శరీరము ఉపాధిగా స్వీకరించి కర్మఫలములను అనుభవించును. అవి దుఃఖమయినా సుఖమయినా కావచ్చును. కాని మాయ ఉపాధిగా గల ఈశ్వర పక్షిమాత్రము కర్మఫలాతీతమయి నిరాహారమయి జీవునకు సాక్షిగా నుండును. 110

**శ్లో॥ దేహేఽహమ్మతిరేష శోచతి పుమాన్ సంసారపాథోనిధౌ**
**మగ్నో దీనతయా సుతాదిమమతోఽజ్ఞానేన మూఢాశయః ।**
**రుగ్ణోఽహం మమ మృత్యురేష్యతి సుతో నాసీచ్చ దగ్ధం గృహం**
**భార్యా చాపి మృతాఽధనో బహుజనం జీవేత్కుటుమ్బం కథమ్ ॥111**

భావ॥ జీవుని సంసారదుఃఖమును వర్ణించుచున్నాడు. జీవుడు 'దేహముతానే' అను భ్రాంతిగల వాడయి, బాధపడును. సంసార సముద్రమున ముగ్ధుడై దీనుడై పుత్రాదులయందు మమకారముతో (మమతః) అజ్ఞానావృత బుద్ధితో ఇలా బాధపడును. "నేను రోగిని, నాకు మరణం దగ్గఱలో రాబోతున్నది. పుత్రుడు లేడు. ఇల్లు దగ్ధమయినది. భార్య మరణించినది. నాకు తగినంత డబ్బులేదు. బహుకుటుంబము. ఎలా బ్రతకాలి? - ఇవి, ఇటువంటిది జీవ-దుఃఖము. 111

**శ్లో॥ శాస్త్రాచార్యశమాదిసంస్కృతహృదా తం సర్వసంసేవితం**
**పశ్యత్యేష యదేశమస్య విభవం నో వా తదా శోచతి ।**
**పశ్యః పశ్యతి రుక్మవర్ణమమృతం కర్తారమీశం యదా**
**పుణ్యం పాపమపి ప్రధూయ తు తదా బ్రహ్మైవ సమ్పద్యతే ॥ 112**

భావ॥ ఇట్టి సంసారబాధ ఈశ్వరదర్శనముతో తొలగుతున్నది. శాస్త్రములు, ఆచార్య-వర్యుడు, శమదమాదులు - వీటివలన సంస్కరింపబడిన హృదయము గలవాడై సంసారిజీవుడు, సర్వసేవితుడయిన ఈశ్వరుని ఆయన వైభవమును దర్శించిననాడు ఇక అతనికి ఎటువంటి దుఃఖములుండవు. జ్ఞానియై హిరణ్యమువలె స్థిరప్రకాశస్వరూపమయిన ఆ అమృత పదార్థమును, జగత్కర్త అయిన ఈశ్వరుని జ్ఞానదృష్టితో చూచినవాడు, చూచిననాడు, పుణ్యమును పాపమును గూడా వదలించికొని బ్రహ్మమునే చేరును. అనగా ఉపాధి తాదాత్మ్య - అధ్యాస వలన అజ్ఞానంతో సంచరించు జీవునకు నిరుపాధి అయిన ఈశ్వరుని సాక్షాత్కారానుభవము కలిగిన క్షణమే సకార్యంగా అజ్ఞానం తొలగుతుంది. జీవుడు ఉపాధిరహితేశ్వరుడే అవుతాడు. 112

**శ్లో॥ ప్రాణప్రాణమముం పరేశమమృతం యస్సర్వభూతస్థితం**
**సర్వాత్మానమయేదసావహమితి బ్రహ్మేతరత్కిఞ్చన ।**
**నో తస్య ప్రతిభాతి నాతివదతి బ్రహ్మణ్యయం క్రీడతి**
**జ్ఞానధ్యానయుతశ్చ తత్ర రమతే స బ్రహ్మవిత్సూత్తమః ॥ 113**

భావ॥ ఆత్మవేత్తయే బ్రహ్మవేత్త - అని చెప్పబడినది. అట్టి బ్రహ్మవేత్తలలోనూ ఉత్తముని గురించి ఇపుడు చెప్తున్నాము. పరమేశ్వరుడు ప్రాణానికి ప్రాణము. అమృతమూర్తి. సర్వభూత స్థితుడు, సర్వస్వరూపుడు "ఆయనయేతానని' బ్రహ్మాత్మైక్యమును అనుభవించును. బ్రహ్మేతర-మయినది ఏదియు వాస్తవముగాదు - అని అతనికి తెలియును. అతను ఏదీ అతివాదము చేయడు. అట్టిదేదియు లేదు గదా? అతడు బ్రహ్మమునందే రమించును. జ్ఞానధ్యానయుక్తుడై ఆనందించును. అట్టి మహాత్ముడు బ్రహ్మవేత్తలలోనే ఉత్తముడు.

విశే॥ "ఆత్మరతిరాత్మక్రీడః" అని ఉపనిషత్తు. బ్రహ్మవేత్తలలో ఉత్తముడయినవానికి జీవన్ముక్తిగూడా లభించును. అతను అవధూత వంటివాడు. కేవలం బ్రహ్మవేత్తకు జీవన్ముక్తి లేదు. విదేహముక్తి ఇరువురకు సమము. 113

**శ్లో॥ ఏకాగ్రేన్ద్రియమానసైరవిరతం సద్బ్రహ్మచర్యైస్సదా**
**సత్యజ్ఞానసమఞ్చితైర్యతిజనైర్లభ్యోఽయమాత్మా పరః ।**
**సూక్ష్మాత్సూక్ష్మతరో మహాన్ రుచిమయోఽ చిన్త్యోఽతి దూరేఽన్తికే**
**చేహాప్యాత్మని సంస్థితస్తనుభృతాం గూఢః ప్రకాశోఽపి చ ॥ 114**

భావ॥ ఈ ఆత్మ పరమయినది. ఇంద్రియ మనస్సులను ఏకాగ్రముగా చేసి, నిత్యము మంచి బ్రహ్మచర్యమును పాటించువారు సత్యమయిన జ్ఞానముగలవారూ అయిన యతులు అపరమాత్మను పొందగలరు. కేశాగ్రం కన్న సూక్ష్మమయిన వాడు. అనగా గహనమయినవాడు. మహాత్ములకన్న మహత్తయినవాడు. కాంతిమయుడు. అచింతనీయుడు. అజ్ఞానికి కంఠహారమువలె దగ్గఱున్నా దూరంగానే ఉన్నట్లనిపించేవాడు. జ్ఞానికతిసమీపమయినవాడు, అతని వాస్తవ రూపమయిన చైతన్యమయినవాడు, మనస్సునందే ఉన్నను అజ్ఞానులకు నిగూఢంగా అనిపించు వాడు, జ్ఞానులకు ప్రకాశరూపంగా లభించువాడు. 114

**శ్లో॥ గ్రాహ్యోఽయం న హి చక్షుషా న వచసా నాన్యైన్ద్రియైర్నోకృతై-**
**ర్నో కృచ్ఛ్రాదితపోభిరప్యమలినప్రజ్ఞాప్రసాదేన తు ।**
**గ్రాహ్యశ్శుద్ధహృదేహ హృద్యవిరతధ్యానేన తేనాత్మనా**
**వ్యాప్తత్వాదజడేన యత్ర విమలే సోఽయం స్వయమ్భాసతే ॥ 115**

భావ॥ నేత్రములుగాని వాక్యములుగాని, ఇతర ఇంద్రియాలుగాని, కర్మలుగాని కృచ్ఛ్ర చాంద్రాయణం మొదలయిన వ్రతాలుగాని, కష్టమయిన పంచాగ్ని మధ్య తపస్సులుగాని, పరమాత్మను గ్రహించలేవు. అలా గ్రహింపబడినది సాధ్యము గనుక కృతకం అవుతుంది. నశ్యం అవుతుంది. ఈ దేహంలోనే బ్రహ్మమును గ్రహింపగలిగినది అజ్ఞాన మాలిన్య రహితమయిన ప్రజ్ఞా ప్రసాదము గల శుద్ధ మనస్సు మాత్రమే. ఆ హృదయములో నిరంతర బ్రహ్మధ్యానం ఉండాలి. మనస్సు జడమయినా చైతన్యవ్యాప్తివలన అజడం అనగా సచేతనం అవుతుంది. అట్టి విమలమయిన హృదయములో ఆత్మ స్వయముగానే భాసించును.

విశే॥ హృదయం విమలమయితే అందులో ఆత్మ స్వయముగానే భాసిస్తుంది. చూడండి. "యదోపరామోమనసోనామరూప రూపస్య దృష్ట స్మృత సంప్రమోషాత్, **య ఈయతే కేవలయా స్వసంస్థయా హంసాయ** తస్మై శుచి సద్మనే నమః"

కనుక బ్రహ్మం మామూలు మనస్సుకు అందనిది. జ్ఞాన సంస్కృతమయిన మనస్సుకు అందుతుందని అర్థము. 115

**శ్లో॥ ఆత్మత్వేన మహేశ్వరం చ సకలాత్మానం పరం ప్రాప్తవాన్**
**యస్సోఽయం మనసేక్షతే పరకృతే స్వార్థం చ కామాంస్తు యాన్ ।**

**లోకాంస్తాంశ్చ సమశ్నుతే తత ఇమం జ్ఞం భూతికామోఽర్చయే-**
**త్సేవేతాపి ముముక్షురేనమఖిలం బ్రహ్మైవ యద్బ్రహ్మవిత్ ॥ 116**

భావ॥ సకలాత్మరూపుడయిన మహేశ్వరుని పరమాత్మగా (ఆత్మగా) ఎవడు తన మనస్సుతో దర్శిస్తాడో, వాడు తనకోసం గాని పరులకోసంగాని కోరిన కోరికలు, ఆయా కోరబడినలోకములు లభించును. కనుక ఐశ్వర్య కాముడైన వాడు ఈ జ్ఞానిని ఆశ్రయించి అర్చించి తమ కోరికలను పొందవచ్చును. మోక్షకాముడీ జ్ఞానిని గురువుగా సేవింపవలెను. ఎందుకంటే బ్రహ్మవేత్తయే ఈ అఖిలరూపమయిన బ్రహ్మము కదా! 116

**శ్లో॥ కామాన్ కామయతే తు యాన్ లఘుమనా యస్తైస్సకామైః పునః**
**సమ్భూతిమ్భత తత్ర తత్ర భజతే కామాన్ ముముక్షుస్త్యజేత్ ।**
**ఆత్మజ్ఞస్య కృతాత్మనస్త్విహ సమే పర్యాప్తకామస్య నుః**
**కామా యాన్తి లయం యదేష హతవాన్ జ్ఞానార్కభాసా తమః ॥117**

భావ॥ అజ్ఞానమువలన సవికారమయిన మనస్సుగలవాడు కోరికలనే కోరుతాడు. మరల ఆ కోరికలు తీరటం కోసం ఆయాజాతులలో పుట్టాడు. జననమరణములనుండి విరక్తుడై మోక్ష కాముడయినవాడు ఇతర కామములను వదలికొనవలయును. ఆత్మజ్ఞుడై, అందుచేత అన్నికోరికలు తీరినట్లుగా ఉన్న నిర్మలచిత్తుడయిన జ్ఞానికి సర్వకామములు లయము చెందును. ఎందుకంటే, జ్ఞానసూర్యకాంతితో అతను అజ్ఞానమును చంపినాడుగదా! 117

**శ్లో॥ వేదం కర్మమయం చ తత్త్వవిధురం తర్కాదిశాస్త్రం తథా**
**సన్త్యజ్యోపనిషద్విచారనిరతోఽకామః ప్రసన్నాశయః ।**
**ఆత్మానం పరిలబ్ధుమిచ్ఛతి పుమాన్ యస్తస్య విద్యావశా-**
**దాత్మాఽయం స్వతనూం ప్రకాశయతి తల్లభ్యోఽయమాత్మేచ్ఛయా ॥118**

భావ॥ కర్మమయమయిన వేదపూర్వభాగము, తత్త్వశూన్యమయిన తర్కాది శాస్త్రములను వదలి ఉపనిషద్విచారనిష్ఠగల వాడై అకాముడై ప్రసన్నాంతరంగుడయిన పురుషుడు ఆత్మను పొందగోరినచో అతడు జ్ఞానవశమున ఆత్మను పొందును. అట్టివానికి ఆత్మ తనను తాను వెల్లడించికొనును. తనకున్న తీవ్ర వాంఛ వలన అతడు ఆత్మను తప్పక పొందును.

**విశే॥ (ఘట పటములు, పర్వతధూమములు, పంచలక్షణి, సింహవ్యాఘ్రులక్షణాలు, చాంతాడంత పరిష్కారాలతో కంఠక్షోభ , గౌతమాదులయిన ఋషులు చెప్పిన దుఃఖాపాయమును గాలికి వదలి చర్చలతో కంఠక్షోభం కలిగించేది తర్కశాస్త్రం. మీమాంసకు దర్భలు హోమాలు చమసాలు రంభలు తప్ప తత్త్వం అక్కరలేదు. పదానికి ధాతువులు, ప్రత్యయాలు కిత్తులు పిత్తులు, సూత్రాలు అపవాదలు శబ్దబ్రహ్మ, స్ఫోటం తప్ప తారక తత్త్వం పట్టించి కొననిది వ్యాకరణము. దీనికి శబ్ద పరమాత్మ తప్ప అర్థపరమాత్మ అక్కరలేదు.**

" నహి నహి రక్షతి డుకృఞ్ కరణే"

" వృధాకంఠక్షోభం వహసితరసా తర్క వచసా" అనికదా శంకర సూక్తి. శ్రుతి మతతర్కంతో ఉపనిషదర్థమును అనుభవించటం కర్తవ్యం – ఇది సారాంశం – అనువాదకుడు.)118

**శ్లో॥ నిష్కామః పరమాత్మకామకలితస్సన్న్యాసవాన్ జ్ఞానవాన్**
**నాత్మస్థిత్యుపజాతవీర్యసహితో యస్త్వప్రమాదో బుధః ।**
**ఆత్మార్థం యతతే ప్రపద్య స ధియం బ్రహ్మోహమిత్యవ్యయాం**
**శాన్తో జ్ఞానవితృప్తధీః ప్రవిశతి బ్రహ్మోఖిలస్థం సమమ్ ॥ 119**

భావ॥ ఆత్మవాంఛ ఉన్నంతమాత్రమున ఆత్మ లభించదు. అందుకు ఇంకా కొంత సామగ్రి ఉండాలి. పరమాత్మవాంఛ తప్ప మరేవాంఛ ఉండరాదు. అందువలన అంతవఱకు కర్మ ఫలమును వదలాలి. అదే సన్న్యాసము. గురూపదేశ శ్రవణ మననాదులతో అది 'అహం బ్రహ్మాస్మి' అను జ్ఞానం పొందాలి. ఆత్మనిష్ఠ వలన వచ్చిన బలము (మనస్సు) గలవాడై, సావధానుడై ఆత్మానుభవం కోసం ప్రయత్నించాలి. అపుడు 'అహం బ్రహ్మాస్మి' 'సోహం' అనుభావన కలుగుతుంది. అది అవ్యయమయినది. అది కలిగిన తరువాత, పురుషుడు శాంతుడు, జ్ఞానం వలన పూర్ణకాముడు, అయిన అఖిల వ్యాప్తమయిన సర్వాత్మకమయిన బ్రహ్మమును చేరును. అనగా తానే బ్రహ్మమై మిగులును. 119

**శ్లో॥ సర్వం కర్మ విహాయ నిశ్చితమహావాక్యార్థతత్త్వాశ్రితా**
**యోగం బ్రహ్మమయాత్మసంస్థితిమయం సంశుద్ధసత్త్వా బుధాః ।**
**బ్రహ్మాత్మాన ఇహైవ సన్త ఉపరి త్యాగాత్తనోరద్వయం**
**పూర్ణం బ్రహ్మ విశన్తి హేతుషు లయే జాతే కలానాం స్వతః ॥ 120**

భావ॥ సర్వకర్మలను విడువ వలయును. అనగా సన్న్యసింపవలయును. మహావాక్యార్థ మయిన తత్త్వమును శ్రవణమననాదులతో నిశ్చయమును తెచ్చికొనవలయును. అయమాత్మా బ్రహ్మ, తత్త్వమసి అనువాక్యములు చెప్పు జీవేశ్వర తత్త్వమును నిదిధ్యాసనలోకి రప్పించవలయును. బ్రహ్మమయమయిన ఆత్మయందు నిలుపవలయును. అట్టి శుద్ధసత్త్వులయిన జ్ఞానులు, జీవన్ముక్తు లయి బ్రహ్మాత్మభావము గలవారయి బ్రతుకుచు, (త్వయిమయి సర్వత్రైకోవిష్ణుః) చివరకు శరీరత్యాగం తరువాత, లింగ శరీర సంబంధమయిన కళలు తమ తమ కారణ పదార్థములలో లయము కాగా; (అవి బుద్ధియందు బుద్ధి అవ్యక్తమునందు లీనము కాగా) అద్వైతమయిన పూర్ణ బ్రహ్మమున లయము చెందెదరు. విదేహముక్తిని పొందెదరు. 120

**శ్లో॥ కుణ్డోపాధిలయాన్మహాభ్రమయతే కుణ్డామ్బరం చాననం**
**ప్రత్యాస్యం ముకురక్షయాద్భృహదసౌ లిఙ్గక్షయాదేతి నా ।**

**సింధుం ప్రాప్య యథా నదీ కలయతే నిర్నామరూపైకతాం**
**తేనైవం బృహదేత్య నా భవతి వై నిర్నామరూపో బృహత్ ॥ 121**

భావ॥ ఘటాకాశము ఘటము పగిలితే ఆకాశములో లీనమవుతుంది. **అద్దం పగిలిపోతే అందలి ప్రతిబింబము బింబములో లయమవుతుంది**. అట్లే బ్రహ్మశక్తి ప్రభావాన్ని స్వీకరించగల (అవచ్ఛేదం/ప్రతిబింబంగా) అంతఃకరణరూపమయిన లింగశరీరం జ్ఞానం వలన నశించినచో జీవుడు పరబ్రహ్మములో కలిసిపోవును. అది ఎలా అవుతుందంటే నదులన్నియు సముద్రములో కలిసినంతనే, అవి తమ నామరూపములను కోల్పోయి సముద్ర రూప జలతత్త్వముగా నిలిచి పోవును గదా! అట్లే బ్రహ్మములో కలిసిపోయిన జీవుడు తన నామరూపములను కోల్పోయి కేవల చైతన్యముగా మిగిలిపోవును.

విశే॥ 1. అంతఃకరణంతో కలిసి ఆడే (అవచ్ఛిన్న) చైతన్యం లేదా అంతఃకరణం స్వచ్ఛం కనుక అందు ప్రతిబింబంగా ఉన్న చైతన్యం జీవుడని రెండు వాదనలు. మొదటిది ఘటాకాశము రెండవది ప్రతిబింబము.

2. బ్రహ్మలో కలిసినా సారూప్యాది ముక్తులతో జీవుడు విడిగా నుండునని సాయుజ్యంగా లీనముగాడని ద్వైతం. అది తప్పని నిరూపించినట్లు దీని అర్థము. 121

**శ్లో॥ యో బ్రహ్మాఽహమితి ప్రవేద భవతి బ్రహ్మైవ సద్బ్రహ్మవి-**
**న్నాన్యామేష గతిం ప్రయాస్యతి మృతో దేవాదిభిర్విఘ్నితః ।**
**ఆత్మా బ్రహ్మ హి సర్వగం భవతి వా నాస్యాన్వయోఽబ్రహ్మవి-**
**చ్ఛోకాబ్ధిం తరతి హ్యఘం చ హృదయగ్రన్థేర్విముక్తోఽమృతః ॥ 122**

భావ॥ "అహం బ్రహ్మాస్మి" అను జ్ఞానం/అనుభవం కలిగిన వాడు బ్రహ్మమే అగును." "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" బ్రహ్మవేత్త శరీరత్యాగానంతరము బ్రహ్మత్వమునే పొందును. ఇతర లోకగతులు లేవు. వానికి దేవతల వలన విఘ్నములు కలుగవు. ఆత్మయే బ్రహ్మం కదా! అది సర్వవ్యాప్తము కదా! వాని వంశములో బ్రహ్మవేత్తకానివాడు పుట్టడు. ఇతడు సంసార దుఃఖ సముద్రమును, పాపమును దాటును. హృదయమునందలి అభిమానగ్రంథి నుండి విడివడి మృతదేహాభిమాన రహితుడై అమృతుడగును.

విశే॥ దేవతలకన్న ఇతడు బ్రహ్మజ్ఞానము వలన అధికుడవుతాడని, విరక్తుడై కర్మలు మానటం ద్వారా తమకు హవ్య కవ్యములను ఇవ్వడని, తద్వారా తమ బ్రతుకు సాగదని దేవతలు, **ఇంద్రియ దేవతలు గూడా జ్ఞానికి యోగికి విఘ్నములు కలిగించెదరని శాస్త్రసూచన.** బ్రహ్మవేత్తకు ఉన్నచోటనే లయము కనుక అతని ప్రయాణవిఘ్నములు లేవని తాత్పర్యము. 122

**శ్లో॥ నిత్యం కర్మ యథోక్తమాచరితవాన్ యశ్శ్రోత్రియశ్చాపర-**
**బ్రహ్మస్థః పరమం బుభుత్సతి బృహచ్చైకర్షిహోతా తు యః ।**

**చీర్ణం యేన శిరోవ్రతం చ విధివత్తస్మై ప్రశాన్తాత్మనే**
**ప్రాప్తాయ స్వపదం యథావిధి వదేత్తాం బ్రహ్మవిద్యామ్బుధః ॥ 123**

భావ॥ నిత్యకర్మలాచరించి శ్రోత్రియుడు అపరబ్రహ్మనిష్ఠుడై ఇక పరబ్రహ్మజ్ఞానము గోరినవాడు, 'ఏకర్షి' అనబడు అగ్నిని హోమములతో సేవించినవాడు, అధర్వణ ప్రకారము 'శిరోవ్రతము' (శిరస్సుపై సంవత్సరకాలము నిప్పులకుండ ధరించు వ్రతము)ను యథావిధిగా ఆచరించినవాడు, ప్రశాంత చిత్తుడు, తన పాదముల చెంతకు సమిత్పాణియై శుశ్రూషకు చేరినవాడు, అయిన శిష్యునకు బ్రహ్మజ్ఞాని జ్ఞానోపదేశము చేయవలయును. 123

ఇతి ముణ్డకోపనిషద్వ్యాఖ్యాతా.

శ్రీః



# మాణ్డూక్యోపనిషత్

**శ్లో॥ ఓమిత్యేక్షరమేతదేవ భువనం భూతం భవద్భావి చా-**
**వ్యక్తం సూత్రమిదం సమస్తమపి చ బ్రహ్మోఽయమాత్మా బృహత్ ।**
**ఓఙ్కారప్రతిపాదితోఽయమమృతో హ్యాత్మా చతుష్పాదివాఽ-**
**నంశోఽపి ప్రతిభాతి సత్త్వవశతోఽద్వైతస్తు తద్వస్తుతః ॥ 124**

భావ॥ "ఓం" అను ఈ అక్షరమే ప్రపంచము. అనగా ప్రపంచమునకు ప్రతీక. భూత భవిష్యద్వర్తమానకాల సంబంధమయిన ప్రపంచమంతయు ఓంకార స్వరూపము. ఆకాలములూ ఓంకార స్వరూపము. ఇదంతా రూపముదాల్చిన ప్రపంచము. దీనికన్న ముందు రూపరహితదశలో నున్న అవ్యాకృతమయిన అవ్యక్త ప్రపంచము, హిరణ్యగర్భరూపమయిన మహత్తు అను సూత్రము అంతా ఓంకారమే. ఈ సూత్ర, సూక్ష్మ అవ్యక్త కారణ ప్రపంచములన్నియు, ఓంకారమని సారాంశము. ఈ ఆత్మగూడా బ్రహ్మమే. ఆత్మగూడా ఓంకారమే. ఎందువలననంటే ఓంకారమును బ్రహ్మవాచకముగా వేదము చెప్పినది. నామవ్యక్తులకు వాచ్య వాచకములకు అభేదము కదా! కనుక ఓంకారమే బ్రహ్మ. బ్రహ్మమే ఆత్మ. కనుక ఓంకారము ఆత్మయే. అమృతమయిన యీ ఆత్మ అంశరహితము. నిరవయవము. అయినను చతుష్పాదములు గలదానివలె కనబడుతుంది. అందుకు కారణము మాయ (సత్త్వం) కాని వస్తుతః అది. అద్వైతమే. ద్వైత రూపమయిన ప్రపంచము దానియందు లేదు. 124

**శ్లో॥ ఏతస్యైకవిహీనవింశతిముఖో జాగ్రత్పదః స్థూలభుక్**
**సప్తాఙ్గశ్చ బహిర్మతిః ప్రథమతః పాదస్తు వైశ్వానరః ।**
**స్వాప్నోఽన్తర్ధిషణో వివిక్తభుగయం పాదో పరస్తైజస-**
**స్త్వఙ్గాన్యస్య ముఖాని పూర్వపదవత్తావన్తి తాన్యేవ చ ॥ 125**

భావ॥ ఆత్మయొక్క పాద చతుష్టయమును వివరించుచున్నాడు. ఆత్మకు (ఓంకారమునకు) ప్రథమ పాదములో ఈ క్రింది విషయములు అంతర్భవించును. “21” ముఖములు అనగా ఉపలబ్ధి ద్వారములు. పంచప్రాణములు, దశేంద్రియములు, మనోబుద్ధిచిత్తాహంకారములు. 21. జాగరణస్థానము. స్థూలములయిన శబ్దాది విషయానుభవములు, సప్తాంగములు – అనగా

ద్యులోకము, సూర్య వాయు, ఆకాశ, జల, భూమి, అహవనీయాగ్ని, మూర్ధ, నేత్ర, ప్రాణ, మధ్యదేహ, మూత్రాశయ పాద ముఖములు. బాహ్యప్రజ్ఞ, ఇవి కలిగిన వైశ్వానరుడు ప్రథమ పాదము. సమస్త ప్రాణిరూపుడయిన విరాట్పురుషుడు.

ఇక ద్వితీయ పాదము. స్వప్నస్థానము. అంతఃప్రజ్ఞ, వివిక్తమయిన స్వప్నపదార్థముల అనుభవము గల తైజసుడు ద్వితీయపాదము. ఈ పాదమునకుగూడా అంగాలు ముఖాలు అన్ని ప్రథమ పాదోక్తములే. కనుక ఏకోన వింశతిముఖమే.

విశే॥ 1. సప్తాంగములు – శిరస్సు = ద్యులోకము నేత్రము సూర్యుడు ప్రాణము వాయువు, దేహమధ్యము = ఆకాశము, మూత్రస్థానము = జలము, పాదద్వయము = భూమి, నోరు ఆహవనీయము ఇవి సప్తాంగములు.

2. వివిక్తములు = వాసనాఖండములుగా విడిపోయిన సంస్కారములను అనుభవించువాడు.

3. తైజసుడు = బాహ్య తేజస్సుతో పనిలేకుండా సొంత తేజస్సుతో స్వప్నదృశ్యము ననుభవించువాడు. 125

**శ్లో॥ సుప్తో యత్ర పుమాన్న వా కలయతే స్వప్నం చ కామం చ కం**
**తత్సుప్తే స్థిత ఏకతాముపగతశ్చేతోముఖశ్శర్మభుక్ ।**
**ప్రాజ్ఞశ్శర్మమయః ప్రవేదనఘనః పాదస్తృతీయో హ్యసా–**
**వన్తర్యామ్యఖిలస్య యోనిరధిపో జన్మాప్యయస్సర్వవిత్ ॥ 126**

భావ॥ సుషుప్తి స్థానంలో ఉన్నవాడు స్వప్నమునుగాని ఏ కోరికనుగాని గమనింపలేడు. సుషుప్తి స్థానంలోనున్నవాడు ఇంద్రియాది భేదము లేనివాడై ఏకీభూతుడై జ్ఞానముఖం కలవాడై యుండును. ఎందుకంటే మనస్సే స్వప్నజాగరములకు ద్వారము లేదా – లోకవిజ్ఞానము చేతను దానిని స్వప్నములో అందించునది కనుక చేతోముఖము. అట్టివాడు చేతోముఖుడు, సుషుప్తి – ఆనందమును అనుభవించువాడు ఆనందమయుడు జ్ఞానఘనుడు అయిన “ప్రాజ్ఞుడు” తృతీయపాదము. ఇతడే అఖిలమునకు అంతర్యామి. అఖిలమునకు కారణము. ప్రభువు. అఖిలమునకు సృష్టి లయకారకుడు సర్వవిశేషజ్ఞానము గలవాడు.

విశే॥ 1. ప్రజ్ఞానఘనుడు = సమస్త ప్రపంచము విభాగ సహితముగా నున్నను కటిక చీకటిలో మాత్రం ఒకే చీకటి ముద్దలాగా భాసిస్తుంది. అట్లే ఆత్మ సుషుప్తిలో ఎటువంటి స్పందనలు లేనిదిగా నుండును.

2. ప్రాజ్ఞుడు జీవుడు గదా! అతడు సర్వాంతర్యామి అని సృష్టిస్థితి కారకుడని ఎలా చెప్తారు. అవి ఈశ్వర లక్షణములుగదా! సమా - ప్రాజ్ఞుడు ఈశ్వరుడు ఒక్కరే గదా! జీవేశ్వరులొక్కరే గదా! కనుక అభేద దృష్ట్యా అభేదోపాసన దృష్ట్యా అలా చెప్పబడినది. కనుకనే ప్రథమపాదములలో జీవేశ్వరులయిన విశ్వ వైశ్వానరులలో వైశ్వానరుని అధికారిగా చెప్పిన శ్రుతి ద్వితీయ పాదములో జీవేశ్వరులయిన తైజస హిరణ్యగర్భులలో హిరణ్యగర్భుని చెప్పకుండా జీవుడయిన తైజసుని చెప్పినది. కనుక జీవుని చెప్పిన ఈశ్వరుని చెప్పిన ఒక్కటే. లేదంటే ఒకపాదము ఈశ్వరుడయితే రెండవపాదము జీవుడుగా ఎలా చెప్తారు? 126

**శ్లో॥ నాన్తర్యస్య బహిర్న నాప్యుభయతః ప్రజ్ఞా న చ జ్ఞాతృతా**
**న ప్రజ్ఞా న ఘనత్వమస్తి జడతా నో నేన్ద్రియగ్రాహ్యతా ।**
**తచ్చాచిన్త్యమశబ్దగమ్యమపదం చైకాత్మధీసారమ-**
**ద్వైతం శాన్తమజం బృహత్తు చరమో జ్ఞేయస్స ఆత్మా స హి ॥ 127**

భావ॥ ఇది తురీయ పాదము. ఈ తత్త్వమునకు తైజసుడయిన స్వప్నపురుషునకున్నట్లే అంతఃప్రజ్ఞలేదు. విశ్వజీవునకున్నట్లు జాగరణములోని అంతఃప్రజ్ఞాలేదు. జాగరణస్వప్న దశలమధ్య నున్నట్లు ఉభయప్రజ్ఞ లేదు. (కునుకు పట్టుతున్నప్పుడుండే సగం తెలిసి సగం తెలియని స్థితి) సుషుప్తిలోని ప్రాజ్ఞుని వలె ప్రజ్ఞాన ఘనత్వం లేదు. ఈశ్వరునివలె సర్వజ్ఞత్వమూ లేదు. ఘటము వలె జడమూ కాదు. విషయములవలె ఏకాదశేంద్రియ గ్రాహ్యత్వమూ (11 ఇంద్రియములు మనస్సు) లేదు. కనుక అచింత్యము అనూహ్యాము, శబ్దముల కందదు. అందాలంటే కావలసిన జాతిగాని, గుణములుగాని, క్రియలుగాని లేవు. గమకమయిన లక్షణములు లేవు. "ఆత్మ ఒక్కటే" అను బుద్ధికి మాత్రమే అందునది, అద్వైతము, శాంతము అజము అనగా జనన మరణాది వికార రహితము, అయిన బ్రహ్మము ఆత్మకు చరమ పాదము. అట్టి ఆత్మయే తెలియదగినది. "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" గదా!

విశే॥ 1) **4 పాదాలు అంటే రూపాయిలో 4 పావలాలున్నాయన్నట్లు. కల్పనయే.** ఆత్మలో నిజముగా నాల్గు భాగాలుగాని నాల్గు కాళ్ళుగాని యున్నాయని కాదు. కనుక ఆత్మలో అంశలు లేవు. అది నిరవయవము.

2) ఆత్మ బ్రహ్మం ఒక్కటే గదా! మఱి ఆత్మకు నాల్గవ పాదం బ్రహ్మం అంటున్నారు గదా! ఒకే వస్తువు తనే పాదము, పాదవంతము ఎలా కాగలదు? - సమా - 'రాహువుతల' అన్నట్లు, బ్రహ్మం యొక్క ఆనందము అన్నట్లు ఇది ఔపచారికము. రాహువుకు మిగిలినదే తల. ఇంక రాహువు తల ఏమిటి? బ్రహ్మమంటేనే ఆనందము. ఇంక బ్రహ్మంయొక్క ఆనందము ఏమిటి? 127

**శ్లో॥ ఆత్మాఽధ్యక్షరమేష ఓమితి తతః పాదాశ్చ మాత్రాస్త్రయోఽ**
**వర్ణో వర్ణమవర్ణకా భవతి తత్రాద్యస్తు వైశ్వానరః ।**

**ఆద్యత్వాద్విభుభావతస్తదుభయోరైక్యం విజానాతి యః**
**కామాన్ సోఽయమయేత్సమాంశ్చ మహతామాదిర్భవేద్ధీమతామ్ ॥128**

భావ॥ ఓంకార వాచ్యుడయిన ఆత్మకు నాల్గుపాదములు చెప్పారు. ఆత్మ పాదాలకు ఓంకారములోని నాల్గుపాదములకు అనగా 'అ ఉ మ, సముదాయములకు' అభేదం చెప్పబడుచున్నది.

ఆత్మ అక్షరములలో ఓంకారస్వరూపము. దీనికి మూడు మాత్రలు మూడు పాదములు. అవి అ, ఉ, మ అనునవి. అందులో మొదటిది వైశ్వానరుడు. అనగా విరాట్పురుషుడు. విశ్వజీవుడు. ఈ అక్షరము ఆద్యము. ఇతర అక్షరములందు వ్యాపకము. విరాట్టుగూడా సర్వప్రపంచవ్యాపి. ఈ రెండింటి ఐక్యమును ఎరిగినవాడు, అందరిలోను మొదటివాడు మహాత్ముడు కాగలడు. అకార వైశ్వానరులు మొదటివారు సర్వవ్యాపులు గనుక ఉపాసక ఉపాస్య – అభేదము వలన ఉపాసకులు గూడా అగ్రేసరులు సర్వవ్యాపి కీర్తిగలవారు అగుదురు. 128

**శ్లో॥ ఉత్కర్షాదుభయత్వతో భవతి చోవర్ణః పునస్తైజస**
**స్తద్విద్ జ్ఞానవివృద్ధిమేతి సమతాం నాస్యాన్వయేఽబ్రహ్మవిత్ ।**
**మానాదప్యయతస్తథా భవతి హి ప్రాజ్ఞో మకారః పున–**
**స్తద్విత్సర్వమిదం మినోతి భవతి త్రైలోక్యహేత్వాత్మకః ॥ 129**

భావ॥ ఉకారము ద్వితీయాక్షరము. ఇది అకారమకారములమధ్యది కనుక ద్విస్వభావమయినది. ఉభయరూపము. ఇది తైజసము హిరణ్యగర్భస్వరూపము. విశ్వవైశ్వానర – ప్రాజ్ఞుల మధ్య నున్నది. ఈ ఉకార తత్త్వము తైజసతత్త్వము. వీటి ఐక్యమును గ్రహించినవాడు జ్ఞానవృద్ధిని పొందగలడు. సర్వసముడగును. శత్రుమిత్రులకు సమానబంధువగును. ఇతని వంశములో బ్రహ్మవేత్తకానివాడు పుట్టడు.

ఇక మకారము మూడవమాత్ర మూడవ పాదము. మానము వలన ప్రాజ్ఞుడగును. మానము అనగా ఇమడటం. అంతర్భవించటం. విశ్వతైజసులు సుషుప్తిలో, విరాట్ హిరణ్యగర్భులు ప్రలయంలోను ప్రాజ్ఞునియందు (ఈశ్వరునియందు) లయమవుతారు. లేదా కుంచముతో ధాన్యమును కొలిచినట్లు, సృష్టి ప్రలయములలో విశ్వతైజసులు కొలవబడుదురు. ఓంకారము నందలి అకార ఉకారములు మకారమునందు లోపలకు ప్రవేశించి బయటకు వెళ్లెదరు. ఇలా మకార ప్రాజ్ఞుల (ఈశ్వర) ఐక్యమును భావించిన వారు సర్వజ్ఞుడగును. వాడే జగత్కారణమయిన ఈశ్వరుడగును. 129

**శ్లో॥ యో బ్రహ్మాత్మతురీయపాద ఇతి సద్ద్వైతోపశాన్తిశ్శివోఽ**
**ద్వైతశ్చావ్యవహార్య ఏష పరమోఙ్కారో హ్యమాత్రః పునః ।**

**ఓఙ్కారో విదుషోదితః ప్రవిశతి స్వాత్మానమాత్మైవ స**
**న్నేవం వేద య ఏష ఆత్మని గతో నో వా పునర్జాయతే ॥ 130**

భావ॥ బ్రహ్మాభిన్నమయిన ఆత్మయొక్క తురీయపాదము ఓంకార పాదస్వరూపము. (రూపాయిని విడదీసి భావనచేస్తే 16 అణాలు 100 పైసలు కావచ్చును. కాని నాణెముగా ఇన్ని ముక్కలు లేవు. ఇవి భావనాకల్పితమయిన భాగాలు. 'ఓం' గూడా అఖండంగా ఒక్కటే కేవలనాదాత్మకం. విడదీస్తే 'అ ఉ మ' అవుతుంది. అలాగే ఆత్మ ఒక్కటే విడదీస్తే విశ్వ, తైజస, ప్రాజ్ఞులు. బ్రహ్మం ఒక్కటే - విడదీస్తే "వైశ్వానర, హిరణ్యగర్భ, ఈశ్వరులు" **కనుక ఈ తురీయపాదము ద్వైతోపశాంతి. శివము అద్వైతము.** అందుకే వ్యవహరింపశక్యము కానిది. (ఎవరితో ఎవరు వ్యవహరిస్తారు. అంతా ఒక్కటే కదా!) **ఇది మాత్రారహితమయిన అఖండమయిన ఓంకారము. జ్ఞాని పలికిన ఓంకారము ఆత్మనే పలుకును.** కనుక అది ఆత్మయే. వాచ్యవాచకములకు అభేదము కదా! త్రిపాదమయిన ఆత్మగా ఉండి అఖండమయిన ఆత్మగా అగును. **ఓంకారాంశలు ఆత్మాంశలు కల్పితములే. వస్తుతః నిరంశములు.** కనుక అఖండ ఓంకారము ఈశ్వరుడే. బ్రహ్మమే. ఇట్లు ఆత్మైక్యమునెరిగిన వానికి పునర్జన్మ లేదు. 130

ఇతి మాణ్డూక్యోపనిషద్వ్యాఖ్యాతా.

శ్రీః

# తైత్తిరీయోపనిషత్

## 1. శీక్షావల్లీ

**శ్లో॥ శం నో మిత్ర ఉదన్వతామధిపతిశ్శం శం న ఏషోఽర్యమా**
**శం నో జిష్ణురసౌ బృహస్పతిరజో విష్ణుర్భవత్వేష శమ్ ।**
**వన్దే బ్రహ్మ నమోఽస్తు మారుత! తవ త్వం బ్రహ్మ సాక్షాదసి**
**త్వం సత్యం చ ఋతం ప్రపాలయ గురుం వక్తారమేనం చ మామ్ ॥131**

భావ॥ బ్రహ్మవిద్యార్థి బ్రహ్మవిద్యా విఘ్న నివారణకై చేయుచున్న శాంతి ప్రార్థన.

నాకు, నాగురువుకు ప్రాణవృత్తికి అహస్సుకు "అధిదేవత" అయిన మిత్రుడు శుభము కలిగించుగాక! అపానవృత్తికి రాత్రికి అధిపతి అయిన వరుణుడు (సముద్రపతి) శుభము కలిగించుగాక! నేత్రమునకు సూర్యమండలమునకు అభిమానదేవత అయిన ఆర్యముడు శాంతి కలిగించుగాక! బలాభిమానదేవత ఇంద్రుడు, వాక్కులకు బుద్ధికి అధిపతిఅయిన బృహస్పతి, శుభము కలిగించుగాక! అనాది, పాదా(అడుగులకు)భిమాని దేవత అయిన విష్ణువు, శుభము కలిగించుగాక! బ్రహ్మమునకు నమస్కారము. వాయుదేవ! నమస్కారము. నీవు ప్రత్యక్ష బ్రహ్మమువు. నీవే సత్యము. నీవే ఋతము. అయ్యా! నీవు వక్త అయిన గురువును శ్రోతనయిన నన్ను కాపాడు.

విశే॥ 1. ఇద్దఱిని గూర్చి "నః" అని బహువచనము వ్రాయుటకు "అస్మదోర్ద్వయోశ్చ" అను సూత్రము ప్రమాణము.

2. విష్ణువు ఉరుక్రముడు. త్రివిక్రముడు. అందువలన పాదములకు అడుగులకు అధిపతి.

3. ఈ దేవతలందరు అనుకూలులయితే విద్యా శ్రవణధారణలు బాగా జరుగుతాయని ఆశ.

4. **ఋతము = విన్నది బుద్ధిలో అనుసంధానం చేయటం. సత్యము = దానిని వాక్కుతో పలకటం** – ఈ వివరణ గురుశిష్య పాఠ ప్రవచనానికి సంబంధించినది. అనుసంధాన ధారణలు ప్రాణాధీనము కనుక వాయు ప్రార్థన.

5. గురువు కృతార్థుడయినా ఆయన మీద ప్రేమాతిశయమువలనగాని, అనారోగ్యాది విఘ్నములు వస్తాయనిగాని గురు రక్షణకోరటం జరిగింది. 131

**శ్లో॥ వర్ణం చ స్వరసామనీ బలమయం మాత్రామితస్సంహితాం**
**స్యాత్కీర్తిస్సహ నౌ చ ధామ పరమిత్యభ్యర్థ్య వేదం పఠేత్ ।**
**పూర్వం రూప మిలా పరన్తు భవతి ద్యౌస్సంహితాయా వియ-**
**త్సన్ధిశ్చేత్యధిలోకమేష పవనస్సన్ధానమిత్యుచ్యతే ॥ 132**

భావ॥ శాంతిని పఠించిన శిష్యుడు అకారాది వర్ణములను, ఉదాత్తాది స్వరములను, సమతారూపమయిన సామమును, బలమును అనగా ప్రయత్న విశేషమును, హ్రస్వదీర్ఘాది మాత్రములను, సంహితను పొందినవాడై, మన ఇద్దఱికి కీర్తి కలుగవలయునని పరంధాముని యాచించి వేదమును చదువవలయును. వేదసంహితలో పూర్వరూపము అనగా పూర్వవర్ణము 'భూమి', ద్యులోకము పరరూపము, సంధి ఆకాశము అగును. అధిలోకముగా వాయువు సంధానకర్త. 132

**శ్లో॥ అగ్నిః పూర్వమథోత్తరస్తు తరణీ రూపం చ సన్ధి ర్జలం**
**సన్ధానం తటిదగ్నిరిత్యధిరుచి ధ్యాయేన్మహాసంహితామ్ ।**
**వక్తా పూర్వపదం పరం త్వనువదన్ శిష్యశ్చ సన్ధిః కలా**
**సన్ధానం వచనం భజేదితి పరాం భక్త్యాధిఽవిద్యం బుధః ॥ 133**

భావ॥ వేదసంహితాధ్యయమన విధానమిది. సంహిత పూర్వరూపము అగ్ని. ఉత్తర రూపము సూర్యుడు. జలము సంధి. సంధానం విద్యుత్. జ్యోతిస్సునందు మహాసంహిత నిట్లు ధ్యానింపవలయును. అలాగే ఆచార్యుడు పూర్వపదము. అనుసరించి పలుకు శిష్యుడు ఉత్తర రూపము. వారిద్దరిమధ్య విద్య సంధి. సంధానకర్త వచనము. ఇది విద్యలో పరాసంహితోపాసనను భక్తిగా చేయు విధము – భక్తి సార్థకత చేకూర్చును. 133

**శ్లో॥ మాతా పూర్వపదం పితోత్తరమథో సన్ధిః ప్రజోత్పాదనం**
**సన్ధానం ప్రభజేదధిప్రజమథాధ్యాత్మం హనుశ్చాధరా ।**
**పూర్వస్తూత్తరముత్తరా భవతి వాక్సన్ధిస్తు జిహ్వోచ్యతే**
**సన్ధానం య ఇదం ప్రవేద స భవేత్స్వర్గప్రజాన్నాదిమాన్ ॥ 134**

భావ॥ ప్రజావిషయంలో మహాసంహితోపాసన ఈ భావనతో చేయవలయును. తల్లి

పూర్వరూపము. తండ్రి ఉత్తరరూపము. సంతానం సంధి. సంధానం జననం (ప్రసవం) అధ్యాత్మ ముగా ఇట్లుపాసన చేయవలయును.

క్రింది హనువు పూర్వరూపము. పై హనువు ఉత్తర రూపము. వాక్కు సంధి. జిహ్వ సంధానము. ఇట్లు ప్రజ, అన్నము, బ్రహ్మవర్చస్సు, పశువులు, కీర్తి చివఱకు స్వర్గము లభించును. 134

**శ్లో॥ సారిష్ఠం తపసా విధిర్విదితవాన్ యం ఛన్దసాం చర్షభో**
**యో విశ్వాత్మక ఏష మే బలయతు ప్రజ్ఞాం మహానీశ్వరః ।**
**ధర్తా జ్ఞానమహం భవేయమనఘా యోగ్యా భవేన్మే తను-**
**ర్జిహ్వా స్యాన్మధురేరణా కరుణయా భూరిశ్రుతౌ చ శ్రుతీ ॥ 135**

(శ్రుత్ – క్విప్)

భావ॥ ఈ ఓంకారమును తీవ్రతపముతో కనిపెట్టెను. వేదములలో లోకములలో దేవతలలో వ్యాహృతులలో (భూః భువః సువః) అత్యంత సారమయినది. వేద గోవులకు వృషభము, విశ్వాత్మకమయినది. మహత్తు, పరము ఈశ్వర రూపమయిన ఓంకారము నా ప్రజ్ఞను బలపఱచుగాక! ఈశ్వరుని కరుణచేత అమృతప్రదమయిన బ్రహ్మజ్ఞానమును నేను ధారణ చేయగలిగెదనుగాక! నా శరీరము పాపరహితముగా యోగ్యముగా ఉండును. నానాలుక మధుర వచనములనే పలుకు గాక! నా శ్రవణము బహువిషయ శ్రవణము చేయగలుగు గాక! 135

**శ్లో॥ కోశోఽసేరివ సర్వదేవ! భవసి బ్రహ్మోపలబ్ధిస్థలం**
**స్వల్పజ్ఞైర్విదితం భవత్యపి న తే తత్త్వం మహావైభవమ్ ।**
**యోగక్షేమవహో మమైధి భగవన్నోఙ్కారబోధస్య భో**
**మాం రక్షేతి ముముక్షురేనమమలః సమ్ప్రార్థయేదన్వహమ్ ॥ 136**

భావ॥ ఓ సర్వదేవ! ఓంకార రూప! నీవు బ్రహ్మం అను కత్తిని దాచిన ఒఱవు. అందువలన బ్రహ్మము నీయందే దొఱకును. మహావైభవమయిన నీ తత్త్వము అల్పజ్ఞులకు అర్థముకాదు. భగవన్! నా ఓంకారజ్ఞానమునకు నీవు యోగక్షేమములను నిర్వహింపుము. అనగా జ్ఞానయోగము కలిగింపుము. అది పోకుండా దారి తప్పకుండా కాపాడుము. ఈ విధముగా నన్ను రక్షింపుము. అని మోక్ష సాధకుడు నిర్మల మానసుడై ఓంకారమును నిత్యము ప్రార్థింపవలయును. 136

**శ్లో॥ లక్ష్మీరస్తు చ తే విభో! కరుణయా సర్వార్థదాఽఽపో యథా**
**నిమ్నం మాసవదబ్దమేతు పరమం మాం బ్రహ్మచారివ్రజః ।**
**త్వద్రూపస్త్వయి సమ్ప్రవిశ్య భగవన్! భూయాసముద్ధ్వస్తశుక్**
**స్వాత్మానం ప్రతిభాసయ త్వమపి మాం లోహం యథాగ్నిః కురు ॥137**

భావ॥ ఓంకారదేవా! నీ దయతో నాకు సర్వార్థ దాయిక అయిన లక్ష్మి కలుగు గాక!

నీరు పల్లమును చేరినట్లు, నెలలు సంవత్సరములోనికి చేరినట్లు బ్రహ్మచారి సమూహము పరమ గురువుగా నన్ను చేరెదరుగాక! భగవన్! నీయందు ప్రవేశించి నీరూపుడనయి సంసారశోక రహితుడను కాగలను. అయ్యా! నీవు నాకు నీ స్వరూపమును నాస్వరూపముగా ప్రతిభాసింప జేయుము. అగ్ని లోహమును అట్లే చేయునుగదా! 137

**శ్లో॥ సన్తి వ్యాహృతయశ్చతస్ర ఇహ భూర్లోకోఽయమగ్నిర్వచః**
**ప్రాణశ్చాథ భువోఽన్తరిక్షమనిలస్సామాన్యపానస్సువః ।**
**లోకోఽసౌ వరుణో యజూంషి పవనో వ్యానో మహో భాస్కర-**
**శ్చన్ద్రో బ్రహ్మ చ భక్తమిత్యధియయుర్భేదం చతుర్ధా చ తాః ॥ 138**

భావ॥ వేదమునందు 4 వ్యాహృతులు గలవు. మొదటి వ్యాహృతి భూః. ఇది ఇహలోకము. అగ్ని, ఋక్కులు, ప్రాణము. భువః అనునది వ్యాహృతి. అది అంతరిక్షము, వాయువు. సామములు, అపానము. సువః అనునది మూడవ వ్యాహృతి. పరలోకము, వరుణుడు, యజుర్వేదము, వ్యానవాయువు, మహః నాల్గవ వ్యాహృతి. సూర్యుడు, చంద్రుడు, బ్రహ్మం, అన్నము, అని నాల్గు మాత్రలు నాల్గుభేదములు ఈ నాల్గవ వ్యాహృతి "ఓం" అను సమష్టి.

విశే॥ 1. అసౌ = ఆముష్మికమయిన లోకము, అయం = ఇహ, అంతరిక్షం = ఇందులో

2. భూః = భూలోకము, అగ్ని, ఋక్కు, ప్రాణము = 4
భువః = అంతరిక్షం, అనిలము, సామ, అపాన = 4
సువః = పరలోకము వరుణుడు, యజుః, వ్యానం = 4
మహః = సూర్య, చంద్ర, బ్రహ్మం, అన్నము = 4
----
16
----

3. ఇందులో

(ఎ) భూ, భువః, సువః - లను భాస్కరుడు వెలిగించును కనుక భాస్కరుడు 'మహః'

(బి) అగ్ని అనిల వరుణులను చంద్రుడు వెలిగించును గనుక చంద్రుడు 'మహః'

(సి) ఋక్సామ యజుస్సులను ఓంకార బ్రహ్మం వెలిగించును గనుక బ్రహ్మ - మహః

(డి) ప్రాణాపానవ్యానములను అన్నం వెలిగించును గనుక అన్నం 'మహః'. 138

**శ్లో॥ ఏతద్వ్యాహృతిరూపకం ప్రథమజం బ్రహ్మాఙ్గిదేవాః పరా**
**అస్యాఙ్గాని చ భూః పదౌ భువ ఇమౌ బాహూ తు మూర్ధా సువః ।**
**అఙ్గీ మధ్యమభాగ ఏవ తు మహస్తద్భృత్పయోజామ్బరే**
**సమ్పూర్ణామృతధీమయద్యుతిమయప్రత్యఙ్మయం తిష్ఠతి ॥ 139**

భావ॥ ఇందులో వ్యాహృతి రూపమయిన త్రయము ప్రధమజాతుడయిన హిరణ్యగర్భుడు. ఆయనయే అంగి. (శరీరంగలవాడు). మిగిలిన దేవతలు ఈ అంగికి అంగములు. అందు భూమి పాదములు. భువర్లోకము బాహువులు. సువర్లోకము శిరస్సు. మహర్లోకము మధ్యమ భాగము. అదే అంగి అయినది. దీని హృదయపద్మమధ్యమున పూర్ణము అమృతము మనోమయము తేజోమయము అయిన ప్రత్యగాత్మ రూపంగా ఆ బ్రహ్మం ఉంటున్నది. 139

**శ్లో॥ మధ్యే తాలుకయోః స్తనాకృతిధృతస్సన్మాంసఖణ్డస్య చ**
**ప్రాప్తా మూర్ధపదం హృదః ప్రతిగతా యోర్ధ్వం చ భిత్త్వా శిరః ।**
**నిర్యాతా సుశిరేన్ద్రయోనిరితి తద్బ్రహ్మాత్మదర్శీ తయా**
**నిష్క్రమ్యాగ్న్యనిలార్కభావమయితో బ్రహ్మాఙ్గి సమ్పద్యతే ॥ 140**

భావ॥ వ్యాహృతి రూపమయిన బ్రహ్మోపాసన చేయు వాని ఫలం ఇది. హృదయమునుండి ఊర్ధ్వముగా సాగినదియు, తాలువుల మధ్యనున్న స్తనం వంటి మాంసఖండమును మధ్యనుంచి మూర్ధస్థానమును చేరినదియు, శిరస్సును అనగా శీర్ష కపాలముల మధ్యగా భేదించికొనినదియు అయిన నాడియే సుషుమ్న. అది ఇంద్రయోని. పరమాత్మను పొందు స్థానము. అది మంచి "శిర". దానిద్వారా బ్రహ్మరూపమయిన ప్రత్యగాత్మను సాధకుడు దర్శించును. ఇంతకుముందు చెప్పినట్లు హిరణ్యగర్భాభిన్నుడయిన మనోమయాత్మను దర్శించు సాధకుడు మూర్ధస్థానమునుండి నిర్గమించి వ్యాహృతి త్రయస్వరూపమయిన అగ్ని – అనిల – అర్క స్వరూపమును పొందినవాడై తరువాత అంగి అయిన "మహః" రూపమయిన హిరణ్యగర్భ బ్రహ్మను చేరును. 140

**శ్లో॥ స్వారాజ్యం స తతః ప్రపద్య చ బలిం గృహ్ణాతి దేవవ్రజా–**
**ద్వాక్చక్షుశ్శ్రుతిచేతసామధిపతిస్సోఽయం సమేషామ్భవేత్ ।**
**కిఞ్చాకాశశరీరమాశయసుఖం సత్యాత్మకం చామృతం**
**ప్రాణారామమపారశాన్తి భవతి బ్రహ్మైవ సోఽయం పుమాన్ ॥ 141**

భావ॥ బ్రహ్మప్రాప్తి వలన ఫలితమిది. బ్రహ్మలోకమును పొందిన యీ పురుషుడు, 'స్వరాట్టు' అగును. స్వయంగా అధిపతి అగును. దేవతలనుంచి పూజను గ్రహించును. అందఱి యొక్క వాక్కులకు నేత్రములకు మనస్సులకు అధిపతి యగును. అనగా సర్వాత్మ అగును. మఱియు ఆకాశమే శరీరము లేదా ఆకాశమువలె సూక్ష్మమయిన శరీరము, మనస్సే ఆనందకరము, సత్యస్వరూపము, (మూర్త – అమూర్తమయినది) ప్రాణములందు క్రీడ, లేదా ప్రాణములకు విశ్రమము – అయినదో అట్టి అపారశాంతి రూపమయిన బ్రహ్మముగా అతడు వెలుగొందును. 141

**శ్లో॥ భూమ్యభ్రద్యుదిశోఽప్యవాన్తరదిశోఽమూర్లోకపాఙ్క్తం జలం**
**వాయుర్భాస్కర ఇన్దురప్యుడుగణః పాఙ్క్తం సురాణామిదమ్ ।**

**ఆపశ్చౌషధయో వనస్పతిగణః ఖం భూతపాఙ్క్తం విరా-**
**ట్పాఙ్క్తానామధిభూతమేవమవదద్వేదస్త్రయం వా ఋషిః ॥ 142**

భావ॥ వ్యాహృతిస్వరూపమయిన బ్రహ్మను పాంక్త స్వరూపముగా నుపాసించు విధానము. పాంక్తములు 3. పంక్తి అను ఛందస్సులో పాదానికి 5 అక్షరాలు. అందువలన ఈ గుంపులో గూడ 5 ఉండుట వలన ఇవి 'పాంక్తములు'.

1. భూమి ఆకాశము (అంతరిక్షము) ద్యులోకం, దిక్కులు, విదిక్కులు – 5. లోకపాంక్తము.
2. జలము, వాయువు, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు – 5. దేవపాంక్తము.
3. ఆపః, ఓషధులు, వనస్పతులు, ఆకాశము, విరాట్ – 5. ఇది భూతపాంక్తము.

ఈ విధముగా వేదము లేదా ఒక ఋషి పాంక్తములను చెప్పెను. 142

**శ్లో॥ ప్రాణాః పఞ్చ చ వాయుపాఙ్క్తమథ దృక్ఛ్రోత్రం మనో వాక్త్వచ-**
**శ్చైతత్త్విన్ద్రియపాఙ్క్తమస్థిపలలం స్నావాపి మజ్జా త్వచా ।**
**పాఙ్క్తం ధాతవమేతదాత్మని మతం పాఙ్క్తత్రయం తేన చా-**
**భిన్నం పాఙ్క్తమిదం సమస్తమితి యో వేద ప్రజేట్ స్యాత్స నా ॥ 143**

భావ॥ పంచప్రాణములు. వాయుపాంక్తములు, నేత్రము, శ్రవణము, మనస్సు, వాక్కు, త్వక్కు (చర్మము) – ఇంద్రియపాంక్తము. అస్థి పటలం, స్నాయువు, మజ్జ, చర్మము – ఇది ధాతు పాంక్తము. ఈ పాంక్తత్రయము అధ్యాత్మము. ఈ అధ్యాత్మ పాంక్తత్రయము పైన చెప్పిన అధిభౌతిక పాంక్త త్రయముతో అభిన్నమని సర్వజగత్తు పాంక్తమని గ్రహించినవాడు, ప్రజాపతి యగును. 143

**శ్లో॥ ఓమిత్యేతదుపాసతే బుధవరా బ్రహ్మోమితీదం సమం**
**హ్యోఙ్కారోఽనుకృతిః క్రతౌ చ విబుధైరో(శ్రావయేత్యుచ్యతే ।**
**సామాన్యోమితి గాయతి ద్విజవరశ్శస్త్రాణి చోంశోమితి**
**హ్యధ్వర్యుః ప్రతివక్తి చోమితి తథా బ్రహ్మ ప్రసౌత్యోమితి ॥ 144**

భావ॥ జ్ఞానులు, బ్రహ్మమును ఓం అని ఉపాసించెదరు. సమస్తము 'ఓం' అని ఉపాసించెదరు. ఓంకారమే అంగీకారమునకు వాడెదరు. (' ఓమిత్యుక్తవతోధ – ' అని మాఘుడు ఆ అర్థములో వాడెను) క్రతువునందు ఋత్విక్కులు "ఓ వినిపింపుము" అని అనెదరు. (అది ప్రైష). ద్విజశ్రేష్ఠుడు సామములను 'ఓం' అని గానము చేయును. శస్త్రమంత్రములను 'ఓంశోం' అని చెప్పును. అధ్వర్యువు "ఓం" అని సమాధానము చెప్పును. అట్లే బ్రహ్మ గూడా 'ఓం' అని అనుమతించును. 144

**శ్లో॥ ఓమిత్యప్యనుమన్యతే క్రతుపతిః కిఞ్చాగ్నిహోత్రం తథా**
**బ్రహ్మాప్యోమితి భాషతేఽధ్యయనతః ప్రారమ్భఏవ శ్రుతేః ।**

**ఏవం కర్మ సమస్తమోమితి కృతం సాద్గుణ్యమాపద్యతే**
**భూయిష్ఠం చ ఫలం దదాతి తదిమాం బ్రహ్మోజ్ఝృతిం చిన్తయేత్ ॥145**

భావ॥ యజమాని అగ్నిహోత్రమును 'ఓం' అని అనుమతించును. బ్రాహ్మణుడు అధ్యయన ప్రారంభములో 'ఓం' అని పలుకును. 'ఓం' అని చేయబడిన సమస్త కర్మ మంచిగా గుణవంత మగును. చాల ఫలితమును ఇచ్చును. కనుక ఈ ఓంకారమును బ్రహ్మముగా ధ్యానింప వలెను. 145

**శ్లో॥ సత్యం చర్తతపోదమాన్ శమమసావాధానమగ్నేస్తతో**
**హోమం చాతిథిపూజనం వ్యవహృతిం భార్యాగమం చర్తుషు ।**
**పుత్రోత్పత్తిమనేన పౌత్రజననం స్వాధ్యాయమధ్యాపనం**
**కుర్యాద్బ్రాహ్మణ ఏషు సత్యతపసీ శ్రేష్ఠే తతోఽ ప్యన్తిమే ॥ 146**

భావ॥ బ్రహ్మవిద్యార్హత సంపాదించటానికి గృహస్థుని కర్తవ్యమిది. ఈ గృహస్థు సత్యము, ఋతము, తపము, దమము, శమము అగ్ని – అధానము, హోమము, అతిథిపూజ, ఉచితమయిన లోకవ్యవహారము, ఋతుకాలములందు భార్యా సంగమము, పుత్రజననము, తరువాత పౌత్రముఖ సందర్శనము, వేదాధ్యయనము అధ్యాపనము – చేయుచుండవలయును. వీటిలో సత్యం తపస్సు గొప్పవి. అంతకన్న గొప్పవి స్వాధ్యాయము, అధ్యాపనము. 146

**శ్లో॥ సంసారాఖ్యమహీరుహస్య వితథస్యాహమ్భవామీరకః**
**కీర్తిః పర్వతపృష్ఠవన్మమ సతీ సంవిస్తృతా భూతలే ।**
**ఊర్ధ్వం మేఽస్తి పవిత్రమత్ర సవితర్యత్యన్తశుద్ధామృతం**
**యత్తత్తుల్యమివాత్మతత్త్వమమలజ్ఞానోఽమృతోఽస్మ్యవ్యయః ॥ 147**

భావ॥ వ్యర్థమయిన అనగా మిథ్య అయిన యీ సంసారవృక్షమునకు ప్రేరకుడను నేను. అనగా అంతర్యామిని. నా సత్కీర్తి యీ భూతలమునందు పర్వతపృష్ఠము వలె పఱచికొన్నది. సర్వాత్మకుడనయిన నా పైన కారణమయిన పవిత్ర బ్రహ్మం ఉన్నది. స్వరూపంగా ఉన్నది. సూర్యుని యందున్న అత్యంత శుద్ధమయిన ఆత్మ తత్త్వము నా ఆత్మతత్త్వమునకు తుల్యమువలె అనగా అభిన్నముగా నున్నది. నేను అమల జ్ఞాన స్వరూపుడను. అమృతుడను. అవ్యయుడను. లేదా అమృతం అనగా మధువు ఆత్మతత్త్వం మధు తుల్యమయినది. కాని తుల్యమనటం తప్పు. 'న తత్సమశ్చాభ్యధికశ్చ' అని గదా శ్రుతి. కనుక తుల్యం లాగా ఉన్నది అనబడినది. 147

**శ్లో॥ సత్యం త్వం వద ధర్మమాచర కృథా మా చ ప్రమాదం క్వచిత్**
**కర్తవ్యే గురవస్త్వయాప్యతిథయః పూజ్యాః పరం మాతరః ।**
**నిన్ద్యం మా కురు కర్మ పూజయ ధియా శ్రేష్ఠాన్ హ్రియా శ్రద్ధయా**
**భీత్యా తత్పదవీమనువ్రజ గురుశ్శిష్యం ప్రశిక్షేదితి ॥ 148**

భావ॥ వేదోపదేశం తరువాత గురువు శిష్యునకు చేసే కర్తవ్యోపదేశములు.

నీవు సత్యమును పలుకుము. ధర్మమును ఆచరింపుము. దేనియందును పొరపాట్లు చేయకుము. కర్తవ్యములను శ్రద్ధగా నెరవేర్చుము. గురువులను అతిథులను తల్లులను పూజింపుము. నింద్యములను చేయకుము. శ్రేష్ఠులయిన వారిని పూజింపుము. సిగ్గుతో శ్రద్ధతో భీతితో పూజింపుము. వారిమార్గములో నడువుము. ఈవిధముగా గురువు శిష్యునికి బోధింపవలెను. 148

శిక్షావల్లి పూర్తి

## 2. ఆనన్దవల్లీ

**శ్లో॥ శిష్యం మాం చ గురుం సహైవ పరమాऽధీతా శ్రుతిస్త్రాయతాం**
**బ్రహ్మ ప్రాశయతాత్సహైవ కరవావాऽऽవాఞ్చ వీర్యం సహ ।**
**తేజస్స్వస్త్వపి నావధీతమనఘం ద్వేషఞ్చ మాభూ త్త్వచి-**
**ద్విద్యాప్రాప్త్యుపసర్గశాన్తయ ఇమాం శాన్తిమ్పఠేత్పాఠకః ॥ 149**

భావ॥ మేము చక్కగా చదివిన పరమ శ్రుతి నన్ను నాగురువును కాపాడుగాక! శ్రుతి నన్ను నా గురువును బ్రహ్మానందమును అనుభవింపనిచ్చుగాక! మేమిద్దఱము కలిసి విద్యాది నిమిత్తమయిన మా సామర్థ్యమునుపయోగించెదముగాక! పరిశుద్ధముగా మేము చేసిన అధ్యయనము తేజస్వియగుగాక! ఎందున్ను మాకు ద్వేషము కలుగకుండుగాక! విద్యాప్రాప్తి విఘ్నములు తొలగటానికి విద్యార్థి యీ శాంతిపాఠమును చదువ వలయును. 149

**శ్లో॥ సత్యం జ్ఞానమనన్తమాత్మనిహితం బ్రహ్మోమ్బరే యః పరే**
**వేద బ్రహ్మవిదేష యాతి పరమం కామాంశ్చ సర్వాన్ స్వయమ్ ।**
**తస్మాద్బ్రహ్మణ ఆత్మనస్సమభవత్ఖం వాయురగ్నిర్జలం**
**భూమిశ్చౌషధయోऽన్నమేష పురుషో మాయావశేన క్రమాత్ ॥ 150**

భావ॥ మన చిత్తమును పరమాకాశమునందు సత్యజ్ఞానానంద స్వరూపమయిన పరమ బ్రహ్మ మున్నది. దాని నెఱిగినవాడు బ్రహ్మవేత్త. అతడు సర్వకామములను స్వయముగా పొందగలడు. ఆ బ్రహ్మమునుంచి ఆకాశము, ఆకాశస్వరూపమయిన బ్రహ్మమునుంచి వాయువు అట్టి వాయువునుంచి అగ్ని జలము భూమి ఓషధులు అన్నము పురుషుడు వరసగా మాయా వశమున జన్మించిరి. 150

విశే॥ 1. "సత్యం జ్ఞాన మనంతంబ్రహ్మ" అన్నది బ్రహ్మయొక్క స్వరూపలక్షణము. ఇందులో బ్రహ్మపదము లక్ష్యము. మిగిలినది లక్షణ వాక్యము.

2. లక్షణం రెండు రకాలు. 1. స్వరూపలక్షణము. 2. తటస్థ లక్షణము.

అగ్నికి ప్రకాశము స్వరూపము. అలాగే బ్రహ్మకు సత్యజ్ఞాన, అనంత, ఆనందములు స్వరూపములు. **స్వరూపేతరమయిన గుణాదులను చెప్పేది తటస్థలక్షణము.** జగత్కారణత్వం మొదలయినవి తటస్థలక్షణాలు. జన్మాద్యస్యయతః, అత్తా చరాచరగ్రహణాత్ వంటివి.

3. సత్యం బ్రహ్మ, జ్ఞానం బ్రహ్మ, అనంతంబ్రహ్మ అని ప్రత్యేకం అన్వయము. నిశ్చితరూపంలో ఉండేది సత్యం. కార్యం అనృతము. "వాచారంభణం వికారో నామధేయం – " అని శ్రుతిచెప్పినది. కారణమయిన మట్టి సత్యము. నిశ్చిత రూపంగా ఉంటుంది. కాని కార్యం కుండ పిడత, చట్టి మూకుడు" ఇలా అనిశ్చితంగా రూప వైవిధ్యంతో కనబడుతుంది. కారణమయిన మట్టి రూపం మాత్రం అనుగతంగా ఉంటుంది. అందువలననే మట్టి వస్తువులుగా గుర్తిస్తాము. కాని కుండను "చట్టి" అనము. చట్టిని పిడత అనము. అట్లే బ్రహ్మం సత్తారూపంగా సర్వప్రపంచమునందు అనుగతంగా ఉన్నది కనుక సత్యము.

4. బ్రహ్మం జగత్తుకు కుండకు కుమ్మరివలె నిమిత్తకారణమా? కుండకు మట్టివలె ఉపాదానకారణమా? నిమిత్తకారణమయితే కుమ్మరివలె కర్త అవుతాడు. బ్రహ్మం కర్తృత్వాది వికారములు గలవాడనాలి. ఉపాదానకారణమయితే మట్టివలె అచేతనం కావాలి. జగత్తు అచేతనం కనుక ఉపాదానం గూడా అచేతనం కావాలి.

5. జ్ఞానం బ్రహ్మ – జ్ఞా – క్త = జ్ఞానం. భావార్థం తెలియటం (తెలివి). అంతేకాని కర్త్రర్థంకాని కర్మార్థంకాని కాదు. కనుక బ్రహ్మం జ్ఞానకర్మగాని జ్ఞానకర్తగాని కాదు. అయితే సర్వజ్ఞుడు సర్వవిత్ – ఎలా అంటాము? సత్యము అనంతము అను విశేషణములతో కలిపిచెప్పటంవలన అవి జ్ఞానకర్తలు కావు కనుక జ్ఞానకర్మలూ కావు గనుక, పైగా కర్తగా అయిన బ్రహ్మము వికారి, నశ్యము కనుక సత్యత్వము అనంతత్వము కుదరవు. పైగా అది జ్ఞాత అయితే అది జ్ఞానజ్ఞేయములకన్న భిన్నమయి తీరును. అపుడది అనంతంకాదు. కాని "యత్ర నాన్యత్పశ్యతి నాన్యద్విజానాతి సభూమా" అను శ్రుతి బ్రహ్మమును అద్వితీయంగా చెప్తున్నది.

"బ్రహ్మ" జ్ఞానమయినా, జ్ఞాతృజ్ఞేయములకన్న భిన్నమయినట్లే గదా! – సమా – ఇది క్రియారూపమయిన జ్ఞానము కాదు. చైతన్యరూపమయిన జ్ఞానము. దీనిని భావ ప్రత్యయం అనటం ఉపచారమే. క్రియ అని కాదు. తెలియటం కాదు "తెలివి". అది జ్ఞానము మాత్రమే అయితే సర్వజ్ఞత ఎలా? అది జ్ఞాతృత్వం కదా? జ్ఞానం కాంతివలె సర్వభాసకం కనుక గౌణంగా అలా అంటారు. కనుక జ్ఞానం చిద్రూపమే. జడం కాదు. కర్త్రాదికం కాదు. ఉపాదానోపాదేయములు ఒకేరకం కానక్కరలేదు. రజ్జు సర్పాదుల యందు రజ్జువు అచేతనం సర్పం చేతనం.

4. జ్ఞానం ఉత్పత్తి వినాశములు గలది. మరి అనంతం ఎలా అవుతుంది? – అదివృత్తి జ్ఞానం ఇది చైతన్యరూపసర్వవ్యాపిజ్ఞానము. దీనికి దేశకాలవస్తువుల వలన భేదం రాదు. ఇది వీటి అన్నింట ఉన్నది. దేశాదులు దీనికి కార్యములు. కారణం కన్న అన్యమయిన వస్తువు లేదు. కనుక అనంతమే. కారణం అయిన మట్టి కార్యం అయిన కుండ కన్న అన్యంకాదు. వివర్తమయిన సర్పంకన్న వివర్తకారణమయిన రజ్జువు భిన్నంకాదు. కనుక బ్రహ్మం సత్యము జ్ఞానము అనంతము. అందుకు భిన్నం కాదు.

5. **సత్యాది శబ్దములు బ్రహ్మమును లక్షణతో బోధించును. అభిధతో బోధించవు.** లక్షణ మాత్రం ఎలా అంటే ధర్మరహితమయినను లక్షణ రావటానికి ఆటంకము లేదని "సిద్ధాంత సింధువులో" నిరూపించాను.

6. "సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ' అన్నవి స్వరూపములన్నారు. ఎలా?

**అందులో జ్ఞానమే స్వరూపం. మిగిలిన రెండూ ధర్మములే.** కనుక "**విజ్ఞానమానందం బ్రహ్మ**' అన్న శ్రుతినిబట్టి "జ్ఞానం బ్రహ్మ" అనేలక్షణం. లౌకికజ్ఞానంకన్న దీనికి భేదము సత్యత్వం. అందువలన సత్యం జ్ఞానం అన్నారు. అనంతం కనుక సత్యం అన్నారు. అంతంగలదయితే సత్యంకాదు. మనకు సత్యం అన్నా నిత్యం అన్నా ఒకటే. అవి రెండూ ఒకేచోట ఉంటాయి.

7. ఆనందో బ్రహ్మ అని ఇచ్చుట ఎందుకు చెప్పలేదు. అదీ బ్రహ్మ స్వరూపమే కదా! – సమా – **ఆనందం జ్ఞానం ఒకటే**. లౌకిక జ్ఞానాలు లౌకిక ఆనందాలు భిన్నాలుగా కనబడతాయి. **కాని చైతన్యరూపమయిన అలౌకిక జ్ఞానానందములు ఏకస్వరూపమే**. కనుకనే జ్ఞానంబ్రహ్మ ఆనందోబ్రహ్మ అని చెప్తాడు. అయితే "విజ్ఞానమానందం బ్రహ్మ" అన్నమాట "ఘట కుంభము" అన్నట్లు పునరుక్తమా? కాదు భాసకత్వం ఆనందకత్వం అనుగుణాలవలన అలా చెప్తారు. తస్య భాసా సర్వమిదం విభాతి, ఏషహ్యేవానందయతి" అనిగదా శ్రుతి. **నిర్గుణపరమాత్మయందు గుణద్వయము మాయాకల్పితము**. కనుకనే నిర్విషయమయిన బ్రహ్మం "సత్యం జ్ఞాన మనంతంబ్రహ్మ" మొదలగు లక్షణములకు విషయమయినది. అంతా మాయాకల్పితమే. వాస్తవంగా బ్రహ్మంలో ఏవిధమయిన గుణాలు విషయత్వాలు లేవు. అది నిర్విశేషము.

8. 'జ్ఞానం బ్రహ్మ' జ్ఞానం అనగా చైతన్యం అన్నారు. ఈ చైతన్యం నిర్విశేషమా? సవిశేషమా? నిర్విశేషం కాదు. సత్యత్వం వంటి విశేషాలున్నాయి కదా! సవిశేషమంటారా? – సవిశేషమయినవి సత్యము నిత్యము కావు. నశ్యములే. ఎలా? – సమా – నిర్విశేషమే. సత్యము ఆనంతము అయినది కనుకనే ఆ జ్ఞానము నిర్విశేషం అవుతుంది. కేవల జ్ఞానమయితే లౌకికం కావచ్చును అలౌకికం కావచ్చును. కనుక "సత్యం అనంతంజ్ఞానం" అన్న పదసమూహానికి "నిర్విశేషచైతన్యమ"ని అర్థము. అంతేతప్ప సత్యత్వం అనంతత్వం కల జ్ఞానము – అని కాదు. అనగా జ్ఞానమని చైతన్యమని తేలుతుంది. బ్రహ్మమన్నా చైతన్యమే. అయితే; ఈ వాక్యమునకు

సత్యం అనంతం జ్ఞానం – బ్రహ్మ "బ్రహ్మ – బ్రహ్మ" అని ఆకారం తేలుతుంది. జ్ఞానం బ్రహ్మ అనగా "ఘటం కుంభం" అన్నట్లే గదా! – సమా – కాదు. "ఏది సత్యానంతచైతన్యమో అదే బ్రహ్మము" అని నిర్వచించినట్లు – ఎలాగంటే "ఘటం అనగా కుండ" అని చెప్పినట్లు. లేదా "ప్రకృష్ట ప్రకాశః చంద్రః" లో ("నక్షత్రములలో కనబడే ఆ పెద్దవెలుగే చంద్రుడు" అన్నట్లు) లక్షణవలన ఆ వాక్యము చంద్రవ్యక్తిని చెప్తుంది. **అలాగే సత్యంజ్ఞానం – అను వాక్యం గూడా బ్రహ్మమును లక్షణయా బోధించును**. అది వాక్కులకు నేరుగా అందదు. లక్షణయా అర్థం చెప్పాలి. అందుకే "యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసాసహ" అని శ్రుతి.

9. **సత్యాది పదములు దేనికది లక్షణతో బ్రహ్మమును బోధించును.** చూడండి. "ఘటస్సన్ పటస్సన్ ఘటోస్తి – పటోస్తి" – ఇందలి అస్తిత్వం సమానంగా కనబడుతున్నది. ఈ అస్తిత్వం (సత్త) బ్రహ్మమును లక్షణయా సూచించును. అదే సత్యం బ్రహ్మ. **ఇక జ్ఞానం బుద్ధివృత్తి విశేషం. దీనివలన లక్షణయా బ్రహ్మం అని అర్థం వస్తుంది.** అలాగే **గగనం మొదలయినవి లోకంలో అనంతములు, కనుక అనంతశబ్దము లక్షణయా బ్రహ్మమును చెప్తుంది.** అయితే ఇలా ఈ **పదాలు కలిసి ఉండటం వలననే లక్షణయా బ్రహ్మమును చెప్తాయి.**

ఎలాగంటే; సత్యం అనగా సత్ "సత్యం బ్రహ్మ" "సదేవ సత్యమ్" స న ఘటః – అన్నపుడు ఘటం గూడ సత్తు. కనుక సత్యమయిన ఘటాదివస్తువే బ్రహ్మం అవుతుంది. కనుక జ్ఞానం అనంతం అని చెప్పారు. ఘటం సాంతం జడం కనుక అది బ్రహ్మం కాదు. అలాగే జ్ఞానం బ్రహ్మం అంటే బుద్ధి ధర్మమయిన విషయజ్ఞానాదులు బ్రహ్మం అవుతాయి. కాని అవి సాంతములు. కనుక బ్రహ్మం కాదు. అనంతం బ్రహ్మ అంటే ఆకాశంగూడా బ్రహ్మం అవుతుంది. అందువలన సత్యం జ్ఞానం అన్నారు. గగనం జ్ఞానం కాదు. ఈరెండుచోట్ల 'సత్యం' పదము అల్పప్రయోజనమయినది.

దీనివలన మూడులక్షణాలు వచ్చినాయి.

1. అనంతము సత్యమూ అయిన జ్ఞానము
2. జ్ఞానము అనంతము అయిన సత్యము
3. సత్యము జ్ఞానము అయిన అనంతము బ్రహ్మము.

10. వాస్తవంగా అయితే "సత్యం బ్రహ్మ, జ్ఞానం బ్రహ్మ, అనంతం బ్రహ్మ" అని విడివిడిగా అన్యోన్య సాపేక్షత లేకుండానే **లక్షణ లేకుండానే అభిదతోనే బ్రహ్మమును చెప్పును.** సత్యమంటే కాలత్రయములోను బాధలేని వస్తువు. ప్రపంచం సర్వం జ్ఞానంతో పోయేదే. అలాగే వ్యవహారికంగా చూస్తే మరణం చేత ప్రలయం చేత పోయేదే. అవ్యాకృతమయిన వస్తువు బ్రహ్మ భిన్నము, అభిన్నము అని నిర్వచింపలేము. కనుక అది వస్తువు కాదు.

"జ్ఞానం" అనగా స్వయంప్రకాశము అయిన కేవల చిత్తు. అదే బ్రహ్మము. బుద్ధివృత్తి జ్ఞానము స్వయం ప్రకాశము కాదు. చైతన్యము దానిని వెలిగించాలి. అవ్యక్తము నుంచి దేహందాకా అన్ని జడములు చైతన్యప్రకాశనీయములు.

అట్లే అనంతం బ్రహ్మం మాత్రమే. మిగిలినవ్ని సాదులు, సాంతములు.

ఇలా బ్రహ్మం సత్యాదిశబ్దవాచ్యమయితే శబ్దములకు అందినట్లే గదా! "యతో వాచో నివర్తంతే–" అని బ్రహ్మం శబ్దాదులకు అందదని చెప్పిన శ్రుతితో విరోధం కదా! – కాదు. అది పరమార్థదశలో సంగతి. వ్యవహారంలో సంగతి కాదు.

" తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి"

" శాస్త్రయోనిత్వాత్ "

" వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః" అని గూడా శ్రుతులు చెప్పినాయి గదా! కనుక సత్యజ్ఞానఅనంత శబ్దములు బ్రహ్మం విషయంలోనే ముఖ్యం. ఘటాదుల విషయంలో వృత్తిజ్ఞానం విషయంలో ఆకాశం విషయంలో అవి ఔపచారికములు.

**(అంటే సత్యాది శబ్దాలకు వ్యావహారికార్థం ముఖ్యమనుకొంటే బ్రహ్మం లక్ష్యార్థం. పరమార్థం ముఖ్యమనుకొంటే వ్యావహారికార్థం గౌణము.)**

11. ఆత్మని = బుద్ధియందు. ప్రత్యగాత్మకాదు. అదే బ్రహ్మం కదా! సర్వగతమయినది కనుక బుద్ధిగతంగూడా కావచ్చు. (సర్వగత–ఆకాశము కుంభగతం అవుతుంది గదా!) బుద్ధిగతం అని చెప్పటం దేనికి? – అది సర్వవ్యాప్తమయినా మనకు తెలియదు. బుద్ధిలోనే తెలుస్తుంది. ప్రత్యగాత్మ బుద్ధియందు ఉపహితం ప్రతిబింబితం కదా! అదే బ్రహ్మం. ఆ చైతన్యమే బ్రహ్మ. బ్రహ్మభూతుడై సమస్తకాలములను పొందుతాడు. అనగా ప్రకాశింపజేస్తాడు. ఎందుకంటే వానికి కామములు లేవు. ద్వైతమే లేదుగదా! లేదా సమస్త కామములు తనయందు కల్పితములని గ్రహించును. అనగా సర్వజ్ఞుడవుతాడు. ఇదంతా లోకదృష్ట్యా. కాని వస్తుతః బ్రహ్మం అద్వితీయం కదా! కనుక అది సర్వజ్ఞము కాదు. లేదా సర్వకామస్వరూపుడవుతాడు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనిగదా! లేదా, బ్రహ్మవేత్త సర్వం అవుతాడు. సమస్త కామాలను పొందుతాడు. అనగా బ్రహ్మవేత్త బ్రహ్మమే కనుక సర్వజీవస్వరూపుడు కనుక సర్వజీవుల కామసాఫల్యములు ఆయనవే. లేదా సర్వకామభోగజన్యమయిన సర్వానందములు అతని స్వరూపమే అవుతాయి. లేదా సర్వజీవమోక్షం దాక ఈశ్వర సాయుజ్యం కనుక అలాగయినా సర్వకామభోగము.

12. సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ – అంటారు 'బ్రహ్మవి త్పరమాప్నోతి' అంటారు. "స సర్వాన్ కామాన్ అశ్నుతే" అంటారు – ఇదంతా వంధ్యాసుతవృత్తాంతము. అసలు బ్రహ్మ ఉంటే గదా! – ఇదంతా

" మృగతృష్ణాంభసిస్నాతః ఖపుష్పకృతశేఖరః

ఏష వంధ్యాసుతోయాతి శశశృంగధనుర్ధరః" అన్నట్లుగా ఉన్నది.

సమా – కార్యం అయిన ప్రపంచం ఉన్నది. కార్యం కారణం లేనిదే ఉండదు. కారణంగా బ్రహ్మను అలా ఊహిస్తాము.

13. మాయవలన సర్వం సంభవమే. కనుక సచ్చిదానంద బ్రహ్మమునుండి అనృతజడ దుఃఖాత్మక ప్రపంచం వచ్చింది. **శుద్ధ బ్రహ్మము నుంచి ఆకాశాదికం రాలేదు. సగుణుడయిన ఈశ్వరుని నుంచియే వచ్చింది.** మాయావి అయిన ఈశ్వరుడే బ్రహ్మము. అది శుద్ధరూపము. కనుక ఈశ్వరుడు బ్రహ్మము ఒక్కడే. మాయావిని బ్రహ్మం అని ఎలా అంటాము – మాయకన్న విడిగా ఉన్న తత్త్వము శుద్ధమే కదా! (గారడీ చేయక మౌనంగా ఉన్న గారడీవాడు – లాగా)

14. ఆకాశం అజం కాదు. జన్యమే. సుషుప్తిలో లేదు. జాగర స్వప్నములలో పుట్టినట్లు లెక్క. బ్రహ్మమయితే సుషుప్తిలోనూ సాక్షి రూపంగా నున్నది. సాక్షిలేకపోతే సుషుప్తియున్నట్లు గూడా అంగీకరించము. కనుక ఆకాశము సాది. దృశ్యము. శబ్ద గుణవంతము. కనుక అది మిథ్యయే. మాయామయం గదా! మాయగూడా సుషుప్తియందు అజ్ఞాన రూపంగా కనబడుతున్నది. జాగరాదుల యందును "నేను అజ్ఞుడను" అని అనుభవమున్నది గదా! బ్రహ్మం మాత్రం దృశ్యంగాదు. సాక్షి.

15. ఆకాశమునకు శబ్ద గుణం. ఆకాశజమైన వాయువుకు స్పర్శ శబ్దములు, వాయుజమైన అగ్నికి రూప స్పర్శ శబ్దములు, అగ్నిజమైన జలమునకు రసము మిగిలిన రూపాదులు, జలజన్యమయిన భూమికి గంధము+పై గుణములు మొత్తం "5" గుణములు గలవు. ఇలా పైనుంచి కారణగుణాలు. కార్యములందు సంక్రమించును.

16. పురుషుడు స్థూలదేహధారి. శుక్లశోణితాత్మక దేహము.

17. ఈవిధంగా బ్రహ్మ ధర్మములయిన సత్య, స్ఫురణ ఆనందములు కార్యములందు సంక్రమించటం వలన "అస్తి భాతి ప్రియం" అను భావనలు వ్యవహారంలో కనబడుచున్నవి. కనుక సర్వకారణం అయిన బ్రహ్మం ఉన్నదనే పొందవలెను.

**శ్లో॥ ఏతస్యాన్నరసాత్మకస్య పురుషస్యేదం శిరో దక్షిణః**
**పక్షో బాహురయం తు సవ్య ఇతరః పక్షో భుజస్త్వుత్తరః ।**
**ఆత్మాఽయం తనుమధ్యభాగ ఇదమప్యఙ్గస్తు నాభేరధః**
**పుచ్ఛం తద్గరుడాయతే స పురుషో యోఽసౌ మనుష్యాభిధః ॥ 151**

భావ॥ మనుష్యసంజ్ఞగల ఈ పురుషుడు గరుత్మంతుని వలె కనబడుచున్నాడు. అన్నరసమయ మయిన స్థూలదేహంగలయీ పురుషుని శిరస్సు పక్షి శిరము. సవ్యమయిన బాహువు దక్షిణ (కుడి) పక్షము. (ఱెక్క) అపసవ్యమయిన బాహువు ఎడమ ఱెక్క. శరీర మధ్యభాగం ప్రధానమయినది గనుక అది ఆత్మ. నాభిక్రింద నున్న మిగిలిన శరీరము గరుత్మంతుని తోక,

ఇదంతా అన్నమయకోశము. ఎందుకంటే అన్నరసరూపమయిన రేతస్సు నుండి పుట్టినది. అన్నరసముతో పెరుగుతుంది. నేనుమనుష్యుడను అన్న అభిమానం దీనివలననే వస్తుంది. 151

**శ్లో॥ ఏతస్మాత్పర అన్తరోఽన్నమయతః ప్రాణోఽయమాత్మా తతః**
**పూర్ణోఽయం పురుషః పుమాకృతిరయం మూషాక్తతామ్రాదివత్ ।**
**ప్రాణః ప్రాణమయస్య తస్య తు శిరో వ్యానో గరుద్దక్షిణో-**
**పానస్తూత్తర ఆత్మతి స్మ గగనం పుచ్ఛం ప్రతిష్ఠా ధరా ॥ 152**

భావ॥ ఈ అన్నమయకోశంకన్న ఆంతరమయిన కోశము ప్రాణమయకోశము. కొందఱు ప్రాణములను "ఆత్మ" అనెదరు. మూసలో పోసిన రాగివలె ఈ ప్రాణము శరీరమునందంతటా వ్యాపించి ఉన్నది కనుక ఈ శరీరము ప్రాణాకారము. ఈ ప్రాణపురుషునికి శిరస్సు ప్రాణము. వ్యానము కుడిఱెక్క. అపానము ఎడమరెక్క. ఆకాశము ఆత్మ. భూమి ఆధారభూతమయిన పుచ్ఛము. 152

విశే॥ 1. చార్వాకాదులు అన్నమయకోశమును ఆత్మ అంటారు. దేహంలోపలిదయిన ప్రాణమే ఆత్మ అని మరికొందరు.

2. గగనం అనగా సమానమను ప్రాణము. అది ఆకాశములో ఉండునది కనుక "ఆకాశం" అనియు పేరు. మామూలు ఆకాశం కాదు. విషయం పంచప్రాణాలకు సంబంధించినది గదా! సమానం శరీర మధ్యంలోనిది గనుక 'ఆత్మ' అన్నారు. "మధ్యంహ్యే షామంగానామాత్మ" అని శ్రుతి.

3. ఆధ్యాత్మికమయిన ప్రాణమును పట్టియుంచునది అపానము. అది శరీరంలో క్రిందిది. "సైపా పురుషస్యాపానమవష్టభ్య" - శ్రుతి. లేదంటే ఉదానప్రాణబలంతో శరీరం పైకి పోయేది. బరువు కనుక క్రిందపడిపోయి ఉండేది.

(4. ఆత్మతి - కాని టిలోపం రాదు. ఆత్మానతి కావాలి. - అనువాదక)

**శ్లో॥ ఏతస్మాత్తు పరో మనోమయ ఇతి ప్రాణోఽన్తరాత్మాఽమునా**
**పూర్ణోఽయం పురుషాకృతిర్భవతి వై కోశోఽస్య మూర్ధా యజుః ।**
**పక్షో దక్షిణ ఏవ తస్య ఋగథో పక్షస్తు సామోత్తర-**
**స్త్వాత్మా బ్రాహ్మణమఙ్గిరాస్స పరమోఽథర్వా చ పుచ్ఛం మహత్ ॥153**

భావ॥ ప్రాణమయకోశముకన్న పరమయినది మనోమయకోశము. ఇది ప్రాణమయ కోశమునకున్ను లోపలిది. మనస్సుతో నిండిన ప్రాణమయకోశమే మనోమయకోశము. ఇదియును పురుషాకారము. ఈ మనోమయకోశమునకు పక్షి భావన ఇది. దీనితల యజుర్వేదము. కుడి ఱెక్క ఋగ్వేదము. ఎడమ ఱెక్క సామవేదము. బ్రాహ్మణం ఆత్మ. అది పరమము. అధర్వాంగిరములను ఋషులు మంత్రద్రష్టలు - ఈ పక్షికి ప్రతిష్ఠ అయిన పుచ్ఛము. 153

విశే॥ ప్రాణము ఆత్మకాదు. అది ఒక కోశము. దేహం వంటిది. దానికన్న లోపలిది కనుక మనస్సు ఆత్మ. ఇది "మనస్సు ఆత్మ" అనువారి మతము. మనస్సుగూడా ఆత్మకాదు. "కత్తికి ఒఱ"లాగా ఆత్మకు ఇది ఒక ఆవరణ కోశము.

**శ్లో॥ ఏతస్మాచ్చ మనోమయాత్పరతరం విజ్ఞానమాత్మాఽఽన్తరం**
**పూర్ణ స్తేన మనోమయో హి పురుషాకారశ్చ కోశోఽసకౌ**
**శ్రద్ధా శీర్షమృతస్తు దక్షిణగరుత్సత్యస్తు తస్యోత్తర-**
**స్త్వాత్మా యోగ ఇవాస్య దీప్యతి మహత్పుచ్ఛం ప్రతిష్ఠా పరమ్. 154**

భావ॥ ఈ మనోమయకోశముకన్న మరింత అవతలిది సూక్ష్మమయినది అంతరమయినది విజ్ఞానమయకోశము. ఆ విజ్ఞానమే ఆత్మ. విజ్ఞానమయకోశమునందు మనోమయకోశము వ్యాపించి మనుష్యాకారమయి యున్నది. ఇదియు కోశమే. దీనికి పక్షిసామ్యము గలదు. దీనికి శీర్షము శ్రద్ధ. ఋతము కుడిఱెక్క. ఎడమఱెక్క సత్యము. యోగమే ఆత్మ. లేదా యోగం ఆత్మలాగా వెలుగుచున్నది. హిరణ్యగర్భుడను పేరుగల మహత్తత్త్వము దీనికి ప్రతిష్ఠ అయిన పుచ్ఛము. 154

విశే॥ విజ్ఞానాత్మవాదులు విజ్ఞానమే అనగా బుద్ధియే ఆత్మ అని అంటారు. అదీ ఒకకోశమే. కనుక ఆత్మకాదని నిర్ణయం.

**శ్లో॥ అస్యానన్దమయోఽన్తరస్తి హి పరశ్చాత్మామునా పూరితః**
**పూర్వోఽయం పురుషాకృతిః ప్రియమముష్యాఙ్గం ప్రధానం ఖలు ।**
**మోదో దక్షిణ ఉత్తరో భవతి వై పక్షః ప్రమోదస్తథా**
**చాత్మాఽఽనన్ద ఇవాస్య పుచ్ఛమథ తద్బ్రహ్మ ప్రతిష్ఠా పరమ్ ॥ 155**

భావ॥ విజ్ఞాన(బుద్ధి)మయకోశమున కన్న పరమయినది, అంతరమయినది ఆనందమయకోశము. ఇది విజ్ఞానమయమునకు లోపలనున్నది. బుద్ధిమయకోశమునందు వ్యాపించిన ఆత్మ పురుషాకారము దాల్చినదే. దీనికి శిరస్సు ప్రియము. మోదము కుడిఱెక్క. ప్రమోదము ఎడమఱెక్క. ఆనందము ఆత్మ. పరబ్రహ్మం ప్రతిష్ట. పుచ్ఛం. 155

విశే॥ 1. ఆనందప్రచురమయిన అవ్యాకృతం (అవ్యక్తం) అయిన అజ్ఞానమను కారణశరీరమే ఆనందమయకోశము. **ఆత్మ అయితే ఆనందమే. ఆనందమయం కాదు.** "విజ్ఞానమానందం బ్రహ్మ" అని శ్రుతి. బ్రహ్మం ఆత్మయే కనుక ఆత్మ ఆనందమే. ఆనందమయం కాదు. చూడండి. "తత్త్వమసి, అయమాత్మా బ్రహ్మ".

2. ప్రియం = ఇష్టపుత్రాది దర్శనం వలన వచ్చే సుఖం

మోదః = ప్రియలాభం వలన వచ్చే సంతోషం ప్రమోదః = అధిక సంతోషం

3. ఆనందమే ఈ కోశమునకు 'శరీరంలో ఆత్మలాగా' ముఖ్యస్థానమునందు – మధ్యలో నుండును. ఆనందము – సుఖసామాన్యము.

4. ఆనందం అన్నది పరబ్రహ్మమే. అది శుభకర్మలు కారణంగా పుత్రమిత్రాది - ఉపాధులు నిమిత్తంగా అంతఃకరణవృత్తిలో ప్రతిబింబిస్తుంది. అదే విషయసుఖం అంటారు. వృత్తిజ్ఞానమయిన ఆనందాదులు క్షణికాలు. వృత్తి అస్థిరము. విద్యాపరిశుద్ధమయిన అంతఃకరణంలో శాశ్వతసుఖం బ్రహ్మమయి స్ఫురిస్తుంది.

5. పరబ్రహ్మం పుచ్ఛం అంటే అదే పరమాధారం అని అర్థము. అవిద్యాకల్పిత ద్వైతమంతటికి బ్రహ్మము అవధి గదా!

**శ్లో॥ ఏతస్యాన్తరమాశ్రయం పరతరం వాచో హృదోఽగోచరం**
**బ్రహ్మానన్దమభేదమేత్య భజతే భీతిం కుతశ్చిన్న నా ।**
**కోశైః పఞ్చభిరావృతం బృహదిదం స్వాత్మానమస్తీతి యో**
**వేదైనం ప్రవదన్తి సన్తమితరం నిన్దన్త్యసన్తం బుధాః ॥ 156**

భావ॥ ఈ ఆనందమయకోశమునకు అంతరమయినది, ఆధారమయినది, పరతరమయినది వాక్కుకు హృదయమునకు గోచరముకానిది, అగు బ్రహ్మానందమును భేదరహిత విభాగముగా పొందిన వ్యక్తి ఎవరినుండి భయమును పొందదు. ఈ పంచకోశముల మధ్య ఆవృతమయి యున్న యీ బ్రహ్మమును తన ఆత్మనుగా గ్రహించి "అస్తి" అని ఎవడు గ్రహించునో వాడు "సన్" అని, అలా గ్రహించని వానిని "అసన్" అని పండితులు అందురు. 156

విశే॥ 1. ఆనందమయంగూడా 'ఆత్మ' కాదంటే ఇక 'ఆత్మ' లేనట్లే గదా! శూన్యవాదం అవుతుంది. అయితే ఆనందమయం ఒక సంచి అన్నాము. అది ఒక ఆవరణం. ఆ ఆవరణం ఎవరికి ఉన్నట్లు? ఆ వస్తువే ఆనందరూపమయిన బ్రహ్మము. దానినే పుచ్ఛమని ప్రతిష్ఠ అని చెప్పారు.

2. భీతి ఎందుకుండదు - బ్రహ్మము తానే కనుక అది అద్వితీయం కనుక ఎవరినుంచి భయం?

3. బ్రహ్మం లేదన్నవాడు అసన్ ఎందుకవుతాడు? బ్రహ్మం తానే కనుక తాను లేనని చెప్పినట్లు గదా! నాకు నాలుక లేదని చెప్పినంతగా పరిహాసప్రాయం. అజ్ఞానం.

4. ఆకాశాదిసృష్టిని చెప్పింది శ్రుతి. కనుక జగత్తుకు కారణంగా బ్రహ్మ ఉన్నదని సాధింపబడినది. కోశపంచకం చెప్పటం వలన కోశాంతరంలో 'ఆత్మ' ఉన్నట్లు సాధింపబడినది. 'ప్రత్యగాత్మ, పరబ్రహ్మం' ఒక్కరే కనుక ఈ రెండింటి అస్తిత్వం చెప్పబడినట్లే, కనుక సర్వాంతరం (లోనిది), సర్వవిలక్షణం, సర్వకారణం, శరీరంలో ప్రత్యగాత్మ, అయిన సత్యజ్ఞానానందములు స్వరూపముగా (గుణంగాకాదు) గల బ్రహ్మము ఒక్కటే అద్వితీయము. అని తెలియదగును. దానివలన మోక్షం. అనగా తన బ్రహ్మస్వరూపానుభవము పొందటం.

**శ్లో॥ యోఽన్నం బ్రహ్మ విచిన్తయత్యయమయేదన్నం ప్రభూతం పుమాన్**
**ప్రాణం యస్తు స దీర్ఘమాయురథ యో విజ్ఞానమేనాంస్యయమ్ ।**

**హిత్వాఽజ్ఞేఽఖిలకామసఙ్ఘయమిదం సర్వం హ్యనిత్యన్తతో**
**బ్రహ్మైకం విదుషా విచిన్త్యమమృతం తచ్చిన్తనాత్సోఽమృతః ॥ 157**

భావ॥ 'అన్నం బ్రహ్మ' అని ఉపాసన చేసిన వాడు అన్నసమృద్ధిని పొందును. ప్రాణం బ్రహ్మ అని ఉపాసన చేసినవాడు గొప్ప ఆయువు పొందును. విజ్ఞానమే ఆత్మ అని ఉపాసించువాడు మంచి బుద్ధిగలవాడై పాపరహితుడై సమస్త మనోరథములను పొందును. కాని ఈ వాంఛాసమూహము అనిత్యము. కనుక అన్నాదిలోభంతో ఈ ఉపాసనలు వదలి అమృత స్వరూపమయిన బ్రహ్మము నొక్కదానినే చింతనచేసినవాడు స్వయంగా అమృతుడగును. 157

విశే॥ 1. మందమతులయినవారికి 'జ్ఞానం' రాదు. కనుక వారికొఱకు "అహం బ్రహ్మాస్మి" అను చింతన చెప్పబడినది. దానివలన అమృతత్వం వస్తుంది. బ్రహ్మం అమృతం కదా! ఇది అభేద చింతనం కదా!

**శ్లో॥ ఈక్షిత్వా పరమేశ్వరస్స హి బహు స్యాం చ ప్రజాయేయ చే-**
**త్యాలోచ్యాథ సమస్తమేతదకరోజ్జీవాత్మనా ప్రావిశత్ ।**
**మూర్తామూర్తజడాజడానృత ఋతప్రాయం ప్రవిశ్యాఖిలం**
**సోఽభూత్సత్యమిదం హి సర్వమమునా సత్యన్తు తమ్భావయేత్ ॥ 158**

భావ॥ ఆపరమేశ్వరుడు సంకల్పించాడు. తాను అనేకంగా కనబడాలని అనేకంగా జన్మించాలని. ఈ ఆలోచనతో ఈ సమస్తమును సృజించెను. జీవరూపంతో అందులోనికి ప్రవేశించెను. మూర్తము అమూర్తము, జడము, అజడము, ఋతము, అనృతము అయిన వీటిలో ప్రవేశించి ఈ అఖిలంగా అయినాడు. ఇదంతా అజ్ఞానుల దృష్టిలో సత్యమయిన ఈ ప్రపంచమునుబట్టి కర్తగా ఆ సత్యవస్తువును భావింపవలయును. 158

విశే॥ 1. బ్రహ్మం అనువస్తువు ఉన్నదా? లేదా? ఉంటే ఎందుకు దొరకటం లేదు. దొఱకని దానిని శశశృంగంవంటి దానిని ఎలా ఉన్నదనుకోనటం? లేదంటే ఎందుకు దాని చింతన. అమృతత్వం ఎలా వస్తుంది. కుందేటికొమ్మును ధ్యానం చేసినా అమృతత్వం లభిస్తుంది - అంటారా? - సమా - జగత్కారణంగా బ్రహ్మమును ఊహించాలా? సృష్టికి ముందు బ్రహ్మంకన్న మరో వస్తువు లేదనాలి. కనుక జగత్తుకు ఉపాదానం నిమిత్తం బ్రహ్మమే అనాలి. కనుక జగత్తునుబట్టి బ్రహ్మము నూహించటం సరయినదే. పరమాత్మయే ప్రపంచం అయినాడు గదా!

2. తాత్పర్యమిది. వృక్షమును చూచి దానికి విత్తనం ఉంటుందనుకొంటాము. అలాగే జగత్తును బట్టి జగత్కారణమయిన బ్రహ్మమును ఊహిస్తాము. బీజం బీజంగా దొరకకపోయినా చెట్టురూపంలోనున్నట్లు సత్యమని, సత్తని భావిస్తాము. అలాగే కనబడని బ్రహ్మము జగద్రూపంగా కారణం కార్యంగా పరిణమిస్తుందికదా! కార్యం సత్యంకదా! జీవుడయితే అందరికి "అహంసుఖీ"

మొదలయిన అనుభవాల రూపములో దొరకుతున్నాడు గదా! ఆ జీవుడు పరమాత్మయే. పరమాత్మ జీవుడుగా శరీరములలో వ్యాపించాడు గదా! కనుక జీవుడు సత్యం. కనుకనే బ్రహ్మమూ సత్యము.

పైగా దొరికేదే సత్యమన్న నియమం లేదు. దొరకించికొనే జీవుడున్నూ సత్యమే. ఆ జీవుడు బ్రహ్మమే కదా! అందువలన బ్రహ్మమూ సత్యమే.

3. బ్రహ్మం జీవ స్వరూపంతో అంతట ప్రవేశించినదను మాట కుదరదు. చేతనములందే జీవుడు కనబడుచున్నాడు. అచేతనములందు లేడనాలి – సమా – జీవుడు విభువు. చేతన – అచేతన అను విభాగం బుద్ధినిబట్టి వస్తుంది. **బుద్ధిగలవి చేతనంగా కనబడతాయి**. అలా అయితే సర్వవ్యాపి అయిన జీవుడు శరీరములలో ప్రవేశించటం ఎలాకుదురుతుంది? – లేనిచోట గదా ప్రవేశించటం? లేదంటే అనిత్యత్వం వస్తుంది. విభుత్వం పోతుంది. – సమా – 'ప్రవేశం' అంటే, జీవబ్రహ్మాభేదమే. లేదా అఖండమయిన బ్రహ్మం శరీరాది ఉపాధుల ద్వారా ఖండములయినట్లు కనబడటం ప్రవేశంగా చెప్పబడినది. అదే దాని జీవత్వం.

4. అంతఃకరణంలో కనబడేచైతన్యం జీవుడు. ఎదురుగా ఘటాది విషయాలలోనుండే చైతన్యం బ్రహ్మం. కనుక జీవుడుగా విషయాలలో లేడనాలి గదా! – సమా – అది జీవబ్రహ్మాభేదం చెప్పటానికి కల్పించిన విశ్లేషణ.

5. ప్రవేశం ప్రతిబింబరూపంగా జరిగినదనరాదు. బుద్ధిలో ప్రతిబింబంపడినా ఘటాదుల యందు కుదరదు కదా! సర్వంలోనూ ప్రవేశించాడు గదా!

6. సర్వం బ్రహ్మమే అన్నారు అది ఎలా? – గృహంలో ప్రవేశించినవాడు గృహము కాడు గదా! అలాగే సర్వంలో ప్రవేశించినవాడు సర్వం ఎలా అవుతాడు? – సమా – ఘటంలో ప్రవేశించిన మట్టి ఘటమవుతుంది. ప్రశ్న : కాని మట్టి వలన ఘటంతయారవుతుంది గాని తయారయిన ఘటంలో మట్టి ప్రవేశించదు. బ్రహ్మం అయితే "తత్సృష్ట్వాతదేవ అనుప్రావిశత్" అని సృష్టమయిన ప్రపంచములో ప్రవేశించినట్లున్నది గదా! – సమా –

అవచ్ఛిన్నం కావటమే ప్రవేశం. మట్టిగూడా ఘటం పుట్టిన తరువాత ఘటావచ్ఛిన్నం అవుతుంది.

7. ఏదయినా, **అనేక అనుపపత్తులకు సమాధానము మాయ.** ఎందుకంటే బ్రహ్మం వాస్తవంగా శుద్ధం. నిర్గుణం. నిర్వికారం. అది జగత్తు గాదు. జీవుడూ కాదు. ఈశ్వరుడూ కాదు. అంతా మాయవలననే. దానివలన కలలో లాగా అసంభవాలు సంభవాలు అవుతాయి. కనుక బ్రహ్మం జగత్కారణం, జగన్మయం, జీవరూపం. ఏదయినా అది సత్యమే. 'సత్యం జ్ఞాన మనంతంబ్రహ్మ" కనుక చింతనీయమే.

**శ్లో॥ సృష్టేః ప్రాగసదేవ సర్వమభవత్తస్మాత్సదాసీత్స్వయం**
**తత్స్వాత్మానమథాజ్జగత్సుకృతమిత్యేతత్తతః ప్రోచ్యతే ।**

**లబ్ధ్వేదం విబుధస్సుఖీ భవతి యత్తస్మాత్తదేతద్రసో**
**నానన్దో యది చైష కో ను కలయేల్లోకేఽననం ప్రాణనమ్ ॥ 159**

భావ॥ సృష్టికి ముందు అంతా అసత్తుగా అనగా అవ్యక్తంగా అవ్యాకృతంగా ఉండెను. దానినుండి 'సత్' అనగా వ్యాకృతమయిన నామరూపాత్మక ప్రపంచము ఏర్పడెను. ఇదంతా తండ్రినుంచి భిన్నంగా కొడుకు పుట్టినట్లు పుట్టలేదు. అవ్యాకృతమయిన బ్రహ్మమే తన అవ్యాకృత స్వరూపమును వ్యాకృతముగా నొనర్చెను. అందువలన బ్రహ్మమును సుకృతం అనగా స్వయంగా గొప్ప 'కర్త' అందురు. అది సర్వకారణము కదా! లేదా సర్వకర్తగనుక అట్టి పుణ్యం వలన నయినా ఆ బ్రహ్మమును పుణ్యరూపమయిన కారణముగా చెప్పిరి. ఏదయిన మంచి ఫలం కలిగిందంటే అది 'పుణ్యం' వలన కలిగిందంటారు. అట్టి ప్రసిద్ధి నిత్యమయిన చైతన్యము కారణమయితేనే కుదురుతుంది. కనుక సుకృతప్రసిద్ధివలన బ్రహ్మం ఉన్నదనగలము. మఱియు బ్రహ్మం రసం కావటం వలన ఉన్నదన వచ్చును. రసమనగా మధురం, ఆమ్లం మొదలయిన షడ్రసాలు ఆనందహేతువులు. అట్లు జ్ఞానులు ఈ బ్రహ్మమును పొంది ఆనందమును పొందుచున్నారు. లేని దానినుంచి ఆనందమును పొందలేము. కనుక ఆనంద హేతువయిన 'రసము' ఒక్కటి యున్నదని ఊహింపవలయును. కారణము లేకుండా కార్యం ఉండదు గదా! రసమనగా రసయతి = ఆనందం పంచునది.

కేవలం ఆనందం మాత్రమే బ్రహ్మ నిదర్శనం కాదు. ఈ 'ప్రాణనం' గూడా బ్రహ్మ నిదర్శనమే. ఆనందరూపమయిన ఈ బ్రహ్మం హృదయాకాశంలో జీవచైతన్యంగా వ్యాపించి యుండకపోతే, ఈశరీరంలో అపానంకాని ప్రాణనం అనగా ప్రాణచేష్టగాని ఉండేది కాదు.

"న ప్రాణేన ప్రాణితి, నాపానేన పానితి" అని శ్రుతి. ఇదంతా జీవరూపబ్రహ్మం వలననే జరుగుతున్నది. కనుక వీటినిబట్టి అయినా బ్రహ్మం ఉన్నదని ఊహించాలి. లేదా అననం అనగా శరీరంలోని పంచప్రాణాలు పంచేంద్రియాలు అని గూడా భావింపవచ్చును. కాగా వ్యానం మొదలగు వాయువులు చేసే శ్రవణ దర్శనాది – ఇంద్రియ కార్యములు కనబడుచున్నవి. భిన్నమయిన ఇంద్రియాలు ఇలా చక్కగా కలిసి సహకారంగా పనిచేయాలంటే **ఈ అచేతనములను ఒక్కత్రాటిమీదకు తెచ్చే చేతన వస్తువు ఒకటి ఉండాలి.** ఇల్లు మొదలగు వస్తుసమూహం యొక్క స్థితి చేతనుడయిన వ్యక్తిని బట్టియే గదా! కనుక ప్రాణనాది చేష్టలకు కరణములయిన అచేతన – ఇంద్రియాదులను నడిపించుటనుబట్టి ఒక చేతనమునూహించాలి. అదే బ్రహ్మము. అదే జీవుడు. లేదా సంఘాతం ఇతరులకోసం ఏర్పడుతుంది. ఆ సంఘాతము (శరీరం) యొక్క ప్రాణనం మొదలయిన చేష్టలు ఎవరికోసమో ఆ తత్త్వము బ్రహ్మము. (ప్రాణనం = బ్రతకటం ఊపిరి పీల్చటం) 159

**శ్లో॥ ఆత్మాఽఽనన్దయతి ప్రజా అవికృతేఽనఙ్గేఽనిరుక్తేఽపదేఽ**
**ముష్మిన్నేతి యదాఽభయాం స్థితిమయత్యేషోఽ భయం నా తదా ।**
**అన్యోఽసావహమన్య ఇత్యపి మనాగ్భేదం విచష్టే తు యః**
**స్వాత్మన్యపృఖిలేశ్వరే భవతి తస్యేశాత్ప్రభూతం భయమ్ ॥ 160**

భావ॥ ఈ ఆత్మపదార్థం ప్రజలను/ధర్మానురూపంగా ఆనందపఱచును. నిర్వికారం అసంగము, అనిర్వచనీయం, అనాశ్రయము అయిన ఈ బ్రహ్మమునందు చేరి ఎవడు అభయస్థితిని(బ్రహ్మం తనే కనుక) పొందునో ఆ పురుషుడు సదా నిర్భయుడగును. భయపెట్టునట్టి ద్వితీయుడెవడున్ను లేడు కదా! ఆత్మ రూప బ్రహ్మమునకు తనకు కొంచెమయినా భేదం ఉన్నదని భావించువాడు (అనగా నేను వేరు దేవతవేరు అని) తప్పక ఆ ఈశ్వరుని నుంచి భయము పొందును. ఆ అఖిలేశ్వరుడు తన ఆత్మరూపమయినా అతడు భయపడక తప్పదు. 160

విశే॥ 1. రసత్వం అనగా ఆనందం, ఆనందకరం కావటం వలన అందుకు హేతువయిన బ్రహ్మం ఉన్నదని ముందు తేల్చాము. ఇంతకుముందు జ్ఞానులకు ఆ ఆనందము గూర్చి చెప్పాము. ఇప్పుడు సర్వప్రాణులకు అతనే ఆనందకరుడని చెప్తున్నాము. వాక్యార్థంలో భేదం ఉన్నది కనుక ఇది పునరుక్తి కాదు.

2. ఆత్మయే ఆయా ఉపాధుల ద్వారా ఆనందరూపంగా అనుభవింపబడుచున్నది. విషయేంద్రియములు ఉపాధులు. వాటి వృత్తివలన ఆ ఆనందము గూడా క్షణికమే. ఇదంతా అవిద్యాకృతము.

3. ప్రియవస్తు ప్రాప్తివలన మనస్సు ఒక్కక్షణం అంతర్ముఖం అవుతుంది. అది కామక్షయం. అంతర్ముఖమనస్సులో ఆనంద రూపబ్రహ్మం స్ఫురిస్తుంది. అదే ఆనందం. కనుక తాను 'సుఖిని' అన్న భావన కలుగుతుంది. మనస్సుకు ఈ అంతర్ముఖ స్థితి చిరకాలం ఉండదు. కర్మాను రూపముగా క్షణకాలమే. అది బహిర్ముఖం అయితే ఆ ఆనంద స్ఫురణ ఉండదు. కనుక **ఆనందం క్షణికం కావటం మనోవృత్తి క్షణికం కావటం వలననే.** సహజం కాదు. ఆనందం శాశ్వతం. ఉదా॥ మనం చంద్రుని వైపు చూచినపుడే చంద్రస్ఫురణం జరుగుతుంది. చూడకపోయినా, తల క్రిందకు వంచినా చంద్రస్ఫురణ ఉండదు. చంద్రుడు క్షణిక వస్తువు కాదు. **నేత్ర వృత్తి క్షణికం కావటం వలన వచ్చిన క్షణికత్వం అది.**

4. ఇష్ట వస్తువే ఆనందకరం అనరాదు. అది కేవలం మనస్సును అంతర్ముఖం చేసి ఆనందకరం అవుతుంది. అందుకని అంతర్ముఖవృత్తి ఆనందపఱచదు. అది జడము. సాభాసమయిన అంతర్ముఖ మనోవృత్తి ఆత్మానందమును ప్రతిబింబించును. అంటే ఆ ప్రతిబింబమే ఆనందపఱచదు. అది బ్రహ్మయే కదా! కనుక ప్రతిబింబమునందు బింబానందం వృత్తిద్వారా వచ్చి ఆనందహేతువగును. కనుక ఆనందకరమయినది బ్రహ్మమే.

**శ్లో॥ భీత్యాస్మాత్పవనార్యమాగ్ని మఘవత్రప్తాశ్చ లోకేశ్వరా**
**రాజ్ఞో మన్త్రిభటాదివత్సనియమం తిష్ఠన్తి కార్యే స్వకే ।**
**సమ్రాడాదిహిరణ్యగర్భచరమానన్దాః పరిచ్ఛేదగా**
**ఆనన్దోఽస్యతు నో య ఏష పురుషే యోఽర్కే స ఏకః పుమాన్ ॥161**

భావ॥ ద్వైతంలో సృష్టిలో బ్రహ్మం భయహేతువే. ఆయననుంచి భయపడి వాయు, సూర్య, అగ్ని, ఇంద్ర, యమ, వరుణాది దిక్పాలకులు లోకేశ్వరులు గూడా "రాజుకు మంత్రి భటులు భయపడినట్లు" భయపడుచు క్రమశిక్షణతో తమతమ విధులను నెరవేర్చుచున్నారు. కనుక సర్వభయకారణమయిన బ్రహ్మం ఉన్నది. అది జ్ఞానులకు ఆనందకరము. ఈ ఆనందము పరిచ్ఛిన్నము కాదు. ఖండము కాదు. అఖండము. చక్రవర్తి నుంచి హిరణ్యగర్భునిదాకా ఉన్న శతగుణితమయిన క్రమానందములను మించిన అఖండానందమణి. అది బ్రహ్మం యొక్క స్వరూపము. గుణము కాదు.

ఈ ఆనందబ్రహ్మమే మనదక్షిణ నేత్రమున జీవపురుషుడయిన ప్రత్యగాత్మగాను, సూర్యమండలమున హిరణ్యగర్భుడను ఈశ్వరునిగానూ ఉన్నాడు. అతడు ఒక్కడే. వేరు కాదు. లేదా, మనుష్యదేహమున హృదయగుహలో అంగుష్ఠపరిమితుడయిన పురుషుడు అనిగూడా అర్థము. కాగా జీవ హిరణ్యగర్భులు ప్రసిద్ధులు గనుక ఆ రూపములోనున్న అనుగత చైతన్యము బ్రహ్మమే. 161

**శ్లో॥ యోవేదైవ మయం విహాయ సకలం దేహాత్మబుద్ధిం పురా**
**సన్త్యజ్యాసుషు చాత్మబుద్ధిమథ చ స్వాన్తేఽథ బుద్ధావథ ।**
**మాయానన్దమయే తదేతదఖిలం నాస్త్యేవ నో భాతి వా**
**మిథ్యాస్వప్నపదార్థవద్ధ్రువమహం బ్రహ్మేతి మత్వాఽభయః ॥ 162**

భావ॥ సచ్చిదానంద రూపమయినది బ్రహ్మమని, అది తన తత్త్వమేనని ఎఱిగినవాడు ముందుగా దేహమే ఆత్మ అను బుద్ధిని వదలుతాడు. అనగా నేను మనిషిని, విప్రుడను, పురుషుడను మొదలగు భావనలు దేహాత్మ భావనలు. తరువాత ప్రాణములే నేను అను ప్రాణాత్మ బుద్ధిని, అట్లే మన – ఆత్మ బుద్ధిని, విజ్ఞానాత్మ బుద్ధిని, అజ్ఞాన రూపమయిన "ఆనందమయకోశము నేనే" అను బుద్ధిని, వదలవలయును. ఇదంతయును స్వప్నమువలె మిథ్యాపదార్థమే. ఇదంతా వాస్తవంగా లేదు. సత్యంగా కనబడటం లేదు. నేను శాశ్వతమయిన బ్రహ్మమును అని తలచి భయరహితుడు కావలయును. "అభయం వై జనక ప్రాప్తోసి" – భయ పెట్టగల ద్వితీయ వస్తువు లేదుగదా! 162

విశే॥ 1. బ్రహ్మం ఉన్నదని సాధింపబడినది. బ్రహ్మం సర్వసమమయినా బ్రహ్మనిష్ఠుడయి బ్రహ్మాత్మైక్యమును దర్శించు వానికే అభయము. తాను దేహాదులు కానని శాశ్వతమయిన బ్రహ్మమే తానని భావించాలి.

2. మాయయే అజ్ఞానము. అదే ఆనంద మయకోశము. నేను అజ్ఞానమును కాదన్న భావనయే ఆనందమయకోశము తాను కాదన్న భావన.

3. అన్నమయంనుంచి ఆనందమయందాకా సర్వదృశ్యం భూత భౌతిక వస్తు సమూహము కాలత్రయంలోనూ లేదు. ఉన్నది అద్వితీయం ఏకరూపమయిన శాశ్వత బ్రహ్మము.

## 3. భృగువల్లీ

**శ్లో॥ దేహాస్విన్ద్రియవాఙ్మనోమతిమయద్వారం బృహత్తద్యతో**
**జన్మస్థానలయా భవన్తి జగతో నాన్నాసుహృద్బుద్ధయః ।**
**కార్యత్వాన్న తు పఞ్చమోఽపి మలినశ్శుద్ధం హి సర్వాన్తరం**
**బ్రహ్మానన్ద ఇదం జనిస్థితిలయానానన్దతో యాతి యత్ ॥ 163**

భావ॥ '**భృగువల్లీ వ్యాఖ్య ప్రారంభము**' బ్రహ్మమును పొందవలయుననగా అందుకు దేహ ప్రాణ ఇంద్రియ మనో బుద్ధులు ద్వారములు. అనగా జీవుడే బ్రహ్మము కదా! అయితే ఎవని నుండి ప్రపంచ సృష్టి స్థితి లయములు జరుగుచున్నవో వాడు ఈశ్వరుడు. ఆయనయే బ్రహ్మము. కనుక మా మతము నిరీశ్వర వాదము కాదు. ఆయనయే జీవరూపంగా శరీరములలో ప్రవేశించినాడు. అంతేగాని అన్నము, ప్రాణములు, మనస్సు, బుద్ధి, బ్రహ్మం కావు. వానిలో కొంతవఱకు సృష్టి మొదలగు వానికి సంబంధం ఉన్నను అవి కార్యములు కనుక బ్రహ్మం కావు. అలాగే పంచమమయిన ఆనందమయకోశం అజ్ఞాన మలినం. కనుక అదీ బ్రహ్మం కాదు. ఎందుకంటే సర్వాంతరమయిన ఆ బ్రహ్మం శుద్ధం. స్వప్రకాశం. కాని అవ్యక్తం (అనందమయ కోశం) మలినం. అలాగే పంచకోశములు ఈ అవ్యక్తములోనివి. కనుక అవీ బ్రహ్మము కావు. ఈ ప్రపంచము జన్మస్థితి లయములను ఈ ఆనంద తత్త్వమునుండియే పొందును. కనుక ఈ ఆనంద తత్త్వమే బ్రహ్మము. 163

విశే॥ 1. జీవుడు బ్రహ్మం కాడు. కనుక 'అహం బ్రహ్మ' అను దర్శనము మిథ్య. దీనివలన అభయం ఎలావస్తుంది – అని ప్రశ్న. జీవుడు బ్రహ్మము ఒక్కటేనని, శరీరం ద్వారా శరీరాధిష్ఠానమయిన జీవాభిన్నుడయిన బ్రహ్మమును పొందవలయును. జగత్కారణుడయిన పరమేశ్వరుడే జీవరూపమున మన శరీరములలో ప్రవేశించెను. "రూపం రూపం ప్రతిరూపో-బభూవ" కదా!

2. అన్నంవలన ప్రపంచంలో జన్మాదులు జరుగుతున్నవి. అన్నం రేతస్సుగామారి భూతములగుచున్నవి. అన్నంతో పెరుగుతున్నవి. అన్నం లేనందువలన నశించుచున్నవి. లేదా ప్రాణమే బ్రహ్మ. ప్రాణమే అన్నంతిని సృష్ట్యాది కారణమయినది. ప్రాణియే మరో ప్రాణిని

పుట్టిస్తున్నది. మనస్సే బ్రహ్మ. అదే అన్నమును కోరుతుంది. అది కోరితేనే ప్రాణం అన్నమును స్వీకరిస్తుంది. స్వప్నంలో ప్రపంచమును మనస్సే సృష్టిస్తుంది. ఇక జాగరణ ప్రపంచం గూడా మనస్సు చేసిన సృష్టి యని ఊహిస్తాము. లేదా బుద్ధియే బ్రహ్మం. "నేనీ అన్నమును తినవలెను" అని బుద్ధి నిశ్చయించటం వలన ప్రాణం అన్నమును తింటుంది. **మనలోపలి విజ్ఞానము బయటప్రపంచముగా కనబడుచున్నది.** కనుక బుద్ధియే బ్రహ్మము. లేదా ఆనందమయకోశ రూపమయిన అజ్ఞానము (అవ్యక్తము) బ్రహ్మము. "నన్ను నేనెఱుగను" అను అజ్ఞానం ఉన్నంతకాలము ప్రాణాదులు అన్నభక్షణాది వ్యాపారము చేయును. జడదుఃఖాత్మకమయిన ఈ అజ్ఞానము నుంచి అదే రకమయిన ప్రపంచం వచ్చింది. కనుక అవ్యక్తమే బ్రహ్మం. కాని ఇవి కార్యములు కనుక బ్రహ్మం కావు. మలినములు కనుక కావు. అవ్యక్తం మలినం బ్రహ్మాభాస్యం. బ్రహ్మం శుద్ధం. స్వయంప్రకాశము. ఆంతరం.

3. సర్వాంతరము శుద్ధము, అకార్యము, విజ్ఞానభిన్నమూ అయిన అఖండానంద పదార్థము నుండి జగత్తుకు సృష్టి మొదలగునవి జరిగినవి. ఇదే మాయా విశిష్టమయి జగత్కారణం అవుతుంది. అట్టి **విశిష్ట బ్రహ్మమయిన "ఆనంద"మునకున్ను ఆంతరము అకార్యము శుద్ధం సర్వాంతరము అయిన ఆనందతత్త్వం బ్రహ్మం.**

**శ్లో॥ విద్యైషా పరమామ్బరే ప్రణిహితా సా భార్గవీ వారుణీ**
**యో వేద ప్రతితిష్ఠతి ప్రభజతే తేజో యశోఽన్నం చ సః ।**
**నిన్దేన్నాన్నమిదం న వా పరిహరేత్కుర్యాద్బహు ప్రస్తుతం**
**యస్యైతద్వ్రతమేష స ప్రతిలభేతాన్నాదతామన్నితామ్ ॥ 164**

భావ॥ ఇది భార్గవీ వారుణీ విద్య. పరమాకాశ స్వరూపమయిన బ్రహ్మమునందు ఇది ప్రతిష్ఠితమయినది. వరుణుడు తన పుత్రుడయిన భృగువునకు ఈ విద్యచెప్పెను. ఈ విద్యను ఎఱిగినవాడు ప్రతిష్ఠ పొందును. తేజస్సును, కీర్తిని, అన్నమును పొందును. అందువలన బ్రహ్మ స్వరూపమయిన అన్నమును నిందింపరాదు. పరిహరింపరాదు. అన్నము అతిథి మొదలగు వారికి సరిపడునట్లు అధికముగా తయారుచేయవలయును. అన్నమును స్తుతింపవలయును. ఎవనికయితే యీ అన్నవ్రతమున్నదో వాడు అన్నాదుడు అన్నసమృద్ధిగలవాడును అగును. 164

విశే॥ తేజస్సు = బ్రహ్మవర్చస్సు; విద్యను మనస్సు ద్వారా పొందవలయును. మనస్సు అన్నరసమయము. అందువలన అన్నమును గారవింపవలయును.

**శ్లో॥ ప్రాణోఽప్బక్షితిరన్నమజ్ఞమనలోఽన్నాదో నభోఽన్నే స్థితోఽ**
**న్నాదోఽన్నాదవినిష్ఠితం భవతి చాన్నం వేద యస్సోఽన్నవాన్ ।**
**అన్నాదశ్చ మహాన్భవేత్కులపశుబ్రహ్మప్రకాశైః పున-**
**ర్నాత్మా కార్యమనాదిరేష హి తతోఽన్నాదో న చాన్నం బృహత్ ॥165**

భావ॥ అన్నమనగా = ప్రాణము జలము భూమి. అన్నాదుడనగా = శరీరము అగ్ని ఆకాశము. ప్రాణము నందు దేహము, జలమునందు అగ్ని, భూమియందు ఆకాశము అనగా అగ్నిత్రయము నందు అన్నాదత్రయము అధిష్ఠించి యున్నది. అలాగే అన్నాద త్రయమునందు అన్నము అధిష్ఠించియున్నది. వీరి యీ పరస్పర బంధ తత్త్వమును ఎరిగినవాడు గొప్ప అన్న సమృద్ధిగలవాడు, అన్నాదుడు అగును. వానికి వంశము పశుసమృద్ధి, బ్రహ్మవర్చసము కలుగును. కాని ఇంత గొప్పదయినను ఈ అన్నము అన్నాదము మాత్రము ఆత్మకాదు. ఇవన్నియు బ్రహ్మ కార్యములు. అనిత్యములు. లేదా ఈ బ్రహ్మం అన్నముకాదు. అన్నాదము కాదు. అలాగే అన్న, అన్నాదములుగూడా బ్రహ్మం కావు. ఆత్మ లేదా బ్రహ్మం అనాది, అజన్యము, అది కేవలం బ్రహ్మమే. 165

**శ్లో॥ వాసార్థం గృహమాగతం శుభమతి ర్నో వారయేదోదనం**
**దద్యా త్తస్య యయా కయాపి విధయా బహ్వన్నమేవార్జయేత్ ।**
**అన్నం సిద్ధముదీరయేదతిథయే నాస్తీతి నోదీరయే-**
**దృస్మిన్ యేన యథా వయస్యుపహృతం తస్మిన్ తథా స వ్రజేత్ ॥166**

భావ॥ కొంతకాలము నివసించుటకు ఇంటికి వచ్చిన అతిథిని వద్దనరాదు. శుభమతియై అతనికి అన్నమును పెట్టవలయును. ఏవిధముగానయినా అన్నమును అధికముగా సంపాదింప వలయును. అన్నం సిద్ధముగా నున్నదనియే చెప్పవలయును. అతిథికి అన్నము లేదని చెప్పరాదు. ఏ వయస్సునందు ఎవడు ఎంత దానము చేసెనో వానికి ఆవయసున అంత అన్న సమృద్ధి లభించినది. లభించును. లభింపగలదు. ఇది అన్న ప్రదాన స్తుతి. కనుక అన్నార్థికి గౌరవ పూర్వకముగా అన్నమును అర్పింపవలయును. 166

**శ్లో॥ క్షేమో వాచి కృతిః కరే పది గతిః పాయౌ విముక్తిస్తథా**
**ప్రాణే యోగ ఇతి క్షణత్విషి బలం తృప్తిస్తు వర్షే యశః ।**
**గోషు జ్యోతిరుడుష్వథామృతసుఖాపత్యాన్యుపస్థేఽఖిలం**
**ఖే బ్రహ్మైవ నభశ్చ తత్తత ఇదం సర్వప్రతిష్ఠా బృహత్ ॥ 167**

భావ॥ బ్రహ్మోపాసనలు ఇవి. వాక్కునందు క్షేమమని, చేతియందు పనియని, పాదములందు గమనమని, పాయువునందు విసర్జనమని, ప్రాణమునందు యోగమని, విద్యుత్తునందు బలమని, వర్షమునందు తృప్తియని, గోవులయందు కీర్తియని, నక్షత్రములయందు జ్యోతియని, యోని (శిశ్నము) యందు అమృతము, సుఖము సంతానమని, ఆకాశమున ఈ సమస్తమని ఉపాసన చేయవలయును. ఆ ఆకాశము బ్రహ్మయే. అదంతయు బ్రహ్మమే. కనుక ఈ బ్రహ్మము సర్వమునకు ఆశ్రయము. 167

విశే॥ 1. క్షేమం. స్వీకరించినదానిని కాపాడుట. యోగము నూతనముగా స్వీకరించుట.

అమృత – ఋణ (పితృ) మోచనం వలన వచ్చినది.

యోగక్షేమము = ప్రాణాపానములు బాగుంటే కలుగుతాయి. 167

**శ్లో॥ యస్తు ధ్యాయతి స ప్రతిష్ఠిత ఇతి బ్రహ్మ ప్రతిష్ఠా గుణం**
**జాయేతైష మహాన్ మహత్త్వగుణకం యో బ్రహ్మ నిధ్యాయతి ।**
**యో వా తన్మన ఇత్యయం ఖలు భవేన్మానీ నమస్తత్తు యః**
**కామాప్తస్స భవేద్విరాడితి తు యస్స స్థూలభోగీ భవేత్ ॥ 168**

భావ॥ బ్రహ్మ ప్రతిష్ఠా గుణము గలదని ఎవడు బ్రహ్మమును ధ్యానించునో వాడు ప్రతిష్ఠగల వాడగును. మహత్త్వగుణముగలదానినిగా ఎవడు బ్రహ్మమును ధ్యానించునో వాడు మహాత్ముడగును. మనస్సును బ్రహ్మముగా నుపాసించునో వాడు మనస్వియగును. ఎవడు బ్రహ్మమును 'నమః' అని ఉపాసించునో వాడు ఆప్తకాముడగును. ఎవడు విరాట్పురుషునిగా ఉపాసించునో వాడు స్థూలభోగములు గలవాడగును.

**"తం యథాయథోపాసతే తదేవ భవతి".** నమః = అనగా కామములు అతనికి 'నమ్ర' మగును. 168

**శ్లో॥ విద్యుద్వృష్టిహిమాంశుభాస్వదనలా వాయౌ మ్రియన్తే యతో**
**వాయుర్బ్రహ్మణ ఏష తత్పరిమరోఽనన్యో యతః ఖాదయమ్ ।**
**ఆకాశస్తత ఏష తత్పరిమరో ధ్యాయత్యముం యః పున-**
**ర్భ్రాతృవ్యా రిపవో ద్విషోఽస్య జహతి ప్రాణాన్ప్రియానప్యరమ్ ॥169**

భావ॥ విద్యుత్, వృష్టి, చంద్రుడు, సూర్యుడు అగ్ని – వీరు తమ మూల కారణమయిన (వాయోరగ్నిః) వాయువునందు లీనమగును. కనుక వాయువు బ్రహ్మమునకు సంహార సాధనము. ఈ వాయువు తనమూలతత్త్వమయిన ఆకాశమునందు లీనమగును. అనగా అభిన్నుడు. కనుక ఆకాశము బ్రహ్మమునకు పరిమరము అనగా సంహారసాధనము. **వాయు స్వరూపమయిన ఆకాశమును ఎవడు బ్రహ్మమునకు "పరిమరముగా" అనగా** సంహారాయుధముగా ఉపాసన చేస్తాడో, అతని బహిరంగ శత్రువులు అంతరంగశత్రువులు అనగా గూఢశత్రువులయిన దాయాదులు శీఘ్రముగా నశించెదరు. 169

(పరిమ్రియంతే అనేన = పరిమరః)

**శ్లో॥ బ్రహ్మాత్మైవ తదేష హృత్కుహరగస్సూర్యస్థితః పూరుష-**
**స్తద్విద్వాన్ప్రవిలాప్య కోశనిచయం స్వాత్మన్యహం పూర్వజః ।**
**దేవేభ్యోఽమృతనాభిరస్మ్యభిభవామ్యేతత్సువర్ణద్యుతి-**
**శ్చాన్నాదోఽన్నమదన్తమద్మి మనుతే బ్రహ్మేతి యో బ్రహ్మ సః ॥170**

భావ॥ ఇట్టి "పరిమరం" గల బ్రహ్మం ఎవరు? శరీర హృదయగుహాలోనున్న ఆత్మయే.

సూర్యమండలమునందున్న పురుషుడే యీ బ్రహ్మము. కనుక జ్ఞాని తన ప్రత్యగాత్మయందు కోశపంచకమును లయంచేసి, తరువాత "నేను దేవతలకన్న ముందు పుట్టిన హిరణ్యగర్భుడను, అమృతమూర్తిని (అమృతనాభిని) ఈశ్వర స్వరూపంతో ఈ ప్రపంచమునందు వ్యాపించి యున్నాను. నేను ఆదిత్య సమాన కాంతి గలవాడను. హిరణ్యం వలె స్వయంప్రకాశుడను. అన్నమును, అన్నాదుడను, అన్నాదులను గూడా తిను చరాచర - అత్తను" అని తనను బ్రహ్మముగా గుర్తించిన వాడు బ్రహ్మయే అగును. 170

విశే॥ 1. అమృత నాభి = సర్వప్రాణం, అమృతత్వం హిరణ్యగర్భుని యందుండును. ఇతడు ప్రాణరూపుడుగదా!

2. సువః = ఆదిత్యుడు - న - సమానమయిన (వేదంలో న = సమానమయిన అని అర్థం మృగం - న భీమం - లాగా) ద్యుతిగల వాడు.

3. వస్తుతః = ఈ ఆకారభేదములు మిథ్యలు సముద్ర తరంగ బుద్బుదములవంటివి. అంతా బ్రహ్మమే. అదే తానని తెలిసిన వాడు బ్రహ్మమే యగును.

భృగువల్లి సమాప్తము.

**(తైత్తిరీయంలో ఇంకా రెండు అధ్యాయములు గలవు. 1. నారాయణ ప్రశ్నము 2. చిత్తి.**

**ఇందులో నారాయణ ప్రశ్నలో యజ్ఞవిషయాలు ఎక్కువ. ఈ రెండింటికి శంకర భాష్యము లేదు. శ్రీరామారావుగారు నారాయణ ప్రశ్నమును, పురుష సూక్తమును ఇందు చేర్చినారు. చిత్తి ప్రశ్నము చయనమునకు సంబంధించినది గనుక దానికి వ్యాఖ్యానము లేదు.)**

## - నారాయణ ప్రశ్నః -

**శ్లో॥ లోకాలోకమహీధరాదిరుదధేః పారే మహానస్తి యో**
**మేర్వాదిశ్చ ధరాన్తరే త్రిదివతః పృష్ఠే చ సత్యాదికః ।**
**తస్మాద్యోఽతిమహాన్ స జీవవపుషా చేతః ప్రవిశ్యోదరే**
**బ్రహ్మాణ్డస్య విరాట్పదేన చరతి స్వాధీనమాయః పుమాన్ ॥ 171**

భావ॥ సముద్రపారమునందు లోకాలోక పర్వతాదికమున్నది. భూమధ్యమునందు మేరువు మొదలగు మహాపదార్థమున్నది. స్వర్గము పైన సత్యాది లోకములున్నవి. ఈ మహా పదార్థముకన్న అతి మహాపదార్థమయిన ఆ మాయాసహాయుడయిన పరమేశ్వరుడు జీవరూపములో మన అంతఃకరణమున ప్రవేశించి బ్రహ్మాండమునందు విరాట్పురుషుడుగా సంచరించుచున్నాడు. 171

**శ్లో॥ యస్మిన్ సజ్జత మేతదేవ విగతం సృష్టౌ లయే దైవతై-**
**స్సాకం చన్ద్రమహేన్ద్రశఙ్కరవిరాడ్ఢైరణ్యగర్భాదిభిః ।**

**భూతం భవ్యమిదం భవిష్యదపి యద్విశ్వం తదవ్యాకృతం**
**యస్మిన్ వ్యోమ్ని పరేఽక్షరే స్థితమివ బ్రహ్మైతదాత్మైవ తత్ ॥ 172**

భావ॥ చంద్ర మహేంద్ర శంకర విరాట్ హిరణ్యగర్భాదులతో సహా, ఈ ప్రపంచము సృష్టిలో ఎవరితో కలిసియుండునో, లయంలో వీరందఱితో కలిసి ఎవనిలో లీనమగునో భూత వర్తమాన భవిష్యద్రూపమయిన యీ అవ్యక్రమమయిన విశ్వము ఏపరమ, అక్షర ఆకాశమునందు (బ్రహ్మము) ఉన్నట్లు కనబడునో అట్టి బ్రహ్మము ఆత్మయే, ఈ ఆత్మ బ్రహ్మమే. 172

విశే॥ మట్టియందు కుండ పిడత మూకుడు ఎలా కలిసియున్నవో ఎలా చివరకు మట్టియందు లీనమగునో అవి ఎలా తత్త్వరీత్యా మట్టియేనో అలా చంద్రమహేంద్రాదులు, బ్రహ్మతత్త్వమే. కార్యం కారణంకన్న భిన్నంగా కనబడుతున్నది. అది కేవలం నామరూపమేకాని తత్త్వం భిన్నము కాదు. కనుకనే అది మిథ్య. ఉన్నట్లు కనబడుతుంది.

**శ్లో॥ యేన వ్యాప్తమిదం నభశ్చ ధరణీ స్వర్గశ్చ లోకత్రయం**
**తత్థాస్తత్పతయశ్చ సర్వభువనం సద్రూపమాభాసతే ।**
**యే నార్కోఽనుగృహీత ఏష రుచినా లోకత్రయమ్భాసయ-**
**త్యస్యాన్తః పటతన్తువద్వ్యతి యత్తత్స్వే మహిమ్ని స్థితమ్ ॥ 173**

భావ॥ "సత్తు" అయిన ఆ బ్రహ్మము ఈ భూమ్యాకాశములను, స్వర్గమును అనగా లోకత్రయమును వ్యాపించినది. దానియందున్న ప్రజలను ప్రభువులను సమస్తలోకమును ఆ సత్తు వ్యాపించియున్నది. అందువలన ఈ ప్రపంచమంతయు సద్రూపముగా భాసించినది. కార్యమునందు కారణం అనుగతంగా ఉంటుంది. కనుక కారణం యొక్క సత్త (ఉనికి) కార్యం యొక్క సత్తగా భాసిస్తుంది. కార్యమునకు వేరే సత్త లేదు. అలా ఆభాసిస్తుంది. అనగా మిథ్య.

సూర్యుడుగూడా ఏ తేజోనిధియనుగ్రహముతో వచ్చిన తేజస్సుతో ఈ లోకత్రయమును వెలిగించుచున్నాడో, ఈ ప్రపంచము లోపల వస్త్రములో తంతువు వలె అనుగతముగా నున్నాడో, ఏ బ్రహ్మం స్వయంప్రకాశమై తన మహిమతో తానున్నాడో తన స్వరూపమునందే తానున్నాడో అదియే బ్రహ్మము. అలా తెలిసికొనగలిగిన జ్ఞాని యీ బ్రహ్మమే. 173

**శ్లో॥ అవ్యక్తోపహితాద్యతస్సమభవత్ త్రైలోక్యసృష్టిః పుమాన్**
**భూతైః పఞ్చభిరేష భువ్యదసృజద్దేహాన్విచిత్రాన్ పరః ।**
**భూత్వాఽన్నం చ చరాచరాణ్యుదవిశద్భూతాని నాతఃపరం**
**కిఞ్చిద్వస్తు పరాత్పరోఽయమతమా ఏకః పురాణో మహాన్ ॥ 174**

భావ॥ అవ్యక్తమయిన మాయయందున్న యీ బ్రహ్మచైతన్యము నుండియే యీ సృష్టి యుద్భవించినది. పరమపురుషుడు పంచభూతముల ద్వారా ఈ విచిత్రదేహములను సృజించెను.

ఆయనయే అన్నముగా ఏర్పడి యీ చరాచరభూతములందు ప్రవేశించెను. బ్రహ్మమునకు మించి మఱొక వస్తువు ఏదియు లేదు. ఇతడు పరాత్పరుడు. తమోరహితుడు. అఖండుడు. పురాతనుడు (అనాది) మహాత్ముడు. 174

విశే॥ 1. బ్రహ్మం జగత్కారణమయినా వస్త్రములో దారములాగా కనబడదు. అది అవ్యాకృతముగా అవ్యక్తముగానున్న మాయలోనుండి జగత్కారణమయినది. అది లేనిదే జడమయిన అవ్యక్తము జగత్తును కలిగించలేదు. అలాగే శుద్ధ బ్రహ్మ జగత్కారణం కాదు. అది అవ్యక్తంతో కలవాలి. కనుక ఈశ్వరుడు అనగా అవ్యక్త – ఉపహితమయిన చైతన్యం.

2. అన్నంగా అయి మానవాదిప్రాణిశరీరాలలోకి వర్షజలంగా స్థావరశరీరాలలోకి ప్రవేశించేది గూడా బ్రహ్మమే. అలా జగత్ పాలన హేతువు బ్రహ్మమే. ఈయన హిరణ్యగర్భునికన్న అధికుడు. పూర్తిగా అజ్ఞానదూరుడుగదా! అజుడు. హిరణ్యగర్భుడు ఈశ్వరపుత్రుడు. జననం కలవాడు. ప్రథమజుడు.

3. ఈశ్వరుడు ఒక్కడే "ఏకః". ఆయన ఉపాధి అయిన మాయయు ఒక్కటే. జీవులు అనేకులు. వారి ఉపాధులయిన అంతఃకరణలు అనేకం గదా! కనుక ఈశ్వరభేదం లేదు. మరో ఈశ్వరుడూ లేడు. "న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే".

**శ్లో॥ వేదస్సత్యమృతం చ కర్మ వివిధం భూతం భవద్భావి చ**
**త్రైలోక్యం పవనోఽగ్నిరిన్దురరుణో జ్యోతిర్గణశ్చామృతమ్ ।**
**బ్రహ్మ ఖానిలవహ్నివారివసుధాః స్థూలో విరాడిత్యదోఽ**
**విద్యాదృష్టికృతం జగత్సుఖమయం బ్రహ్మైవ విద్యాధియా ॥ 175**

భావ॥ పురుషుడు సచ్చిదానంద స్వరూపుడు. ఆయనకు మించి ఇతరమేమియు లేదు. ఆయినప్పటికి ప్రపంచమంతా మాయవలన కనబడునట్టిది. కనుక వేదము, సత్యము, ఋతము, వివిధకర్మలు, భూత భవిష్యద్వర్తమానములు, లోకత్రయము, వాయువు, అగ్ని, సూర్యచంద్రులు, జ్యోతిర్గణము, అమృతము, బ్రహ్మ (హిరణ్యగర్భుడు), ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి, స్థూలము, విరాట్పురుషుడు – ఇవన్నియు అవిద్యాకృతమయినవి. జ్ఞానదృష్టిచేత చూచినచో ఇదంతయు ఆనందరూపమయిన బ్రహ్మమే. అవిద్యవలన రజ్జువే సర్పంగా కనబడుతుంది. అంతే ఇదీను. 175

**శ్లో॥ ఏతస్మాత్పురుషాల్లవాస్త్రుటికలా కాష్ఠా నిమేషాః క్షణా**
**నాడ్యశ్చాపి ముహూర్తకా దిననిశాః పక్షాశ్చ మాసర్తవః ।**
**అబ్దా ఇత్యయముద్బభూవ సమయః కస్మింస్తు కాలే స్వరుక్**
**త్రైలోక్యం స దుదోహ భోగ్యనిచయం గోపః పయో గామివ ॥ 176**

భావ॥ "**ప్రకృతిః పురుషశ్చైవ నిత్యః కాలశ్చ సత్తమ**' అని పురాణం కాలము నిత్యమని చెప్పినది. అది అవిద్య దృష్ట్యా వ్యవహారనిత్యమే కాని విద్యాదృష్ట్యా కాదు.కాలము బ్రహ్మము నుండియే ఆవిర్భవించినది. కనుక కార్యము జన్యము అయినదేదీ నిత్యము కాదు. క్రింద చెప్పబోవు కాలములు వాటి విభాగములు అన్ని బ్రహ్మరూపము.

1. లవము = తామరపూవురేకును సూదితో గ్రుచ్చునంతకాలము. విడిగా కాదు, గుత్తిలో గ్రుచ్చునపుడు ఒక రేకు తెగే కాలము. చూడండి. "నలినీపత్రసంహత్యాం సూక్ష్మసూచ్యావిభేదనే దళేదళేతుయః కాలః సకాలో లవ సూచకః"

2. త్రుటి = "30" లవములు త్రుటి; "లవైః త్రుటిః స్యాత్ త్రింశద్భిః"

3. కలా = త్రుటులు 30 4. కాష్ఠః = 30 కలలు

5. నిమేషః = రెప్పపాటు కాలము = కాష్ఠలు 18

6. క్షణం = 30 కలలు 7. నాడి = ఘటిక

8. ముహూర్తాలు = 12 క్షణాలు, 2 ఘడియలు

9. దినం/నిశ = 30 ఘడియలు 10. అహోరాత్రం = 60 ఘడియలు

11. పక్షాలు = 15 అహోరాత్రులు - శుక్ల, కృష్ణ

12. మాసాలు = 2 పక్షాలు, చైత్రం/మేషం మొదలగునవి

13. ఋతువులు = '2' మాసాలు వసంతాదులు

14. సంవత్సరము = '6' ఋతువులు ప్రభవ మొదలుగా - 60

చాంద్రమాన, సౌరమాన, బార్హస్పత్య, సావన మానములు - నాలుగు

ఇట్టి కాలమున స్వయంప్రకాశుడయిన ఈశ్వరుడు త్రిలోకములనుండి "ఆవునుండి గోపాలుడు పాలుపిండినట్లు" భోగ్యములను సృష్టించెను. 176

**శ్లో॥ ఊర్ధ్వం స్తమ్భవదేష నో భవతి వా సూర్యాదివన్నోర్ధ్వగ-**
**శ్శాలావంశ ఇవాథ గోవృషభవత్తిర్యఙ్ న వాయం పుమాన్ ।**
**మధ్యే తిష్ఠతి నో గృహాన్తరివ నో మధ్యస్థితో నాభివత్**
**తస్మాదేష మహద్యశా న పురుషైర్గ్రాహ్యో నియామ్యో న చ ॥ 177**

భావ॥ ఈ బ్రహ్మ పదార్థము స్తంభము వలె పైకి పొడుగుగా పోదు. సూర్యాదులవలె ఊర్ధ్వవ్యాపి కాదు. శాలావంశములాగా ఎద్దులాగా గాని 'తిర్యక్' కాదు. పురుషుడూ కాదు. ఒక ఘటంలాగా గృహమధ్యమునందుండదు. నాభివలె గృహమధ్యగతం కాదు. అందువలన ఈ మహద్యశుడు పురుషులకు అందుబాటులో దొఱకడు. మన నియమములకు లొంగడు. 177

విశే॥ 1. శాలావంశము = దూలము

2. మహద్యశాః = మహాన్ లేదా మహత్ అని కీర్తిగలది. లేదా మహత్ అనగా బ్రహ్మవలె వ్యాపకమయిన కీర్తిగలది. లేదా మహద్యశాః అను పేరు గలది.

**శ్లో॥ తచ్చాతీన్ద్రియమస్య రూపమనఘో బుద్ధ్యాఽగ్ర్యయా పశ్యతి**
**జ్ఞాత్వైనం హ్యమృతో భవత్యపి యతః ప్రాణోత్క్రమో నో బుధః ।**
**అస్మాదాస హిరణ్యగర్భ ఇతి నా ప్రాక్సర్వభూతేశ్వరః**
**స ద్యాం భూమిమిమాం బిభర్తి జగతాం రాజా నియన్తా భవన్ ॥178**

భావ॥ ఆయనరూపం అతీంద్రియం. అయినా అగ్రాహ్యుడు కాడు. ఆయన రూపం సచ్చిదానంద స్వరూపము. అట్టి రూపమును పుణ్యపాపరహితుడయిన జ్ఞానయోగి ఏకాగ్రమయిన బుద్ధితో చూడగలడు. ఆ పురుషుని గుర్తించిన యోగి అమృతుడగును. సంసారదుఃఖ రహితుడై పరమానందమయుడగును. అమృతుడు కావటం అనగా మరణం లేదని అర్థం. కాని శుకవామదేవాదులు మరణించలేదా? వారేరి? కనుక మరణం ప్రాణములు (సూక్ష్మ శరీరం) లేచి పరలోకాలకు పోవటం. అట్టి దశ నిర్గుణ జ్ఞానికి లేదు. "తస్య ప్రాణానోత్క్రామంతి, అత్రైవ సమవలీయంతే" అని గదా! శ్రుతి. కనుక వారు బ్రహ్మ భావము చెందెదరు. మరణం గాని జీవత్వంగాని వారికి లేవు. ఈ పురుషుని నుంచియే మొదట సర్వలోకేశ్వరుడయిన హిరణ్యగర్భుడు ఆవిర్భవించెను. అతడే రాజు, నియంత అయి యీ ద్యావాభూములను భరించుచుండెను. 178

విశే॥ 1. ఆయనకు శబ్దస్పర్శరూపరసగంధాలు లేవు - కనుక ఇంద్రియగ్రాహ్యుడు కాడు.

2. తత్త్వవేత్తలకు మరణం లేదంటే అర్థం వారు శరీరంతో ఉంటారని కాదు. శరీరం వదలి జీవుడుగా సూక్ష్మశరీరంతో పరలోకగమనం చేయటం వంటివి ఉండవు. అందుకని జీవుడుగా ప్రాణధారణ చేయడు. (జీవ ప్రాణధారణే) అతను కేవలం ఘటాకాశం ఘటభంగం తరువాత మహాకాశంలో లీనమయినట్లు "బ్రహ్మ" అగును.

**శ్లో॥ ఆత్మానఙ్చ బలం దదాతి చ తనౌ జీవాత్మనా యః స్థితో**
**యస్యాజ్ఞామతివర్తితుం న మనుజా దేవాశ్చ నేశాస్సమే ।**
**యస్యాస్తే చ వశేఽమృతం మృతమపి ఛ్చాయేవ హా ప్రాణినాం**
**యస్యేమే హిమవన్ముఖా మహిమభిస్తిష్ఠన్తి భూమౌ ధరాః ॥ 179**

భావ॥ హిరణ్యగర్భుడు చాల గొప్పవాడు. జీవస్వరూపంగా హిరణ్యగర్భుడు శరీరమునందు ఆత్మను, ఇంద్రాదిరూపములతో బలమును కలిగించును. ఆయన ఆజ్ఞను మనుజులు దేవతలు

రాక్షసులయినా ఉల్లంఘించలేరు. ప్రాణులయొక్క "మృత - అమృత" దశలు "నీడవలె" ఆయన వశమునందున్నవి. ఆయన మహిమవలననే హిమాలయం వంటి మహాపర్వతములు భూమియందు నిలిచియున్నవి. లేకుంటే అవి అడ్డంగా పడి యుండవలసినది. ఈయన మహిమయే ఇట్లున్నచో ఇక పరమేశ్వరుని మహిమ గూర్చి ఏమి చెప్పగలము? 179

**శ్లో॥ భూమ్యా సాకమవస్థితో జలనిధిర్యస్యైవ నిఘ్నో దిశా**
**నిఘ్నా యస్య సమా భుజావివ యతో ధర్మోఽ ప్యధర్మస్తథా ।**
**ద్యావాభూమియుగఞ్చ యస్య రుదితాదాసీచ్చ సంస్తమ్భితం**
**దేవానాఞ్చ నృణాముదేతి తరణిర్యస్యాధికారాద్బహు ॥ 180**

భావ॥ భూమితో సహా అంతరిక్షంలో నిలిచియున్న సముద్రుడు ఆయనకు అధీనము. దిక్కులన్నియు ఆయనకు అధీనము. ఆయనకు ధర్మము, అధర్మము భుజములు. ఆయన రోదన శబ్దము నుండియే ద్యావాభూములు ఏర్పడినవి. అంతేగాక అలా అంతరిక్షమున స్తంభించినవి. దేవతలకు మనుజులకు అవి నివాసస్థానములు కాగలిగినవి. ఆయన అధికారమునకు లోబడి సూర్యుడు రకరకాలుగా ఉదయించుచున్నాడు. (రాశిభేదం, ఋతుభేదం వలన ఉదయభేదం) 180

**శ్లో॥ ద్యాముగ్రాం పృథివీం దృఢా మకృత యః స్వర్గామృతం పుణ్యవ**
**త్స్వజ్ఞానాత్మతమోరవిష్వమృతమప్యాస్థాపయామాస యః ।**
**గన్ధర్వాదిగణం నభస్యుదసృజ ద్దక్షం దధానా అపః**
**కుర్వాణా శ్శుచి మాప యద్భువనతాం సర్వామరాస్వాయితః ॥ 181**

భావ॥ పాపాత్ములకు దరిచేరరాని ఉగ్రమయిన ద్యులోకమును, దృఢమయిన సర్వనిలయమయిన భూమిని, పుణ్యవంతులకు స్వర్గసుఖములను, అజ్ఞాన స్వరూపమయిన అంధకారమును పారద్రోలు సూర్యులయిన సనకాది తత్త్వవేత్తలయందు అమృతమయిన మోక్షసుఖమును ఆయనయే స్థాపించినాడు. ఆకాశమునందు గంధర్వాదులను సృజించెను. అగ్నిచయన నిపుణుడయిన యజమానుని (దక్షుని) ధరించినవి, అలాగే అగ్నిని పుట్టించునట్టి నీటిని విశ్వముగా చేసెను. మొదట ప్రపంచమంతా జలమయముగా నుండెను. '**అప ఏవ ససర్జాదౌ తాసు వీర్య మపాసృజత్, తదణ్డమభవద్ధైమం సహస్రాంశుసమప్రభం**' అని భాగవతం. ఆయనయే సర్వదేవతలకు జీవనమయినవాడు. ప్రాణములయినవాడు. 181

**శ్లో॥ ఆత్మా పుత్ర ఇతి శ్రుతేస్స భగవాన్ దేవోత్తమో హీశ్వరో**
**బ్రహ్మాణ్డోదరవర్త్యయం హి సకలా ఆవృత్య కాష్ఠాః స్థితః ।**
**జాతోఽయం బహుధా భవిష్యతి పునః ప్రత్యఙ్సమస్తాన్తర-**
**స్సర్వాత్మేన్ద్రియసాధనస్తదధిపస్సర్వాశ్రయస్తిష్ఠతి ॥ 182**

భావ॥ "ఆత్మావై పుత్రనామాసి" అని శ్రుతి. అందువలన ఆ హిరణ్యగర్భుడు ఈశ్వరుడే. ఆయన దేవోత్తముడు. బ్రహ్మాండమధ్యమందున ఉన్న యీ దేవుడు సర్వదిక్కులను ఆవరించియుండెను. ఈయన దేవమనుష్యాది రూపములతో అనేక విధములుగా పుట్టినాడు. పుట్టగలడు. అంతా మాయ వలననే జరుగును. సమస్త అన్నమయాది కోశములకు ఆంతరుడైనవాడు. సర్వ, అంతఃకరణ, ఇంద్రియాలు సాధనములుగాగల ఆ ప్రత్యగాత్మ వాటికి అధిపతి గూడా. సమస్త జగదాధారుడయిన వాడు. సర్వకల్పనలు ఆ యీశ్వరుని మీదనే జరిగినవి కదా! 182

**శ్లో॥ సర్వాత్మా యదయం తతోఽస్య దృశయస్సర్వత్ర వక్త్రాణ్యథో**
**హస్తాశ్చాపి పదో భవన్తి సకలం వశ్యం భుజాభ్యామిదమ్ ।**
**భూతైః పఞ్చభిరేష సర్వభువనం చోత్పాదయంస్తిష్ఠతి**
**స్వస్మిన్నేవ మహిమ్ని హృద్గతమిమం యో వేద ధాతుః పితా ॥ 183**

భావ॥ ఈ ఈశ్వరుడు సర్వాంతరాత్మ. అందువలన ఈయనకు అనేక నేత్రములు, అనేక వక్త్రములు, అనేక హస్తములు, అనేక పాదములు మిగిలిన అవయవాలు అన్నియు అనేకములే. ఇదంతయు ధర్మాధర్మరూపమయిన ఆయన భుజములకు అధీనము. ఇట్లు పంచభూతములతో సర్వమును పుట్టించుచు రక్షించుచు హరించుచు, ఆయన తన మహిమయందే తానుండును. హృదయగతుడయిన ఈ ఈశ్వరుని గుర్తెఱిగిన వాడు బ్రహ్మకు గూడ కర్త అయిన ఆ ఈశ్వరుడే అగును. 183

**శ్లో॥ ఓతఃప్రోత ఇవాఖిలే జగతి యస్తన్తుర్వ దీర్ఘః పటే**
**సోఽస్మాకం జనితా చ బన్ధురముతో ధాతా చ జానాతి సః ।**
**లోకాంస్తేషు పదాని భోగ్యనిచయం సర్వం విదిత్వా యథా**
**కర్మాస్మాకమయం ప్రయచ్ఛతి ఫలం సర్వేశ్వరస్సర్వవిత్ ॥ 184**

భావ॥ వస్త్రమునందు దీర్ఘమయిన దారమువలె ఆయన అఖిల ప్రపంచమునందు పడుగుపేకగా వ్యాపించియుండెను. అతడు మనకు జనకుడయిన బంధువు. ఈ ప్రపంచమునకు పోషకుడు. ఆతనికి ఈ లోకములు, అందలి ఇంద్రాది పదవులు, అమృతాది భోగ్య వస్తు సమూహము తెలియును. సర్వేశ్వరుడు సర్వజ్ఞుడు అయిన ఆ మహాపురుషుడు అన్ని తెలిసికొనియే మనకు మన సర్వకర్మల ఫలమును ఇచ్చును. 184

**శ్లో॥ విద్వాంసః పరియన్తి లోకనిచయం ప్రాచ్యాదికాష్ఠాచయం**
**లోకాంస్తత్ర చ లోకపాంశ్చ యుగపత్సర్వాత్మకత్వాత్స్వతః ।**
**సర్వత్రాపి పరాత్మనోఽస్య సతతావస్థానమీశస్య య-**
**శ్శాస్త్రాదేత్య గురోః ప్రపశ్యతి బృహద్బ్రహ్మైవ స బ్రహ్మవిత్ ॥ 185**

భావ॥ అనాత్మవేత్తలకు స్వర్గాదిఫలము. ఇక ఆత్మవేత్తలకు సర్వజ్ఞత్వం ఫలము. వారు సర్వాత్మకులు సర్వ వ్యాపులు కనుక, లోక సమూహమును, తూర్పు మొదలగు దిక్సమూహములను, పౌరులను, లోకపాలకులను ఏకకాలములో చూడగలరు. ఇక తత్త్వదర్శనమునకు ఫలము. ఈ పరమాత్మ అయిన ఈశ్వరుడు నిత్యము సర్వత్ర ఉంటాడన్న విషయమును శాస్త్రం వలన గురూపదేశము వలన గ్రహించిన జ్ఞాని బ్రహ్మను ప్రత్యగాత్మగా అభిన్నముగా గ్రహించునో అతడు బ్రహ్మమే అగును. "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" 185

**శ్లో॥ సత్యస్యాస్య పరాత్మనః ప్రథమజో హైరణ్యగర్భో మహాన్**
**లోకాన్ సప్త దిశో దశాప్యసుభృతో దేవాదిదేహాంస్తథా ।**
**సృష్ట్వా సర్వమభీత్య తాత్త్వికధియా సత్యం సుఖం చిన్మయం**
**బ్రహ్మాత్మానమనన్తమేత్య మహతి బ్రహ్మణ్యహో వర్తతే ॥ 186**

భావ॥ బ్రహ్మమయిన ఆ బ్రహ్మవేత్త, హిరణ్యగర్భుడే. సత్యమయిన పరమాత్మనుండి ప్రథమజాతుడయినవాడు హిరణ్యగర్భుడు. ఆయనయే మహత్తత్త్వము. సప్తలోకములను, దశదిక్కులను, ప్రాణములుగల దేవాది దేహములను సృష్టించి అందులో ప్రవేశించి వ్యాపించినవాడు హిరణ్యగర్భుడు. ఆయన తత్త్వజ్ఞానముతో సచ్చిదానంద స్వరూపమయిన బ్రహ్మమును తన ఆత్మగా గుర్తించిన బ్రహ్మవేత్త. అట్టి పూర్వకల్ప హిరణ్యగర్భుడు బ్రహ్మభావమును పొంది ఉండెను. ప్రస్తుత హిరణ్యగర్భుడున్ను జీవన్ముక్తుడై బ్రహ్మభావమున నుండును.

సత్యం పరబ్రహ్మం అనటం వలన ఆయనకు భిన్నంగా ఉన్నదంతయు మిథ్యయే. హిరణ్యగర్భుడుగా ఇతని బ్రహ్మభిన్నమయిన అస్తిత్వమున్ను మిథ్యయే. 186

విశే॥ హిరణ్యగర్భుడు తన ఆత్మను బ్రహ్మగా, లేదా బ్రహ్మమును తన ఆత్మగా బ్రహ్మభిన్నమయిన తన ఆత్మను సచ్చిదానంద రూపముగా సాక్షాత్కరించికొన్న అద్భుత చరిత్రుడు.

**శ్లో॥ తప్త్వా జ్ఞానమయం తపస్స భగవాన్ సత్యం స్వరోచిరృతం**
**సృష్ట్వా రాత్రిదినాత్మకఞ్చ సమయం నానావిధానర్ణవాన్ ।**
**అబ్దం చన్ద్రరవీ యథాపురమధాద్విశ్వస్య వశ్యాత్మనా**
**ద్యాం భూమిం గగనఞ్చ తత్ర సకలాన్భోగానపేక్షావశాత్ ॥ 187**

భావ॥ ఆ ఈశ్వరుడయిన హిరణ్యగర్భుడు ముందు జ్ఞానమయమయిన తపస్సు చేసెను. స్వయం ప్రకాశుడయిన ఆయన సత్యమును ఋతమును సృజించెను. అవే అహోరాత్రములు (అందుకే సత్యంత్వర్తేన పరిషించామి, ఋతంత్వాసత్యేన పరిషించామి. అని భోజనంలో పరిషేచనము.) అట్టికాలమును వివిధ సముద్రములను, మేఘములను, సంవత్సరములను, సూర్యచంద్రులను, యథాపూర్వముగా సృజించెను. విశ్వనియంత అయిన ఆయన తన ఆత్మద్వారా

సంకల్పవీక్షణముతో ద్యావాభూములను అంతరిక్షమును సృజించెను. అంతేకాదు అందు సమస్త భోగములను సృజించెను. 187

**శ్లో॥ ప్రాక్కల్పే పురుషైః కృతా బహువిధా ధర్మా అధర్మాః ఫలం**
**దాతుం స్వప్రవణా యదా ప్రజనయన్ లోకాన్ సముద్రస్తథా ।**
**రాజాముష్య వృషా గిరేః కుహరవద్దేహాన్తరభ్రే స్థితః**
**పుణ్యేఽవ్యేఽత్యధికే సువాన ఇవ నశ్చన్ద్రః ప్రవృద్ధో బృహత్ ॥ 188**

భావ॥ పూర్వకల్పమున పురుషులు (జీవులు) చేసిన బహువిధములయిన ధర్మ - అధర్మములు, ఫలమిచ్చు సమయము వచ్చినపుడు సముద్రగంభీరుడయిన ఈ ఈశ్వరుడు, లోకములను సృష్టించుచుండును. ఈలోకమునకు రాజు, భక్తులకు వరములను వర్షించు ఇంద్రుడు అయిన ఈ దేవుడు భక్తుల హృదయ గుహలలో నుండును. ఈ హృదయగుహ పవిత్రము. రక్షణ హేతువు. ఇతరావయవములకన్న శ్రేష్ఠము. అందు సర్వజీవ ప్రేరకుడై చంద్రునివలె ఆహ్లాదకుడై గొప్పవృద్ధిగలవాడై బ్రహ్మమగును. 188

విశే॥ 1. సముద్రః = సముద్రమువలె గంభీరుడు, సమ్మోదమును ఆనందస్వభావంగా గలవాడు, ప్రపంచమునకు మంచి ఉత్పత్తిస్థానము (ఉదవతి)

2. సముద్రత్వం మొదలగు గుణములుగల ఆయన బ్రహ్మమగును. లేదా బ్రహ్మం వలె ప్రవృద్ధుడగును. లేదా బ్రహ్మభిన్నమయిన సముద్రత్వాది విశేషణములుగల ఆ భగవాన్ ప్రవృద్ధుడగును.

**శ్లో॥ సోమోఽసౌ విభురీశ్వరస్సకలవిద్వహ్న్యాత్మనా తిష్ఠతి**
**ధ్యాయన్తోఽగ్నిమతస్తరన్తి విపదో భస్మీకరోతి ద్విషః ।**
**ధ్యాతౄణాం దహనస్స నావిక ఇవామ్భోధిఙ్చ నావా జనం**
**భక్తం స్వస్య వితారయత్యఘచయం ధత్తే చ సర్వార్థగమ్ ॥ 189**

భావ॥ ఈ ప్రభువు ఈశ్వరుడు సోముడు అనగా ఉమ అనగా బ్రహ్మవిద్యతో గూడినవాడు. సకలవేత్త, ఇతడు అగ్నిస్వరూపుడు. అందువలన ఇతనిని అగ్నిగా ఉపాసన చేయువారు ఆపదలను దాటెదరు. ఈయన దహనుడు కనుక తన ఉపాసకుల శత్రువులను భస్మము చేయును. నావికుడు తన నౌకతో జనమును సముద్రమును దాటించినట్లు ఈయన తన భక్తులను పాపసముద్రమును దాటించును. ఆ భక్తగణమునకు సమస్త – పుత్రపౌత్ర భూ, హిరణ్యాదులను అనుగ్రహించును. 189

**శ్లో॥ తోయం బ్రహ్మణి కల్పితం జ్వలతి హి జ్యోతిర్మయం మాయయా**
**దేహాదేః ప్రవివేచితస్య మమ తజ్జ్యోతిః స్వరూపం జ్వలత్ ।**

**జ్యోతి ర్బ్రహ్మ తదేవ చాహమహమిత్యన్తః స్ఫురత్యేష యో**
**జీవో బ్రహ్మ స ఏవ మాం జలమహం వహ్నౌ క్షిపామ్యాత్మని ॥ 190**

భావ॥ ఈ ప్రపంచమునకు అధిష్ఠానము బ్రహ్మము. కనుక బ్రహ్మమునందు జలము కల్పితము. కల్పితమునకు అధిష్ఠానమయిన బ్రహ్మము జ్యోతిస్స్వరూపము. కనుక కల్పితమయిన జలము జ్యోతిర్మయంగా మెఱయుచుండును. ఇదంతమాయ కనుక నేను ఈ దేహాదికం కానని నారూపమున నేను విశ్లేషించగా నేను ఆ జ్యోతిస్స్వరూపముగా జ్వలించెదను. ఆ జ్యోతి బ్రహ్మమే. అదే నేను అని ఎవడు అంతర్గతముగా స్ఫురించునో వాడు జీవుడు. వాడు బ్రహ్మమే. నేను జఠరాగ్ని స్వరూపమయిన నాయందు జలమును ఆచమనరూపముగా హవనము చేసెదను. 190

విశే॥ సర్వము బ్రహ్మమునందు కల్పితము. నేను బ్రహ్మమునే. కల్పితమయిన నా దేహాదికము అధిష్ఠానంకన్న భిన్నం కాదు. కనుక జలము వహ్ని రెండూ నేనే. వహ్ని అనగా ఇచ్చట జఠరాగ్ని అని అర్థము.

**శ్లో॥ వేదానామృషభో జగన్మయతనుర్యో వేదసారః ప్రజా-**
**నాథస్యాభిమతశ్చ తత్ప్రణవగస్స బ్రహ్మవిద్యాం సతామ్ ।**
**శక్యః ప్రాప్తుమనాదిరాదిరముతః ప్రోవాచ జిజ్ఞాసవే**
**దేవర్షీన్ద్రపితృప్రజాయ భగవాంస్తేభ్యో నమస్కుర్మహే ॥ 191**

భావ॥ వేదములలో శ్రేష్ఠమయినవాడు, విశ్వరూపుడు, ప్రజాపతికి 'వేదసారమని' అభీష్టమయినవాడు, అట్టి ప్రణవమునకు అర్థమయినవాడు, అయిన హిరణ్యగర్భుడు లేదా హిరణ్యగర్భుని ద్వారా ఈశ్వరుడు, కేవలం సత్పురుషులకు అనగా బ్రహ్మవేత్తలకు మాత్రమే సులభుడు. అనాది, ప్రపంచమునకు ఆది అయిన ఆ మహాత్ముడు, భగవాన్, జిజ్ఞాసువులయిన దేవర్షి, ఇంద్ర, పితృదేవతా గణమునకు బ్రహ్మవిద్యను ప్రణవగతుడయి ఉపదేశించెను. ఆయనవలన ప్రత్యక్ష శిష్యులయి బ్రహ్మవిద్యనేర్చిన ఆ బ్రహ్మవేత్తలందరికి నమస్కరించెదము. బ్రహ్మవేత్తలు బ్రహ్మస్వరూపములు కనుక, వారికి చేయునమస్కారము పాపనాశకమయి చిత్తశుద్ధిని కలిగించును. కనుక జిజ్ఞాసువులు జ్ఞానికి నమస్కరించుట కర్తవ్యము. 191

**శ్లో॥ జ్ఞాతవ్యం తపసా బృహత్సుమతిభిస్సాక్షాదృతం తత్తపః**
**సత్యఞ్చ శ్రవణం శమో వితరణం యజ్ఞస్తథార్వాక్తనమ్ ।**
**త్రైలోక్యాత్మకమస్తి యద్బృహదిదం వైరాజదేహాత్మకం**
**తస్యోపాసనముత్తమం తప ఇదం సమ్యఙ్ముముక్షో! కురు ॥ 192**

భావ॥ "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" అని శ్రుతి. కనుక తపస్సువలన వచ్చిన జ్ఞానము

మోక్షదాయకము. కనుక సుధీవరులు తపస్సుతో బ్రహ్మమును తెలిసికొనవలయును. ఆ తపస్సు సాక్షాత్తుగా ఋతము. ఋతము = యథార్థ వస్తుచింతన. సత్యం – యథార్థభాషణ. అదే తపస్సు, శ్రవణం – వేదవేదాంతార్థ శ్రవణము. ఇదీ తపస్సే. ఇకముందు చెప్పేవన్ని తపస్సులే. శమము. ఇంద్రియ జయము. వితరణం = దానము, యజ్ఞము, ఇదంతా తక్కువరకం తపస్సు. ఉత్తమ తపస్సుకాదు. త్రైలోక్యస్వరూపంగా కొలువుదీరిన ఆ బ్రహ్మం యొక్క విరాడ్రూపము–నుపాసన చేయుము. అది ఉత్తమం. ఎందుకంటే ప్రపంచమంతా బ్రహ్మస్వరూపంగా నిత్యము కనబడుతున్నది గదా! ఓ మోక్షార్థీ! ఈ విరాట్టును చక్కగా ఉపాసన చేయుము. అదే ఉత్తమం. 192

**శ్లో॥ పున్నాగస్య సుపుష్పితస్య సురభిర్దూరాద్యథా వాతి వా**
**పున్నాగస్య సుకర్మణశ్శుభయశో వాతి ద్యులోకం భువః ।**
**పద్భ్యామాహరతేవ దమ్బరభువా గర్తేఽసిధారాం స్థితాం**
**రక్ష్యో బుద్ధిమతాఽనృతా దహరహః స్వాత్మా ద్విలోకచ్ఛిదః ॥ 193**

భావ॥ చక్కగా పుష్పించిన పున్నాగవృక్షముయొక్క పరిమళము సుదూరం వ్యాపించును. అట్లే సత్కర్మశాలి అయిన పురుష శ్రేష్ఠుని శుభకీర్తి భూతలమునుండి ద్యులోకమును వ్యాపించును. గర్తము నందు కత్తిపదునుమీద (అసిధారావ్రతం) నడచునట్టి దొమ్మరివానివలె, జ్ఞానిగూడా ప్రతిదినము ఉభయలోకభ్రష్టునిగావించు అనృతమునుండి తనను తాను రక్షించికొనవలయును. దొమ్మరివాడు ఏమాత్రం ఒళ్లుమఱచినా కత్తికి తెగవచ్చు. గుంటలో పడవచ్చు. అందువలన బహుశ్రద్ధతో పొరపాట్లు రాకుండానడుస్తాడు. అలాగే వ్యక్తియును జాగ్రత్తగా నడువవలయును. 193

**శ్లో॥ యో దేవేషు పితామహశ్చ కవిషు ప్రాచేతసో బ్రాహ్మణే–**
**ష్వాద్యో ధాతృసుతో మృగేషు మహిషః శ్యేనస్తథా పక్షిషు ।**
**అశ్వత్థో ధరణీరుహేషు విదితస్సోమః పవిత్రేషు వా**
**సూర్యేన్ద్వగ్న్యనిలాత్మఖాద్రిధరణీసిన్ధ్వాదిలోకోఽపి సః ॥ 194**

భావ॥ ఆ పరమాత్మ దేవతలలో హిరణ్యగర్భుడు. కవులలో వాల్మీకి. బ్రాహ్మణులలో బ్రహ్మపుత్రుడు వశిష్ఠుడు. మృగములలో మహిషుడు. పక్షులలో శ్యేనము. వృక్షములలో అశ్వత్థము. పవిత్రములలో సోమరసము. అంతేగాక సూర్యచంద్రవహ్ని వాయు మన ఆకాశ పర్వత భూమి సముద్రాది సమూహము గూడా అతడే. పరమాత్మ ముందుగా స్వయంగా తెలియకపోయినా ఆయన విభూతులు ప్రత్యక్షంగా తెలుస్తాయి గదా! ఇవి ఆయన విభూతులు. 194

**శ్లో॥ ఏకాం లోహితశుక్లకృష్ణగుణవత్తేజోఽమ్బుభూమ్యాత్మికాం**
**మాయాం దేవమనుష్యపత్రగపశుక్రిమ్యాదిభూతోదయామ్ ।**

**ఏకోఽనాదిరజాం భజన్ హి పురుషో మూఢః పతత్యమ్బుధౌ**
**సంసారే పురుషోఽపరస్తు విబుధో హిత్వాఽమృతం విన్దతే ॥ 195**

భావ॥ లోహిత శుక్ల కృష్ణ వర్ణములు గలదై తేజోబన్నస్వరూపమయినదియు, దేవమనుష్యపశుపక్షిక్రిములు మొదలగు భూత ప్రసవిత్రి అయిన మాయారూపమయిన అజను ఒక అనాది అయిన పురుషుడు సేవించుచు సంసార సముద్రమున పడుచున్నాడు. మరొక మహాపురుషుడు ఈ మాయ అను అజను వదలి అమృతత్వమును పొందుచున్నాడు. 195

విశే॥ 1. స్థూలారుంధతీ న్యాయంతో సమస్త జగత్తు ఈశ్వరుడన్నాము. కాని అందులో చైతన్య రూపమయిన జీవుడే ఈశ్వరుడని ఇపుడు విశేషముగా చెప్పుచున్నాము. అరుంధతినే చూపినట్లు ప్రత్యగాత్మనే చూపుచున్నాడు. అభోక్త అని. ఆత్మారాముడని, అమృతుడని.

2. మరి జగత్తు జీవుడు ఈశ్వరులా? కాదా? అని సంశయము – జీవ – ఈశ్వరులొకే చైతన్యము. మాయవలన ఉపాధిభేదంతో భిన్నంగా కనబడటమే. ఇక జగత్తు ఈశ్వరుడే. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అన్నారు గదా! అధిష్ఠానం అయిన బ్రహ్మం మీద వివర్తంగా భాసించేదే కనుక అధిష్ఠానమే కదా!

**శ్లో॥ సర్గానన్తరజా ప్రజా న పురుషాదన్యా ఘటో వా మృదః**
**సర్గాత్ప్రాక్పురుషాత్పరం కిమపి నో బ్రహ్మైకమేవాస్తి యత్ ।**
**జీవస్సన్నయమేక ఏవ సకలాన్ దేహాననుప్రావిశత్**
**జీవోఽస్మాత్తదనన్య ఏవ జగతా తాదాత్మ్యవాన్ షోడశీ ॥ 196**

భావ॥ మట్టికన్న ఘటం భిన్నమయినది కాదు. అట్లే సృష్టితరువాత ఏర్పడిన ప్రజలు పురుషునికన్న భిన్నము కారు. సృష్టికి ముందు పురుషునికన్న భిన్నమయినది ఏదీలేదు. బ్రహ్మమొక్కటి మాత్రమే యున్నది. ఈ బ్రహ్మమే జీవుడయి సకల దేహముల లోనికి ప్రవేశించెను. కనుక జీవుడున్ను పురుషునికన్న వేరుకాదు. అతడు షోడశకలా సహితుడై జగత్తుతో తాదాత్మ్యమును పొందెను. 196

విశే॥ 1. జగత్తు పురుషకార్యం కనుక అది పురుషునికన్న భిన్నం కాదు. కనుక జగత్తును పురుషునిగా చెప్పవచ్చును.

2. జగత్కారణం పురుషుడే కావాలి. ఎందుకంటే జగత్తుకు ముందు వెనుకల పురుషుడు తప్ప వేరెవరు లేరు. అవ్యాకృతమయిన ప్రపంచం ఉన్నా భగవంతుని శక్తిగానే ఉంటుంది. అగ్నికన్న అగ్నిశక్తి వేరుగా లేదు గదా!

3. పురుషకార్యం కనుక జగత్తును పురుషుడందాము. కాని జీవుడు పురుషకార్యంకాడు. అతడు అజుడు కదా! సమా – జీవుడు వేరెవరో కాదు. పురుషుడే. ఆయనయే ప్రతిబింబముగా

ఉపాధులలో వ్యాపించి జీవుడయినాడు. బింబం ప్రతిబింబం ఒక్కటే కాదు. అవచ్ఛిన్నం దాని అవచ్ఛేదకం కన్న భిన్నం కాదు. వృక్షంకన్న వృక్షత్వం అన్యం కాదు గదా!

**శ్లో॥ బ్రహ్మజ్ఞానదమీశ్వరఞ్చ ధిషణా సమ్ప్రేరకం దేశికా-**
**కారేణాత్మకలోపదేశకమముం సమ్ప్రార్థయేతేతి నా ।**
**ఆచార్యం ప్రదిశాద్య దేహి ధిషణాం నిర్మూలయైనశ్చయం**
**దుస్స్వప్నాభజగత్ప్రతీతిమపి మే జ్ఞానఞ్చ భద్రం దిశ ॥ 197**

భావ॥ జీవునకు సంసార నివృత్తి అగు మార్గం ఇది. ఈశ్వరుడు బ్రహ్మజ్ఞానప్రదాత బుద్ధులకు ప్రేరణ కలిగించువాడు. అందుకు ఉపాధ్యాయరూపముతో రాగలడు. అలావచ్చి ఆత్మకలను ఉపదేశిస్తాడు. అంతర్యామిరూపంతో గురువు రూపంతో రాగలడు. అందువలన ఆయనను వ్యక్తి ఇలా ప్రార్థింపవలయును. "దేవ! నాకు నేడు ఆచార్యుని అనుగ్రహింపుము. బుద్ధిని అనుగ్రహింపము. పాపసమూహమును నిర్మూలింపుము. దుస్స్వప్నం వంటి యీ ప్రపంచ ప్రతీతిని తొలగింపుము. నాకు మంగళప్రదమయిన "అహంబ్రహ్మోస్మి" అను జ్ఞానమునిమ్ము". 197

**శ్లో॥ అమ్భోధేరివ వీచయో ద్యుతిమయాద్భూతాన్యభూవన్పరా-**
**దవ్యక్తోపహితాద్విభోః శ్రుతిగణే గూఢాఽభిధాఽస్యోమితి ।**
**అస్యోపాంశుజపాదయేదమృతతాం విద్వానిదం వర్తతే**
**దేవానాం రసనా ముఖేష్వివ తథా మోక్షారినాభ్యాయితమ్ ॥ 198**

భావ॥ స్వయంప్రకాశుడు, పరుడు అవ్యక్తమునందున్నవాడు - అగు ప్రభువునుండి "సముద్రమునుండి తరంగములవలె" భూతములు ఆవిర్భవించినవి. ఈయనకు శ్రుతులందు "ఓం" అని నిగూఢమయిన నామం ఉన్నది. జ్ఞాని ఈ ఓంకారముయొక్క "ఉపాంశుజపము" వలన అమృతత్వమును పొందును. ఇది దేవతల ముఖములందు నాలుకవలె నుండును. అనగా వారు నిత్యము ఓంకారమును (ప్రాణనాదమును) పలుకుచుందురు. ఈ ప్రణవము మోక్షచక్రమునకు "నాభి" వంటిది. (ఉపాంశు జపమనగా - ధ్యానకాలములో అస్పష్టంగా మెల్లగా చేయు 'గొణుగుడు' వంటి జపము) 198

**శ్లో॥ జ్ఞానం యజ్ఞముపాశ్రితా హి మునయశ్చిత్తే ధరన్తో బృహ-**
**త్తన్నామ ప్రణవం బ్రువన్తి సనమస్కారాస్సదా బ్రహ్మణే ।**
**గౌరోఽయం ప్రణవాత్మకశ్చ వృషభః శృంగైశ్చతుర్భిర్యుతోఽ**
**కారోకారమకారనాదకపటైస్తత్త్వం పరం వాస్తవాన్ ॥ 199**

భావ॥ జ్ఞానమునే యజ్ఞముగా చేయుచున్న మునులు బ్రహ్మమును తమ మనస్సులో

ధరించి, బ్రహ్మమునకు నమస్కారములు చేయుచు ఆయన నామమయిన ప్రణవమును పలుకుదురు. ఈ ప్రణవము శ్వేతవర్ణము. వృషభరూపము. దీనికి 4 శృంగములు. అవి అకార ఉకార మకార నాదములు. ఈ ప్రణవ వృషభము పరతత్త్వమును వెల్లడించినది. 199

**శ్లో॥ ఆస్తే శృఙ్గచతుష్కమస్య బృహతః పాదాస్త్రయస్త్వాత్మని**
**ప్రాజ్ఞస్తైజసవిశ్వకౌ పరమహద్విశ్వమ్భరా దైవతే ।**
**శక్తీ ద్వే చిదచిన్మయే తు శిరసీ లోకాః కరా స్సప్త గౌ**
**ర్బద్ధో౽యం ప్రణవ స్త్రిధా వదతి తద్వ్యాప్తం సమస్తం యతః ॥200**

భావ॥ ఈ ప్రణవ బ్రహ్మకు ఇంతకుముందు చెప్పిన, శృంగ చతతుష్టయం ఉన్నది. అవి అకార ఉకార మకార వాదములు (అర్థమాత్రలు) ఇక అధ్యాత్మంగా మూడు పాదములు. విశ్వతైజసప్రాజ్ఞులు అధిదైవతంగా = మూడు = ఈశ్వర హిరణ్యగర్భ విరాట్టులు.

శిరస్సులు 2 = అవి చిత్ – అచిత్ శక్తులు

చేతులు 7 = సప్తలోకములు

బంధములు 3 = విశ్వ తైజసప్రాజ్ఞరూపముగా విరాట్ హిరణ్యగర్భ ఈశ్వరులు గాను

అది ఇలా సమస్త వ్యాప్తమయి సర్వవ్యాప్తమయిన బ్రహ్మమును చెప్పును. (యతః = దేనిచేత = సార్వవిభక్తికః తసిః) 200

**శ్లో॥ విశ్వాద్యాస్త్రివిధా విధాయ వపుషి బ్రహ్మాండగర్భే విరా-**
**ణ్ముఖ్యాశ్చ త్రివిధా విధాయ నిహితం జ్యోతిర్మయం బ్రహ్మ తత్ ।**
**జాగ్రత్స్వప్నసుషుప్తిధాతృ పణిభిస్సఙ్గోప్యమానం మహా-**
**వాక్యార్థం సుగురూపదేశవశతో జానాతి ధన్యః పుమాన్ ॥ 201**

భావ॥ ఆధ్యాత్మముగా శరీరమునందు విశ్వతైజసప్రాజ్ఞులను, అధిభౌతికముగా బ్రహ్మాండ గర్భమున విరాట్ హిరణ్యగర్భ ఈశ్వరులను నిర్మించిన ఆ బ్రహ్మము జ్యోతిర్మయముగా నున్నది. "జాగ్రత్ స్వప్న సుషుప్తి" దశలలో దాగి ఉన్న ఆ మహావాక్యార్థమయిన ప్రత్యగభిన్నమయిన ఆత్మను గురూపదేశమువలన గుర్తెరిగిన పురుషుడు ధన్యుడు. గురువు బ్రహ్మతత్త్వమును అపరోక్షముగా పొందిన వాడయి యుండవలయును. 201

**శ్లో॥ దేవానాం ప్రథమం పురః స్వవపుషో యో జాయమానం మహాన్**
**విశ్వస్మాదధికో హిరణ్యజఠరం వేదైకవేద్యః పుమాన్ ।**
**సర్వజ్ఞర్షిగణే మహర్షిరయతే సో౽యం పరాత్మేశ్వరః**
**సంసారార్ణవతారకాత్మవిషయస్మృత్యా యునక్త్వాత్మనః ॥ 202**

భావ॥ విశ్వాధికుడు, మహాత్ముడు, తన శరీరమునుండి సర్వదేవాగ్రజుడుగా హిరణ్యగర్భుని ముందుగా ప్రతికల్పమున కనువాడు, వేదైక వేద్యుడు అనగా ఔపనిషదుడు సర్వజ్ఞులయిన ఋషులకన్న ప్రథమ ఋషి అనగా ప్రథమ సర్వజ్ఞుడు, అట్టి పరమాత్మ ఈశ్వరుడు, ఉపాధిభేదముతో మాయవలన బహువిధముగా కన్పట్టుచున్న యీ జీవాత్మలను సంసార సముద్రతారకమయిన బ్రహ్మాత్మైక్యస్ఫురణను ప్రసాదించి కాపాడుగాక! (**అవ్యక్త - ఉపహిత చైతన్యస్వరూపమైన ఈశ్వరాకారము నుండి ప్రథమజీవుడుగా హిరణ్యగర్భుడు జన్మించును,**)
"మత్తః స్మృతిః జ్ఞాన మపోహనం చ" – గీత. 202

**శ్లో॥ యస్మాదస్తి పరం న వస్తు భువనే నైవాపరం కిఞ్చన**
**జ్యాయో నాస్తి న చాల్పమప్యపగతద్వైతం తదేకం బృహత్ ।**
**స్తబ్ధోఽయం దివి తిష్ఠతి క్షితితలే వృక్షో యథా నిశ్చల-**
**స్తేనేదం పురుషేణ పూర్ణమఖిలం బ్రహ్మైవ నేదం జగత్ ॥ 203**

భావ॥ ఈ ప్రపంచమున ఆయనకన్న గుణాధికమయినది గాని గుణహీనమయినదిగాని సమానమయినదిగాని లేదు. అట్లే ప్రమాణంలో అధిక, అల్ప సమానజీవులు లేవు. అందువలన ఆ బ్రహ్మము అద్వితీయము ఏకము. భూతలము మీద వృక్షము వేరుదన్నుకొని నిటారుగా ఆకాశములో నిక్కియున్నట్లు బ్రహ్మం ఆత్మయందు నిశ్చలముగా వ్యాపించియుండెను. ఈవిధముగా పరమపురుషపరిపూర్ణమయిన యీ ప్రపంచము సమస్తము బ్రహ్మమే. అంతే తప్ప కనబడుచున్నట్లు ఈ జగత్తు బ్రహ్మభిన్నమయిన మరో వస్తువు కాదు. ఘటం మట్టియేగాని అందుకు భిన్నమయిన తత్త్వము గల ఘటము కాదు గదా! 203

**శ్లో॥ బ్రహ్మాభిన్నపరాత్మతత్త్వవిషయా నేయం స్మృతిః కర్మణా**
**లభ్యా న ప్రజయా ధనేన న తథా త్యాగేన లభ్యా బుధైః ।**
**త్యక్త్వా సర్వమిదం జితేన్ద్రియచయా ఏకాగ్రచిత్తా బుధా**
**జ్యోతిః స్వాత్మని సంస్థితం పరతరం స్వర్గాదయన్తే బృహత్ ॥ 204**

భావ॥ బ్రహ్మాత్మైక్య సంబంధమయిన ఈ కంఠచామీకర న్యాయతుల్యమయిన యీ బ్రహ్మాత్మ భావస్మరణ కర్మలవలనగాని, ప్రజ (సంతానం) వలనగాని, దానము వలన గాని రాదు. వీటినన్నింటిని వదలటం వలన అనగా త్యాగం వలన జ్ఞానులయిన వారికి కలుగుతుంది. ఈ సమస్తమును వదలి, ఇంద్రియసమూహములను జయించి మనస్సును ఏకాగ్రము చేసిన పండితులు తమయందే ఉన్న యీ స్వయం ప్రకాశమయిన బ్రహ్మజ్యోతిని దర్శించెదరు. ఇది స్వర్గముకన్న పరతరమయినది. 204

**శ్లో॥ యే సన్న్యస్య గురోర్ముఖాదధిగతశ్రుత్యన్తతత్త్వా జిత**
**ప్రాణాశ్శుద్ధహృద శ్శరీరపురమధ్యావస్థితే నిర్మలే ।**

**అల్పేఽస్మిన్ హృదయామ్బుజే పరగృహే నిశ్శోకమభ్రం బృహ**
**ద్ధ్యాయన్తి ప్రతిపద్య తత్త్వమిహ తే బ్రహ్మైవ దేహక్షయే ॥ 205**

భావ॥ తీవ్రప్రజ్ఞగలవారు జ్ఞానమాత్రం వలననే ముక్తులవుతారు. మందప్రజ్ఞులు ధ్యానసహాయం కోరుతారు. వీరు (మందప్రజ్ఞులు) సన్న్యసించి, గురుముఖమునుండి వేదాంత తత్త్వమును గ్రహించి ప్రాణజయము చేసినవారై శుద్ధహృదయులై శరీరపురమధ్యమున నున్న నిర్మలమయిన అల్పమయిన బ్రహ్మప్రాప్తి – ప్రదేశమయిన ప్రాదేశమాత్రమయిన హృదయ కమలమునందు శోకరహితము, పరమాకాశరూపము – అయిన బ్రహ్మమును ధ్యానింతురు. వీరు జీవన్ముక్తులయి దేహావసానమున బ్రహ్మమే అగుదురు. 205

**శ్లో॥ యో వేదాదిగతః స్వరః పరతరో వేదాన్తవేద్యస్తదో–**
**ఙ్కారస్యాదిపదం విరాజమమిమం విశ్వాత్మకం చోస్వరే ।**
**ధీమాంస్తైజసకాఙ్చనోదరమయే సమ్యగ్విలాప్యాథ తం**
**ప్రాజ్ఞో వ్యాకృతరూపమే ప్రకృతితో లీన స్త్రిపాదోమితి ॥ 206**

భావ॥ సాక్షాత్తుగా బ్రహ్మధ్యానం చేయు సమర్థత లేనివారు ఓంకారోపాసన ఇట్లు చేయవలెను. వేద ప్రారంభమునందు నిత్యము ఉచ్చరింపబడు స్వర రూపము, వేదాంతవేద్య తత్త్వరూప మయినది, పరతరము, శ్రేష్ఠతరము అయినది ఓంకారము. దాని మొదటి అక్షరము 'అకారము' అది విరాట్టు. శరీరంలో విశ్వము. దీనిని తరువాతి వర్ణమయిన 'ఉ'కారములో లీనము చేయవలయును. ఈ ఉకారము హిరణ్యగర్భస్వరూపము. శరీరమున తైజసరూపము. ఈ విశిష్ట – ఉకారమును 'మ' కారమున లీనము చేయవలయును. ఈ మకారము అవ్యాకృతము అవ్యక్తము మాయ, ప్రకృతి అజ్ఞానము ఇందున్నవాడు ఈశ్వరుడు. శరీరమున ప్రాజ్ఞుడు. ఈ విధముగా త్రిపాదమయిన "ప్రణవం" ప్రకృతియందు లీనమయినది – అని ధ్యానింప వలయును. 206

**శ్లో॥ ధ్యాత్వా తత్ప్రకృతేః పరం ద్యుతిమయం బ్రహ్మాన్త్యమాత్రామయే**
**నాదేతత్పరమాత్మనోఽధికతరధ్యేయస్య చాసత్త్వతః ।**
**ధ్యాయేదన్వహమాత్మబోధమమునా జ్ఞేయో హి శుద్ధాత్మనా**
**ధ్యానేనైష పురః పుమానధిగమాదస్యామృతం లభ్యతే ॥ 207**

భావ॥ అట్టి ప్రకృతికి పరమయినవాడు, తేజోమయుడు, అయిన బ్రహ్మమును అంత్య మాత్రారూపమయిన నాదమునందు (ఁ) ధ్యానము చేయవలయును. ఇక అచ్చట పరమాత్మకన్న అధికమయిన ధ్యేయ వస్తువు ఏదియు లేదుగదా! ఈ విధముగా ఆత్మబోధ జరుగువఱకు ధ్యానించుచుండవలయును. ఈవిధము శుద్ధ చిత్తుడయిన పురుషుడు ఆ పరమపురుషుని ధ్యానింపవలయును. ఆ పరమ పురుషుని ప్రాప్తివలన జీవుడు అమృతుడగును. 207

**శ్లో॥ ధ్యాయేద్దేవమనన్తశీర్షనయనశ్రోత్రత్వగాదీన్ద్రియం**
**విశ్వానన్దకరం చ విశ్వమధిపం నారాయణఞ్చాక్షరమ్ ।**
**విశ్వస్మాత్పరమఞ్చ నిత్యమపరం విశ్వోపజీవ్యం హరిం**
**విశ్వాత్మేశ్వరపాలకం ధ్రువతమం శాన్తం శివం చాచ్యుతమ్ ॥ 208**

భావ॥ హృదయపుండరీకమున ఉపాసింపదగిన ఆ యీశ్వరుడెవరు? ఆయన స్వయం–ప్రకాశుడు, అనంత శిరోనేత్ర కర్ణ చర్మాది – ఇంద్రియములు కలవాడు, విశ్వమునకు ఆనందకరుడు విశ్వరూపుడు విశ్వాధిపుడు, నరసమూహమునకు గమ్యము. ఆశ్రయమూ అయినవాడు, అక్షరుడు విశ్వమునకు అతీతమయినవాడు, నిత్యుడు, సర్వాధికుడు, విశ్వమునకు ఉపజీవ్యుడు, హరి, విశ్వమును ఆత్మను ఈశ్వరుని పాలించు అత్యంత శాశ్వతుడు. శాంతుడు, మంగళ రూపుడు, అచ్యుతుడు అయిన ఆ దేవుని ధ్యానింపవలయును. 208

విశే॥ 1. సర్వ ప్రపంచరూపమయిన యీ విరాట్టు యొక్క రూపము సహస్రశీర్షనయనం కావటమనగా, మన అవయవాలు ఆయన అవయవాలుగా భావించటమే. అయినా మనవేదనలు ఆయనకు అంటవు – ఎందుకనగా ఆయన ఆనందస్వరూపుడు ఆనంద దాత, దుఃఖము దుఃఖకర ప్రపంచముగూడా మాయగా ఆయన రూపమే. కనుక ఆయనకు దుఃఖానుభవం రాదు. (కోరలలో విషం పామును చంపదు గదా!) విశ్వపాలకుడూ ఆయనయే.

2. న రీయంతే = న క్షీయంతే అని నరులు అనగా జీవులు. వారికి అయనం = ప్రవృత్తి కలిగించువాడు, అయినా ఆయన వికారి కాడు. అయస్కాంతము నిర్వికారముగా నుండియే లోహచలనమునకు కారణం అవుతుంది కదా! అందువలన నిర్వికారుడు,

3. విశ్వమూ ఆయనయే. అయినా విశ్వలక్షణమయిన 'క్షరత్వం' ఆయనకు రాదు. ఆయన అక్షరుడే. విశ్వం కావటం మాయాకృతము మాత్రమే.

4. అపరః = ఆయనకన్న అధికులు లేరు. అలా ఉన్నారంటే అనవస్థ.

5. విశ్వమునకు ఆత్మ ఆయనయే, పాలకుడూ ఆయనయే. దేహమునకు ఆత్మగా విశ్వమునకు ఈశ్వరుడుగా ఉన్నాడు. సర్వపాపహరుడుగా హరి. ఆశ్రితులను భ్రష్టులను కానీయనివాడు, లేదా తానుగా మారని శాంతమూర్తి. కనుక అచ్యుతుడు.

**శ్లో॥ విశ్వస్యాస్య పరాయణం బుధజనైర్జ్ఞేయం మహాన్తం పరం**
**తత్త్వం బ్రహ్మ పరత్విషం చ పరమాత్మానం నృదృక్శ్రోత్రగమ్ ।**
**అన్తశ్చాపి బహిస్సమస్తమపి సంవ్యాప్య స్థితం విష్టపేఽ**
**నన్తం సంసృతిసిన్ధుపారమమృతం సర్వజ్ఞమప్యవ్యయమ్ ॥ 209**

భావ॥ పరమాత్మ యీ విశ్వమునకు పరమగమ్యము. పరమాధారము. జ్ఞానులకు

జ్ఞేయమయినవాడు. మహాత్ముడు అనగా అపరిచ్ఛిన్నుడు, అఖండుడు, పరమ తత్త్వమయిన బ్రహ్మము పరమజ్యోతి, పరమాత్మ, నరులకు కనబడే మఱియు వినబడే సమస్త ప్రపంచము నందు లోపల బయట వ్యాపించియున్నవాడును, అందువలన నాశములేనివాడును, సుఖస్వరూపుడును, సర్వజ్ఞుడును, సర్వ వేత్తయును, సంసారసముద్రమునకు తీరమయినవాడును అయిన పరబ్రహ్మమును ధ్యానింపవలయును. 209

విశే॥ 1. ప్రపంచం ఆత్మయందే కల్పితముకనుక ప్రపంచమునకు ఆయనే పరమాధారము పరమగమ్యము, పరమప్రేరకము.

2. నిర్గుణ బ్రహ్మము జ్ఞేయము. సగుణ బ్రహ్మము అనగా ఈశ్వరుడు ధ్యేయుడు. జ్ఞేయం అనగా ఘటాదుల వలె జ్ఞేయమయిన జడపదార్థము కాదు. ఎందుకంటే ఆ రకమయిన జ్ఞేయం అంటే ఇతరుల చేత భాసింపజేయబడటం. కాని బుద్ధియందు ఉపలభ్యం కావటమే ఇచ్చట జ్ఞేయత్వం. స్వయం ప్రకాశమయిన జ్ఞానరూపము.

3. పరమతత్త్వము ప్రకృతి మొదలగు 25 తత్త్వములలోకి ఉత్కృష్టమయిన తత్త్వము.

4. సర్వజ్ఞుడు – సర్వవ్యాపి కనుక సర్వజ్ఞుడు. సర్వవిత్ – సర్వం విశేషంగా తెలిసినవాడు.

“ససర్వజ్ఞస్సర్వవిత్” “తమసః పరమోధాతా”

**శ్లో॥ నాభేరగ్రతలే వితస్త్యతిగతౌ నిష్టేరధోఽధోముఖం**
**మర్త్యానాం వపుషి స్థితం హి హృదయం పాథోజకోశోపమమ్ ।**
**విశ్వస్యాయతనం మహద్బహుసిరావ్యాప్తం తదన్తే తను**
**చ్ఛిద్రం తిష్ఠతి తత్ర సర్వభువనం యద్వ్యజ్యతే తత్ర సత్ ॥ 210**

భావ॥ మనుష్య శరీరంలో నాభికి 12 (వితస్తి) అంగుళాల పైన , మెడ ముడికి(నిష్టి) క్రిందుగా అధోముఖమయిన ఒక పద్మకోశము వంటి హృదయమున్నది.

“పద్మకోశప్రతీకాశం హృదయం చాప్యధోముఖమ్” – చూడండి మంత్రపుష్పం. అది విశ్వమునకు ఆధారమయినది. అది మహత్తు. బహుసిరలు దానియందల్లికొని యుండును. దాని చివర స్వల్పమయిన రంధ్రముండును. అది సుషుమ్నా నాడీ రంధ్రము. దానియందు సమస్త ప్రపంచము సూక్ష్మరూపముగా నుండును. దానియందు ప్రవేశించిన మనస్సుకు అనగా బ్రహ్మాకారాంతఃకరణవృత్తికి “బ్రహ్మం” లభించును. **బ్రహ్మం సర్వాధారం కనుక సర్వభువనము సుషుమ్నలో నుండును.** 210

విశే॥ హృదయమునందు మనో విజృంభణమే యీ విశ్వము. కనుక హృదయము విశ్వమునకు ఆయతనము.

**శ్లో॥ మధ్యే తస్య మహానలోఽస్తి బహులజ్వాలశ్చ నానాముఖో**
**భోక్తాఽన్నస్య పురఃస్థితస్య విభజత్యాహారమేషోఽజరః ।**
**నిష్ఠాతో జరయన్ స్వదేహమఖిలం సన్తాపయత్యన్వహం**
**తజ్జ్వాలాసు చ కాచిదస్త్యణుతరోర్ధ్వం బ్రహ్మరన్ధ్రం గతా ॥ 211**

భావ॥ ఆ సుషుమ్నానాలం మధ్యలో ఒక మహా వహ్ని ఉన్నది. జ్వాలామాలాకులము. నానాముఖము. ఎందుకంటే చుట్టూ ఉన్న అనేక నాడులలో సంచరించటం వలన అది అనేక ముఖము. అది ఎదురుగా ఉన్న ఆహారమును పచనము చేయును. దానిని రక్తాదిరూపంతో పరిణమింపజేస్తుంది. ఆ విధంగా జీర్ణంచేసి విభాగిస్తుంది. కాని అది మాత్రం తాను జీర్ణం కాదు. (ఇదే జఠరాగ్ని, వైశ్వానరము) దేహమునంతటిని యావజ్జీవము వేడిగా నుంచుతుంది. ఆ అగ్నిజ్వాలలు మధ్యలోనే ఊర్ధ్వగతమయిన అత్యంతసూక్ష్మరేఖగా "సుషుమ్న" ఉన్నది.

"తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః" అది బ్రహ్మరంధ్రమును చేరును. 211

**శ్లో॥ నీలామ్భోధరమధ్యసంస్థితతటిల్లేఖేవ దీప్తా శిఖా**
**సేయం పీతగుణా పరం తనుతరా నీవారపుచ్ఛం యథా ।**
**తస్యా మధ్యతలే స్థితస్స పురుషో బ్రహ్మేన్ద్రరుద్రాత్మకోఽ**
**వ్యక్తాత్మా పరమః స్వరాట్చ పరమాత్మా చిన్తనీయస్సదా ॥ 212**

భావ॥ నీలమేఘమధ్యమునందున్న విద్యుల్లత వంటిది. పీతవర్ణమయినది. నీవారశూకమువలె సన్ననిది. అట్టి దీప్తాగ్నిశిఖమధ్యన ఉన్న పురుషుడే బ్రహ్మము. ఆయన బ్రహ్మేంద్రరుద్రాది సర్వదేవతా తత్త్వస్వరూపము. అవ్యక్తముతో (మాయ, అజ్ఞానము, అవ్యాకృత ప్రపంచరూపము) తాదాత్మ్యము చెందిన ఆ పరమ స్వయంజ్యోతి పూర్ణ పురుషుడు పరమాత్మ సదా చింతనీయుడు. 212

**శ్లో॥ యత్సత్యం పరమార్థతః పరమిదం తద్బ్రహ్మ మాయావశా-**
**ద్భక్తానుగ్రహణాయ శఙ్కరమయం విష్ణ్వాత్మకం చాభవత్ ।**
**శ్రీమన్తం పురుషం తమూర్ధ్వగరసం విశ్వాత్మకం వా విరూ-**
**పాక్షం చేతసి కృష్ణపిఙ్గలమితం స్ఫూర్తిం నమస్కుర్మహే ॥ 213**

భావ॥ పరమార్థ రీత్యా సత్యమయినది పరబ్రహ్మము. అది భక్తానుగ్రహబుద్ధితో మాయాకృతమయిన హరిహరరూపములను స్వీకరించెను. ఆ రూపద్వయము శ్రీమంతము (శ్రీ= లక్ష్మి, శోభ, విషము). ఊర్ధ్వరేతసమయినది (ఊర్ధ్వరేతం విరూపాక్షం) విశ్వరూపమయినది. (విశ్వం విష్ణుః వషట్కారః) విరూపాక్షమయినది అనగా సూర్యచంద్ర రూప ఉష్ణశీతల నేత్రములు గలది, కృష్ణ పింగలము నీలలోహితము అయిన ఆతత్త్వమును మనస్సునందు ధ్యానించి నమస్క-రించెదము. 213

విశే॥ 1. నిర్గుణోపాసన 'అహంబ్రహ్మాస్మి' మొదలగునవి. అలాగే ఓంకారధ్యానం. సగుణోపాసనలు అనేకము. అందులో విరాడుపాసన ముఖ్యము. ప్రాధమికము. అది చెప్పబడినది. ఇక ఇచ్చటనుంచి వ్యష్టి ఉపాసనలు చెప్పబడుచున్నవి.

2. శివ, విష్ణు శరీరాలు పురాణ ప్రసిద్ధాలు. ఇంకా ఆగమాదులలో ద్విబాహు చతుర్బాహు షణ్ముఖాది శరీరాలున్నాయి. వాటిని ఈశ్వరునిగా బ్రహ్మముగా ధ్యానింపవచ్చును.

3. బ్రహ్మం పరమార్థస్థాయిలో సత్యం. అది రజ్జు సర్పం వలె భ్రాంతికాల సత్యంకాదు. రజ్జువు వలె వ్యవహార కాలిక సత్యమూ కాదు. ఇవి అన్నీ మిథ్యలు.

4. సర్వప్రపంచం మాయావశమున బ్రహ్మ వివర్తమే. అయినా ప్రత్యక్షంగా మాయామాత్ర కార్యముగనుక శివకేశవులు ఈశ్వరులు. మిగిలినవారు అవిద్యాకామకర్మలవలన వచ్చిన మాయాకార్యములు. కనుక (బ్రహ్మాదిస్తంబపర్యంతం) కేవల జీవులు. అందువలన శ్రీధర, శ్రీకంఠులు సర్వజ్ఞులు, సర్వశక్తులు, మాయాధీశులు. కనుకనే వారు హాలాహల పాన సముద్రమథనాది మహాకార్యములను చేయగలరు. ఇదంతా మాయాకల్పితం - కనుక ఈ జీవేశ్వర విభాగము వలన అద్వైతమునకు హాని లేదు.

5. "దక్షిణం వహ్ని సంకాశం వామం తుహిన సన్నిభమ్" కనుక నేత్రములు విరూపములు. కృష్ణపింగలం. కుడిభాగము నలుపు. ఎడమ భాగము పింగళవర్ణము. కాగా శివుడు నలుపు. పార్వతి పింగళవర్ణము. ఇది అర్ధనారీశ్వరము. విష్ణువు నలుపు. ఆయన హృదయగతమయిన లక్ష్మి పింగళవర్ణము. కనుక ఇది "లక్ష్మీధర తత్త్వము"

"నమస్యేపరమానంద పురుషం కృష్ణ పింగలమ్, నారాయణం జగన్నాధం వాసుదేవమనామయమ్" కనుక ఇది "హరహరి"

**శ్లో॥ ఋ గ్రూపం హి ఋగాశ్రయశ్చ తరణే ఋగ్దేవతానామ్పదం**
**బిమ్బం సామమయం హి సామనిలయస్తద్దేవతానామ్పదమ్ ।**
**జ్యోతిస్తస్య యజుర్మయోఽత్ర పురుషస్తద్దేవతానామ్పదం**
**ధ్యాయేత్తద్యజురాత్మకం తపతి తత్త్రయ్యేవ సూర్యాత్మనా ॥ 214**

భావ॥ సూర్య బింబము ఋగ్వేదస్వరూపము. ఋగ్వేద దేవతలకు నివాసము. ఋక్కులకు ఆధారము. సూర్యకాంతి సామవేదమయము, సామములకు ఆశ్రయము. సామవేద దేవతలకు స్థానము. సూర్యమండల పురుషుడు యజుర్వేద మయుడు, యజుర్వేద దేవతలకు స్థానము. కనుక సూర్యబింబము యజురాత్మకము. అందువలననే వేదమే సూర్యస్వరూపముగా వెలుగుచున్నది. అని ధ్యానింపవలయును. 214

విశే॥ 1. మండలము, కాంతి పురుషుడు – ఇవి సూర్యునిలోని పదార్థములు. కనుక అవి వేద త్రయాత్మకము. కనుకనే "అంశుమాలీ త్రయీ తనుః" అని అమరము.

2. ఋగాత్మకమయిన సూర్యమండలమును యజుః, సామ వేదములుగా ఎందుకు ధ్యానం చేయటం? – సమా – మండల, కాంతి, అధిష్ఠాన పురుషుడు – ఈ మూడూ కలిపి మండలంగానే వ్యవహరిస్తాము. కనుక దానిని త్రయీమయంగాను, యజురాది వేద భేదరూపముగాను, ధ్యానము చేయవచ్చును. విడిగానయితే సూర్యమండలం ఋగ్వేదమే. దానిని విడిగా మాత్రము యజుర్వేదంగానో, సామవేదంగానో ధ్యానించము. లేదా మండలమే స్వయంగా ఋగ్వేదము, కాంతిద్వారా సామవేదం, అధిష్ఠాన పురుషుని ద్వారా యజుర్వేదము కావచ్చును. కనుక సూర్యుడు త్రయీమయుడని పరమార్థము.

**శ్లో॥ ఆదిత్యే పురుషో హిరణ్మయతనుర్యస్సోఽయమోజో బలం**
**తేజః కీర్తిరపీన్ద్రియాణి హృదయం మన్యుశ్శరీరం మనుః ।**
**మిత్రో మృత్యురథామ్బరం మరుదసుస్సత్యశ్చ లోకేశ్వరః**
**కః కిం కం తదృతం నరోఽన్నమమృతశ్చాయుః ప్రజేశశ్శరత్ ॥215**

భావ॥ ఆదిత్యునియందున్న హిరణ్మయ పురుషుడు మనలోని ఓజస్సు, బలము, తేజస్సు, కీర్తి, ఇంద్రియాలు, హృదయము, మన్యువు (కోపము, కామము మొదలగు మనోధర్మములు) శరీరము, మనువు, మిత్రదేవత, ఆకాశము, యముడు, వాయువు, ప్రాణము, సత్యదేవత, ఇంద్రాది లోకపాలకులు, కః అనగా కశ్యపాది ప్రజాపతులు, కిం = అనిర్వచనీయము, కం = అనగా సుఖము. తత్ = పరోక్ష విషయములు, సత్యము, జీవుడు (చిదాభాసుడు) వ్రీహియవాదికమయిన ఆహారము, అమృతుడు, ఆయువు, ప్రజాపాలకులయిన రాజాదులు, సంవత్సరము, అమృతుడయిన ప్రత్యగాత్మ – అందరూ ఆయనయే. 215

**శ్లో॥ సర్వాత్మా పురుషస్స ఏష భగవాన్ సంవత్సరాత్మా రవి**
**ర్భూతానామధిపస్తమేనమనఘా యే సర్వదోపాసతే ।**
**సాయుజ్యం చ సలోకతామ్భగవతస్తే ప్రాప్నుయుర్బ్రహ్మణో**
**దేవానామితరే తు దేవయజనాః సార్ష్టిత్వమప్యాప్నుయుః ॥ 216**

భావ॥ సర్వాత్మ అయిన భగవంతుడయిన యీ సూర్యమండల పురుషుడు సంవత్సర స్వరూపుడయిన "రవి" అగును. భూతములకు అధిపతి అగును. హిరణ్యగర్భుడయిన యీ పురుషుని సర్వదా ఉపాసించువారు ఆ భగవంతుని సాయుజ్యమునుగాని, సాలోక్యమునుగాని పొందెదరు. దేవ పూజాపరులయిన వారు ఆ దేవతలతో సమానమయిన ఐశ్వర్యమును గూడా పొందెదరు. 216

విశే॥ సూర్యమండల పురుషుడయిన హిరణ్యగర్భుని ఉపాసన రెండు విధములు. 1. హిరణ్యగర్భుని ఉపాసన 2. హిరణ్యగర్భుని అవయవములయిన దేవతల ఉపాసన. అందులో మొదటివారు అధికమయితే ఆ బ్రహ్మతో సాయుజ్యం, మధ్యస్థమయితే సాలోక్యము, మందమయితే సార్ష్టిత్వము కలుగును. దేవతల ఉపాసనలలోనూ ఇట్లే స్థాయినిబట్టి ఆయా దేవతలతో సాయుజ్యాదులు పొందెదరు.

**శ్లో॥ సూర్యో దీప్తియుతశ్చ యోஉదితిసుతస్సోஉహం భవామ్యర్చయ-**
**న్త్యేనం సర్వఫలార్థినో భువి తపః కుర్వన్తి సత్యన్తథా ।**
**క్షీరాదిం చ నివేదయన్తి మధురం ప్రీత్యర్థమేతస్య త-**
**ద్బ్రహ్మైవైష జలం రసోஉగ్నిరమృతం మన్త్రాశ్చ లోకా రవిః ॥ 217**

భావ॥ సూర్యమండలగత హిరణ్యగర్భోపాసనగూడా చేయలేనివారు సూర్యోపాసననే చేయవచ్చును. "దీప్తియుతుడు, అదితికశ్యపుల సుతుడు అయిన సూర్యుడను నేను" అని "సూర్యోహమ్" భావనతో పూజించువారున్నారు. సర్వఫలార్థులయిన వారు సత్యముగా తపము చేయుచున్నారు. ఆయనకు పాలు పొంగలి మొదలగు మధుర పదార్థములను నివేదించెదరు. అందువలన అట్టి భావన గలవారికి ఆ రవియే బ్రహ్మము. కనుక జలములు, మధురాది రసములు, అగ్ని, అమృతము, మంత్రములు, లోకములు అంతా రవియే. 217

**శ్లో॥ ఆపస్సర్వమిదం సమస్తతనవః ప్రాణా మృగాశ్చామృతం**
**వ్రీహ్యాద్యన్నమథో విరాట్స చ మహానవ్యాకృతాత్మా స్వరాట్ ।**
**ఛన్దాంస్యర్కశుచీన్దువైద్యుతముఖజ్యోతీంషి సత్యం సమే**
**దేవా ఇన్ద్రముఖా జగత్త్రయమపి బ్రహ్మైవ తస్మాజ్జలమ్ ॥ 218**

భావ॥ జలమును బ్రహ్మముగా ఉపాసన చేయుట చెప్పబడుచున్నది. సర్వము జలమే. సమస్త శరీరములు జలమే. ప్రాణములు జలమే – కారణమేమనగా, స్థావరజంగమ శరీరము లన్నియు అందలి ప్రాణములు వీర్యరూపమయిన జలముతో సృష్టింపబడినవి. అలాగే ప్రాణము లకు జలము ఆధారము. మృగములు జలమే. వాటికి క్షీరరూపమయిన జలమే ఆధారము. క్షీరము పశువులకు ఆహారము. "పశుభ్యో ఏకం ప్రాయచ్ఛత్" – శ్రుతి. అమృతం జలమే. అది ద్రవము కదా! వ్రీహి మొదలయిన అన్నము వర్ష జలాధారము కనుక జలమే. అందువలన జలమే విరాట్టు. జలమే అవ్యాకృత ప్రపంచము. దానికభిమాని అయిన స్వరాట్టు అనగా ఈశ్వరుడు. గాయత్రి మొదలగు ఛందస్సులు, సూర్యచంద్రాగ్ని విద్యుత్తులు మొదలగు వెలుగులు జలమే. (అగ్నే రాపః ), సత్యము జలమే. ఇంద్రాది సకల దేవతలు జలములే. లోకత్రయము జలమే. అంతా జలమే కనుక జలము బ్రహ్మమే. సర్వం బ్రహ్మం కదా! 218

**శ్లో॥ ఏషా భూరదితిస్సురాసురనరప్రష్ఠాఖిలప్రాణినాం
మాతోర్వీ పృథివీ మహీ చ మహతీ కా మేదినీ యా చ సా ।
గాయత్రీ జగతీ సమా చ కతమా భూతా చ కా యాఽమృతా
సావిత్రీ బహులా వసిష్ఠముఖరైస్సత్యా స్తుతా వైష్ణవీ ॥ 219**

భావ॥ అగ్ని, జల ఉపాసనల తరువాత "భూస్వరూప" మయిన ఉపాసన ఇది.

"ఈ భూమి అఖండమయినది. సుర, అసుర, నరులు మొదలగు సర్వప్రాణులకు మాత. విశాలమయినది. అనేక సస్య సమృద్ధి గలది. పూజ్యమయినది, గుణాధికమయినది, మధుకైటభుల క్రొవ్వుతో తయారయినది లేదా కఠినమయినది. "కిం" "యత్" శబ్దములకు అర్థమయినది. తనను స్తుతించు వారిని కాపాడునది, ప్రపంచ స్వరూపమయినది. కతమా అనగా మిక్కిలి సుఖ రూపమయినది. (కం = సుఖం), ప్రాణి సృష్టికి ముందే సిద్ధమయినది, శరీర రూపముగా (పార్థివ శరీరంగా) పరిణతమయినది. అమృతమయినది. సవిత అనగా ప్రేరణ కలిగించు అంతర్యామికి సంబంధించినది, దట్టమయినదిగా స్తుతింపబడిన విష్ణుపత్ని. 219

**శ్లో॥ ప్రాణాః పఞ్చ దశేన్ద్రియాణి చ దశ స్థానాని తేషాం తథా
కోశాః పఞ్చ చ సప్త ధాతవ ఇమే శబ్దాదయః పఞ్చ చ ।
హృద్బుద్ధిద్వయమాత్మకార్యసహితం భూతాని పఞ్చాపి మే
శుధ్యన్తు ప్రతిపద్యతామపరజా ఆత్మా మమ బ్రహ్మతామ్ ॥ 220**

భావ॥ బ్రహ్మవిద్యా ప్రథమాధికారమయిన ఆత్మశుద్ధిని కోరుచున్నాడు.

నా పంచప్రాణములు, దశేంద్రియములు వాటి దశస్థానములు, పంచకోశములు, సప్తధాతువులు, శబ్దాది విషయపంచకము, కామ సంకల్పాది కార్యములతో గూడిన మనోబుద్ధి ద్వయము, పంచభూతములు, శుద్ధి చెందుగాక! ఆ విధముగా రజోహీనమయి శుద్ధి చెందిన నా ఆత్మ బ్రహ్మత్వమును పొందుగాక! 220

**శ్లో॥ మేధాదేవి! న ఏహి సర్వవిషయవ్యాప్తిక్షమే ప్రీతినా
భద్రే సద్ధృదయే త్వదాప్తివశతస్త్యక్త్వా దురర్థా గిరః ।
వేదైకప్రవణా విధాయ యజనం సంశుద్ధసత్త్వా వయం
సద్భిశ్శిష్యసుతాదిభిః పరిగతాస్తత్త్వం వదేమేశితుః ॥ 221**

భావ॥ శ్రవణాదుల వలన జ్ఞానం కలిగినా అది నిలవటానికి "మేధాశక్తి" కావాలి. అందుకని మేధా ప్రార్థన.

"ఓ మేధాదేవీ! – సర్వ విషయముల లోనికి వ్యాపించి పోగలదానా! మంగళస్వరూపు రాలా! మంచి మనస్సుగలదానా! ప్రేమతో మావద్దకు రమ్ము. నీవు మాకు లభించుట వలన

మేము దుష్టార్థములుగల బాహ్యావాక్కులను వదలి వేదవాక్యమాత్రశ్రద్ధగల వారమయి, యజ్ఞముల నొనరించి శుద్ధ – అంతఃకరణులమయి, సత్పురుషులయిన శిష్యసుతాదులతో సహితులమయి ఈశ్వర తత్త్వమును ముచ్చటించికొనెదము. 221

**శ్లో॥ మేధే!ఽనుగ్రహమాప్తవాన్ తవ పుమాన్ యస్సర్షివర్యో భవే-**
**ద్బ్రహ్మా స్యాదపి సమ్పదం ప్రతిగతో వస్త్వప్యపారం వ్రజేత్ ।**
**ఇన్ద్రో దేవధవో దదాతు పరమాం మేధాఞ్చ మే భారతీ**
**బ్రాహ్మీ చాశ్వియుగం హిరణ్మయమహాపద్మస్రగాభూషితమ్ ॥ 222**

భావ॥ ఓ మేధాదేవీ! నీ అనుగ్రహము పొందిన పురుషుడు గొప్ప ఋషివర్యుడు కాగలడు. హిరణ్యగర్భుడో బ్రహ్మమో కాగలడు. ఇక ఇంద్రాది దేవతలు కాగలగటం ఎంత విషయము? వాడు సంపదలు గూడా పొందును. అపారమయిన వస్తువులను (గో భూ హిరణ్యాదులు) పొందును. దేవరాజు ఇంద్రుడు బ్రహ్మపత్ని భారతి హిరణ్మయపద్మమాలికలు ధరించిన అశ్వినులజంట మాకు పరమ మేధను ఇచ్చుగాక! "సమేంద్రో మేధయా స్పృణోతు"222

**శ్లో॥ యా రమ్భాదిషు విద్యతే వసతి యా స్వర్గాయ కేషు స్వయం**
**యా బ్రహ్మాదిషు వర్తతే మనుభవే ష్వాస్తే చ యా శాస్త్రిషు ।**
**సా మేధా సురభి శ్శుభా కరుణయా ప్రాప్నోతు మామీశితు-**
**స్సా దేవీ స మహేశ్వరశ్చ భవతాం ప్రీతౌ మమారాధనాత్ ॥ 223**

భావ॥ ఆ మేధాశక్తి రంభ మొదలగు వారియందు ఉండును. స్వర్గ వాసులయిన గంధర్వులయందు, స్వయంగా బ్రహ్మాదుల యందు శాస్త్రవేత్తలయిన మానవులయందు నుండును. అట్టి మేధాశక్తి కామధేనువు వలె ఇష్ట దాత్రి, మంగళమయినదై ఈశ్వర కరుణ వలన నన్ను పొందునుగాక! ఆ మేధాదేవత ఆ ఈశ్వరుడు నా ఆరాధన వలన నాయందు ప్రేమ చూపెదరు గాక! 223

**శ్లో॥ విద్యా వేదతదఙ్గశాస్త్రముఖరాస్సర్వా య ఈష్టే స్వయం**
**బ్రహ్మాదీని తృణావధీని నిఖిలానీష్టే చ భూతాని యః ।**
**వేదస్యాధిపతిశ్చ వేదజఠరస్యాయం పురాణః పుమాన్**
**బ్రహ్మాత్మా స శివోఽస్తు మే కరుణయా జ్ఞానప్రదో మాధవః ॥ 224**

భావ॥ మేధాఫలమయిన జ్ఞానమును ప్రార్థించుచున్నాడు. వేద వేదాంగాలు మొదలయిన సకల విద్యలకు ప్రభువు, బ్రహ్మమునుండి తృణముదాకా సర్వభూతములకు అతడు ప్రభువు. వేదాధిపతి. వేద గర్భుడయిన బ్రహ్మకు అధిపతి, సనాతనుడు, పురుషుడు, బ్రహ్మస్వరూపుడు, బ్రహ్మ, బ్రహ్మాత్మస్వరూపుడు, మాయాపతి అయిన ఈశ్వరుడు నాకు జ్ఞానప్రదుడు, శుభుడు అగుగాక! 224

**శ్లో॥ ప్రాగ్జన్మన్యయమారచయ్య పవనస్సూర్యశ్చ సత్యం తతో**
**వాయుత్వం తరణిత్వమేత్య భువనే వాతి జ్వలత్యమ్బరే ।**
**సత్యే సర్వమిదం ప్రతిష్ఠితమిదం వాచః ప్రతిష్ఠా పరా**
**సత్యం తత్పరమం వదన్తి పురుషా మోక్షస్య హేతుమ్భువి ॥ 225**

భావ॥ జ్ఞానమునకు సన్న్యాసమే అంతరంగసాధనమని చెప్పినాడు. జ్ఞానద్వారా మోక్షమునకున్ను అదే సాధనమని ఇక చెప్తూ ముందు మతాంతరములు చెప్తున్నాడు. అందు 'సత్యం। సాధనమని ఒక మతం. వాయువు సూర్యుడు పూర్వజన్మలో, "సత్యమును" ఆచరించి దాని మహిమ వలన ఈ జన్మలో వాయు సూర్యస్థానములు పొంది లోకంలో వీచుట, ఆకాశమున వెలుగుట అను విధులు నిర్వహించుచున్నారు. ఈ సకల ప్రపంచము సత్యమునందే ప్రతిష్ఠితము. ఈ సత్యమే వాక్కుకు పరమ ప్రతిష్ఠ. కనుక లోకము నందు కొందరు సత్యమే మోక్షమునకు పరమ సాధనమనుచున్నారు. 225

**శ్లో॥ అగ్నీన్ద్రాదిసురాః పురా హ్యనశనం కృత్వా తపో దేవతా-**
**మ్ప్రాప్తాస్తేన వసిష్ఠముఖ్యఋషయస్స్వర్గం గతాస్తేన చ ।**
**కృత్వా తద్వయమప్యరాతినిచయం నిర్మూలయామోఽఖిలం**
**తస్మింత్సంస్థితమేతదేవ పరమో మోక్షస్య హేతుస్తపః ॥ 226**

భావ॥ నిరాహారంగా చేయు తపస్సు మోక్షసాధనమని కొందరు. అగ్ని, ఇంద్రుడు మొదలగు దేవతలు పూర్వం నిరాహారులయి ఈ జన్మలోనే ఆ దేవతను పొందిరి. వశిష్ఠుడు మొదలయిన దేవతలు తపస్సు వలననే స్వర్గమును పొందిరి. మేముగూడా తపస్సుచేసి (మోక్ష విఘ్నములయిన) శత్రువుల సమూహమును నిర్మూలించెదము. తపస్సునందే ఫలసమూహ మంతయు ఉన్నది. కనుక తపమే మోక్షసాధనము. 226

**శ్లో॥ దాన్తా యత్కలుషం నుదన్తి దమతో యద్బ్రహ్మచారివ్రజః**
**స్వర్గమ్ప్రాప దమేన యత్స చ దురాధర్షః సమప్రాణినామ్ ।**
**యత్తస్మింశ్చ నృణామపేక్షితఫలం సర్వం ప్రతిష్ఠాపితం**
**తస్మాత్తం పరమం వదన్తి కతిచిన్మోక్షస్య హేతుం దమమ్ ॥ 227**

భావ॥ దమము మోక్షసాధనమని కొందఱు. దమము అనగా (బాహ్య) ఇంద్రియ జయము. దమము కలవారే పాపమును పోగొట్టికొనెదరు. దమము వలననే బ్రహ్మచారి సమూహము స్వర్గమును పొందెను. శమము సర్వప్రాణులకు కఠినముగా నున్నది. ఈశ్వరుడు సర్వమానవులకు కావలసిన సమస్త ఫలమును దమమునందే యుంచెను. కనుక కొందఱు "దమమే మోక్షమునకు పరమ కారణము" అని అందురు. 227

శ్లో॥ య చ్ఛాన్తా శ్శివమాచరన్తి మునయో నాకం శమేనాఽయయు-
ర్భూతానామతిదుస్సహస్సకలదశ్శ్రేష్ఠశ్శమస్తద్భువి ।
దానం హ్యేహవదక్షిణా భవతి యద్దాతారమేవాఖిలాః
సేవన్తే రిపవో జితాశ్చ సుహృదో దానేన దానం పరమ్ ॥ 228

భావ॥ కొందరు శమమును కొందఱు దానమును మోక్షసాధనమని చెప్పుచున్నారు. ఎందుకంటే, శాంతులు అనగా శమవంతులు (శమం = అంతరింద్రియ నిగ్రహం) సాధుకర్మలు చేయుచున్నారు. మునులు శమము వలననే స్వర్గము పొందుచున్నారు. శమము చాల శ్రేష్ఠమయినది. అది భూతములకు ఆచరణలో అత్యంత కఠినము.

మరికొందరు దానమే గొప్పది. యజ్ఞదక్షిణగా స్వర్గాదికము మోక్షదాయకము. ఓడిన శత్రువులయినా మంచి మిత్రులయినా అందరూ దాతనే ఆశ్రయించెదరు. దానమునకు లొంగి శత్రువులయినా మిత్రులయ్యెదరు. కనుక దానమే గొప్ప మోక్షసాధనము. అని అందురు. 228

శ్లో॥ వాపీకూపవనాదినిర్మితిమయో ధర్మః ప్రతిష్ఠా యతః
సర్వేషాం తనుధారిణాముపసరన్త్యన్యాస్సమస్తాః ప్రజాః ।
ధర్మిష్ఠం సకలం ప్రతిష్ఠితమిదం ధర్మే చ ధర్మేణ య-
త్పాపఞ్చాపనుదన్తి తద్భువి మతో ధర్మః పరం సాధనమ్ ॥ 229

భావ॥ ధర్మమే మోక్ష కారణమని వీరి మతము. సర్వప్రాణులకు వాపీకూపవనాది నిర్మాణ రూపమయిన (అపూర్తం) ధర్మము ప్రతిష్ఠాకరము. ధర్మమూర్తినే ఇతర ప్రజలు అనుసరించెదరు. సమస్తము ధర్మము నందే ప్రతిష్ఠింపబడినది. ధర్మం వలననే మోక్ష ప్రతిబంధకమయిన పాపములు నశించును. కనుక ధర్మమే మోక్షమునకు పరమసాధనమని అందురు. 229

శ్లో॥ పుత్రోత్పాదనమేవ సాధనతమం ముక్తేః ప్రతిష్ఠా యతో
గార్హస్థ్యస్య తదేవ సన్తతిమయం తన్తుం వితన్వన్పుమాన్ ।
ధాతౄణామనృణో భవేన్న హి ఋణగ్రస్తో విముక్తిం క్వచి-
ద్యాయాత్తద్గృహమేధినైవ భవితుం యుక్తం ముముక్షావతా ॥ 230

భావ॥ పితృఋణము తీర్చకుండా విముక్తి లేదు. కనుక సంతానము/గృహస్థతయే మోక్షసాధనము - అని కొందరు. దానివలననే గృహస్థతకు ప్రతిష్ఠ. సంతానతంతువును కొనసాగించినవాడే పితరుల ఋణము నుంచి విముక్తుడగును. ఋణవిముక్తి లేనివానికి అసలు ముక్తి ఎట్లు కలుగును? కనుక మోక్షార్థి గృహస్థుడే అయి యుండవలయును. "ప్రజయా పితృభ్యః" అని శ్రుతి. 230

**శ్లో॥ అగ్నీనాం త్రితయం త్రయీక్రతువశాత్తద్దేవయానః స్థిత-**
**స్తన్మధ్యే పృథివీ రథన్తరమృచస్తద్గార్హపత్యానలః ।**
**ఆకాశశ్చ యజూంషి దక్షిణశుచిస్తద్వామదేవ్యాత్మకః**
**స్వర్గశ్చాహవనీయ ఏష హి బృహత్సామాత్మకః సామ చ ॥ 231**

భావ॥ అగ్ని త్రయమే మోక్షసాధనమని కొందరు. ఎందుకంటే వేదత్రయప్రతిపాద్యమయిన క్రతువుల వలన దేవయానమార్గము లభించును. అదే మోక్షమార్గము. వేదంలోనే ఋగ్వేదమునందు పృథివి, రథంతరమను సామము, గార్హపత్యాగ్ని ఉన్నవి. యజుర్వేదమునందు, ఆకాశము యజుస్సులు, దక్షిణాగ్ని వామదేవ్యమను సామముగలవు. సామవేదమునందు స్వర్గము. అహవనీయాగ్ని, బృహత్సామము కలవు. అందువలన త్రేతాగ్ని సపర్యయే మోక్షదాయకము. 231

**శ్లో॥ సాయం ప్రాతరనుష్ఠితం సుమతిభిర్మూల్యం గృహాణామపి**
**స్విష్టం వా సుహుతం హ్యుపక్రమకరం యజ్ఞక్రతూనాన్తథా ।**
**స్వర్గస్య ప్రతిపాదకం సుకరణం తచ్చాగ్నిహోత్రం పరం**
**తస్మాదన్వహమగ్నిహోత్రమనఘం కార్యం ముముక్షావతా ॥ 232**

భావ॥ బుద్ధిమంతులచే ప్రాతస్సాయంకాలము అనుష్ఠింపబడునది, గృహములకు విలువనిచ్చునది (అగ్నిహోత్రం చేయకపోతే ఆకలిగల అగ్ని ఇంటిని తగుల వేయును.) శోభనయాగహోమరూపమయినది యజ్ఞాలకు క్రతువులకు ఉపక్రమకరమయినది, స్వర్గమునిచ్చు మంచి సాధనము, అయినది అగ్నిహోత్రమను కర్మ. కనుక మోక్షకాముడయినవాడు చక్కగా "అగ్నిహోత్రము" అను కర్మను చేయవలయును. 232

**శ్లో॥ యజ్ఞం ప్రాగ్విరచయ్య నాకమగమన్ దేవాశ్చ తేనాసురాన్**
**ఛిన్దన్తి స్మ భజన్తి మిత్రపదవీం యజ్ఞేన వా విద్విషః ।**
**యజ్ఞే సర్వమిదం ప్రతిష్ఠితమభూద్వృష్ట్యాదిహేతుర్యతో**
**దేవానాం ప్రియకృత్తతః సుకరణం ముక్తేర్హి యజ్ఞః పరమ్ ॥ 233**

భావ॥ యజ్ఞమే ముక్తిసాధనమని కొందఱు. దేవతలు పూర్వజన్మలో యజ్ఞము చేసి స్వర్గనివాసులయిరి. యజ్ఞముతోనే దేవతలు అసురులను చంపిరి. యజ్ఞమువలన శత్రువులు గూడా మిత్రులయ్యెదరు. యజ్ఞమునందు సమస్తము ప్రతిష్ఠితమయినది. యజ్ఞమే వర్షాదికారణము. అదే దేవతల సంతోషమునకు కారణము. కనుక యజ్ఞమే ముక్తికి ముఖ్య సాధనము. 233

**శ్లో॥ నిష్పాద్యం మనసా యదస్తి సగుణధ్యానం హి తన్మానసం**
**ప్రాజాపత్య మిదం పవిత్రమమునా యుక్తేన చిత్తేన తే ।**

**భూతం భావి చ యోగినో వ్యవహితం పశ్యన్తి బహ్వీః ప్రజాః**
**సఙ్కల్పా దృషయోఽ సృజన్ తత ఇదం ముక్తేః పరం సాధనమ్ ॥234**

భావ॥ సగుణధ్యానం ముక్తికారణమని కొందరు. ఇది మానసక్రియ. పవిత్రమయిన యీ సగుణధ్యానము మనకు మనువు మొదలగు ప్రజాపతుల స్థానములను ఇచ్చును. హిరణ్యగర్భపదవి మాత్రము సన్న్యాసం వలననే సాధ్యము. ఈ సగుణధ్యానంతో కూడిన మనస్సుతోనే యోగులు త్రికాలదర్శనము మొదలయిన అతీంద్రియ శక్తులను పొందినారు. విశ్వామిత్రాది - ఋషులు అనేక ప్రజాసృష్టిని కేవలం సంకల్పముతో చేయగలిగిరి. కనుక ముక్తికి సగుణధ్యానము ముఖ్యసాధనము. 234

**శ్లో॥ బ్రహ్మన్యాస ఇతి ప్రకృష్టమనసో మన్వాదయో యద్వద-**
**న్త్యేతే నైవ యదీయతే చ యతిభిస్స బ్రహ్మలోకః పరః ।**
**బ్రహ్మ సర్వజగన్మయస్సుఖమయస్సంవత్సరాత్మా ప్రజా**
**నాథోఽజో యత ఈయతే తదసకౌ ముక్తేః పరం సాధనమ్ ॥ 235**

భావ॥ గొప్ప మేధావులయిన మన్వాదులు న్యాసమును (సన్న్యాసము) బ్రహ్మం అనుచున్నారు. దీని చేతనే యతులయిన వారు బ్రహ్మలోకమును చేరెదరు. ఈ బ్రహ్మలోకమునందు సర్వజగన్మయుడు, సుఖమయుడు, అనగా అధికానందరూపుడు, సంవత్సరస్వరూపుడూ అయిన హిరణ్యగర్భప్రజాపతి మనకు లభించును. కనుక సన్న్యాసమే ముక్తికి పరమ సాధనము. అంతరంగ సాధనము. 235

విశే॥ **1. ఇది సిద్ధాంతపక్షము. ముక్తి** అనగా పునరావృత్తి, పునర్జన్మ రాహిత్యము. అది లేనిది ముక్తి కాదు. ఈ ముక్తి '2' రకములు.

1. సగుణముక్తి 2. నిర్గుణముక్తి. హిరణ్యగర్భలోకప్రాప్తి మొదటిది. వీరు నిర్గుణ బ్రహ్మానుభవం పొందలేరు. ఉపాసనాదుల ద్వారా బ్రహ్మలోకము చేరి అచ్చట జ్ఞానము పొంది బ్రహ్మతో సహా బ్రహ్మాయువు తర్వాత (2 పరార్థములు) నిర్గుణ ముక్తిని పొందెదరు. (అనగా సగుణముక్తి నిర్గుణముక్తికి సోపానము). కనుక ఇది క్రమముక్తి.

2. నిర్గుణ ముక్తి - దీనిలోను పునరావృత్తి ఉండదు. ఇది బ్రహ్మభావము పొందటం. బ్రహ్మాత్మైక్యానుభవము. అతను ఉన్నచోటనే బ్రహ్మలీనుడగును. కనుక పరలోకగమనమే లేదు కనుక పునరావృత్తి యన్నదే లేదు. ఇక స్వర్గాది లోకప్రాప్తి ముక్తి కానే కాదు. అచ్చటనుంచి పునరావృత్తి వాస్తవం కదా? కనుక సన్న్యసించి శ్రవణమననాదులతో గడపవలయును.

**శ్లో॥ ఆదిత్యశ్శరదేవ తద్గతపుమాన్బ్రహ్మైవ సోఽయం పరం**
**బ్రహ్మైవాఖిలభూతహృత్పదగతస్స ప్రత్యగాత్మావ్యయమ్ ।**

**బ్రహ్మాత్మా రవిరేష రశ్మిభిరిదం యాభిస్తపత్యమ్బుభృ-**
**త్తాభిర్వర్షతి వృష్టితః క్షితితలాద్వ్రీహ్యాదిరుద్గచ్ఛతి ॥ 236**

భావ॥ బ్రహ్మము సంవత్సర స్వరూపము. ఎలా అంటే; ఆదిత్యుడే సంవత్సరము. (చారను బట్టి) అందలి పురుషుడయిన హిరణ్యగర్భుడు బ్రహ్మమే. కనుక బ్రహ్మము సంవత్సర రూపము. అఖిలభూతహృదయములందున్న ప్రత్యగాత్మగూడా బ్రహ్మమే. కనుక బ్రహ్మం హిరణ్యగర్భుడు ఆదిత్యపురుషుడు అందరూ ఒక్కటే. హిరణ్యగర్భరూపుడయిన ఈ రవి తన రశ్ములతో ఎండను కల్పిస్తాడు. తాపములను కలిగిస్తాడు. అవే కిరణములతో మేఘములను కల్పించి పర్జన్యుడై వృష్టిని అనుగ్రహించును. దానివలన భూతలమునుండి వ్రీహి మొదలయిన అన్నాదులు కలుగును. 236

**శ్లో॥ అన్నం వ్రీహియవాదికౌషధిగణాదన్నాదసుశ్చాసుభి-**
**ర్దేహాదేః పటుతా తతః పటుతయా శ్రద్ధా తపోభిస్తయా ।**
**మేధా తత్త్వమతిస్తయా చ మననం మత్యా తతో జాయతే**
**శాన్తిర్ జ్ఞానమథానయా భజతి నా తత్త్వస్మృతిం జ్ఞానతః ॥ 237**

భావ॥ వ్రీహియవలు మొదలగు వానివలన అన్నము ఏర్పడును. అన్నమునుండి ప్రాణములు, ప్రాణములవలన దేహమునందు మంచి పటుత్వము, ఆ పటుత్వమువలన శ్రద్ధ, శ్రద్ధవలన చేసిన తపస్సుల వలన మేధాశక్తి, దీనివలన తత్త్వబుద్ధి, దీనివలన మననం, ఈ మననం వలన శాంతి, శాంతివలన జ్ఞానము, ఈ జ్ఞానము వలన తత్త్వస్మరణం జరుగును. 237

**శ్లో॥ స్మృత్యాఽఽప్నోతి నిరన్తరస్మరణకం విజ్ఞానమేతేన నా**
**విజ్ఞానేన పరం పుమాంసమయతే ప్రత్యఙ్మయం సర్వదా ।**
**తస్మాదన్నమిదం దదాతి పురుషో యోగ్యాయ యస్సర్వద-**
**స్సోఽయం హ్యోదనదానమేతదధికం సర్వేషు దానేష్వపి ॥ 238**

భావ॥ స్మృతివలన నిరంతరం సోహంభావస్మరణ జరుగును. దానివలన విజ్ఞానము కలుగును. విజ్ఞానము విజాతీయ భావనలు లేని జ్ఞానధార. దానివలన పరబ్రహ్మ తన ప్రత్యగాత్మ స్వరూపము కన్న భిన్నమయినది కాదని గ్రహించును. అనుభవించును. కనుక సూర్య కారణంగా వచ్చిన అన్నము ఇంత ప్రభావము గలది ముక్తి హేతువు. కనుక యోగ్యునకు అన్నము నిచ్చు పురుషుడు సర్వము నిచ్చినట్లే. ఒక్క అన్నము వలన ఇన్ని ప్రయోజనాల పరంపర కలుగును కదా! కనుక సర్వదానములలోకి భోజనదానం గొప్పది. 238

విశే॥ 1. యోగ్యునకు భోజనదానం చేస్తేనే సత్ఫలితాలు. అయోగ్యునకు చేసినచో పరదారగమనాదులయినా చేయగలడు. కనుక అయోగ్యునికి దానం పాపదాయకము.

2. భోజన దానం ఎందుకు గొప్పదంటే, అది క్రమముగా ముక్తి ప్రదము. ముక్తి అనగా బ్రహ్మాభావము. బ్రహ్మం సర్వము. కనుక భోజనదాత సర్వదాత. మిగిలిన దానములకన్న ఇది అధికము.

**శ్లో॥ యస్సన్న్యస్య సతాం గృహేషు విబుధో భిక్షా మటిత్వా తతో**
**లబ్ధాన్నైరసుసఙ్భయం దరిధరన్ బ్రహ్మైతి విజ్ఞానతః ।**
**సర్వాత్మా పురుషస్స ఏష భజతే పఞ్చాత్మతాం చామునా**
**చోతం ప్రోతమిదం జగత్స్వయమయం సర్వం జగద్బ్రహ్మ యత్ ॥239**

భావ॥ ముముక్షువు సన్న్యసించును. సత్పురుషుల గృహములందు "భిక్ష" స్వీకరించును. అట్టి సద్భిక్షవలన ప్రాణములు నిలుపుకొనును. (దుష్టుల అన్నము స్వీకరించినచో పాపము, మానసిక దోషములు ఏర్పడును.) అలా బ్రదుకుచు విజ్ఞానము ద్వారా బ్రహ్మమును పొందును. బ్రహ్మవేత్త అయిన ఈ పురుషుడు పంచాత్మకుడగును. ఈ ప్రపంచమంతా ఇతడు అల్లిబిల్లిగా అల్లికొని యున్నాడు. ఎందుకంటే ఇతడు సర్వజగద్రూపమయిన బ్రహ్మము గదా! బ్రహ్మవేత్త బ్రహ్మము కదా! బ్రహ్మము "సర్వం ఖల్విదం బ్రహ్మ" గదా! "అయమాత్మా బ్రహ్మ" కదా! "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" కదా! 239

విశే॥ 1. పంచాత్మకుడు = విషయాలు, భూతములు, ప్రాణములు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు – అన్ని "5", "5" గదా! పంచవిధవస్తు స్వరూపం అగును.

2. భూతాత్మా చేంద్రియాత్మాచ ప్రధానాత్మా తథా భవాన్, ఆత్మా చ పరమాత్మా చ త్వమేకః పంచధా స్థితః" అని పంచాత్మకత్వం చెప్పవచ్చును.

3. బ్రహ్మం – జగత్తు – ఆత్మ – అన్ని ఒక్కటే కనుక బ్రహ్మవేత్త అన్ని కాగలడు. కనుక జగత్తులో పడుగుపేకలుగా నుండగలడు.

**శ్లో॥ బ్రహ్మజ్ఞః పురుషస్స ఏష సకలం భూతం భవిష్యద్భవ–**
**ద్విశ్వం యత్సకలాత్మకం బృహదసావాత్మేతి విజ్ఞాతవాన్ ।**
**బ్రహ్మిష్ఠాత్మగురూపదేశధనవాన్ శ్రద్ధాయుతస్స్వప్రభ–**
**స్సత్యో బ్రహ్మవిదేష సంసృతితమఃపారే పరం వర్తతే ॥ 240**

భావ॥ బ్రహ్మవేత్త అయిన పురుషుడే యీ భూతభవిష్యద్వర్తమాన ప్రపంచము. ఇదంతా అతని రూపమే. సకల స్వరూపమయిన యీ బ్రహ్మమే 'ఆత్మ' అని అతనికి తెలిసినదిగదా! బ్రహ్మనిష్ఠులయిన ఆత్మ గురువుల ఉపదేశరూప ధనము గల యీ శ్రద్ధావంతుడు అగు బ్రహ్మవేత్త సత్యస్వరూపుడు. అతడు సంసార తమస్సముద్రపారమున నుండును. అనగా అతనికి అంటదు. 240

విశే॥ పురుషః = పురమునందు అనగా ఈ శరీరమునందు శయనించు వాడు.

**శ్లో॥ యత్సన్న్యస్య గురుం ప్రపద్య పరమం సద్బ్రహ్మనిష్ఠం పరం**
**శాన్తం బ్రహ్మ తదాననాదధిగతో వేదాన్తతత్త్వశ్రుతిమ్ ।**
**మత్వాఽఽత్మానమహం పరః పురుష ఇత్యాధ్యాయ నిధ్యాయ చ**
**బ్రహ్మాఽఽప్నోత్యమృతం పుమాన్ భవతి తత్సన్న్యాస ఏవాధికః ॥241**

భావ॥ సన్న్యసించి పరముడు, సద్బ్రహ్మనిష్ఠుడు, పరాత్పరుడు, శాంతుడు బ్రహ్మరూపుడు, అయిన గురువును పొంది గురుముఖతః వేదాంత తత్త్వశ్రుతిని పొంది, తన 'ఆత్మ అపరమపురుషుడే' అని గమనించి ధ్యానించి, నిదిధ్యాసన చేసి, నిర్వికల్ప సమాధిలో దర్శించి ఆ అమృత బ్రహ్మ తత్త్వమును అనుభవించును. పురుషుడే అమృత రూపుడగును. కనుక ఇతర మార్గములన్నింటికన్న సన్న్యాసమే అధికము. 241

విశే॥ 1. ఆధ్యాయ = సవికల్ప సమాధిలో పొంది లేదా నిదిధ్యాస చేసి; నిధ్యాయ = నిర్వికల్ప సమాధి పొంది బ్రహ్మానందమువనుభవించి,

2. బ్రహ్మన్యాసః = అను (235) శ్లోకంలో సన్న్యాసం సగుణ ముక్తి హేతువన్నాము. ఇచ్చట నిర్గుణముక్తి హేతువన్నాము. సన్న్యాసం పరోక్షజ్ఞానం ద్వారా సగుణముక్తి అపరోక్షజ్ఞానం ద్వారా నిర్గుణముక్తి. జ్ఞానం లేని కేవలసన్న్యాసం బ్రహ్మలోక ప్రాప్తిహేతువు కాదు. జ్ఞానం తప్పనిసరి.

"య ఏవం విద్వానుదగయనే ప్రమీయతే దేవానా మేవ మహిమానం గత్వా ఆదిత్యస్య సాయుజ్యం గచ్ఛతి" – అని తైత్తిరీయ శ్రుతి.

3. అయితే సన్న్యాసం సంగతి వదలుదాం. జ్ఞానమే ద్వివిధముక్తి సాధనం. పరోక్ష జ్ఞానం సగుణ ముక్తికి అపరోక్షజ్ఞానం నిర్గుణముక్తికి సాధనం అందాము. కనుకనే గృహస్థు లయిన జనకాదులు జ్ఞానులు ముక్తులు కదా! "అభయం వై జనక ప్రాప్తోసి" గదా! కనుక సన్న్యాసం గొప్పది కాదు. సమా – జ్ఞానము మోక్షమునకు ప్రత్యక్ష సాధనము. దానికి సాధనాలు శ్రవణ మననాదులు. "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" గదా! అందుకు కావలసిన ఏకాగ్రత గృహస్థ దశలో అసాధ్యం. సన్న్యాసదశలో సులభం. కనుక సన్న్యాసం జ్ఞాన సాధనము. "శాంతో దాంత ఉపరతః" గదా! జనకాదులు వామదేవాదుల వలె జన్మాంతరీయ సన్న్యాసం వలన జ్ఞానం పొందినవారనాలి. కనుక ఇబ్బంది లేదు. మోక్షహేతువయిన సన్న్యాసము అధికమే.

**శ్లో॥ త్వం బ్రహ్మన్నసి వస్తుతత్త్వరణితా జాతోఽసి విశ్వాత్మనా**
**జీవస్యాసుషు యోజకోఽసి సకలవ్యాపీ త్వమేవాసి చ ।**

**తేజో రాసి చ సూర్యవహ్నిశశినాం సోమోఽసి యాగేష్వపి**
**త్వాం తత్త్వస్ఫురణాయ సర్వవిదుషం సర్వాన్తరం ప్రార్థయే ॥ 242**

భావ॥ సన్న్యాసము సర్వాధికము కనుక బ్రాహ్మణుడు సన్న్యసించి అంతర్యామి అయిన భగవంతునిట్లు ప్రార్థించెను. బ్రహ్మన్! నీవు వాస్తవతత్త్వమును మాకు చెప్పగలవాడవు. విశ్వరూపముగా ఆవిర్భవించినవాడవు. జీవునకు ప్రాణములకు జతపఱచినవాడవు. నీవే సకల వ్యాపివి. సూర్యచంద్రాగ్నులకు నీవే తేజస్సును ఇచ్చువాడవు. నీవే యాగములలో సోమరస-రూపుడవు. సర్వజ్ఞుడవు. సర్వాంతర్యామివి. నాయందు ఆత్మస్వరూపస్ఫురణ జరిపింపుమని నిన్ను ప్రార్థించుచుంటిని. 242

**శ్లో॥ అన్తర్యామిణమేవమేష విబుధస్సన్న్యస్య సమ్ప్రార్థయన్**
**నిర్విఘ్నః ప్రణవం మహోపనిషదం గోప్యం సురాణామపి ।**
**యుఞ్జన్నాత్మని చిన్మయే పరశివే బ్రహ్మణ్యనన్తే సమా-**
**దధ్యాచ్చిత్తమథాత్మదర్శనవశాన్మాహాత్మ్యమస్యాశ్నుతే ॥ 243**

భావ॥ ఈ విధముగా పండితుడు సన్న్యసించి అంతర్యామిని పైన చెప్పిన విధముగా ప్రార్థింప వలయును. విఘ్నములను తొలగించికొని మహోపనిషత్తు, దేవతలకు గూడా గోప్యమయిన ప్రణవమును నిరంతరముగా ఉచ్చరించుచు తన మనస్సును చిన్మయుడు, అనంతుడు, పరమ మంగళుడు - అయిన బ్రహ్మము నందు సమాహితం చేయవలయును. అంతట, ఆత్మ దర్శనానుభవం వలన సచ్చిదానంద స్వరూపమయిన బ్రహ్మ మహిమను ఈ సన్న్యాసి పొందును. 243

**శ్లో॥ జీవన్ముక్తిముపేయుషోఽస్య విదుషో యజ్ఞస్య యష్టా స్వయం**
**శ్రద్ధాప త్న్యథ దేహ ఇన్ధనమురో వేదిశ్చ లోమవ్రజః ।**
**బర్హి ర్వేదమయశ్శిఖా చ హృదయం యూపశ్చ కామో ఘృతం**
**మన్యుర్హవ్యపశుస్తపో హుతవహశ్శాన్తిర్దమో దక్షిణా ॥ 244**

భావ॥ జీవన్ముక్తిని పొందిన ఈ విద్వాంసునియొక్క యజ్ఞమునకు ఆత్మయే యజమాని. ఆయన శ్రద్ధయే పత్ని. దేహమే ఇంధనము. వక్షస్థలమే వేదిక. రోమములే దర్భలు. వేదము శిఖ. హృదయం యూపము. కామము ఘృతము. మన్యువు హవిస్సుగా అయిన పశువు. తపస్సు అగ్ని. శాంతియుతమయిన దమము దక్షిణ. 244

విశే॥ 1. సన్న్యాసమే అంతరంగసాధనము. కనుక జిజ్ఞాసువునకు సన్న్యాసము కర్తవ్యము. కర్మాచరణ కాదు. జ్ఞానం తరువాత కర్మలు చేయవచ్చు కదా! - అక్కరలేదు. అతనికి ఇక కోరికలే లేవు. ఆయన జీవితమే యజ్ఞము. ఆయన భోజనాది వ్యవహారమే యజ్ఞము.

2. మోక్షకాముడు హృదయమున ప్రవృద్ధమయిన తపస్సులో కామ మన్యువులను హోమము చేయును.

**శ్లో॥ వాగ్ఘోతాఽస్య భవత్యసుస్తు పర ఉద్గాతా దృగధ్వర్యుకో**
**బ్రహ్మాగ్నీద్ధృదయం శ్రుతిస్తు గిళనం తత్సోమపానస్తథా ।**
**తత్త్వార్థేస్య రతిర్భవత్యుపసదశ్చేష్టా ప్రవర్గ్యో ముఖం**
**హోమాగ్నిస్తు మతిర్హుతం తు సమిధో భక్ష్యం పయోఽన్నాదికమ్ ॥245**

భావ॥ జీవన్ముక్తుడే యజ్ఞము. అతని వాక్కు హోత. ముఖ్యప్రాణము ఉద్గాత, నేత్రం అధ్వర్యువు, మనస్సు బ్రహ్మ, కర్ణము అగ్నీధ్రుడు, భక్షణం, సోమపానము. తత్త్వార్థాసక్తి ఉపసదము. గమనాది చేష్ట ప్రవర్గ్యము. ముఖం అహవనీయ మనుహోమాగ్ని. విజ్ఞానము హుతము. భక్ష్యమయిన పాలు అన్నము మొదలగునవి సమిధలు. (ఉపసదము – గురుసేవ)245

**శ్లో॥ సాయంప్రాతరథాన్తరం త్రిషవణం దర్శేతరౌ నిద్దినే**
**చాతుర్మాస్యతి పక్షమాసమృతవస్తే పాశుబన్ధాస్తథా ।**
**సర్వేఽబ్దాస్తదహర్గణా అసుధృతిస్సర్వస్వ సత్రం క్షుధో**
**దీక్షాధారణమస్య చాప్యవభృథో మృత్యుశ్చరిత్రం కృతిః ॥ 246**

భావ॥ ప్రాతః, మధ్యాహ్న సాయంకాలములు సవన త్రయము. అహోరాత్రములు దర్శపూర్ణమాసములు. పక్షమాసములు చాతుర్మాస్యము. ఋతువులు పాశు బంధములు. ప్రభవాది సంవత్సరములు అహర్గణములు. ప్రాణధారణ సర్వస్వసత్రము. ఆకలి సమయం దీక్ష. మరణం అవబృధము. జనన మరణాది చరిత్ర ఆయన కర్మ. అంతే. 246

ఇచ్చటికి ఈ 3 శ్లోకములు జీవన్ముక్తుని వర్ణన.

**శ్లో॥ యో విద్వానితి నా పరోక్షపరమాత్మా భేదధీరుత్తరే**
**మృత్యుం యాత్యయనే మహత్త్వమధిగత్యాయం సురాణామథ ।**
**సాయుజ్యం తరణేః ప్రయాస్యతి తు యో నా దక్షిణే తాదృశోఽ-**
**గ్నిష్వాత్తాది మహత్త్వమేత్య శశినస్సాయుజ్యమాయాస్యతి ॥ 247**

భావ॥ ఈ విధముగా పరమాత్మజ్ఞానం పరోక్షంగా లభించినవాడు ఉత్తరాయణములో మరణించినచో అతడు దేవతల మహిమను పొంది సూర్యసాయుజ్యమును పొందును. అట్టి పరోక్షజ్ఞాని దక్షిణాయనమున మరణించినచో అగ్నిష్వాత్తాది పితృదేవతల మహత్త్వమును పొంది చంద్ర సాయుజ్యమును పొందును. (వీరి ప్రయాణము దేవయాన పితృయానములు)247

**శ్లో॥ సూర్యాచన్ద్రమసోర్మహత్త్వమితి తౌ యాతౌ హిరణ్యోదరం**
**సాక్షాత్కృత్య చ తత్ర తత్పదమథ త్యక్త్వా పదం బ్రహ్మణః ।**

**గత్వా తన్మహిమానమేత్య పరమాభిన్నాత్మసాక్షాత్కృతిం**
**తత్ర ప్రాప్య తదీయధామవిలయాదూర్ధ్వం బృహద్యాస్యతః ॥ 248**

భావ॥ ఈ విధముగా సూర్యచంద్రుల లోకములకు వెళ్లిన యీ సన్న్యాసులు, అచ్చట హిరణ్యగర్భ బ్రహ్మను సాక్షాత్కరించికొని సూర్యచంద్రలోకములనుండి బ్రహ్మలోకమునకు వెళ్లెదరు. అచ్చట బ్రహ్మమహిమను తామూ పొంది అచ్చటనే బ్రహ్మోపదేశము వలన ఆత్మ – అభిన్నంగా బ్రహ్మమును సాక్షాత్కరించికొనెదరు. తరువాత బ్రహ్మలోక విలయానంతరము ఆ బ్రహ్మముతో కలిసి పరబ్రహ్మములో లీనమయ్యెదరు. 248

విశే॥ 1. చంద్రసూర్యలోకములను పొందిన కర్మఠులు పునరావృత్తిగా జన్మకు వస్తారు. సన్న్యాసులు జ్ఞానులు రారు. "తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" – గీత

"ఆ బ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోర్జున" – గీత అన్నంతమాత్రమున పునరావృత్తి ఉన్నదనరాదు. బ్రహ్మలోకముగూడా నశ్వరమని చెప్పటమే దాని అర్థము.

"బ్రహ్మణా సహతే సర్వే సంప్రాప్తే ప్రతి సంచరే, పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరంపదమ్" అని స్మృతి. దీనివలన బ్రహ్మలోకము పునరావృత్తి రహితమని చెప్పాలి.

"ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽవర్తతే పునః" – గీత.

**దీనివలన చంద్రలోకము వెళ్లిన వానికి పునర్జన్మయని సూర్యలోకము వెళ్లిన కర్మఠునకు పునర్జన్మ లేదని వ్యాఖ్యానించరాదు**. ఆ గీతావాక్య తాత్పర్యము దేవయానములో వెళ్ళువారు బ్రహ్మలోకమే వెళ్లెదరు – అని దాని తాత్పర్యము. పితృయానం ద్వారా వెళ్లిన వారయినా బ్రహ్మలోకం చేరినవారికి పునరావృత్తి లేదు గదా! మరి దేవయానమే బ్రహ్మలోకప్రాప్తి, పునరావృత్తి రహితమన్నారెందుకు? – సమా – అందరూ బ్రహ్మలోకం వెళ్లాలంటే దేవయానమే. అయితే పితృయానంలో వెళ్లిన జ్ఞాని (దక్షిణాయనం కారణంగా) అయినా చంద్రలోకము చేరి అచ్చటనుంచి దేవయానం ద్వారానే బ్రహ్మలోకము చేరును. అచ్చట అమానవపురుషుడు వీరికి ఆతివాహకుడు అవుతాడు. అనగా బ్రహ్మలోకం చేర్చేవాడు అవుతాడు. కనుక దేవయానము తద్వారా బ్రహ్మలోకము పునరావృత్తి రహితములే. అవి అచ్చట అపరోక్ష బ్రహ్మసాక్షాత్కారము కలిగించి ముక్తి హేతువులవుతాయి. కనుక పరోక్షబ్రహ్మవేత్త అయిన సన్న్యాసి బ్రహ్మలోకము చేరి వెనుదిరగడు. (కాశి నివాసంతో ముక్తి వంటిది) ఇక అపరోక్ష బ్రహ్మవేత్తకు నిర్యాణమే లేదు. అతను ఉన్నచోటనే బ్రహ్మం అవుతాడు.

"నారాయణ ప్రశ్న సమాప్తము"

## పురుషసూక్త ప్రారంభః

**శ్లో॥ తత్తద్వ్యష్టిశరీరసంస్థితిభృతస్తత్తత్పరిచ్ఛేదిన-**
**స్తత్తత్సన్నిహితం విదన్తి పురుషాస్తత్తద్దృగాదీన్ద్రియైః ।**
**మాయావీ తు మహేశ్వరోఽఖిలజగద్దేహాన్తరస్థోఽ పరి-**
**చ్ఛిన్నస్సర్వమపి ప్రవేద భగవాన్ స్వేనైవ వా మాయయా ॥ 249**

భావ॥ జీవేశ్వరుల వ్యావహారిక భేదమిది. సంసారులైన జీవులు ఆయా భిన్నమయిన శరీరోపాధులలో నుండి ఆయా పరిమితులకు లోబడినవారై ఆయా నరమృగాది శరీరములందు లభ్యమయిన నేత్రాదీంద్రియములతో ఆయా సమీపవస్తువులయిన ఘటాదులను ప్రత్యక్షంగా గమనిస్తారు. భగవంతుడు మాయాశాలి అయిన ఈశ్వరుడు. అఖిల జగత్తునందు దేహములందు వ్యాపించినవాడై, అఖండుడై యీ సర్వములను స్వయంజ్యోతిగాను, మాయతోను సాక్షిగా గ్రహించుచుండును. అసంసారి. 249

విశే॥ 1. ఇక పురుషసూక్త వ్యాఖ్య – జీవుడు అల్పజ్ఞుడు. ఖండుడు. సేవకుడు. ఈశ్వరుడు సర్వజ్ఞుడు, అఖండుడు, సేవ్యుడు. అందువలన పురుషార్థమయిన మోక్షము సిద్ధించును. అది క్రమముగాగాని, "సద్యః"గాని సిద్ధించును. కనుక జీవేశ్వరుల వ్యావహారిక భేద వర్ణన ముక్తికుపయోగించేదే. కనుక తప్పులేదు.

2. ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః, జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాంవర్గో భగోమతః" భగం అనగా ఈ '6' గలవాడు భగవాన్.

**శ్లో॥ మాయావీ పురుషస్సహస్రమకుటశ్రోత్రాక్షినాసాభుజా-**
**కణ్ఠోరోజఠరోరుజానుచరణో వృత్వా సమన్తాద్ధరామ్ ।**
**సోఽసావత్యవసద్దశాఙ్గులమిదం సర్వం స ఏవేశ్వరో**
**భూతం యచ్చ భవద్భవిష్యదమృతత్వస్యాధిపోఽన్నాతిగః ॥ 250**

భావ॥ సహస్ర శీర్షుడు, సహస్ర నేత్రుడు, సహస్ర పాదుడు, సహస్ర మకుట శ్రవణ నాసికా భుజ కంఠ వక్షస్థలుడు, సహస్రోరు జానువు అయిన ఆ మాయామయ పురుషుడు ఈ భూమిని అంతటా ఆవరించి అంతకు మించి దశాంగులము నిలిచియుండెను. ఇదంతయు ఆ ఈశ్వరుని స్వరూపమే. విభూతియే. భూత భవిష్యద్వర్తమానమయిన కాల సమేతమయిన ఈ ప్రపంచమంతా ఆయన స్వరూపమే. ఆయనయే అమృతత్వమునకు అధిపతి. అన్నము అనగా మర్త్యమయిన ప్రపంచమునకు అతీతుడు. మోక్షదాత. 250

**శ్లో॥ ఏతావాన్మహిమాస్య సర్వజగతో జ్యాయాన్ స చాయం పుమాన్**
**పాదోఽస్యాఖిలలోక ఏష దివి సత్పాదత్రయం చాఽమృతమ్ ।**
**ఆక్రమ్యైష చ దక్షిణోత్తరపథద్వన్ద్వం సమన్తాత్స్థితో**
**జజ్ఞేఽస్మాత్పురుషో విరాడితి స యో జాతోఽతిరిక్తో భువః ॥ 251**

భావ॥ అతని మహిమ ఇంతటిది. ఈ పురుషుడు సర్వజగత్తుకన్న అధికుడు. ఈ సమస్త లోకము ఆయన పాదము (4వ వంతు) మిగిలిన పాదత్రయము (3/4) ద్యులోకమున 'సత్' గా నుండెను. ఈ పురుషుడు దక్షిణోత్తర పథములయిన దేవయాన పితృయానములను మొత్తంగా ఆక్రమించియుండెను. ఈ పురుషుని నుంచియే "విరాట్టు" అను పురుషుడు జన్మించెను. అతను పట్టుచునే లోకములను, అందలి ప్రాణాలనుమించి (అధికుడయి) వ్యాపించెను. 251

**శ్లో॥ దేవా యజ్ఞమతన్వతాథ హవిషా పుంసా విరాజాఽమునా**
**యజ్ఞస్యాస్య మధుర్ఘృతం సమభవద్గ్రీష్మర్తురిధ్మం శరత్ ।**
**సఞ్జజ్ఞే హవిరస్య వా పరిధయస్త్రిస్సప్త సప్తాభవన్**
**సఞ్జాతాస్సమిధశ్చ యజ్ఞపురుషం దేవాస్తమగ్నౌ న్యధుః ॥ 252**

భావ॥ దేవతలు ఈ పురుషుని పశువుగా పెట్టి మానసయజ్ఞమును చేసిరి. ఈ యజ్ఞమునకు విరాట్పురుషుడు పశువు. వసంతుడు నేయి. గ్రీష్మర్తువు. ఇధ్మం (కట్టె). శరదృతువు హవిస్సు. దీనికి ఏడు సముద్రాలు. "21" సమిధలు అయినవి. దేవతలు ఈ యజ్ఞపురుషుని అగ్నిలో పడవేసిరి. 252

**శ్లో॥ తస్మాత్సర్వహుదాహవాత్సమభవన్ వేదాస్త్రయో మానసాత్**
**ఛన్దాంస్యశ్వగవాజమేషపశవో గ్రామ్యాశ్చ వన్యాస్సమే ।**
**బ్రహ్మైతస్య ముఖం విభోర్భుజయుగం క్షత్రం విదూరుద్వయం**
**శూద్రః పాదయుగం హృదిన్దురరుణశ్చక్షుర్ముఖం జిష్ణుకౌ ॥ 253**

భావ॥ సర్వహోమాత్మకమయిన యీ మానస యజ్ఞమునుండి మూడు వేదములు ఛందస్సులు గవాశ్వములు, అజమేషములు మొదలగు పశువులు గ్రామ్యములు వన్యములు అన్నియు పుట్టినవి. బ్రాహ్మణుడు ముఖముగానూ, క్షత్రియుడు భుజములుగాను, వైశ్యుడు ఊరుద్వయముగాను, శూద్రుడు పాదద్వయముగాను, చంద్రుడు మనస్సుగాను, సూర్యుడు కన్నుగాను, ముఖము ఇంద్రాగ్నులుగాను అయ్యెను. అనగా ఆయా అవయవములనుండి ఆయా వస్తువులు వ్యక్తులుద్భవించినవి. 253

**శ్లో॥ ప్రాణో వాయురముష్య నాభిరభవత్ఖం ద్యౌశ్శిరో భూః పదౌ**
**కాష్ఠాశ్శ్రోత్రమితి ప్రభోరకలయన్నఙ్గాని లోకాన్ బుధాః ।**

**యో రూపాణి విచిత్య హన్త సకలాన్యాధాయ నామాని చా-**
**స్తే పారే తమసో మహోమయమముం విద్యాన్మహాన్తం బుధః ॥254**

భావ॥ ఆయన ప్రాణము వాయువయ్యెను. నాభి అంతరిక్షమయ్యెను. శిరస్సు ద్యులోకము. పాదములు భూలోకము. చెవులు దిక్కులు. ఈవిధముగా ఆ విరాట్పురుషుని అవయవములను పండితులు లోకములుగా కల్పించిరి. సకలరూపములను నిర్మించి సకలనామములను ఏర్పరచియు ఆయన అజ్ఞాన పారమున వెలుగుచున్నాడు. ఆహా! అట్టి జ్ఞాన స్వరూపుడయిన ఈశ్వరుడు బుధులకు జ్ఞేయుడు. 254

**శ్లో॥ ధాతా ప్రాగ్యముదాజహార భగవాన్ శక్రః ప్రవేదాపి యం**
**సర్వాశ్చాపి స ఇత్యహం స ఇతి తం యో వేద సోఽయం సుధీః ।**
**జీవన్నేవ పరాం ప్రయాత్యమృతతామన్తే తనోః కిం పునః**
**ప్రాప్తుం బ్రహ్మపురం పరాస్తి న నృణాం విజ్ఞానమార్గాద్గతిః ॥ 255**

భావ॥ అందరూ ఆయనను తెలిసికొనాలి. భగవాన్! బ్రహ్మ ఆయనను తొలిసారి ఇంద్రునికి ఉపదేశించెను. ఆ ఇంద్రుడు ఈ పురుషుని గురించి తెలిసికొనెను. అలాగే ఈ సర్వము ఈశ్వరుడేనని, నేను ఆ ఈశ్వరుడనేనని ఎవరు తెలిసికొనునో వాడు జ్ఞాని. వాడు జీవించి యుండగనే పరమమయిన అమృతత్వమును పొందును. ఇక విదేహముక్తి చెప్పవలయునా! అమృతుడే అగును. బ్రహ్మ పురమును చేరవలెనంటే మానవునకు విజ్ఞానమార్గమును మించిన గతి లేదు. అదే పరాయణము. 255

**శ్లో॥ యజ్ఞేనేత్యయజన్త యజ్ఞమమరా నాకం గతాస్తేన తం**
**పూర్వే యత్ర వసన్తి సాధ్యవిబుధా ధర్మః పురాణో హ్యయమ్ ।**
**యజ్ఞో విష్ణురయం ప్రజాపతిరజోప్యణ్డాన్తరేఽనేకధా**
**జాతస్సన్ చరతి ప్రవేద విబుధః కస్సర్వయోనింత్వముమ్ ॥ 256**

భావ॥ మానసయజ్ఞమును చేసినవారికి ఫలం ఇది. దేవతలు ఈ మానసయజ్ఞముతో విష్ణురూపయజ్ఞపురుషుని అర్చించిరి. దీనివలన వారందరు సాధ్యదేవతాస్థానమయిన లోకములను పొందిరి. ఈ మానసయజ్ఞానుష్ఠానరూపమయిన ధర్మము సనాతనము. యజ్ఞమనగా విష్ణువు, యజ్ఞమనగా ప్రజాపతి అనగా బ్రహ్మాది స్తంబపర్యంతము పాలకుడు. అజుడు. ఈయనయే బ్రహ్మాండ మధ్యమున అనేక విధములుగా విష్ణు రుద్ర గణపతి కుమార, కాళీ భారతీ లక్ష్మి రామకృష్ణ సీతాలక్ష్మి గౌర్యాదిరూపముతో సంచరించుచున్నాడు. సర్వయోని అయిన ఆ మహాత్ముని ఎవరు తెలిసికొనగలరు. "మాంతు వేద న కశ్చన" - గీత. 256

విశే॥ 1. విష్ణుః = వ్యాపకుడయిన పరమేశ్వరుడు, అజుడయినా మాయవలన రకరకములుగా అవతరిస్తాడు. అవతారాలు, నానావిధ జీవులు అన్నీ ఆయన విభూతులే.

2. కః = ఎవడు? కః = కశ్యపుడు, కః = ప్రజాపతి. ఎవడో ధన్యుడు తెలిసికొనగలడనియే తాత్పర్యము. లేదంటే జ్ఞానియే ఉండడు.

"బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి", "తమేవం విదిత్వాతి మృత్యుమేతి"

3. కః – ఆత్మభిన్నంగా ఏదీ లేదు కనుక ఎవడూ ఎఱుగడు. "కేన కం పశ్యేత్" భిన్నం జడం మిథ్యకదా!

4. కః = ఆత్మా – ఆత్మయే తనను తాను తెలిసికొనును. తనకు తాను అపరోక్షమే కదా! జీవుడు తెలిసికొన్నా జీవుడున్నూ తనే కదా!

కః = యముడు. యమునికి తెలుసు అని అర్థము.

"కస్తం మదామదం దేవం మదన్యోవేత్తు మర్హతి" – కఠ.

**శ్లో॥ యో దేవాధికధీశ్చ భవ్యమపి యో ధత్తేஉమరాణాం పురో**
**దేవేభ్యః ప్రథమం చ యస్సమభవద్దేవాన్ ససర్జాపి యః ।**
**దక్షాదిప్రథితప్రజాపతిపితా యస్తస్య ధామేచ్ఛవః**
**ప్రాప్తుం సత్యమముష్య యోనిమజనిం ధీరా విదన్తీశ్వరమ్ ॥ 257**

భావ॥ కేవలము మోక్షార్థులే గాక సగుణముక్తి క్షేత్రమయిన బ్రహ్మలోకమును గాని, హిరణ్యగర్భత్వమును గాని కోరువారయినా ఈశ్వరుని ఉపాసించెదరు.

హిరణ్యగర్భుడు దేవతలందఱికన్న అధికధీశాలి. దేవతల యెదుట శుభాకారుడు, దేవతలకన్న ముందు పుట్టిన దేవత. దేవతలను ఆయనయే సృష్టించెను. అతడే దక్షాది ప్రజాపతులకు తండ్రి, అట్టి హిరణ్యగర్భుని సత్యలోకమునో (మరుజన్మలో ద్విపరార్ధావసానం తరువాత) ఆ లోకాధిపత్యమునో కోరువారు హిరణ్యగర్భునకు గూడా తండ్రి అయిన సత్యుడయిన అజుడయిన ఈశ్వరుని శరణువేడెదరు. 257

విశే॥ 1. మాయోపాధికుడయిన యీశ్వరుని ధ్యానించెదరు.

2. **సగుణబ్రహ్మోపాసనవలనగాని, పరోక్షజ్ఞానమును మాత్రమే కలిగించు నిర్గుణోపాసన వలనగాని వచ్చేది హిరణ్యగర్భలోకమే.**

3. హిరణ్యగర్భుడినయినా ఈశ్వరునిగానే ఉపాసించాలికనుక నేరుగా ఈశ్వరునే ఉపాసించి హిరణ్యగర్భలోకమునో ఆ లోకాధిపత్యమునో కోరవచ్చు. తనలోకాధిపత్యం తనే

ఇవ్వలేదు కనుక, హిరణ్యగర్భోపాసన కన్న ఆయనను ఆయన పదవితోబాటు కన్న (అముష్యయోనిం) ఈశ్వరునే వేడుట ఉత్తమమని కొందఱు ధీరులు ఈశ్వరోపాసన చేస్తారు.

4. **ఎటూ పరోక్షజ్ఞానమే కనుక అందులో హిరణ్యగర్భ - ఉపాసన కన్న ఈశ్వరోపాసనయే మిన్న గదా!** ప్రత్యక్షజ్ఞానం దుర్లభము. పరోక్షజ్ఞానం సులభమే. అయితే ఆ పరోక్షజ్ఞానం ఎలా ఉండాలంటే ఏదో బ్రహ్మం ఉన్నదని తెలియటం మాత్రమే కాదు. అలా అయితే అందరూ బ్రహ్మలోకగాములే అవుతారు. అలా కాదు.

**"సచ్చిదానందలక్షణమయిన ఈశ్వరుడు ప్రత్యగభిన్నుడు" అనే పరోక్షజ్ఞానం కావాలి.** ప్రత్యగాత్మ మనమే. అయినా ప్రత్యక్షంగా తెలియటం లేదు గదా! కనుక పరోక్షమే కదా! యదార్థ స్వరూపం అపరోక్షానుభూతికి రాలేదు కదా! కనుక ఉపాసనాదుల వలన కలిగే ప్రత్యగాత్మాభిన్న ఈశ్వర పరోక్ష జ్ఞానం వలన బ్రహ్మలోక ప్రాప్తి - అని సిద్ధాంతము.

ఇతి తైత్తిరీయోపనిషద్వ్యాఖ్యాతా.

శ్రీః

# ఛాన్దోగ్యోపనిషత్

**శ్లో॥ భూతానాం పృథివీరసోఽమ్బుధరణేస్తస్యౌషధీనాం చ య-**
**స్తస్యాసౌ పురుషో రసస్తు వచనం పుంసస్తు ఋగ్వాగ్రసః ।**
**సామర్చోరస ఏతదస్య తు స చోద్గీథో రసో వాగ్ఘి ఋక్**
**ప్రాణస్సామ తదేతదోమితి పదన్తూద్గీథ ఇత్యుచ్యతే ॥ 258**

భావ॥ రసమనగా అత్యంత సారపదార్థము. భూతములకు భూమి రసము. భూమికి నీరు రసము. నీటికి ఓషధులు రసము. ఓషధులకు పురుషుడు రసము. పురుషునికి వాక్కు రసము. వాక్కుకు సామము రసము. సామమునకు ఉద్గీథమను సామభేదము రసము. అలాగే వాక్కు ఋక్కు. ప్రాణమే సామము. "ఓం" అనునది ఉద్గీథము. కనుక ఓమిత్యేతదక్షరముద్గీథ ముపాసీత" అని శ్రుతి. 258

విశే॥ 1. బృహదారణ్యకం వలె ఈ ఛాందోగ్యమున్నూ పెద్ద ఉపనిషత్తు.

2. ఉపనిషత్తు = సంసారమును శిథిలము చేయునది. దీనియందు పరమ శ్రేయస్సు ఉన్నది గనుక ఉపనిషత్తు – లేదా – బ్రహ్మమునకు సమీపమున నున్నది. ఏదయినా ఉపనిషత్తు అనగా బ్రహ్మవిద్యయే. కనుక బ్రహ్మవిద్యను చెప్పే గ్రంథమున్ను ఉపనిషత్తే.

3. ఛందోగులు = ఛందోగానము చేయువారు. వారికి సంబంధించిన ఉపనిషత్తు. కనుక సామవేదములోని ఉపనిషత్తు.

4. నిర్గుణబ్రహ్మవిద్యే దురవగాహం కనుక ముందుగా సులభమయిన సగుణ బ్రహ్మవిద్యను ఈ ఉపనిషత్తు చెప్తుంది. నిర్గుణంలో హఠాత్తుగా ప్రవేశించలేము. ఇది సంగతి.

5. ఉపనిషత్తులు స్వతః ప్రమాణములు. స్వతంత్రములు. కనుక వాటి మధ్య క్రమము

సంగతి అవసరము లేదు. అయినా యీ వేదాంతముక్తావళిలో సంగతిని చూపుచున్నాను. సంగతి ఉంటే మరింత శోభయే కదా!

6. రసము అనగా పరాయణము, గతి, ఆధారము, అత్యంతసార పదార్థము.

7. పృథివి నీటియందున్నది – ఆధారం. జలపరిణామములు ఓషధులు కనుక సారం. ఓషధుల వలన అన్నము. శరీరము అన్నమయకోశం. కనుక ఓషధుల సారం శరీరం – అలా

**శ్లో॥ ఘ్రాణం వాచమపీక్షణం శ్రుతిమథో చిత్తం చ దేవాః క్రమా-**
**దుద్గీథం సముపాస్య తేష్వసురకైః పాపైః ప్రవిద్ధేషు చ ।**
**ముఖ్యం ప్రాణముపాసతే స్మ తత ఉద్గీథం న తద్ధూషణే**
**తే శేకుర్వ్యసురా ఇవాశ్మదలనే లోష్టా అపాపో హ్యయమ్ ॥ 259**

భావ॥ దేవతలు ఉద్గీథోపాసన చేసిరి. ముందుగా వారు ముక్కును, వాక్కును, నేత్రములను, కర్ణమును, మనస్సును ఉద్గీథముగా ఉపాసించిరి. కాని పాపరాక్షసులు వాటిని దెబ్బదీసిరి. అందువలన దేవతలను ముఖ్యప్రాణమును ఉద్గీథముగా ఉపాసించిరి. అపుడు రాక్షసులు ప్రాణమును దెబ్బతీయలేకపోయిరి. మట్టి గడ్డలు రాతిని పగలగొట్టలేవు కదా! అందువలన ప్రాణము పాపరహితము శుద్ధము. అసంగము. ఉద్గీథమనగా ఓంకార భేదము.

ఇందులో ఘ్రాణాదులను ఉద్గాతలుగా కల్పించి ఉద్గీథమును ప్రాణాది దృష్టితో ఉపాసించారు. 259

(విశే॥ రాక్షసులు = కామక్రోధమోహాదులు. అసురగణాలు. ఆసురీసంపద. అవి ఇంద్రియాదులను ఆశ్రయించి చెడగొట్టాయి. కాని ప్రాణం శక్తి రూపము. దానికి విషయాస్వాదన లుండవు. లోభమోహాదులుండవు. కనుక అది అసురులకు లొంగదు. వాయురూపము. ఉద్గీథమునకు జతకుదురుతుంది – అనువాదక)

**శ్లో॥ ప్రాణోఽయం హి బృహస్పతిర్భవతి యద్వాచో బృహత్యాః పతి-**
**ర్యస్మాదఙ్గరసోఽఙ్గిరాశ్చ తదయం యస్మాచ్చ నిర్గచ్ఛతి ।**
**ఆస్యాదేష తదుచ్యతే కవిగణైరాయాస్య ఇత్యప్యముం**
**హ్యుద్గీథం గురురఙ్గిరాస్స్మ భజతే చాయాస్య నామా మునిః ॥ 260**

భావ॥ ఈ ప్రాణము బృహస్పతి. ఎందుకంటే ఇది బృహతి అయిన వాక్కుకు (వేదం) పతి. ఇది శరీర(అవయవ) సారమయినది గనుక అనగా అంగరసము కనుక "అంగిరాః" అంగిరసుడు. ఇది ఆస్యం అనగా ముఖమునుండి వచ్చునది కనుక కవులు దీనిని "ఆయాస్యః" అన్నారు. కనుక ఈ ఉద్గీథమును గురువు, అంగిరసుడు, ఆయాస్యుడు అను మునులు ఉపాసన చేసెదరు. 260

(విశే॥ బృహతీ = వేదం. బృహత్ బ్రహ్మ. ఇది వేదనామములు. ఛందోనామము.

“ఆయాస్యః – ఆస్యం = ముఖము. ఆస్యాత్ ఆయాతి = ఆయః = ఆస్యాయః = కాని పరోక్ష ప్రియత్వం వలన – పశ్యక = కశ్యప – లాగా ఆస్యాయుని ఆయాస్యుడనవచ్చును – అనువాదక)

**శ్లో॥ ప్రాణోద్గీథవిచిన్తనేన పురుషస్సత్కామగాతా భవే-**
**దుద్గీథం చ తమర్కమాకలయతే సోఽయం తమోభీతిహృత్ ।**
**వ్యానోద్గీథవిచిన్తనేన తు మహావీర్యోఽస్య యస్త్వక్షరా**
**ణ్యుద్గీథస్య విచిన్తయేత్స తు వచో దోహాన్నవా నన్నభుక్ ॥ 261**

భావ॥ ప్రాణములను ఉద్గీథముగా భావనచేయువాడు సత్కామములను గానముచేయు వాడగును. సామగానముద్వారా కోరికల నిప్పించును. ప్రాణములను అర్కునిగా (సూర్యుడు) ఉద్గీథోపాసన చేయువాడు అంధకారభయమును పోగొట్టును. వ్యానమును ఉద్గీథంగా ఉపాసించువాడు మహాబలశాలి యగును. ఈ ఉద్గీథ – అక్షరములను ఉద్గీథముగా ఉపాసన చేయువాడు వాక్ఫలమును పిండికొనును. అనగా ఋగ్వేదాది శబ్దసాధ్య ఫలమును పొందును. అన్నము గలవాడు అన్నము తినువాడున్ను అగును. 261

**శ్లో॥ ఉత్ప్రాణో వచనస్తు గీర్బుధజనైరన్నం థమిత్యుచ్యతే**
**ద్యౌ రేవోత్తు నభోఽథ గీస్తు ధరణీ థం వర్ణ ఇత్యుచ్యతే ।**
**ఉత్సూర్యః పవనస్తు గీర్హుతవహో థంకార ఇత్యుచ్యతే**
**సామోద్గీర్యజురేవ ఋక్తు నిగమో థంశబ్ద ఇత్యుచ్యతే ॥ 262**

భావ॥ ఉద్గీథాక్షరములనిట్లుపాసన చేయవలయును. పండితులు ఇట్లు చేసెదరు.

1. ఉత్ = ప్రాణము, గీః = వచనం థం = అన్నం
2. ఉత్ = ద్యౌః, గీః = ఆకాశము, థం = భూమి
3. ఉత్ = సూర్యుడు, గీః = వాయువు, థం = అగ్ని
4. ఉత్ = సామ, గీః = యజుః, థం = ఋక్

ఈ మూడు అక్షరములను ఆయా విషయములుగా ధ్యానము చేయవలయును.ః262

**శ్లో॥ దేవా మృత్యుభయాత్త్రయీం సమవిశన్ ఛన్దోభిరచ్ఛాదయ**
**న్నాత్మానం స చ తత్ర తానకలయద్దాశోఽణ్డజాన్ కే యథా ।**
**తాముత్సృజ్య తతోఽథ తే సమవిశన్నోఙ్కారమత్రామృతం**
**ప్రాపుశ్చాభయమేన మిత్యయతి యస్యాత్సోఽమృత శ్చాభయః ॥263**

భావ॥ ఓంకారోపాసన యొక్క వైభవం ఇది. దేవతలు మృత్యుభయంతో రక్షణకయి వేదత్రయములో దాగిరి. అందలి ఛందస్సులను మీద కప్పికొనిరి. అయినా వారిని మృత్యువుకనిపెట్టింది. జాలరి నీటిలో చేపలను కనుగొంటాడు కదా! అలాగే ఇదీ జరిగింది. వెంటనే దేవతలు వేదత్రయములను వదలి ఓంకారములోనికి ప్రవేశించిరి. అచ్చట వారు అమృతమును అభయమును పొందిరి. కనుక ఎవడు ఓంకారమును ఇట్లుపాసించునో ఆ సన్న్యాసి అమృతుడు అభయుడు అగును. 263

విశే॥ 1. వేదత్రయం అనగా వేదోక్త యజ్ఞాది కర్మలు. ఛందస్సులు అంటే అందలి మంత్రములు. కర్మ వినియోగం లేని మంత్రాలలో దూరి మృత్యువునుండి తప్పించికొనిరి. అయినా మృత్యువు వారిని కనిపెట్టింది. అంటే కర్మమార్గమున మృత్యువు తప్పలేదు. అందువలన వారు వేదములను అనగా కర్మలను వదలి, సన్న్యసించి ప్రణవమున జొరబడిరి. సన్న్యసించని వారికి ప్రణవాధికారము లేదు. ఓంకారమునందు వారు అమృతులు అభయులైరి. అనగా ప్రణవం బ్రహ్మప్రతీక. బ్రహ్మమునకు నామము, బ్రహ్మమునకు ఆలంబనము. బ్రహ్మమును చేర్చునది. కాగా కర్మలవలన భయమని, మోక్షము లేదని, కర్మసన్న్యాసం వలననే అమృతత్వం అభయం వస్తాయని కథ.

**శ్లో॥ సామాధ్యాథమృచి క్షితౌ శుచిమయం సా భూరమోఽగ్నిస్తతః**
**సామ భ్వగ్నియుగం చ ఖే ఋచి మరుత్సామాస్తి ఖం సా త్వమః ।**
**వాయు స్సామ ఖ వాయుయుగ్మమథ దివ్యృచ్యర్యమా సామ స**
**ద్యౌస్సామస్త్వరుణో ద్యుసూర్యయుగలం సామేతి సజ్గీయతే ॥ 264**

భావ॥ సామపదోపాసనా విధానము - భూస్వరూపమయినది ఋక్. దానియందు అగ్నిరూపమయిన 'సామం' ఉన్నది. కనుక సా = భూమి; అమ = అగ్ని; సామ = భూమ్యగ్నిద్వయము.

ఆకాశరూపమయినది ఋక్ . దానియందు వాయురూపమయిన సామం. కనుక సా = ఆకాశం. అమ = వాయువు; సామ = ఆకాశవాయు ద్వంద్వం.

ద్యులోకరూపమయినది ఋక్కు. దానియందు సూర్య స్వరూపమయిన సామం ఉన్నది. కనుక సా = ద్యులోకము, అమ = సూర్యుడు, కాగా సామ = ద్యుసూర్య ద్వంద్వము. 264

**శ్లో॥ నక్షత్రే ఋచి సామ శశ్యధిగతం సాభాన్యమశ్చన్ద్రమాః**
**సామర్క్షేన్దుయుగం రవేస్సితరుచౌ ఋచ్యస్తి సామాసితమ్ ।**
**తేజస్సాసితరుగ్రవేరసితరుక్సామస్తు సామ ద్వయం**
**శ్వేతాశ్వేతరవిత్విషోరితి తు యో వేదాయ మైశ్వర్యభాక్ ॥ 265**

భావ॥ ఋక్కు = నక్షత్రము. అందులోనున్న సామ చంద్రుడు. కనుక సా = నక్షత్రము, అమ = చంద్రుడు. సామ = నక్షత్ర చంద్ర ద్వయము. ఋక్కు = సూర్యుని తెల్లని కాంతి. సామ = అందలి నీల కాంతి కనుక సా = సూర్యుని శ్వేత కాంతి, అమ = సూర్యుని నీల కాంతి, సామ = శ్వేత – అశ్వేత కాంతి ద్వయము.

ఈ విధముగా ఎఱిగిన వానికి ఐశ్వర్యము లభించును. 265

**శ్లో॥ ఏతద్భాస్కరమణ్డలాన్తరతలే యో దృశ్యతే కాఞ్చన–**
**శ్మశ్రుః కాఞ్చనకేశ ఆపదనఖం సర్వస్సువర్ణః పుమాన్ ।**
**రక్తామ్భోరుహపుణ్డరీకనయనస్సర్వాఘసిన్ధూద్గత–**
**శ్చోన్నామా తదుపాసకస్తు భవితా సర్వాఘసిన్ధూద్గతః ॥ 266**

భావ॥ ఈ సూర్యమండల మధ్యమున నొక పురుషుడు కలడు. అతడు హిరణ్యశ్మశ్రువు. హిరణ్య కేశుడు. కాలిగోటిదాకా హిరణ్యమయుడయిన ఆ పురుషుని కన్నులు ఒకటి అరుణ కమల వర్ణము. మఱొకటి శ్వేతకమలసమానము. (సూర్యచంద్రులు నేత్రములని అర్థము) ఆయన సర్వపాపసముద్రముల నుండి బయట నున్నవాడు. కనుక "ఉత్". ఆయనను ఉపాసించిన వారుగూడా సర్వపాపసముద్రమునకు అతీతులగుదురు. 266

**శ్లో॥ ఉన్నామ్నః పురుషస్య తస్య తు మతే ఋక్సామనీ పర్వణీ**
**ఉద్గీథః పురుషోఽయమస్య నితరాం గానాత్స ఉద్గాతృతామ్ ।**
**ఉద్గాతా భజతే రవేః పరతరాన్ లోకానయం ధారయ–**
**న్నీష్టే దేవగణస్య కామనిచయం ధత్తే స్వయమ్భూః పుమాన్ ॥ 267**

భావ॥ 'ఉత్' అను ఈ పురుషునకు ఋక్, సామములు పర్వములు. ఇతనిని ఉద్గీథ పురుషుడు అనెదరు. ఇతనిని బాగుగా గానము చేయుటవలన అనగా 'ఉత్' గానము వలన ఉద్గాతకు "ఉద్ – గాత" అని పేరు ఏర్పడెను. సూర్యుని కన్న ఊర్ధ్వతరమయిన లోకములను ఇతడు నిలబెట్టి యుంచును. దేవగణమునకు ఇతడే ఈశ్వరుడు, ఈ స్వయంభువయిన పురుషుడు దేవతలకు భక్తులకు సర్వ కామములను తీర్చును. 267

**శ్లో॥ వాగ్ఘ్రాణే నయనాత్మకౌ శ్రుతిహృదీ సామౌ యతస్సామ త–**
**ద్ద్వన్ద్వం తత్ర హి పూర్వపూర్వవిషయేఽధ్యూఢః పరోఽర్థః పరః ।**
**అక్ష్ణశ్శుక్లరుచిస్తు సా ఋగథ తన్నీలం త్వమస్సామ చ**
**ద్వన్ద్వం సామ తయో రుచోరపి తతః పూర్వత్ర సంస్థా పరా ॥ 268**

భావ॥ వాక్కు, ముక్కు, ఒక జంట. నయనం, అందలి ఆత్మచ్ఛాయ ఒకజంట. శ్రుతి

హృదయములు మఱొక జంట. ఇవి 'సా+అమ' అను జంటలు. ఈ రెండూ కలిసిన జంటయే సామము. ఇందులో మొదటి దానియందు రెండవది ఆరోపింపబడినవి. అనగా వాక్కునందు ముక్కు, నయనమునందు ఆత్మ, శ్రుతియందు హృదయము (మనస్సు) ఆరోపింపబడినవి. కంటిలోని శుక్లకాంతి "సా" ఋక్కు. నీలికాంతి అమ = = సామ. కనుక ఈద్వయం 'సామం'. ఇందులోనూ శుక్లకాంతి యందు నీలకాంతి ఆరోపింపబడినది. ఇది ఆధ్యాత్మమునందు సామోపాసన. 268

**శ్లో॥ అక్ష్ణోఽన్తః పురుషో య ఏష కుశలైస్సన్దృశ్యతే తస్య సా**
**ఋక్తత్సామ తదుక్థమస్య చ యజుస్తద్బ్రహ్మ తద్వాఙ్మయమ్ ।**
**సూర్యస్థస్య యదేవ రూపమభిధా యా పర్వణీ యే తథా**
**నేత్రస్థస్య తదేవ రూపమభిధా సా పర్వణీ తే మతే ॥ 269**

భావ॥ నిపుణులయిన యోగులు నేత్రాంతరంగమున ఒక పురుషుని గమనించెదరు. అతనికి అదే ఋక్కు, అదే సామము, అదే ఉక్థము (శస్త్రము), అదే యజుస్సు, అదే వాఙ్మయము, సూర్యమండలగతుడయిన పురుషునకు రూపము, నామము పర్వలు ఏవి చెప్పబడినవో నేత్ర మధ్యపురుషునకున్ను అవే. (హిరణ్యశ్మశ్రువులు, ఉత్, ఋక్సామములు) 269

**శ్లో॥ అర్వాచీనపదాని మర్త్యవిషయాన్ కామానయం వై పుమా-**
**నీష్టే గాయతి యోఽముమేష స భజేన్మర్త్యః ప్రభూతం ధనమ్ ।**
**ఉద్గీథం త్వముమర్కమణ్డలగతం యో గాయతి ప్రాప్నుయా-**
**ల్లోకానూర్ధ్వగతాన్ స ఏష దివిషత్కామాంశ్చ సర్వానపి ॥ 270**

భావ॥ నేత్ర మండల పురుషుడు శరీరమునందు నేత్రములకన్న క్రింది స్థానములను పాలించును. అలాగే మానవ మనోరథములకు అతడే ప్రభువు. ఈయనను గానము చేయువాడు, ధనసమృద్ధిని పొందును. సూర్యమండల పురుషుని గానము చేసినవానికి ఊర్ధ్వలోకములు, దివ్యభోగములు లభించును. 270

**శ్లో॥ సామ్నామేష గతిః స్వరస్స చ తతః ప్రాణస్తు తస్యోదనం**
**తస్యామ్భో గతిరమ్బునోగతిరసౌ స్వర్గస్తు తస్య క్షితిః ।**
**ఆకాశః పురుషః క్షితేస్స హి గతిర్విశ్వం యతో జాయతే**
**యస్మిన్నేవ విలీయతే స జగతో జ్యాయాన్ ప్రతిష్ఠా పరా ॥ 271**

భావ॥ ఉద్గీథమును పరమాత్మరూపముగా ధ్యానింపవలయును. సామములకు ఈ ఉద్గీథ స్వరము గతి. స్వరమునకు ప్రాణము గతి, ప్రాణమునకు ఓదనము గతి. ఓదనమునకు నీరు గతి, నీటికి స్వర్గము గతి. స్వర్గమునకు భూమి గతి. భూమికి స్వయం ప్రకాశుడయిన పురుషుడు

గతి. ఆయననుండియే ఈ విశ్వం పుట్టును. ఆయన యందే లీనమగును. ఆతడు ప్రపంచమున కన్న గొప్పవాడు. పరమ ప్రతిష్ఠ. 271

విశే॥ పర్జన్యాదులకు ఆశ్రయం కనుక జలమునకు ద్యులోకము గతి. యాగదాన హోమాదుల వలన పోషిస్తుంది గనుక ద్యులోకమునకు భూమి గతి.

**శ్లో॥ ఉద్గీథేఽత్ర పరోవరీయసి తు యశ్చిత్తం చిరం స్థాపయే-**
**త్తస్యైవం విదుషో విశిష్టమవనౌ స్యాజ్జీవనం చోత్తమాన్ ।**
**లోకాన్ స ప్రజయేదితి స్మ మునయే శాణ్డిల్యనామ్నేఽవద-**
**త్స ప్రాజ్ఞశ్శునకాత్మజః ప్రవిదితో నామ్నాఽతిధన్వేతి యః ॥ 272**

భావ॥ పరము వరీయము అనగా అతీతము అయిన పరమాత్మరూపమయిన ఉద్గీథమునందు ఉపాసకుడు చిత్తమును నిలుపవలయును. ఈ విధముగా గ్రహించిన జ్ఞానికి ఈ భూమియందు విశిష్ట జీవనము కలుగును. అతడు ఉత్తమ లోకములను జయించును - అని **శాండిల్య మునికి ప్రజ్ఞుడయిన శౌనకుడయిన అతిధన్వుడు చెప్పెను గదా!** 272

**శ్లో॥ ప్రాణం భూతచయో యతః ప్రవిశతి ప్రాణాద్యదుద్గచ్ఛతి**
**ప్రాణోఽయం హి పరః పుమాననుగతః ప్రస్తావభక్తిం పరామ్ ।**
**ఊర్ధ్వం సన్తమముం యతోఽఖిలజనా గాయన్తి తీక్ష్ణప్రభం**
**యస్మాత్తద్ద్యుమణిస్స ఏష భగవానుద్గీథమన్వాగతః ॥ 273**

**శ్లో॥ అన్నం భూతచయో యతః ప్రతిహరన్ జీవత్యతోఽన్నం బుధై-**
**ర్విఖ్యాతం ప్రతిహారమాగతమిదం సద్దేవతేతి క్షితౌ ।**
**ప్రస్తావాదివిచిన్తయేదితి పుమాన్ ప్రాణాదిదృష్ట్యా తు య-**
**స్స ప్రాణాది సమాప్నుయాత్స్థిరమతిః కర్మర్ద్ధిమప్యాప్నుయాత్ ॥ 274**

భావ॥ భూత సమూహము ప్రాణములో ప్రవేశించినందు వలన, ప్రాణముల నుండి ఉత్పన్నమయినందువలన ఈ ప్రాణమే పరమ పురుషుడు. పరమ మయిన ప్రస్తావ భక్తి ననుసరించువాడు. ఊర్ధ్వమునందు తీవ్రకాంతితో వెలుగుచున్న యీ సూర్యుని అందఱు గానము చేస్తారు. కనుక ఈ ద్యుమణి అయిన యీ సూర్యభగవానుడు, ఉద్గీథమును అనుసరించును.

భూమియందు భూతములు అన్నమును తినుచు బ్రతుకుచున్నవి కనుక పండితులు అన్నమును "**ప్రతిహారము**" అందురు. దీనికి భూమియందు "**సద్దేవత**" అని ప్రసిద్ధి.

కనుక ప్రాణ సూర్య అన్నముల దృష్ట్యా ప్రస్తావ ఉద్గీథ ప్రతిహారములను చింతింప వలయును. అట్టివాడు ప్రాణాదులను పొందును. కర్మ సమృద్ధిని పొందును. 273-274

**శ్లో॥ హా ఉః క్ష్మా పవనస్తు హా ఇరథ ఇత్యబ్జస్స ఆత్మా త్విహ-**
**స్త్వీరగ్నిర్బహుభానురూర్నివహ ఏరౌహో ఇ విశ్వే సురాః ।**
**హిఙ్కారస్తు క ఏష వాగితి విరాట్ప్రాణః స్వరోఽన్నన్తు యా**
**హుఙ్కార స్త్వనిరుక్త ఇత్యుపభజేత్ స్తోభం స చాన్న్యన్నభుక్ ॥ 275**

భావ॥ ఇక **స్తోభముల** ఉపాసన చెప్పుచున్నాడు. **స్తోభము** యొక్క అనుకరణ శబ్దములు.

హాఉ = భూమి, హా ఇ = వాయువు, అధ = చంద్రుడు, ఇహా = ఆత్మ, ఈ = అగ్ని, ఊ = సూర్యుడు, ఏ = ఆహ్వానము, ఔహోఇ = విశ్వేదేవతలు, హిం = ప్రజాపతి, వాక్ = విరాట్, స్వరము = ప్రాణము, యా = అన్నము, హుం = అనిరుక్తము అనగా కారణరూపమయిన అవ్యక్తము.

ఇట్లు స్తోభమునుపాసింపవలయును. వాడు అన్నము గలవాడు, అన్నభోక్త అగును.

విశే॥ **స్తోభములు అనగా సరిగమల వంటివి.** గాన సిద్ధి కొఱకుపయోగింపబడు అర్థరహిత - అక్షరములు. "దదరిన" వంటివి - ఇవి సామగానంలోనివి. 275

**శ్లో॥ సర్వం యః ఖలు సాధు సామ భజతే స్యాత్సాధుధర్మాఞ్చితః**
**క్షోణ్యగ్న్యభ్రరవిద్యులోకకలయా హిఙ్కారమాచిన్తయేత్ ।**
**ప్రస్తావం చ యథాక్రమం కుశలధీరుద్గీథభక్తిస్తథా**
**నిత్యం చ ప్రతిహార మత్ర నిధనం తద్వ్యత్యయేనాపి వా ॥ 276**

భావ॥ ఇపుడు సామోపాసన చెప్పబడుచున్నది. సామమంతయు మంచిదని ఎవడు సేవించునో వాడు సాధు ధర్మములుగల వాడగును. నిపుణుడయిన సాధకుడు భూమి = హిం, అగ్ని - ప్రస్తావము, అంతరిక్షము = ఉద్గీథము, సూర్యుడు = ప్రతిహారము, ద్యులోకము = నిధనము అని ఉపాసన చేయవలయును. లేదా ఈ భక్తులను (భక్తి = సేవ) తలక్రిందులుగా భజన చేయవచ్చును. చూడండి. ద్యౌః = హిం, సూర్య = ప్రస్తావము, అంతరిక్షము = ఉద్గీథము, అగ్ని = ప్రతిహారము, పృథివి = నిధనము 276

**శ్లో॥ ఊర్ధ్వాధస్థితసర్వలోకవిషయాన్ భోగానయం ప్రాప్నుయా-**
**త్ప్రాగ్వాతామ్బుదవృష్టివైద్యుతరవామ్భోనిగ్రహాణాం ధియా ।**
**హిఙ్కారాదివిచిన్తకస్య జలదః కామేన వర్షత్యథో**
**వార్భృద్వర్షనదీనదాబ్ధికలయా ధ్యాతుర్న తోయే మృతిః ॥ 277**

భావ॥ ఇట్లు ఉపాసన చేసినవాడు ఊర్ధ్వాధోలోకములందున్న సర్వ విషయములను భోగించును. ఇక హింకారాది సామ పంచకమునుపాసించువాడు క్రిందిఫలములను అనుభవించును.

హింకారము = ప్రాగ్వాతము, ప్రస్తావము = మేఘము, ఉద్గీథము = వృష్టి, ప్రతిహారము = ఉఋము, నిధనము = జలనిగ్రహము. వీనికి స్వేచ్ఛావృష్టి ఫలము. వాడు కోరినపుడు వర్షము. మరో ఉపాసన. మేఘము = హింకారము, వర్షము = ప్రస్తావము, నదీ (గంగాదులు) = ఉద్గీథము, నదము (సింధువు మొదలగునవి) ప్రతిహారము, సముద్రము = నిధనము. ఈ ఉపాసన చేయువారికి జలమరణం లేదు. 277

**శ్లో॥ యః పఞ్చర్తుషు సామ పఞ్చవిధమాధ్యాయేత్సభోగ్యర్తుతాం**
**యాయాద్యోజమలిఞ్చ గాం హయమథో మర్త్యఞ్చ సామాత్మకమ్ ।**
**నిధ్యాయేత్పశుమాన్ భవేత్స పురుషో యః ప్రాణవాగ్లోచన-**
**శ్రోత్రాన్తఃకరణాని చిన్తయతి వా సోఽయేత్పరం జీవనమ్ ॥ 278**

భావ॥ సామమును పంచ విధోపాసన చేయుటలో లాభమును చెప్పుచున్నాడు. వసంతం = హిం, గ్రీష్మం = ప్రస్తావం, వర్షఋతువు = ఉద్గీథం, శరత్తు = ప్రతిహారము. హేమంత శిశిరములు = నిధనము – వీనికి సర్వర్తు భోగము. 278

విశే॥ అజము – హిం, మేషము – ప్రస్తావము, గోవు – ఉద్గీథము, అశ్వము – ప్రతిహారము, మనుష్యుడు – నిధనము – ఇతనికి పశు సంపద.

ప్రాణము – హిం, వాక్కు – ప్రస్తావము, నేత్రము – ఉద్గీథము, కర్ణము – ప్రతిహారము, చిత్తము – నిధనము వీనికి ఉత్తమ జీవితము. ఇట్లు ధ్యానము చేసిన వారికి ఇట్టి ఫలములు వచ్చును.

**శ్లో॥ ఏతాః పఞ్చ తథోముపద్రవయుగం స్యుర్భక్తయస్సప్తతా**
**ఏతత్సప్తవిధఞ్చ సామ కలయేద్వాచ్యుష్ణభానౌ పుమాన్ ।**
**వాగ్దోహాదికమేష యాస్యతి ఫలం యస్సామ సర్వత్ర చ**
**ప్రోతం వేద స సర్వతామపి తథా సర్వజ్ఞతాం ప్రాప్నుయాత్ ॥ 279**

భావ॥ పైన చెప్పిన పంచ సామోపాసనము, ఓం, ఉపద్రవము – మొత్తం 7 సామోపాసనలు. ఇవి సప్తభక్తులు. ఈ సప్త విధసామములను వాక్కునందు సూర్యునియందు, ఉపాసన చేసినచో ఆ పురుషుడు వాగ్దోహము, అన్నము, అన్న భోగ సామర్థ్యము గలవాడగును.

ఎవడయితే సామము సర్వత్ర వ్యాపించినట్లు కనుగొనునో అతడు సర్వ స్వరూపుడు సర్వజ్ఞుడు అగును. 279

విశే॥ దీనివలన వచ్చే సర్వజ్ఞత్వం పూర్ణం కాదు. గౌణము. బ్రహ్మజ్ఞానిమాత్రమే సర్వజ్ఞుడు కాగలడు. సర్వం అంటే బ్రహ్మము గదా! (**ఉపద్రవం అనగా అస్తమయాత్ ముందు సూర్యుని రూపము.** దానిని చూచి జంతువులు తమతమ నెలవులకు పరుగెత్తును గనుక అది ఉపద్రవము)

**శ్లో॥ లోమత్వక్పలలాస్థిమజ్జ మితి సామాఙ్గేషు పఞ్చాత్మకం**
**వహ్నిస్పర్శనభానుభేన్దవ ఇతి ప్రోతన్తు తద్దైవతే ।**
**వేదానాం త్రితయం జగత్త్రయ మిదం వహ్న్యర్కవాయుత్రయం**
**నక్షత్రత్రితయం పితృత్రయ మితి ప్రోతస్తు సామాఖిలే ॥ 280**

భావ॥ సర్వత్ర ప్రోతం (వ్యాప్తం) అయిన ఆ సామ స్వరూపం ఇది. సామం శరీరావయవములందున్నది. “అవయవము - సామాక్షరము - దేవత” ఇది వరస.

1) రోమములు = హింకారము = అగ్ని

2)చర్మము - ప్రస్తావము = వాయువు

3) మాంసము - ఉద్గీథము = సూర్యుడు

4) అస్థి - ప్రతిహారము = నక్షత్రములు

5) మజ్జ - నిధనము = ఇందువు.

వేదత్రయము, లోకత్రయము, అగ్ని సూర్య వాయుత్రయం, నక్షత్ర/నక్షత్రములు, వయాంసి(పక్షులు), మరీచులు) త్రయము, పితృత్రయము (సర్ప గంధర్వ పితరులు) అన్నింటియందు సామం ప్రోతమయినది. ఇందులో వేదత్రయం హింకారము, లోకత్రయం ప్రస్తావము, వహ్ని త్రయం ఉద్గీథము, నక్షత్రత్రయము - ప్రతిహారము, పితృత్రయం నిధనము అని వివేకము. 280

**శ్లో॥ యజ్ఞాదిశ్చ తపశ్చ దేశికకులావాసస్తథేతి త్రయో**
**ధర్మాః పుణ్యఫలప్రదా గృహివనస్థబ్రహ్మచర్యాశ్రయాః ।**
**ధర్మాధర్మవిలక్షణా తు పరమబ్రహ్మాత్మనిష్ఠా పరా**
**పుణ్యాపుణ్యవిలక్షణాఽమృతదదా సన్న్యాసిలోకాశ్రయా ॥ 281**

భావ॥ సామావయవమయిన ఉద్గీథము మొదలగు లక్షణములుగల ఓంకారోపాసన చెప్పబడినది. ఇపుడు **సాక్షాత్తుగా ఓంకారోపాసనను విధించుచు అందు సన్న్యాసికే అధికారమని, గృహస్థాదులకు కాదని చెప్పుచున్నాడు.**

ఆశ్రమములు నాలుగు. వారికర్తవ్యములు నాలుగు.

గృహస్థు - యజ్ఞాదులు, అధ్యయనదానములు యాచన, మొదలగునవి.

వానప్రస్థుడు - తపస్సు, చాంద్రాయణం మొదలగునవి.

బ్రహ్మచారి - గురుశుశ్రూష, వేదాధ్యయనము

సన్న్యాసి - ఓంకారోపాసన

పుణ్య హేతువులయినధర్మములు. పాప హేతువయినవి అధర్మములు.

కాని పరబ్రహ్మాత్మనిష్ఠ అనేది ధర్మము కాదు. అధర్మమూ కాదు. అది అతీతమయినది. పుణ్యమూ కాదు. అపుణ్యమూ కాదు. విలక్షణమయిన అమృతస్థితిని ఇచ్చునది. అది సన్న్యాసులకు విధింపబడిన స్థితి. 281

విశే॥ 1. ధర్మం శాస్త్రవిహితం

"వసంతే వసంతే జ్యోతిషాయజేత" – ఇది పరమేశ్వరానుగ్రహంతో లోకం కోసం వచ్చినది.

అధర్మం శాస్త్రనిషిద్ధం "న పరదారాన్ గచ్ఛేత్, నసురాంపిబేత్"

ఇలా నిషేధించకపోతే అది కర్తవ్యమన్న భ్రమ కలుగుతుంది. తెలియక చేసినా నరకం పతనం వస్తాయి. కనుక వర్ణాశ్రమోచిత ధర్మములను ఆచరించిన వారు, నిషిద్ధములను ఆచరించనివారై స్వర్గము పొందెదరు. ఇందుకు విరుద్ధముగా స్వధర్మము మానటం, పరధర్మమును ఆచరించటం వలన నరక పతనాలు తప్పవు. "శ్రుతి స్మృతీ మమైవాజ్ఞే యాస్తే ఉల్లంఘ్య వర్తతే అజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ సవధ్యోనాత్ర సంశయః" వధ్యః = నరకయాతనలతో హింసింపదగిన వాడని అర్థము. కనుక ఎవరి వర్ణ, ఆశ్రమ ధర్మములను వారు ఆచరించి తీరవలయును.

2. సన్న్యాసం గూడ ఒక ఆశ్రమం దానికి విహిత కర్మ ఉన్నది. అదే బ్రహ్మాత్మ నిష్ఠ. వారికి ఇతర వర్ణాశ్రమ విహితమయిన ధర్మములు అవసరము లేదు. **అధర్మములు మాత్రము – హింసా అసత్యం చౌర్యం మొదలగునవి అందరికీ నిషిద్ధములు. వీరికిన్నీ నిషిద్ధమే.**

3. కనుక సాధ్యములయిన స్వర్గాదులను, సాధనములయిన యజ్ఞాదులను, వానికి సంబంధించిన ఏషణ (కామము)ను వదలవలయును. అలాగే దారేషణ, పుత్రేషణ, ధనేషణలను – (ఈషణాత్రయం) విడువవలయును. అగ్నిహోత్రాది నిత్య కర్మలను విడువ వలెను. ఇవన్నియు విడిచి పరమహంసపరివ్రాజకుడయి ఉన్నవానికి బ్రహ్మనిష్ఠ అను జ్ఞానమే మార్గము. కర్మ మార్గము కాదు. అవి ఇతరులకు మాత్రమే.

"జ్ఞాన యోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్ " సాంఖ్యులు – జ్ఞానులు – సంఖ్య = జ్ఞానము. యోగులు కర్మఠులు = యోగం మార్గం.

4. ఆశ్రమమును బట్టి కర్తవ్యములు వేరు కనుక ఇతర కర్తవ్యములు చేయకపోవుట తదితరులకు దోషం కాదు. రాచవంటవాడు వంట చేయాలి. కోశాధికారి వంట చేయకపోవటం తప్పుకాదు. కనుక సన్న్యాసి యజ్ఞయాగాదులు చేయకపోవటం తప్పుకాదు. చేస్తేనే తప్పు. అదే గృహస్థునికి తప్పు. కాని సన్న్యాసి స్వధర్మమయిన జ్ఞానవృద్ధి మార్గమయిన ఓంకారచింతనను

మానినచో తప్పు. దండన ఉంటుంది. సంసార కూపంలో పతనం చెందును. "వీరహా వా ఏష దేవానాం యోగ్నీను ద్వాసయతే" అను శ్రుతి అగ్నిహోత్రం మానిన గృహస్థులను నిందిస్తున్నది. సన్న్యాసులను కాదు.

5. సన్న్యాసం అప్రామాణికం కాదు. "బ్రహ్మసంస్థః అమృతత్వ మేతి" అని శ్రుతి చెప్పింది. గృహస్థులకు అంతటి బ్రహ్మనిష్ఠత సాధ్యం కాదు. ఎందుకంటే కర్మ బ్రహ్మ నిష్ఠలు సమానంగా కల్సియుండవు. ఏకపురుషునియందు అవి ఉండవు. ఎందుకంటే జ్ఞానలో కర్తృత్వం భోక్తృత్వం ఉండవు. సంగం ఉండదు. "సచ్చిదానంద రూపమయిన అద్వితీయ బ్రహ్మమును నేను" అని చింతించటమో, ఆ నిర్వికల్పసమాధి పొందటమో ఉంటుంది.

"కర్మ నిష్ఠలో నేను కర్తను, నాకు ఈ ఫలంకావాలి. నేను బ్రాహ్మణుడను" అని దేహాభిమాన మిథ్యా జ్ఞానములుంటాయి. కనుక ఈ రెండు చీకటి వెలుగుల వలె పరస్పర విరుద్ధములు.

6. సన్న్యాసం ఇతర శ్రుతులలోనూ విధింపబడినది.

"యదహరేవ విరజేత్ తదహ రేవ ప్రవ్రజేత్"

"బ్రాహ్మణో నిర్వేద మాయాత్"

"నిస్తుతిః నిర్నమస్కారః" - స్మృతి.

"తస్మాత్కర్మ న కుర్వంతి యతయః పారదర్శినః" - పురాణం.

7. బ్రహ్మసంస్థః - అన్నచోట బ్రహ్మ అంటే వేదం అని అర్థమయితే వేద విహిత కర్మ నిష్ఠ గల వానికే అమృతత్వం అని చెప్పవచ్చును. కాని అట్టి కర్మలవలన అమృతత్వం రాదు. ఎందుకంటే

ఎ) దేవతలు వేదోక్త కర్మలలో మృత్యువును గమనించి ఓంకారమును ప్రవేశించిరని ఇందే చెప్పబడినది.

బి) న కర్మణా న ప్రజయా ధనేన

సి) యధేహ కర్మచితో లోకః క్షీయతే

డి) నాస్త్యకృతః కృతేన

ఇ) నాన్యః పంథా అయనాయ విద్యతే

ఇలా కర్మలవలన మోక్షమురాదని యీ శ్రుతులు చెప్తున్నాయి.

8. జ్ఞానం వలన మోక్షము వస్తుందని అనేక శ్రుతులు చెప్తున్నాయి.

ఎ) తరతి శోక మాత్మవిత్

బి) బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి

సి) తమేవం విదిత్వాఽతిమృత్యుమేతి

9. యుక్తి గూడా ఇందుకు అనుకూలమే

ఎ) మోక్షం అనిత్యమయిన కర్మలకు కార్యంగా ఫలంగా వస్తే అది అనిత్యం అవుతుంది – కాని మోక్షం నిత్యమని సిద్ధాంతం.

బి) అలాగే మోక్షం జ్ఞాన కార్యమయినా అనిత్యం అవుతుంది. అందువలన అది జ్ఞాన కార్యం కాదు. అది సిద్ధము. సాధ్యము కాదు. అది కంఠచామీకరము వలె, తన యింట్లోనే అజ్ఞాతంగా ఉన్న నిధి అకస్మాత్తుగా తెలిసినట్లు – అది జ్ఞానం వలన దొరకుతుంది. తయారుకాదు. కనుక జ్ఞానం వలన మోక్షము. జ్ఞానమనగా ప్రత్యగాత్మయే అయిన బ్రహ్మయొక్క సాక్షాత్కారము. ఇది అభేద సాక్షాత్కారము. భేద సాక్షాత్కారమయితే భయహేతువే గాని మోక్షహేతువుకాదు. మోక్షం అనగా అభయం.

"అభయం వై జనక! ప్రాప్తోసి"

10. ఆత్మసాక్షాత్కారం నిరంతరం బ్రహ్మచింతన వలన జరుగుతుంది. అదే "బ్రహ్మ సంస్థ" అంటే. ఇది గృహస్థుకు సంసార బాధలు, కర్తవ్యాల మధ్య కుదరదు. కనుక ఇది సన్న్యాసి కర్తవ్యము. కనుకనే "ఆసుప్తే రామృతేః కాలం నయేద్వేదాంతచింతయా"

"తచ్చింతనం తత్కథనం అన్యోన్యం తత్ప్రబోధనమ్"

"ఏతదేక పరత్వం చ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః" కనుకనే "నిదిధ్యాసితవ్యః" అని సన్న్యాసికే విధి.

11. "అహం బ్రహ్మాస్మి" అని దృఢమయిన జ్ఞానం ఏర్పడిన తరువాత ఆత్మనిష్ఠ, బ్రహ్మనిష్ఠ ఎందుకు? – సమా – అవిద్య అత్యంత బలమయినది. అనాది. భ్రాంతి జనని. దాని ప్రభావం ముందర అపుడే పుట్టిన బ్రహ్మాత్మ జ్ఞానం నిలువ లేదు. **పెద్ద పిశాచి ముందు నవజాత శిశువు బ్రతుకునా?** నిష్ఠ ఉన్నచో ఆ జ్ఞానం స్థిరమయి అవిద్యను తట్టుకొనును. కనుక అలా స్థిరమగుదాక బ్రహ్మనిష్ఠ అవసరం. జ్ఞానం స్థిరమయితే ఇక కర్తవ్యం లేదు. "అసుప్తేః–' అను వాక్యము స్థిరత్వం కోసమే. అది పరోక్ష బ్రహ్మవేత్త కొఱకు చెప్పబడినది.

12. అపరోక్షబ్రహ్మజ్ఞానం పొందిన జ్ఞాని అయినా నిరంతరము ఆత్మ సంస్థితుడయి యుండాలా? అయితే అతనికి నిత్యం నిర్వికల్ప సమాధి తప్పదా? – సమా –

ఆత్మ సంస్థ అంటే ఏమిటి? – ఆత్మయందు ఉండటము. ఆత్మ తనేనా భిన్నమా? మొదటి పక్షమయినచో అతను ఆత్మయందున్నట్లే. "స్వేమహిమ్ని ప్రతిష్ఠితః" – కదా! కనుక క్రొత్తగా ఉండవలసిన పనిలేదు. అవిద్య తొలగితే అదే బయటకు తేలుతుంది.

రెండవపక్షమయినచో, వాడు ఆత్మవేత్తయే కాదు. బ్రహ్మవేత్త కాడు – ఆత్మయే బ్రహ్మము కదా! ఆత్మ కన్న అన్యమయినదంతా అనాత్మయే కదా! అది ఆత్మ అనుకొంటే అది భ్రాంతియే.

కనుక చిత్త దర్పం పోనివాడు ఇంకా కొంత అనాత్మ తాదాత్మ్యంతో ఉన్నవాడు నిదిధ్యాసనం చేయాలి. బ్రహ్మవేత్త కాదు. కనుక నిష్కాముడే బ్రహ్మవేత్త. సమాధికాముడు బ్రహ్మవేత్త కాడు.

13. అయితే ఆత్మకాముడయినా నిష్కాముడెలా అవుతాడు? – సమా – ఆత్మయందు బ్రహ్మవేత్తకు కామం ఉన్నదంటే, ఆ విషయం విచారణ చేద్దాం. ఆత్మవేత్తకు, లభించని ఆత్మయందు కామమా? లభించిన ఆత్మయందు కామమా? మొదటిపక్షం కుదరదు – బ్రహ్మవేత్తయే ఆత్మకదా? రెండవదీ కాదు. లభించిన దానిని కోరవలసిన పనిలేదు. తనకు లేని స్వర్గాదికమును ఎవరయినా కోరుతారుగాని తన ఇంట్లో ఉన్న భార్యనే ఎవరయినా కోరి తపస్సు చేస్తారా? కనుక పరోక్ష బ్రహ్మవేత్తకే ఆత్మ కామము.

14. బ్రహ్మవేత్తకయినా ఆత్మరతి అత్యవసరము. కదా! – సమా – ఈ ఆత్మ ఇంతకు ముందు ఆత్మరతియా? కాదా! ఆత్మరతియే అంటే 'రమేత' అన్న విధి వ్యర్థము. ఇంతకుముందు ఆత్మరతి లేదంటే ఈ ఆత్మరతి సాధ్యము కనుక మిథ్య అనిత్యం అవుతుంది. ఆత్మరతి అనేది ఉండటం లేకపోవటం అనేవి వికారములవుతాయి. ఆత్మ సవికారం అవుతుంది. ఘటం లాగా అనిత్యం అవుతుంది.

15. కనుక మందుడయిన బ్రహ్మవేత్తకే ఆత్మకామ, ఆత్మరతి మొదలగు విశేషణములు. ముఖ్య బ్రహ్మవేత్తకు కాదు. మందుడయిన బ్రహ్మవేత్త అయినా బ్రహ్మసంస్థుడయి బ్రహ్మసాక్షాత్కారమును, అమృతత్వమును పొందును.

కనుక బ్రహ్మనిష్ఠ మోక్షమునకు కారణము. నిష్ఠకు శ్రవణాదులు కారణం. బ్రహ్మం గూర్చి పరోక్షజ్ఞానము లేనిదే నిష్ఠ ఎట్లు కలుగును? ఈ శ్రవణమునకు (వివిదిషా) సన్న్యాసియే అధికారి. "శాంతో దాంత ఉపరతః – ' కదా! 'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' అన్న సూత్రం గూడా శమదమాదులు వైరాగ్యంగల ముముక్షు సన్న్యాసి కొఱకే గదా! అందువలన బ్రహ్మసంస్థుడు సన్న్యాసియే. బ్రహ్మనిష్ఠ సన్న్యాసిదే.

**శ్లో॥ తప్త్వా భూరితపః ప్రజాపతిరగాల్లోకేషు సారం త్రయీం**
**తస్యాం భూశ్చ భువస్సువశ్చ పునరోఙ్కారశ్చ తేషు స్వయమ్ ।**
**ఓఙ్కారేణ గిరోఽఖిలాః పరిగతాః పర్ణాని వా శఙ్కునా**
**సర్వం చోమితి చాక్షరం యత ఇదం నామ ప్రతీకం విభోః ॥ 282**

భావ॥ ప్రజాపతి చాల తపస్సు (ఆలోచన) చేసి లోకములందు వేదత్రయమును సారముగా కనుగొనెను. దానియందున్ను 'భూః భువః సువః' అను వ్యాహృతులను సారముగా కనుగొనెను.

వానికి ఓంకారమును సారముగా కనుగొనెను. ఈ ఓంకారము ఈనె ఆకులలో వ్యాపించినట్లు అన్ని వాక్కులయందు వ్యాపించెను. ఈ సర్వం ఓమను అక్షరమే. ఎందుకంటే సర్వం బ్రహ్మ కదా! ఆ బ్రహ్మమునకు ఈ ఓంకారము ప్రతీకమయిన నామము కదా! (వట్టి పేరు గాదు. ప్రతీక అయిన నామము).

వాఙ్మనస్సులకు ఏ మాత్రమూ అందని ఆ బ్రహ్మమును ఈ ఓంకారము ద్వారా ధ్యానింపవలయును. కనుక వ్యాపక పరబ్రహ్మకు ప్రతీకమయిన ఓంకారమును సన్యాసి ఉపాసింప వలయును. 282

**శ్లో॥ అభ్రాపూపపదే ద్యువంశకలితే రశ్మ్యమ్బుపుత్రాతతే**
**సూర్యాత్మా మకరన్ద ఏష బహుధా దేవోపభోగ్యః స్థితః ।**
**ఋగ్వేదోదితకర్మసమ్భవయశ స్తేజోఽన్న వీర్యేన్ద్రియం**
**సూర్యస్థం మధురోహితం వసుగణో భుక్త్వా పరం తృప్యతి ॥ 283**

భావ॥ **మధువిద్య చెప్పబడుచున్నది.** ఇది కర్మయోగులకు ఉపాసింపదగిన విద్య. ద్యులోకము అడ్డముగా వ్యాపించిన వెదురు కఱ్ఱ. దానియందు సూర్యకిరణాలు ఆకర్షించిన జలపరమాణువులే తుమ్మెద కూనలు. అంతరిక్షమే తేనెపట్టు. అప్పచ్చి (రొట్టె) వంటిది. దానియందు సూర్యబింబము మకరందవలయము. దీనిని వసురుద్రాది దేవతలు భోగించెదరు. అమకరందములో అనగా సూర్యునిలో నున్న లోహితరూపము ఒక మధువు. ఈ రూపము ఉదయ కాలమున ఏర్పడు అరుణ వర్ణము. అది ఋక్కులను భ్రమరముల వలన ఏర్పడిన కర్మ పుష్పముల యందున్న సోమ, ఆజ్య, క్షీర రూపములయిన ద్రవములే తేనెలు. మధువు. ఈ తేనెలే కీర్తి, తేజస్సు, అన్నము, వీర్యము, ఇంద్రియములు. దీనిని దేవతలలో వసువులు అనుభవించి తృప్తి చెందెదరు. అనుభవించటమనగా సర్వేంద్రియములద్వారా పొందుట.

విశే॥ 1. తేనెటీగలు పుష్పరసములను తెచ్చి తేనెను చేసినట్లు ఋక్కులు కర్మలనుండి హుతద్రవ్యరూపములయిన సోమాది ద్రవముల ద్వారా కీర్తి మొదలగు తేనెలను తయారు చేయును.

2. ఋగ్వేద కర్మలకు నరులు యజమానులు కదా! కీర్తి మొదలయిన ఫలితాలు అతనికి చెందాలి. అవి అంతరిక్షగతం కావటం ఎలా? అంతరిక్షం కాదు సూర్యునియందున్నాయంటారా? – అలా అయినా ఎలా? పురుషగతంగా గదా! ఉండాలి. సమా – సూర్యుడే కీర్తి మొదలగు కర్మ ఫలదాత. మన సంచిత కర్మల ఫలాలు ఆదిత్యునియందు చేరి నిలవ యుండును. ఆయన కర్మఫలస్వరూపుడు. మన కర్మల ఫలాలు అచ్చట ఉంటాయి. అవే మధు.

3. మనం అనుభవించవలసిన మనకర్మఫలములను వసువులు ఆస్వాదించటం ఎలా కుదురుతుంది? సమా – వసువులుపయోగించు లోహితరూపమునందు యశ ఆది ఫలమని

ఆరోపణ చేయబడినది. ఉదయగిరి ప్రాంత సంచరణం వలన సూర్యునియందు కనబడు అరుణ వర్ణమును మన కర్మఫలముగా భావింపవలయును.

4. సూర్యుడు మధువా? ఆయనలోని అరుణవర్ణము మధువా? - సమా - అందలి లోహిత వర్ణమే మధువు. **అయితే ద్రవ్యగుణములను భిన్నంగాను అభేదంగానూ చెప్పటం ఆనవాయితీ.** నీలమయిన ఘటము అనవచ్చు. మరొక సందర్భములో ఘటనీలము అనవచ్చును. కనుక సూర్యుని లోహితరూపము మధువు కనుక సూర్యునిగూడా మధువు అనవచ్చు. లోహిత రూపంగల ద్రవ్యం సూర్యుడే కదా! 283

**శ్లో॥ సూర్యస్థాయి యజుర్ద్విరేఫకలితం తద్వేదపుష్పోదితం**
**వీర్యాన్నాదిమయం స్వయం సితగుణం రుద్రా భజన్తే మధు ।**
**సామాఖ్యభ్రమరైః కృతం తదుదితక్రత్వాదిపుష్పోద్గతం**
**వీర్యాద్యం మధునీలరూపమదితేః పుత్రాఽభజన్తేఽ ర్కగమ్ ॥ 284**

భావ॥ పైన చెప్పిన విధముగా, సూర్యుని యందున్న యజుర్వేద మంత్రములనబడు భ్రమరములు, ఆవేదపుష్పములనుండి పుట్టిన కర్మ ఫలములయిన వీర్యాన్నాదికము సూర్యధవళ కాంతిరూపమయినది. అట్టి శ్వేత మధువును రుద్రులు ఆస్వాదించెదరు.

అట్లే సామవేదమంత్రములను తుమ్మెదలు సామ వేదోక్తమయిన క్రతువులు మొదలగు కర్మల ఫలమైన వీర్యాన్నాదికమయిన (కర్మఫల) మధువు నీలరూపమయినది. దానిని అదితి పుత్రులు ఆస్వాదించెదరు. 284

**శ్లో॥ సూర్యస్థం పరకృష్ణరూపమధు చాథర్వాఙ్గిరో మక్షికా-**
**సన్తానై రితిహాసపుష్పనిచయాత్సమ్పాదితం భుఞ్జతే ।**
**దేవాస్తే మరుతోఽన్నముఖ్యమథ చోఙ్కారాత్ప్రసూనాత్పరా**
**దేశైః కీటగణైరితం చ తరణేర్మధ్యే చలద్వా మధు ॥ 285**

**శ్లో॥ తేజోఽన్నేన్ద్రియవీర్యమేతదుపజీవ్యా యాన్తి సాధ్యా ముదం**
**యో వేద ప్రథమామృతం స హి వసుస్స్యాద్యో ద్వితీయన్తు సః ।**
**రుద్రో యస్తు తృతీయమేష హి భవేదాదిత్య ఏవాస్య య-**
**స్తుర్యం వేద మరుత్సపఞ్చమమిదం యో వేద సాధ్యస్స తు ॥ 286**

భావ॥ అధర్వుడు అంగిరసుడు అను తేనెటీగలు పురాణోక్తమయిన కర్మరూపమయిన పుష్పములనుండి సంపాదించి సూర్యునియందు నిలిపిన అతి కృష్ణ వర్ణమయిన మధువును మరుత్తులు భుజించెదరు. ఈ మధువు అన్నాది స్వరూపమయినది. ఇక

ఓంకార పుష్పమునుండి గోప్యములయిన ఆదేశములనబడు తేనెటీగలు సృష్టించిన తేజః అన్న ఇంద్రియ, వీర్య రూపమయిన మధువు సూర్యునియందు చలించుచున్నట్లు మనకు కబడుతుంది. దీనిని 'సాధ్యులు' ఆస్వాదించెదరు.

ఇందులో లోహిత రూపామృతమును తెలిసికొన్నవాడు వసువు. శ్వేత మధువును తెలిసికొన్నవాడు రుద్రుడు, నీల మధువును తెలిసినవాడు అదిత్యదేవుడు. కృష్ణమధువును ఎఱిగిన వాడు మరుత్తు ఓంకారమధువును గుర్తించినవాడు సాధ్యుడు అగును. 285-286

**శ్లో॥ అస్తం చాప్యుదయం వ్రజన్ ప్రతిదినం సూర్యోఽయమాయుఃక్షయం**
**త్రైలోక్యస్య తనోతి సత్యభువనం త్వేకం విసూర్యోదయమ్ ।**
**దృష్ట్యా బ్రహ్మవిదో న భానురుదయం నైవాస్తమేతి స్వభ-**
**స్త్వైతస్యాస్తి సదాప్యహర్న తు కదా రాత్రిర్యతో బ్రహ్మ సః ॥ 287**

భావ॥ సూర్యుడు కర్మఫలప్రదుడు. వసువు మొదలగు దేవతలకు భోగ్యుడు. అతడు లోకత్రయమునకు ఆయుఃక్షయములకు కారకుడు.

ఈ సూర్యుడు ప్రతిదినము ఉదయాస్తమయములను పొందుచు కాల విభాగం ద్వారా మర్త్యులకు ఆయుః క్షయము చేయుచున్నాడు. కాని సత్యలోకమునందు సూర్యుడు ఆయన ఉదయాస్తమయములుండవు. కనుక బ్రహ్మలోకమునందు సూర్యోదయాస్తమయ కారణంగా వచ్చే ఆయుః క్షయములుండవు. అంతేకాదు మానవలోకమునందయినా బ్రహ్మవేత్తలకు అట్టి ఆయుః క్షయములుండవు. బ్రహ్మవేత్త దృష్ట్యా సూర్యునకు ఉదయాస్తమయములుండవు. జ్ఞానమే ఆయన సూర్యుడు. చిత్సూర్యుడు. స్వయంప్రకాశజ్ఞానమూర్తి అయిన ఆ బ్రహ్మవేత్తకు నిత్యము పగలే. జ్ఞానరూపమయిన వెలుగు అతడే. చీకటి రాత్రి ఉండవు. అతడే బ్రహ్మము కదా! ప్రజ్ఞానం బ్రహ్మ! కదా! 287

విశే॥ 1. బ్రహ్మ స్వయంజ్యోతి. అది నిత్యం సత్యం. బ్రహ్మవేత్త బ్రహ్మమే. "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి". కనుక అతనికెపుడూ పగలే వెలుగే. చూడండి. **"హృదాకాశే చిదాదిత్యః సదాభాసతి భాసతి, నోదేతి నాస్తమేత్యేవ కథం సంధ్యాముపాస్మహే"** కనుక బ్రహ్మవేత్తలకు వెలుగయిన "చిత్సూర్యుడు" పుట్టడు గిట్టడు.

2. బ్రహ్మవేత్తకు శరీరపరంగా ప్రసిద్ధసూర్యోదయాలు, ఆయుఃక్షయమూ ఉంటాయి. విదేహముక్తి ఉన్నది గదా! కాని అతడు దేహాభిమాన రహితుడు. బ్రహ్మాత్మైక్యానందానుభవశాలి. కనుక బ్రహ్మంగా ఆయన నిత్యుడు. కావున ఆయుః క్షయము లేదు.

3. అలాగే అతనికి రాత్రీ లేదు. అదీ మిథ్యయే. ద్వైతము గదా! అహస్సు మాత్రం ఎలా ఉన్నది. అదీ మిథ్యే గదా! అంటారా? - సమా - అహోరాత్రాలు కాలస్వరూపాలయితే అవి

శరీరానికి ఉంటాయి. కాని అహః – ప్రకాశం వెలుగు జ్ఞానం. కనుక జ్ఞాని నిత్యజ్ఞాన స్వరూపుడు. కనుక అతనికి పగలే ఉన్నదనవచ్చును. రాత్రి అనగా అప్రకాశము అజ్ఞానము అది లేదు.

4. మఱయితే బ్రహ్మం ఎందుకు తెలియదు. దానికి అజ్ఞానం ఆవరణం అన్నారు. లేదంటే అందరికి తెలియాలి. కాదంటే బ్రహ్మం నిత్య ప్రకాశం కాదనాలి. మనకు చాలామందికి బ్రహ్మం తెలియదన్న అనుభవం ఉన్నది గదా! సమా – **బ్రహ్మమునకు ఆవరణం లేదు.** ఆవరణం ఉంటే దానివలన ఇతర భాసనం గూడా జరుగదు. దీపాన్ని మూస్తే అదీ కనబడదు. దానివలన ప్రక్కనున్నవీ కనబడవు. కాని **సర్వం బ్రహ్మప్రకాశితం** అని శ్రుతి.

"తమేవ భాంతమనుభాతి సర్వం" ఇక **మనకు తెలియక పోవటం మన అజ్ఞానమే. అజ్ఞానులకు ఆవృతమయినట్లు అనిపిస్తుంది. గ్రుడ్లగూబలకు సూర్యుడు కనబడదు.**

5. జ్ఞానులకు బ్రహ్మం ఆత్మరూపంగా సర్వధా కనబడుతూనే ఉంటుంది. ఆత్మ ఆవృతమయితే ప్రపంచమే అంధకారం అవుతుంది. అయితే ఈ ఆత్మ బ్రహ్మ కాదన్న భావనలో అజ్ఞానులుగా మనం ఉన్నందువలన 'నేను' అనుకొంటూగూడా బ్రహ్మ ప్రకాశమును గుర్తించలేము.

6. కనుక బ్రహ్మవేత్తల దృష్ట్యా చిత్సూర్యుడు నిత్యం ఆత్మరూపంగా కనబడతాడు. కనుక అతనికి ఎపుడూ పగలే. ఆత్మరూప జ్ఞాన భాస్కరునకు ఉదయాస్తమయములు లేవు గదా! ప్రసిద్ధ సూర్యుడు మిథ్యకదా! కనుక బ్రహ్మవేత్తకు ఆయుః క్షయము లేదు. కనుక శాశ్వతము స్వయం ప్రకాశము అయిన బ్రహ్మమే బ్రహ్మవేత్త.

**శ్లో॥ గాయత్రీ సకలం జగద్భవతి సా వాగేవ యస్మాదిదం**
**సర్వం గాయతి రక్షతి క్షితిరియం సాఽస్యాం సమస్తం స్థితమ్ ।**
**గాయత్రీతనురేవ యత్ర త ఇమే ప్రాణాః సమస్తాః స్థితా**
**గాయత్రీహృదయం యదత్ర త ఇమే ప్రాణాః స్థితాః పఞ్చ చ ॥288**

భావ॥ గాయత్రియే యీ సకల ప్రపంచము. గాయత్రి వాక్కే. ఈ వాక్కే యీ సకలజగత్తును శబ్దరాశితో చెప్తుంది గదా! వాక్కు గాయత్రి కనుక ప్రపంచం వాచ్యం కనుక ప్రపంచం గాయత్రియే. (వాచ్య వాచక సంబంధం వలన అభేదం) వాక్కే యీ ప్రపంచమును చెప్పును. రక్షించును. అభయవచనాలు కలవు గదా? భూమిగూడా గాయత్రియే. ఎందుకంటే గాయత్రీరూపమయిన యీ సమస్తము దాని యందున్నది కదా! వాచ్యత్వం వలన రక్షణ వలన గాయత్రికి, ఆధారత్వం వలన భూమికి భూతముతో సంబంధము. అందువలన గాయత్రి భూమి ఒక్కటే. ఈ శరీరము గాయత్రియే. ఈ ప్రాణములన్నియు శరీరమునందే ఉన్నవి కదా! అనగా సర్వభూతములకు ఆధారమయినందువలన పృథివి గాయత్రి అయినది. సర్వభూతశబ్దవాచ్యములయిన

ప్రాణములకాధారము కనుక శరీరములున్నూ గాయత్రియే. (భూత= జీవులు, ప్రాణాలు) హృదయమున్నూ గాయత్రియే. పుండరీకాకారమయిన హృదయమునందు పంచప్రాణములు ఉన్నాయి కదా! భూతములు = ప్రాణములు.

"ప్రాణోహి పితా ప్రాణోమాతా" అని శ్రుతి. కనుక భూత సంబంధం ఉండటం వలన హృదయము గాయత్రి. 288

విశే॥ 1. సవిత ఉపాసన అయినది. సవితలోని గాయత్రి – ఉపాసన చెప్తాము. గాయత్రి ఒక ఛందస్సు. సోమం తేవటం వలన, ఇతర ఛందోక్షీరములను తేవటం వలన, ఇతర ఛందములందు వ్యాపించటం వలన సర్వ సవనములందును వ్యాపించుటవలన గాయత్రికి యజ్ఞమునందు ప్రాధాన్యము.

2. గాయత్రి ఒక మంత్రము. అది సర్వమంత్రములకు ముఖ్యము.

"న గాయత్ర్యాః పరం మంత్రమ్" గాయత్రీ మంత్రము వలననే ద్విజత్వం సిద్ధిస్తుంది. ఈ మంత్రము గాయత్రీ చ్ఛందస్సులోనిది. కనుక మంత్రం ఛందస్సు అన్ని గాయత్రులే లేదా లేదు. ఇంత గొప్పది కనుక గాయత్రి – ఉపాసన చెప్పబడినది.

**శ్లో॥ వాగ్భూతక్షితిదేహ హృత్సరసిజప్రాణాత్మనా షడ్విధా**
**గాయత్రీ చ చతుష్పదా భవతి తద్బ్రహ్మైవ యద్బ్రహ్మణః ।**
**పాదోఽసౌ చ తతో మహాన్ స పురుషో యస్యైకపాదోఽఖిలం**
**విశ్వం దృశ్యమిదం త్రిపాత్తదమృతం విద్యోతతే స్వాత్మని ॥ 289**

భావ॥ పైన చెప్పినట్లు గాయత్రి '6' విధములు. వాక్కు భూత, క్షితి, దేహ, హృదయారవింద, ప్రాణములు. అట్టి గాయత్రికి బ్రహ్మమే. ఎందుకంటే యీ గాయత్రి బ్రహ్మమునకు ఒక పాదము. పాదము – పాదవంతుడు ఒకటే గదా! అవయవావయవుల మధ్య అభేదముగూడా ఉన్నది. ఆయన ఏక పాదరూపమయిన గాయత్రికన్న చతుష్పాదరూపుడయిన బ్రహ్మం బృహత్ గదా! కనబడే యీ ప్రపంచమంతా ఏకపాదము. అదే గాయత్రి. మిగిలిన త్రిపాద విభూతి ఆత్మయందు సచ్చిదానంద లక్షణముగా నున్నది. 289

విశే॥ 1. గాయత్రి పూర్వశ్లోకములో వాక్కు, భూమి, దేహము, హృదయముగా చెప్పబడినది. షడ్విధం కనబడలేదు. కాని చెప్పబడినట్లే. గాయత్రి సకల జగత్తుగా చెప్పబడినది గదా! జగత్తు అనగా సర్వభూతాత్మకము గదా? కనుక భూతములు చెప్పినట్లే. మఱొక శ్రుతిలో ప్రాణములను భూతములని చెప్పారు. కనుక ఈ రెండు అర్థములు కారణంగా భూత, ప్రాణ రూపముగా గాయత్రి చెప్పబడినది. కనుక ఆరు సరిపోయినవి.

2. గాయత్రికన్న బ్రహ్మం అధికం. పాదం కన్న పాదవంతుడు అధికం గదా! అలాగే

అభేదం గూడా. పాదము పాదవంతులకు అభేదం అవయవావయవి సంబంధం వలన అధిష్ఠానం కన్న అందు కల్పితమయినది భిన్నంకాదన్న న్యాయం వలన, కార్యం కారణం కన్న భిన్నం కాదన్న న్యాయం వలన గాయత్రి బ్రహ్మములకు అభేదము.

3. ఈ త్రిపాద్విభూతి ప్రపంచరహితం, సచ్చిదానందస్వరూపం. కనుక గాయత్రి అధిష్ఠాన చైతన్యమయిన బ్రహ్మరూపంగా లేదా కారణాత్మస్వరూపంగా ఉపాసింపదగినది.

**శ్లో॥ ఆకాశః పురుషాదసౌ బహిరిదం బ్రహ్మైవ దేహాన్తరేఽ**
**ప్యాకాశో బృహదేవ హృత్సరసిజేఽ ప్యాకాశ ఏవామృతమ్ ।**
**హార్దాకాశ ఇతి స్థిరాప్రతిగతశ్చేతస్సమాధిం బుధః**
**పశ్యేత్పూర్ణముపాధిహీనమమృతం స్వాత్మానమేవేశ్వరమ్ ॥ 290**

భావ॥ బ్రహ్మ నుంచి ప్రథమ సృష్టిగా వచ్చినదే ఆకాశము-"ఆత్మన ఆకాశః సంభూతః" కదా! అట్టి ఆకాశమును బ్రహ్మముగానుపాసించు పద్ధతి (కం బ్రహ్మ, ఖం బ్రహ్మ) పురుషదేహముకన్న బయటనున్న యీ ఆకాశము బ్రహ్మమే. ఈ భావన బలపడిన తరువాత దేహాంతరమునందలి ఆకాశముగూడ బ్రహ్మమే అని భావన చేయవలయును. ఈ భావన స్థిరమయిన తరువాత, హృదయాకాశం (దహరాకాశం) అమృత రూపమని అనగా బ్రహ్మరూపమని ధ్యానము చేయవలయును. ఈ హృదయాకాశమున స్థిరమయిన చిత్త సమాధిని పొందినవాడు పూర్ణము ఉపాధిరహితము, అమృతము అయిన తన ప్రత్యగాత్మనే ఈశ్వరునిగా లేదా ఈశ్వరుని తన ఆత్మగా దర్శించును. కనుక ప్రత్యగాత్మ ఈశ్వరుడు పరబ్రహ్మం అంతా ఒక్కరేనని దర్శించటం జ్ఞానం. 290

**శ్లో॥ హృత్స్వర్గావసథస్య పఞ్చసుషిరం ప్రాగాదిదిక్షూర్ధ్వది-**
**శ్యాస్తే ద్వారపవచ్చ పఞ్చమరుతః సూర్యేన్దువహ్న్యమ్బుదాః ।**
**ఆకాశశ్చ వసన్తి తత్ర నయనం శ్రోత్రఞ్చ వాక్చేతసీ**
**వాయుశ్చాపి పుమాన్ య ఏతదయతే స్వర్గం స యాయాత్పుమాన్ ॥291**

భావ॥ హృదయమను దేవలోకమునకు పంచసుషిరములు (సన్నని చిల్లులు) ద్వారములుగా గలవు. అవి తూర్పు, దక్షిణం, పడమర, ఉత్తరం, ఊర్ధ్వం - ఈ దిక్కుల యందు గలవు. వీటికి ద్వారపాలకులుగా వరసగా -

ఎ) పంచప్రాణాలు బి) సూర్యచంద్ర అగ్నిమేఘ ఆకాశములు సి) నేత్ర శ్రోత్ర వాక్, మనః, వాయువులు ద్వారపాలకులుగా నుండును. అనగా తూర్పు - ప్రాణ సూర్య నేత్రములు, దక్షిణ - వ్యాన చంద్ర శ్రోత్రములు, పడమర - అపాన, అగ్ని, వాక్, ఉత్తర - సమాన, మేఘ(పర్జన్య), మనః, ఊర్ధ్వ - ఉదాన, ఆకాశం, వాయువు

ఇట్టి హృదయవిద్య తెలిసినవాడు స్వర్గగామి అగును. 291

**శ్లో॥ సంసారాదుపరి ప్రదీప్యతి తు యజ్జ్యోతిర్ద్యులోకాత్పరం**
**బ్రహ్మేన్ద్రాదిపదేషు చ స్ఫుటతరం యద్ద్యోతతే బ్రహ్మ తత్ ।**
**భూతానాం జఠరే స్థితోఽగ్నిరపి స బ్రహ్మైవ యస్య స్థితే-**
**రుష్ణస్పర్శకరం వపుశ్చ పిహితశ్రోత్రేణ శబ్దగ్రహః ॥ 292**

భావ॥ ద్యులోకముకన్న పరమయిన ఆ జ్యోతి సంసారముకన్న పైన మిక్కిలి వెలుగుచునుండును. బ్రహ్మేంద్రాదిలోకములందు ఆజ్యోతి అత్యంత స్ఫుటముగా ప్రకాశించును. వారు మనకన్న అధిక జ్ఞానమూర్తులు గదా! భూతముల ఉదరములలో నుండు వైశ్వానరాగ్నియును ఆ బ్రహ్మమే. ఆయన ఉనికివలన శరీరమునకు ఉష్ణ స్పర్శ, చెవులు మూసి విన్నచో కనబడు ప్రాణనాదము తెలియును. "అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః"

కనుక విశ్వనరవ్యాప్తుడయి వైశ్వానరుడయిన జఠరాగ్నిని బ్రహ్మముగా ఉపాసన చేయవలయును. 292

**శ్లో॥ యస్మాద్బ్రహ్మత ఏవ సర్వమయతే జన్మ స్థితిం చ క్షయం**
**సర్వం బ్రహ్మ తతశ్శమాదిసహితో బ్రహ్మేతి సర్వమ్భజేత్ ।**
**యో జీవన్హి యథాక్రతుస్స పురుషః ప్రేత్యైవ తాదృగ్భవేత్**
**తస్మాద్బ్రహ్మ యియాసురేష పురుషో బ్రహ్మక్రతుం హ్యాచరేత్ ॥ 293**

భావ॥ బ్రహ్మము వలననే సమస్తము సృష్టి స్థితి లయములను పొందును. కనుక సర్వము బ్రహ్మమే. అందువలన శమదమాది సహితుడయి సర్వము బ్రహ్మమని ఉపాసింప వలయును. పురుషుడు తన జీవితకాలమున ఎట్టి భావనలు కలిగియుండునో మరణానంతరమున్ను అట్టి ఫలితములనే పొందును. కనుక బ్రహ్మమును పొందదలచిన పురుషుడు బ్రహ్మభావనా యజ్ఞమునే ఆచరించవలెను. 293

విశే॥ 1.సర్వం బ్రహ్మమని ఉపాసన చేయవలయును. మట్టియందు పుట్టిన కుండ మట్టిగానే నిలిచి, మట్టిగానే లీనమవుతుంది.

2. "యాంతే మతిస్సాగతిః" "యాదృశీజాయతే బుద్ధిః సిద్ధిర్భవతి తాదృశీ" కనుక అంత్యకాలమున బ్రహ్మస్మరణ కలుగుటకు యావజ్జీవము బ్రహ్మధ్యానము చేయవలయును.

**శ్లో॥ ప్రాణాత్మైష మనోమయో రుచిమయస్సత్యేక్షణోఽభ్రాకృతి-**
**ర్నిర్దోషాఖిలకామగన్ధరసవాన్ సర్వస్య కర్తా విభుః ।**
**వాక్చక్షుశ్రవణేన్ద్రియాదిరహితో నిస్సమ్భ్రమశ్చాఖిల-**
**వ్యాపీ మే హృదయే స్థితోఽ త్యణుతమో జ్యాయాన్ సమస్తాదపి ॥294**

భావ॥ బ్రహ్మోపాసనను వివరిస్తున్నారు.

నా హృదయమునందున్న ఈ ప్రభువు ఈశ్వరుడు. ఆయన ప్రాణస్వరూపుడు. ముఖ్య ప్రాణ శరీరుడు. "ప్రజ్ఞా స ప్రాణః" అని శ్రుతి. అట్లే ప్రాణమయకోశంలోపల నున్న మనోమయ కోశం లోపలివాడు, మనోవృత్తులచే పొందబడువాడు, (ఉపాధులను బట్టి ఈశ్వరుడు ప్రాణ-మయుడు మనోమయుడు) స్వయంగా తేజోమయుడు, సత్యసంకల్పుడు మాయ ద్వారా ప్రపంచ కల్పకుడు, స్వయంప్రకాశ జ్ఞాన స్వరూపుడు, ఆకాశము వలె అసంగుడు అఖండుడు, నిర్దోషమయిన సర్వకామ, సర్వరస, సర్వగంధములు గలవాడు, సర్వ జగత్కర్త. వాక్, నేత్రము మొదలగు ఇంద్రియాలు లేనివాడు, ఎటువంటి సంభ్రమము ఉద్వేగములు లేనివాడు. అఖిలవ్యాపి, హృదయమునందున్నవాడు. అచ్చటనే బుద్ధికి లభ్యమగువాడు, అతి సూక్ష్మమయిన అనగా దురవగాహమయిన తత్త్వము గలవాడు, సమస్త ప్రపంచము కన్న అధికమయినవాడు, (అంతా ఆయన యందే కల్పితము గదా!) అట్టి మాయోపాధి గల ఉపాధిలేని బ్రహ్మమును కొలిచెదను. 294

విశే॥ 1. ఈశ్వరుడు మాయోపాధిగతుడు. జీవుడు ప్రాణ, మన ఉపాధిగతుడు గదా! ఈ విశేషణాలు ఒకే పదార్థమునకు వేయటానికి కారణము జీవేశ్వర చైతన్యములు అభిన్నము కావటమే. ఉపాధి భేదమే కనుక అద్వైతములలో సరిపోతుంది.

2. ఈశ్వరుడు ఉపాధులలోనున్నను ఉపాధి దోషములంటవు. ఆకాశమువలె అసంగుడు గదా!

3. జీవేశ్వరులకు అభేదము. కాని జీవగతమయిన అల్పజ్ఞత్వము, అసంతృప్తి మొదలయిన దోషాలు ఈశ్వరునకు రావు. ఆయన పూర్ణకాముడు. అందుకు కారణము ఉపాధి. మాయ శుద్ధ సత్త్వ ప్రధానమయినది. అవిద్య మలిన సత్త్వ ప్రధానమయినది. కనుక భేదం ఉన్నది. భేదం ఉంటే అభేదం ఎలా? - ఉపాధివలన భేదం. స్వతహా అభేదం.

4. "మాయావికనుకనే జగత్కర్త" నిరుపాధి అయిన బ్రహ్మం కర్తకాదు. "యతో వా ఇమాని..." అని శ్రుతి. కరణములు లేవు కనుక కర్తృత్వం లేదు. అయితే సర్వగంధః, సర్వరసః - ఎలా? - మాయవలన గాని, స్వరూపచైతన్యమువలన గాని గ్రహించవచ్చును. "అపాణిపాదో జవనో గ్రహీతా పశ్యత్య చక్షుః సశృణోత్య కర్ణః" - కదా!

5. ఏదయినా కోరిక గలవానికి అది తీరదనో ఎపుడు తీరుతుందా - అనో సంభ్రమం ఉద్వేగం ఉంటాయి. ఈశ్వరునకు అట్టివి ఉండవు. పూర్ణకాముడు, ఆప్తకాముడు కదా! అఖిల వ్యాపి కనుక సర్వకామములందు వ్యాపించి యుండును గదా!

6. నేను సేవించెదను - ఇచ్చట "నేను" ఎవరు? జీవుడా? ప్రత్యగాత్మయా? జీవుడయితే

అతనికి సగుణనిర్గుణ బ్రహ్మములతో అభేదం కుదరదు. ప్రత్యగాత్మ అయితే, మాయోపాధిక బ్రహ్మములో అభేదం కుదరదు. – సమా –

మాయోపాధిక నిరుపాధిక బ్రహ్మములు అభిన్నులే కదా! అట్లే జీవునకు మాయోపాధిక నిరుపాధిక బ్రహ్మతో అభేదము. ప్రత్యగాత్మకు మాయోపాధిక బ్రహ్మముతో అభేదము చెప్పవచ్చును. **ఒకే చైతన్యము బ్రహ్మం. అది మాయోపాధికంగా ఈశ్వరుడు, నిరుపాధికంగా బ్రహ్మం, అంతఃకరణోపాధికంగా ప్రత్యగాత్మ అవుతుంది.** పరమార్థదశలో నిరుపాధికం ఏకరూపము. కనుక ఒకే బ్రహ్మం జీవుడు, ఈశ్వరుడు, ప్రత్యగాత్మ అవుతుంది. ఇది స్వాభావికం. జీవ ఈశ్వర భావనలు మాయ/ అవిద్య వలన ఆగంతుకాలు. లేదా,

7. సర్వాంతరత్వం, సర్వవ్యాపిత్వం – అదే ప్రత్యక్షం. అది గూడా మాయవలన వచ్చిన ఆగంతుకమే. సర్వం అనేది మాయాజన్యము కదా! కనుక సర్వజ్ఞత్వం లాగా సర్వాంతరత్వం ప్రత్యక్త్వం గూడా 'సర్వమును' బట్టి వచ్చినదే.

8. ప్రత్యగాత్మయొక్క స్వరూపము సచ్చిదానందమే. అది సహజమే. జీవేశ్వరులు కల్పితులు కనుక వారి స్వరూపమూ అధిష్ఠానమయిన శుద్ధచైతన్యస్వరూపమూ, సచ్చిదానందమే. కనుక జీవుడు ఈశ్వరుడు ప్రత్యగాత్మ ఒక్కటే బ్రహ్మమే.

9. అలా అయితే జగత్తు గూడ కల్పితం కనుక బ్రహ్మమే అనవచ్చు గదా! అనవచ్చును. "సర్వం ఖల్విదం బ్రహ్మ" కదా! అయితే "బ్రహ్మ సత్యం జగన్మిథ్య" అనటం ఎలా? – సమా – **బ్రహ్మ స్వరూపంగా భావిస్తే జగత్తు సత్యమే. జగత్తు జగత్తుగానే అంటే మాత్రము మిథ్యయే. ఘటం మట్టిగా సత్యం. కాని ఘటంగా మిథ్య.**

**అయితే జగత్తును బ్రహ్మస్వరూపంగా భావిస్తాము కాని బ్రహ్మమును జగద్రూపంగా భావించము. మట్టి స్వరూపంగా కుండగాదు గదా?** బ్రహ్మకు జగత్తు స్వరూపం కాదు. మాయామయమయిన కల్పితమయిన జగత్తు బ్రహ్మస్వరూపం కానేరదు. అది మిథ్యయే. అలా అని **జీవేశ్వరులు మిథ్యకాదు. వారి తత్త్వము సత్యమే. వారి ఔపాధికమయిన జీవత్వము ఈశ్వరత్వము మిథ్య.** అజో నిత్యః శాశ్వతః మొదలయిన వర్ణన తాత్త్వికమయిన శుద్ధ చైతన్యసంబంధమయినవి. జగత్తు మాత్రం స్వతహాగానే మిథ్య. అదీ భేదము.

10. ప్రత్యగాత్మ గూడా ప్రత్యక్షరూపమయిన ఉపాధిలోనున్నాడు కనుక ప్రత్యగాత్మ గూడా మిథ్య కాదా? – కాదు . ప్రత్యక్త్వం ఉపాధి కాదు. కాని ప్రతక్త్వం మిథ్యయే. అది ప్రపంచరూపమయిన ఉపాధివలన వచ్చినది. ఆత్మ ధర్మ రహితం. ప్రత్యగాత్మ సత్యమే. ప్రత్యక్త్వం మాత్రం మిథ్యయే. అంతమాత్రమున ప్రత్యగాత్మ లేదనికాదు. ఘటత్వరహితమయిన ఘటం

ఉండదు. ఇక్కడ పరిస్థితి అదికాదు. ప్రతక్ష్యం లేనందువలన ప్రత్యగాత్మ అను వ్యవహారం ఉండదు. 'ఆత్మ' సత్యమే.

11. కనుక ప్రత్యగాత్మా భిన్నమయిన బ్రహ్మం ఒక్కటే – సత్యం. అదే నేను. అంతకన్న మించినదంతా మిథ్య, అని నిశ్చయించి పండితుడు అలా ధ్యానింపవలయును.

12. ఈ శ్లోకములో 1. జీవత్వమును చెప్పే విశేషణాలు – ప్రాణాత్మా, మనోమయః, 2. ఈశ్వరత్వమును చెప్పేవి సత్యేక్షణః మొదలగునవి 3. ప్రత్యగాత్మ విశేషణాలు అఖిలవ్యాపి మొదలగునవి 4. రుచిమయుడు, అభ్రాకృతి మొదలగునవి చైతన్యస్వరూపమును చెప్పునవి.

**శ్లో॥ భూభుధ్నో గగనోదరస్త్రిజగతీ కోశో దిశాకోణగో-**
**ద్యామూర్ధ్వం బిలమాదధచ్చ వసుధానోఽయం న వా జీర్యతి ।**
**దిక్ప్రాచ్యస్య జుహూః శ్రుతాతు సహమానాఖ్యా దిశా దక్షిణా**
**రాజ్ఞీనామ పరాగ్దిశోత్తరదిశా ఖ్యాతా సుభూతాఖ్యయా ॥ 295**

భావ॥ ప్రతీకోపాసనలు చెప్తూ మధ్యలో త్వరపడి బ్రహ్మోపాసన చెప్పి మరల సింహావలోకన న్యాయంతో ప్రతీకోపాసనలు చెప్పబడుచున్నాయి. అందులో 2 శ్లోకములతో కోశోపాసన.

లోకత్రయము ఒక కోశము. దీనికి భూమి వేరు (మూలం), ద్యులోకము ఊర్ధ్వ బిలము. కర్మఫలరూపమయిన ధనము (వసు) దీనిలో నిలువ ఉంటుంది. ఈ కోశము తరిగిపోదు. సహస్రయుగములయినా ఉంటుంది.

ఈ కోశమునకు తూర్పుదిక్కు జుహూః. దక్షిణ దిక్కు సహమాన. పడమర దిక్కు రాజ్ఞి. ఉత్తరదిక్కు సుభూత. 295

విశే॥ జుహూః = హోమము చేయు దిక్కు, సాధనము, సహమానా = ప్రాణులు ఈ దిక్కునందున్న యమపురిలో పాపఫలములను సహిస్తారు. రాజ్ఞీ = రాజయిన వరుణుడు గలది. లేదా సంధ్యారాగంతో ప్రకాశించునది, సుభూత = భూతి (ఐశ్వర్యము) గల కుబేరాదులు గలది.

**శ్లో॥ వత్సో వాయురయం దిశామితి విదన్ నో పుత్రశోకం వ్రజేత్**
**పుత్రాయుఃకృతయే భజేత విబుధోఽరిష్టన్తు కోశన్తతః ।**
**ప్రాణం భూతమయఞ్చ భూశ్చ ధరణీ వ్యోమద్యురూపామ్భువో-**
**వాయ్వగ్న్యర్కమయీం సువస్త్రినిగమాకారామితి వ్యాహృతిమ్ ॥ 296**

భావ॥ దిక్కులందు పుట్టునట్టి వాయువు పైన చెప్పిన దిక్కులకు బిడ్డ – అని ఉపాసన చేసినవానికి పుత్రశోకము కలుగదు.

పుత్రుని ఆయువు పెరగాలంటే, బుధుడు శుభమయిన ఈ కోశమును సేవింపవలయును. భూతమయ మయిన ప్రాణమును భజింపవలయును. వారు భూ అంతరిక్ష స్వర్గరూపమయిన "భూః" అను వ్యాహృతిని, వాయు వహ్ని సూర్యమయమయిన "భువః" అను వ్యాహృతిని, వేదత్రయరూపమయిన "సువః" అను వ్యాహృతిని భజింపవలయును. 296

**శ్లో॥ యజ్ఞోఽయం పురుషోఽస్య పూర్వసవనం గాయత్రమాయుశ్చతు-**
**ర్వింశత్యబ్దమయం తదస్య వసవః ప్రాణా స్సమన్వాగతాః ।**
**మాధ్యాహ్నం సవనం ద్విరాగతగుణద్వావింశతి ర్వత్సరా**
**ఆయుస్త్రైష్టుభమేతదప్యనుగతాః ప్రాణాశ్చ రుద్రాః స్వయమ్ ॥ 297**

భావ॥ జీవించుచున్న పురుషుడే ఒక యజ్ఞము. ఈ యజ్ఞములో మొదటి 24 సంవత్సరాలు గాయత్రీ ఛందోమయమయిన పూర్వసవనం అవుతుంది. దీనికి అనుసరణీయ దేవతలు ప్రాణులు అవే వసువులు. తరువాత 2×2=44 సంవత్సరాలు మాధ్యందిన సవనము. ఇది త్రిష్టుప్ ఛందస్సు. ఈ సవనము నందు ప్రాణములే రుద్రులు. 297

**శ్లో॥ చత్వారింశదథాష్ట చాస్య శరదామాయుస్తు యజ్ఞాగతం**
**తత్సాయం సవనం తదప్యనుగతాః ప్రాణాస్త ఆదిత్యకాః ।**
**ప్రాణప్రార్థనయా త్వకాలమరణాన్ముక్తశ్శతం వత్సరాన్**
**జీవేత్షోడశ చైష వేద య ఇదం జీవేత్స చైవం చిరమ్ ॥ 298**

భావ॥ తరువాత 48 సంవత్సరాలు జగతీ ఛందస్సు. అది సాయం సవనం. అచ్చటి ప్రాణములే ఆదిత్యులు. ఈ విధముగా ప్రాణప్రార్థన చేసినట్లయితే, అకాల మరణమునుంచి తప్పించికొని మొత్తం 116 సంవత్సరాలు (24+44+48) జీవించును. అపమృత్యువు అకాల మరణం తప్పి పోవును. ఇట్లు తెలిసిన వాడు 116 సంవత్సరాలు బ్రతుకును. 298

**శ్లో॥ వష్ట్యత్తుం పరిపాతుమేష రమతే నో యత్తు దీక్షాస్య సా**
**పానం భుక్తిరతీ భవన్త్యుపసదశ్శస్త్రాణి హాసాదయః ।**
**సత్యం దానమబాధనం చ ఋజుతా భూయస్తపో దక్షిణా-**
**స్సూతిస్సోమరసాప్తిరప్యవభృథః ప్రాణోత్క్రమో వర్ష్మణః ॥ 299**

భావ॥ యజ్ఞ దీక్షలు మొదలగునవి. తినగోరును. త్రాగగోరును. కాని అలా చేయలేని ఇబ్బంది ఈ యజ్ఞములో దీక్షలు (దీక్షలు ఉపవాసము మంచము వంటివి) ఆ తరువాత యజ్ఞంలో పాలు త్రాగటం మొదలయినవాటికి అనుమతిగల రోజులు **ఉపసత్తులు.** ఈ యజ్ఞంలో తిను త్రాగు ఆనందపడురోజులు. నవ్వు మొదలగు ఆనందపు రోజులు శస్త్రం మొదలయిన

యజ్ఞాంగములు. ఈయజ్ఞ దక్షిణలు సత్యము, దానము, అహింస, ఆర్జవము, తపస్సు, జన్మించటం సోమరసప్రాప్తి, నిర్యాణము అవబృథము (వర్ష్మ = శరీరము) ఉండును. 299

**శ్లో॥ ప్రాణార్కాక్షితమస్యథాచ్యుత మసి ప్రాణస్య సమ్యక్ శితం**
**తత్త్వం చాసి విశుద్ధధీః కలయతే యజ్జ్యోతిరాత్మస్థితమ్ ।**
**సర్వవ్యాపి తమఃపరం రవిగతం తద్భాసకం జ్యోతిషా-**
**ముత్కృష్టం వయమాగతా ఇతి బుధః పశ్యేత్ప్రయాణక్షణే ॥ 300**

భావ॥ పురుష యజ్ఞవేత్త యొక్క చరమకాల కర్తవ్యమిది.

ఓ ప్రాణసూర్యా! నీవు అక్షయమయిన వస్తువు. అచ్యుత స్వరూపమయిన వస్తువు. ప్రాణముయొక్క పదునయిన సూక్ష్మవస్తువువు. అలాగే నిర్మలమయిన మనస్సుతో మరణ ప్రయాణ సమయమున, అతను ఇట్లు గ్రహించవలయును. సర్వ వ్యాపకము, అజ్ఞానదూరము, సర్వ తేజస్సులకు గూడా భాసకమయిన తేజస్సు అయిన ఆదిత్య మండలగతము స్వశరీరగతమూ అయినా ఆ ఉత్కృష్ట చైతన్యమును నేను కలియుచున్నాను అని భావింపవలయును. 300

**శ్లో॥ అధ్యాత్మం పురుషో భజేద్బృహదితి స్వాన్తం చతుష్పాచ్చ త-**
**ద్వాక్ప్రాణశ్రుతిదృగ్భిరమ్బరమితి బ్రహ్మాధిదైవం భజేత్ ।**
**అగ్నిస్పర్శనదిగ్దివాకరమయైః పాదైశ్చతుష్పాచ్చ త-**
**ద్భాగాద్యాని పదాన్యమూని బృహతో వహ్న్యాదిభిర్భాన్తి చ ॥ 301**

భావ॥ మనోమయత్వం ఆకాశమయత్వం ఉన్న ఈశ్వరోపాసన చెప్పబడినది. ఇపుడు మనస్సు, ఆకాశములందు బ్రహ్మదృష్టి చూపబడుచున్నది. (శుక్తి రజతమునందు శుక్తి దృష్టిలాగా) పురుషుడు తన శరీరమునందు మనస్సును బ్రహ్మముగా ఉపాసింపవలయును. (మనోబ్రహ్మేత్యుపాసీత) ఈ బ్రహ్మకు వాక్కు, ప్రాణము, శ్రవణము, నేత్రము అనునవి నాల్గు పాదములు. ఇక అధిదైవముగా, ఆకాశమును, బ్రహ్మం అని సేవింపవలయును. దానికి నాల్గు పాదములు అగ్ని, వాయువు, దిక్కు, సూర్యుడు. ఇందువలన ఆకాశపాదముల వలన మానసిక పాదములు ప్రకాశించును. చూడండి. అగ్ని = వాక్కు ; వాయువు = ప్రాణము; దిక్కు = కర్ణము; సూర్యుడు = నేత్రము. ఈ ఉపాసనకు తేజస్సు కీర్తి మొదలగునవి ఫలము. 301

**శ్లో॥ సృష్టేః ప్రాగసదేవ విశ్వమభవత్తస్మా దభూత్సత్తతో**
**జజ్ఞేఽణ్డం నిరభిద్యతాబ్దత ఉపర్యేతత్కపాలద్వయమ్ ।**
**రౌప్యమ్భూరధరం కపాలమపరం ద్యౌః కాఞ్చనఞ్చాభవత్**
**స్థూలం తస్య జరాయుపర్వతగణః సూక్ష్మం సమేఘం హిమమ్ ॥302**

భావ॥ ఇక ఆదిత్యో(బ్రహ్మేత్యుపాసీత = ఆదిత్య బ్రహ్మోపాసన చెప్పబడుచున్నది. సృష్టికి ముందు ప్రపంచం అసత్ = అవ్యక్తముగా ఉండెను. దానినుండి సత్ వచ్చెను. అనగా (జలరూపంగా) వ్యాకృతమయ్యెను. దానినుండి అండము ఏర్పడెను. సంవత్సరం తర్వాత ఆ అండము కపాలద్వయముగా (రెండు డిప్పలు) విడిపోయెను. అందు అడుగు డిప్ప వెండిది. అదే భూమి (తక్కువ కాంతి గనుక వెండి అనబడెను.) పై డిప్ప ద్యులోక మయ్యెను. అది బంగారు డిప్ప. (కాంతి ఎక్కువ కనుక) ఆ అండములోని స్థూలభాగమయిన జరాయువు (మావి) పర్వతసమూహమయ్యెను. అందలి సూక్ష్మభాగము మంచు, మేఘముగా అయ్యెను. 302

**శ్లో॥ దేహే తస్య సిరాస్తు యాస్సమభవన్నద్యస్సమస్తా హి తా**
**వాస్తేయం సలిలన్తు సిన్ధురభవత్తస్మిన్నభూద్భాస్కరః ।**
**ఉత్పత్తౌ తరణేస్తదా హ్యుదగమన్ఘోషాశ్చ భూతాని త-**
**త్కామా అద్య చ భాస్కరోదయలయే సర్వం తదుద్గచ్ఛతి ॥ 303**

భావ॥ ఆ గర్భము యొక్క దేహమునందున్న సిరలు అన్నియు నదులయినవి. వస్తి = పొత్తికడుపులోని నీరు సముద్రమయ్యెను. దానియందు భాస్కరుడు పుట్టెను. సూర్యుడు పుట్టిన వెంటనే ఘోషములు ఏర్పడెను. ఉలూలవః అనగా పెద్ద శబ్దములు ఏర్పడెను. భూతములు వాటి వాంఛలు బయలుదేరినవి. కనుకనే నేటికిని సూర్యోదయాస్తమయముల వేళ పక్షి మొదలగు వాని ఘోషలు వినబడుతున్నవి. అంతకుముందు నిద్రలోనుండి తరువాత ఉదయంతో మేల్కొంటాయి గదా! "ఉద్యంతమస్తంయయంత మాదిత్యమభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మణో విద్వాన్ సకలం భద్ర మశ్నుతే" కనుక సూర్యోపాసన వలన సర్వకామ సిద్ధి. 303

**శ్లో॥ విద్వానేవముపాస్త ఏనమరుణం బ్రహ్మేతి భానోః పదం**
**ప్రేత్యాయం ప్రతిపద్యతే ద్రుతతరం చేహాపి సాధుస్వరాన్ ।**
**సద్రూప్యామృతమశ్నుతే చ సకలాః కామా భజన్తేఽ ప్యముం**
**భూతాన్యప్యఖిలాని హన్త సుఖయన్త్యేనం నితాన్తం స్వయమ్ ॥ 304**

భావ॥ ఈ విధముగా సూర్యుని బ్రహ్మముగా ఉపాసించువాడు, మరణానంతరము సూర్యలోకమును చేరును. ఇహలోక జీవితము నందయినా అతడు సాధుఘోషమును పొందును. పాపానుబంధము లేని భోగములను సత్కీర్తిని పొందును. అమృతసుఖమును పొందును. ఇతని కోరికలు వాటంతట అవే తీరును. సమస్త భూతములు ఇతనిని స్వయంగా సుఖపెట్టును. కనుక "ఆదిత్యోబ్రహ్మ" అని భావింప వలయును. 304

**శ్లో॥ యేనాయః కృతనామకస్స విజితస్తేనాధరేఽ యాః కలిః**
**త్రేతాద్వాపర ఇత్యమీ హి విజితా యస్మాత్కృతేఽన్తర్గతాః ।**

**ఏవం యేన బృహజ్జితం సమమయం సర్వం జితం తేన స-**
**త్కర్మేదం హి సమాప్యతే పరబృహద్ జ్ఞానే తదేతత్పరమ్ ॥ 305**

భావ॥ పాచికల ఆట ఒకటి ఉన్నది. దానిలో 'అయం' అని ఒక పాచిక. కలి -1 అయం, ద్వాపరం - 2 అయాలు, త్రేతా - 3 అయాలు, కృతం - 4 అయాలు. ఇందులో 'కృతం' గెలిచిన వానికి అంటే 4 పందెం పడితే 1,2,3 స్థానాలు గెలిచినట్లే గదా! **రూపాయి సంపాదిస్తే 4 పావలాలు సంపాదించినట్లే గదా! అట్లే బ్రహ్మం సర్వాధికం. దానియందు అంతా ఉన్నది. సర్వకర్మల ఫలం సర్వాధిష్ఠానమయిన బ్రహ్మమునందే అంతర్గతంగా ఉంటుంది. కనుక** బ్రహ్మమును గెలిచిన వాడు సర్వమును గెలిచినట్లు. ఒక భాగమును గెలిచినవాడు బ్రహ్మమును గెలిచినట్లు. (పావలా గెలిచినవాడు రూపాయిని గెలిచినట్లు కాదు) 'శతం సహస్రే సంభవతి" అని న్యాయము. 100 - 1000లో ఉంటుంది. 305

విశే॥ 1. ఆదిత్యాదులను ఆదిత్యాది రూపంగా ఉపాసిస్తే ఆదిత్యాదులే దొరకుతారు. బ్రహ్మం దొఱకదు. కాని బ్రహ్మంగా ఉపాసిస్తే బ్రహ్మమే దొరకుతుంది. బ్రహ్మం సాక్షాత్కరించాలంటే శ్రవణాది రూప బ్రహ్మజ్ఞానమువలన జరుగుతుంది. కాని అది తీవ్ర బుద్ధులకు మాత్రమే సాధ్యము. మందబుద్ధులకు నిర్గుణోపాసన కావాలి. ఉపాసన అయినా మొదట అసాధ్యము. కనుక సగుణోపాసన చేయాలి. ఆ సగుణమయినా ఎలాదొఱకుతుంది? ప్రతీకలవలన దొరకుతుంది. ప్రతీకలే ఆదిత్యాదులు. "ఆదిత్యో బ్రహ్మేత్యుపాసీత" – కనుక ఆదిత్యుని బ్రహ్మముగా ఉపాసించాలి. బ్రహ్మం ఒక్కటే ఉపాసనీయము. దానిలో అన్నీ ఉన్నాయి. అది అన్నింటిలో ఉన్నది. బ్రహ్మోపాసన సర్వ జయం.

2. అగ్నిహోత్రాది కర్మఫలం అంతా బ్రహ్మంలోనే ఉంటుంది. స్వర్గాద్యధిష్ఠానం బ్రహ్మమే కదా! "శతం సహస్రే సంభవతి" కదా! "సర్వం కర్మా ఖిలం పార్థజ్ఞానే పరిసమాప్యతే" కదా! బ్రహ్మజ్ఞాన ఫలం సర్వాత్మభావం. అగ్నిహోత్రాది ఫలాలు స్వర్గాదులు ఇవి అన్నీ ఆ "సర్వం" లోనివే.

3. సర్వపరిసమాప్తిభూమి బ్రహ్మం. సర్వావధి బ్రహ్మం. ఆదిత్యాదిదేవభావం, స్వర్గాదుల నిచ్చే యాగాలు, ఇష్టాపూర్తములు – అన్నీ వదలి సర్వభావమునిచ్చే బ్రహ్మోపాసనే చేయాలి. సర్వభావములో పై భావములన్ని అంతర్గతమే. సమ్రాట్టుకు సర్వసామంత రాజ్యములు వచ్చినట్లే కదా! 1000లో 100లు, రూపాయిలో పావలాలు, 'కృతం' అనే లయంలో 1,2,3 అయాలు (కలి ద్వాపర త్రేతా) ఉన్నట్లే కదా! కనుక దేవతాంతరారాధన అయినా బ్రహ్మరూపంగా చేయాలి. అది మందబుద్ధులకు ఉపాయము.

**శ్లో॥ యద్యత్సాధు చరన్తి కర్మ భువనే లోకాస్తదేతత్సమం**
**బ్రహ్మజ్ఞం ప్రవిశత్యయం భవతి యద్బ్రహ్మైవ సర్వాత్మకమ్ ।**

**నిష్కామాః కృతినః స్వకర్మజఫలం బ్రహ్మార్పణం కుర్వతే**
**తద్బ్రహ్మైనం సముపైతి తత్ఫలజలైర్నైషోఽమ్బుధిర్వర్ధతే ॥ 306**

భావ॥ లోకులు ఏయే సాధుకార్యములను ఆచరిస్తారో ఆ కర్మ సమూహమంతా బ్రహ్మవేత్తలోనికి చేరును. ఎందుకంటే బ్రహ్మవేత్త సర్వాత్మకమయిన బ్రహ్మమే కదా! నిష్కామకర్మ యోగులందఱు స్వకర్మఫలములను అసంగులయి బ్రహ్మార్పణము చేసెదరు. అదంతయు బ్రహ్మస్వరూపుడయిన బ్రహ్మవేత్తను చేరును. అంతమాత్రముచేత సముద్రతుల్యు డయిన జ్ఞానిలో ఎట్టి విశేషము రాదు. ఎంతవర్షము కురిసినా సముద్రము పెరుగదు. ఆ కర్మ ఫలం నామరూపరహితం అవుతుంది. దుష్కర్మలయినా అంతే. బ్రహ్మం అసంగం. అవికారం. పరిపూర్ణం, సచ్చిదానందం. కనుక బ్రహ్మమే ఉపాసింప దగినది. 306

**శ్లో॥ అగ్న్యర్కేన్దుజలాని యాన్తి విలయం వాయౌ వచోఽక్షిశ్రుతి**
**స్వాన్తాని ప్రలయం ప్రయాన్తి తు యతః ప్రాణే తతస్తావుభౌ ।**
**సంవర్గౌ భవతః ప్రజాపతిమయా వాత్మా స హి ద్యోసదాం**
**భూతానాం జనితా హిరణ్యదశనస్సూరిశ్చ భోక్తా మహాన్ ॥ 307**

భావ॥ వాయువునందు అగ్ని, సూర్య, చంద్ర జలములు లయించును. కనుక వాయువు సంవర్గము. ప్రాణమునందు వాక్కు, నేత్రము, కర్ణము, మనస్సు లయించును. కనుక ప్రాణము సంవర్గము. సంవర్గము అనగా లయస్థానము. కనుక ఈ వాయుప్రాణములు హిరణ్యగర్భ ప్రజాపతి రూపములు. ఈ హిరణ్యగర్భ ప్రజాపతి దేవతలకు (వాయ్వాది) ఆత్మ. ఆయన సర్వ దేవస్వరూపుడు గదా! ఆయనయే భూతములకు స్రష్ట. వీరందఱు ఆయన యందే పుట్టి లీనమయ్యెదరు. ఆ హిరణ్యగర్భుడు హిరణ్యదంతుడు అనగా భగ్నం గాని దంతములు గలవాడు. సర్వభక్షకుడు. ప్రాణవాయువులున్ను అంతే. ఆయన సర్వజ్ఞుడు. వాయువు దేవుడు గనుక సర్వజ్ఞమే. ప్రాణము తన అధిష్ఠానముగా నున్న బ్రహ్మరూపంగా సర్వజ్ఞము. మరియు మహానుభావుడు. 307

విశే॥ 1. ప్రజాపతినుంచి లోకములు పుట్టి ఆయనయందే లయిస్తాయి. అదే విధంగా వాయువు అగ్న్యాదులను, ప్రాణము, వాగాదులను పుట్టించి తమలో లయింపజేస్తాయి కనుక వాయు ప్రాణములు ప్రజాపతులు – అనదగును.

2. సంవర్గం = సంగ్రహించటం, సంగ్రసనము, సంవృజ్క్తే = ఛేదించును = సంవర్గము సంహారకము.

3. ప్రజాపతి హిరణ్యగర్భుడు. ప్రజాపతి సూత్రాత్మ. ప్రాణవాయువులు సూత్ర రూపులు. సూత్రమునందు పుష్పములున్నట్లు ప్రాణమునందు కార్య కరణ సమూహము, వాయువు నందు లోకసంఘము ఆధారపడియున్నది.

4. అగ్ని మొదలగు దేవతలు వాగాదులు - వీనికి వాయు ప్రాణములు ఆత్మలు. స్రష్టలు. ప్రజాపతియు దేవాత్మ, దేవస్రష్ట. కనుక కార్యకారణభావం కుదురుతుంది. కనుక దేవతలకు ఆత్మ, భూతములకు స్రష్ట అని వ్యాఖ్యానించినా సరిపోతుంది.

5. కనుక వాయు ప్రాణ ప్రజాపతులు బ్రహ్మయే. అంతా బ్రహ్మకార్యములే. పరంపరయా వాయు ప్రాణములు బ్రహ్మకార్యములు. ప్రజాపతి నేరుగా బ్రహ్మకార్యము. వాయు ప్రాణములు నేరుగా ప్రజాపతి కార్యములు. కనుక వాయు ప్రాణములను సంవర్గ గుణముగల బ్రహ్మముగా ఉపాసింప వలయును.

**శ్లో॥ చత్వారోఽస్య చతుష్కలా భగవతః పాదాశ్చతుష్కన్దిశాం**
**భ్వభ్రద్యవ్ధిచతుష్కమగ్నితరణిగ్లోప్రోదినీనాన్తథా ।**
**ప్రాణాక్షిశ్రుతిచేతసామితి పుమాన్ ప్రోక్తః పరష్షోడశీ**
**విద్యామేతి గురోర్ముఖాదితి తు యస్సోఽయం కృతార్థో భవేత్ ॥308**

భావ॥ సర్వజగత్తును ఒక్కటిగా భావించి దానిని 16 భాగాలు విభజించి అందు బ్రహ్మదృష్టి చేయవలెను.

భగవంతునకు నాలుగు కలలుగల నాల్గు పాదములు కలవు. ఆ 4 కలలు ఇవి.

1. దిక్కులు 4 2. భూ అంతరిక్ష స్వర్గసముద్రములు 4 3. అగ్ని సూర్య చంద్ర విద్యుత్తులు - 4, 4. ప్రాణ నేత్ర కర్ణ చిత్తములు - 4. ఇందు ఈ కారణముగా ఆ పరమ పురుషుడు "షోడశి" అయినాడు. 16 కలలు గదా! గురు ముఖమునుండి యీ విద్యను స్వీకరించిన వాడు కృతార్థుడగును. 308

**శ్లో॥ ఏకం తత్ర పదం ప్రకాశవదితి ప్రఖ్యాతమాశామయం**
**యో నిధ్యాయతి సప్రకాశమయతే లోకాన్ ప్రకాశాత్మకాన్ ।**
**అన్యమ్పాదమనన్తవన్తమయతే భూమ్యాదిరూపన్తు యః**
**సోఽత్రానన్తగుణో భవేదథ మృతశ్చానన్తలోకానయేత్ ॥ 309**

**శ్లో॥ జ్యోతిష్మన్తమథాపరం భగవతః పాదన్తు యశ్చిన్తయే-**
**ద్వహ్న్యాద్యాత్మకమేష దీప్తికలితో దీప్త్యాప్తలోకాన్వ్రజేత్ ।**
**యోముష్యాన్యపదం తథాఽఽయతనవత్సఞ్జ్ఞన్తు సఞ్చిన్తయేత్**
**ప్రాణాద్యాత్మకమేష చాయతనవాంస్తద్యుక్తలోకాన్వ్రజేత్ ॥ 310**

భావ॥ దిగ్రూపమయిన ప్రథమపాదము ప్రకాశవంతము. దానిని అలా ధ్యానించిన వాడు ప్రకాశస్వరూపమయిన లోకములను ధ్యానించును. ద్వితీయ పాదము భూమ్యాది రూపము.

దానిని దీనిని అనంతవంతముగా నుపాసించిన వాడు అనంతగుణశాలియై అనంతలోకములను పొందును.

తృతీయపాదము జ్యోతిష్మంతము. (సూర్య చంద్రాగ్నిపాదము). దానిని కాంతి మంతముగా భావించి ఉపాసించువాడు కాంతిమంతుడై కాంతిమయలోకములకేగును. ఇక నాల్గవ పాదమయిన ప్రాణాదిపాదమును ఆయతనవంతముగా భావించువాడు. ఆయతన (స్థానం) వంతుడై అట్టి లోకములకు చేరును. 309–310

విశే॥ జీవిత దశలో వీరు ప్రకాశమును, అనంత గుణములను, దీప్తిని, ఆయతనములను పొందును. మరణానంతరము ఆయాలోకములను పొందును.

**శ్లో॥ ప్రాణో బ్రహ్మ సుఖం బృహచ్చ గగనం బ్రహ్మైవ యద్వై సుఖం**
**తత్ఖం యద్గగనం తదేవ హి సుఖం కాకారమేవామ్బరమ్ ।**
**ఖాకారం చ సుఖం తతస్సుఖమయం హార్దం నభో బ్రహ్మత-**
**త్ర్పాణస్సన్నిహితో బృహచ్చ తదిదం బ్రహ్మద్వయం కోదితమ్ ॥ 311**

భావ॥ ప్రాణము బ్రహ్మమే. సుఖం బ్రహ్మమే. ఆకాశం బ్రహ్మమే. ఏది సుఖమో అది గగనము. ఏది గగనమో అది సుఖము. ఆకాశము సుఖాకారమే. గగనాకారము సుఖము. అందువలన సుఖమయమయిన హృదయాకాశము బ్రహ్మమే. హృదయాకాశమున నున్న ప్రాణము బ్రహ్మమే. లేక హృదయాకాశమే బ్రహ్మం. సన్నిహితం ప్రాణం – అందువలన ప్రాణమూ బ్రహ్మమే. ఈ రెండు రకాల పర – అపర బ్రహ్మ ద్వయము. అగ్నులచే(క) చెప్పబడినది. కనుక ఇదంతా ప్రామాణికమే. 311

విశే॥ 1. కారణబ్రహ్మోపాసన గూర్చి చెప్పబడుచున్నది.

2. ప్రాణమనగా సూత్రాత్మ అయిన హిరణ్యగర్భుడు. సర్వవ్యాపి అయినను శరీరముల వలన పరిచ్ఛిన్నంగా కనబడతాడు. ఈయన నుండియే సృష్టి స్థితిలయములు కనుక ఈయన జగత్కారణము. ఈ ప్రాణము మహతత్త్వము. ఇది బ్రహ్మమునుంచి పుట్టినది కనుక అజము కాదు. ముఖ్యబ్రహ్మం కాదు. ఇది అపర బ్రహ్మ.

3. సుఖ, ఆకాశములు బ్రహ్మము – అయితే సుఖం క్షణికం గగనం జడం. కాని అవి కాదు. సుఖాకారమయిన ఆకాశం అంటే బ్రహ్మమే. ఆకాశస్వరూపమయిన సుఖం అన్నా బ్రహ్మమే. అవి జడక్షణికాలు కావు. ఊరకయే సుఖం అన్నా గగనం అన్నా అవి బ్రహ్మం కావు. క్షణిక విషయ సుఖం బాహ్యమయిన మేఘాకాశం గాని అవుతుంది.

4. సుఖాకారగగనం కాని, గగనాకారసుఖం కాని ఏది? – మామూలు సుఖాకాశము

లందు ఆ లక్షణం కనబడటం లేదు గదా! – సమా – అవును. అది హృదయాకాశము – అది సుఖాకాశం. ఆకాశాకారసుఖం. సచ్చిదానందం బ్రహ్మం. అచ్చటనే విషయ నిమిత్తంకాని శాశ్వత స్వయంప్రకాశమయిన సుఖము లభించును. అది గగనం వలె నిరవయవము. అతిసూక్ష్మం. నిర్దోషం. వ్యాపకం.

5. ప్రాణం ఎలా బ్రహ్మం అయింది? – సమా – హృదయాకాశములోనున్న ప్రాణము బ్రహ్మము. బ్రహ్మ సంపర్కంవలననే ఇది బ్రహ్మంగా చెప్తాం. ముఖ్య బ్రహ్మం కాదు.

6. ఈ హృదయాకాశ స్వరూపం ఏమిటి? అది హృదయపద్మ సుషిరమా? బుద్ధిలో భాసించే బ్రహ్మమా? మొదటిదయితే దానికి బ్రహ్మంతో సంపర్కం ఎలా? రెండవదయితే, సుషిరంలో ఉన్న ప్రాణం బ్రహ్మంలో ఉన్నదనటం ఎలా? – సమా – ప్రాణం హృదయసుషిరంలో ఉన్న బుద్ధిలో ఉన్నది. కనుక ఈ రెండింటికి సంపర్కం సాధ్యమే.

7. తన్నిహిత – అన్న శబ్దంలో తత్ అనగా హృదయాకాశం. అది బ్రహ్మమే. హృదయసుషిరగతాకాశము కాదు గదా? – నిజమే – కాని ప్రాణాశ్రయం అన్న కారణంగా, తత్ అంటే బ్రహ్మస్వరూపమయిన హృదయాకాశమును ఆశ్రయమయిన హృదయసుషిరమనబడే భౌతికాకాశం గ్రహిస్తాము.

8. లేదా, తత్ అంటే హృదయాకాశమయిన బ్రహ్మమే. ప్రాణం అచ్చట ఉండటమంటే బ్రహ్మాశ్రయమయిన హృదయరంధ్రంలో ఉంటుంది – అని అర్థము.

**శ్లో॥ సూర్యే చన్ద్రమసి క్షణత్విషి తథా యో వా పుమాన్ దృశ్యతే**
**సోఽహం సోఽస్మ్యహమేవ యః పునరితి ధ్యాయత్యజస్రమ్భువి ।**
**పాపం హన్తి న దీర్ఘమాయురయతే ఖ్యాతిఞ్చ లోకే పరాం**
**నో నశ్యన్త్యవరా అముష్య పురుషాః ప్రేత్యైష సల్లోకవాన్ ॥ 312**

భావ॥ ఇక ఇతర – ఉపాసనలను చెప్తున్నారు. 'సూర్యునియందు చంద్రునియందు, మెఱుపునందు ఏ పురుషుని దర్శింతుమో 'అతడే నేను, నేనే అతడు' అని నిత్యము ధ్యానించువాడు పాపరహితుడగును. దీర్ఘాయువును పొందును. లోకంలో పరమ ఖ్యాతిని పొందును. ఆయన కన్న తరువాత పుట్టిన వారు అనగా పుత్రులు భ్రాతలు మరణింపరు. ఇతడు మరణానంతరము మంచిలోకమును పొందును. 312

**శ్లో॥ పత్రే వారిరుహస్య వారివదఘం నో తద్విది శ్లిష్యతే**
**స్థానన్తస్య చ లోచనం న పయసా నో సర్పిషా శ్లిష్యతే ।**
**అక్షిస్థః పురుషస్స ఏష భగవానాత్మైవ తచ్చామృతం**
**బ్రహ్మైవాభయకం నిరఞ్జనమిదం కిం వా పునః కథ్యతామ్ ॥ 313**

భావ॥ బ్రహ్మవేత్తకు పాపపుణ్యములు తామరాకుమీద నీరులాగా – అంటవు. ఆయన స్థానమయిన కన్ను మీద పాలుగాని నీరుగాని పోసినా అంటవు. ఆయనయే అక్షి పురుషుడు. అభగవానుడే ఆత్మ. ఆయనయే అమృతము. అదే బ్రహ్మము. అదే అభయము. అభయమయిన ఆనందము. నిరంజనము. ఇంకేమి చెప్పవలెను? ఇక అసలు బ్రహ్మము గురించి ఏమి చెప్పగలము. అసంగోహ్యయం పురుషః. 313

**శ్లో॥ సంయద్వామమముం శుభైరధిగతం ధ్యాయన్ సమస్తంశుభం**
**వామన్యస్తు లభేత పుణ్యఫలదం సర్వాణి వామాని నా ।**
**భామన్యంతమముం సమస్తభువనే భాస్తం పరం వేద య-**
**స్సూర్యాద్యాత్మకమేష సర్వభువనే భాయాన్నితాన్తం నరః ॥ 314**

భావ॥ పురుషుని గుణ విశేష ధ్యానముల ఫలమిది. ఆ పురుషుని సంయద్వాముడందురు. అనగా సర్వ శుభ సంగమస్థానమని అర్థము. కనుక శుభనిలయమయిన ఆ సంయద్వాముని సేవించువాడు సమస్త శుభములను పొందును.

ఆయనను వామనిగా అనగా కర్మానుగుణముగా పుణ్యఫలములను భక్తులకిచ్చువాడు అని – ధ్యానించినచో పుణ్యఫలములను పొందును. "భామనీ" అని అనగా కాంతిదాయకుడని సూర్యచంద్రాది స్వరూపుడని, సమస్త భువనమునందు ఆయనయే వెలుగుచున్నాడని గ్రహించిన ఉపాసకుడు సర్వభువనమున గొప్పగా వెలుగొందును. 314

**శ్లో॥ ప్రేతస్యాస్య న సామ్పరాయకరణే తస్యాకృతౌ వా క్షతిః**
**ప్రేతోఽయం ప్రతిపద్యతే హ్యుభయథాప్యర్చిర్మయీం దేవతామ్ ।**
**పశ్చాదేత్యహరాశ్రయాం తదుపరి ప్రాప్నోతి శుక్లాశ్రయాం**
**పశ్చాద్యాత్యయముత్తరాయణమయీం సంవత్సరాఖ్యాం తతః ॥ 315**

**శ్లో॥ తస్మాత్సూర్యమయం ప్రయాతి చ తతశ్చన్ద్రం తతో విద్యుతం**
**తత్రస్థం తమమానవోఽథ పురుషో వేధఃపదాదాగతః ।**
**బ్రహ్మాణం గమయత్యతో న హి పరం గన్తవ్యమాస్తే పదం**
**సోఽయం బ్రహ్మపథశ్చ దేవపథ ఇత్యస్మాన్న చావర్తతే ॥ 316**

భావ॥ సగుణ బ్రహ్మవేత్త బ్రహ్మలోకమునకు చేరు విధానమిది. ఈ సగుణ బ్రహ్మ వేత్తకు మరణానంతరము వారి వారసులు పితృ కార్యములు చేసినను చేయకున్నను, ఈ వేత్త తప్పక అర్చిరాది మార్గమున అనగా దేవయానమున అహర్దేవతను, తరువాత శుక్ల పక్ష దేవతను, తరువాత ఉత్తరాయణమును, తరువాత సంవత్సర దేవతను, తరువాత సూర్యలోకమును, తరువాత చంద్రుని, తరువాత విద్యుత్తును చేరును. ఈ ప్రేతమును అచ్చట ఒక అమానవ పురుషుడు బ్రహ్మలోకమునుండి వచ్చి బ్రహ్మలోకమునకు తీసికొనివెళ్లును. అంతకన్న పరమస్థానము లేదు.

ఇది దేవయానము. దీనినుంచి ఇక పునరావృత్తి లేదు. ద్విపరార్ధావసానము తరువాత లోకపతి అయిన బ్రహ్మతో సహా వారికి ముక్తి. దీనికి బ్రహ్మపథమని పేరు. 315-316

విశే॥ 1. సాంపరాయం = పరలోక కృత్యం. దశదిన కర్మ మొదలయినవి.

2. చంద్రలోకము రెండు రకములు.

ఎ) పితృయాన క్రమములోనిది. మనకు కనబడే చంద్రమండలము.

బి) దేవయాన క్రమములోనిది. అది శాస్త్రసిద్ధమయినది. సూర్యలోకముకన్న ఆవలది.

3. "ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోర్జున" అని బ్రహ్మలోకం వఱకు పునరావృత్తి ఉన్నది. అదీ మాయామయమే గదా! కాని బ్రహ్మలోకం వెళ్లినవారు మాత్రం పునరావృత్తులు గారు. వారు బ్రహ్మోపదేశం వలన జ్ఞానులై బ్రహ్మతో సహా ముక్తి చెందెదరు. కనుక బ్రహ్మలోకం నశించి మరల పుట్టవచ్చు. మరో బ్రహ్మ రావచ్చు. కాని అప్పటి బ్రహ్మ, ఆయన లోకవాసులు ఆయనతో సహా ముక్తి చెందెదరు. ఇదెలాగంటే ద్యులోకం పునరావృత్తి గలదయినా ఇచ్చటి బ్రహ్మవేత్తకు పునరావృత్తిలేదు గదా! అందుకు హేతువు పునరావృత్తి కారణమయిన అజ్ఞానం బ్రహ్మజ్ఞానం ద్వారా నశించటమే.

కనుక ఇచ్చటి బ్రహ్మవేత్తలాగా బ్రహ్మలోకం చేరిన సగుణబ్రహ్మవేత్తగూడా బ్రహ్మవేత్త అయి ముక్తి చెందును. అయితే స్వర్గలోకాదిగతులు గూడా అచ్చట బ్రహ్మజ్ఞానము పొంది పునర్జన్మ లేకుండా ముక్తులు కావచ్చుననరాదు. ఆలోకములలో బ్రహ్మ సాక్షాత్కారం అసంభవము. (అవి కర్మఫలలోకాలు. వీనికి సగుణబ్రహ్మోపాసనగూడా లేదు గదా!) పైగా పుణ్యక్షయ భయంతో బాధపడతారు. **అందుకే శ్రుతి - భూలోకములోనే జ్ఞానం తెచ్చుకొనమని చెప్పినది.**

**"ఇహ చేదవేదీదథ సత్యమస్తి న చేదిహావేదీన్మహతీ వినష్టిః"**

కనుకనే మానవజన్మ ఉత్తమం అన్నారు. కనుక దేవభావాల కోసం, దేవభోగాల కోసం యజ్ఞాది కర్మలు చేయువాడు ద్విపాద పశువని అర్థము.

**శ్లో॥ వాక్చక్షుశ్ర్శుతిచేతసాం ప్రథమజః ప్రాణో వసిష్ఠో న వాక్**
**నాప్రాణో వచసా పరానభిభవేత్ ప్రాణః ప్రతిష్ఠా న దృక్ ।**
**నాప్రాణో విషమే ప్రతిష్ఠతి సమే సమ్పత్స న శ్రోత్రకం**
**నాప్రాణో నిగమం లభేత న కృతిం కుర్యాత్ఫలం న వ్రజేత్ ॥ 317**

భావ॥ ప్రాణము ఎంతోశ్రేష్ఠము. అది వాక్కు, నేత్రము, శ్రవణము, మనస్సు వీటికన్న ముందు పుట్టినది. ఇందులో ప్రాణమే వీటిని అన్నింటిని మించినది. ఇతరులను పరాభవించగలిగినది. వాక్కుకు స్వయంగా అంతటి శక్తి లేదు. ప్రాణము లేనివాడు ఇతరులను

వాక్కుతో పరాభవించలేడు. ప్రాణమే ప్రతిష్ఠ. నేత్రము ప్రతిష్ఠ కాదు. ప్రాణమున్నవాడు మాత్రమే సమ విషమ స్థలముల యందు, సాగలేడు - కర్ణము సంపద కాదు. ప్రాణము లేనివాడు కర్ణము నుపయోగించి వేదాదులను పొందలేడు. ఎట్టి పనిని చేయలేడు. ఎట్టి ఫలమును పొందలేడు. 317

విశే॥ వస్తే = ఆచ్ఛాదయతి = పరాన్ అభిభవతి = ప్రాణము లేనిదే ఇంద్రియ సంపద ఒక సంపద కాదు. వాటి ఫలములన్నియు ప్రాణాధీనములు. కనుక ప్రాణము శ్రేష్ఠము.

**శ్లో॥ ప్రాణో హ్యాయతనన్న హ్యన్న పురుషోఽ ప్రాణో రసాదీనయే-**
**ద్భోగాన్వాగ్దృశికర్ణహృద్భ్య ఇతి స ప్రాణో వరీయానయమ్ ।**
**మూకోఽన్ధో బధిరశ్శిశుశ్చ భువనే జీవన్ కరోతి క్రియా**
**అప్రాణో నహి జీవతి క్షితితలే నో చేష్టతే వా మనాక్ ॥ 318**

భావ॥ ప్రాణమే ఆయతనము. మనస్సు ఆయతనము కాదు. పురుషుడు మనస్సున్నా ప్రాణములు లేనిచో రూపరసాదులను అనుభవించలేడు. అందుకు ఇంద్రియములు పనిచేయవు. కనుక వాక్కు, నేత్ర, శ్రోత్ర మనస్సుల కన్నా ప్రాణమే గొప్పది. ప్రాణమున్న మూగవాడు, చెవిటివాడు, శిశువు గూడ తమతమ క్రియలను చేయగల్గుతాడు. ప్రాణములు లేనివాడు భూమిమీద జీవించడు కదా! కనీసం ఒక్క చేష్ట అయినా చేయలేడు. 318

విశే॥ కనుక ప్రాణమే శ్రేష్ఠము. అది జ్యేష్ఠమని ఇంతకు ముందు శ్లోకములో చెప్పబడినది. గర్భములో ఇంద్రియాదులకన్న ముందుగా ప్రాణమే ఉండును. దానివలననే గర్భము పెరుగును. నేత్రాది - అవయవస్థానాలు ఏర్పడిన తరువాతనే వాక్కు మొదలయినవి మొదలవుతాయి. కనుక ఈ ఏర్పాట్లన్నీ ప్రాణ ప్రకాశంలోనే జరుగుతాయి. కనుక ప్రాణము జ్యేష్ఠము. అందుచేతనే శ్రేష్ఠము.

**శ్లో॥ సర్వప్రాణిహృదన్తరస్థితిరయం ప్రాణోఽననామా క్షితా-**
**వత్త్యన్నం సకలం సురాసురనరశ్వాగాదయోఽ దన్తి యత్ ।**
**వస్తేఽయం వసనం జలం భజతి యః ప్రాణం వరీయా న్భవే**
**త్సర్వాన్నశ్చ కలా మిమాం యది వదేచ్ఛుష్కః ప్రరోహేత్తరుః ॥ 319**

భావ॥ ఈ ప్రాణము సర్వప్రాణుల హృదయమధ్యమున నిలిచి సర్వాన్నములను సురాసురనర శునక వృక్షాది చరాచరరూపములతో తినును. దీని పేరు "అనము" ఈ జీవులలోని ప్రాణమే అన్నమును కోరును. తినును. ఈ ప్రాణమే నీటిని తనకు ఆసరాగా ఆచ్ఛాదించికొనును. అందువలన ప్రాణము శ్రేష్ఠము. పెద్దది. ఇట్లు ప్రాణములనుపాసించువాడు గొప్పవాడు

సర్వాన్నములు గలవాడగును. **ఒక శుష్కవృక్షము వద్ద ఈ ప్రాణవిద్యనుపయోగించినచో ఆ తరువు మరల చిగురించును.** 319

**శ్లో॥ ద్యౌరగ్నిస్తరణిస్సమిద్ఘృణిగణో ధూమోఽహరర్చిశ్శశీ**
**త్వఙ్గారా ఉడవస్స్ఫులిఙ్గనికరాః శ్రద్ధామముష్మిన్హవిః ।**
**వహ్నౌ జుహ్వతి దేవతాస్తదుదితం సోమం ద్వితీయానిలే**
**పర్జన్యేఽనిలమేఘవిద్యుదశనిధ్వానైర్యుతే జుహ్వతి ॥ 320**

భావ॥ ఇక పంచాగ్ని విద్య విచారణ చేయబడును. ద్యులోకం అగ్ని, సూర్యుడు, సమిధ, కిరణములు పొగ అహస్సు జ్వాల చంద్రుడు నిప్పులు, నక్షత్రములు రవ్వలు ఇట్టి **ఒక అగ్నియందు** దేవతలు శ్రద్ధను హవిస్సుగా హోమము చేసెదరు. శ్రద్ధ అనగా అగ్నిహోత్రాహుతుల పరిణామ రూపమయిన సూక్ష్మ జలములే శ్రద్ధ. అందువలన పుట్టినవాడు సోముడను రాజు. అనిలము మేఘము, మెఱుపు, పిడుగు, ఉఱుములుగల **పర్జన్యరూపమయిన రెండవ అగ్నిలో** హోమము చేయుదురు. 320

విశే॥ అగ్ని మొదలగు దేవతలు యజమానుని ప్రాణములే. అనిలము = సమిధలు, మేఘము = ధూమము, మెఱుపు = జ్వాల, పిడుగు = నిప్పు, ఉఱుము = రవ్వలు. అనగా ద్యులోకం ప్రథమాగ్ని, పర్జన్యుడు ద్వితీయాగ్ని.

**శ్లో॥ వర్షస్తత్ర భవం తృతీయదహనే భూమౌ శరత్సక్షపా**
**కాష్ఠావాన్తరదిగ్యుతే దివిషదో జుహ్వత్యతో జాయతే ।**
**అన్నం తత్పురుషానలే చ వచనప్రాణాస్యచక్షుశ్శ్రవో-**
**యుక్తే జుహ్వతి దేవతాస్తత ఇదం వీర్యం పరం జాయతే ॥ 321**

భావ॥ ఈ పర్జన్యాగ్నియందు పుట్టిన వర్షమును **భూమి రూపమయిన తృతీయాగ్నియందు** హోమము చేసెదరు. ఈ అగ్నికి సమిధలు = సంవత్సరము, ధూమము = ఆకాశం, జ్వాల = రాత్రి, నిప్పు = దిక్కు, రవ్వలు = విదిక్కులు అనగా మూలలు. దేవతలు ఈ హోమము చేసెదరు. దీనినుండి "అన్నము" ఉద్భవించును. దీనిని **నాల్గవదయిన పురుషుడను అగ్నియందు** హోమము చేసెదరు. ఈ అగ్నికి సమిధలు = వాక్కు, ధూమం = ప్రాణము, జ్వాల = ముఖము (నోరు), నిప్పు = నేత్రము, రవ్వలు = చెవులు. ఈ అగ్నినుండి "వీర్యము" జన్మించును. ఇది చాల శ్రేష్ఠమయినది. సంతాన హేతువు గదా! 321

**శ్లో॥ యోషా ఽగ్నిస్తదుపస్థ ఏవ సమిధస్సమ్మన్త్రణన్త్వాచ్యతే**
**ధూమో యోనిరథార్చిరత్ర లగుడస్యాన్తః ప్రవేశః స్మృతః ।**

**అఙ్గారా ఇతి తద్భవాస్సుఖలవాస్తే విస్ఫులిఙ్గాశ్చ త-**
**ద్వహ్నౌ జుహ్వతి వీర్యమత్ర విబుధా గర్భస్తతో జాయతే ॥ 322**

భావ॥ పంచమమయిన అగ్ని స్త్రీ. ఆమె యోని సమిధలు, ముచ్చటలు సరససల్లాపములు ధూమము. ఉపస్థేంద్రియస్థానం జ్వాల, శిశ్న ప్రవేశము నిప్పు. అందలి సుఖలేశములు రవ్వలు. ఈ అగ్నియందు దేవతలు వీర్యమను హోమము చేయుదురు. దానివలన గర్భము ఏర్పడును. 322

**శ్లో॥ పఞ్చమ్యాన్తు రసాహుతావితి పరా ఆపః పుమాఖ్యా భవ-**
**న్త్యన్తః స్త్రీజఠరే స్థితస్స పురుషో గర్భో హి మాసా దశ ।**
**సూక్ష్మాద్యోనిబిలాచ్చిరేణ బత హా నిర్యాతి కృచ్ఛ్రాత్తతో-**
**యావత్కర్మసమాప్తి జీవతి తనుం ముఞ్చత్యథో జాయతే ॥ 323**

భావ॥ ఈ పంచమమయిన వీర్యాహుతిలో నీటికి (వీర్యమునకు) పురుషుడని పేరు. ఈ పురుషుడు శిరోబాహ్వాదులు గలవాడై గర్భ పిండముగా శిశువుగా స్త్రీ గర్భమునందు దశమమాసములుండును. చివరకు సూక్ష్మమయిన యోనిబిలము నుండి చాలాకాలమునకు కష్టము మీద బయట పడును. ఆ తరువాత కర్మఫల సమాప్తి వఱకు జీవించి శరీరమును విడిచి మఱల అట్లే పుట్టుచుండును. 323

విశే॥ ఈ జనన మరణ పరంపర అనివార్యము. జుగుప్సావహము. దుఃఖకరము కనుక **సంసార తరణం అత్యవసరమని వైరాగ్య వృద్ధికోసం ఈ వర్ణన.**

**శ్లో॥ యే ప్రాజ్ఞా విదురిత్థమేతదిహ తే యజ్ఞాదికర్మాఖిలం**
**గోత్రాపత్యగృహార్థసఞ్చయమపి త్యక్త్వా విరక్తిం గతాః ।**
**గత్వా కాననమత్ర సంవిదధతే శ్రద్ధా సమేతాస్తప-**
**స్తే సంయాన్తి పథోత్తరేణ పరమం హైరణ్యగర్భం పదమ్ ॥ 324**

భావ॥ ఈ విషయములను ఇలా అర్థం చేసికొన్న జ్ఞానులు ఈ యజ్ఞాది కర్మలను, గోత్ర, సంతాన, గృహాదికములను వదలి విరక్తులై అరణ్యములకేగి శ్రద్ధ గలవారై తపస్సు చేసి ఉత్తరమార్గము ద్వారా హిరణ్యగర్భలోకములను చేరెదరు. 324

**శ్లో॥ యే గ్రామ్యాః పశవో గృహస్థకపటా ద్వాభ్యాం పదాభ్యాం చరా**
**ఇష్టాపూర్తయుగఞ్చ దానమధికశ్రేయోధియోపాసతే ।**
**ధూమం యాన్తి హి తే తతోనిశమతః కృష్ణం తతో దాక్షిణాన్**
**షణ్మాసాన్పితృలోకమమ్బరమతశ్చన్ద్రం తతోఽన్నం బుధామ్ ॥ 325**

భావ॥ దక్షిణమార్గయాత్రికులు వీరు (ఇంతకుముందు ఉత్తరమార్గ యాత్రికులయిన సగుణోపాసకుల గూర్చి చెప్పబడినది). (బుధాం = దేవతలకు)

గృహస్థరూపంలో నున్న ద్విపాద గ్రామ్య పశువులు గొఱ్ఱె మేక వంటివారు. వీరు అధిక శ్రద్ధతో ఇష్టాపూర్తములను అనగా యజ్ఞాదులను, వాపీకూపతటాకాది సత్కార్యములను చేసెదరు. వీటిని అధికశ్రేయస్సు అనుకొనటం పశుత్వం. వీరిమార్గము ధూమయానము. అదే పితృయానము. దానినుంచి రాత్రిని. దానినుండి కృష్ణపక్షమును, దానినుండి దక్షిణాయనమును, దానినుండి పితృలోకమును, దానినుండి ఆకాశమును, దానినుండి చంద్రలోకమును చేరెదరు. అచ్చట వీరు దేవతలకు ఆహారమయిన చంద్రునితో బాటు ఆహారముగా అగుదురు. అనగా పశువులవలె దేవతాదాసులయి వారి భోగములకుపయోగపడెదరు. 325

**శ్లో॥ యావత్పుణ్యవినాశమిన్దుభవనే స్థిత్వాథ తే తత్పదా-**
**త్ప్రత్యావృత్త్య పునః ప్రయాన్తి గగనం తస్మాత్సమీరం తథా ।**
**వాయుత్వాదథ ధూమతాం తత ఇమే చాభ్రత్వమభ్రత్వతో**
**మేఘత్వం త్వథ వృష్టితామపి తతో వ్రీహ్యాదిభావమ్భువి ॥ 326**

భావ॥ వారు చంద్రలోకనివాస దాయకమయిన పుణ్యము క్షీణించినంతనే చంద్రలోకము నుండి మరలివస్తారు. వారు మరల భూలోకమున జన్మకు వచ్చు విధానమిది. చంద్రలోకమునుంచి ఆకాశమునకు, అచ్చటనుండి వాయువు, వాయువు నుంచి ధూమమునకు, ధూమమునుండి అభ్రత్వమునకు (అనగా నీరుకలిగి ఉండే స్థితి బహుశః ఆవిరిస్థితి) దానినుండి మేఘం దశకు అచ్చటనుంచి వర్షమునకు దిగి వర్షానంతరము వ్రీహి మొదలగు భక్షణయోగ్యమయిన ఓషధిరూపముగా భూమికి దిగెదరు. 326

విశే॥ 1. అభ్రం = నీరు పుట్టే 'ఆవిరి' దశ

2. పుణ్యాత్ముల శరీరములు చంద్రమండలమున శరీరరూపమయిన జలముగా శ్రద్ధారూపముగా ఉంటాయి. అవే పంచాగ్ని విద్యలో భూతసూక్ష్మములుగా ఉన్నవి. అవి పుణ్యక్షయము తరువాత లయమవుతాయి. అగ్ని తగిలితే నేయి కరిగినట్లుగా ఈ లయం జరుగుతుంది. ఇవి అంతరిక్షంలో ఆకాశంలాగా అయినట్లుంటాయి. వాయువులో ఉన్నపుడు వాయువులాగా – ఇలా ఆయా పదార్థాలలో వాటిలాగా కలిసి యుంటాయి.

**శ్లో॥ అన్నత్వన్తు తతో రసత్వమథ తే గర్భత్వమఙ్చ్యన్యథో**
**జాయన్తే మరణం ప్రయాన్తి చ పునర్విచ్ఛేద ఏతస్య నో ।**
**లోకేఽస్మిన్ శుభకర్మభిస్తు విహితం యోనిం శుభాం యాన్తి తే**
**బ్రహ్మక్షత్రియవైశ్యతామశుభకృచ్ఛ్వా సూకరోవాఽన్త్యజః ॥ 327**

భావ॥ వ్రీహి దశనుండి అన్నముగాను, అనగా వీర్యముగాను, తరువాత గర్భముగాను,

తరువాత శిశువుగాను జన్మించెదరు. తరువాత జీవితకాలం పూర్తి అయిన తరువాత మరణించెదరు. ఈ జనన మరణ చక్రానికి విచ్ఛేదం లేదు. ఈ లోకమున శుభకర్మ చేసినవారికి శుభవంశజన్మవచ్చును. బ్రహ్మక్షత్రియాది జన్మలు వచ్చును. శుభకర్మలు చేయని వారికి చండాలాది జన్మలు వచ్చును. 327

విశే॥ 1. ఏ పదార్థమునందున్నను ఆ పదార్థరూపంగా నున్నట్లు ఈ జీవులుంటారు. కనుక కేవలం వీర్యమో శోణితమో కేవలం ద్రవమో గర్భకారణం కాదు. **కర్మఫలంగా పుట్టవలసిన జీవులు గర్భకారణము.**

2. కనుక కేవలం ఈ జలమునకు రేతో యోని సంబంధం దుర్లభం. ఎందుకంటే, జితేంద్రియ, బాల, నపుంసక, పరివ్రాజకాదులవలన వీటికి ప్రయోజనము లేదు. జన్మకు రాలేదు.

3. అనంతకర్మలు అనంతఫలాలు. అనంత జన్మ సంపాదనలు. ఏ కర్మఫలం అంకురిస్తుందో దానికోసం సముచితమయిన జన్మలు లభించును. అదయిపోతే మరోకర్మ ఫలదానం కోసం బయలుదేరుతుంది. కనుక ఒకకర్మతో చంద్రలోకం చేరుతాము. తదనంతరము దిగి వస్తాము. దిగివచ్చే కర్మ మంచిదయితే మంచిజన్మ. చెడ్డదయితే చెడ్డజన్మ. ఈ మిగులు కర్మకు కర్మాశయమని కర్మశేషమని పేరు. ఇట్టి జీవుడు కర్మాశయి, కర్మశేషి అగును.

**శ్లో॥ ఏకేనాప్యనయోః పథాఽయతి న యస్స క్షుద్రజన్తుర్భవన్**
**శశ్వజ్జన్మమృతీ ప్రయాతి తదిదం స్థానం తృతీయం మతమ్ ।**
**ఏతద్యాన్తి పదం యతో భువి జనాః ప్రాయేణ సర్వే తతో**
**లోకోఽసౌ నహి పూర్యతే సుకృతినో లోక్యా నరో దుర్లభాః ॥ 328**

భావ॥ ఈ శుక్ల కృష్ణ మార్గములు అనగా దేవయాన పితృయానములు అనగా అర్చిరాది యాన ధూమయానములు రెండు సగుణ జ్ఞానులకు యోగులకు కర్మఠులకు సంబంధించినవి. ఈ రెండు మార్గములకు యోగ్యత లేక “జాయస్వ మ్రియస్వ” అని పుట్టిచచ్చు వారిది మూడవ మార్గము. తృతీయః పంథాః. ఇట్టి వాడు క్షుద్రజంతువు. చాలవఱకు ఎక్కువమంది జనము ఈ మార్గముననే ప్రయాణం చేస్తారు. కనుక చంద్రమార్గము గూడా పలచన. అందువలన చంద్రలోకమే జీవులతో నిండదు. ఇక బ్రహ్మలోకము అర్చిరాది మార్గము సంగతి ఏమి చెప్పవలయును. సుకృతవంతులయిన జనులు దుర్లభులు కదా! 328

విశే॥ 1. యజ్ఞ, ఇష్టాపూర్తాది కర్మలు చేసే సంసారి పునరావృత్తి పొందును. ధూమమార్గము లోకము చంద్రలోకము. నాస్తికులు కర్మాచరణ లేనివారు ఈ రెండు మార్గములకు చెందరు. వారిది క్షుద్ర జంతుమార్గము. “జాయస్వ మ్రియస్వ” – ఇత్యేష తృతీయః పంథాః

జ్ఞానం శ్రద్ధ తపస్సుగల సన్న్యాసులు, గృహస్థులు దేవయానమార్గమున బ్రహ్మలోకము చేరుదురు. జీవన్ముక్తులకు మార్గమే లేదు. వారున్నచోటనే బ్రహ్మత్వం చెందుతారు. కేవలం సన్న్యాసం చాలదు.

2. శుక్ల కృష్ణే గతీ హ్యేతే జగతశ్శాశ్వతే మతే, ఏకయాయాత్యనా వృత్తి మన్యయా వర్తతే పునః" - గీత.

ఇవి యోగ కర్మమార్గాలు. ఇదిలేనివారిది తృతీయమార్గము. గీత ఈ విషయాన్ని చెప్పలేదు. అంతేగాని నిషేధించలేదు. "జాయస్వ మ్రియస్వేత్యేష తృతీయః పంథాః" - అని ఛాందోగ్యం చెప్పింది కదా!

**శ్లో॥ బ్రహ్మస్వర్ణహరస్సురాపముఖజస్తల్పం గురోరావసన్**
**బ్రహ్మఘ్నస్సహగశ్చ పఞ్చ పతితా యామ్యం పదం యాన్తి తే ।**
**యః పఞ్చాగ్నివిదేష తైస్సహచరన్నప్యేనసా లిప్యతే**
**నైవాయం పరిశుద్ధ ఏష్యతి నరో లోకాన్పవిత్రానపి ॥ 329**

భావ॥ బ్రాహ్మణుని స్వర్ణమును హరించినవాడు, సుర త్రాగు బ్రాహ్మణుడు, గురుతల్పగతుడగువాడు, బ్రహ్మహత్య చేయువాడు వీరితో గాఢానుబంధము గల సహచరుడు ఈ ఐదుగురు పతితులు. వీరు తప్పక యమదండన పొందెదరు. కాని పంచాగ్ని విద్యావేత్త అయిన ఉపాసకుడు వీరితో గాఢానుబంధము గలవాడయినను పతితుడు గాడు. పాపము అంటదు. ఇతడు పరిశుద్ధుడే. పవిత్రలోకములకు చేరును. 329

విశే॥ 1. బ్రాహ్మణ సువర్ణహారి మాత్రమే యీ పంచపాతకులలో వాడు. క్షత్రియాది సువర్ణాపహారికాడు. అలాగే బ్రాహ్మణ ధాన్యాదిహారిగూడా యీ పంచపాతకులలో చేరడు.

2. సురాపానం చేసిన బ్రాహ్మణుడే పంచపాతకులలో ఒకడు. క్షత్రియాదులు కారు.

3. సహచరుడయిన వాడు పతితుడయితే వానిసహచరుడు మరల వాని సహచరుడు ఇలా అందరూ పతితులవుతారా? - సమా - కారు. ఎవనికి గాఢమయిన సాహచర్యం ఉంటుందో నేరుగా చిరకాలం ఉంటుందో వాడు పతితుడు. అల్పకాల సంసర్గం దోషం కాదు. **అందువలననే "కలియుగములో సంసర్గదోషము లేద"ని ధర్మశాస్త్రవేత్తలు.**

**శ్లో॥ ద్యౌర్మూర్ధాఽక్షి తు చిత్రభానురనిలః ప్రాణోఽమ్బరం మధ్యమః**
**కాయో వస్తిరథామ్బు భూతలమిదం పాదావురో వేదికా ।**
**బర్హిర్లోమగణశ్చ యస్య హృదయం సద్గార్హపత్యానల-**
**శ్చిత్తం దక్షిణవహ్నిరాస్యమనఘో హోమాగ్నిరిత్యుచ్యతే ॥ 330**

**శ్లో॥ యో లోకేషు జనేషు చాత్మసు తథా సర్వేషు విద్యోతతే**
**యస్సర్వాదనమత్తి తం పరతమం ప్రాదేశమాత్రం విభుమ్ ।**
**ఆత్మానం హృదయే లసన్తమహమిత్యేకం చ వైశ్వానరం**
**సోఽహం బ్రహ్మ ధియా విచిన్తయతి యస్సస్యాత్కృతార్థః పుమాన్ ॥331**

భావ॥ వైశ్వానరుని బ్రహ్మముగా ఉపాసించు విధానమిది. ఈ చెప్పబోవు అవయవములు ఉపాసకునివి లేదా ప్రాణులవి. వీటితో సర్వ విశ్వస్వరూపుడయిన వైశ్వానరుని అవయవాలను వర్ణిస్తున్నాము. వైశ్వానరునికి ద్యులోకం శిరస్సు, సూర్యుడు కన్ను, వాయువు ప్రాణము, ఆకాశము మధ్య శరీరము, నీరు వస్తి, భూమి పాదములు, వేదిక, అగ్ని వక్షస్సు(చాతి), దర్భలు రోమములు, గార్హపత్యాగ్ని హృదయము, దక్షిణాగ్ని చిత్తము, ఆహవనీయాగ్ని ముఖము.

ఈ వైశ్వానరుడు లోకములందు జనులందు, ఆత్మలయందు ప్రకాశించును. ఈతడు సర్వరూపములలో సర్వాన్నములను జఠరాగ్ని రూపమున భక్షించును. అట్టి యీ ప్రభువు పరతముడు, ప్రాదేశమాత్రుడు, హృదయస్థితుడు, ఆత్మ రూపుడు, వైశ్వానరుడు ఏకమని ఆయన తానేనని బ్రహ్మబుద్ధితో భావించు పురుషుడు కృతార్థుడగును. 330-331

విశే॥ 1. ఆత్మలు = ఇంద్రియాదులు, మనస్సులు

2. ప్రాదేశం = ద్యు - మూర్ధ, పృథివీ - పాదం దాకా ఉన్న ప్రదేశముతో మాత్రః = తెలిసికొనబడువాడు.

3. ప్రాదేశ = ప్రకర్షగా శాస్త్రంలో చెప్పబడిన ద్యులోకాది పరిమాణములు గలవాడు.

4. ముఖాది - ఇంద్రియములందు అకర్తగా తెలియబడువాడు.

5. విశ్వాన్ నరాన్ - సమస్త నరులను, నయతి - పుణ్యపాపానురూపముగా నడుపువాడు.

6. నరీయతే - నక్షరతి - నశించని ఆత్మ రూపుడు - నరుడు. కాగా విశ్వాత్ముడు, నరుడు అయినవాడు.

7. అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః - అని జఠరాగ్ని రూపంగా సర్వాన్న భక్షకుడు.

**శ్లో॥ ఏతస్మిన్ జఠరస్థితే హుతవహే వైశ్వానరేఽన్నాహుతీః**
**పఞ్చప్రాణమయీర్జుహోతి కుశలస్తృప్యన్తి హోమాత్తతః ।**
**ప్రాణాః పఞ్చ రవీన్దువహ్నిజలభృద్వాతాశ్చ దృక్ఛ్రోత్రవా-**
**క్చిత్తత్వగ్ద్యుదిశాధరాక్షణరుచివ్యోమాని తత్స్థా జనాః ॥ 332**

భావ॥ సర్వాత్మ ప్రత్యగాత్మ పరమాత్మ అయిన వైశ్వానరుడు. జఠరాగ్ని రూపంగా

శరీరములందున్నాడు. అట్టి జఠరాగ్ని రూప వైశ్వానరునియందు, పంచప్రాణమయమయిన అన్నాహుతులను విద్వాంసుడు హోమము చేయును. అదే కర్మఠుడు బాహ్య హోమాగ్నియందు ఇంద్రాయ స్వాహా - మొదలయిన స్వాహాకారములతో అన్నాది హోమంచేస్తాడు. ప్రాణాహుతుల వలన పంచప్రాణములు తృప్తి చెందును. వీటికి అధిదేవతలయిన సూర్యచంద్రాగ్ని మేఘ వాయువులు తృప్తి చెందెదరు. ప్రాణాదుల కధిష్ఠానములయిన నేత్రశ్రోత్ర వాక్, చిత్త చర్మ పంచకము తృప్తి చెందును. సూర్యాదులకధిష్ఠానమయిన ద్యులోకము దిక్కులు, భూమి, విద్యుత్తు ఆకాశములున్ను అందలి జనులున్ను తృప్తి చెందెదరు. 332

విశే॥ 1. జఠర వైశ్వానరునికి అన్న హోమం. అందులో ప్రాణములే అన్నం వలన బ్రతుకుతాయి కనుక అవే అన్నభోక్తలు. జ్ఞానిచేసే ఇటువంటిహోమం వలన శ్లోకోక్త దేవతలు లోకాలు, ఆ లోకాల ప్రజలు సంతృప్తి చెందుతారు.

2. సర్వజగత్తు పరమేశ్వరుడే. కనుక ఈ హోమఫలం పరమేశ్వర తృప్తి. పరమేశ్వర ప్రీతి కోసమే అన్ని కర్మలు. ఆయన ప్రీతివలన జ్ఞానాదులు కలుగుతాయి.

3. ప్రాణాహుతులవరకే ఈ హోమ భావనయా? సర్వ-అన్న భోజనము అంతేనా? మొదటిదయితే ప్రాణతృప్తికి చాలదు. రెండవదయితే దానికి స్వాహామంత్రోచ్చారణ లేదు కనుక అది హోమం అనటానికి కుదరదు. - సమా - హోమావశిష్ట మయిన ద్రవ్యంగా మిగిలిన భోజనాన్ని భావించవచ్చును. అందువలన మొదటిది హోమం. మిగిలినది హోమావశిష్ట పురోడాశ ప్రసాదం వంటిది.

4. ఇతరులకు భోజన భావనయే తప్ప జఠర వైశ్వానరాగ్ని హోమమన్న భావన ఉండదు గనుక వారి భోజనం హోమం కాదు. క్రియ అదే అయినా జ్ఞానంతో చేయటం వలన అతిశయం వస్తుంది. “తదేవ వీర్యవత్తమం భవతి” అందువలననే ఉపనయనం నుంచి ఈ ప్రాణాహుతులు చెప్పబడినవి. అయితే అంధపరంపరగా ఎటువంటి భావన లేకుండా చేయటం జరుగుతుంది.

**శ్లో॥ యోఽ జానన్ జుహుయాదిమాం పరకలాం బాహ్యాగ్నిహోత్రం స నా**
**భస్మన్యేవ జుహోతి యస్తు విబుధస్సర్వేషు చాత్మస్వయమ్ ।**
**దీప్తాగ్నౌ నిహితం వ తూలమఘమస్యాయాతి నాశం ద్రుతం**
**స్వాత్మన్యేవ హుతం భవేచ్చ విదుషోచ్ఛిష్టం చ దత్తం వునే ॥ 333**

భావ॥ ఈ ప్రాణాగ్నిహోత్ర విద్య తెలియకుండా చేసే బాహ్య హోమం భస్మ హోమం వలె వ్యర్థమవుతుంది. వైశ్వానరవిద్య తెలిసి ప్రాణాగ్నిహోత్రమునందు అన్నహోమభావనతో భోజన క్రియ నిర్వర్తించు జ్ఞాని సర్వభూతములకు తృప్తిని కలిగించును. అతనియొక్క పాపము దూది పింజవలె తత్క్షణమే భస్మమయి పోవును. ఇట్టి విద్వాంసుడు శునకమునకు ఎంగిలి

అన్నము పెట్టినా ఆత్మయందు అన్నహోమము చేసినట్లే అగును. ఎందుకంటే శునకమునందును ఉన్నది తన దేహమునందున్నది ఒకే వైశ్వానరాత్మ – కనుక ఎంగిలి పెట్టటం అజ్ఞానికి పాపము. కాని జ్ఞానికి అదీ పాపము కాదు. 333

**శ్లో॥ క్షుద్బాధోపహతా యథా చ శిశవో ధాత్రీమిహోపాసతే**
**మాతా నోఽన్నమియం ప్రయచ్ఛతి కదేత్యేవం సమస్తం జగత్ ।**
**విద్వానేష కదా ను భోక్ష్యత ఇతి ప్రాజ్ఞస్య భుక్తిం స్వయం**
**చాన్నాదం సముపాస్త ఏవ సకలం తృప్యేద్ధి భుక్తే బుధే ॥ 334**

భావ॥ ఆకలిబాధతో నున్న శిశువులు తమ దాది లేదా తల్లి ఎపుడు ఆహారమునిచ్చునా? అని ఎలా ఎదురుచూచునో, అలా ఈ జ్ఞాని ఎపుడు భోజనము చేయునా అని యీ ప్రాజ్ఞుని భోజనమునకై నిత్యము ఎదురు చూచును. అన్నాదమయిన ప్రపంచమంతయు ఈ అన్నాదుని కోసము ఎదురు చూచును. ఎందుకంటే జ్ఞాని భుజించినచో సకల ప్రపంచము తృప్తి చెందును గదా!

బాహ్యాగ్నిహోత్రహోమం హోత అయిన యజమానునికే ఫలం. ఈ వైశ్వానర విద్యా హోమం అంతర్యామి అయిన ఆత్మద్వారా సర్వమును సంతృప్తి పఱచును. అందువలననే కృష్ణుడు ద్రౌపది వద్ద ఒక్క మెతుకు తిని దుర్వాసాదుల ఆకలిని తొలగించెను. వైశ్వానర విద్య పూర్తి. 334

**శ్లో॥ యస్య జ్ఞానవశాద్భవేదధిగతం సర్వం యదప్యశ్రుతం**
**యచ్చాదృష్టమతర్కితఞ్చ మనసా జ్ఞేయన్తదేకన్తు సత్ ।**
**మృద్వస్తుప్రతిబోధతో హి సకలం మృత్కార్యమాజ్ఞాయతే**
**వాగాలమ్బనమేవ నామ వికృతిర్మృత్త్యేవ సత్యా తు మృత్ ॥ 335**

భావ॥ అఖండ అద్వితీయమయిన "సత్" పదార్థం ఒకటి ఉన్నది. అది తెలిసినచో సర్వం తెలిసినట్లే. ఇంతకుముందెన్నడూ విననిది కననిది ఊహించనిదిగూడా మనకు తెలిసినదవుతుంది. ఎలాగంటే 'మట్టి' అను ఒక మూలవస్తువు తెలిసిన క్షణమున మట్టికి సంబంధించిన అన్ని వస్తువులు మనకు తత్త్వరీత్యా అర్థమవుతాయి. ఇకపైకి కనబడే చట్టి, పిడత, కుండ, ముంత మొదలగు వికారములన్నియు కేవలం వాఙ్మాత్రమే తప్ప అంతా కల్పితమే. సత్యం మాత్రం మట్టియే. అట్లే అఖండ బ్రహ్మ పదార్థమే సర్వం. దానియందు మనకు కనబడు ఈ వికారములన్ని కల్పితములే. 335

విశే॥ 1. ఇన్నిరకాల విద్యలు నేర్వటం కన్న బ్రహ్మవిద్య ఒక్కటి చాలు. అది అబ్బితే సర్వవిద్యలు కరతలామలకమే. అందుకే ఈ గ్రంథము. వైశ్వానర విద్య బ్రహ్మవిద్యయే కాని

ఇది సగుణ బ్రహ్మ విద్య. నిర్గుణ బ్రహ్మవిద్య కాదు. దీనికి అది సోపానము. అందుకని ముందు సగుణం తరువాత నిర్గుణం వస్తున్నాయి.

మరియు బ్రహ్మం రెండు రకాలు. 1. ధ్యేయం 2. జ్ఞేయం

ఇందులో సగుణం ధ్యేయం. నిర్గుణం జ్ఞేయం. అదీ తేడా. బ్రహ్మం తెలిస్తే సర్వం తెలుస్తుంది.

2. ఏకవస్తుజ్ఞానం వలన సర్వవస్తుజ్ఞానం కలుగుతుంది. వాస్తవంగా ఘటాది పదార్థం లేదు. అది నామమాత్రమే. ఉన్నది ఉపాదానమయిన మట్టి మాత్రమే. కనుక వికారములన్నియు మూలమునందు కల్పితం మిథ్య. ఏది లేకపోతే ఏదిలేదో అది మిథ్య. ఏదిలేకపోయినా ఏది ఉన్నదో అది సత్యం. రజ్జువు లేనిదే సర్పంలేదు. కనుక సర్పం మిథ్య. సర్పం లేకున్నా రజ్జువున్నది. కనుక రజ్జువు సత్యం. అట్లే మట్టి లేనిదే ఘటం ఉండదు. ఘటం మిథ్య. ఘటం లేకున్నా మట్టి ఉంటుంది - మట్టి సత్యం.

**శ్లో॥ స్వర్ణస్య ప్రతిబోధనేన సకలం కేయూరహారాదికం**
**సౌవర్ణం విదితం భవేద్ధి వికృతం మిథ్యైవ తద్ధేమ సత్ ।**
**విజ్ఞానాదసితాయసశ్చ సకలం కార్ష్ణాయసం వైకృతం**
**విజ్ఞాతం హి భవేచ్చ తత్ర వికృతం మిథ్యైవ సత్యస్త్వయః ॥ 336**

భావ॥ బంగారం తెలిస్తే చాలు. దానితో తయారయిన కేయూర హారాదులు తెలుస్తాయి. అది బంగారు వికారమే తప్ప క్రొత్త వస్తువు కాదు. బంగారం మీద ఏర్పడిన కల్పిత వికారము మిథ్య. బంగారం మాత్రమే సత్. ఉక్కు ఇనుము తెలిస్తే ఆలోహ సంబంధవస్తువులన్నియు తెలిస్తాయి. అవి లోహ వికారములని లోహమునందు కల్పితములని మిథ్యలని, ఇనుము లేదా ఉక్కు సత్యమని తెలుస్తుంది. సూదులు కత్తులు మిథ్యలని తాత్త్వికంగా లోహమని తెలుస్తుంది. కనుక దేనివలన అన్ని తెలుస్తాయో అది ఆ అన్నింటికి తత్త్వం. అదే జ్ఞేయం. అదే సత్యం. 336

**శ్లో॥ జ్ఞానాత్కారణవస్తునో హి నిఖిలం కార్యం పరిజ్ఞాయతే**
**నామాకారమయన్తు కార్యమనృతం పూర్వోత్తరాఽ సత్త్వతః ।**
**సత్యం కారణమేకమేవ భవనాత్కాలత్రయేఽపి ధ్రువం**
**తస్మాద్బ్రహ్మ సదేకమేవ సకలం మిథ్యైవ తత్సమ్భవమ్ ॥ 337**

భావ॥ కారణ వస్తువు యొక్క జ్ఞానం వలన దానియొక్క సమస్త కార్యము తెలుస్తుంది. నామాకారమయమయిన ఘటాది కార్యము మట్టి మొదలగు కారణ పదార్థముల దృష్ట్యా కల్పితములు మిథ్యలు. ఎందుకంటే అవి పుట్టకముందు లేవు. పగిలిన తరువాత లేనివే. కనుక పూర్వోత్తర కాలములందు లేని యీ నామరూపవికారములు మిథ్యలే. కాలత్రయమునందు

నిలిచియుండుట వలన కారణపదార్థం ఒకటే సత్యము. శాశ్వతము. కనుక "బ్రహ్మం" ఒక్కటే సత్తు. ఏకము. దానినుంచి వచ్చినట్లు కనబడుచున్న సమస్తము మిథ్యయే. 337

విశే॥ 1. రజ్జు సర్ప భ్రమలో సర్పభ్రమకు ఉత్పత్తికి ముందు భ్రమనాశం తరువాత సర్పం ఉండదు. రజ్జువే ఉంటుంది. కనుక సర్పం అసత్యం. అయితే, ఘటకాలంలో సర్పకాలంలో ఘటసర్పాలుంటాయి. ఆ సమయంలో "మట్టి రజ్జువు" ఉండవు కదా! కనుక కారణం గూడా కార్యకాలంలో కనబడదు. కనుక అది ఎలా సత్యం? పూర్వోత్తర కాలాలలో ఉండనివి మిథ్య అయితే వర్తమానంలో ఉండనిది గూడా మిథ్యకాదా? – సమా – **ఆద్యంతములలో లేని వస్తువు మధ్యలో కనబడినా అది లేనట్లే. ఆద్యంతములందున్నది మధ్యకాలములో లేకపోయినా ఉన్నట్లే.** కనుక కాలత్రయములోనూ కారణం ఉంటుంది. కాలత్రయములోనూ కార్యం లేనట్లే.

2. భ్రమకాలంలో సర్పం, రజతం, కనబడినా భ్రాంతి తరువాత అవి అచ్చట వాస్తవంగా లేవని తెలుస్తూనే ఉన్నది. కనుక మధ్యకాలంలో కనబడినంతమాత్రాన సత్యం కాదు. అట్లే ఘటకాలంలోనయినా మట్టి సత్యం. ఘటం భ్రమ. మిథ్య. ఎందుకంటే కనబడుతున్నది మట్టి మాత్రమే. మట్టికన్న భిన్నమయిన వస్తువు లేదు. కంబుగ్రీవాది ఆకారముగలది మట్టియేగాని ఘటము కాదు. ఆ ఆకారం తరువాతనే అది 'ఘటము'. కనుక ఘటకాలములోనయినా ఘటం భ్రాంతియే. ఉన్నది కల్పితాకారంగల మట్టియే. దానినే ఘటం అంటాము. కనుక వాగాలంబనమయిన నామము మాత్రమే అన్నారు. అలాగే నామరూపాత్మకం ఘటం. కాని ఆ నామరూపాలు సర్పరజతనామరూపాలలాగా కల్పితములు. అధిష్ఠానభిన్నముగా కల్పితము ఎపుడూ ఉండదు. అట్లే గుణములు గుణికన్న భిన్నంగా ఉండవు. కనుక నామరూపములను గుణములు మట్టి అను ద్రవ్యమునాశ్రయించి యుంటాయి. కనుక మట్టియే సత్తు. నీలఘటం వద్దగూడా ఘటం లేని నీలం కనబడదు. రూపసహిత ద్రవ్యమే కనబడుతుంది. స్పర్శకు ద్రవ్యమే తెలుస్తుంది కాని రూపం అందదు గదా! అంటారా? – మంచిదే. గుణి లేకుండా గుణం తెలియదు గాని గుణం లేకుండా గుణి తెలుస్తుంది. కనుక ద్రవ్యంకన్న విడిగా రూపం దొరకదు. ద్రవ్యం సత్యము. రూపము మిథ్య అంటారు. కారణం ఇదే. ఏది లేనిదే ఏదిదొరకదో ఆ దొరకనిది మిథ్య. ద్రవ్యం లేనిదే దాని గుణం దొరకదు. కనుక గుణం మిథ్య.

3. ద్రవ్యభిన్నంగా నామం ఉన్నది గదా! అది శబ్దాత్మకం. చెవికి వినబడుతుంది. కాని ద్రవ్యం వినబడదు గదా! – వాచ్యంగా ద్రవ్యమూ తెలుస్తుంది. లేదంటే వాచకం నిర్విషయంగా ఉండదు కనుక. లేదా;

ఆకారాది అక్షరాలు లేకుండా నామములుండవు. ధ్వనిలేకుండా లక్షణాలుండవు. ధ్వని ఆకాశగుణము. కనుక ద్రవ్యమయిన ఆకాశముకన్న విడిగా 'నామం' అను శబ్దము లేదు. ఆ ఆకాశం గూడా తన కారణంకన్న విడిగా లేదు గనుక అదీ మిథ్యయే.

లేదా, వర్తమానకాలములో అనగా మధ్యకాలములో కార్యమయిన ఘటాదికముండుగాక! అంతమాత్రంతో అది సత్యం కాదు. ఎందుకంటే పూర్వోత్తరకాలములందు లేనిదేదయినా 'మిథ్య' అని గదా శాస్త్రము. సత్యం అంటే త్రికాలాలలోనూ ఉండేదే. కారణం మాత్రం కార్యమయిన ఘటాదికాలంలోనూ ఉంటుంది గనుక అది సత్యమే. 'పట। కాలములో దారములు, ఘటకాలములో మట్టి ఉన్నవి కదా!

కనుక కారణం త్రికాల స్థాయి - కార్యం వర్తమానకాలమాత్ర స్థాయి - వర్తమానకాలంలో గూడా దానికి కారణభిన్నంగా అస్తిత్వం లేదు. కనుక,

కారణం సత్యం - కార్యం - మిథ్య

బంగారం సత్యం - హారకేయూరాదులు మిథ్య

మట్టి సత్యం - కుండలు పిడతలు మిథ్య

ఇనుము సత్యం - కత్తి మొదలగునవి మిథ్య

4. ఈ మట్టి మొదలయినవిగూడా తమ మూల కారణం దృష్ట్యా మిథ్యలు. తమ కార్యం దృష్ట్యా సత్యములు. కారణం అయిన జలం దృష్ట్యా పృథివి మిథ్య గదా! అలా బ్రహ్మం దృష్ట్యా ప్రపంచం అంతా మిథ్య. కనుక కారణం సత్యం. కార్యం మిథ్య - అన్నదే సిద్ధాంతము.

5. మిథ్య అయితే ఎలా గోచరిస్తున్నాయి. సమా - మిథ్య అంటే కుందేటికొమ్ము లాగా అసలు లేనిది కాదు. ఉన్నట్లు కనబడేది. కాని తత్త్వరీత్యా వాస్తవంగా ఉండదు. కనుక ఉన్నదని లేదని చెప్ప వీలు లేనిది. అనిర్వచనీయము. గోచరిస్తున్నది కనుక "సత్" కారణ భిన్నంగా లేదు గనుక "అసత్" కనుక మిథ్య. కారణం కార్యభిన్నంగా కనబడుతుంది. కాని కార్యం కారణ భిన్నంగా కనబడదు. రజ్జు సర్పం. (ఇక్కడ చెప్పే కారణపదానికి అర్థం ఉపాదాన కారణం. నిమిత్తకారణం కాదు) (ఇదంతా వ్యవహారంలో సంగతి. బ్రహ్మందృష్ట్యా అంతా మిథ్యయే.)

6. కారణం సత్యం కనుక కార్యం మిథ్య కనుక బ్రహ్మమొక్కటే సత్యం సత్తు కనుక జ్ఞేయం. బ్రహ్మ కార్యమయిన సకల జగత్తు మిథ్యయే. ఉదా॥ రజ్జువు సత్యం సర్పం మిథ్య.

7. అర్థక్రియాకారులయినవి సత్యం. అలా కానివి అసత్యం. రజ్జువు సత్యం. సర్పం మిథ్య. మామూలుగా ఘటం సత్యం. అది పనులకుపయోగిస్తుంది గదా! అలాగే ప్రపంచం అర్థక్రియాకారిగా ఉన్నది కదా! మిథ్య ఎలా అవుతుంది? సమా - అర్థక్రియాకారి అయినదల్లా సత్యం అనటం తప్పు. స్వప్నంలో స్వప్నదృశ్యములు అర్థక్రియాకారులు. స్వప్నకాంతతో స్వప్నంలో సరసం సాధ్యమే. స్వప్న సర్పం స్వప్నంలో కరవటం సాధ్యమే. దొంగనోట్లతో పనులు జరగటం సాధ్యమే. అంతమాత్రాన ఇవన్నియు సత్యములు కావు.

అయితే రజ్జుసర్పము లాగా వల్మీకసర్పము గూడా మిథ్య అయితే ఇక లోకంలో సత్య – అసత్య వ్యవహారం ఎలా సాధ్యపడుతుంది? స్థిరమయినది సత్యము అస్థిరమయినది అసత్యము.

రజ్జు సర్పం దీపంతో చూస్తే అసత్యం. వల్మీక సర్పం సత్యం. స్వప్న ప్రపంచం జాగరణంతో పోతుంది. జాగరణ ప్రపంచం పోదు. కనుక సత్యం.

8. సరే! కాని జాగ్రత్ ప్రపంచం బ్రహ్మజ్ఞానంతో నశించటం లేదుగదా! మరి దానిని మిథ్య అని ఎలా అనటం? (అది కాలంతో ప్రలయం వలన గదా నశిస్తుంది).

సమా – జాగరణ ప్రపంచం కనబడేటపుడు స్వప్నప్రపంచం తొలగుతుంది. రజ్జుజ్ఞాన దశలో భ్రాంతి సర్పము కనబడదు. అలాగే బ్రహ్మసాక్షాత్కార దశలో జాగరణప్రపంచం కనబడదు. చూడండి. "యత్ర త్వస్య సర్వ మాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్" జగత్తు బ్రహ్మమునందు అవిద్యా కల్పితం కనుక అవిద్యను విద్య తొలగించిన తర్వాత ప్రపంచం బ్రహ్మభిన్నంగా కనబడదు. కనుక కారణమయిన బ్రహ్మమొక్కటే, అది సత్యం. కార్యమయిన జగత్తు మిథ్యయే.

9. బ్రహ్మమే సర్వకారణము. దానికి మరొక కారణం లేదు. ఉందంటే మరలా దానికొక కారణం ఇలా అనవస్థ. కనుక అజమయిన అనగా కారణ రహితమయిన బ్రహ్మం ఒకటే సర్వకారణము సత్యము.

10. బ్రహ్మంతోబాటు ప్రకృతిపురుషులు (చిత్ అచిత్) ఉన్నారు గదా! బ్రహ్మమొక్కటే ఎలా అవుతుంది? – ప్రకృతి పురుషులు అనాదులు కనుక బ్రహ్మకార్యములనటం కుదరదు. చూడండి.

"ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి " – గీత

"అజామేకాం–" శ్రుతి, "అజోనిత్యః – " స్మృతి.

కనుక ముగ్గురూ కారణమే – సమా – కాదు. **బ్రహ్మం శరీరంలో వ్యాపించటం వలన పురుషుడంటాము.** ఘటంలో ఉన్న ఆకాశమును ఘటాకాశం అంటాము గదా! ప్రకృతి లేదా ప్రధానము ఈశ్వర శక్తి. శక్తి శక్తిమంతులు ఒక్కటే. వారిని విడిగా నిరూపించటం కుదరదు. కనుక మిథ్యయే. అనిర్వచనీయం కదా! అగ్నిశక్తిని అగ్నికన్న విడిగా గాని కలిసినట్లుగాని నిరూపించలేము.

ప్రకృతి ఈశ్వరశక్తియేగాదని స్వతంత్రమని అంటే అందుకు ప్రమాణము లేదు. "ఈక్షతేర్నాశబ్దం" అనుసూత్రం వలన అట్టి స్వతంత్ర పదార్థము నిరాకరింపబడినది. వేదాంతములలో ఈ "ప్రధాన" శబ్దమే లేదు. ఈశ్వరశక్తి మాత్రం ఉన్నది. అదే ప్రకృతి. "దేవాత్మ శక్తిం స్వగుణైః నిగూఢామ్" అని శ్రుతి.

11. లేదా, ప్రకృతి పురుషులిద్దరూ బ్రహ్మ కార్యములే. "మాయాచావిద్యాచ స్వయమేవ భవతి" - శ్రుతి. "యథాగ్నేః క్షుద్రాః విస్ఫులింగాః" - శ్రుతి. కనుక ప్రకృతి పురుషులు (ఉపాధి ఉపాధిమంతులుగా) సాదులు. కనుక సాంతులు. కనుక మిథ్య.

12. బ్రహ్మమొక్కటే ఉపాదాన కారణం కనుక ప్రకృతి/మాయ అనాది. ప్రపంచమునకు బ్రహ్మము మాయ - ఈరెండూ కారణములు. కనుక ప్రపంచం సాది. పురుషుడు ఉపాధిని బట్టి సాది. స్వరూపతః అతడు బ్రహ్మమే. ఆయన స్వరూపం చైతన్యమే. అది అనాది. అనంతం ఏకము. అద్వితీయము.

13. ప్రకృతి బ్రహ్మమునందు అధ్యాస చేయబడినది. ఎవరు ఎపుడు అధ్యాస చేశారో తెలియదు. కనుక ప్రకృతి అనాది. అదే జగత్తు అయితే ప్రలయం తరువాత మాయచేత అధ్యాస చేయబడినది కనుక సాది. అధ్యాస అయినది కనుకనే ప్రకృతి మిథ్య. కాలేదు కనుకనే బ్రహ్మం సత్యము. పురుషుడు బ్రహ్మయందు అధ్యస్తుడు కాలేదు. బ్రహ్మమే పురుషుడుగా గోచరిస్తాడు. కనుక పురుషుడు సత్యము. ఉపాధులు అనగా అంతఃకరణములు. బ్రహ్మ భిన్నమయినదంతా అధ్యస్తమే. మిథ్యయే. పురుషుడు బ్రహ్మమే. ప్రకృతి బ్రహ్మభిన్నమే మిథ్యయే.

14. ప్రకృతి - అధ్యాసకు హేతువు లేదు. అందువలన ఈ అధ్యాస నంగీకరింపరాదు - సమా - హేతువులేకున్నను, జగత్తు అను కార్యం వలన ఊహించాలి. శ్రుతి ప్రమాణం కనుక అంగీకరించాలి. ప్రకృతిని సత్యమంటే దానినుంచి మోక్షం కుదరదు. సంసారము మాయామయము. మాయ తొలగకుండా సంసారము తొలగదు. మాయ ఉంటే సంసారము మరల చిగురించవచ్చును. మాయ సత్యమయితే నశించదు. "తరతి శోకమాత్మవిత్" వంటి శ్రుతులు మాయకు నాశము చెప్తున్నాయి. "జ్ఞానేనతు తదజ్ఞానం యేన నాశిత మాత్మనా" - స్మృతి.

15. జ్ఞానం వలన నశించవలసిన మాయ సత్యంకారాదు. అట్టిది మిథ్య అవుతుంది.

16. అసలు ఈ ప్రకృతి బ్రహ్మమా? భిన్నమా? - బ్రహ్మం కాదు. బ్రహ్మం అయితే తొలగదు. భిన్నమయితే అనాత్మ అబ్రహ్మ పదార్థం కనుక మిథ్యయే. బ్రహ్మభిన్నమయిన స్వప్నరథాదులు, శుక్తి రజతాదులు మిథ్యగదా! కనుక బ్రహ్మం ఒక్కటే సత్యం. అది అధ్యాస చేయబడలేదు. సర్వ - అధ్యాసలకు అదే అధిష్ఠానము. కనుక సర్వకారణము. రజ్జువు అంతే కదా! సర్పం మాత్రము రజ్జువునందు అధ్యాస చేయబడినది కనుక రజ్జుకార్యం మిథ్య.

**శ్లో॥ సృష్టేః ప్రాగిదమేకమేవ సదభూద్బ్రహ్మాఽద్వితీయం పరం**
**సృష్టేః ప్రాగ్ఘటవైకృతం న కిమభూన్మృత్పిణ్డ ఏవ క్షితౌ ।**

**సృష్టేః ప్రాగసదేవ సర్వమసతస్సజ్జాయతే చేతి కే**
**మన్యన్తే తదసత్కథం సముదయేత్సద్వస్త్వసద్వస్తునః ॥ 338**

భావ॥ సృష్టికిముందు ఇదంతా ఏకముగానే ఉన్నది. అది అద్వితీయమయిన పరమయిన బ్రహ్మము. అదే "సత్". కనుక సృష్టికిముందు అంతా "సత్" సృష్టికి ముందు ఘటరూపమయిన వికారము భూమియందు మట్టి ముద్దరూపములోనే ఉన్నది. **ఇది సత్కార్య వాదము.**

కొందరంటారు. సృష్టికిముందు ఇదంతా "అసత్" రూపములోనే ఉన్నది. అసత్తునుండియే సత్తు పుట్టుచున్నది – **అసత్కార్యవాదులంటారు.** కాని ఈ వాదము సరికాదు. "కథమసతః సజ్జాయేత" శూన్యమునుండి భావము ఎలా పుట్టుంది? అసత్తు నుండి సత్తు అభావము నుండి భావము ఎలా పుట్టును? గగనారవిందమునుండి మకరందమురాదు. వంధ్యాతనయునకు తనయుడు పుట్టడు. 338

విశే॥ 1. సత్తునుండియే ప్రపంచము పుట్టినదనటానికి ఏమి యుక్తి ఉన్నది. చూడండి. సమవాయికారణగుణములు కార్యము నందు సంక్రమించునుగదా! **కనుకనే 'సత్తు' నుండి పుట్టిన జగత్తు 'సత్తు' అయింది.** ఇదే అసత్తునుండి పుట్టియుంటే 'అసత్తు' అయి ఉండేది. మరి **జగత్తు మిథ్య అన్నారు గదా! అంటారా! – నిజమే. తత్త్వరీత్యా బ్రహ్మదృష్ట్యా మిథ్య అన్నాము.** వ్యవహారరీత్యా ఇది సత్యమే. కారణమయిన బ్రహ్మం దృష్ట్యా ఇది మిథ్య అన్నాము. పైగా జగత్తు నందున్న **ఈ 'సత్తు' అను వ్యవహారము కారణమయిన బ్రహ్మస్వరూపము. అదే జగత్తునందు సంక్రమించినది.** అంతేకాని అది జగత్తుయొక్క ధర్మము కాదు. జగత్తునుండి సత్యమును ఘటము నుండి మట్టిని వస్త్రమునుండి తంతువులను విడదీస్తే మిగిలేది మిథ్యయేకదా! **కనుక సత్తునుండి పుట్టిన యీ జగత్తు 'సత్తు' అయినది. కనుక అది స్వయంగా మిథ్యయే.** మట్టినుండి పుట్టినది కనుక ఘటం మట్టియే అనటం వలన ఘటం మిథ్య అని స్పష్టమే కదా! కనుక 'సత్' అంటే బ్రహ్మమే.

2. 'జగత్ సత్' జగత్తు ఉన్నది – అను ప్రతీతి వలన 'సత్' అయిన బ్రహ్మమే ఉపాదాన కారణం కావచ్చు – కాని జగత్తుకు నిమిత్తకారణం ఏది? – బ్రహ్మమే. దీనికి వేరు నిమిత్తకారణముల సహాయాపేక్ష లేదు. అద్వితీయమయిన బ్రహ్మకు సాధనాంతరం అసంభవము. కనుక బ్రహ్మమే నిమిత్తము ఉపాదానము. అందుచేత అభిన్న నిమిత్తోపాదానము. మాయాశక్తి బ్రహ్మకు సహాయమున్నది గదా! అంటారు. అది ఆయన శక్తియే. భిన్న పదార్థము కాదు. కుమ్మరి ఘట నిర్మాణనైపుణ్యం అతనికి సహాయకం అయిన భిన్న పదార్థము కాదు గదా!

3. జగత్కారణమయిన బ్రహ్మం మాయోపాధికమా? నిరుపాధికమా? మాయోపాధిక మయితే బ్రహ్మం ఏకం కాదు. సద్వితీయమే. నిరుపాధికమయితే జగత్కారణం ఎలా అవుతుంది? – సమా – మాయవలన బ్రహ్మం సద్వితీయంకాదు. అది శక్తి కనుక అది అభిన్నపదార్థము.

4. లేదా, సృష్టికి ముందు ఈ ప్రపంచము సద్రూపముగా అనగా బ్రహ్మంగానే ఉన్నది. అది అద్వితీయము.

5. బ్రహ్మం 'సత్తు' అయిన వస్తువు. అయితే అన్ని వస్తువులలాగానే దీనికి గూడా సజాతీయ విజాతీయ స్వగత భేదములుండాలి గదా! ఒక వృక్షము స్వగతమయిన ఫలపుష్పాదులతోను, ఇతర వృక్షమునుండి సజాతీయ భేదములతోను, శిలాదులనుంచి విజాతీయ భేదము కలిగి ఉన్నది కదా! కాని ఏకం అద్వితీయం అనటంవలన ఈ భేదం నిషిద్ధం కదా! సమా – బ్రహ్మం ఒక్కటే. కనుక సజాతీయ బ్రహ్మలేడు. విజాతీయమయిన ప్రపంచం సృష్టికి ముందు లేదు. కనుక విజాతీయ భేదమూ లేదు. బ్రహ్మమునకు అవయవములు, వికారములు లేవు. కనుక స్వగతభేదము లేదు. కనుక బ్రహ్మం భేదరహితం. "సలిల ఏకోద్రష్టాఽద్వైత" – శ్రుతి. సృష్టికి ముందు అవ్యక్తం లేదా మాయ ఉన్నా అది బ్రహ్మశక్తియే కనుక ఆయనకన్న భిన్నం కాదు.

6. బ్రహ్మయందున్నమాయచేసిన సృష్టిస్థితిలయాలవలన బ్రహ్మములో స్వగతభేదం ఏర్పడుతున్నది. కదా! చెట్టులోని ప్రాణశక్తివలన ఫలపుష్పాలు, చిగురు, మోడు – ఇలా? – సమా – నిరవయవము అసంగము అయిన బ్రహ్మమునందు అట్టి వికారములు లేవు. అవి మాయాకృతవికారములు. మిథ్య. రజ్జువు మీద సర్పం వంటివి. జడమయిన మాయతో సంగం గూడా మిథ్యయే.

7. సృష్టికిముందు ప్రపంచం లేదు కనుక బ్రహ్మమునకు విజాతీయ భేదం లేదన్నారు. సృష్టి తరువాత ఉన్నట్లే గదా! సమా – బ్రహ్మం సర్వదా ఏకమే. అద్వితీయమే. మట్టికి ఘటం వలన భేదత్రయం ఏర్పడదు గదా! అలాగే జీవులనుండి సజాతీయ భేదం ఏర్పడవచ్చు గదా! – రాదు. ఘటాకాశ మహాకాశముల మధ్య అట్టి భేదము లేదుగదా! అలా జీవ – బ్రహ్మ అభేదం అయితే జీవసంసారం బ్రహ్మమునకు తగలాలి కదా! – తగలదు. జీవులయందే సంసారం లేదు. సంసారం ఆత్మ ధర్మం కాదు. అంతఃకరణధర్మం. ఆకలి దప్పికలు ప్రాణధర్మము. సుఖ–దుఃఖాలు అహంకార మమకారాలు అంతఃకరణ (మనోబుద్ధి) ధర్మాలు. జనన మరణాదులు దేహ ధర్మాలు. కనుక బ్రహ్మము అద్వైతము సత్.

8. జగత్తు పుట్టకముందు దాని ప్రాగభావం ఉన్నది. జగత్తు నశించిన తర్వాత దాని ప్రధ్వంసాభావమున్నది. జగత్తున్న స్థితి సమయంలో దానితో బ్రహ్మమునకు అన్యోన్యభావమున్నది. అసలు జగత్తే లేదంటే అత్యంతాభావమున్నది. **ఇలా బ్రహ్మంతో బాటు జగత్తు యొక్క ఈ అభావాలు కాపురం చేస్తున్నాయి.** కనుక బ్రహ్మం సద్వితీయమే. అద్వితీయం కాదు – సమా – **సద్వస్తువుకు మరో సద్వస్తువు ఉంటేనే తోడవుతుంది. అసద్వస్తువు కాదు. అభావము, 'సత్'**

**కాదు**. భావం = సత్, అభావం సత్తుకాదు. కనుక అభావంతోడుకాదు. అలా అయితే లేని భార్యతోను రానిభార్యతోను విధురుడు బ్రహ్మచారి సద్వితీయులు కాగలరు. ఘటపటాలు కలిసి ఉంటే అవి సద్వితీయములు. రెండూ భావ వస్తువులు కదా! అంతేకాని **ఘటం ఒక్కటే ఉన్నచోట పటాభావంతో అది సద్వితీయం (ఘటభావాభావంతో సద్వితీయం) అనటం వెఱ్ఱితనము. ద్వితీయాభావంతోకూడినవాడు కనుక అద్వితీయుడిని సద్వితీయుడనవచ్చునా?** "నా తల్లి గొడ్రాలు" అన్నట్లుగా ఉంటుంది. ఇలా గయితే వస్తు శూన్యమయిన గృహంనిండా అభావ రాశులు కలుగుతాయి. ఇక శూన్య గృహం శూన్య ఘటం అనటం కుదరదు. (జలాభావపూర్ణో ఘటః అనవలసి ఉంటుంది) (వంధ్యకు పుత్రాభావరూప పుత్రులు చాలమంది ఉండవచ్చును.) **కనుక అభావమునకు అస్తిత్వం అపహాస్యకరం.** ఇట్టి అభావాలున్నా వాటివలన ఇంట్లో ఎలా ఖాళీ నిండి ఇరుకురాదో అట్లే బ్రహ్మమునకు సద్వితీయత్వమూ రాదు. అభావానికి సొంతంఅనే ఉనికి (సత్త) లేదు. అది మరొకదానికి సద్వితీయత్వం ఎలా కలిగిస్తుంది. (ఒంటరిగా వచ్చినవాడు తాను తన ద్వితీయాభావము వచ్చామనడు గదా!) కనుక సత్తుకు అసత్తు వలన సద్వితీయత్వం రాదు. **ఎండమావిలోని నీటితోగాని నీటి అభావంతోగాని మరుభూమి బురదగాదు.**

9. అభావమనే పదార్థం ఉన్నది. దానిని కాదనటం కుదరదు. సప్తపదార్థాలలో అది ఒకటి. లేదంటే ఆపదమే నిలవదు – సమా – 'సత్' అన్నదాన్ని గురించి అది సత్తా? అసత్తా? అని ప్రశ్నలు కుదరవు. అలాగా అసత్తు గురించి ఇది అసత్తా? కాదా? అని వికల్పించటం కుదరదు. అలాగే అభావపదమునకు అభావం అర్థం. అంతమాత్రమున అభావం సత్తుగాదు. అలా అయితే వంధ్యాపుత్రపదానికి వంధ్యాపుత్రుడు అర్థం. మరివాడు దొరకడు గదా? సత్తు కాదు గదా! **అనుపలబ్ధి ప్రమాణంతో అభావం సిద్ధిస్తే వంధ్యాపుత్రుడు గూడా అలాగే సిద్ధిస్తాడు.**

10. 'అతీతో ఘటః" అన్నమాటకుదరాలంటే కాలం కల్పించాలి. అలాగే "ఘటం లేదు" అనే వ్యవహారం కుదరాలంటే, అభావం కల్పించాలి కదా! – సమా – కల్పితం అయినా అది అసత్తు కనుక అసత్తే. కాలంవలె భావపదార్థము కాదు. ఘటం తొలగించినచోట ఘటాభావం ప్రత్యక్షం అవుతున్నది గదా! అది అసత్తు ఎలా అవుతుంది. – సమా – **అక్కడ ప్రత్యక్ష మవుతున్నది భూతలమే ఘటా భావం కాదు.** (అలా అనుకొంటే అచ్చట ఘటాభావం పటాభావం మొదలయిన లక్ష అభావ ప్రత్యక్షాలు కావలసి వస్తుంది) ఎవడూ ఘటాభావం ప్రత్యక్షమయినది అనడు.

11. అభావం ప్రత్యక్షం కాదు. దానిని ఏ ఇంద్రియమూ గ్రహించదు. వృత్తిలేకుండా బాహ్యమయిన అభావమును మనస్సు గూడా గ్రహించదు. ఘటం పదార్థమయితే దాని అభావం పదార్థాభావం అవుతుంది గాని అభావం కాదు. పదార్థం కాదంటే సర్వప్రమాణాలు విరోధిస్తాయి. మరియు, ఘటాభావం పదార్థమయితే దాని అభావం పదార్థాభావం కావాలి. అనగా ఘటం

పదార్థాభావం అవుతుంది. అపుడు ఘటాభావాభావం అనగా ఘటం పదార్థం కాదనాలి. అది చాల అశుద్ధం కదా! కనుక అభావం పదార్థము కాదు.

12. పదార్థం రెండు రకాలు. భావము, అభావము. ఆకాశాదులు భావ పదార్థాలు. ప్రాగభావాదులు అభావ పదార్థాలు. వంధ్యాపుత్రాదులు అత్యంతాభావాలు. కనుక అవిగూడా పదార్థాలే - కాని కుదరదు - వంధ్యాపుత్రాది పదార్థములకన్న విలక్షణమయినది అభావ పదార్థమని కదా! తమ మతం. దాన్ని వదలితే, అభావం వంధ్యాపుత్రాదులవలె లేనిదే అవుతుంది. కనుక అభావం అసత్తు అవుతుంది. దానివలన బ్రహ్మం సద్వితీయం ఎలా అవుతుంది?

13. అలాకాదు. అభావమని ఒక పదార్థమున్నది. అది సత్తుకాదు. అసత్తు. అంటారా? ఆమాట సరికాదు. ఎ) అభావం ఉన్నది, పదార్థం కాదు బి) అభావము అసత్పదార్థము. ఈ రెండు (ఎ,బి) మాటలమధ్య తేడా ఏమున్నది? అభావమను పదార్థం లేదనే కదా తాత్పర్యము. ఇంతమాత్రంతో అస్తి నాస్తి వ్యవహారమునకు ఇబ్బందిలేదు. అస్తి - అంటే ఉన్న పదార్థము. నాస్తి అంటే లేనిదానికి సంకేతము. అదే వంధ్యాపుత్రాదికము.

అలా అయితే ఘటం లేనపుడు "ఘటః నాస్తి" అను వ్యవహారం ఉన్నది కదా? నిజానికి మఱి ఘటం అసత్పదార్థం కాదు గదా! - సమా - 'ఘటం లేదు' అన్నచోట ఘటం సత్తా? లేక అసత్తా? సత్తు అయితే 'నాస్తి' అనటం కుదరదు. "అసత్తు" అయితే వంధ్యాపుత్రునివంటిదే. ఇక "ఘటోనాస్తి" అన్నది తత్కాలంలో ఏర్పడిన **సామయికాభావమని**, వంధ్యాపుత్రవిషయము అత్యంతాభావమని తేడా ఉన్నదనవచ్చును. కాలం అవచ్ఛేదకం. అందులో భూతరూపమయిన భేదం ఉన్నది. కాని అభావంలో లేదు. ప్రాగభావాదులన్నింటిలోనూ అభావత్వం సమానమే కదా! భేదాలు కాలాది - ఉపాధికృతాలు. కనుక అభావంలో భేదాలు వాటివిశేషాలు కల్పించటం అయుక్తము. అన్ని వంధ్యాపుత్రరూపమయిన అభావములే. (కేవలం ఒకటే అభావము. అదే అత్యంతాభావము).

14. "అభావం" వంధ్యాపుత్రరూపము కాదు. వంధ్యాపుత్ర విషయము. ఘటాభావము ఘటవిషయకమే కాని ఘటరూపము కాదు కదా! - సమా - అభావమునకు అభావమే విషయము. భావము కాదు. సద్వస్తువును లేదనము. అసత్తును ఉన్నదనము. కనుక (అనగా అభావం అభావమే. (ప్రాగభావాది భేదం అయుక్తం అన్నదానినిబట్టి ఇదంతా) 'నాస్తి' అన్నది వ్యవహారం కచ్చితంగాలేని దానిని గూర్చియే. కనుక 'అభావం' అంటే వంధ్యాపుత్రాది - అసత్పదార్థరూపమే. కనుక "నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః" - గీత. సదసత్తులు విరుద్ధము. ఒకేదానికి అవి ఉండవు. కనుక సత్తు సత్తే. అసత్తు అసత్తే. సత్తు బ్రహ్మమే. అసత్తు శశశృంగమే. ప్రపంచం అనిర్వచనీయమే.

15. కొంతకాలముండి తరువాత లేనివాని సంగతి ఏమిటి? – పితృపుత్రాదులు ఘటపటాదులు. వీరు పుట్టకముందు, గిట్టిన తరువాత ఏమిటి వీరు. 'అభావం' కారా? – కారు. వారు, ఆ సమయాలలో వారి శరీరాలు భూత రూపంలోనున్నాయి. భూతములు అంతకుముందు బ్రహ్మరూపంలోనుంటాయి. బ్రహ్మ రూపమనగా మాయావచ్చిన్న బ్రహ్మ పరిణామముగా నుంటాయి. లేదా, **రజ్జు, వివర్తమయిన సర్పం రజ్జురూపంలో నున్నట్లు బ్రహ్మ** వివర్తమయిన ప్రపంచము బ్రహ్మ రూపంగా ఉంటుంది. ఘటపటాదులందు మట్టి తంతువులు లాగా, పృథివ్యాదులందు సద్రూపమయిన బ్రహ్మం కారణంగా అనుగతంగా ఉంటుంది. కనుక 'మట్టి కుండ' అన్నట్లు "కుండ ఉన్నది" అన్న ప్రతీతి ఉన్నది. అందుకు భిన్నమయిన నామరూపములు మిథ్యలే. జగత్తు నామరూపములే. వాటి ఉనికి భ్రాంతి. అవి సృష్టికిముందు, లయం తరువాత లేకున్నా స్థితి కాలంలో ఉన్నా, 'సత్తు' అయిన బ్రహ్మం మీద అధ్యాస చేయబడిన కల్పితములే. (రజ్జువు మీద 'సర్పం' ఉన్నదన్నట్లే). కనుక నామరూపానుగతమయిన బ్రహ్మమే (రజ్జువే) సత్తు. అదే 'సత్తు' అను బుద్ధికి విషయము. (రజ్జువును చూచి సర్పం ఉన్నది అన్న "ఉనికి" రజ్జువుదే). కనుక ఘటం అంటే ఘటమే కావాలి కాని పటం కారాదు. అలాగే నామం నామమే కావాలి. రూపం అంటే రూపమే కావాలి. నామం కాదు. అలాగే సత్తు అంటే సత్తయిన బ్రహ్మమే కావాలి కాని నామరూపములు సత్తులు కావు. స్థాణువు పురుషుడనుకొన్నట్లు, నామరూపములను సత్తులనుకొంటున్నాము. కనుక నామరూపములు వేరు మిథ్యలు. సత్తు వేరు సత్యము. నామరూపములే జగత్తు. అది అసత్తు. మిథ్య. అది ఉన్నది, సత్తు అనటం శ్రుతి సమ్మతం కాదు. (నేహనానాస్తి కించన) అదే అవివేకంతో "అభావం" ఉన్నది – అంటాము. అభావమునకు 'సత్'తో తాదాత్మ్యం కుదరదు. "నాతల్లి గొడ్రాలు" అనటం ఎంత అవివేకికయినా సాధ్యమా?

16. అయితే ప్రపంచం "సత్" తో తాదాత్మ్యం చెప్పటానికి అవకాశం ఉన్న పదార్థము. అందువలననే దీనిని 'అసత్' అనలేము. రజ్జు సర్పం వలె మిథ్యపదార్థము. కనుక దీనివలనగాని, వంధ్యాపుత్రుని వంటి అసత్తుతో గాని బ్రహ్మం సద్వితీయంగానేరదు.

17. ప్రపంచం అసత్తు కాదు. సత్తునుండి పుట్టినది సత్తే కావాలి. వేదంగూడా "కథమసతః సత్ జాయేత" అని జగత్తును 'సత్ అని చెప్పింది – సమా – జగత్తు ప్రతీయమానం కావటమే ఆ 'సత్త్వం'. అంటే శుక్తి రజతం లాంటిది. అంతేగాని త్రికాలములలోనూ అబాధ్యంగానే ఉండేదికాదు. అట్లాంటిది పుట్టదు. జన్మ స్థితిలయాలు జగత్తుకున్నాయి గదా! – "యతోవా ఇమాని – " కనుకనే జగత్తును "మిథ్య" అంటాము. కనుక శుక్తిరజతం, జగత్తు అన్ని మిథ్యలే. ప్రాతిభాసికములే. కాని స్థిరప్రతీతి వ్యావహారికము. అస్థిరప్రతీతి ప్రతిభాసము. ఈ తేడా కోసము – శుక్తిరజత సత్యరజత భేదం కోసము వ్యవహార ప్రతిభాసములు కల్పితమయినాయి.

18. కార్యకారణములు సమానలక్షణంగా ఉండాలి. నిజమే. కాని రజ్జు సర్పం వద్ద ఆనియమం పోయింది. ఏదో ఆకార సాదృశ్యమున్నది. సత్తాసాదృశ్యములేదు. సత్తునుంచి "పుట్టునది" అన్నపుడే దాని 'సత్త్వం' వీగిపోయింది. "సత్తు" అయినది పుట్టదు. గిట్టదు. అయితే సత్కార్యవాదం ప్రకారం ఏకార్యమయినా తన కారణంలో సూక్ష్మరూపంలో "విత్తనంలో చెట్టులాగా" ఉంటుంది. కనుక జగత్తు గూడా బ్రహ్మమునందున్నదే కనుక 'పుట్టటం' అనేది ఆవిర్భవించటమే కనుక లేనిది పుట్టదు కనుక 'జగత్తు సత్తే' అనవచ్చుగదా అంటారా! – కుదరదు. **కారణమునందు కార్యజనకమయిన శక్తి మాత్రమే ఉంటుంది. కార్యం ఉండదు.** బీజములు పగలగొట్టినా అందులో చెట్టుకనబడదు. శక్తి ఉంటుంది. శక్తిని కార్యమనటం కుదరదు. బీజమునందు సూక్ష్మంగా చెట్టు లేకపోతే బీజమునకే ఆశక్తి ఉన్నదని ఎలా నియమం చేస్తాం? సూక్ష్మంగా అలా ఉన్నా బీజంలోనే తరువు సూక్ష్మరూపంలో ఉన్నదన్న నియమం ఎలా చేస్తాం? – బీజం వృక్ష జన్యం కనుక బీజమునందు తరువున్నదని నియమం కుదురుతుందంటారా? – అయితే తరువు నందే బీజం సూక్ష్మరూపంతోనున్నదని నియమం ఎలా? తరువు బీజం వలన పుట్టినది కనుక అంటారా? అయితే అన్యోన్యాశ్రయమవుతుంది. వృక్షకారణమయిన విత్తనం వేరు. వృక్షమువలన పుట్టిన విత్తనం వేరు కనుక అన్యోన్యాశ్రయదోషం లేదంటారా? – అయితే

19. చెట్టుముందా? విత్తు ముందా? అనాదులు కనుక ప్రశ్న న్యాయము కాదంటారా? ఇవి కార్యములు గనుక సాదులయి యుండాలి. మా పక్షంలో నియమం కుదరదంటాం, మీ పక్షంలో ఏమి నియమం అంటారా? "ఈశ్వరశాసనము" వలన కార్యోత్పత్తి. "సేయందేవతైక్షత" గదా! అగ్ని మొదలగు వానికి దాహాది శక్తులు ఈశ్వర సంకల్పం వలన వచ్చినవే కదా! కనుక ఉత్పత్తికి పూర్వము సమస్త కార్యం తన రూపంతో, సూక్ష్మంగానయినా ఉండదు. నూతనంగా కార్యం పుట్టుందంటే అసత్కార్యవాదం అవుతుంది గదా? – అని భయమా? అసత్తు నుండి సత్తు పుట్టిందంటే ఆవాదం. **సత్కారణం వలననే ఈ అసత్ పుట్టుందన్నాము. ఆ సద్వస్తువు బ్రహ్మమే.**

20. "జగత్తు" అను కార్యంవలన కారణమయిన బ్రహ్మను ఊహిస్తున్నాము. అదే మీరు 'అసత్' అంటున్నారు. ఇక బ్రహ్మం ఎలా నిరూపితమవుతుంది? శ్రుతివలన. "తంత్వౌపనిషదం పురుషం పృచ్ఛామి". "శాస్త్రయోనిత్వాత్" అని స్మృతి. శాస్త్రమే ప్రమాణం. పౌరుషేయమయిన అనుమానం ప్రమాణం కాదు. అది అస్థిరం. బుద్ధి శక్తినిబట్టి మారుతుంది.

21. 'బ్రహ్మం – జగత్తు' ఈ రెండింటి వివేచన లేనంతకాలము ప్రపంచం "సత్" అనిపిస్తుంది గదా! కనుక వ్యవహారదృష్ట్యా జగత్తు సత్తు. దానివలన కారణమయిన బ్రహ్మమున్నదని నిశ్చయింపగలము. బ్రహ్మమునిలా నిశ్చయింపదలచినవాడే బ్రహ్మం. ఆత్మయే బ్రహ్మం కదా! – తనే ఆత్మకదా! కనుకనే "యత్సాక్షాదపరోక్షాత్ బ్రహ్మ" అని శ్రుతి. నిత్యం అపరోక్షము

కనుక నిత్య సిద్ధమయిన బ్రహ్మం సాధ్యం కాదు. అయినా దానిని సాధించి నిశ్చయించాలన్న ఆవృత్తి భ్రాంతియే. అట్టి భ్రాంతిని తొలగించుటకే ఈశ్వరుడు వేదాంతశాస్త్రమును ప్రవేశపెట్టాడు. ఈ శాస్త్ర పూర్ణ నిశ్చయం "ఏకమేవాద్వితీయం బ్రహ్మ". దీని వివరణలే "తత్సత్యం స ఆత్మా తత్త్వమసి" మొదలయినవి. జీవేశ్వరభేదం నిజమయితే "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" కుదరదు గదా!

22. లేదా, సృష్టికిముందు ఇది సత్తే. ఆ జగత్కారణమయిన "సత్తు" వస్తుతః 'ఏకము అద్వితీయము. జగత్కారణత్వం మొదలయిన ధర్మములు బ్రహ్మమునందు మాయవలన కల్పింపబడినవే. జగత్తే కల్పితం కదా! కనుక బ్రహ్మం నిర్ధర్మక కేవల చైతన్యమే. ఏకం అంటే కేవలమని అర్థము. అద్వితీయం అంటే నిర్ధర్మకం అని అర్థం వస్తుంది. చైతన్యం అన్నారు. అందుకు మూలపదం ఏది? – నిర్ధర్మకము కేవలము అయినది చైతన్యమే తప్ప మఱొకటి లేదు. కేవలం కావటం గూడా ఒకధర్మమేకదా! అందుకే నిర్ధర్మకం అనిగూడా అన్నాము. అందువలన బ్రహ్మభిన్నమయిన మరొక (కేవలత్వ) ధర్మి ఏదీ లేదని అర్థము. 'ఏవ' అనటం వలన ధర్మరూపముగూడా నిషేధింపబడినది. కాగా బ్రహ్మము ధర్మికాదు. ధర్మము కాదు. ధర్మసహితమూ కాదు. ఇక నిర్ధర్మకత్వం అభావరూపం కనుక ధర్మం కాదు. భావమే ధర్మము. బ్రహ్మత్వం ధర్మం కాదు. అది స్వరూపము కదా! కనుక ధర్మ ధర్మి విలక్షణమయిన కేవల చైతన్యము బ్రహ్మము.

23. "సదేవేద మగ్ర ఆసీత్" అగ్రే = పూర్వకాలమున. కనుక బ్రహ్మముతోబాటు కాలముగూడా ఉన్నది కనుక బ్రహ్మం అద్వితీయం ఎలా అవుతుంది? – సమా – అది కాలవాసనలు గల శిష్యునికి అర్థం కావటానికి వేద గురువు చెప్పిన తీఱు. కాలం జన్యం. అది, అనాది నిత్యం కాదు. "సర్వే నిమేషాజజ్ఞిరే విద్యుతః పురుషాదధి" శ్రుతి. అహోరాత్రాది కాలం రావటం, పోవటం మనకు తెలిసినదే గదా!కనుక కాలసృష్టికన్న ముందు కాలం ఉండదు. ఉత్పత్తికి ముందు లేనిదే ఉత్పన్నమవుతుంది. కాలం ఉత్పత్తికి ముందు లేదనరాదు. "ఉత్పత్తికిముందు" అన్నపదం వలననే కాలం ఉన్నట్లు తెలుస్తున్నది గదా? "ముందు" అనటం కాలసూచనయే కదా! కనుక కాలం అనాది – అంటారా? "ఉత్పత్తికిముందు కాలం లేదు" అన్నమాట కుదరదు. కాని కలానిమేష అహోరాత్రాది విభాగములు ఇంతకు ముందు లేవు. అనవచ్చుగదా! ఈ కాల విశేషములు సాదులయినా కాలసామాన్యము అనాదియే గదా! అంటారా? – పైన చూపిన కాలవిశేషములు లేని కాలసామాన్యం కుదరదు. కనుక బ్రహ్మం కాలం వలన సద్వితీయం కాదు.

24. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" – ఈ స్థితి ముక్తి దశలోనిదా? ప్రలయదశలోనిదా?

ముక్తి దశకాదు – "సదేవసోమ్యేదమగ్ర ఆసీత్" "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" ప్రలయదశను ఈ మంత్రం వర్ణించింది. ప్రలయదశయూ కాదు. ప్రలయములో సర్వద్వైతం పోగా సర్వజీవులకు మోక్షం అప్రయత్నంగా వస్తుంది. గదా! – సమా – 'వస్తుతః' అన్న పదం చేరిస్తే బ్రహ్మం యొక్క వాస్తవరూపం అదియని తెలుస్తుంది. వ్యవహారతః సద్వితీయంగా కనబడుతున్న బ్రహ్మం వస్తుతః ఏకం అద్వితీయము కదా? అదే వ్యవహారతః మాయావచ్ఛిన్నం. సృష్టి స్థితిలయ కాలములందు అంతట అది మాయావచ్ఛిన్నమే. అయితే ప్రలయంలో నామరూపములు లేని అవ్యాకృత మాయ, సృష్టిలో వ్యాకృత మాయ – అదే తేడా. ప్రలయంలో జీవోపాధులయిన అంతఃకరణాదులు నశించవు. అవి మాయలో లీనమై (నిద్రలోలాగా) సూక్ష్మరూపంలో లీనమయి యుండును.

25. ఈ అంతఃకరణాలు ఈ సంసారము – ఇవి సృష్టికిముందు లేవు. కనుక అవి సాదులు. మరయితే, నూతనంగా వచ్చిన యీ సంసారము ఏకారణంగా భిన్నభిన్నంగా ఉన్నది? వైవిధ్యకారణమయిన కర్మ వైవిధ్యముగూడ లేదు కదా! – సమా – "సాది" అయినా సంసారంయొక్క "ఆది" ఎవరికీ తెలియదు. కనుక అది అనాది ప్రవాహము. అందలి అంతః కరణాలు అంతే. కాకపోతే సృష్టిలయములు చెప్పబడినవి కనుక 'సాది' అంటాం. కనుక జ్ఞానం లేకుండా ప్రలయంలోనయినా జీవులకు అంతఃకరణరూప లింగశరీరభంగం లేదు.

26. అనాదిగానున్న వీటివలన సద్వితీయమయిన బ్రహ్మం పరమార్థదశలోనయినా ఎలా అద్వితీయం? సమా – పరమార్థదశలో ఇవి ఏవీ లేవుకదా! ఇవి మిథ్యలు కదా! జ్ఞానం వలన అజ్ఞానం పోయింది కనుక ఇదంతా స్వప్నతుల్యం కదా! అయితే యీ జ్ఞానం వలన మరల బ్రహ్మమునకు తోడు దొఱకినట్లే కదా! ఈ జ్ఞానమునకు నివారకమయినదేదీ లేదు గదా! – సమా – బ్రహ్మాకారాంతః కరణవృత్తియే యీ జ్ఞానము. అది అజ్ఞానమును దగ్ధం చేస్తుంది. ఇక దగ్ధం చేయవలసినదేదీ లేదు కనుక అది 'నిరింధన – అగ్ని వలె' తనే చల్లారును. కాని ఇందులో చల్లారేది జ్ఞానం కాదు. జ్ఞానవాహిక అయిన చిత్తవృత్తి మాత్రమే. వృత్తిపోవటం వలన వృత్తియందున్న చైతన్యం పోయినట్లు ఉపచారము.

27. లేదా వృత్తిలోని జ్ఞానం ప్రతిబింబం. కనుక వృత్తినాశం వలన ప్రతిబింబము నశిస్తుంది. బింబచైతన్యము నిత్యమే. కనుక బ్రహ్మం ఏకము. అద్వితీయము.

28. ఏకత్వం మాత్రం ఎందుకు? అదీ లేనిదే కదా! – సమా – శ్రోతలమయిన మనకు అట్టి సంస్కారములుంటాయి కనుక మన భాషలో ఏకం అని చెప్పటం. అసలయితే రెండవది లేనపుడు 'ఏకం' అవసరం లేదు. పదార్థాలు రెండన్నా ఉంటే ఇది ఒకటి అది రెండు అని లెక్క. ఉన్నదే ఒక్కటి మనమే అదీ. ఇక్కడ లెక్క ఎవరు పెట్టారు. ఎలా?

29. బ్రహ్మం వాఙ్మనస్సులకు గోచరమా? అగోచరమా? గోచరమయితే అది అద్వితీయం కాదు. అగోచరమంటే "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అన్న శ్రుతివాక్యమయినా ఎలా దానిని వర్ణించగలదు? – సమా – వ్యవహారతః ఈ వాక్యములు బ్రహ్మమును ప్రతిపాదించును. పరమార్థదశలో వాక్కు మనస్సు ఉండవు. కనుక గోచరమా? అగోచరమా? అన్న ప్రశ్నయే రాదు. వ్యవహారం మాయామయం కనుక, అందులో బ్రహ్మం వాక్కుకు మనస్సుకు విషయం అవుతుంది. మాయవలన బ్రహ్మం అలా అవుతుంది. రజ్జువు సర్పం అవుతుంది. గగనం నీలం కావటం లేదా? చైతన్యరూపమయిన మనుష్యాది జాతి గలది కావటం లేదా?

30. బ్రహ్మం సదా అద్వితీయం కదా! ముక్తి దశలో అద్వితీయం అని చెప్పటం ఎందుకు? – వ్యవహారదశలో సద్వితీయంగా మాయవలన కనబడుతున్నది, కదా! ముక్తిదశలో ద్వితీయ కారకమయిన అజ్ఞానం ఉండదు గనుక అద్వితీయంగా తెలుస్తుంది. అందువలన అలా చెప్తాము.

31. ఈ రెండు దశలు ఎవరికి? మనకే. అయితే వ్యవహారదశలో భేదం తెలుస్తుంది. పరమార్థదశలో అద్వితీయులము. భేదం లేదు. ఇందుకు శ్రవణ మనన నిది ధ్యాసములు కావాలి.

వ్యవహారం లేనిదశ సుషుప్తి మొదలగు వానిలోనూ ఉంటుంది. వ్యవహారం లేదన్న విషయమును గుర్తించేది మనమే. సాక్షి రూపులము. కనుకనే నిద్రలేచినతరువాత ఏమీ తెలియదని చెప్తాము. ఈ జ్ఞానాభావములను గుర్తించేది మనమే. గుర్తించావు కనుకనే జ్ఞానం లేదని తెలిసింది. గుర్తించకపోతే జ్ఞానాభావం ఎలా తెలుస్తుంది?

32. ముక్తి దశ పరమార్థంగా సత్యమా? అసత్యమా? సత్యమయితే బ్రహ్మం సద్వితీయ మవుతుంది. అసత్యమయితే ఆ దశలోని బ్రహ్మంగూడా అసత్యమే. సమా – ముక్తి దశ బ్రహ్మం కన్న భిన్నము కాదు. భిన్నమనుకొంటే అది మిథ్యయే. అంతమాత్రం చేత ఆ దశలో బ్రహ్మం మిథ్యకాదు. వ్యవహారదశావిషయమయిన బ్రహ్మం మిథ్య కాదు గదా! సత్యమే కదా! వ్యవహార దశలోనే గదా! "బ్రహ్మ" విచారం జరిగేది. విచారం మిథ్యఅయినా బ్రహ్మం మిథ్య కాదు.

33. ముక్తుడు బ్రహ్మమా? భిన్నమయిన జీవుడా? బ్రహ్మమయితే ఆయనకు ముక్తత్వం అనుధర్మం వస్తుంది. భిన్నమయితే బ్రహ్మం సద్వితీయం అవుతుంది. – సమా – " ననిరోధో న చోత్పత్తిః స బద్ధో న చ సాధకః న ముముక్షుః న వై ముక్త ఇత్యేషా పరమార్థతా" – శ్రుతి. కనుక బంధమోక్షాదులు అన్ని బ్రహ్మయందు కల్పితములే. బంధం మిథ్య. దాని మోక్షమూ మిథ్యయే. కనుక మోక్షం బ్రహ్మ భిన్నమయితే మిథ్య. అభిన్నమయితే బ్రహ్మమే. సిద్ధాంతం ఇది. "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" – సత్ బ్రహ్మ, భిన్నం సర్వమపి ద్వైతం అసత్"

34. కార్యం కారణంకన్న భిన్నంకదా! బ్రహ్మజన్యమయిన యీ ద్వైతము (ప్రపంచము)

బ్రహ్మాభిన్నము కనుక ఇదీ సత్తుకావాలి. అసత్తు కాదు – సమా – **ఈ ద్వైతమును బ్రహ్మాభిన్నముగా భావించినచో అది సత్యం అవుతుంది. అందువలననే దానిని సృష్టికి ముందు 'సత్' అన్నారు. బ్రహ్మాభిన్నమయితే మిథ్యయే.** ఎలా అంటే **కుండను మట్టిగా భావిస్తే సత్యమే. కుండగానే భావిస్తే మిథ్యయే.** నిజానికి సత్యం మనభావననుబట్టి మారదు. అది ఎపుడూ సత్యమే. కాని అసత్యం లాగా కనబడుతుంది. స్థాణువు పిశాచంలాగా రజ్జువు సర్పంలాగా కనబడుతున్నది గదా! సత్యాసత్యములు అభిన్నం కాకపోయినా మన అవివేకం వలన "సత్యం అసత్యం" గా "అసత్యం సత్యం" గా కనబడుతుంది.

35. సారాంశమిది :

కార్యం పూర్తిగా కారణంతో అభిన్నం అయితే కార్యకారణ వ్యవహారమే ఉండదు. కనుక అంశలను బట్టి కొంతభేదం కొంత అభేదం కనబడతాయి. ఉదా॥ ఘటం తనలోని మట్టి పరమాణువులను బట్టి మట్టితో అభిన్నం. కంబుగ్రీవం మొదలగు నామ రూపాలను బట్టి భిన్నం.

అట్లే ప్రపంచమున్ను నామరూపాలను బట్టి భిన్నం, సమానంగా ఉన్న 'సత్' విషయంలో అభిన్నము. **కనుక నామరూపాంశప్రకారం జగత్తు మిథ్య. సత్తా రూపంగా అభిన్నము. అందువలన నామరూపస్వరూపంగా గ్రహించిన జగత్తును సత్తు అనుకొనటం భ్రమ. జ్ఞానిమాత్రము జగత్తును సత్తుగానే గ్రహించి నామరూపాత్మకముగా నుండటం మిథ్యగా భావిస్తాడు.** నామరూపములు కల్పితములని అతనికి తెలుసు. ఆ మిథ్యలయందు అనుగతంగా ఉన్న సత్యత్వమును గ్రహించిన జ్ఞాని "సర్వం ఖల్విదం బ్రహ్మ" అంటాడు. ఘటాదుల యందు అనుగతమయిన "మట్టి" అను అంశము సత్యము. మౌలికము – నామరూపాదులు కల్పితము. కనుక కారణం కన్న భిన్నంకాని కార్యం అంటే కార్యంలో కొనసాగిన కారణతత్త్వమే. కారణం బ్రహ్మ ఒక్కటే. సత్యం. మిగిలిన నామరూపములు అనేకము. మిథ్య. అందువలన బ్రహ్మం ఒక్కటే అని సత్యమని చెప్పబడినది. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ"

36. బ్రహ్మం అజ్ఞమా? సర్వజ్ఞమా? అజ్ఞమయితే, బ్రహ్మం జగత్కారణం కాలేదు. సాంఖ్యుల ప్రధానం గూడా అంతే. సర్వజ్ఞమయితే, అది నిర్ధర్మకం కాదు. సర్వజ్ఞత్వం ధర్మమే కదా! – సమా – వ్యవహార రీత్యా బ్రహ్మం సర్వజ్ఞం. (అది ఈశ్వరదశ) పరమార్థదశలో ఈ 'సర్వం' అనేదే లేదు. **కనుక బ్రహ్మం సర్వజ్ఞం కాదు. అది జ్ఞానం.**

37. బ్రహ్మం యొక్క జ్ఞానం స్వరూపం అన్నారు. తనూ తన స్వరూపజ్ఞానం – రెండూ కనుక బ్రహ్మం అద్వితీయం కాదు గదా! సమా – ఘటస్వరూపం మట్టి. అందువలన మరి కుండ సద్వితీయమా? స్వరూపమయిన జ్ఞానం కన్న బ్రహ్మం అంటూ ఏదీ లేదు. అందువలన

జ్ఞానం బ్రహ్మ. (నేత్ర గ్రాహ్యమయిన రూపమయితే గుణం అవుతుంది) "బ్రహ్మం" "జ్ఞానం" అయితే అది జడమయినదే. జ్ఞానం కలవాడు మాత్రమే జడుడు కాదు గదా! సమా – జ్ఞానం జడమయితే అది గలవాడు మాత్రం జడుడో జడం గలవాడో కావాలి. జ్ఞాత అయినా జ్ఞానం ద్వారానే అంతా తెలిసికొంటాడు. **అందువలన సర్వభాసకమయిన జ్ఞానము చేతనమే. జడము కాదు. అది స్వయం ప్రకాశము.**

38. బ్రహ్మ జ్ఞాతకాదు. జ్ఞానమే. చూడండి. "నిష్కలం, నిష్క్రియం, శాంతం" నిష్క్రియునకు జ్ఞాతృత్వ రూప క్రియ ఉండదు. అలాగే అద్వితీయుడు కనుక జ్ఞానానికి ఆశ్రయమయిన జ్ఞాతకూడా కాడు. ఆయనయే జ్ఞానం కనుక జ్ఞానాశ్రయం అయ్యే అవకాశము లేదు.

39. అద్వితీయుడు అంటే తనకు సమానమయిన వాడు లేడని అర్థం చెప్పరాదు. అది లక్షణతో వచ్చే అర్థము. అభిధతో వచ్చే అర్థము సరిపోతుండగా ఈ లక్షణార్థము తప్పు. అద్వితీయుడయిన భటుడు – అన్నచోట ముఖ్యార్థం కుదరదు కనుక (చాలమంది భటులుంటారు) లక్షణ అవసరం. ఇచ్చట (నేహ నానాస్తి కించన) సరిపడదు. ఏకం అన్న పదం కుదరదు.

40. అద్వితీయం అంటే అబ్రహ్మాత్మకమయిన ద్వితీయ వస్తువు లేనిది – అని చెప్పవచ్చుగదా? – సమా – లక్షణ వల్లనయినా ఆ అర్థం రాదు. పైగా తప్పు. చూడండి. అబ్రహ్మాత్మకమయిన ద్వితీయవస్తువు లేదంటే అర్థము బ్రహ్మాత్మకమయిన ద్వితీయవస్తు-వున్నదనిగదా అర్థము. ఆ వస్తువు స్వరూపం ఏమిటి? అది బ్రహ్మదృష్ట్యా ద్వితీయమా? ఇతర – ఆపేక్షయా ద్వితీయమా? మొదటి పక్షం కుదరదు. **మట్టి కుండ మట్టి దృష్ట్యా సద్వితీయం కాదు.** అట్లే బ్రహ్మాత్మకమయిన వస్తువు బ్రహ్మదృష్ట్యా సద్వితీయం కాదు గదా! అలాగే రెండవపక్షమూ కాదు. బ్రహ్మేతరమయినదేదీ మిథ్యయే గదా! తనను బట్టి తనే సద్వితీయం కాదు. ఘటం తనతోనే సద్వితీయం కాదు గదా! కనుక బ్రహ్మాత్మకమయిన వస్తువు బ్రహ్మమే కాని మరొకటి కాదు. మరొకటి అయితే బ్రహ్మాత్మకమే కాదు.

41. బ్రహ్మాత్మకమయిన వస్తువు ప్రకృతి పురుష మిథునం అంటారా? – అది బ్రహ్మభిన్నం కనుక బ్రహ్మాత్మకం కాదు. ప్రకృతి పురుషులు బ్రహ్మ కార్యం కనుక బ్రహ్మాత్మకులని మేము అనటం లేదు. బ్రహ్మమే ప్రకృతి పురుషులకు అంతరాత్మ కనుక బ్రహ్మాత్మకం అంటాము. సమా – **పెట్టిలో రూపాయిలాగానో ప్రపంచంలో ఆకాశంలాగానో బ్రహ్మం ప్రకృతిపురుషులలో ఉన్నదా? – మొదటిదయితే బ్రహ్మం పరిచ్ఛిన్నం అవుతుంది.** రెండవదయితే బ్రహ్మం కేవలం అంతర్యామి కాదు. బహిర్వ్యాపికూడా. "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" అని శ్రుతి. కనుక బ్రహ్మచేత వ్యాప్తమయిన ప్రకృతి పురుష మిథునమున్నదని అర్థము. అనగా

సృష్టికిముందు "ప్రకృతి పురుషుడు, వారియందు వ్యాపకమయిన బ్రహ్మం" అని మూడున్నట్లు లెక్క. మరి శ్రుతి "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అని ఎలా చెప్తుంది. ఇది పరిహాసనీయ వాదన.

పైగా, బ్రహ్మం ప్రకృతిపురుషులలో ఎలా వ్యాపించింది? జీవప్రకాశం గృహంలో వ్యాపించినట్లా? – కుదరదు. ప్రకాశమునకు రూపం ఉన్నట్లు బ్రహ్మమునకు రూపం లేదు. ఆకాశం ఘటంలో వ్యాపించినట్లు? ఆకాశం వలె బ్రహ్మం దొరకటంలేదు కనుక కుదరదు. అగ్ని కొయ్యలో వ్యాపించినట్లా? కొయ్యనుంచి మథిస్తే అగ్నిపుట్టినట్లు బ్రహ్మం పుట్టటం లేదు. లేక రామాదుల కీర్తిలోకత్రయములో వ్యాపించినట్లా? కాని కీర్తి స్వరూపరహితము, తత్త్వరహితము. బ్రహ్మం తత్త్వము. ఇక జీవునియందు అజ్ఞానం వ్యాపించినట్లా? – "నాహం జానామి' అన్న అనుభవం ఉండటం వలన జీవునియందు అజ్ఞానావరణ కల్పించాము. కాని బ్రహ్మావరణం కల్పించటానికి అట్టి అనుభవం లేదు. కనుక కల్పన కుదరదు. జీవుడు దేహమునందు వ్యాపించినట్లా? – మీమతములో జీవుడు అణువు కనుక దేహంలో వ్యాపించటం కుదరదు. జీవధర్మమయిన జ్ఞానము దేహంలో వ్యాపించినట్లా? – అదీ కుదరదు. జీవుని విషయంలో అలా ఊహించవచ్చును. తలనొప్పి కాలినొప్పి రెండూ తెలుస్తాయి కనుక జీవ స్వరూపమో ధర్మమో అయిన జ్ఞానమును శరీర వ్యాపిగా కల్పించవచ్చును. కాని సర్వవ్యాపిగా బ్రహ్మమును నిర్ణయించటానికి అటువంటి నొప్పులు అనుభవాలు లేవు గదా!

జీవుని పట్టు వలన దేహం నడుస్తున్నది. అట్లే ప్రకృతి పురుషాత్మకమయిన యీ జగత్తు బ్రహ్మం వలన నడుస్తున్నది. కనుక జగత్తునందు బ్రహ్మం వ్యాపించినట్లు ఊహిస్తామంటారా? – సమా – జీవుడు తొలగినపుడు శరీరం మరణిస్తున్నది కనుక జీవవ్యాప్తినూహిస్తాము. కాని జగత్తులో అటువంటి అవకాశం కనబడదు. సర్వవ్యాపి అయిన బ్రహ్మం పోదు. అది పోవటం వలన పడిపోయే వస్తువు దొరకదు. **బ్రహ్మం వ్యాపించి ఉన్నా మృతశరీరం తిరిగి బ్రతకటం లేదు**.

42. ఖాళీగల వస్తువులోనికి ఏదయినా వ్యాపిస్తుంది. ఖాళీలేని వస్తువులోకి అలా వ్యాపించటం కుదరదు. మీ లెక్కలో పురుషుడు అన్నావు. అందులో ఖాళీయుండదు. కనుక బ్రహ్మ పురుషునిలో వ్యాపించటం కుదరదు.

ఇక బ్రహ్మం ప్రకృతి పురుషులలో ఏరూపంతో వ్యాపిస్తాడు? అంతర్యామి రూపంతోనా? – అంతర్యామి రూపం ఏమి? జ్ఞానమే గదా! **అచేతనములందు ఆయన వ్యాపించినాడనటానికి ఆధారమేమి? శాస్త్రమే కదా! కాని ఒక ఘటం జ్ఞానం (అంతర్యామిగా) గలది** – అన్నమాట అసంగతం కదా! 'అగ్నిచల్లగా చీకటిగా ఉండును' వంటి మాటను శాస్త్రం ఎలా చెపుతుంది? స్వరూప జ్ఞానం మాత్రమే ఉంటే అభేదమని, ధర్మభూతమయిన జ్ఞానం గూడా ఉంటే చేతనమని

నియమం అంటారా? అందువలన ఘటంలో స్వరూపమయిన జ్ఞానం మాత్రమే ఉన్నదంటారా? అది అచేతనం అంటారా? – సమా – మీరు జ్ఞాన స్వరూపభూతజ్ఞానమునందు ధర్మమయిన జ్ఞానం గూడా ఉన్నదన్నారు కదా! కనుక ఘటమునందు ధర్మం అయిన జ్ఞానం గూడా ఉన్నట్లే కనుక ఈ ఘటం చేతనమే కావాలి. ధర్మం అయిన జ్ఞానం లేని ధర్మి అయిన జ్ఞానం లేదు కదా!

ధర్మభూతమయిన జ్ఞానము స్వరూపజ్ఞానములోనే ఉంటుంది కనుక స్వరూపజ్ఞానమే చేతనమని, అందుకు భిన్నమయినదంతా అచేతనమని అంటారా! – అయితే లోకంలో మనం అనుకొనే చేతనాచేతన వ్యవహారం చెడిపోతుంది. జీవించునవి చేతనములని, జీవములేనివి అచేతనములని మన వ్యవస్థ గదా!

44. చేతనుడయిన జీవుని సారధ్యములోనున్న మనుష్య పశ్వాది జీవులు చేతనములు, లేనిచో అవి అచేతనములే. సమా – అయితే జీవుడు గూడా చేతనుడనాలి. ఎందుకంటే అతనికి జ్ఞానము స్వరూపము గుణముగూడా. మరి అయితే అట్టివాడే అయిన ఈశ్వరుడు అధిష్ఠించిన ఘటపటాదులుగూడా ఎందుకు, చేతనములు కాలేదు? చేతనేశ్వరుడు గాదు చేతన జీవుడుంటేనే అలా గంటారా? – అయితే చేతనుడయిన ఈశ్వరుడు ఘటాదులను అధిష్ఠించినట్లు కల్పించటం వ్యర్థం కదా! **అలాగే స్వయంగా జ్ఞానరూపుడు, జ్ఞానగుణుడు – అయిన జీవునియందు అట్టి ఈశ్వరుడు వ్యాపించటం వలన ఏమి ప్రయోజనం**? అలాగయితే మరో జీవుడు గూడా జీవునిలో వ్యాపించవచ్చును.

కనుక జ్ఞానస్వరూపమయిన బ్రహ్మము ప్రకృతి పురుషులలో వ్యాపించిందనటం అశక్యం.

45. వ్యాపించటం అంటే అధికదేశమునందు ఉండటం, వ్యాప్యం కావటం అంటే అల్పదేశమునందుండటం (వ్యాపకం – వహ్నివలె) అంటారా – అయితే ప్రకృతియే అట్టి దేశము. అందులో అల్పం అధికం అన్న తేడా లేదు.

ఈశ్వరుడు ప్రకృతిపురుషులలో వ్యాపించాడు, ప్రకృతి – పురుష, ఈశ్వరులలో వ్యాపించ లేదు. పురుషుడు ప్రకృతియందే వ్యాపించాడు, ఈశ్వరునియందు వ్యాపించలేదు. కనుక ఈశ్వరుడు వ్యాపకుడు, ప్రకృతి పురుషులు వ్యాప్యులు అంటారా? – కుదరదు. ఈశ్వరుడు ప్రకృతి పురుషులలో వ్యాపించిన విషయమే ఇంకా తేలలేదు గదా!

అయ్యా! ఈశ్వరుడు శక్తిమంతుడు. ఆ శక్తి అనపాయిని – అది నానావిధములు. అన్ని వస్తువులందు శక్తి ఏదో రూపంలో ఉన్నది. కనుక శక్తిమంతుడయిన ఈశ్వరుడున్నట్లే – అంటారా? – సమా – ఆ శక్తి ఈశ్వర వ్యాప్యమా? కాదా? – అవునంటే శక్తికి వ్యాపకము ఈశ్వర రూపము. కాదంటే ఈశ్వరునికి సర్వవ్యాప్తి లేదు. ప్రకృతి పురుష ఈశ్వరులు తామంగీకరించిన

తత్త్వాలు. అదిగాక శక్తిని అంగీకరిస్తే తమ సిద్ధాంతం పోతుంది. శక్తి ఈశ్వరునిలో అంతర్భాగం అంటే శక్తిమంతుడుగూడా ఈశ్వరునిలో అంతర్భాగమే. అంటే అగ్ని మొదలయినవి గూడా ఈశ్వరునిలో భాగమే. కాదు కాదు అది అగ్న్యాది పదార్థమే కాని శక్తిమాన్ అయిన ఈశ్వరుడు కాడు - అంటే ప్రత్యక్ష విరోధము. అగ్ని, శక్తిమాన్ కదా! దహన శక్తి ఉన్నది కదా!

46. అగ్నిలోని ఈశ్వరునిదే ఆ దహనశక్తి. అగ్నిదని ప్రజల భ్రాంతి - అంటారా? మంచిదే అయితే అగ్నిలో ఉండి దహించే ఆ యీశ్వరుని రూపమేమి? జ్ఞానమేనంటారా? - ఇంతకుముందే నిరాకరించాము. అయ్యా! ఈశ్వరునియందు రెండు శక్తులు కలవు. జ్ఞానశక్తి, క్రియాశక్తి. జ్ఞానశక్తి ప్రధానంగా ఉన్నచోట చేతనులు క్రియాశక్తి ప్రధానంగా ఉన్నచోట అచేతనములు - కనుక అగ్న్యాదులు అచేతనములు. కనుక అచ్చట ఈశ్వరవ్యాప్తి లేదు - అంటారా? - కుదరదు. అలాంటిచోట్ల అప్రధానంగానయినా జ్ఞానశక్తి ఉండాలిగదా! లేదని ఎలా అంటాం. చేతనములందు జ్ఞానశక్తి ప్రధానంగా ఉన్నా క్రియాశక్తి గూడా ఉన్నది కదా! నీ మతంలో చేతనమయిన ఆత్మ గదా జీవుడు. అతడే కర్త కదా! అందువలన అగ్నిగూడా చేతనుడే. కొడవలి, కఱ్ఱ, అన్ని చేతనమే కావాలి. కాని అనుభవం అలా లేదు. కనుక వానియందు ఈశ్వర వ్యాప్తి కుదరదు. క్రియాశక్తి ఉన్నా అది అగ్ని మొదలగు వానిదే. ఈశ్వరుడు నిష్క్రియుడు.

47. అయ్యా! శక్తియే ఈశ్వరుడు, శక్తిమాన్ కాదు. ఆ శక్తి కొన్నిచోట్ల జ్ఞానం, కొన్నిచోట్ల క్రియను కలిగిస్తుంది. అది సర్వత్ర ఉన్నది. కనుక ఈశ్వరుడు సర్వవ్యాపకుడు - సమా - కాదు. **శక్తి, తత్త్వము లేనిది. కార్యం వలన అది ఉన్నదని తెలుస్తుంది. అది జడము,** శక్తిమంతునకు లోబడినది. అస్వతంత్రము. అది బ్రహ్మం ఎలా అవుతుంది? మరియు, ప్రపంచం ప్రకృతి కార్యం కనుక ప్రకృతి వ్యాపించవచ్చును. ఘటం నిండా మట్టి గదా వ్యాపించేది. అది అచేతనం కనుక దానికి చేతనుడయిన పురుషుడు అధిష్ఠానం కావచ్చును. దేహం అంతే కదా! కనుక ప్రకృతి పురుషులతో సరిపోయినచోట ఈశ్వరవ్యాప్తి ఎందుకు? అసలు అక్కడ ఈశ్వరుడెందుకు? చేతనుడయినా పురుషురు అస్వతంత్రుడంటారా? అయితే, ఈశ్వరుడయినా అస్వతంత్రుడే అనాలి. అతనూ చేతనుడే కదా!

48. ఈశ్వరుడు చేతనా చేతన విలక్షణమయిన తత్త్వం అంటారా! అట్టి తత్త్వము అప్రమాణం. మూడవ వస్తువు ఎక్కడా లేదు. అయ్యా! ఈశ్వరుడు చేతనుడూ కాదు. అచేతనుడూ కాదు. చైతన్యమే. ఈశ్వరుడు - అంటారా? ఇందులో నూతనం ఏమీ లేదు. చైతన్యమే చేతనుడు. చైతన్యమే బుద్ధి మొదలగు వానిలో నుండి వాటిని ప్రేరణ చేస్తుంది. అయ్యా! దేహ ప్రకృతిలో పురుషుడు మట్టి మొదలగు వస్తువులలో నున్న ప్రకృతియందు ఈశ్వరుడున్నాడంటారా! - అచ్చట నున్నదీ పురుషుడే. అయితే అవి చేతనులు కావెందుకంటారా? మరి ఈశ్వరుడుంటే

అవి చేతనములు కావెందుకు? ప్రశ్నకు ప్రశ్నయే సమాధానము. దోషం ఇరువురికీ సమానము కదా! పురుషుడుంటేనే చేతనత్వం వస్తుందంటారా? చేతనత్వం కలిగించలేని వాడు ఈశ్వరుడు కాడు. ఆయనకే ఆ శక్తి లేదనటం విరుద్ధము. అయితే మీ సిద్ధాంతంలో ఏమిటో చెప్పమంటారా?

49. మా సిద్ధాంతము :

**చేతనా అనగా బుద్ధి**. పురుషుడన్నా బ్రహ్మమన్నా ఈశ్వరుడన్నా చైతన్యమే. అది సర్వవ్యాప్తము. ఇది బుద్ధియందు ప్రతిబింబిస్తుంది. **కనుక బుద్ధిగలవారు చేతనులవుతారు.** జడపదార్థములందు ఆ బుద్ధి ఉండదు. అందువలన అవి అచేతనములు. బుద్ధిలో చైతన్యం పురుషుడని సర్వవ్యాప్త చైతన్యం ఈశ్వరుడేనని తేడా లేదు. **చైతన్యం అంతా ఒక్కటే**.

సర్వత్ర చైతన్యం వ్యాపించిందనటానికి ఆధారం ప్రపంచంలో కనబడే చైతన్యలక్షణాలే. అస్తి భాతి అను వ్యవహారములే ఆ లక్షణము. ఉన్నది తెలుస్తున్నది. మా మతంలో ప్రపంచం బ్రహ్మజన్యం కనుక బ్రహ్మాంశములయిన అస్తి, భాతి, ప్రియం అనునవి (సచ్చిదానందములు) ప్రపంచమునందు కనబడుచున్నవి. కనుక నామతంలో కుదురుతుంది. మీరు జగత్తును బ్రహ్మ కార్యమని చెప్తున్నారు. అందులో ఈ గుణాలు రావు. మేముగూడా ప్రపంచం బ్రహ్మకార్యం కాదని చెప్తాము – అంటారా? అయితే బ్రహ్మకార్యం కాని ప్రకృతిపురుషులలో బ్రహ్మం ఎలా వ్యాపిస్తుంది. వ్యాప్తి లేకుండా బ్రహ్మ లక్షణాలు ఎలా దిగుతాయి? అవి అనాది కదా! ప్రకృతి సచ్చిదానందభిన్నమయినా దానిలోకి ఎలాగో బ్రహ్మాంశలు దిగవచ్చును. సచ్చిదానంద రూపమయిన పురుషునిలో బ్రహ్మ వ్యాప్తి ఎలా? కనుక ప్రకృతి పురుషుల యందు ఈశ్వర వ్యాప్తి చెప్పటం కుదరదు.

50. పురుషేశ్వరుల మధ్య వ్యాప్యవ్యాపకభావం లేదు. సరే – కాని ఈశ్వరవ్యాప్తమయిన ప్రకృతి ఉన్నది. పురుషేశ్వరులు ఇద్దరున్నారు. మరి బ్రహ్మం అద్వితీయం ఎలా అవుతుంది? సమా – ఈశ్వరవ్యాప్తమయిన ప్రకృతి ఈశ్వరుడే. మట్టిలో వ్యాప్తమయిన కుండ మట్టియే. అది ఈశ్వరుని నుంచి పుట్టకపోయినా ఈశ్వరుని యందు అధ్యస్తమయినది కనుక ఈశ్వర వ్యాప్తమే. (రజ్జు సర్పం రజ్జువ్యాప్తమే కదా!) పురుషుడు సాక్షాత్తూ ఈశ్వరుడే. కనుక బ్రహ్మం అద్వితీయమే. కనుక సృష్టికి ముందు వెనుక గూడా మాయావచ్ఛిన్నమయి ప్రత్యగాత్మయే అయిన సచ్చిదానంద రూప బ్రహ్మ ఉన్నది. అదే మధ్యలో స్థితి కాలములోనూ ఉన్నది. అయితే ఈకాలములో జగద్రూపంగా పరిణమించిన మాయతో అవచ్ఛిన్నంగా ఉన్నది. అంతే తేడా. **పరమార్థతః అయితే అద్వితీయబ్రహ్మమే ఉన్నది.**

**శ్లో॥ సత్తద్బ్రహ్మ జగద్భవేయమహమిత్యాలోక్య తేజోఽసృజత్**
**తత్తేజోమయమమ్బు చామృతమయం సఙ్కల్ప్య తన్మేదినీమ్ ।**

**భూయస్తద్బృహదైక్షతాప్యహమిమాస్తిస్రః ప్రవిశ్యాత్మనా**
**జీవే నాకరవాణి రూపమభిధామేతాస్త్రివృత్త్వం గతాః ॥ 339**

భావ॥ సద్రూపమయిన ఆ బ్రహ్మచైతన్యం "నేను జగత్తుగా కావలయును" అని సంకల్పించెను. తరువాత తేజస్సును సృజించెను. తేజోమయమయిన ఆ బ్రహ్మము జలమును సృష్టించెను. తేజోమయమయిన ఆ బ్రహ్మము భూమిని సృష్టించెను. తరువాత ఆ బ్రహ్మం మరల ఇలా సంకల్పించెను. నేను ఈ మూడు దేవతలలోనికి జీవరూపంతో ప్రవేశించి నామరూపములను సృష్టించెదను. వీటిని ప్రత్యేకముగా "త్రివృత్' గా చేసెదను. 339

విశే॥ 1. సాంఖ్యులవాదము. 'సదేవేదమగ్రమాసీత్' అనగా 'సత్' అంటే ప్రధానము. అదే ముందున్నదన్నమాట నిజము. ప్రధానమయితేనే మార్పు చెందుతుంది. అక్రియం అవికారం అయిన బ్రహ్మం పరిణామం పొందదు. జగత్తు కాదు. బ్రహ్మం ఏకరూపం. ప్రధానం సత్త్వరజస్తమోగుణస్వరూపం. దీనికి గుణవైషమ్యం ఏర్పడటం స్వభావం. పరిణామం సాధ్యం. వేదంలో "ప్రధాన క్షేత్రజ్ఞపతిర్గణేశః" అని ప్రధానపదం ఉన్నది. ప్రధాన జగత్తులు అచేతనాలు. బీజాంకురములవంటివి. కార్యకారణభావం సమానం జడత్వం సరిపోతాయి. ప్రధానం బీజం వంటిది. జగత్తు వృక్షం వంటిది. ప్రపంచం సృష్టికి ముందు ప్రధానంగా ఉంటుంది. చెట్టు విత్తనంగా ఉంటుంది గదా! ఆ ప్రధానమే ఆదిలోని 'సత్'. అదే బ్రహ్మ. "మమ యోనిః మహద్బ్రహ్మ" అని గీత గూడా ప్రధానమును బ్రహ్మ అన్నది. మరొక ప్రధానము లేదు గనుక అది ఏకము. వికారములు లేని స్థితిలో అది అద్వితీయము. సమా -

2. అద్వైతుల వాదన ఇది :

జడమునకు సంకల్పం ఉండదు. "సేయందేవతైక్షత" అని ఈక్షణం ప్రధానానికి కుదరదు. ప్రధానం జడం కదా? కనుక సత్ బ్రహ్మ చైతన్యమే. అది మాయావచ్ఛిన్న మయిన దశలో పరిణామం(వివర్తం) సాధ్యమే. కనుక ఉన్నదని లేదని నిరూపించుటకు సాధ్యముకాని సూక్ష్మజగద్రూపమయిన ఈశ్వర శక్తి రూపమయిన ప్రధానం "సత్" అనటం కుదరదు. ప్రధానం ఈశ్వర శక్తి కాదు. వేరే తత్త్వం అంటారా? అయితే అది శ్రుతి విరుద్ధము. శ్రుతిలోని ప్రధాన పదము ఈశ్వరశక్తినే చెప్తుంది. "దేవాత్మశక్తిం స్వగుణైః నిగూఢాం" బ్రహ్మం అంటే ముఖ్యార్థం బ్రహ్మమే. అది కుదురుతుండగా దానిని కాదని 'ప్రధానము' అని లాక్షణికార్థం చెప్పరాదు. పైగా ద్వితీయ వస్తువు పురుషుడుండగా ప్రధానం అద్వితీయం కాదు. నిర్వికార బ్రహ్మమునకయినా మాయా సంపర్కం వలన 'సంకల్పం' కలుగుతుంది.

3. 'ఆలోక్య' తరువాత 'ఆకాశ వాయువులను సృజించి' అని కలపాలి. (తైత్తిరీయంలో అలా వరస ఉన్నది గదా! ఇచ్చట చెప్పినది మూర్త భూతాల గూర్చి. జీవుడు ప్రవేశించాల్సినది మూర్తులలోనికి గదా!)

**శ్లో॥ యత్సఙ్కల్పితమాత్మనా బృహదిదం తత్సత్యకామం వృథా-**
**ద్భూతాని త్రివృదాహితాని భువనే దృశ్యన్త ఏవాధునా ।**
**సూర్యాగ్నీన్దుతటిద్గ్రహర్క్ష నికరా స్తేజఃప్రసిద్ధే జల**
**క్షోణ్యౌ తత్ర చ రోహితం సితమథో కృష్ణం చ రూపం త్రిధా ॥ 340**

భావ॥ "ఆత్మనా జీవేన -' అని సంకల్పించిన బ్రహ్మం సత్యకామం. అది ఆమేరకు పనిపూర్తిచేసినది. భూతములను 'త్రివృత్' చేసినది. నేటికి భూతములందు ఆ జాడ కనబడుతున్నది. సూర్య, అగ్ని, చంద్ర, విద్యుత్, గ్రహ, నక్షత్రములు తేజస్సు – జలము భూమి ప్రసిద్ధమయినవి గదా! వీటియందు లోహితవర్ణము, ధవళవర్ణము, కృష్ణవర్ణము కనబడుచున్నవి. ఈ మూడు రకముల వర్ణనలు త్రివృత్కరణ ఫలితములే. 340

విశే॥ 1. పృథివీ జల తేజోరూపములయిన భూతములందు జీవరూపముగా బ్రహ్మం ప్రవేశించి నామరూపములను వ్యాకరించినది.

2. అనుప్రవేశమనగా అవిద్యలోగాని అంతఃకరణములయందు ప్రతిబింబరూపంలో ప్రవేశించి అందు అవచ్ఛిన్నంగా ఉండటము. అదే అనుప్రవేశంగా చెప్పబడినది.

3. అవచ్ఛిన్నమయినదిగాని ప్రతిబింబమయినదిగాని మరల భూతములందు ఎట్లు ప్రవేశించును? – సమా – అజ్ఞానమునందు ప్రవేశించినట్లుగా అజ్ఞానకార్యములయిన భూతములందును ప్రవేశిస్తుంది. అయ్యా! అజ్ఞానంలోనే అంతఃకరణోపాధిగా ఉన్న జీవుడు మరల భూతములలో ఎట్లు ప్రవేశించును? – సమా – అజ్ఞాన సంబంధంతో ఉన్న జీవునకు భూతములతో సంబంధము కలగటమే ఈ ప్రవేశము. లేదా కారణం కార్యంలో ప్రవేశిస్తుంది కనుక అజ్ఞానం భూతములకు కారణం కనుక అజ్ఞానం భూతములలో ప్రవేశించునపుడు అజ్ఞాన గతుడయిన జీవుడున్నా భూతములందు ప్రవేశించును. ఇందువలననే జీవునకు అజ్ఞాన సంబంధంతో బాటు భూతసంబంధం గూడా ఏర్పడింది.

4. భాష్యకారులు అదే అన్నారు. "తేజోబన్నభూతమాత్రసంసర్గముగల" – భూతాభిమాని దేవతలలోనికి అనుప్రవేశం జరిగిందని **రంగరామానుజుడు** అన్నాడు. అది బాగా లేదు. అప్పటికి దేవతా శరీర సృష్టి కాలేదు. భూత రూపమయిన దేవతలే త్రివృత్తుగా చేయబడినారు.

5. త్రివృత్కరణమనగా, ఒక్కొక్క భూతమును రెండు రెండుగా (భాగాలు) చేసి అందులో ఒక భాగమును మరల రెండు చేసి తమకున్న ఇతర ద్వితీయాంశలతో కలపటం వలన భూతములు ప్రత్యేకంగా మూడు రకాలు అవుతాయి.

6. పంచీకరణమనగా, ఒక్కొక్క దానిని రెండుగాచేసి అందులో ఒక్కొక్క అంశను నాలుగుగా చేసి తమతమ ఇతర ద్వితీయాంశలతో కలపటం వలన అవి ప్రత్యేకంగా ఐదు

ఐదు అగును. మనకు కనబడే దొరికే నక్షత్రాది తేజస్సులు, నీరు, గృహాది స్థలము అన్నియు అలా త్రివృత్, పంచీకృతం అయినవే. కనుకనే తేజస్సుకు మామూలుగా లోహితరూపమయినా త్రివృత్కరణం వలన లోహిత శుక్ల కృష్ణ రూపములు ఏర్పడుతాయి. నీరు తెలుపు. భూమి నలుపు. కాని త్రివృత్కరణం వలన మూడు రంగుల మిశ్రమ రూపాలు ఏర్పడుతున్నాయి.

**శ్లో॥ సూర్యాగ్న్యాదిషు వాపికాప్రహితటాకాదౌ యవాదిష్వపి**
**ప్రత్యక్షం భువి లోహితం యదిదకం రూపం హి తత్తేజసః ।**
**యచ్ఛ్వేతం తదపాన్తు కృష్ణమథ యద్భూమేస్తదేతత్త్రయం**
**సూర్యాదేస్తు పృథక్కృతం యది తదా మిథ్యైవ సూర్యాదయః ॥ 341**

భావ॥ సూర్యుడు, అగ్ని - త్రివృత్ అయిన తేజస్సులు. వాపీకూపాదులు త్రివృత్ అయిన నీరు. వ్రీహియవాదులు త్రివృత్ అయిన భూమి. వీటియందున్న లోహిత వర్ణము అగ్నిది. శుక్ల వర్ణము నీటిది. కృష్ణవర్ణము భూమిది. సూర్యాదులనుంచి యీ రూపత్రయంతొలగిస్తే సూర్యాదులు మిథ్యలే. 341

విశే॥ 1. ఈ రూపత్రయము వ్యావహారిక సత్యము. అది తొలగిస్తే అంతా మిథ్య. "బ్రహ్మ సత్యం, జగన్మిథ్య" అని దీనివలన తెలుస్తుంది - అందుకిది ఉదాహరణం.

2. సూర్యాదులందు రూపం తప్ప ఏమియు లేదు. రూపం గుణం కనుక గుణి అయిన ద్రవ్యం ఉండాలి. కాని నామరూపాలు తప్ప అంతకు మించి జగత్పదార్థం లేదు. అంతా భూతాత్మకమే. అదే తత్త్వము.

3. రూపరహితమయిన ద్రవ్యము లేదు. లేదా ఉన్నదనుకొందాము. అది తత్త్వరీత్యా భూతాత్మకమే. అంతే తప్ప సూర్యాద్యాత్మకం కాదు. రూపం విడదీసి చూచినపుడే రూపాశ్రయద్రవ్యం గూడా విడదీసినట్లే. కనుక సూర్యాదులు మిథ్య.

4. మట్టి ఘటమయినట్లు "త్రివృత్" గా చేయబడిన భూత త్రయం సూర్యాది రూపంగా పరిణమించింది. ఘటం నుండి మట్టిని విడదీసినట్లు ఊహిస్తే, ఘటం అనే నామరూపములు మిథ్య. మట్టియే సత్యం. సూర్యాదులనుంచి కారణమయిన భూతత్రయమును విడదీస్తే సూర్యాదులు మిథ్యయే. నామరూపములు తప్ప ఏదీ లేదు. రూపత్రయమే భూతత్రయము. రూపత్రయమును విడదీయటమనగా భూతత్రయములను విడదీయటమే. "రూపము భూతము" అవిభాజ్యములు గదా!

**శ్లో॥ లోకోఽయం నిఖిలస్త్రివృత్కృతమహాభూతత్రయారబ్ధ ఇ-**
**త్యస్మాద్భూతమయాకృతిత్రయపృథక్కారే మృషాయమ్భవేత్ ।**

**వాగాలమ్బనమాత్ర ఇత్యుపగతే నామప్రపఞ్చే మృషా**
**భావం భూతమయాకృతిత్రయమిదం సత్యం పరం శిష్యతే ॥ 342**

భావ॥ ఈ లోకం అంతా త్రివృత్‌గా చేయబడిన మహాభూతత్రయం చేత ప్రారంభమయినది. అందువలన దీనియందు ఆ భూతత్రయం వలన ఏర్పడిన లోహిత శుక్ల కృష్ణాది ఆకారత్రయమును మినహాయించి చూచినచో అంతా మిథ్యయే. కేవలం నామ మాత్రం మిగులుతుంది. అది మిథ్యయే అవుతుంది. చివరకు తత్త్వం గా మిగిలేది ఈ భూత త్రయా కృతి మాత్రమే. అదే సత్యం. 342

**శ్లో॥ భుక్తాన్నస్య పురీషభావమయతే భాగో మహాన్మధ్యమో**
**మాంసం స్యాదణురాశయోఽన్నమయమిత్యుక్తం మనస్తద్బుధైః ।**
**పీతామ్బూని తు మూత్రరక్తమరుతః ప్రాణస్తదమ్భోమయ-**
**స్తేజోఽప్యస్థి చ మజ్జికా చ వచనం తేజోమయీ వాక్తతః ॥ 343**

భావ॥ భుజించిన ఆహారమునందు ఎక్కువ భాగము పురీషం (మలం) అగును. మధ్యమ భాగము మాంసమగును. అణుతరమయిన కణభాగములు మనస్సు అగును. త్రాగిన నీరు మూత్రము, రక్తము వాయువు (ప్రాణము) అగును. అనగా స్థూలభాగము మూత్రము, మధ్యభాగము రక్తము, సూక్ష్మభాగము ప్రాణము అగును. తేజస్సులో స్థూలభాగము ఎముక, మధ్యమ భాగము మజ్జ, సూక్ష్మభాగము వాక్కు అవుతుంది. కనుకనే వాక్కును "తేజోమయీ వాక్" అంటారు.

కనుక మనః ప్రాణ వాక్కులుగూడా నామమాత్రము. మిథ్య. భూత త్రయమే సత్యము. 343

**శ్లో॥ వాక్ప్రాణాప్తమనః ప్రవిశ్య భగవాన్ జీవాత్మనా వర్తతే**
**సూర్యో వా సలిలాశయం ఘటమివాకాశో హృదాత్మా స చ ।**
**ధ్యానాదివ్యవహారవానుపరమే చిత్తస్య సుప్తావయం**
**స్వం ప్రాప్నోతి బృహత్పదం స్వపితి నేత్యాచక్షతే తజ్జనాః ॥ 344**

భావ॥ వాక్ప్రాణములతో కలిసిన మనస్సులోకి భగవంతుడు జీవుడుగా ఉంటాడు. సూర్యుడు సరస్సులోకి ప్రవేశించినట్లు, ఘటంలోకి ఆకాశం ప్రవేశించినట్లు భగవంతుడు మనస్సులో ప్రవేశిస్తాడు. (ప్రతిబింబంగాను, అవచ్ఛిన్నంగాను - ఉపమానం)

ఆ జీవుడు మనోమయుడై, ధ్యానాదివ్యవహారములు చేస్తుంటాడు. నిద్రలో మనస్సు లీనమయిన తరువాత ఈ జీవుడు సుషుప్తిలో తనదయిన బ్రహ్మపదమును పొంది ఆనందించును. కాని జనులు అది తెలియక నరుడు నిద్రించుచున్నాడని అనుకొందురు. 344

విశే॥ 1. వాక్ప్రాణములతో గూడిన మనస్సు అనగా లింగశరీరము. భూతత్రయమయ

మయిన లింగశరీరమునందు జీవుడు ప్రవేశించటమే. బ్రహ్మం భూతత్రయమునందు ప్రవేశించటము.

2. అన్నం మొదలయినవి మనస్సు మొదలయిన వానికి ఆహ్లాదం కలిగిస్తాయని అర్థం. అంతేగాని మనస్సు మొదలయినవానిని పుట్టించినాయని కాదు – సమా – సరే. అందుకే అవి భూతమయమందాము. లేదా, అపంచీకృతమయిన పంచభూత కార్యము లింగశరీరము అని ఇతరత్ర ప్రసిద్ధము కనుక, దానిని బట్టి త్రివృత్‌కాని భూతత్రయం వలన పుట్టినవే ఈ మనస్సు మొదలయినవి. కనుక ఇవి భూతమయమే. దీనిలోనికి బ్రహ్మం అవిద్యోపాధిగల జీవుడుగా ప్రవేశించెను. (త్రివృత్తు అయిన భూతత్రయంలోనికి మాత్రము అంతఃకరణోపాధిగతమయిన జీవరూపంతో ప్రవేశించెను.)

3. భూతత్రయములో ప్రవేశించిన భగవంతుడు భూతత్రయంలోనే ఉన్న లింగ శరీరము నందు ప్రవేశించి యుండును. లేదా, భూతత్రయమునందు ప్రవేశించి ఉన్న జీవుడు అందలి లింగ శరీరమునందున్నాడు. ఏ ఉపాధిలో (అంతఃకరణం/అవిద్య) ప్రవేశించి జీవుడు ఇంతకుముందు భూతత్రయము నందు ప్రవేశించియుండెనో ఆ ఉపాధిలో ప్రవేశించియే ఇపుడూ ఉన్నాడు. అదే ఉపాధిలో ఇపుడు భౌతిక దేహములందును ఉన్నాడు.

4. లేదా దేవాదిదేహాలు నామమాత్రములే. భూత త్రయమే సత్యము. కనుక ఇపుడుగూడా జీవుడు త్రివృత్ – భూతత్రయమునందు ప్రవేశించి యున్నాడు.

అయితే లింగశరీరం ఉపాధిగానే అందులో ప్రవేశించాడు. ఇందులో వాక్, ప్రాణము, మనస్సు. ఇందులో లింగశరీరములో మనస్సే ప్రధానము.

5. జీవుడే బ్రహ్మమని చెప్పటానికి, అలాగే అసలు బ్రహ్మం ఉందని నిరూపించటానికి సుషుప్తి – ఉదాహరణమును చూపినాడు.

**శ్లో॥ పక్షీ సూత్రసితో దిశం దిశమితోఽలబ్ధాశ్రయో బన్ధనం**
**ప్రాప్నోత్యేవ యథాతథా హృదుపధిర్జీవః పతిత్వాఽభితః ।**
**అప్రాప్తాయతనోఽ న్యతస్స్వమయతే బ్రహ్మైవ హృద్బన్ధనం**
**జీవాఖ్యం బృహదేకమేవ సదిదం సత్యం మృషాఽతఃపరమ్ ॥ 345**

భావ॥ కాలికి త్రాడు గట్టిన పక్షి నానాదిక్కులకు ఎగిరి ఎగిరి 'కట్టుకొయ్య' వద్దకే చేరి విశ్రమిస్తుంది. అట్లే హృదయమునందున్న జీవుడు సంసారంలో జాగరణంలో రకరకాల ఆశలతో శ్రమించి, భ్రమించి ఎచ్చటను విశ్రాంతి లేక చివఱకు చివఱకు హృదయమునందే చేరి అచ్చటనే జీవరూప (ప్రత్యగాత్మ) మయిన బ్రహ్మమునే ఆశ్రయించి విశ్రమించును. కనుక బ్రహ్మం ఒక్కటే

సత్యము. బ్రహ్మభిన్నమయిన భూతత్రయాదికమంతా మిథ్యయే వ్యవహారదృష్ట్యా మాత్రమే అది సత్యము. 345

**శ్లో॥ పీతాపేన రసాదిభావమయితేనాన్నేన నిష్పాదితో**
**దేహో௨యం వటబీజశుఙ్గ ఇవ నా௨మూలో భవిష్యత్యయమ్ ।**
**అన్నమ్మూలమతో௨స్య తస్య తు జలం తేజస్తతస్తస్య సత్**
**సన్మూలాస్సకలాః ప్రజాస్సదయనాస్తత్సత్ప్రతిష్ఠా అపి ॥ 346**

భావ॥ అన్నపానీయములు శుక్ల శోణితాది రసరూపమును పొందినవి. అట్టి అన్నము వలన ఈ దేహం ఏర్పడినది. వటబీజాంకురం వలె ఈ దేహమునకు ఒక మూలం తప్పక ఉన్నది. అది అన్నము. అన్నమునకు మూలము జలము. జలమునకు మూలము తేజస్సు. తేజస్సుకు మూలము "సత్" అనగా బ్రహ్మము. సకల ప్రజలకు బ్రహ్మమే మూలము. బ్రహ్మమే మార్గము. గమ్యము. బ్రహ్మమే ప్రతిష్ఠ. 346

విశే॥ 1. అన్నమునకు జలం మూలం అనగా వృష్టి వలన పంటలు పండుతాయి గదా! – ఎండవలన వర్షం రావటం వలన తేజస్సు మూలము. చెమట అలాగే ఏర్పడుతుంది గదా! సూర్యకిరణములే పర్జన్యుడుగా అయి వర్షిస్తాయని శ్రుతి. ఉక్కపోసిన రోజు వెంటనే వర్షం కురవటం అనుభవమే కదా!

2. తేజస్సుకు కారణం బ్రహ్మం. అది అనుభవంలో తెలిసే విషయం కాదు. కాని తేజస్సుకు కార్యం కనుక దానిని లింగముగా (హేతువు) భావించి కారణమయినది. బ్రహ్మమును అనుభవంలోకి తేవచ్చును. ధూమంతో సాధింపబడిన అగ్ని, ప్రత్యక్షం కాకపోయినా 'సత్' కదా! అలాగే ఇదీ.

తేజస్సు దృశ్యం కనుక కార్యము. "దృశ్య ములన్నియు జన్యములే" గదా!

3. సదయనాః – బ్రహ్మమునందు స్థితిగలవారు. సత్ప్రతిష్ఠాః – బ్రహ్మమునందు లీనమగు వారు. మట్టివలన వచ్చిన ఘటము మట్టిలోనే ఉంటుంది. లీనమవుతుంది. అలాగే ప్రజలకు బ్రహ్మం (సత్) మూలము. అందువలననే 'సత్' తాదాత్మ్యము. అందువలన సత్ – జగత్తు అవుతుందని అదే వాడుక. అందువలన జగత్తుకు సత్తే కారణము. సద్భిన్నము కారణం కాదు.

**శ్లో॥ కార్యం నామ న కారణాద్భువి పరం వస్త్వస్తి కిఞ్చిత్తతః**
**సత్యం కారణమేవ కార్యమనృతం హేత్వాత్మనా తత్తు సత్ ।**
**మృత్స్నాయా న పరో௨స్తి కుమ్భ ఇతి కో௨ప్యర్థః క్షితౌ మృత్తికా**
**సత్యా కుణ్డమథానృతం తదుదితం మృత్స్నాత్మనా తత్తు సత్ ॥ 347**

భావ॥ కారణం కన్న భిన్నంగా కార్యం అంటూ ఏదీ లేదు. కనుక కారణమే సత్యము. కార్యం మిథ్య. కారణరూపంగా మాత్రమే కార్యము సత్యము. కార్యరూపంగా మాత్రం సత్యం కాదు. మట్టికన్న భిన్నంగా 'కుండ' అనబడువస్తువేదియూ లేదు. కనుక మట్టి సత్యము. కుండ మిథ్య. అది మట్టిరూపంగా అయితే "సత్" 347

**శ్లో॥ అన్నం సత్యమిదం శరీరమనృతం కార్యం యదన్నస్య త-**
**న్మిథ్యాఽన్నం జలమేవ సత్యముదకం హేతుర్యదన్నస్య తత్ ।**
**తేజస్సత్యమిదం మృషైవ సలిలం తేజోమయం యజ్జలం**
**తేజస్తచ్చ మృషా సతస్సముదితం సత్యన్తు సత్కేవలమ్ ॥ 348**

భావ॥ కారణం సత్యం. కార్యం మిథ్య. సత్యమయిన భూతత్రయాత్మకమయిన రూపత్రయం మిథ్య ఎలా అవుతుంది? - సమా - తమ తమ కారణ పదార్థాలదృష్ట్యా అవి మిథ్యలే. బ్రహ్మం ఒక్కటే సత్యం. చూడండి.

అన్నము సత్యము, అన్నకార్యమయిన శరీరము మిథ్య. అన్నము మిథ్య దానికారణమయిన జలం సత్యం. కాని జలం మిథ్య. తేజస్సు సత్యము. అది జలకారణం కదా! తేజస్సున్ను మిథ్యయే. దానికారణమయిన బ్రహ్మం సత్యము. కనుక సద్వస్తువయిన బ్రహ్మము మాత్రమే సత్. సత్యము. కార్యదృష్ట్యా కారణాలు సత్యము. అవిగూడా తమ కారణాలదృష్ట్యా మిథ్యలు. కారణ రూపంగా ఆలోచించబడిన కార్యమయినా సత్యమే. కాని కార్యంగానే చూస్తే మాత్రం మిథ్య. 348

**శ్లో॥ తేజోఽబన్నమయం సమస్తభువనం భూతత్రయం తత్స్వయం**
**మిథ్యైవానుగతాత్మకారణబృహద్రూపేణ సత్యోచ్యతే ।**
**సత్యం బ్రహ్మ తు తత్స్వయం యదభవం నిర్విక్రియం కారణం**
**సర్వస్యాపి తతస్సదిత్యభిధయా బ్రహ్మైకమేవోచ్యతే ॥ 349**

భావ॥ ఈ లోక త్రయము 'తేజోబన్న' స్వరూపము. ఇది భూతత్రయము. ఈభూతత్రయము (తేజః ఆప్ అన్నం) గూడా స్వయంగా మిథ్యయే. కాని వాటియందు వ్యాపకంగా ఉన్న కారణమయిన బ్రహ్మం సత్యమే. అందువలన బ్రహ్మరూపంగా భావిస్తే ఈ ప్రపంచము సత్యమే. బ్రహ్మం మాత్రము ఆపేక్షిక సత్యం కాదు. అది సర్వకారణకారణము కనుక స్వయం సత్యము. అది జన్మనాశరహితము. ఇతర పరిణామాది వికారరహితము. సర్వకారణము. కనుక "సత్" అన్నపదం వాస్తవంగా బ్రహ్మమునకే చెందును. 349

విశే॥ అయ్యా! ప్రధానంగూడా ఎపుడూ కారణమే. అది కార్యం కాదు. కారణమయినదల్లా సత్యమయితే ప్రధానం ఎందుకు "సత్" కాదు. - సమా - ప్రధానము సత్తు అయిన

బ్రహ్మమునందు అధ్యాస చేయబడినది. కనుక ప్రధానం సత్‌కాదు. మిథ్యయే. ఈ అధ్యాసవలననే భేదము తెలియదు. కనుక "ప్రధానము సత్" అన్న వ్యవహారం కలుగుతుంది. బ్రహ్మం మాత్రం అధ్యాస చెందలేదు. అదే అధ్యాసకు ఆధారము. అధిష్ఠానము. ప్రధానము అచేతనం కనుక అది చేతనంమీద అధ్యాస చెందకుండా నిలువలేదు. (చైతన్యం మీద అహం, దేహం అధ్యాసలాగా) 'ప్రధానం' అస్తి భాతి అనునవి నిజమయిన సత్తు వలననే వచ్చినవి. స్వయంగా ప్రధానం అచేతనం. "మనుష్యోహం" మొదలయిన వాటినిబట్టి పరస్పరాధ్యాస కారణముగా జీవుడు గూడా అధ్యాస చెందాడు. కనుక బ్రహ్మం అధ్యాస అయినట్లే లెక్క. కాని అధ్యాస దశలో జీవుడు బ్రహ్మభిన్నుడు గాడు. అధ్యాసరహిత స్థితిలో తాత్త్వికంగా మాత్రమే బ్రహ్మం అవుతాడు. అందువలన సర్వకారణము, సర్వాధ్యాసలకు అధిష్ఠానము, అయిన బ్రహ్మం ఒక్కటియే సత్యము. దానికి భిన్నమయిన అవ్యక్తం వద్ద నుంచి అంతా మిథ్యయే.

**శ్లో॥ లోకేఽస్మిన్ పురుషస్య మృత్యుమయతస్సమ్పద్యతే వాగ్ఘృది**
**ప్రాణే తచ్చ స తేజసి ద్యుతిమయే బ్రహ్మణ్యనన్తే చ తత్ ।**
**స్వాపే బ్రహ్మణి వా ప్రవిష్ట ఇహ యస్త్వజ్ఞస్స దేహం భజే-**
**దుత్థాయావశధీరితస్తు విబుధో నావర్తతేఽతః పునః ॥ 350**

భావ॥ సత్ప్రతిష్ఠాః ప్రజాః. అన్నారు అంటే ప్రజాః = కార్య కారణ సంఘాతరూపమయిన దేహములు భూతములందు, భూతములు సత్తునందు లయమవుతాయి. కాని కరణములు లింగశరీరము ఎక్కడ లయమవుతాయి? భూతములందు లయం కాదు. దేహమును వదలి లింగదేహము లోకాంతరం వెళ్తుంది గదా! – సమా – కరణములు గూడా సత్తులోనే లయమవుతాయి. చూడండి.

మరణించుకాలమున పురుషుని వాక్కు హృదయమునందు, అది ప్రాణమునందు, అది తేజస్సునందు, ఆ తేజస్సు అనంతమయిన బ్రహ్మమునందు – సుషుప్తిలోలాగా లీనమగును. ఈ దశలో అజ్ఞాని అయినవాడు బ్రహ్మమునుండి మరల జన్మకు వచ్చును. జ్ఞాని అయినవాడు మరల జన్మకు రాడు. (నిర్గుణ బ్రహ్మములో కలియటమో, సగుణ బ్రహ్మలోకమున నుండుటమో జరుగుతుంది.) 350

విశే॥ 1. లీనం కావటం అంటే ఇంద్రియాలు తమ పనులను మానటం, మనోవ్యాపార ఇంద్రియవ్యాపారాలు రెండూ పోయిన స్థితి ప్రాణ లీనదశ – ఇది సుషుప్త్యావస్థ వంటిది. తరువాత ప్రాణవ్యాపారమయిన ఊపిరిగూడా ఆగిన స్థితిలో క్రియాశక్తి జ్ఞానశక్తి రహితమయిన అంతఃకరణం కేవలాంతఃకరణంగా ఉంటుంది. ఇది తైజసము కనుక ప్రాణవ్యాపారం లేని శరీరంలోగూడా కొంచెం వేడిమి ఉంటుంది.

2. ఈ అంతఃకరణము జీవునియందు లీనమగును. జీవుడే తేజస్సు. అతడు అంతఃకరణంలో ఉంటాడు కనుక. అతడు తేజోమయమయిన చైతన్యరూపంలో లీనమవుతాడు. అనగా అంతఃకరణ తాదాత్మ్యాధ్యాస పోయి జీవుడు బ్రహ్మ రూపంగా ఉంటాడు. ఈ దశలో అంతఃకరణం గూడా ఉండదు. శరీరం పూర్తిగా చల్లబడుతుంది. మరణం జరుగుతుంది.

3. జాగరణంలో అంతఃకరణం పనిచేస్తూ ఉంటుంది. దానికి బాహ్యేంద్రియాలు తన అంతర్భాగాలయిన మనోబుద్ధి చిత్తాహంకారాలు, క్రియాశక్తి అయిన ప్రాణము సహకరిస్తాయి. దానితో కలిసిపోయిన చైతన్యము జీవుడు. అతడు ఇంద్రియాదిక్రియలన్ని తనవయినట్లు "పశ్యామి, నశ్యామి" అనుకొంటూ ఉంటాడు. స్వప్నంలో బాహ్యేంద్రియ వ్యాపారం ఉండదు. జ్ఞానక్రియాశక్తులు గల మనస్సుంటుంది. అది స్వప్న విషయాలను అనుభవిస్తుంటుంది. సుషుప్తిలో అంతఃకరణం క్రియాశక్తి అనగా ప్రాణ వ్యాపారమాత్రంలో ఊపిరి తీసికొంటూ ఉంటుంది.

కాని మరణంలో ఆ క్రియాశక్తిగూడా పోతుంది. **కేవలం వట్టిబోయిన అంతఃకరణం మిగులుతుంది**. అది వాసనారూపంగా బ్రహ్మమునందు లీనమయి ఉంటుంది. అంతః కరణవాసనలోనే ఇంద్రియాది వాసనలూ ఉంటాయి.

**ఈ అంతఃకరణం మరల ప్రారబ్ధవశమున మరల మరో దేహం పొంది పూర్వ వైభవం సంతరించికొంటుంది**. జ్ఞానికయితే అంతఃకరణం తన కారణమయిన భూతములలో కలిసి పోతుంది. (తస్య ప్రాణా ఇహైవ లీయంతే). కనుక వాడు మరల జన్మకురాడు. వాడు బ్రహ్మమే.

అంతఃకరణం పోతే అందులోని జీవుడు నశించడు. ఘటం పగిలితే ఘటాకాశం పగలదు. ఆకాశంలో కలుస్తుంది. అలా అని జీవుడు బ్రహ్మంలో కలవడు. **వాసనారూపముగా ఉపాధి ఉంటుంది.** (జ్ఞానికది ఉండదు). బ్రహ్మమునందు చేరిన వానికి ఈ వాసనలెలా ఉంటాయి? అంటారా? – అజ్ఞానంలో ఉంటాయి. **కనుక మరణ ప్రలయాలలో జీవునకు అంతఃకరణ వాసనలు గల అజ్ఞానము ఉపాధి. కనుక కేవల అజ్ఞానం బ్రహ్మోపాధి. వాసనాసహిత అజ్ఞానం జీవోపాధి.** కనుకనే బ్రహ్మం గాని బ్రహ్మవేత్త గాని పుట్టరు. బ్రహ్మవేత్తకు ప్రాణయాత్ర ఉండదు.

4. తత్త్వవేత్త కాని వానికి ప్రాణోత్క్రమణం శ్రుతిలోనున్నది. ఇచ్చట ప్రాణలయం చెప్తున్నారు – ఎందువలన? – సమా – మనః ప్రాణేంద్రియాత్మకమయిన లింగ శరీరము వాసనారూపమయి మరల దేహాంతరమును పొందునని చెప్పటం వలన **దేహావచ్ఛిన్నమయిన బ్రహ్మప్రదేశమున లీనమయిన లింగశరీరము దేహాంతరావచ్ఛిన్నమయిన బ్రహ్మ ప్రదేశమునుండి పునః జన్మించాలంటే అంతకుముందున్న బ్రహ్మ ప్రదేశమునుండి ఉత్క్రమణం జరిగిందని చెప్పక తప్పదు.** (జీవుడు పునర్జన్మకు వచ్చాడంటే అర్థము పాతశరీరము నుండి లేచి వచ్చినట్లే కదా! కనుక విరోధము లేదు. కనుకనే "లేచి" (ఉత్థాయ) అన్నాము. ఈ శబ్దమునకు రెండర్థములు.

ఒక దేహావచ్ఛిన్న ప్రదేశమునుంచి లేచి మరో దేహావచ్ఛిన్న ప్రదేశమునందు దాగియుండును. అచ్చటనుండి దేహతాదాత్మ్యాధ్యాసపొందును.

లేదా, లింగశరీరం తన శరీరావచ్ఛిన్న బ్రహ్మమునందు కాక దేహాత్ బాహ్య వ్యాప్త మయిన బ్రహ్మము నందే వాసనారూపమున లయించును. కనుక లింగము బాహ్యవ్యాప్త బ్రహ్మదాకా చేరటానికి శరీరమునుండి బయలుదేరవలసినదే గదా!

తత్త్వవేత్తకు మాత్రం లింగ శరీరం భూతములయందే లయిస్తుంది. కనుక ఉత్క్రాంతి అవసరం లేదు. అది వాసనారూపంగా నిలవదు గదా! అతను దేహమునందే బ్రహ్మముతో కలియును.

5. మరయితే బుద్ధియే చచ్చి వాసనారూపంగా మిగిలినదశలో "అవశధీః" అని అనటం సముచితం కాదు. "ధీ" బుద్ధి లేదుగదా! – సమా – కార్యం కారణాధీనం కావటం ప్రసిద్ధమే. **వాసన అనగా బుద్ధియొక్క సూక్ష్మస్థితి. అది బలిస్తే బుద్ధియే గదా!** కనుక కారణమయిన వాసనలకు కార్యమయిన బుద్ధి అధీనమే కదా! వాసనాధీనబుద్ధి అనగా సూక్ష్మతవదలి స్థూలమయిన బుద్ధియందున్న వాడని అర్థము.

లేదా, కర్మ పరవశ బుద్ధిగలవాడయి అని అర్థము. అదీ వాసనారూపమయిన బుద్ధియే. ఇలా కర్మ ఫలజనిత వాసనామయ బుద్ధికి అధీనుడు కావటం వలననే కదా! జీవునకు బహుజన్మ మరణములు. కాగా, ప్రలయంలోనూ, మరణంలోనూ బ్రహ్మమునందే లీనమవుతారు గనుక ప్రజలు, సత్ప్రతిష్ఠులు అనబడును.

**శ్లో॥ ఏతేనైవ సతాऽऽత్మనా జగదిదం యేనాఖిలం సాత్మకం**
**తత్సత్కారణమేకమేవ పరమం సత్యం స ఆత్మాऽస్య చ ।**
**జీవాభిన్నమిదం బృహత్ప్రతిదినం సమ్పద్య సత్తత్ప్రజాః**
**స్వాపే నైవ విదుర్యదైవ మధుతాం ప్రాప్తా రసా ఆత్మనః ॥ 351**

భావ॥ సద్రూపమయిన ఈ ఆత్మవలననే జగత్తు ఆత్మగలదిగా అయినది. అదే సత్తు ఏకము. పరమకారణము. సత్యము. అదే యీ జగత్తుకు ఆత్మ. ఇది జీవునకు అభిన్నము. నిద్రలో ప్రజలు దీనిలో చేరెదరు. కాని దానిలో చేరినట్లు గ్రహించరు. పుష్పరసములే తేనె అయినా తామే తేనె అయినట్లు గ్రహించలేవు. 351

విశే॥ 1. బ్రహ్మ సత్తేకాదు. అది మన ఆత్మ గూడా. కార్యమునకు కారణమే ఆత్మ అనగా స్వరూపము. ఘటమునకు మట్టి, వస్త్రమునకు దారము ఆత్మ. జగత్తుకు సత్తు కారణము. ఆత్మగూడా. కార్యమునకు ఆత్మ కనుకనే కారణము సత్యము. అందుకే ఘటంలో మట్టి సత్యం. మిగిలినదే నామరూపాదికం మిథ్య.

2. బ్రహ్మం అత్యంత పరోక్షము. గదా! అనుభవంలోకి ఎలా వస్తుంది - అది పరోక్షం కాదు. (నతద్ద్వారేన చాంతికే) అదీ నీవే. జీవుడే బ్రహ్మం. కనుక అపరోక్షమే. లేదా జీవుడే ఆత్మ అందాము. అదే బ్రహ్మ. లేదా జగత్తులోదే దేహం. కనుక జగత్తుకు ఆత్మ అయిన వాడే దేహమునకున్ను ఆత్మ. దానిని బ్రహ్మం అంటారు. దీనిని ఆత్మ అంటారు. కాని రెండూ ఒకటే చైతన్యము. ఉపాధివలన భేదం. ఉపాధిపోతే అభేదం. ఘటాకాశ మహాకాశాల వలె. లేదా ఈ జగత్తుకు ఆత్మ బ్రహ్మమే. ఈ బ్రహ్మం శరీరంలోని జీవునికన్న అభిన్నమే. జీవుడే బ్రహ్మ. అంతే తప్ప జీవునికి బ్రహ్మం ఆత్మకాదు. అంతఃకరణంలో ప్రవేశించటం వలన బ్రహ్మమునే ఆత్మ అంటాము.

3. జాగర స్వప్నములందు అనాత్మ యందు (అహంకారము) అధ్యాసవలన బ్రహ్మం అందదు. సుషుప్తిలో బ్రహ్మం అందుతుంది. కాని అజ్ఞానావృతం కావటం వలన అందదు.

4. పుష్పరసాలు అచేతనాలు గదా! జ్ఞానహీనములు. అవి ఎలా ఉదాహరణంగా పనికి వస్తాయి? - ఫరవాలేదు. వాటిని తుమ్మెదలు గాని, మనుష్యులుగాని అవి పుష్పరసములేనని తెలియజాలరు. ఫలానా ఫలానా పుష్పరసములని వివేచించజాలరని దాని ఆంతర్యము.

5. లింగశరీరం గల జీవులు సుషుప్తిలో లింగశరీర తాదాత్మ్యాధ్యాసపోయినా (లింగం లీనమయినది) బ్రహ్మమునందే ఉన్నా అజ్ఞాన కారణం వలన ఆ విషయం గ్రహించలేరు. "అహం బ్రహ్మ" అని ఎఱుగరు. బ్రహ్మానందం మాత్రం అనుభవిస్తారు. కనుకనే 'సుఖంగా' నిద్రించా నంటాడు. "ఒళ్ళెఱుగను" అంటాడు.

6. **భేదం చూపే అజ్ఞానం ఉండగా సుషుప్తిలోనయినా జీవబ్రహ్మలకు అభేదం ఎలా సంభవము? - అజ్ఞానోపహిత బ్రహ్మములో అభేదం కుదురుతుంది గదా!** (జీవుడున్ను అజ్ఞానోపహితుడే గదా!)

**శ్లో॥ మర్త్యత్వాదివిశేషసంస్కృతిమయాజ్ఞానావృతేస్స్వప్నభవాత్**
**స్వాపే బ్రహ్మణి సజ్జతా అపి జనా ఆత్మస్వరూపావిదః ।**
**స్వాపాన్తే పునరాప్నువన్తి నియతం దేహం సుఖాదాగతాః**
**సమ్ప్రాప్తిం పునరాగతిఙ్చ న విదు ర్మూర్ఛాం గతా వా జనాః ॥ 352**

భావ॥ జీవులకు మర్త్య సంబంధమయిన జాత్యాది సంస్కారాలతో నిండిన అజ్ఞానావరణం ఉంటుంది. దానివలన సుషుప్తిలో బ్రహ్మముతో కలిసినా ఆ ఆత్మస్వరూపం బ్రహ్మాత్మైక్యము తెలియదు. అందువలన సుషుప్తి తొలగినంతనే వారు తమ తమ దేహములలోకి చేరెదరు. సుఖమునుండి తిరిగి వచ్చినా వారికి ఆ సుఖములోనికి వెళ్లిన సంగతిగాని తిరిగి వచ్చిన సంగతిగాని తెలియదు. మూర్ఛపోయిన వారు తమను ఎవరయినా శయ్యమీద నుంచినా దించినా తెలియదుగదా! అదే అజ్ఞానావరణ ప్రభావము. 352

శ్లో॥ స్వాపేఽన్తే ప్రలయే చ సత్యుపగతో వీచీతరఙ్గాదివ-
త్సమ్పత్తిం జలధౌ వినశ్యతి పుమాన్నాయం యతోఽవిక్రియః ।
నాసౌ బ్రహ్మవికార ఏవ భవతి బ్రహ్మైవ తేనామునా
త్యక్తాసౌ మ్రియతే తనుర్విదలితా శాఖేవ జీవస్తు నో ॥ **353**

భావ॥ సుషుప్తి ప్రలయ మరణాదులందు ఈ పురుషుడు సముద్ర తరంగన్యాయంతో అనగా తరంగములు లేచి పడి సముద్రంలో లీనమయినట్లు – సద్రూప బ్రహ్మమునందు లీన మగును. అయినా పురుషుడు తరంగమువలె, నశించడు. ఎందుకంటే అతడు నిర్వికారుడు. ఇతడు బ్రహ్మపరిణామము కాదు. బ్రహ్మమే. కనుక ఈ పురుషుడు వదలిన శరీరము నరకబడిన కొమ్మవలె మరణించును. జీవుడు మాత్రము చెట్టువలె అమృతుడుగనేయుండును. అతడు శరీరముమీద ఆధారపడడు. 353

విశే॥ 1. సముద్రములో తరంగములు సముద్ర పరిణామములు. అవి నశించును. నామరూపములుండవు. **అలా జీవుడు నశించడు. లయం అనగా ఇచ్చట కలియటమే.** మామూలుగా అయితే ఘట శరావాదులు మట్టిలో లయమవుతాయి. ఎందుకంటే అవి వికారములు కదా! **జీవుడు బ్రహ్మ బుద్బుదము కాదు. బ్రహ్మమే.** బ్రహ్మ వికారము జీవుడయితే వికారముతోబాటు వికారి అయిన బ్రహ్మము గూడా అనిత్యమగును. అజము నిరవయవము అయినది వికారి కాదు. వికారి అయినది నిత్యము కాదు.

2. అలా అయితే జగత్తు గూడా బ్రహ్మ వికారం కారాదు గదా! సమా – బ్రహ్మం జగత్కారణమేనని సిద్ధాంతీకరించాము గదా! పరిణామవాదం ప్రకారము మట్టి కుండగా పరిణమించినట్లు చెప్తే అది వికారం, బ్రహ్మం వికారి అవుతాయి. కాని అలాకాదు. రజ్జువు భ్రాంతి సర్పానికి కారణమయినట్లు ప్రపంచానికి బ్రహ్మం కారణమయినది. ఇది వివర్తకారణము. **పరిణామియైన ఉపాదాన కారణము కాదు. వివర్తోపాదాన కారణము**. కనుక రజ్జువులో వికారం లేనట్లే బ్రహ్మంలోనూ వికారం లేదు.

3. లేదా, బ్రహ్మం మాయవలన పరిణమిస్తున్నది అంటాము. అపుడు మాయయే పరిణామి. బ్రహ్మం కాదు. కనుక జీవుడు బ్రహ్మ వికారం కాదు. బ్రహ్మమే.

4. "యథాగ్నేః క్షుద్రాః విస్ఫులింగాః – " అన్న శ్రుతినిబట్టి జీవులు బ్రహ్మకార్యం కదా! సమా – జీవోపాధులు బ్రహ్మకార్యము. (రవ్వలలో ఉన్న కాష్ఠ లేశములే ఉపాధులుగాగల ఆ నిప్పు, నిప్పే భిన్నంకాదు) జీవుడు స్థావర జంగమాదులలో ఉంటాడు. అందువలననే అవి చిగురిస్తాయి. (జీవునితోబాటే ప్రాణమూ ఉంటుంది). కొమ్మ తెంచితే ఆ కొమ్మలో ప్రాణం ఉండదు. జీవుడుండడు. ఎండిపోతుంది. కాని జీవుడు చావడు. లింగశరీరాభిమాని అయిన జీవుడు పోతే మరణము. అనగా శరీరం చస్తుంది.

5. జీవుడు విభువుకదా? వెళ్లటమేమిటి? – ఉపాధివలననే. అదే లింగశరీరము. కనుకనే నిజంగా జీవుడు పోడు. "ధ్యాయతీవ లేలాయతీవ" అని శ్రుతి. ఉపాధి దోషములు మరణాదులు చలనాదులు జీవునకంటవు. ఘటదోషాలు ఆకాశానికంటవు. జీవునకు మరణము లేదు. లింగశరీరం తొలగటమే మరణము. మరి యీ లింగశరీరము ఎలా నశిస్తుంది? – జ్ఞానము వలన అజ్ఞానరూపమయిన అంతఃకరణాదులు నశిస్తాయి.

**శ్లో॥ నైయగ్రోధఫలస్థితే విదలితే బీజే న కిం దృశ్యతే**
**భూమిస్థాత్తత ఏవ భూరివిపులో వృక్షో వటో జాయతే ।**
**సూక్ష్మాత్సూక్ష్మతమం దృగాదిభిరిదం న గ్రాహ్యతే సత్తథా**
**క్షోణీసిన్ధ్వనలానిలామ్బరమయో లోకస్సతో జాయతే ॥ 354**

భావ॥ మఱ్ఱివిత్తనం చాలా చిన్నది. దానిని పగలగొట్టి చూచినచో ఏమీ కనబడదు. కాని దానిని భూమియందు నాటినచో మహావిశాలమయిన ఊడలమర్రి పుట్టుంది. అదేవిధంగా నామరూపరహితము అద్వైతమూ అత్యంత సూక్ష్మమూ అయిన బ్రహ్మమునుండి యీ అనంత విశ్వము పుట్టినది. ఇంద్రియగ్రాహ్యముగాని యీ సత్తునుండి, భూమి, సముద్రము, అగ్ని, వాయువు, ఆకాశము మొదలయిన లోకములు ఏర్పడును. 354

విశే॥ 1. బీజములో వేరు పదార్థము కనబడదు. కనుక అది అద్వితీయస్థితి. అలాగే జగత్తు కనబడని స్తితిలో సత్ అద్వైతము. బీజమునకు వృక్షమను నామరూపములు లేనట్లు 'సత్' కు గూడా జగత్తు అను నామరూపములు లేవు. తేడా ఏమంటే బీజం సావయవం. నేత్రగ్రాహ్యము. 'సత్' మాత్రము నిరవయవము. ఇంద్రియాతీతము.

2. సూక్ష్మమయిన విత్తనమయినా సావయవం కనుక స్థూలమయిన వృక్షముగా పరిణమించ వచ్చుగాక! **నిరవయవ మయిన "సత్" వస్తువు జగత్తుగా ఎలా పరిణమిస్తుంది? కాని యీ ప్రశ్న అనవసరము. ఎందుకంటే ఇదంతా మాయామయం.** చూడండి.

విత్తనంలో ఉన్న అవయవాలన్ని దట్టంగా ఉండి అవే చెట్టుగా పలచగా ఎదిగినాయా? లేక కొత్తగా వృక్షదశలో ఎచ్చటనుంచయినా అవయవాలు వచ్చాయా? మొదటిది కుదరదు. బీజంలో ఎంతదట్టంగా అవయవాలు ఉన్నా అవి ఎంతపలచగా సాగినా ఒక కొమ్మకన్న ఎక్కువ రూపమును ఇవ్వలేవు. కనుక అతిస్వల్ప బీజావయవరాశి అతి విశాల వృక్షశరీరమునకు హేతువు కావటం అర్థం కాని విషయమే. రెండవ పక్షమూ సరిపోదు. ఈ నూతన – అవయవములు ఎక్కడనుంచి ఎలా ఎందుకు వస్తాయి? అది నిరూపింపలేము. (స్వయంగా జరిగే కణవిభజన ప్రక్రియ అన్నా ఇలా ఎందుకు? ఎలా అన్నది నిరూపింపలేము. ప్రకృతి అనటం మాత్రమే చేయగలిగినది) కనుక వృక్షము అట్లే మనశరీరాలు అన్ని మాయామయమే. ఈ అవయవాలు ఎలా మాయామయమో ఈ సృష్టియు అలా మాయామయముగానే వస్తుంది. లేని

**అవయవములను పుట్టించటంలో మాయకు ప్రచండమయిన శక్తి ఉన్నది.** మాయవలన లేనివయినా పుట్తాయి. మాయవలన సర్వం సంభవమే. అది ఈశ్వరశక్తి. కనుక నామరూప రహితమయిన సూక్ష్మతమమయిన సత్తునుండి మాయ జగత్తును విశాలముగా పుట్టించగలదు. బీజతరున్యాయము దీనికి నిరూపణము.

**శ్లో॥ రాత్రౌ పాథసి పాతితం న లవణం ప్రాతర్గృహీతుం దృశా**
**హస్తేనాపి న శక్యతే రసనయా తద్గృహ్యతే వార్మయమ్ ।**
**సర్వత్రాపి జగత్యవస్థితమిదం సద్బ్రహ్మ నైవేన్ద్రియై-**
**ర్గ్రాహ్యం శాస్త్రశమాదిసంస్కృతహృదా గ్రాహ్యన్తు తద్ధీమతా ॥ 355**

భావ॥ రాత్రి పూట కాస్త ఉప్పు నీటిలో వేసి తెల్లవారి చూచినచో అది కంటికి గాని చేతికి గాని అందదు. కాని జలలీనమయియున్న ఆ లవణాదులు నాలుకకు మాత్రము అందును. కనుక ఉన్న వస్తువయినా ఒకరకంగా దొరకదు. మరో రకంగా దొరకుతుంది. సద్రూపమయిన బ్రహ్మ ఈ సర్వ జగత్తునందు ఉన్నది. కాని అది ఇంద్రియాలకు అందదు. శాస్త్రము, శమదమాదులచేత నిర్మలమయిన మనస్సుతో గొప్ప జ్ఞాని దానిని అందుకొనగలదు. 355

**శ్లో॥ చోరైః కాననమాపితః పిహితదృగ్గన్ధారదేశాత్పుమాన్**
**త్యక్త స్తత్ర భృశం రుదన్నుపగతో దిఙ్మోహమాప్తేన తత్ ।**
**దైవాత్కేన విమోచితాక్షినహనః ప్రోక్తాత్మదేశాధ్వకో**
**గ్రామాద్గ్రామమయన్ క్రమేణ కలయంస్తం తం స్వదేశం వ్రజేత్ ॥356**

భావ॥ శమదమాది సంపన్నుడయిన వ్యక్తి శాస్త్రం వలన గురూపదేశంవలన సంసార వనమునుండి బయటపడి ఆత్మమార్గమును పొందును. ఎలాగంటే దొంగలు ఒక గాంధార దేశీయునికి గంతలు కట్టి అడవికి తీసికొని వెళ్లి అక్కడ వదలిపెట్టారు. అతడు దిక్కులు తెలియక ఏడ్చుచుండగా ఒక ఆప్తుడు చూచి గంతలు ఊడదీసి అతని దేశమునకు వెళ్లు మార్గమును చూపినాడు. వాడు మెల్లగా గ్రామమునుంచి గ్రామము దాటికొనుచు, తన దేశమునకు వెళ్లును గదా! 356

**శ్లో॥ ఏవం కర్మభిరేష మోహపిహితః ప్రచ్యావితస్స్వాత్మనో**
**దేహే బన్ధనమాపితః పరిరుదన్ దుఃఖాలయే తాపితః ।**
**ఆచార్యోదితతత్త్వమస్యసిహతే మోహాపిధానే శుభాత్**
**త్యక్త్వాఽఙ్గం సముపైతి సత్యమమృతం స్వాత్మానమాద్యమ్మునః ॥357**

భావ॥ దొంగలవంటి కర్మలు మోహమను గంతలు కట్టి ఆత్మ స్వరూపమునుండి జీవుని తప్పించినవి. దుఃఖాలయమయిన మలపూరితమయిన దేహమును అడవియందు వానిని

కదలకుండా కట్టివేసినవి. వాడు సంసారబాధలతో అహంకార మమకారములతో బాధపడు చుండెను. దీనినుంచి బయటపడుటకు ఎదురుచూచుచుండెను. దైవాత్ ఒక జ్ఞాని అయిన ఆచార్యుడు దొఱకి అతను "తత్త్వమసి" మొదలగు వాక్య ఖడ్గముతో మోహపు గంతలను కోసివేసెను. అపుడతడు దేహాభిమానము వదలి సత్యము అమృతము అయిన తన ఆత్మ రూపమును మరల పొందును. 357

విశే॥ 1. అవిద్య అనాది కర్మఫలములు – వీటివలన జీవుడు ఆత్మ – అనాత్మ వివేకము లేని వాడై, తన స్వరూపము సచ్చిదానందమయిన బ్రహ్మమని ఎఱుగడు. సుఖినని, దుఃఖినని, అంతఃకరణంతో తాదాత్మ్యం చెంది దాని సుఖదుఃఖాది ధర్మాలను తన నెత్తిన వేసికొని కర్త, భోక్త అవుతాడు. కర్మఫలానుభవం కోసం ఫలంకోసం, కర్మ కరణం కోసం మరల మరల దేహములను పొంది తాపత్రయాలతో ఏడుస్తుంటాడు. చివరకు పరమాత్మానుగ్రహంతో సంసారంమీద విరక్తి చెంది సన్యసించి గురూపదేశములతో మహావాక్యములను పొంది శ్రవణ మననాదులు చేసి నిదిధ్యాసనను పొందును. అలా మరల బ్రహ్మ సాక్షాత్కారం అనబడు ఆత్మ దర్శనమును పొంది, బ్రహ్మానందమును పొందును.

జీవన్ముక్తుడై ప్రారబ్ధనాశపర్యంతము శరీర క్రియలకు సాక్షిగా అసంగుడై నిలచును. దేహానంతరము బ్రహ్మమగును.

2. తత్త్వమసి – విచారణ :

"తత్, త్వం, అసి" తత్ అనగా పరోక్షమయిన మాయోపహిత – ఈశ్వర తత్త్వము. ప్రపంచ నియామకత్వాది లక్షణములవలన తెలుస్తుంది. "త్వం" అనునది ప్రత్యక్షమయిన జీవుని చెప్పునది. ఘటాది జడపదార్థములను ఎవరునూ 'త్వం' అనరు కదా! అసి = అనగా ఐక్యము.

ప్రత్యక్ష పరోక్షులు, అల్పజ్ఞ సర్వజ్ఞులు అయిన జీవేశ్వరులకు అభేదము నేరుగా కుదరదు గనుక ముఖ్యార్థము సరిపోదు. అందువలన లక్షణ కావాలి. అదీ భాగత్యాగ లక్షణ – 'సోయం దేవదత్తః' 'సః అయం' అను అర్థములను వదలి 'దేవదత్తః' అన్నట్లు మహావాక్యమునకు పరోక్షత్వము అపరోక్షత్వము వంటి ధర్మములను వదలి "అఖండ చైతన్యము" అను అర్థము చెప్పవలయును. జీవుడు ఈశ్వరుడు ఒకే చైతన్యము.

3. లేదా, తత్ = మాయావచ్ఛిన్న చైతన్యము, త్వం = అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము. విశిష్టములుగా వాటికి ఐక్యం కుదరదు గనుక విశేషణాంశములు వదలాలి. కేవలం విశేష్యమాత్రమయిన చైతన్యము అని లక్షణ. "చైతన్యం చైతన్యమగుదువు" అను అర్థం కుదరదు. కనుక "అఖండ చైతన్యం" అని అర్థము.

4. లేదా, నీవు వస్తుతః బ్రహ్మవు. మాయవలన జీవత్వం. భ్రాంతివలన ఆకాశం నీలంగా

కనిపించినట్లు ఇలా జరిగింది. సుషుప్తి మొదలగు వానియందు నీలో జీవత్వం లేదు. లేదా, నీవు ఘటాకాశం వంటి శరీరబద్ధ చైతన్యమయిన జీవుడవు తత్ – అనగా మహాకాశము వంటి అఖండ చైతన్యమని అర్థము. ఘటాకాశ మహాకాశముల మధ్య ఉపాధివలన వచ్చిన నామ–భేదంలాగా మీమధ్యను భేదం మిథ్య. కనుక మహావాక్యార్థము జీవబ్రహ్మభేధము.

కాని ఈ వాక్యమునకు **జీవుడు ఈశ్వరుని శరీరమని విశిష్టాద్వైతులు వర్ణించెదరు. ఆ అర్థము అభిదతోనే వస్తుందట. ఈ విషయములో వారికి సమాధానం చెప్పే మర్యాద ఇవ్వటం కూడా సిగ్గుచేటు.**

**శ్లో॥ అజ్ఞానాత్మతమశ్ఛయైః కబలితం స్వాత్మానమక్ష్ణేత్స్వయం**
**కుమ్భం దేశికదీపదత్తవిలసద్దృష్టిప్రకాశః పుమాన్ ।**
**ప్రారబ్ధాఙ్గసమాప్తిరస్య విదుషస్స్యాద్యావతాఽనేహసా**
**క్షేపస్తావదముష్య సత్పరిగతౌ బ్రహ్మాథ సమ్పత్స్యతే ॥ 358**

భావ॥ గురువు శాస్త్రములు ఇచ్చిన ఉపదేశ దీపం వలన మంచి దర్శన శక్తిగల పురుషుడు అజ్ఞానాంధకారములో కనబడకుండా పోయిన ఆత్మతత్త్వమను కుంభమును స్వయముగా పొందవలయును. ఎంత కాలముదాకా దేహ సంసారదాయకమయిన ప్రారబ్ధం ఉంటుందో అంతవఱకు ఈ జీవన్ముక్తుడు విదేహ ముక్తి పొందుటకు ఆలస్యము కలుగును. ఆ తరువాత బ్రహ్మమును చేరగలడు. 358

విశే॥ చీకటిలో ఉన్న కుండను దీపంవలన నేత్రశక్తిగల పురుషుడు గమనించినట్లు అజ్ఞానావృతమయిన ఆత్మను గుర్వనుగ్రహముతో వచ్చిన మహావాక్యరూప శాస్త్రోపదేశముతో ప్రత్యగభిన్నమయిన బ్రహ్మాకారవృత్తి గలవాడై గమనించును.

**శ్లో॥ నాహం చోర ఇతి బ్రువన్ భువి పుమాంశ్చోరో ధురి క్ష్మాపతే–**
**స్తప్తం లోహముపేత్య దాహమయతే బన్ధం చ కారాగృహే ।**
**నాఽచోరస్తు తథా వదన్ననలగం లోహం స్పృశన్ దహ్యతే**
**బన్ధం నైతి చ సత్యసన్ధ ఇతి నా ముచ్యేత నైవాపరః ॥ 359**

భావ॥ ఒక దొంగ "నేను చోరుడను కాను" అని అసత్యము పలుకుతాడు. రాజు అగ్ని పరీక్షపెట్టాడు. వాడికి వాత పడుతుంది. దానితో వాడు దొంగ అని నిశ్చయించి జైలులో పెట్టారు. కాని దొంగకాని వానికి వాతపడదు. వాడు దొంగకాదని సత్యసంధుడని భావించి వానిని వదలుతారు. అదే విధముగా సత్యమయిన బ్రహ్మమును ఎఱిగినవాడు ముక్తుడగును. లేనివాడు సంసారమున బడును. 359

శ్లో॥ ఏవం బ్రహ్మ భవన్నపి స్వయమయం మోహేన యో మన్యతే
న బ్రహ్మాహమితి ప్రపద్య మరణే బ్రహ్మోఽప్యసౌ బధ్యతే ।
బ్రహ్మైవాహమితి ప్రయాతి ధిషణామాచార్యవాక్యేన యః
స బ్రహ్మ ప్రతిపద్య నైవ భజతే దేహాదిభిర్బన్ధనమ్ ॥ **360**

భావ॥ జీవుడు స్వయంగా బ్రహ్మమే. అయినా అజ్ఞానం చేత 'తాను బ్రహ్మమును కాదని' భావించును. ఈ అసత్యసంధత వలన అతడు అజ్ఞానం వలన అతడు మరణమును పొందును. బ్రహ్మమయినను సంసారములో బంధింపబడును. ఆచార్యుని వలన శ్రుతి - ఉపదేశము వలన ఎవడు తాను బ్రహ్మమునేనని ప్రయాణించునో (మరణం) వాడు బ్రహ్మమే అగును. అందువలన మరల దేహాది సంసార బంధములలో చిక్కుకొనడు. 360

విశే॥ 1. అజ్ఞాని, కర్మఠుడు మరణించినా అతడు "వాఙ్మనసి సంపద్యతే, మనః ప్రాణే, ప్రాణస్తేజసి, తేజః పరస్యాం దేవతాయాం" అని పరదేవత అయిన బ్రహ్మంలో కలిసినా సంసారబంధము తప్పదు.

2. "అహం న బ్రహ్మ" అనువాడు అసత్యసంధుడు. "అహం బ్రహ్మ" అనువాడు సత్యసంధుడు. వీనికి ముక్తి కలుగును. అంటే బ్రహ్మం గురించి తెలియకుండానే "నేను బ్రహ్మం కాను' అనుకొనటం అసత్యం. (బ్రహ్మం గూర్చి శాస్త్రం చెప్పినా తెలియనివాడు తాను బ్రహ్మమును కాదనరాదు - సంశయగ్రస్తుడు కావచ్చును. కాని బ్రహ్మమును కాదని జీవుడనేనని చెప్పటం మహావాక్యము అర్థమునుగూడా అలా మార్చటం అసత్య సంధత)

3. చోరుడు తాను చోరుడయినా కాదని చెప్పటం అసత్యము. జీవుడు తాను బ్రహ్మమునని తెలిసి బ్రహ్మమును కాదని చెప్పటం లేదు. తెలియకే తాను జీవుడనని చెప్పుచున్నాడు. - సమా - ఇచ్చట సామ్యం కొంతవఱకే. తెలిసిగాని తెలియకగాని అసత్యం భావించటం వఱకే సామ్యం.

4. అసలు జీవుడు బ్రహ్మం అయితే గదా! "నేను బ్రహ్మను కాదన్న" మాట తప్పు. కాని అతను జీవుడు. బ్రహ్మం కాదు. తనను గూర్చి విపర్యయం - విపరీతభావన - ఎలా వస్తుంది? దొంగ తాను దొంగను కానని ఎలా అనుకొంటాడు - సమా - అజ్ఞానంతో సాధ్యం కావచ్చును. నిద్రలో అలాంటివి సాధ్యం అవుతాయి గదా! ప్రక్కమీద పరుండినవాడు గూడా అడవిలో పరుగెత్తుతున్నట్లు కల రావచ్చుగదా!

5. జీవుడు తాను జీవుడనని గ్రహించటంగాని, లేక బ్రహ్మం బ్రహ్మమేనని గ్రహించటం గాని ముక్తి కాదు. అలా అయితే అందరూ ముక్తులే అవుతారు. అది సమస్త సహజభావన. కాని తాను బ్రహ్మమునే అని గ్రహించటం ముక్తి. పోనీయండి ఆ పండితులే బ్రహ్మను జీవునిగా భావిస్తారు. కాని ఆ జీవుడే బ్రహ్మమని తలచిన వారు ముక్తులు.

**శ్లో॥ నో వేదాధ్యయనం న శాస్త్రకలనం నో వా పురాణశ్రుతి-**
**ర్నో సఙ్గీతముఖాః కలా అపి నృణాం శోకాబ్ధిసన్తారణమ్ ।**
**బ్రహ్మాహమ్మతిరేవ కేవలమియం వేదాన్తలభ్యా తతో**
**వేదాన్తశ్రవణాయ నా గురుమయేత్స్కన్దం యథా నారదః ॥ 361**

భావ॥ వేదాధ్యయనము గాని, శాస్త్రపఠనముగాని, పురాణశ్రవణము కాని, సంగీతాది కలలుగాని నరులను శోకసముద్రమునుంచి బయటకు తేలేవు. "అహం బ్రహ్మాస్మి॥ అను భావన ఒక్కటే అనుభవం ద్వారా శోకసముద్రము నుండి బయట పడవేస్తుంది. కనుక వేదాంత లభ్యమయిన యీ బుద్ధి కొఱకు, వేదాంత వాక్య శ్రవణము కొఱకు వ్యక్తి యోగ్యుడయిన గురువు వద్దకు వెళ్లవలయును. నారదుడు స్కందరూపుడయిన సనత్కుమారుని వద్దకు వెళ్లెను. "తంస్కంద ఇత్యాచక్షతే" అనిగదా! శ్రుతి. 361

విశే॥ గురుః ; గు = అజ్ఞానాంధకారము, రు = దానిని పోగొట్టువాడు. గృణాతి = సర్వం = అంతా చెప్పువాడు.

**శ్లో॥ చత్వారో నిగమాష్షడఙ్గమితిహాసాదిః పురాణం నయో**
**మీమాంసాయుగలం చ ధర్మ ఇతరాశ్చాపాదివిద్యా అపి ।**
**నామ్నైవైతదుపాసతే భువి జనా బ్రహ్మేతి యే నామ్ని తే**
**స్వాతన్త్ర్యం క్షితిపా ఇవాత్మ విషయే సమ్ప్రాప్నుయుస్సన్తతమ్ ॥ 362**

భావ॥ చతుర్వేదములు, షడంగములు, పురాణేతిహాసాలు, న్యాయము, పూర్వ ఉత్తర మీమాంసలు, ధర్మము, ధనుర్వేదము మొదలయినవన్ని నామములే. ఇది ఘటము. ఇది పటము అన్నట్లు ఇది వేదము. ఇది శాస్త్రము అన్నట్లు అన్ని నామ మాత్రములే. కాని యీ నామములను "బ్రహ్మము" గా భావించి ఎవరు ఉపాసన చేసెదరో వారు ఆ వేదాదివిద్యలకు, ఆనామములకు ప్రభువులగుదురు. ప్రభువులు తమ రాజ్య ప్రదేశమున ఎట్లు స్వతంత్రులో అట్లు వీరున్నూ వేదాదులయందు స్వతంత్రులగుదురు. కనుక "నామమే బ్రహ్మమని" ఉపాసింపవలయును. 362

**శ్లో॥ వాఙ్నామ్నో నను భూయసీ యత ఇయం సర్వం జగద్బోధయ-**
**త్యేషా క్ష్మాఽనిల ఏష ఏష రవిరిత్యేనాముపాస్తే తు యః ।**
**బ్రహ్మేతి ప్రతియాత్యసౌ స విషయే సత్కామచారం గిరో**
**వాచోఽస్యా అపి భూయ ఏవ హృదయం వాచో యతః ప్రేరకమ్ ॥363**

భావ॥ నామము మాత్రమే బ్రహ్మయా? – కాదు. నామముకన్న వాక్కు చాల పెద్దది. ఈ వాక్కు సమస్త జగత్తును బోధించును. ఈ వాక్కు భూమి అని, వాయువని, లేక సూర్యుడని, సర్వజగత్తును మనకు బోధించును. ఈ వాక్కును 'బ్రహ్మం' అని ఎవడు ఉపాసించునో వాడు

వాక్కుల విషయంలో ప్రభువగును. స్వతంత్రుడగును. ఈ వాక్కుకన్న హృదయం మరింత పెద్దది. అది వాక్కునుగూడా ప్రేరేపిస్తుంది. 363

**శ్లో॥ ఆత్మాఽయం భువనం మనశ్చ తదిదం బ్రహ్మేత్యుపాస్తే తు యః**
**స్వాన్తం గచ్ఛతి యత్ర తత్ర విదుషస్స్యాత్కామచారోఽస్య కౌ ।**
**సఙ్కల్పో మనసో మహాన్ హి మననం స్వాన్తస్య సఙ్కల్పజం**
**సఙ్కల్పాత్మకమేవ సర్వభువనం సఙ్కల్పజాతం యతః ॥ 364**

భావ॥ ఈ ఆత్మ ఈ లోకము అంతా మనస్సే. ఈ మనస్సు బ్రహ్మమేనని ఉపాసన చేసినచో అతడు తన మనస్సు ప్రవేశించినచోటనూ ప్రభువు స్వతంత్రుడగును. అనగా సఫలమనోరథుడగును. ఈ మనస్సుకన్న సంకల్పం గొప్పది. మనస్సుయొక్క మనన వ్యాపారం ఏదయినా దాని సంకల్పం వలన కలుగుతుంది. సమస్త ప్రపంచం సంకల్పము వలన ఏర్పడినదేగదా "తదైక్షత, తత్సర్వమభవత్" అని శ్రుతి. కార్యం కారణాత్మకము గదా! కనుక సమస్త ప్రపంచం సంకల్ప జన్యము కనుక సంకల్పమే. 364

**శ్లో॥ సఙ్కల్పం బృహదిత్యముం కలయతే యస్స ధ్రువానాప్నుయా**
**ల్లోకాంశ్చిత్తమితో మహన్న హి నరోఽచిత్తస్తు సఙ్కల్పయేత్ ।**
**తచ్చిత్తం సకలాయనం బృహదిదం యో ధ్యాయతి స్యాత్స నా**
**చిత్తాఖ్యధ్రువలోకగోఽథ పరమం ధ్యానన్తు చిత్తాన్మహత్ ॥ 365**

భావ॥ సంకల్పమే బ్రహ్మము – అని ఉపాసన చేయువాడు ధ్రువలోకములను పొందును. సంకల్పముకన్న చిత్తము గొప్పది. చిత్తము లేనినరుడు సంకల్పము చేయలేడు. సర్వమునకు ఆయతనమయిన "చిత్తము బ్రహ్మమని" ఎవడు ధ్యానించునో అతడు చిత్తమును ధ్రువలోకములను చేరును. చిత్తంకన్న ధ్యానం గొప్పది. 365

**శ్లో॥ ధ్యాయన్తీవ ధరాఽన్తరిక్షసలిలక్షోణీధరా దేవతా**
**మర్త్యా ధ్యానవశాన్మహాన్త ఇదకం బ్రహ్మేతి యో ధ్యాయతి ।**
**యావద్ధ్యానగతం స కామచరణం యాయాదథ ధ్యానతో**
**విజ్ఞానం మహదేవ నా యదమునా సర్వం విజానాత్యదః ॥ 366**

భావ॥ భూమి మొదలగు భౌతిక పదార్థములు, అలాగే అందలి దేవతలు ధ్యానము చేయుచున్నట్లు నిశ్చలముగా నున్నవి. మనుష్యులున్ను ధ్యానము వలన మహాత్ములగుదురు. ఈ ధ్యానమునే బ్రహ్మమని ఎవరు ధ్యానము చేయుదురో వారు ధ్యానము సంచరించిన మేరకు స్వతంత్రులగుదురు. సఫల మనోరథులగుదురు. ఇక ఈ ధ్యానంకన్న విజ్ఞానం గొప్ప. విజ్ఞానం వలన సర్వము తెలియును. శాస్త్రార్థ విషయజ్ఞానము చేత పరోక్షవిషయములన్నియు తెలుస్తాయి. 366

శ్లో॥ విజ్ఞానం బృహదిత్యవైతి మనసా విజ్ఞానినః ప్రాప్నుయా-
ల్లోకాన్ సోఽయమితో బలం నను మహద్యస్మాచ్ఛతం జ్ఞానినామ్ ।
ఏకః కమ్పయతే బలీ బలవశాద్భూమ్యన్తరిక్షాదికం
సర్వం తిష్ఠతి సద్బలో హి మనుతే జానాతి పశ్యత్యపి ॥ **367**

భావ॥ "విజ్ఞానం బ్రహ్మ" అని ఎవరు ఉపాసించునో వారు విజ్ఞానవంతమయిన లోకములను పొందును. "విజ్ఞానం" కన్న గొప్పది "బలము". బలవంతుడయినవాడు వందమంది జ్ఞానులను కంపింపజేయును. భూమి, అంతరిక్షము మొదలగునవి బలం వలననే నిలిచియున్నవి. మంచి బలముగల వాడు మాత్రమే తలచగలడు. తెలిసికొనగలడు. చూడగలడు. దుర్బలుడు ఏమి చేయగలడు. 367

శ్లో॥ ఏతద్బ్రహ్మ బలం విచిన్తయతి యస్సోఽయం బలీ స్యాన్నరో
భూయోఽన్నం హి బలాద్యతో బలమిదం సఞ్జాయతేఽన్నాన్నృణామ్ ।
నాఽనన్నో బలవానపి ప్రభవతి ద్రష్టుం చ మన్తుం నరః
శ్రోతుం తద్బృహదిత్యవైతి మనసా యస్సోఽన్నలోకానయేత్ ॥ **368**

భావ॥ బలమును బ్రహ్మముగా ఉపాసించువాడు "బలవంతుడగును". ఈ బలముకన్న గొప్పది "అన్నము". అన్నం వలననే నరులకు బలము కలుగును. అన్నంలేనివాడు – అప్పటికి బలవంతుడయినా – నీరసుడై చూచుటకు వినుటకు, తలచుటకు గూడా పనికిరాడు. కనుక "అన్నం బ్రహ్మ" అని ఎవడు ధ్యానము చేయునో అతడు అన్నముగల లోకములకు చేరును. 368

శ్లో॥ అన్నాద్వారి మహద్యతోఽన్నముదయత్యమ్భోవశాద్భూతలే
భూమ్యభ్రద్యుధరద్యుసన్నరపశుక్రిమ్యణ్డజాగాదయః ।
సర్వే వారిమయాస్తదేతదయతే బ్రహ్మేతి యో మానవః
సర్వానేష సమాప్నుయాత్సుఖకరాన్ కామాంశ్చ తృప్తో భవేత్ ॥ **369**

భావ॥ అన్నముకన్న నీరు గొప్పది. భూతలము నందు వర్షాదిజలముల వలననే అన్నము లభించుచున్నది. భూమి, అంతరిక్షము, ద్యులోకము, పర్వతములు, దేవతలు, నరులు, పశువులు, క్రిములు, అండజములు, చెట్లు మొదలయిన వన్నియు జలమయములే. కనుక 'జలమును' బ్రహ్మముగా నుపాసించువానికి సమస్త సుఖకర మనోరథములు లభించును. అతడు సంతృప్తుడగును. కనుక జలము బ్రహ్మమనియుపాసింపవలెను. 369

శ్లో॥ తేజో వావ మహజ్జలాద్భవతి యత్కం తేజసః కారణం
కార్యాద్భూయ ఇతి ప్రసిద్ధమిహ సన్తాపాద్ధి వర్షోదయః ।

**తేజో బ్రహ్మధియా విచిన్తయతి యస్తేజోయుతోఽయేదసౌ**
**లోకాన్నిస్తమసస్తతో మహదిదం వాయోరపి వ్యోమ తత్ ॥ 370**

భావ॥ జలంకన్న తేజస్సు గొప్పది. తేజస్సు నుండియే జలము పుట్టును. కార్యముకన్న కారణము గొప్పది. తేజస్సుయొక్క సంతాపమువలననే వర్షము కలుగును గదా! కనుక "తేజస్సును" బ్రహ్మమని ధ్యానించువాడు తేజోయుతుడగును. అతడు అంధకార రహితమయిన తేజోలోకములను పొందును. ఈ తేజస్సుకన్న వాయువు గొప్పది. వాయువుకన్న దానికారణ మయిన ఆకాశము గొప్పది. 370

**శ్లో॥ సూర్యేన్ద్వగ్న్యుడువిద్యుతోఽత్ర నివసన్త్యేతేన లోకో హ్వయ-**
**త్యన్యం సోఽపి శృణోత్యనేన రమతేఽత్రోదేతి సర్వం హ్యతః ।**
**వ్యోమేదం బృహదిత్యవైతి మనసా యాయాత్స ఆకాశినో**
**లోకానస్తి మహానితః స్మర ఇతి వ్యోమ్నః పునర్మానసః ॥ 371**

భావ॥ సూర్య చంద్ర నక్షత్ర విద్యుత్తులు ఈ ఆకాశమునందున్నవి. ఈ ఆకాశం వలననే లోకులు మాట్లాడటం పిలవటం సంభవిస్తున్నాయి. శబ్దం ఆకాశగుణం కదా! దీనివలననే వినటం జరుగుతున్నది. "కర్ణ శష్కుల్యవచ్ఛిన్నమయిన ఆకాశము చెవి" అని న్యాయశాస్త్రం అంటున్నది. కర్ణం ఆకాశమయమని వేదాంత శాస్త్రంగూడా చెప్పినది. ఆకాశమునందే ఆడుకొనెదరు. ఆకాశమునందే అంతా ఉదయించును. సర్వవ్యవహారములు ఆకాశమునందే జరుగును. "ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః –" అని మిగిలిన భూత భౌతికములన్నియు ఆకాశజన్యములే. ఈ "ఆకాశము బ్రహ్మం" అని ఎవరు ఉపాసన చేస్తారో వారు ఆకాశం గల విస్తృతమయిన లోకములకు వెళ్లెదరు. ఈ ఆకాశముకన్న గొప్పది మానసికమయిన "స్మరణ"371

**శ్లో॥ సత్యస్మిన్ స్మరణే సమస్త మయతే సత్త్వం సదప్యమ్బర-**
**ప్రష్ఠం విశ్వమసత్యసత్త్వమయతే భూయస్తదేతద్బృహత్ ।**
**యో మర్త్యః స్మరణంవిచిన్తయతి వా సిద్ధ్యేత్స్మృతార్థోఽస్య సా**
**తస్మాదప్యతిభూయసీతి విదితా తృష్ణా సమం యద్వశే ॥ 372**

భావ॥ ఈ స్మరణం ఉన్నచో సమస్తము "ఉనికి"ని పొందును. "ఆకాశం మొదలుగాగల యీ విశ్వమంతయు స్మరణము లేనిచో 'అసత్' అగును. స్మరణమే బ్రహ్మమని ఎవడు ధ్యానించునో వాడు కృతార్థుడగును. ఈ స్మరణముకన్న పెద్దది "తృష్ణ" ఆశ. ఎందుకంటే స్మరణంగాని అన్నంగాని కర్మలు గాని అన్ని స్మరణం మీద ఆధార పడియున్నవి కదా! 372

**శ్లో॥ ఆశాం బ్రహ్మధియా విచిన్తయతి యస్సర్వాన్ స కామానయేత్**
**సత్యాశీరపి సమ్భవేత్స తు మహాన్ప్రాణోఽస్త్యముష్యా అపి ।**

**ప్రాణే సర్వమిదం సమర్పితమరా నాభౌ రథాఙ్గస్య వా**
**ప్రాణో మాతృపితృప్రజాగ్రజసఖీశాచార్యసద్బ్రాహ్మణాః ॥ 373**

భావ॥ ఆశను బ్రహ్మముగా భావించి ధ్యానించినవాడు సమస్త కామములను పొందగలుగును. వాని ఆశీస్సులు సత్యములగును. "సత్యా ఏతా ఆశిషస్సంతు". ఆశకన్న ప్రాణం చాలా గొప్పది. ప్రాణము నందు సమస్తము అర్పింపబడినది. ఒక చక్రపు కుండయందు అన్ని ఆకులు (కడ్డీలు) ఉన్నట్లుండును. ప్రాణము మాతగా, పితగా, సంతానముగా, సోదరులుగా, స్నేహితుడుగా, ఈశ్వరుడుగా, గురువుగా సాధువులుగా, బ్రాహ్మణులుగాను కనబడును. అనగా చరాచరాత్మక సర్వప్రాణి సమూహము ప్రాణమే. 373

**శ్లో॥ సప్రాణం పితరం విదూషయతి యో వాచాऽపి నిన్దన్తి తం**
**హాహాऽయం పితృహేతి సన్త ఇహ నప్రాణన్తు తం యో గురుమ్ ।**
**వహ్నౌ నిక్షిపతి స్వయం తముత తే నిన్దన్తి నైవేత్యతః**
**ప్రాణోऽయం హి పితైవమేవ సకలం ప్రాణస్స సేవ్యో బుధైః ॥ 374**

భావ॥ ప్రాణమే తండ్రి మొదలగు వారి స్వరూపం ఎందుకయినది? – అంటే, ప్రాణంతో ఉన్న తండ్రిని కొట్టినా తిట్టినా వానిని పితృఘాతియని నిందించెదరు. ప్రాణరహితుడయిన తండ్రి శరీరమును నిప్పులో దహించినను ఎవరు నిందించరు. పైగా ప్రశంసించెదరు. కనుక ప్రాణమే పిత. కనుక ప్రాణమే బ్రహ్మమని సేవింపదగినది. 374

**శ్లో॥ ప్రాణం సర్వగతం మహేశ్వరమముం బ్రహ్మేహమిత్యశ్నుతే**
**యస్సోऽసావతివాదితామపలపేన్నో నాతివాదీత్యహమ్ ।**
**ప్రాణాదస్త్యపి వస్తు కిఞ్చన మహద్యత్సత్యమాచక్షతే**
**యో వేదైతదహన్తదిత్యయమహో సర్వాతివాదీ పుమాన్ ॥ 375**

భావ॥ సర్వవ్యాపి అయిన మహేశ్వరమయిన ప్రాణమును "అహంబ్రహ్మ" అని ధ్యానించువాడు **అతివాది.** తన అతివాదితను, వాడుదాచలేడు. తాను అతివాదినని అతడు చెప్పవలసినదే. కాని యీ ప్రాణంకన్న మహత్తరమయిన వస్తువు ఉన్నది. అదే సత్యం. ఆ సత్యమే నేనని ఎఱిగిన వాడు సర్వాతివాది. (అతివాది అనగా అన్నింటికన్న గొప్ప విషయమును చెప్పినవాడే అతివాది.) చూడండి. **యస్తుభూమాఖ్యం సర్వాతిక్రాంతం తత్త్వం పరమార్థ సత్యం వేదసోతివాదీ** – శం॥భా॥) ప్రాణాదులు వఱకు చెప్పినవాడు నామాదులకన్న గొప్ప విషయమును (అతి) చెప్పినవాడవుతాడు. (నామాద్యపేక్షంతు తస్యాతివాదిత్వమ్ –శం॥భా॥) అంతేగాని సర్వాతివాదిగాడు. 375

విశే॥ ప్రాణం బ్రహ్మగా తెలిసినవాడు ఇతర నామబ్రహ్మవేత్తలకన్న గొప్పవిషయమును

చెప్పినవాడు. అనగా అతివాది. సత్య బ్రహ్మాత్మ వేత్త మాత్రము సర్వాతివాది. ఇది సత్య బ్రహ్మం. మిగిలినవి కల్పితబ్రహ్మములు. నిరతిశయమయిన మహత్త్వం కలది బ్రహ్మము. అదే సత్యం.

**శ్లో॥ తేజస్సత్యమథామ్బు సత్యమవనీ సత్యా తథా లోహితం**
**సత్యం శుక్లమథాసితఞ్చ ఋతమిత్యజ్ఞో వదత్యస్తధీః ।**
**విద్వాంస్తత్సకలం మృషేతి కలయన్ బ్రహ్మైకమేవాద్వయం**
**స్వాత్మానం సుఖబోధరూపమమలం సత్యం పరమ్భాషతే ॥ 376**

భావ॥ అజ్ఞాని తేజస్సును సత్యం అంటాడు. అలాగే మరో మరో అజ్ఞానులు జలం సత్యమని, భూమి సత్యమని, లోహిత వర్ణము (తేజస్సు) సత్యమని, శుక్లము సత్యమని, కృష్ణవర్ణము సత్యమని వెంపరలాడుతుంటారు. కాని జ్ఞాని ఇదంతా అసత్యమని అద్వితీయము ఏకము అయిన బ్రహ్మం ఒక్కటే సత్యమని, అదే అమలము సత్యము పరము అయిన ఆ బ్రహ్మమును తమ ఆత్మగా చెప్పును. దానినే సత్యమనును. 376

విశే॥ 1. అసలు ఒక ప్రశ్న. జీవుడు సత్యమయితే బ్రహ్మమే ఎలా సత్యం అవుతుంది? జీవుడు అసత్యం అయితే, తనవలన ఉనికిని పొందిన బ్రహ్మం సత్యం ఎలా అవుతుంది? ద్రష్టగా జీవుడు లేకుంటే ఆకాశాదులు కనబడనట్లే బ్రహ్మం గూడా లేనట్లే గదా! సమా - వీరిమధ్య భేదం ఉంటే యీ ఆలోచనలు. భేదమే లేదు. అయమాత్మా బ్రహ్మ గదా! జీవుడు వక్త వికారి అయినా అది లింగశరీరంతో తాదాత్మ్యాధ్యాసవలన వచ్చినదే. అసలు రూపం నిర్వికారమే. అందుకే "అహం బ్రహ్మ" కుదురుతుంది. ఇందులో **"అహం" అనేది నేరుగా అభిధతో అహం అనే అహంకార జీవుని చెప్తుంది**. జీవుని వక్తృత్వం కర్తృత్వం ఇవన్ని ఉపాధి అయిన "శరీర - అహంకార" ధర్మాలు. జీవధర్మాలు కావు. కనుకనే సుషుప్తిలో అవి ఏవీ ఉండవు. కనుక నిర్వికారమయిన ప్రత్యగాత్మ బ్రహ్మం ఒక్కటే.

2. "బ్రహ్మం" వాక్కులకు అందదుగదా! 'సత్యం' అని మాత్రం దాన్ని నిర్వచిస్తాము. బ్రహ్మం అను పదంగూడా అంతేగదా! - సమా - మాయావిశిష్ట చైతన్యవాచకమయిన బ్రహ్మ శబ్దంలో లక్షణతో నిర్విశేషచైతన్యమును చెప్తుంది. ఆత్మ శబ్దం గూడా అంతఃకరణ విశిష్ట మయిన చైతన్యమును చెప్తుంది. జ్ఞాన శబ్దం అంతఃకరణవృత్తిలో ప్రతిబింబించిన చైతన్యమును చెప్తుంది.

3. అంతేకాదు ఆ వస్తువు వాక్కులకు అందదు అనిగదా శ్రుతి "యతో వాచో -" అంటే "వాక్కులకందదు" అన్నమాట గూడా ఏ వస్తువును చెప్తుంది. బ్రహ్మమునే గదా! అలా చెప్పింది. కనుక ఈ విషయంలో అతి శంకలు వద్దు.

**శ్లో॥ సత్యజ్ఞానకృతం హి సత్యవదనం జ్ఞానన్తు తత్తర్కజం**
**శ్రద్ధాతర్కనిదానమార్యచరణద్వన్ద్వార్చనాద్యాత్మికా ।**
**నిష్ఠా తత్ప్రకృతిర్హృదిన్ద్రియజయస్తస్యాః పరం కారణం**
**ప్రాప్తవ్యం పరమం మయా సుఖమితి స్పష్టాగ్రహోత్స్యాత్స చ ॥ 377**

భావ॥ జ్ఞాని బ్రహ్మమును సత్యం అంటాడు. ఎందువలన? సత్యమయిన బ్రహ్మమును తెలిసికొనటం వలన బ్రహ్మమును సత్యమంటారు. బ్రహ్మజ్ఞానం మననరూపమయిన తర్కం వలన కలుగుతుంది. తర్కమునకు కారణం శ్రద్ధ. శ్రద్ధ అనగా ఆర్యులయిన గురువుల శుశ్రూషవలన వస్తుంది. నిష్ఠకు మూలకారణము ఇంద్రియ మనోవిజయము. ఆ ఇంద్రియ జయమునకు కారణము తీవ్రమయిన బ్రహ్మజిజ్ఞాస. పరమానందస్వరూపమయిన బ్రహ్మమును నేను పొందవలయునన్న పట్టుదలయే ఇంద్రియజయమును కలిగించును. తీవ్రముముక్ష అవసరము. ఆస్తికులందరికి మందముముక్ష ఉంటుంది. కాని తీవ్ర ముముక్షుత్వం ప్రయోజనకరము. 377

**శ్లో॥ యో భూమా స సుఖం యదల్పమథ తద్దుఃఖం న చాల్పే సుఖం**
**నాన్యద్యత్ర శృణోతి పశ్యతి పుమాన్జానాతి భూమా స హి ।**
**అన్యద్యత్ర శృణోతి పశ్యతి పుమాన్జానాతి చాల్పం హి త-**
**ద్యో భూమాఽమృత ఏవ మర్త్యమితరత్స్వస్మిన్ స్థితోఽసౌ న వా ॥378**

భావ॥ ఏది భూమయో అది సుఖము. ఏది అల్పమో అది దుఃఖము. అల్పమునందు సుఖము లేదు. 'భూమ'ను ఎఱిగిన జ్ఞానికి ఆ దశలో మరొకటి వినబడదు. కనబడదు. తెలియదు. భూమ తప్ప ఏమియు తెలియదు. అల్పములోనున్న వానికి ఇతర వస్తువు వినబడుతుంది. కనబడుతుంది. తెలుస్తూ ఉంటుంది. అల్పం అంటే ద్వైతము. భూమ అంటే అద్వైతము. అఖండము. ఎవడూ భూమయో అది అమృతమే. ఇతర మయినది మర్త్యము = మృతము. ఈయన తన మహిమయందే ఉండెను. లేదా అసలు దేనియందునూ ప్రతిష్ఠితుడు కాలేదు. ఆయన అద్వితీయుడు గదా! 378

విశే॥ 1. యజ్ఞాది ధర్మములు వాటివలన వచ్చేసుఖం ద్వైతం అల్పము. మృతం. అందువలన భూమ, అఖండం అమృతం అయిన సుఖం. కనుక ఇదియే కోరదగినది. దీనిని తెలియటమే పొందటం. అదీ తనయందున్నదే. నిజానికి అది పొందబడినదే. కాని తెలియదు. కనుక తెలియటమే పొందటం.

2. విషయసుఖాలన్నీ అల్పములు అస్థిరములు. సుఖస్వరూపమయిన పరమాత్మ నిత్యసుఖము.

3. ఈ భూమి వ్యవహారదృష్ట్యా తన మహిమయందే తానుంటుంది. - "స్వేమహిమ్ని ప్రతిష్ఠితః" పరమార్థరీత్యా ఆశ్రయం ఆశ్రయి అని రెండంశములు లేవుకనుక అసలు ఆ ప్రశ్నయే లేదు.

**శ్లో॥ గావోఽశ్వాః కనకాదయశ్చ మహిమా చైత్రో మహాంస్తం శ్రితో**
**భూమా నైవమయం పరం ప్రతిగతో వస్త్వన్తరాసమ్భవాత్ ।**
**సోఽధస్తాత్స ఉపర్యథో స పురతః పశ్చాత్సవా దక్షిణే**
**భూమైవోత్తరతస్స ఏవ సకలం సోఽహం స చాత్మా పరః ॥ 379**

భావ॥ మహిమగలవాడు మహాన్. మహిమ అంటే ధన కనక వస్తు వాహనాది సమృద్ధి. కాని యీ భూమకు అట్టి ద్వితీయ వస్తువు ఏదియు లేదు. ఎందుకనగా, ఈ భూమయే క్రింద పైన ఎదుట వెనుక కుడి, ఎడమ వైపులందు దిక్కులందు వ్యాపించి యున్నది. ఆయన నేనే. ఆయనయే పరమాత్మ. అందువలన అది తనమహిమయందే నిలిచెను. కనుక నేను నా శరీరము నా చుట్టూ ఉన్న ప్రపంచము, అంతా భూమయే. అట్టి భూమ కన్న మరో వస్తువు లేదు గనుక అది తన మహిమయందున్నదని అర్థము. అయితే యీ దిక్కులు మొదలగు ఈ భేదం అంతా మాయాకృతమే. అదీ వాస్తవముగా కాదు. వివర్తముగా అలా రజ్జుసర్పంలాగా కనబడటము మాత్రమే. నిజంగా భేదము లేదు. 379

**శ్లో॥ పశ్యన్నేవమిమం మనంశ్చ విబుధో యస్త్వాత్మని క్రీడతి**
**స్వాత్మన్యేవ రతిం ప్రయాతి మిథునానన్దావపి స్వాత్మని ।**
**స స్వారాడ్భవతి ప్రయాతి సకలాన్ లోకానపి స్వేచ్ఛయా**
**యే నైవం విదురాప్నువన్తి త ఇమే లోకాననిత్యాన్ కృతేః ॥ 380**

భావ॥ ఈ విధంగా భూమ రూపమయిన ఆత్మను గమనించుచు తలచుచున్న జ్ఞాని తన ఆత్మయందే క్రీడించును. ఆత్మయందే రమించును. మిథున సంబంధమయిన శృంగార సంబంధంగా వచ్చే ఆనందములను గూడా ఆతడు ఆత్మయోగముననే పొందును. అతను స్వయం ప్రకాశజ్యోతి అగును. సకల లోకములలో అతను స్వేచ్ఛగా సంచరించగలడు. ఎవరి కయితే ఈ భూమ జ్ఞానము లేదో వారు కర్మఫలమయిన అనిత్యలోకములను పొందెదరు. 380

**శ్లో॥ భూమాఽఽత్మా బృహదస్మ్యహం సదితి యో జానాతి స స్వాత్మతః**
**సర్వం జన్మలయౌ స్థితిం చ భజతే ప్రాణాదినామావధి ।**
**మన్త్రాః కర్మ చ సర్వమాత్మమయమిత్యాలోకతే స్వస్య నో**
**మృత్యుం రోగమశర్మ పశ్యతి సమం పశ్యత్యవాప్నోతి చ ॥ 381**

భావ॥ భూమ, ఆత్మ, సత్ - నేనే అని ఎవడు తెలిసికొనునో అతడు ప్రాణములనుండి

నామము దాకా సర్వప్రపంచము, మంత్రములు, కర్మలు, తన ఆత్మయందే జన్మలయములను పొందుతుందని తెలిసికొనును. సర్వము ఆత్మమయమని అతడు గమనించును. అందువలన అతడు రోగమయినా అసుఖమయినా సమంగా చూస్తాడు. సమంగా పొందుతాడు. ఆత్మ నిర్వికార సచ్చిదానంద రూపము గనుక సర్వవిషయంలో సమానదృష్టి గల సర్వజ్ఞుడుగా జ్ఞాని ఉంటాడు. పూర్ణకాముడు కాగలడు. 381

**శ్లో॥ భూమబ్రహ్మవిదేష కామవశతో లోకే భవేదేకధా**
**త్రేధా పఞ్చవిధస్తథా నవవిధశ్చైకాదశాత్మా శతమ్ ।**
**సాహస్రం బహుధా చ యోగవిభవాత్కృష్ణద్యునాథాదివ-**
**త్సర్వం చోపహరేత్స రూపనిచయం బ్రహ్మామృతం స్వాదయన్ ॥382**

భావ॥ భూమ బ్రహ్మవేత్త లోకములో స్వేచ్ఛగా చరించగలడు. అతడు ఒక్కడుగా (సృష్టికి ముందు) బ్రహ్మరూపముగా ఉండగలడు. కాయవ్యూహములు సృష్టించగలడు. మూడు, ఐదు, తొమ్మిది, పదునొకండు, వంద, వేయి ఇంకా అనేక విధములుగా కృష్ణుని వలె ఇంద్రుని వలె సౌభరివలె, యోగశక్తితో కాగలడు. మరల ఈ రూపములనన్నింటిని ఉపసంహరింపగలడు. బ్రహ్మానందమును ఆస్వాదించును. 382

**శ్లో॥ రాగద్వేషమదాదిదోషనిచయాస్పృష్టార్థవిజ్ఞానతః**
**సత్త్వం శుద్ధ్యతి శుద్ధితోఽస్య సతతా భూమస్మృతిర్జాయతే ।**
**లాభాత్తత్స్మరణస్య సర్వహృదయగ్రన్థిప్రభేదో భవే-**
**జ్జాతేఽస్మిన్ పురుషస్సుఖామృతబృహద్రూపేణ తిష్ఠేత్సదా ॥ 383**

భావ॥ విషయాలమీద రాగద్వేషాలు మదం మొదలయిన దోషాలు లేని కేవల విషయజ్ఞానం మాత్రమే గల వాడు జ్ఞాని. అంటే విషయదర్శనమేకాని విషయాభిలాష ఉండదు. వారి అంతఃకరణము శుద్ధమగును. ఆ శుద్ధివలన మనస్సులో భూమ స్మరణ కలుగును. (సోహం అని) ఆ స్మరణ వలన సర్వహృదయ గ్రంథులు విడిపోవును. అలా గ్రంథి ప్రభేదం జరిగితే ఆ జ్ఞాన పురుషుడు సచ్చిదానంద బ్రహ్మ రూపముతో నిరంతరము ఉండును. (అహంకార మమకారాదులు, కామక్రోధాదులు హృదయ గ్రంథులు) అట్టి జ్ఞానికి పునర్జన్మ లేదు. భూమ బ్రహ్మవిద్య సమాప్తము. 383

**శ్లో॥ స్వల్పబ్రహ్మపురాన్తరస్థహృదయావచ్ఛిన్నఖాన్తర్గతం**
**బ్రహ్మాకాశపదం విచేయమనఘైర్జిజ్ఞాసితవ్యం చ తత్ ।**
**బాహ్యవ్యోమసమాన్తరామ్బరతలే ద్యావాపృథివ్యౌ శ్రితే**
**వాయ్వగ్నీ శశిభాస్కరౌ భతటితస్సర్వం న యచ్చేహ తత్ ॥ 384**

భావ॥ శరీరం బ్రహ్మపురం. దానిలోపల హృదయంలో స్వల్పమయిన ప్రాదేశ మాత్రమయిన ఆకాశములోనున్న "పరమాకాశమను" పేరుతో అంగుష్ఠపరిణామముతో నున్న బ్రహ్మమును జ్ఞానులు అన్వేషించవలయును. అదే మనము తెలిసికొనదగిన బ్రహ్మతత్త్వము. అది బాహ్యాకాశముతో సమానమయిన ఆకాశము. దాని యందును ద్యావా పృథివులు, అగ్ని వాయువులు సూర్యచంద్రులు నక్షత్ర విద్యుత్తులు ఈ సర్వం ఉండును. (కృష్ణముఖంలో విశ్వంలాగా) ప్రస్తుతం ఈ లోకంలో నష్టమయినది గూడా ఉండును. 384

విశే॥ 1. దహరవిద్యా ప్రారంభము. అచేతనం చేతనాధీనం. కనుక శరీరం ప్రత్యగాత్మ అను బ్రహ్మం నివసించు చోటు. కనుక పురం "అష్టాచక్రానవద్వారా దేవానాం పూరయోధ్యా" దేహపురంలో ఇంద్రియాలు, అధిష్ఠాన దేవతలు నవద్వారాలు ఉన్నాయి.

2. హృదయమధ్యంలో పుండరీకాకారమయిన మాంసఖండము, నాడీ పరివేష్టితం, అథోముఖమయిన కోశము. దానియందున్న రంధ్రము హృదయాకాశము. అనగా అంతః కరణము. అందులో అదే ప్రమాణంతో ఉండువాడు ప్రత్యగాత్మరూపబ్రహ్మము.

3. ఆకాశం = అంతటా ప్రకాశముగలది, అలాగే ఆకాశం వలె నిరంజనమయినది అసంగమయినది కనుక బ్రహ్మం/ఆత్మ. అశరీరం. సర్వవ్యాపి. అంతర్యామి బహిర్యామి - ఆకాశంవలె. ఈ ఆకాశము బాహ్యాకాశమువలె సర్వ సృష్టిపూర్ణమే. ఈ విషయం శాస్త్రం వలన తెలుస్తుంది. బాహ్యాకాశమే దహరాకాశం కనుక ఆంతరమయిన బ్రహ్మమునందున్న సర్వం ఆశ్రితమే. పైగా మాయవలన వచ్చిన ఉపాధి భేదమే కనుక బ్రహ్మమునందున్నదంతా ప్రత్యగాత్మయందున్ను ఉండును. అంతరబ్రహ్మ ప్రత్యగాత్మ, బాహ్య బ్రహ్మ పరమాత్మ.

4. బాహ్యంగా జగత్తు కనబడటం అనుభవమే. అంతరమయిన ఆత్మయందు కనబడటం స్వప్నాదులందు అనుభవసిద్ధము. పైగా చనిపోయినవారు మొదలగు గతకాలపు విషయాలు గూడా స్వప్నంలో కనబడతాయి. అందుకే శ్లోకం చివర "న యచ్చేహతత్" అన్నాము.

5. లేదా, సర్వజగత్తు ఆంతరమే. మాయచేత అది బయటగూడా కనబడుతున్నది. స్వప్నంలో ఆంతరమయిన ప్రపంచం బయటా ప్రపంచంగా కనబడుతున్నది. "విశ్వం దర్పణ-దృశ్యమాన నగరీ తుల్యం నిజాంతర్గతమ్. పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథా నిద్రయా" దక్షిణామూర్తి స్తోత్రం.

6. జాగరణ స్వప్న సుషుప్తి రూప ప్రపంచమంతా మనోమయము. కనుక మనస్సుంటే ప్రపంచం, లేదంటే లేదు. అయితే జాగరణంలో ఇంద్రియ వృత్తులద్వారా స్వప్నంలో అవిద్యా వృత్తులద్వారా మనస్సు ఆంతర ప్రపంచమును గుర్తిస్తుంది. లేదా, లోకులందరు బాహ్యంగా

చూసే ప్రపంచమును మునులు సమాధిలో ఆంతరముగా చూస్తారు. భూతభవిష్యత్తులను గూడా చూస్తారు. కనుక ఆంతర ప్రపంచం గూడా అనుభవసిద్ధమే.

**శ్లో॥ జీర్ణేఽస్మిన్నిహతే వపుష్యపి నభో నైవాన్తరం జీర్యతే**
**నో వా హన్యత ఏవ ఖం త్రిభువనే నష్టేఽ ప్యనష్టం యథా ।**
**ఆత్మా బ్రహ్మ తదేతదస్తకలుషం క్షుత్తృడ్జరారోగశు-**
**జ్ఞాశాఽసఙ్గతమప్యమోఘహృదయం సర్వేఽత్ర కామాశ్రితాః ॥385**

భావ॥ ఈ శరీరమును మనం కొట్టినా అరగదీసినా అందులో ఉన్న అంతరాకాశమయిన బ్రహ్మం దెబ్బతినదు. చావదు. అరగదు. ముల్లోకములు ప్రలయమయినా ఆకాశము చావదు గదా! దేహం నష్టమయినా ఆకాశముగాని ఆత్మగాని నష్టము గాదు. దేహపు ముసలితనంతో ఆత్మ ముసలిది కాదు. దేహాకాశమూ ముసలిది కాదు. పాపరహితము. ఆకలిదప్పికలు, ముసలితనము, రోగము, దుఃఖము, ఆశలు - ఇట్టి వాని స్పర్శ గూడా లేనిదియు, అమోఘసంకల్పముగలదియు, అగు బ్రహ్మము ఆత్మయే. సర్వకామములు బ్రహ్మమునందే ఆశ్రయించియున్నవి. 385

**శ్లో॥ యద్యత్కామసమాప్తయే బృహదిదం లోకా ఇహోపాసతే**
**తం తం కామమయన్తి దారధరణీపుత్రార్థపశ్వాదికమ్ ।**
**భోగః కర్మజితో వినశ్యతి యథేహాముత్ర నశ్యేత్స చే-**
**త్యజ్ఞః కామవశోఽవశోఽయతి శుచం ప్రాజ్ఞస్త్వకామో ముదమ్ ॥386**

భావ॥ ప్రజలు ఏయే కోరికలు తీర్చుకొనుటకు ఈ బ్రహ్మమును సేవించెదరో ఆయా కోరికలు - భార్య, సంతానము, భూమి, దానము, పశువులు మొదలయినవి - తీరును. కాని కర్మఫలంగా వచ్చిన భోగములు అనుభవంతో నశించును. అట్లే స్వర్గాది లోకములయందున్ను నశించును. నశించటం వలన కామ వశుడయిన అజ్ఞాని అవశుడై దుఃఖపడును. జ్ఞాని నిష్కాముడై ఆనందమును పొందును. కనుక నిష్కాముడై బ్రహ్మోపాసన చేయును. 386

**శ్లో॥ యస్సాక్షాదకృతాఽశయే స్థితమముం స్వాత్మానమీశం పరం**
**బ్రహ్మాయం పతితే వపుష్యుపగతస్సర్వేశ్వరస్య క్షితిమ్ ।**
**సఙ్కల్పాత్పితృమాతృసోదరసఖిస్వస్రఙ్గనాన్నోదకా-**
**తోద్యస్రఙ్ముఖలోకసఙ్గతతమస్తుష్టో మహీయాన్భవేత్ ॥ 387**

భావ॥ తన హృదయమునందే లభ్యుడయిన ఈశ్వర రూప పరమాత్మను సాక్షాత్కరించి కొన్నవాడు విదేహముక్తిలో ఆ ఈశ్వరుని హిరణ్యగర్భలోకమునకు పోవును. అచ్చట సంకల్ప మాత్రముననే పితృ, మాతృ, సోదర, మిత్ర, సోదరీ, స్త్రీలోకములను, అన్నం, ఉదకం, వాద్యము,

గంధమాల్యములు మొదలుగాగల లోకములను పొందును. సంతుష్టుడై గొప్పవాడే అగును. (అథ యది పితృలోక కామో భవతి తంపితర ఉపతిష్ఠంతే) 387

విశే॥ సత్యకామ సత్యసంకల్పాది గుణములుగల సగుణబ్రహ్మోపాసన చేత అట్టిలోకములు మహిమలు వచ్చును. నిర్గుణబ్రహ్మసాక్షాత్కారం వలన మాత్రమే కైవల్యము. నిర్గుణము సాక్షాత్కరించినా అది సగుణ బ్రహ్మ అని తాను ఉపాసకుడనని ద్వైతభ్రాంతి ఉండటం వలన ఇలా జరుగుతుంది.

**శ్లో॥ స్వస్థానప్యనృతేన సాధు పిహితాన్ లోకాన్ యియాసన్నయం**
**లోకో నైతి బతార్యమాతృసహజస్త్రీపుత్రముఖ్యాన్మృతాన్ ।**
**స్వాత్మానం చ స వేత్తి హృద్గతమపి బ్రహ్మాన్వహం యన్నపి**
**క్షేత్రాన్తర్నిహితం నిధిం కి మబుధో విద్యాదుపర్యప్యయన్ ॥ 388**

భావ॥ అజ్ఞానావృతమయి బ్రహ్మరూపుడయిన తనయందే ఉన్న మాతృపితృభ్రాతృ పుత్రాదిలోకములను (వారి మరణానంతరం) చేరవలెననుకొన్నను అజ్ఞాని చేరలేడు. రోజూ సుషుప్తిలో పొందుతున్నా గూడా హృదయగతమయిన తన ఆత్మరూపమయిన బ్రహ్మమును గూడా తెలిసికొనలేడు. అజ్ఞాని తాను నడిచే మార్గమును భూమిలో కూరుకొనియున్న నిధి మీదగా నడుస్తూ గూడా ఆ నిధిని గుర్తించలేడు గదా! 388

విశే॥ 1. వీరు చూడలేనంతమాత్రమున ఎలా నిధులు లేవనలేమో అలాగే వారి ఆత్మయందు మృతులయిన పితృ పుత్రాదులు లేరనరాదు. ఇక సకలహృదయగతుడయిన పరమాత్మ లేడనగలమా? తననే తెలియనివారికి తనయందున్న లోకములెలా తెలుస్తాయి? ప్రాజ్ఞులకయితే ఆ నిధులూ తెలుస్తాయి. ఈ లోకాలు తెలుస్తాయి. పరమాత్మయు తప్పక తెలుస్తాడు.

2. ఇవన్నీ తన ఆత్మయందుండుట అనగా, నష్టమయిన ఘటము తన ఉపాదాన కారణమయిన మట్టి యందున్నది - అన్నట్లు ఈ లోకములన్నియు తమ అధిష్ఠానమయిన బ్రహ్మరూప - ఆత్మయందు అధ్యాసలయి వివర్తముగా నున్నట్లు ఉండటము.

3. అయితే అందరు ఆత్మయందుంటే ముక్తి వచ్చినట్లవుతుందంటారా? - సమా - అన్ని తమ అధిష్ఠానమునందేగదా ఉంటాయి లయిస్తాయి. అలాగే నష్ట ఘటమయిన మంచి ఘటమయినా మట్టియందే ఉంటుంది. అందువలన ముక్తులయినా బద్ధులయినా ఆత్మరూపంతోనే ఉంటారు. వారికి తమ ఆత్మరూపం తెలియునంతవఱకు బద్ధులే. తెలిసిన తరువాత ముక్తులే.

4. మృతమయిన ఆలోకులు పునః ఎలాకనబడతారు? - సమా - ఈశ్వరసముడయిన జ్ఞానికి ఈశ్వరుని సంకల్ప బలం వస్తుంది. దానివలన అలా జరుగుతుంది. భారతంలో వ్యాసుడు మృత వీర సందర్శన చేయలేదా? విశ్వామిత్రుడు లోక సృష్టి చేయలేదా?

**శ్లో॥ ఆత్మాయం హృది యత్తతో హృదయమిత్యుక్తం హృదేతద్బుధై-**
**రేవం విత్ప్రతిపద్యతేఽ ప్యహరహర్హార్దం బృహద్భాస్వరమ్ ।**
**ఉత్థాయైష తనోరితఃపరమితః స్వేనాత్మనా తిష్ఠతి**
**బ్రహ్మాత్మైష హి సమ్ప్రసాద ఉదితస్సత్యోఽమృతశ్చాభయః ॥ 389**

భావ॥ ఆత్మ హృదయమునందుండుట వలన "హృది అయం" అను వ్యుత్పత్తిచేత "హృదయం" అయినది. అందువలన ఈ విషయం తెలిసిన జ్ఞాని ప్రతిదినము హృదయగత ప్రకాశరూప పరబ్రహ్మమును సుషుప్తిలో పొందుచుండును. అప్పటినుంచి జ్ఞానికి ఈ దేహాభిమానము తన ఆత్మరూపములో నుండును. అనగా సచ్చిదానందరూపముతో నుండును. ఇట్టి సంప్రసాదరూపుడయిన ప్రాజ్ఞజీవుడు బ్రహ్మాభిన్నుడయిన ప్రత్యగాత్మ అని చెప్పబడును. అతడే సత్యమనుపేరు గలవాడు. అమృతుడు అభయుడు అగును. 389

విశే॥ ఆత్మ హృదయగతమే. కనబడలేదనరాదు. **జ్ఞాని అయినవాడు రోజూ సుషుప్తిలో సమాధిలో ఆత్మను హృదయమున గమనిస్తాడు. అజ్ఞుడు పొందినా 'బ్రహ్మమును పొందుచున్నా"నన్న భావన లేనందువలన తెలియనివాడయినాడు.** బ్రహ్మవేత్తయే బ్రహ్మం. కానివాడు బ్రహ్మం కాడు గదా!

**శ్లో॥ వర్ణాః సత్యమితి త్రయః పరతరబ్రహ్మాభిధాయాం స్థితా-**
**స్సస్తోయఇచ్ఛ సకార ఏతదమృతం బ్రహ్మైవ మర్త్యస్తు తః ।**
**మర్త్యామర్త్యయుగం నియచ్ఛతి తు యః స్వేనాత్మనాత్మా స యం**
**వేదైవం ప్రతిపద్యతేఽన్వహమయం స బ్రహ్మలోకం స్వయమ్ ॥390**

భావ॥ బ్రహ్మమను పేరుగల సత్యము యొక్క ఉపాసన ఇది. "సత్య" పదమున మూడు అక్షరములు గలవు. 1. స 2. త 3. య. ఇవి అన్నియు కలిసి పరతరమయిన బ్రహ్మమును చెప్పును. అందులో "సః" అనునది అమృతరూపమయిన బ్రహ్మమే. త = మధ్యమయిన అనాత్మ సంసారము. 'య' కారము మర్త్య - అమర్త్యము జంటను తన ఆత్మతో వశము చేసికొనును. ఈ యకారమే పరమాత్మ. సకారం తనే కనుక, త కారము తన అధీనమయినది కనుక రెండిటినీ ఇది (స, త లను) వశములో ఉంచికొనును. ఇలా ఎరిగినవాడు ప్రతిరోజూ బ్రహ్మలోకమునకు పోయివచ్చును. (అనగా వాడి నిద్ర, సుషుప్తి సమాధి క్రింద లెక్క)390

**శ్లో॥ ఆత్మా సేతురయం ధరాదిభువనస్తోమం విధత్తే యతః**
**కాలో నాత్ర జరా న మృత్యురపి నో శోకశ్శుభం నాశుభమ్ ।**
**అన్ధోఽనన్ధ ఇవైనమేత్య పురుషో రుగ్ణోఽ ప్యరుగ్ణో భవే-**
**ద్రాత్రిశ్చాప్యహరేవ తస్య సతతం బ్రహ్మైవ లోకః స్ఫురేత్ ॥ 391**

భావ॥ ఈ ఆత్మ సేతువు. ఎందుకంటే భూలోకము మొదలగు లోకసమూహమును సృజించుచున్నది. ఈ ఆత్మ వద్ద ముసలితనం లేదు. మృత్యువు లేదు. శోకమూ లేదు. శుభాశుభములేవియు లేవు. ఈ ఆత్మను జ్ఞాని లేదా సుషుప్తిలోని జీవుడు అంధుడయినా అనంధుడే. రోగి అయినా అరోగియే. వానికి రాత్రి గూడా పగలుగానే యుండును. అతనికి బ్రహ్మలోకము జరారోగాది మృత్యులోకములు కనబడవు. 391

విశే॥ ఆత్మ ప్రకాశైక స్వభావము. జ్ఞాన స్వరూపం తప్ప ఏవీ ఉండవు. "యానిశా సర్వ భూతానాం తస్యాం జాగర్తి సంయమీ। యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః" కనుక అతనికి సర్వదా పగలే. సంసారమే అతనిపాలిట రాత్రి. అతనికి బ్రహ్మలోకమే కనబడుతుంది. బ్రహ్మమే కనబడుతుంది కనుక. అదంతా సర్వదా అలాగే ఉంటుంది. సుషుప్తిలో మాత్రమే కాదు. అజ్ఞానికి మాత్రం బ్రహ్మలోకం వెళ్ళినా ఆ భావన లేనందువలన మోక్షము రాదు. దేహాభిమానరహితుడై సమాధిగతుడయిన అవధూతకు నిత్యమూ బ్రహ్మస్ఫురణయే. ఆయన సమాధియొక్క గొప్పతనానికి మన సుషుప్తియే ఉదాహరణము. రోగము అంగవైకల్యము ఏవీ గూడా ఆత్మ రూపములో ఉండవు. వాని అనుభవంలో సుఖమే ఉంటుంది. అందువలన దానినే స్మరిస్తాడు గాని తన వైకల్యాలను స్మరించడు. అవన్నీ అనాత్మ ధర్మాలు.

**శ్లో॥ బ్రహ్మజ్ఞోఽపి న కామినీవిషయసమ్పర్కోత్థతృష్ణో భజే-**
**దేత ద్బ్రహ్మపదం తతః ప్రకలయేత్సద్బ్రహ్మచర్యం బుధః ।**
**విద్వాన్ బ్రహ్మపదం ప్రయాతి విదధత్తద్బ్రహ్మచర్యం హి య-**
**ద్యజ్ఞేష్టావచనోపవాసవనితాసత్త్రాయణాఖ్యం విదుః ॥ 392**

భావ॥ బ్రహ్మజ్ఞుడయినా కాంతా తృష్ణ, విషయ తృష్ణ వంటివి ఉన్నచో బ్రహ్మ పదమును పొందలేడు. ఇక ఆ బ్రహ్మజ్ఞాని సంగతి ఏమి చెప్పవలె. కనుక జ్ఞాని తప్పక బ్రహ్మచర్యమును పాటింపవలయును. బ్రహ్మచర్యము కలిగిన జ్ఞానియే బ్రహ్మలోకమును చేరును. కనుకనే సన్న్యాసికే జ్ఞానాధికారము. ఈ బ్రహ్మచర్యము యజ్ఞము, ఇష్టము, మౌనము, ఉపవాసము, వనవాసము, సత్త్రాయణమను సామూహిక యజ్ఞముల కన్న చాలగొప్పది. 392

విశే॥ స్మరణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యాభాషణమ్ సంకల్పోధ్యవసాయశ్చ క్రియానిర్వృతిరేవచ ఏతన్మైథున మష్టాంగం ప్రవదంతి మనీషిణః" కనుక ఇట్టి కాంతాసంపర్కం లేకపోవటం సన్న్యాసికే కుదురుతుంది. కనుక గృహస్థుకు కర్మత్యాగ రూపమయిన జ్ఞానానికి అధికారం లేదు. సత్త్రాయణము. అనేకమంది యజమానులు కలిసి చేయునది.

**శ్లో॥ అస్మిన్ బ్రహ్మపదేఽర్ణ వావర ఇతి ణ్యశ్చేత్యుభౌ స్తో ధరా**
**స్వర్గాభ్యాం పరమేఽత్ర కిఞ్చన సరోఽస్త్యైరమ్మదీయాభిధమ్ ।**

**అశ్వత్థస్తరురస్తి సోమసవనో హైరణ్మయం మణ్డపం**
**చైశం పూరపరాజితేతి వదతే తద్బ్రహ్మణో భారతీ ॥ 393**

భావ॥ ఈ బ్రహ్మస్థానము భూలోకస్వర్గలోకములకన్న పరమస్థానములోనున్నది. దీనిలో రెండు సముద్రములున్నవి. అరము, ణ్యము. ఇచ్చటనే ఐరమ్మదీయమను సరస్సు ఒకటి యున్నది. అచ్చటనే సోమ సవనమను అశ్వత్థ వృక్షము ఒకటియున్నది. అచ్చటనే ఈశ్వరుడు సృష్టించిన హిరణ్మయనగరమున్నది. దానినే "అపరాజితా" నగరమని బ్రహ్మవాణి అయిన వేదము చెప్పుచున్నది. **ఇదంతా సగుణ బ్రహ్మోపాసకునకు గమ్యమయిన లోకస్థితి.** 393

విశే॥ ఈ సరస్సు, ఈ సముద్రములు అన్నియు అమృతమయములు. బ్రహ్మచర్యాదికము లేనివానికి ఇది దుర్లభం కనుక "అపరాజిత".

**శ్లో॥ యత్స్వర్గాదుపరి ప్రకాశత ఇదం స్థానం తృతీయం పరం**
**బ్రహ్మక్షేత్రమిహాపి మర్త్యవపుషో హృద్యస్త్యముష్మిన్నపి ।**
**ణ్యారాశ్వత్థహిరణ్యమణ్డపసరస్సోమోఽస్తి యన్మానస-**
**స్సర్వోఽయం ప్రతిపద్య చైతదయతే కామాన్ సమస్తాన్ బుధః ॥394**

భావ॥ ఈ పరమోత్కృష్టమయిన బ్రహ్మస్థానము స్వర్గము కన్న పైనది. తృతీయము. ఈ బ్రహ్మక్షేత్రం కేవలం బ్రహ్మలోకమునందే కాదు. **ఈ శరీరములోనూ హృదయస్థానంలో సూక్ష్మరూపంలో నుంటుంది.** ఇచ్చట గూడా బ్రహ్మ క్షేత్రమునందున్నట్లు చెప్పబడిన, అరణ్య, అశ్వత్థ, సువర్ణ మండపాదులు కలవు. ఇదంతా మానసిక శరీరంలో నుంటుంది. దీనిని శరీరంలోనే పొంద గలిగిన జ్ఞాని (ఉపాసన) సమస్తకామ పరిపూర్ణుడగును. 394

విశే॥ 1. **"మనోమయాని బ్రహ్మలోకే శరీరాదీని" అని పురాణవచనం**

"అశోకమహిమం –" శ్రుతి.

2. బ్రహ్మలోకశరీరాలు మనోమయాలు. భూలోకంలోలాగా పార్థివాలు కావు. చంద్రలోకములో లాగా జలశరీరాలు కావు. అయితే శీతోష్ణబాధలు తప్పవు కదా!

**శ్లో॥ బ్రహ్మక్షేత్రగతం మనోమయమిదం సత్యం సమస్తం యతః**
**శుద్ధం శుద్ధహృదుద్భవఞ్చ విషయో బాహ్యస్త్వశుద్ధోఽనృతః ।**
**స్వాప్నోఽర్థోఽప్యనృతో హృదన్తరగతో యస్మాదవిద్యామయో**
**శుద్ధాత్మప్రభవశ్చ సత్యమనృతం మోదాయ ఖేదాయ చ ॥ 395**

భావ॥ మనోమయమయినను ఇవి స్వప్నభోగములవలె మిథ్యాభూతములు కావు. "త ఇమే సత్యాః కామాః" శ్రుతి. బ్రహ్మక్షత్రగతమయిన ఈ భోగములు పదార్థములు సత్యములు. ఎందుకంటే అవి సత్యసంకల్పము వలన దోషరహితమయిన హృదయమునుండి జన్మించినవిగదా!

బాహ్యావిషయములు అవిద్యా దూషితములు కనుక అశుద్ధములు. మిథ్యలు అనృతములు. స్వప్నవిషయాలు హృదయాంతరగతములే. అయినా అవిద్యా నిద్రాదోష దూషితములు. కనుక అనృతములే. మిథ్యలే. శుద్ధ సంకల్ప జన్యములయినది. ఆనందకరము. అవిద్యా జన్యమయినది దుఃఖకరము. 395

విశే॥ 1. మనోమయమయినా అవిద్యామయమయినవి కనుక స్వప్నపదార్థములు రజ్జుసర్పముల వలె మిథ్యలు. అవిద్యచేత మనస్సునందు అవి కల్పింపబడినవి. లేదా, మనస్సంస్కారముతో కూడిన అవిద్యయే ఆత్మయందు కల్పించినవి. ఎలాగయినా దోషజన్యములు కల్పితములు కనుక అవి మిథ్యలు. బ్రహ్మలోకవస్తువులు మనోమయమయినా అట్టివికావు. ఇవి శుద్ధ సత్త్వసంకల్పజన్యములు.

2. మనశ్శుద్ధి - అశుద్ధినిబట్టి బ్రహ్మలోకపదార్థాలకు స్వప్నాది పదార్థాలకు సత్యం 'మిథ్య' అన్నతేడా రావచ్చును. అట్లే మనోమయం కాకపోయినా బాహ్య ప్రపంచ విషయాలున్నూ అవిద్యామయములు. మాయాకృతములు. తత్త్వరీత్యా బ్రహ్మదృష్ట్యా మిథ్యలు. ప్రపంచమంతా బ్రహ్మమునందు అవిద్యా కల్పితము కదా! సప్తాన్న బ్రాహ్మణమున ఇట్లున్నది. "అశుద్ధ మనస్సంకల్పము వలన పుట్టి అవిద్యా కామ కర్మాది దూషితమనస్సుగల వాడైన జీవుడు జ్ఞానకర్మలతో ప్రపంచమును పుట్టించును" అని శ్రుతి. కనుక జాగరణ స్వప్నాలు రెండున్నూ అవిద్యామయములు, అశుద్ధాత్మ భిన్నములు, అశుద్ధములు కనుక ఈ సామ్యంతో మిథ్యలు. విద్యామయము, శుద్ధాత్మ ప్రభావము, శుద్ధము - కనుక బ్రహ్మలోకము సత్యము.

3. బాహ్యం - ఆంతరం (మనోమయం) వీటికి సామ్యం ఎలా? - బాహ్యమయినా మనోమయమే. మనస్సే గ్రహిస్తుంది. మనస్సంకల్పమునుంచి పుట్టాయి. కనుక, బాహ్య ఆంతరములు మనోమయములే. "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" అని ప్రపంచమంత సంకల్పజన్యమే కదా! జీవేశ్వరులు అభిన్నులు కనుక ఈశ్వర సంకల్పమయినా జీవ సంకల్పమే. కనుక బ్రహ్మ, జాగ్రత్, స్వప్న లోకములు మూడున్నూ మనోమయములే. అందులో శుద్ధం కనుక బ్రహ్మలోకం మరింత సత్యం. మిగిలినవి అసత్యములు. కారణమయిన బ్రహ్మరూపంగా ఆలోచిస్తే అన్నీ సత్యములే. (బ్రహ్మభిన్నంగా ఆలోచిస్తే ఈ మూడు మిథ్యలే).

**శ్లో॥ ణ్యారావమ్బునిధీ ప్రయాతి పురుషో యో బ్రహ్మచర్యేణ వా**
**తస్య బ్రహ్మపదం కరస్థితమపి స్యాత్కామచారో భువి ।**
**రక్తశ్వేతవినీలపిఙ్గలహరిత్సూర్యాంశుసమ్పృక్తభూ-**
**తత్తద్వర్ణగనాడికాసితహృదో మూర్ధన్యయా ప్రైత్యయమ్ ॥ 396**

భావ॥ బ్రహ్మచర్యం ద్వారా ఎవడు ణ్యము, అరము అను సముద్రములను చేరునో ఆ

పురుషునకు బ్రహ్మలోకము కరతలామలకము. అంతేకాదు వాడు స్వేచ్ఛగా భూలోకమునందున్ను కామచారము చేయగలడు. నారదాదులు అట్టివారు. వారివి మనోమయ శరీరములు. ఇట్టి సగుణ బ్రహ్మవేత్త భౌతిక శరీరత్యాగం తరువాత సూర్యకిరణములద్వారా (దేవయానము) సగుణ బ్రహ్మలోకమునకు చేరును. రక్తశ్వేత నీల పింగల హరిత వర్ణమయిన సూర్య కిరణముల వలన మన హృదయమునందు అవేరంగులు గల నాడులు పుట్టును. అట్టి నాడీబద్ధమయిన హృదయమునుండి నడినెత్తికి చేరు సుషుమ్నా నాడి ద్వారా అర్చిరాది మార్గమున వెడలును. 396

**శ్లో॥ ఆత్మానం విబుధోఽయమోమితి పరం ధ్యాయన్ప్రయాణక్షణే**
**యోగాత్ప్రాణమపి ప్రవేశ్య హృదయం మూర్ధన్యనాడీపథే ।**
**త్యక్త్వా దేహమిమం తయావకలితైర్భానోర్మయూఖైరుప-**
**ర్యాయన్ హృజ్జవతః ప్రయాతి తరణిం ద్వారాయితం బ్రహ్మణః ॥397**

భావ॥ సుషుమ్న, ప్రయాణ విధానమిది. మరణ దశలో జ్ఞాని ఆత్మను ఓంకారముతో ధ్యానము చేస్తూ యోగశక్తితో హృదయగత ప్రాణములను సుషుమ్నలోకి చేర్చి ఈ దేహమును వదలును. దానితో కలిసిన సూర్యకిరణముల ద్వారా మనోవేగముతో ఊర్ధ్వగమనము చేయుచు బ్రహ్మలోకద్వారమయిన సూర్యునిలో చేరి కొనును. (సూర్యకిరణములు సుషుమ్నాగ్రమున కలియును – తదోకోగ్ర జ్వలనమ్) 397

**శ్లో॥ రశ్మీనాం నికరో రవేర్హృదయతః ప్రారభ్య చాభాస్కరం**
**సంవ్యాప్తోఽస్తి మహాపథో భువి యథా గ్రామద్వయం సంవిశన్ ।**
**సత్యం యాన్త్యమునా యతః ప్రపదనం విద్యావతామ్భాస్కర-**
**ద్వారం హన్త నిరోధనన్త్వవిదుషాం దేహే నిరుద్ధాయతః ॥ 398**

**శ్లో॥ ఆదిత్యస్య రుచా ప్రయాణసమయేఽయోగాత్సుషుమ్నే తరా**
**స్వాప్తాః ప్రాణగతిం పృథగ్విధసిరా స్వజ్ఞా భజన్తేఽధ్రువాన్ ।**
**లోకానాత్మకృతానురూపమసుఖానుత్థాయ దేహాదితః**
**కోఽప్యేవం మ్రియమాణ ఏతి న పుమాన్ సంజ్ఞాముతాల్పీయసీమ్ ॥399**

భావ॥ హృదయమునుండి సూర్యునివరకు ఒక కిరణమార్గముండును. రెండు గ్రామాల మధ్యనుండే మహామార్గము వంటిదది. అది విద్యావంతులకు అనగా జ్ఞానులకు యోగులకు బ్రహ్మను చేర్చుమార్గము. అది భాస్కర ద్వారము. దీనిని విద్వాంసులు "**ప్రపదనం**" అందురు. బ్రహ్మమును చేర్చుమార్గము – అని అర్థము. అవిద్యావంతులకు ఇది "**నిరోధనము**" బ్రహ్మమును చేరనీయదు. మూసి ఉన్న ముక్తి ద్వారము.

అవిద్వాంసులు మరణ సమయములో ఆదిత్యద్వారము నిరోధింపబడటం వలన యోగశక్తి

లేనందువలన సుషుమ్నేతరమయిన నాడులలో చేరి తద్ద్వారా ప్రాణగతిమార్గమును పొంది తమ కర్మఫలములైన అశాశ్వతములయిన ఆనంద దూరములయిన లేదా అల్పానందము లయిన లోకములను పొందును. ఇట్టి మరణ దశలో అజ్ఞాని అయినా ప్రాజ్ఞుడయినా ఎటువంటి విశేష జ్ఞానము (స్పృహ) ఉండదు. 398-399

**శ్లో|| శ్రీమద్భాస్కరభానుపూరితసిరాద్వారైరితో హృత్పురం**
**తత్రాకాశమహేశ్వరేణ కలితస్సమ్ప్రత్తిముచ్చైః పుమాన్ ।**
**స్వాప్నం బాహ్యజగచ్చ నో కలయతే స్వాపే యథా వా తథా**
**నాశేఽ ప్యుత్క్రమమాణ ఏష హృదయాత్సమ్ప్రత్తిభాగ్వేద నో ॥ 400**

భావ|| మరణ క్షణంలో ఎవరికీ చేతన (స్పృహ) ఉండదు. సూర్యకిరణభరిత, నాడీద్వారము ద్వారా హృదయమున చేరి అచ్చట దహరాకాశ స్వరూపుడయిన పరమాత్మతో కలిసిన మానవుడు సుషుప్తిలో ఎలా బాహ్యప్రపంచ జ్ఞానము లేకుండా పడియుండునో అట్లే ఉత్క్రమించు సందర్భములోనూ ప్రపంచజ్ఞాన రహితుడయి యుండును. 400

**శ్లో|| ఆత్మా యః క్షతపాపశోకమరణక్షుత్తృడ్జరారుగ్భయ-**
**స్సత్యేచ్ఛోఽవితథేక్షణశ్చ పురుషో జిజ్ఞాసితవ్యస్స వా ।**
**సోఽన్వేష్టవ్య ఇహైవ మోక్తుముశతా యస్తం విజానాత్యయం**
**లోకానేతి సమానుపైతి సకలాన్ కామానువాచేత్యజః ॥ 401**

భావ|| పాపశోక మరణములు ఆకలిదప్పికలు, జరారోగ భయములు లేనివాడు, సత్యకాముడు, సత్యసంకల్పుడు, ఆత్మరూపుడు అయిన ఆ పురుషుడు విచారణీయుడు. ఆయనయే ముముక్షువులకు అన్వేషణీయుడు. ఆయనను అలా ఎఱిగిన వాడు సమస్తలోకములను సకల కామములను పొందునని ప్రజాపతి చెప్పెను. (పురుషః = పూర్ణుడు, పురమయిన దేహమునందు శయనించువాడు) సత్యకామత్వాదిగుణములు గల ఆత్మయే ఈశ్వరుడు. ఆయనయే జ్ఞేయుడు. 401

**శ్లో|| ఆత్మాఽసౌ పురుషస్స ఏవ విబుధైర్యో దృశ్యతేఽక్ష్ణీత్యజే-**
**నోక్తస్సన్నసురేడ్విరోచన ఇతి చ్ఛాయామయం సోఽగ్రహీత్ ।**
**ఆత్మానం పురుషం తమప్సు ముకురే ఖడ్గే చ యో దృశ్యతే**
**దేహాత్మానమిమం స చాసురగణాయోపాదిశన్మూఢధీః ॥ 402**

భావ|| నేత్రములో కనబడే పురుషుడే "ఆత్మ" అని ప్రజాపతి ఇంద్ర విరోచనులకు ఉపదేశించాడు. ఈ విషయము విన్న విరోచనుడు కంటిలో కనబడే ప్రతిబింబమే 'ఆత్మ' అని గ్రహించెను. అనగా శరీరమే కదా! ప్రతిబింబించేది. కనుక "దేహమే ఆత్మ'. నీటిలో అద్దంలో కత్తిలో ప్రతిబింబించునట్టి దేహమే ఆత్మ అని ఆ మూఢుడు అసురగణమున కుపదేశించెను. అందువలననే రాక్షసులు దేహాత్మవాదులయినారు. 402

శ్లో॥ ఛాయాఽఽత్మా పురుషోఽక్షిగః కథమయేద్రోగాదిహీనాత్మతాం
దేహస్థా నను రోగశోకకృశతా దృశ్యన్త ఏవాఽత్ర యత్ ।
ఆత్మాచేత్ప్రతిదేహ ఏవ న కుతో దేహోఽయమాత్మా భవే-
దాత్మా దేహ ఇతీరితం న గురుణా కస్మాదితీన్ద్రోఽమనత్ ॥ **403**

భావ॥ నేత్ర ప్రతిబింబితుడయిన ఛాయారూప పురుషుడు పాపశోకరోగాది హీనుడెలా అవుతాడు" అలా కావాలంటే బింబ దేహములో రోగాదులుంటే అవి ప్రతిబింబములో కనబడతాయి కదా! పైగా బింబ దేహమును వదలి ప్రతిబింబదేహమును ఆత్మ అని చెప్పటమేమిటి? అసలు దేహమునే "ఆత్మ" అని ప్రజాపతి ఏల చెప్పలేదు? అని ఇంద్రుడు తీవ్రముగా ఆలోచించెను. 403

శ్లో॥ దేహే తిష్ఠతి తిష్ఠతి ప్రచలతి చ్ఛాయామయోఽయం చల-
త్యస్మిన్నశ్యతి నశ్యతీతి విదితం నాత్మైష ఆత్మా తు కః ।
ఏవం పృష్టవతే జగాద హరయే బ్రహ్మా మహీయాంస్తు యః
స్వప్నే సర్వపదార్థభుక్చరతి తం స్వాత్మానమాలోకయ ॥ **404**

భావ॥ ఇంద్రుడు ప్రజాపతినిట్లు ప్రశ్నించెను. బింబమయిన దేహం ఏమిచేస్తే ప్రతిబింబం (ఛాయాపురుషుడు) అదే చేస్తుంది. నిలిస్తే నిలుస్తుంది. నడిస్తే నడుస్తుంది. నశిస్తే నశిస్తుంది. ఇంతటి పరతంత్రమయినది ఆత్మ ఎలా అవుతుంది? కనుక నిజంగా 'ఆత్మ' ఎవరు? ప్రజాపతి ఇలా అన్నాడు. ఏ మహానుభావుడు స్వప్నములో సర్వపదార్థములను అనుభవిస్తూ తిరుగుచుండునో అతనే నీ "ఆత్మ" అని గ్రహింపుము. 404

శ్లో॥ దేహేఽన్ధే జ్వరితే హతేఽపి వికలే నాన్ధో న వా సజ్వరీ
నో వా స్వప్నదృగాహతో న వికలశ్చాత్మైవ తస్మాదయమ్ ।
ఏవం సమ్ప్రతిపద్య చాథ మఘవా వ్యాఘ్రాగ్నిదాహాదిభిః
స్వప్నే శోకమయన్నయం కథమయేదాత్మత్వమిత్యామనత్ ॥ **405**

భావ॥ ఈ సమాధానం విని ఇంద్రుడు ఇలా ఆలోచించాడు. నిజమే దేహం గ్రుడ్డిదయినా జ్వరపడినా, దెబ్బతినినా, వికలమయినా, ఈ స్వప్న పురుషుడు అయిన ఆత్మ దెబ్బతినదు. జ్వరపడదు. దెబ్బతినదు. కనుక దేహాతీతమయిన యీ పదార్థము ఆత్మయే. అని భావించినాడు. కాని మరల ఆలోచించాడు. ఈ స్వప్న పురుషుడు స్వప్నంలో అగ్ని వ్యాఘ్ర శోకాదులకు దుఃఖము భయము అనుభవిస్తాడు గదా! వీడెలా ఆత్మ అవుతాడు. ఆత్మ అద్వితీయము, శోకరహితము కదా! 405

**శ్లో॥ ఆత్మా స్వప్నదృగేష నో భవతి వా శోకార్త ఆత్మానమా-**
**పన్నాయ ప్రవదేతి భాషితవతే ప్రోవాచ కో జిష్ణవే ।**
**ఆత్మా సుప్తిసుఖానుభూరితి తతో మత్వా మహేన్ద్రః పున-**
**ర్నాత్మాఽసావపి స స్వమేవ న విదన్ సర్వజ్ఞ ఆత్మా కథమ్ ॥ 406**

భావ॥ మరల ఆయన "ప్రజాపతి" వద్దకు వెళ్ళాడు. స్వప్న ద్రష్ట అయిన ఈ పురుషుడు శోకార్తుడవుతుంటాడు. ఇతను ఎలా ఆత్మకాగలడు? అర్థముకాక ఆపన్నుడనయిన నాకు తమరు వివరింపుడని ఇంద్రుడు ప్రార్థించాడు. ప్రజాపతి ఇలా అన్నాడు. "సుషుప్తిలో సుఖమును అనుభవించు పురుషుడు ఆత్మ" అన్నాడు. ఇంద్రుడు ఆలోచించాడు. మరల ప్రజాపతితో ఇలా అన్నాడు – ఆ పురుషునికి తనెవరో ఏమిటో ఎక్కడున్నాడో తెలియదు. అట్టివాడు సర్వజ్ఞుడైన ఆత్మ ఎలా అవుతాడు? – అతడు ప్రాజ్ఞుడు. ప్ర+అజ్ఞుడు కదా! 406

**శ్లో॥ యః స్వాపే స్వయమేవ నష్ట ఇవ న హ్యాత్మా స ఆత్మోచ్యతా-**
**మిత్యుక్తో హరిణా జగాద భగవాంస్తత్త్వం ప్రజేడాత్మనః ।**
**యో నేత్రే నివసంశ్చ బాహ్యవిషయాన్భుఙ్క్తే గళస్థస్తథా**
**స్వాప్నార్థాన్ హృదయస్థితో బహుసుఖం న స్యాత్స ఆత్మా కథమ్ ॥407**

భావ॥ గాఢమయిన సుషుప్తిలో తనే ఏమయినాడో ఉన్నాడో పోయినాడో తెలియదు. అట్టి అజ్ఞాని 'ఆత్మ' ఎలా అవుతాడు? – అనగా విని భగవాన్ ప్రజాపతి ఆత్మ తత్త్వమును ఇలా చెప్పెను. నేత్రములందు అక్షిపురుషుడుగానుండి బాహ్యవిషయములను, కంఠమునందుండి స్వప్న విషయములను, హృదయమునందు చేరి సుషుప్తి సుఖమును ఆస్వాదించువాడు ఎందుకు ఆత్మకాడు? 407

విశే॥ అక్షిపురుషుడు – జాగరణం – (విశ్వుడు), కంఠపురుషుడు – స్వప్నం – (తైజసుడు), హృదయపురుషుడు – సుషుప్తి – (ప్రాజ్ఞుడు). సుషుప్తికి ఇతడు సాక్షి. ఆత్మ ఎందుకు కాదు? ఆత్మ ఒక్కటే. స్థాన భేదం వలన భోగ్యమయిన ఆనందాదుల వలన జాగరణాది దశాభేదం వలన నామభేదం మాత్రమే.

**శ్లో॥ దేహాధ్యాసమయం ప్రపద్య పురుషో రుగ్ణేఽపి జీర్ణే వపు-**
**ష్యాత్మానం చ తథైవ రుగ్ణమయతే జీర్ణం చ జాగ్రత్పదే ।**
**చిత్తాధ్యాసమథ ప్రపద్య స పునః స్వప్నే సశోకే హృది**
**స్వాత్మానం చ సశోకమిచ్ఛతి తథా స్వాపే త్వవిద్యామయః ॥ 408**

**శ్లో॥ నో జానన్నివ కిఞ్చనాపి లసతి ప్రాజ్ఞః స్వతోఽయం పున**
**ర్నో రుగ్ణో న చ జీర్ణ ఏవ న తథా శోకీ న చాజ్ఞః ఖలు ।**

**నష్టత్వాద్ధృదయస్య నష్ట ఇవ స స్వాపే విభాతి స్వతో**
**నో నష్టస్సకలజ్ఞ ఏవ సకలం స్వాపాది జానాతి యత్ ॥ 409**

భావ॥ జీవుడు జాగరణంలో దేహాధ్యాసం పొందుతాడు. అందువలన దేహానికే బాధ కలిగినా తాను బాధపడతాడు. అది ముసలిదయితే తాను ముసలివాడయినట్లు బాధపడతాడు. అదే పురుషుడు స్వప్నంలో చిత్తాధ్యాస పొంది స్వప్నంలో శోకం కలిగితే తనకు కలలో బాగా ఏడుపు వచ్చిందంటాడు. అదే సుషుప్తిలో అవిద్యామయుడై అజ్ఞానిగా ఉంటాడు.

ఏమీ తెలియని వాడై ప్రాజ్ఞుడుగా (ప్ర+అజ్ఞుడు) ఉంటాడు. అతనికి శరీరాధ్యాస ఉండదు. చిత్తాధ్యాస ఉండదు. శరీరబాధలు తెలియవు. రోగాలు శోకాలు తెలియవు. చిత్తం నష్టమయినది కనుక శోకాదులుండవు. అందువలన సుషుప్తిలో లేనట్లు అతడుండును. కాని లేనివాడుగాదు. ఉన్నవాడే. అతడు సకలజ్ఞుడే. సుషుప్తి మొదలయినవి, సుషుప్తి సుఖం మొదలయినవి అతనికి తెలుసు. 408-409

విశే॥ 1. చిత్తాధ్యాస - లింగశరీరతాదాత్మ్యాధ్యాస. "అవిద్యామయః = కారణ శరీరమయిన అవిద్యతో తాదాత్మ్యాధ్యాస.

2. ఉపాధిగతమయిన రోగదుఃఖాదులు ఆ ఉపాధులు లేని సందర్భమున ఉపహితమయిన ఆత్మయందు కనబడవు గదా! ఉపాధులు స్థూల, లింగశరీరాలు. సుషుప్తిలో అంతఃకరణం నష్టం కావటం వలన పురుషుడు నష్టం అయినట్లే ఉంటాడు.

3. ప్రాజ్ఞుడు అజ్ఞానానందమును గ్రహిస్తాడు. జరారోగాదులు లేని కేవలానందభోక్త అతడు. కనుక సర్వజ్ఞుడు. వీడే తైజసుడు, వీడే తరువాత విశ్వుడు. అందరూ కలిపి ఒకే ఆత్మ. **ఎవరికీ ఆయాదశలలో స్వరూపనాశం లేదు. ఉపాధి లయం మాత్రమే.** పైగా జాగరణానుభవాలు స్వప్నంలోకి వస్తాయి. స్వప్నానుభవాలు వాటి శకునఫలితాలు జాగరణంలో స్మరిస్తాము. సుషుప్తి అనుభవం జాగరణంలో స్మరిస్తాము. కనుక ఆత్మభేదం లేదు. దశా, ఉపాధి భేదం మాత్రమే.

4. ప్రాజ్ఞుడే ఉపాధి బేదం వలన విశ్వతైజసులవుతాడు. ప్రాజ్ఞత్వం సమానంగా అనుస్యూతం - సుషుప్తిలో అదే కేవలంగా ఉన్నది. కనుక ప్రాజ్ఞత్వము అజ్ఞాన - ఉపాధిగా వచ్చినది కాదు. సహజము - సమా - కాదు. సమాధిలో అజ్ఞానం ఉండదు. కనుక ప్రాజ్ఞత్వంగూడా ఉండదు. **కనుక అజ్ఞానమును అనుభవించువాడు ప్రాజ్ఞుడు.** కనుక ఇవన్నియు ఉపాధులు. **ప్రాజ్ఞత్వాదులు ఔపాధికములు.**

"ఆత్మ" తురీయమే. అది నిర్వికల్ప సమాధిగతము.

**శ్లో॥ మర్త్యం మృత్యుమహాహినా కబలితం స్థూలం శరీరం సదాఽ**
**ధిష్ఠానం పరమాత్మనోఽమృతమయస్యాస్యాశరీరస్య చ ।**

**సూక్ష్మం చాపి శరీరమస్య కరణం భోగే తదేత ద్ద్వయం**
**తాదాత్మ్యేన సమేత్య సోఽయమయతే భోగాన్ శరీరీ భవన్ ॥ 410**

భావ॥ అసంసారి అయిన ఆత్మ సంసారి ఎలా అవుతున్నదో ఆ పద్ధతి ఇది. అమృత మయుడు, అశరీరుడు, అయిన పరమాత్మకు ఈ మృత్యుసర్పకబలితం కాబోయే స్థూల శరీరము అధిష్ఠానము. కరణము గూడా. అలాగే సూక్ష్మశరీరము గూడా అధిష్ఠానము కరణము గూడా అవుతుంది. కారణ శరీరం గూడా (విడిగా చెప్పకపోయినా) ఆత్మకు అధిష్ఠానము, కరణము. వీటియందు తాదాత్మ్యం చెందిన ఆత్మ శరీరి అయి ఆయా భోగములను అనుభవించును. 410

విశే॥ 1. శరీరాలలో ఉండటం వలన ఆ శరీరాలు అధిష్ఠానం అనగా ఆధారం. ముఖము, కాళ్లు, చేతులు మొదలగు వాటితోను, జిహ్వా మొదలగు ఇంద్రియముతోను అనుభవాలు వస్తాయి కనుక అవి కరణాలు గూడా (ఇంట్లో ఉండి ఇంటి సౌకర్యాలు అనుభవించినట్లు)

2. సూక్ష్మశరీరంతో తాదాత్మ్యం చెప్పటం వలననే కారణశరీరంతో తాదాత్మ్యం పొందటం గూడా చెప్పినట్లే. సుషుప్తి యందు అజ్ఞానం లోనే ఉండి అజ్ఞానంతోనే (అవిద్యా వృత్తిద్వారా ఆనందానుభవము వస్తుంది.)

**శ్లో॥ ఏవం యస్సశరీరతాముపగతస్సోఽయం ప్రియం చాప్రియం**
**స్వాదృష్టోపగతం భజన్ కలయతే సంసారపాథోనిధిమ్ ।**
**జ్ఞానధ్వస్తశరీరిసమ్భ్రమ మముం ప్రాజ్ఞం ప్రియం చాప్రియం**
**నో వా కిఞ్చిదపి స్పృశత్యయమహో ఆనన్ద ఏవ ప్రియః ॥ 411**

భావ॥ ఇట్లు శరీరములను పొందిన ఆ అజ్ఞుడు తన అదృష్టం వలన లభించిన ప్రియా ప్రియములను పొందుచూ సంసార సముద్రము నందు మునుగుచున్నాడు. ఈ ప్రాజ్ఞునకు "అహం బ్రహ్మాస్మి" అను జ్ఞానము కలిగిన తరువాత తాను శరీరినన్న భ్రమ పోయిన ఈ ప్రాజ్ఞునికి ప్రియము - అప్రియమన్నవేవి తగలవు. అశ్చర్యము. ఆ ఆత్మయే ఆనందము ప్రియము. కనుక జ్ఞానమే సంసార నివర్తకము. సంసారము రజ్జు సర్పమువలె మిథ్య గనుక జ్ఞానమే సంపాదింపదగినది. 411

**శ్లో॥ వాతాభ్రస్తనయిత్నువిద్యుత ఇమా దేహేన హీనా నభ-**
**స్తాదాత్మ్యం ప్రతిపద్య ఖాదుదయితాస్సావిత్రతేజోగతాః ।**
**స్వస్వాకార మయన్తి తద్వదతనుర్జీవో వపుస్సాత్మతాం**
**యాత్వాఽస్మాదుదితః పరమ్ప్రతిగతః స్వేనాత్మనా తిష్ఠతి ॥ 412**

భావ॥ గాలి, మేఘము, పిడుగు, మెఱుపు - ఇవి వర్షానంతరం, దేహరహితములయి, ఆకాశంతో తాదాత్మ్యం పొంది "శిశిరం" తరువాత సూర్యుని గ్రీష్మ తేజస్సులో చేరినవయి

మరల వర్షర్తువులో ఆకాశమునుండి ఆవిర్భవించి తమ తమ నిర్దిష్టమయిన ఆకారములను పొందును. అదే విధముగా శరీరరహితుడయిన జీవుడు శరీరముతో తాదాత్మ్యము పొంది దీనినుండి బయటపడి పరబ్రహ్మమును చేరి స్వస్వరూపముతో నిలుచును. అదే సచ్చిదానంద రూపము. 412

విశే॥ 1. సశరీరుడయితే సంసారం. అశరీరుడయితే స్వస్వరూపప్రాప్తి.

2. అశరీరజీవుడు – దేహరహిత వాయువు మొదలగు వానితో సమానము. ఆకాశతుల్యం శరీరం. పరబ్రహ్మం సూర్యకాంతివంటిది. బ్రహ్మజ్ఞానం సూర్యకాంతిని పొందుట వంటిది.

**శ్లో॥ అజ్ఞానాదహితాం భజన్నపి గుణో జ్ఞానాద్గుణాత్మా భవ-**
**త్యేవం దేహమయో భవన్నయమజో జ్ఞానాత్పునః స్వాత్మనా ।**
**జ్ఞానాత్తిష్ఠతి భిన్న ఏష పురుషో హ్యవ్యాకృతాద్వ్యాకృతా-**
**త్తస్మాదుత్తమ ఏష ఏవ పరమాత్మా యత్సమస్తాన్తరః ॥ 413**

భావ॥ అజ్ఞానం వలన రజ్జువు సర్పం అవుతుంది. జ్ఞానంవలన మరల అది రజ్జువు అవుతుంది. అలాగే అజ్ఞానం వలన దేహాభిమానంతో దేహతాదాత్మ్యం పొందిన బ్రహ్మం మరల జ్ఞానముతో తన అసలు స్వరూపంతో నిలుచును. ఈ పురుషుడు వ్యాకృత – అవ్యాకృత ప్రపంచములనుండి భిన్నమయినవాడు. కనుక ఇతడు ఉత్తమ పురుషుడు. ఇతడు సమస్త ప్రపంచమునకు అంతరుడు. కనుక పరమాత్మ అనబడును. 413

విశే॥ 1. శరీరం వాస్తవంగా లేదు గనుక అజ్ఞానం వలన అజ్ఞానజన్యమయిన శరీరాలే ఉపాధి కనుక ఇవన్నీ జ్ఞానంతో తొలగటం సంభవము. వాస్తవమయితే తొలగవు. రజ్జుసర్పంలో రజ్జువు తొలగదు. సర్పమే తొలగుతుంది. దేహతాదాత్మ్యాధ్యాస వలన వచ్చిన సంసారము జ్ఞానం వలన సమూలంగా తొలగుతుంది. కనుక తనసహజరూపం బయట పడుతుంది. మబ్బులు తొలగితే ఆకాశరూపం సహజంగా బయటపడుతుంది గదా!

2. దేహమయః = చాల (ప్రచుర) దేహములు గలవాడు. ఏకజీవవాదంలో ఇది నిశ్చయమే.

3. లేదా, ఒక వస్తువు మఱొకవస్తువుగా ఎలా అవుతుంది? భ్రమర కీటన్యాయంతో అలా జరిగిందనుకొన్నా అది మరల పూర్వరూపానికి రావటం అసలు కుదరదు. భ్రమరం మరల కీటం అయినట్లు వినలేదుగదా! అలా శరీరి అయిన జీవుడు మరల అశరీరస్థితికి ఎలా తిరిగివస్తాడు. సమా – ఈ పక్షంలో "దేహమయం" దేహరూపంగా కనబడువాడైన జీవుడు. నేనులావు, నేను మనిషిని – ఇలాంటి భావనలు దేహరూపుడు కావటం వలన వస్తాయి. జీవుడు వాస్తవముగా దేహరూపుడు గాడు. అతడే బ్రహ్మము. పురుషోత్తముడు – అతడే పరమాత్మ.

4. సర్వాంతరమయినంత మాత్రాన పరమాత్మ సశరీరుడు కాదు. ఆకాశం సర్వాంతర మయినా సశరీరం కాదు గదా! ఇది నా శరీరం అనటం అధ్యాస, వలన వచ్చిన అభిమానమే. ఈ అభిమానము పోతే అశరీరమయినట్లే.

5. రెండో సమన్వయంలో;

రజ్జుసర్ప దృష్టాంతం ప్రకారం జీవుడు దేహి అయినాడని చెప్పవచ్చుగదా! సమా - భ్రమర, కీటకములకు అవయవాలు ఆకారాలు ఉన్నాయి. కనుక కీటం భ్రమరం కావటం యథార్థం కావచ్చు. కాని జీవుడు, వ్యాకృతమయిన స్థూల లింగదేహములూ కాదు. అవ్యాకృత-మయిన కారణశరీరమూ కాదు. అందువలన అతనికి దేహభావం కుదరదు. నామరూపరహితు-డయిన జీవుడు నామరూపములతో వ్యాకృతముకన్న భిన్నంకావచ్చు. అవ్యాకృతంగూడా ఎందుకుకాదు? - అది నామరూపరహితం కదా! సమా - అవ్యాకృతమయినా దృశ్యమే. జీవుడు ద్రష్ట. దృశ్యం ద్రష్ట భిన్నం కదా! ఘటం వేరు. దానిని చూచేవాడు వేరు కదా! కనుక వ్యాకృతము అవ్యాకృతమూ కాని పురుషోత్తముడు జీవుడు. గీతగూడా "క్షరస్సర్వాణి భూతాని కూటస్థోక్షర ఉచ్యతే, ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః" క్షరః అనగా వ్యాకృతమయిన ప్రపంచము. అక్షరమనగా అవ్యాకృత ప్రపంచము. మిగిలినది మామూలే. "యో లోకత్రయ-మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః" అని గీత. అందువలన పురుషుడు సర్వాంతరుడు. "యేన సర్వమిదం తతమ్" సర్వవ్యాపీసర్వభూతాంతరాత్మా" యయేదం ధార్యతే జగత్" అను గీతావచనములనుబట్టి జీవుడున్నూ సర్వాంతరుడే. అంతఃకరణోపాధిలోనున్నను ఆయన తత్త్వరీత్యా చైతన్యం కనుక సర్వవ్యాప్తి ఉన్నట్లే. అంతఃకరణోపహితం అయితే జీవుడు. మాయోపహితం అయితే ఈశ్వరుడు. చైతన్యం ఒక్కటే కనుక జీవేశ్వరాభేదము.

**శ్లో॥ అక్షిస్వప్నగతావుభౌ చ పురుషౌ వ్యక్తౌ సుషుప్తస్థిత-**
**స్త్వవ్యక్తః పునరుత్తమస్స పురుషో యస్సమ్ప్రసాదోఽతనుః ।**
**పర్యేత్యాత్మని సోఽయమేవ సకలాత్మా జక్షణక్రీడనో-**
**ద్యానస్త్రీరమణాదిభిర్త్వుపజనం నేదం శరీరం స్మరన్ ॥ 414**

భావ॥ అక్షిగత (విశ్వ) పురుషుడు, స్వప్నగత పురుషుడు, వ్యక్తపురుషులు భోక్తలుగా, కర్తలుగా, ద్రష్టలుగా మనకు తెలియును. సుషుప్తిలో నున్నవాడు అవ్యక్తుడు. భోక్తగా అస్పష్టము. ఇక నాల్గవవాడు ఉత్తమ పురుషుడు. అతడే **సంప్రసాదుడు.** అనగా ఇతనిని పొంది జీవుడు చక్కగా తేరుకొంటాడు. (లేదా బాగా నిర్మలుడు) శరీర త్రయరహితుడు, ఇతడే సకల స్వరూపుడు. సర్వశరీర సాక్షి. తురీయుడు. ఇంద్రాది దేహాలలో భోజన క్రీడన విహరణ మైథునాదులతో ఆత్మయందే ఆనందపడును. "జక్షన్ క్రీడన్ రమమాణః, ఆత్మ రతిః ఆత్మ క్రీడః" కదా! కాని అతడు ఈ ఉపజనములను అనగా శరీరములను స్మరింపడు. 414

విశే॥ 1. ఇంతకుముందు వ్యాకృతులు 2, అవ్యాకృతుడు – 1. ఇపుడు వ్యక్తులు 2. అవ్యక్తుడు – 1. భిన్నంగా తురీయుడు సాక్షి – పరమాత్మ ఉత్తమపురుషుడు. సంప్రసాదుడు.

2. సంప్రసాదః – "సమ్యక్ ప్రసీదతి ఏనం ప్రాప్య జీవః" సోపాధకులయినవారు తమ ఉపాధి ధర్మాలయిన రోగశోకమోహాదులను ఆత్మయందు అధ్యాసచేసి, వ్యవహరించు విశ్వాది జీవులకన్న భిన్నుడు.

3. ఉపజనం – శరీరము. స్త్రీపుంసయోః అన్యోన్యం ఉపగమేన జాయతే – ఇతి. శరీరస్మరణ లేనందువలన దుఃఖముండదు.

**శ్లో॥ సర్వాత్మా స్వమహిమ్ని సంశ్చ విహరన్నో సమ్ప్రసాదస్తథా**
**యాయాత్మఙ్చ వికారమమ్బుదగణేనాభ్రం యథా ఖేలతా ।**
**పూర్ణస్యాస్య కథం ను కైర్విహరణం సర్వాత్మనశ్చాద్వయ-**
**స్యైకస్యైవమపి ప్రభాతి విహరన్వా మాయయాఽయం నృణామ్ ॥415**

భావ॥ ఈ సంప్రసాదుడు సర్వరూపుడు, సర్వాంతరాత్మ, తనమహిమలో తనే ఉండువాడు, అట్లే తనయందే విహరించువాడు, అయినా ఎట్టి వికారములను పొందడు. మేఘములెన్ని తనలో ఆడినా ఆకాశమునకు ఏమియూ అంటదు. ఎందుకంటే ఈ తురీయుడు పూర్ణకాముడు. సర్వవ్యాప్తుడు. అఖండుడు, అద్వితీయుడు. అతను ఎవరితో విహరించును. (యత్ర సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్) ఇంద్రాది విహారములు ఆయనవి కావు. ఇంతకుముందు సంప్రసాదుడే విహరిస్తున్నట్లు చెప్పాము. కాని అలా కనబడుతుంది – "ధ్యాయతీవ లేలాయతీవ" 415

విశే॥ 1. బ్రహ్మేంద్రాది శరీరాలు కదలుతుంటే వారే కదలుతున్నారనుకొంటాము. కాని వారు సంప్రసాదులు. అదేవిధంగా శరీరాలు పొందే జనన జరా మరణాదులన్నియు జీవుడు పొందుతున్నట్లు అనిపిస్తుంది.

2. తేడా ఏమిటంటే జ్ఞాని వీటినన్నింటిని తటస్థంగా గమనిస్తాడు. తనవిగా భావించడు. అజ్ఞాని తానే సుఖదుఃఖాలు జనన మరణాలు అనుభవిస్తున్నట్లు భావిస్తాడు. అందువలన జ్ఞానికి ఆనందము జీవన్ముక్తి విదేహముక్తి అజ్ఞానికి దుఃఖ స్వర్గనరకాదులు. జనన మరణాలు.

**శ్లో॥ అశ్వః స్యన్దనవత్తనౌ భగవతా ప్రాణో నియుక్తో మహాన్**
**మాత్రా తస్య తు చక్షురిన్ద్రియమిదం తత్కృష్ణతారాభ్రగమ్ ।**
**తత్రాసావుపలభ్యతే హి దృశినా లిఙ్గేన సోఽసంహత-**
**స్తస్మాచ్చాక్షుష ఏష చక్షుషి పుమాన్ ద్రష్టవ్య ఇత్యుచ్యతే ॥ 416**

భావ॥ ప్రజాపతి నేరుగా – సంప్రసాదుని గూర్చి చెప్పకుండా విశ్వుని వద్దనుంచి

ఎందుకు మొదలు పెట్టినట్లు? - అదే వివరించబడును. రథానికి గుఱ్ఱంలాగా శరీరమునకు ప్రాణమును బిగించాడు భగవంతుడు. **ఈ ప్రాణము మహత్తత్త్వము. జ్ఞాన క్రియాశక్తి సహితము.** ఈ నేత్రేంద్రియము ప్రాణాంశము. దీనియందున్న నల్ల గ్రుడ్డు లోని ఆకాశమునందిది యుండును. దీనియందు కలియకుండా అందులో కనబడువాడు సంప్రసాదుడు. ఈ సంఘాతములో కలియలేదు కనుక అతడు స్వతంత్రుడు. కనుక ఇతను చాక్షుష పురుషుడు. నేత్రమునందే దొరకును. - అని చెప్పబడును. 416

విశే॥ 1. నేత్రేంద్రియం పరతంత్రము. కరణము కనుక - ఉలి మొదలగువాని వలె.

2. "పరః స్వతంత్రః అసంహితత్వాత్ సంఘాతోహి పదార్థః పరతంత్రః యథాగృహః"

3. దర్శనానికి నేత్రం కరణం. కరణం మీద కర్త ఉంటేనే కరణం పనిచేస్తుంది. దర్శనానికి ఇంద్రియానికి అధిష్ఠానం పురుషుడు ఉండి తీరాలి. అలాగే ఊహింపబడిన పురుషుడినే నేత్రమునందు కనుగొనాలి. "సవా ఏష పురుషః అక్ష్ణి" - శ్రుతి.

4. అంటే అతను పురుషుడే కాని ప్రతిబింబము కాదు. అయితే సంప్రసాదుడు అనగా సర్వాతీతుడు నిర్వికారుడయిన ఆత్మ ఏమిటి? చూడటమేమిటి? - అంతా మాయవలన సాధ్యము.

**శ్లో॥పశ్యానీతి మనోతి యస్తు కరణం రూపగ్రహే తస్య దృక్**
**స హ్యాత్మా శ్రవణాయ తస్య కరణం శ్రోత్రన్తు శుశ్రూషతి।**
**గన్ధస్య గ్రహణాయ తస్య కరణం ఘ్రాణన్తు యో మన్యతే**
**జిఘ్రాణీత్యథ భాషణాయ కరణం వ్యాహర్తుమిచ్ఛోస్తు వాక్.॥ 417**

భావ॥ ఇదంతా కేవలం నేత్రేంద్రియంలో జరిగే విషయమేకాదు. అన్ని ఇంద్రియములలోను ఇదే స్థితి. చూడండి. చూడాలని సంకల్పించిన ద్రష్టకు రూపగ్రహణము నందు నేత్రము లింగము. ద్రష్ట ఆత్మ. అలాగే శ్రవణానికి సాధనం చెవి. శ్రవణ కాముడు ఆత్మ. గంధ గ్రహణానికి కారణం ముక్కు. గ్రహీత ఆత్మ. మాటలాడదలచిన వానికి వాక్కు కరణము. విషయ భేదమును బట్టి కరణములలో భేదమున్నది. కర్తలలో భేదము లేదు. కర్త ఒక్కడే జీవుడు. ఎందుకంటే అన్నిపనులలోను 'నేను' అనే "అహం" కొనసాగుతున్నది గదా! 417

**శ్లో॥ ధ్యాయానీతి య ఏతి తస్య కరణం ధ్యానాయ సన్మానసం**
**స హ్యాత్మా స చ బోధ ఏవ సుగమో లిఙ్గైరమీభిః పుమాన్।**
**దివ్యం చక్షురముష్య బోద్ధుమనఘం త్రైకాలికార్థగ్రహే**
**శక్తం చిత్తమనేన యాత్యయమజస్థానే హి భోగాన్ సమాన్॥ 418**

భావ॥ 'నేను ధ్యానము చేసెదను" అన్న సంకల్పం గల వానికి ధ్యాన సాధనము శుద్ధ

మనస్సు. సంకల్పం చేసిన చైతన్యమే ఆత్మ. శ్రవణ మననాది కార్యము లాధారముగా వాటిని నడిపించు పురుషుని సులభంగా ఊహించగలము. ఈ క్రియలకు ఆ ఇంద్రియాలకు అధిష్ఠాత అతడే కదా! ప్రజాపతి నేత్రమును ఉపలక్షణంగా అనగా "మాదిరి"కి చెప్పాడు. సర్వేంద్రియములకు ఆ పురుషుడే అధిష్ఠాత. (అసలు మనస్సు నేత్రం వలననే తెలుస్తుంది. ఇతరావయవాల వలన తెలియదు. అందువలన గూడా ఈ అక్షిపురుష – విచారణ వేదంలో ఇతరత్ర వచ్చినది.)

ఇక మనస్సు ఒక దివ్యనేత్రము. అది మాంసమయమయిన నేత్రము వంటిది కాదు. ఇది తన ఊహాశక్తితో త్రికాల విషయాలను పరోక్ష విషయాలను గూడా తెలిసికొనగలదు. అట్టి దివ్యచిత్తం ద్వారా పురుషుడు బ్రహ్మలోకమున భోగానుభవము పొందగలడు. 418

**శ్లో॥ అథాయైకశతం సమాస్స మఘవా సద్బ్రహ్మచర్యం గురోః**
**శ్రుత్వాఽఽత్మానమవేత్య సాధురగమల్లోకాంశ్చ కామాన్ సమాన్ ।**
**శ్రుత్వాఽఽత్మానముపాసతే మఘవతో దేవా ఇదానీఞ్చ తాన్**
**యాన్త్యేవేతి నరోఽప్యముం పరిభజన్ సమ్ప్రాప్నుయాదేవ తాన్ ॥419**

భావ॥ ప్రజాపతి వద్ద 101 సంవత్సరములుండి బ్రహ్మచర్యం చేసి తగిన తర్కంతో ఆలోచించి ఆత్మ తత్త్వమును సరిగా గ్రహించెను. తరువాత అతను ఆత్మసాక్షాత్కారం పొంది సమస్తలోకములను, సర్వకామములను పొందెను. ఇంద్రుని నుంచి ఆత్మజ్ఞానము పొందిన దేవతలందరు అట్లే సర్వకామములను పొందిరి. అనగా పూర్ణకాములయిరి. కనుక మానవుడు గూడా ఈ ఆత్మనే సేవించుచు ఆయా కామములను పొందవచ్చును. 419

**శ్లో॥ యస్మాద్బ్రహ్మపదాదహం భగవతస్సఙ్కల్పతః ప్రాప్తవాన్**
**హార్దం బ్రహ్మపదం తతోఽహమముకధ్యానేన పాపవ్రజమ్ ।**
**రోమాణ్యశ్వ ఇవ ప్రధూయ వదనాద్రాహోరివేన్దుస్తనో–**
**ర్ముక్తస్సన్ కృతకృత్య ఏవ పునరప్యేష్యామి సత్యమ్పదమ్ ॥ 420**

భావ॥ ఆత్మను ఉపాసించువాడు ఈవిధముగా ధ్యానింపవలయును.

ఈశ్వరుని సంకల్పం (అనేన జీవేనాత్మనానుప్రవిశ్య – ) "నేను పరమ బ్రహ్మస్థానమునుండి హృదయగతమయిన అంతఃకరణరూపమయిన బ్రహ్మస్థానమును పొందితిని. కనుక నేను మరల ఆ ఈశ్వరునే ధ్యానించి గుఱ్ఱము తన రోమములను జలదరింపుతో వదలించికొన్నట్లు పాపములను వదలించికొని, రాహువదనమునుండి చంద్రునివలె శరీరము నుండి వెలువడి కృతార్థుడనై సత్యపదమునకు తిరిగి జేరబోవుచున్నాను". ఉపాసన అనగా హృదయగత బ్రహ్మమయిన ప్రత్యగాత్మను బ్రహ్మాభిన్నముగా నుపాసన చేయుట అని యర్థము. పరమానంద లక్షణమయిన సత్యలోకమునుండి జీవునిగా ఇచ్చట నిలిచిపోయిన నేను మరల సచ్చిదానందరూపుడనై ఆలోకమునకేగెదను. ఇదంతా సగుణ బ్రహ్మోపాసన. 420

**శ్లో॥ ఆకాశో నను నామరూపయుగలం నిర్వాహయత్యాత్మగం**
**ఫేనం వారివదన్తరస్తి చ తయోరాత్మా జలం ఫేనవత్ ।**
**అస్పృష్టశ్చ తయో ర్యగేన పురుషో వ్యోమేవ నైల్యాదినా**
**బ్రహ్మాత్మాఽమృత మేష ఏక మభయం దృశ్యా త్పరం చాద్వయమ్ ॥421**

భావ॥ ఆకాశము. అనగా సర్వత్ర ప్రకాశించునది అనగా బ్రహ్మం. పరమాత్మ ప్రత్యగాత్మ లేదా ఆకాశము వలె సూక్ష్మమయినది. శరీరరహితము. అట్టి పరబ్రహ్మ తనయందు ఆరోపితమయిన నామరూపద్వంద్వమును నిర్వహించును. ఆ ద్వంద్వము గదా! సర్వసంసారము–యొక్క అస్తిత్వం అదే. దాని బీజము పరబ్రహ్మము. **తనయందున్న నురుగును నీరు అలాగే నిర్వహిస్తుంది. నీరు నురుగులో అంతర్యామిగా అధిష్ఠానంగానూ ఉన్నట్లు ఈ ప్రపంచనామరూపములలో ఆ బ్రహ్మం అంతర్యామిగాను అధిష్ఠానంగానూ ఉన్నది.** అలా ఉన్న ఆ నామరూపములతో ఈ ఆత్మకు సంగం ఉండదు. ఎంత నీలత్వం కనబడినా ఎన్ని మబ్బులు క్రమ్మినా ఎన్ని గంధర్వ నగరాలు ఏర్పడినా వాటిలో **ఏ ఒక్కటియు ఆకాశమున కంటదు గదా!** ఈ బ్రహ్మం అను ఆకాశం దృశ్యమయిన నామరూపస్వరూపమయిన ప్రపంచంకన్న విలక్షణమయినది. అమృతమయినది. అద్వితీయమయినది కనుకనే అభయమయినది, సత్యజ్ఞానానందస్వరూపమయినది అమృతమయినది. ఇదే బ్రహ్మం. 421

విశే॥ 1. "యద్దృశ్యం తన్నశ్యం" కనుక దృశ్యేతరమయిన బ్రహ్మం అనశ్యం – శాశ్వతం. "ద్వితీయాద్వైభయం భవతి" – అద్వితీయం కనుక అభయం కనుక 'భూమ' తత్త్వం – వ్యాపకం.

2. ఆత్మ బ్రహ్మలకు భేదం కొంచెమయినను లేదు – బ్రహ్మమే జీవరూపంతో ప్రవేశించి ఆత్మ అయినది కనుక. బ్రహ్మ – ఆత్మ భిన్నమయిన పదార్థములయితే అందులో ఏదో ఒకటి ఘటంవలె జడము కావలసి వస్తుంది.

3. ద్రష్ట ఆత్మ అని సిద్ధము. 'నేను చూస్తున్నాను' అని నానుడి కదా! దానికన్న భిన్నం అయితే బ్రహ్మం ఘటం వలె జడము. మర్త్యము అవుతుంది. అలాకాక బ్రహ్మం ఆత్మకాదు. ఆత్మకు దృశ్యమూ కాదంటే బ్రహ్మం అసలు లేని కుందేటికొమ్ము వంటిదవుతుంది. బ్రహ్మమే ఆత్మను చూస్తుందంటే ఆత్మ దృశ్యం నశ్యం అవుతుంది. అపుడు మోక్షశాస్త్రం ఎవరికి? కనుక ఆత్మ బ్రహ్మలకు అభేదం తప్పదు.

4. పదార్థములు రెండే మర్త్యం అమృతం. (దృశ్యం – ద్రష్ట, ద్రష్ట – దృశి = నశ్యం – శాశ్వతం, అల్పం – భూమ – ఇలా) బ్రహ్మం తప్ప తృణమునుంచి హిరణ్యగర్భునిదాకా అన్నిదేహాలు మర్త్యములే. ఆయువులో భేదం మాత్రమే. స్థావరములు అంతే. పృథివ్యాది భూతములూ అంతే. అవి వాటి వాటి కారణాలలో లయం అవుతాయి. భూమి నీటిలో నీరు

అగ్నిలో ఇలా – లింగశరీరములు మర్త్యములే. అవి మోక్షదశలో చస్తాయి గదా! కనుక మూర్తామూర్త, చరాచరమంతయు మర్త్యమే. దీనికి కారణమయిన అవ్యక్తమున్ను (మాయ) మర్త్యమే. అది జ్ఞానంతో నశిస్తుంది. మోక్షంలో పోతుంది. కనుక జ్ఞానలక్షణ పరమాత్మయే ద్రష్ట సాక్షి. "సలిలఏకోద్రష్టాఽద్వైతః" అని శ్రుతి. కనుక బ్రహ్మమే జీవ, ఈశ్వర, బ్రహ్మాది పదవాచ్యము. మరొకటి లేదు. కనుక జీవబ్రహ్మము లొక్కటే.

**శ్లో॥ విద్వానేవమిహైవ సన్నపి హృదా యాయాత్సభాం బ్రహ్మణో**
**దేహాన్తేఽపి చ తాం యదీచ్ఛతి భవత్యాత్మా స హి బ్రహ్మణామ్ ।**
**భూపానాం చ విశాం హృదిన్ద్రియతనుప్రాణాక్షరాఖ్యాత్మనా–**
**ఙ్ఞాత్మానం స లభేత నో పునరిహ స్త్రీగర్భమాయాస్యతి ॥ 422**

భావ॥ బ్రహ్మలోకమునకు పోవలయునని కోరిక గల వాడు జ్ఞానియైనచో ఈలోకముననున్నను బ్రహ్మసభకు మనసు ద్వారా పోగలడు. దేహాంతమునందు శాశ్వతముగా అచ్చటకు పోగలడు. అట్టి జ్ఞాని ద్విజులందరికి ఆత్మ కాగలడు. హృదయ, ఇంద్రియ, శరీర, ప్రాణ, అక్షర రూప ఆత్మలకు ఆత్మ కాగలడు. వాడు ఉపాసనల ద్వారా ఆత్మతత్త్వమును అందికొనలేనిచో మరల జన్మకు రావలసియుండును. అందికొనగలిగినచో జన్మకు రాడు. 422

విశే॥ నిర్గుణ బ్రహ్మజ్ఞాని అయితే వారికిచ్చుటనే ముక్తి. సగుణ బ్రహ్మోపాసకులకు బ్రహ్మకృత జ్ఞానోపదేశము వలన ఆత్మ తత్త్వసాక్షాత్కారమై బ్రహ్మతోసహా ద్విపరార్థావసానంలో విదేహ ముక్తి. బ్రహ్మలోకంలో నున్న సందర్భములోనూ జీవన్ముక్తి వంటిది కలుగుతుంది.

**శ్లో॥ బ్రహ్మాచార్యకులే నిషద్య విధినా వేదానధీత్యాఙ్గినః**
**ప్రత్యావృత్య గృహీ భవన్ స్వవిహితం యజ్ఞాదికర్మాచరన్ ।**
**స్వాధ్యాయం చ పఠన్ సుతాంశ్చ విదధచ్ఛిష్యాన్ బహూన్ ధార్మికాన్**
**భూతాన్యవ్యథయన్ పరత్ర విహితాచ్ఛాన్తో విరక్తిం వ్రజేత్ ॥ 423**

భావ॥ బ్రాహ్మణుడు ఆచార్య గృహమున విధిపూర్వకముగా వేదాధ్యయనము చేయ వలయును. వేదాంగములను చదువవలయును. తిరిగివచ్చి స్నాతకుడై గృహస్థుడై తనకు విహితములను, యజ్ఞాదికర్మలను చేయుచు, స్వాధ్యాయము స్మరించుచు, సంతానమును కని, వారిని తన శిష్యులను గొప్ప ధార్మికులనుగా చేయుచూ యజ్ఞేతరంగా పశువులను హింసించ కుండా శాంతుడై దృష్ట – అదృష్ట ఫలములందు విరక్తికలవాడై యుండవలయును. నిష్కాముడయితే బ్రహ్మచర్యమునుంచియే సన్న్యసింపవలయును. 423

**శ్లో॥ సన్న్యస్యాథ పరాత్మతత్త్వవిదుషః పాదావుపేత్యాగతాం**
**వేధః కశ్యపకాశ్యపిప్రముఖసాధ్వాచార్యసన్తానతః ।**

**విద్యామాత్మపరామిమామధిగతః స్వాధీనవాతేన్ద్రియః**
**సంస్థాప్యాఽత్మని చిత్తమాచ మరణాద్బ్రహ్మేతి పశ్చాద్బుధః ॥ 424**

భావ॥ అట్టి విరక్తుడు బ్రహ్మతత్త్వము తెలిసినజ్ఞాని వద్దకు వెళ్లి వారి పాదముల పట్టికొని బ్రహ్మ కశ్యపుడు, కాశ్యపి మొదలగు సిద్ధ గురువుల పరంపర నుండి వచ్చిన యీ ఆధ్యాత్మ విద్యను స్వీకరించి ప్రాణేంద్రియములను జయించి యోగియై జ్ఞానియై ఆత్మయందు మనసును మరణ పర్యంతము లగ్నము చేసిన జ్ఞాని, జీవన్ముక్తుడై, తుదకు బ్రహ్మమును చేరును.

"ఆసుప్తేః ఆమృతేః కాలం నయేద్వేదాంత చింతయా". ఇదే వ్యక్తి సగుణ బ్రహ్మో- పాసకుడయినచో హిరణ్యగర్భ బ్రహ్మమును పొందును. 424

ఇతి ఛాన్దోగ్యోపనిషత్సమాప్తా.

ఇది మేళ్లచెర్వు వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రి

అనువదించిన

ఆంధ్ర వేదాంతముక్తావళి పూర్వార్ధము.

***

హయగ్రీవార్పణమస్తు.

హరిః ఓమ్

శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీబెల్లంకొండ రామరాయ కవీంద్ర విరచిత

# వేదాన్తముక్తావళీ

దినకర్యనువాద కర్త

**మేళ్లచెర్వు వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రి**

(ఉత్తరార్ధే)

***

## బృహదారణ్యకోపనిషత్

**శ్లో॥ కణ్ఠస్థితా దినకరే సతి సౌవ మర్థం**
**ముక్తావళీ కలయతే నతు కేవలేతి ।**
**ముక్తావళీం కృతవతా తురగాధిరాజః**
**కారుణ్యతో దినకరః క్రియతే మయాఽసౌ ॥**

భావ॥ కంఠస్థితమయిన ముక్తావళి దినకరుడున్నపుడే సౌవమయిన (స్వర్లోక-సంబంధమయి, తనదయిన) అర్థమును (ప్రయోజనమును తళతళలను అర్థమును) సరిగా పొందును. కేవలం అది మాత్రమే అయితే అలా పొందదు – అని హయగ్రీవుని కారుణ్యముతో ముక్తావళిని రచించిన నేను దానికి దినకరమను వ్యాఖ్యను రచించుచుంటిని ఇదిగో!

విశే॥ పూర్వమీమాంసలో చెప్పిన విధముగా పరమేశ్వరార్పణబుద్ధితో నిష్కామముగా తమతమ వర్ణాశ్రమ విహిత కర్మలు చేసి చిత్తశుద్ధిపొంది విరక్తుడయి శమదమాది గుణ సంపన్నుడయిన వివేకి అయిన ముముక్షువునకు, ప్రత్యగాత్మ పరమాత్మల అసలు తత్త్వము తెలిసినొకవలయునను కోరిక కలిగి బ్రహ్మవిద్యయందు అధికారము కలుగును. ఆ బ్రహ్మవిద్య ఉపనిషత్తుల వలన మాత్రమే తెలియునట్టిది. కనుక అది కావలసినవాడు ఉపనిషత్తులనే

చదువవలెను. వాటి అర్థమే తెలిసికొనవలెను. కాని అవిసాధారణమయినవి కావు. వాటి అర్థం తెలిసికొనుటకు సాధ్యము కాదు. **కనుక బెల్లంకొండ రామరాయ విద్వత్కవి శార్దూలవిక్రీడితమను రమణీయ వృత్తములతో వేదాంతముక్తావళిని నిర్మించెను.** దాని అర్థమును గూడా సుగమము చేయుటకు స్వయముగా **దానికి దినకరమను పేరుతో వ్యాఖ్య నొనర్చెను.** ఈ ముక్తావళీ పూర్వార్ధమునందు ఈశకేనకఠప్రశ్నముండక మాండూక్య తైత్తిరీయకచ్ఛాందోగ్యములను ప్రతిపాదించెను. ఈ ఉత్తరభాగమున బృహదారణ్యకము ఐతరేయము కైవల్యము, శ్వేతాశ్వతరము అను ఉపనిషత్తులను ప్రతిపాదించెను.

**శ్లో॥ మూర్ధోషాస్తురగస్య చక్షురరుణో మేధ్యస్య వాతోఽసవో**
**వక్త్రం హవ్యవహోఽన్తరిక్షముదరం ద్యౌః పృష్ఠ ముర్వీ ఖురాః ।**
**పార్శ్వే దిక్ఫలు పర్శవస్తు విదిశా అఙ్గాని షట్చర్తవో**
**మాసాః పర్వగణః పదో దిననిశం చాత్మా తు సంవత్సరః ॥ 1**

భావ॥ అశ్వమేధమునందు హవ్యము కాదగిన యజ్ఞాశ్వమునకు ఉషఃకాలము శిరస్సు. కన్ను అరుణుడు. వాయువు ప్రాణములు. నోరు అగ్ని, ఉదరం అంతరిక్షము, వీపు ద్యులోకము, గిట్టలు భూలోకము, పార్శ్వములు తూర్పు మొదలగు దిక్కులు, పర్శువులు (ప్రక్కటెముకలు) ఆగ్నేయం మొదలగు విదిక్కులు, అంగములు ఋతువు, సంధులు, మాసములు, పాదములు రేయింబవళ్లు, ఆత్మ సంవత్సరము. 1

విశే॥ 1. అహోరాత్రములు చాల రకములు – మనుష్యులవి 60 ఘడియలు. పితరులవి పక్షద్వయము. దేవతలవి ఆయన ద్వయము, ప్రజాపతిది చతుర్యుగ సహస్ర ద్వయము – అని తేడాలు.

2. అశ్వమేధ సంబంధమయిన అశ్వము యొక్క అవయవములందు ఆయా దేవతలను భావన చేయవలయును. ప్రతిమయందు దేవతాభావన చేస్తాంగదా! ఈ యజ్ఞాధికారి అయిన క్షత్రియుడు, ఆ కర్మను మరింత బలముగా చేయుటకు ఈ భావన అవసరము. అశ్వమునందు కాలాది భావనలను చేయవలయును. అందుకు అనధికారి అయిన బ్రాహ్మణుడు తన ఆత్మను అశ్వముగా భావించికొని తన అవయవములందు కాలాది దృష్టిని భావన చేయవలయును.

3. ఈ భావన వలన అనగా కాలలోక దేవతాది ఆరోపణల వలన అశ్వము ప్రజాపతిగా అవుతుంది. ప్రతిమదేవుడయినట్లు. దానివలన ఇది ప్రాజాపత్యమయినది. అశ్వమేధమునకు అధికారి అయిన క్షత్రియుడు ప్రాజాపత్యలోకములను, బ్రాహ్మణాదులు ఆ భావన వలన తాము ప్రజాపతులై "ప్రజాపతినయితిని" అనుభావం చేత ప్రజాపతిత్వం పొందాలి. అంతేకాని అశ్వమేధానుష్ఠానం వలన తప్ప గాని, కాలాది భావనలవలన గాని అట్టి ప్రజాపతిత్వ ఫలం

రాదు – అనటం తగదు. ""యోశ్వమేధేన యజతే య ఉచైనమేవం వేద" అని శ్రుతి. మీరు కాదన్న రెండు విషయాలను స్వీకరించుతున్నది.

**శ్లో॥ ఉద్వస్థ్యమ్బుధరాః పలాని సికతా గర్భార్ధజీర్ణాశనం**
**క్లోమానశ్చ యకృద్ధరా అథ సిరా నద్యశ్చ లోమౌషధిః ।**
**కేశా భూమిరుహః ఖరాంశురుదయన్ పూర్వోఽపరోఽర్ధోఽప్యయన్**
**విద్యుజ్జృమ్భణమీరణం స్తనితమస్యోన్మేహనం వర్షణమ్ ॥ 2**

భావ॥ కాలరూపమయిన ఈ అశ్వమేధాశ్వమునకు నక్షత్రములు ఎముకలు, మేఘములు మాంసములు, ఇసుకలు కడుపులో సగము జీర్ణమయిన అహారము. పర్వతములు యకృత్క్లోమములు, నదులు సిరలు, ఓషధులు రోమములు, చెట్లు కేశములు. ఉదయ సూర్యుడు దాని పూర్వార్ధము, అస్తమయ సూర్యుడు దాని జఘనము, మెఱుపులు దాని శరీరచలనము, దాని జృంభణము ఉఱుములు, వర్షము దాని మూత్రవిసర్జనతో సమానము. కనుక పై శ్లోకములోవలె అశ్వమేధీయమయిన అశ్వం విషయంలో నక్షత్రాది దృష్టిచేయవలయును. అలా భావించవలయును. 2

**శ్లో॥ సౌవర్ణో మహిమా గ్రహోఽశ్వమహరన్వాసీచ్చ పూర్వోఽమ్బుధి-**
**ర్యోని స్తస్య నిశాఽన్వజాయత తథా రౌప్యోఽస్య యోనిః పరః ।**
**దేవానేష హయో భవన్నుదవహద్వాజీ తు గన్ధర్వకా-**
**నర్వా సన్నసురాంస్తథాఽశ్వ ఇతి నౄన్యోనిః ప్రియోఽస్యామ్బుధిః ॥3**

భావ॥ "అహస్సు" అను సువర్ణమయమయిన "గ్రహ" మను పాత్ర అవుతుంది. ఈ గ్రహమను పాత్రకు తూర్పు సముద్రము యోని = అనగా ఉంచుస్థానమయినది. తరువాత దానికి "నిశ" వెండి గ్రహమయినది. దానిని ఉంచు స్థలము పశ్చిమ పర్వతమయినది.

ఈ ప్రజాపతి రూప – అశ్వము దేవతలకు హయము, గంధర్వులకు వాజి, అసురులకు 'అర్వ' మనుష్యులకు అశ్వము అయి వాహనమయ్యేను. ఈ అశ్వమునకు బంధువయిన సముద్రము కారణము. "అప్సు యోనిర్వా అశ్వః" అని శ్రుతి. 3

విశే॥ లేదా, అంబు అనగా లక్షణావృత్తితో జలమునుండి పుట్టిన ప్రపంచమని అర్థం చెప్పవచ్చు. "అప ఏవ ససర్జాదౌ తాసు వీర్య మపాసృజత్" – భాగవతము.

అంబుధి = పరమేశ్వరుడు. ఈయనయే గదా ప్రలయంలో ప్రపంచమును ధరించువాడు. అనగా ఉపసంహరించి తనయందుంచికొన్నవాడు. ప్రియమయినవాడు. ఎందుకనగా ప్రియమును చేసినవాడు. యోనిః = ఉత్పత్తికారణము. ఉత్పత్తి స్థలము.

శ్లో॥ అస్యాగ్రే న కిమప్యభూత్సమమిదం గ్రస్తం పరం మృత్యునా
కల్పాన్తే త్వశనాయయాऽకృతమనస్స్యామాత్మవానిత్యయమ్ ।
అర్చన్ సన్నచర త్క మస్తు మ ఇతి ప్రాదుర్బభూవార్చత-
స్తస్మాదమ్బు తదర్క ఇత్యభిదధత్యర్క ప్రతిష్ఠాం బుధాః ॥ 4

భావ॥ మన ఇంద్రియములకు గోచరించుచున్న ఈ ప్రపంచముకన్న ముందు ఏమియు లేదు. ఇదంతయు మృత్యువయిన హిరణ్యగర్భుని చేత కల్పాంతమునందు ఆకలి చేత మ్రింగి వేయబడినది. అతడు తరువాత "నేను మనస్సుగల వాడను కావలెను" సంకల్పించెను. తరువాత ఆ మృత్యువు ఆత్మను అర్చించుచు 'నాకు కం అనగా జలము కావలయు"నని సంకల్పించెను. అంతట ఆ మృత్యువు నుండియే జలము ఆవిర్భవించెను. అర్చన చేయు వానినుండి వచ్చినది కనుక దానిని "అర్కము" అనెదరు. అర్క అనగా అగ్నికి ఆశ్రయమయిన ఆ నీటిని అర్కము అని బుధులు అనెదరు. 4

విశే॥ 1. ప్రలయమును బట్టి ఆకలి ఊహింపబడును. ఆకలిని బట్టి మృత్యువయిన హిరణ్యగర్భుడూహింపబడును. ఎవడయినా ఆకలి వలననే జంతువులను ఆహారార్థం చంపునని సూచన.

2. సృష్టికి ముందుగూడా ఆహారాది క్రియకు కర్త అయిన హిరణ్యగర్భుడు, కర్మగా ఆహారమున్ను ఉన్నందువలన ఇది శూన్యవాదము కాదు. సృష్టికి ముందు ఏదో ఉన్నదన్నపుడు మరి అది లేదని మృత్యువు చేత మ్రింగబడినదని ఎలా అంటారు? - ఏదయినా ఉన్నట్లా? లేనట్లా? - ఉన్నది కాని వ్యక్తముగా నామరూపాత్మకస్థితిలో లేదని అర్థము. అవ్యక్త లేదా అవ్యాకృత స్థితిలో నున్నదని భావన. సృష్టి అసలే లేదని అంటే అసలే లేనిది పుట్టదు. కుందేటికొమ్ము పుట్టుందా? అయ్యా ఉంటే కనబడాలి కదా! దొఱకనిది (అనుపలబ్ధి) ఉన్నట్లు ఎలా చెప్పబడటం? - అనుపలబ్ధికి కారణము ఇచ్చట అసలు లేకపోవటం 'కాదు'. కంటికి అందే వ్యక్తస్థితి లేక పోవటము. కుండ ఉన్నది. కాని గోడ మున్నగు వ్యవధానములవలన కనబడదు (అణువులున్నవి కనబడవు. వినబడవు.) అయ్యా! కార్యం పుట్టే గదా! ఆవరణము. పుట్టకుండానే ఆవరణం ఏమిటి? - పుట్టకపోయినా కారణము నందు లీనమయి యున్న కార్యమును మరోరూపము కప్పివేయగలదు. మట్టిలోనున్న ఘటము తాను పుట్టకముందు "ముద్ద" రూపముగా నున్నది. అది వ్యక్తము కావాలంటే కర్త అయిన కుమ్మరి, అతని దండాది కారక వ్యాపారమూ కావాలి. కనుక సృష్టికి ముందు కార్యం అవ్యక్తంగా ఉన్నది. అది వ్యక్తం కావటానికి కారకవ్యాపారమూ ఉన్నది.

3. కారణం నుంచి వ్యక్తం కాని స్థితిలో సూక్ష్మరూపమున (యోగ్యతా రూపమున)

ఎన్ని కార్యములయినా ఉండవచ్చును. నామరూపములుగా వ్యక్తమయిన దశలో ఒకే మట్టియందు కుండ పిడత మూకుడు మొదలయినవి ఉండవు. అసలు అవ్యక్తంగా అవి ఉన్నాయని ఎందుకనాలి? – లేదంటే మట్టినుండి కుందేటి కొమ్ము గూడా పుట్టవచ్చును. అవ్యక్త స్థితిలో వాటి రూపం ఏమిటంటారా? – వ్యక్తస్థితిలోనిరూపములే ఊహిస్తాము. కార్యమునందలి నామరూపములు వ్యక్తం కానంతవఱకు కార్యం అవ్యక్తం గానే చెప్పబడును.

4. లేదా, ఉత్పత్తికి ముందు కార్యము కారణ రూపములో ఉంటుంది. కారణం కర్త యొక్క కారక వ్యాపారము వలన కార్యంగా పరిణమిస్తుంది. కనుక సృష్టి కారణ రూపంగా ఉంటూనే ఉన్నది కనుక అసత్కార్య వాదము లేదు. అయ్యా! ఉత్పత్తికి ముందు అవ్యక్తముగా నయినా కార్యములు కార్యరూపములో కారణమునందుండటం కుదరదని, అది కారణంలో కార్యోత్పాదనశక్తి (యోగ్యత) రూపంగా మాత్రం ఉంటుందని చెప్పండి. కుందేటికొమ్ము మొదలయినవాటిని సృష్టించే సామర్థ్యం లేదని అందాము. మన తలలకు కొమ్ములు కలిగి ఉండే సామర్థ్యము లేదుగదా! ఇదీ అంతే – సమా – అత్యంతం అసంభవమయిన విషయాలను పుట్టించేశక్తి కారణానికి ఉంటే కుందేటికొమ్మయినా పుట్టవలసినదే. **అందువలన సూక్ష్మరూపంతో కార్యమయిన ఘటాదికం కారణమయిన మట్టిలోనున్నట్లు చెప్పవలసినదే.** అసలు అసంభవ మయిన కార్యం పుట్టుందంటే అర్థం "అభావం" పుట్టుందని అంగీకరించాలి. శశవిషాణం పుట్టుందంటే "అభావం" పుట్టినట్లే. గొడ్రాలికి కొడుకు పుట్టినట్లే, కనుక క్రియవలన భావం పుట్టాలి. ఉత్పత్తి మొదలయినవి భావవికారాలే. నీవు అసత్కార్యవాదివయినా ఘటం పుట్టిందన– గలవుగాని ఘటాభావం పుట్టిందనగలవా? ప్రాగభావం అనగా "అనాది సాంతము" అన్ననీవు అభావమును సాది అనగా ఉత్పన్నమయినదని అనలేవు గదా! అసత్ నుండి పుట్టదు. సత్తునుండి అసత్తు పుట్టదు. "నాసతో విద్యతే భావః, నాభావో విద్యతే సతః" అని గీత. కనుక కార్యం సత్తే. అదే పుట్టుంది అని సత్కార్యవాదము.

5. అయితే ఉత్పత్తికి ముందుగూడా కార్యమున్నదంటే అర్థము అది కారణరూపంలో లీనంగా ఉన్నట్లే కదా! కనుక జగత్తుకు నాశంలేదు. "నాభావో విద్యతే సతః – " కనుక మోక్షము లేదు – సమా – **ఇదంతా వ్యావహారికంగానే.** అజ్ఞానం వలన ఇదంతా. జ్ఞానంలో అజ్ఞానం దాని కార్యములు ఏవీ ఉండవు. కనుక కార్యకారణ వ్యవహారమే ఉండదు. కనుక మోక్షం ఉంటుంది.

6. నీవు కార్యం సత్ అంటున్నావు. కాని "వాచారంభణం వికారో–" అను శ్రుతి ఇదంతా మిథ్య అని కారణం సత్ అని చెప్తున్నది. కనుక కార్యం సత్తుకాదు. మిథ్య – సమా – కారణం లేనిదే కార్యం ఉండదు. కార్యంలేకున్నా కారణం ఉంటుంది. కనుక కారణం సత్. కార్యం మిథ్య. కారణం ఒక్కటే సదా ఉంటుంది. కార్యం అసలు లేదు – అని శ్రుతి తాత్పర్యం

అన్నా మాకిష్టమే. అయితే అపుడిక అసత్కార్యవాదం, సత్కార్యవాదం అన్న ప్రసక్తి యుండదు. ఎందుకంటే అసలు కార్యమే లేదంటున్నాము కదా! కార్యముంటేనే గదా! అది ఉత్పత్తికి ముందు ఉన్నదా? లేదా? అన్న మీమాంస. కారణం ఉన్నదంటున్నాము కనుక శూన్యవాదము కాదు. మరి ఘటాది కార్యములు కనబడుతున్నాయి కదా! అంటే అవన్ని మాయవలన మిథ్యగా కనబడుతున్నాయి. గారడీ వలన ఏదయినా జరగవచ్చును గదా! అందులో ఇది ఈశ్వరశక్తి. అది మోక్షపర్యంతం ఉండేదే. పరమార్థదశలో తప్ప సర్వత్ర మాయ ఉన్నదే. ఆ దశలో ఉండదంటాము. అందుకున్ను శ్రుతియే ప్రమాణము. “నేహనానాస్తి కించన”, “ఏకమేవాద్వితీయం బ్రహ్మ”. కనుక “కార్యం మిథ్య” అన్నమతంలో గూడా మాయామయమయిన ప్రపంచము వ్యావహారికంగా “సత్” అదే మృత్యువు చేత వ్యావహారికంగా గ్రస్తం అయింది.

7. అప్సుచాగ్నిః ప్రతిష్ఠితః – శ్రుతి. కనుక అగ్నికి జలము ఆశ్రయము. అర్కము అనగా అగ్ని. అర్కము అనగా ప్రజాపతి కనుక ప్రజాపతి సంబంధం వలన అగ్నిగూడా అర్కము. “అర్చించు నాకు ‘కం’ జలము అగుగాక” అని కోరినాడు కనుక అర్చ్+క = ‘అర్క’ అయినాడు.

8. ప్రజాపతికి మనస్సులేదు. సంకల్పం ఎలా? మాయవలన సంకల్పం కలిగింది. ప్రజాపతి మనస్సును సృష్టించికొని తర్వాత జలములను సృష్టించాడంటే మరి ఆకాశాదుల సృష్టిసంగతి ఏమిటి? – సమా – **ఆకాశాదుల తరువాతనే జలసృష్టి అని కల్పనచేయాలి.** అంటే అమూర్తములను వదలి మూర్తముల విషయం ప్రస్తావించినట్లు భావించి ఆకాశ వాయువుల సృష్టిని శ్రుత్యంతరమును (తైత్తిరి) బట్టి కల్పించి అతకాలి.

9. ముందు మనస్సు – తరువాత పంచభూతాలు అని అన్నారు. కాని అపంచీకృత పంచభూతకార్యం మనస్సు అని కదా! శాస్త్రం. – ఎలా – సమా – మనవంటి జీవులకుపాధి అయిన మనస్సు మాత్రమే పంచభూతకార్యము. **హిరణ్యగర్భుని మనస్సు మాత్రం పంచభూతములకన్నా ముందుదే.** కనుకనే వశిష్ఠుడు “ఆశా మనః తదనుబంధవిమోక్షదృష్టిః పశ్చాత్రపంచరచనా భువనాభిధానా” అని అన్నారు.

**శ్లో॥ యోఽపా మస్తి శర స్స సంహత ఇయమ్భూరాస మృత్యుః క్షితా–**
**వశ్రామ్యత్తత ఆవిరాస స విరాట్ స్వఇచ్ఛ త్రిధా వ్యాకరోత్।**
**అగ్న్యర్కౌ మరు దిత్యముష్య తు శుచేః ప్రాచీ శిరస్తే భుజౌ**
**శర్వాగ్న్యోః కకుభౌ జలాధిపదిశా పుచ్ఛం పరం కల్ప్యతే ॥ 5**

భావ॥ (ప్రథమ) సృష్టి అయిన జలము యొక్క శరము (విరుగుడు) అనగా మీగడవంటి సారము ‘భూమి’ అయ్యెను. అందువలన మృత్యువు విశ్రమించెను. (అద్భ్యః పృథివీ) (మృత్యువు వలన నీరు ఉడికి ఉడికి అది కొంతభాగము భూమిగా పరిణమించెను. అందువలన ఇక

మృత్యువు తన పని ఆపింది. మృత్యువు = అర్కము అను అగ్ని. (హిరణ్యగర్భరూపము) దానినుండి 'విరాట్' ఏర్పడెను. అతడు అగ్ని అర్క మరుత్తులు ఏర్పడెను. ఇందులో అగ్నికి శిరస్సు తూర్పు దిక్కు. భుజములు ఈశాన్య ఆగ్నేయమూలలు. పశ్చిమదిక్కు పుచ్ఛము అని భావింపవలయును. 5

**శ్లో॥ వాయోః కోణపతేశ్చ సక్థియుగళం దిగ్దక్షిణా చోత్తరా**
**పార్శ్వౌ ద్యౌః ఖలు పృష్ఠమభ్రముదరం సర్వం సమోరస్థలమ్ ।**
**ఏషోఽగ్నిః పయసి ప్రతిష్ఠితతమో వేదైనమేవన్తు య-**
**స్స ప్రాజ్ఞోఽయతి యత్ర తత్ర పరమాం యాయాత్ప్రతిష్ఠామయమ్ ॥ 6**

భావ॥ వాయవ్య నిరృతి కోణములు అగ్నికి సక్థిద్వయము (సక్థి = తొడ) దక్షిణ ఉత్తరదిక్కులు - పార్శ్వములు, ద్యులోకము వీపు, అంతరిక్షం పొట్ట, భూమి ఛాతి - ఈ అగ్ని నీటియందు పూర్తిగా నిలిచియున్నది. దీనిని ఈ విధముగా భావించినవాడు గూడా వెళ్లిన ప్రతి స్థలమునందు ప్రతిష్ఠను పొందును. 6

**శ్లో॥ ఆత్మా మే భవతు ద్వితీయ ఇతి స స్వేనాత్మనాఽథ త్రయీం**
**పర్యాలోచ్య యయౌ ప్రజాపతిజనౌ యద్జ్ఞానకర్మాత్మకమ్ ।**
**రేతస్తేన జలం విధాయ తదనుప్రావిశ్య చాణ్డాత్మనా**
**గర్భీభూయ స జాయతే స్మ భగవాన్ సంవత్సరః కాలకృత్ ॥ 7**

భావ॥ విరాట్టును సృజించిన మృత్యువు (హిరణ్యగర్భుడు - అగ్ని) తన మనోమయ శరీరంకన్న భిన్నమయిన మరో శరీరము కావలయునని సంకల్పించెను. అపుడు వేదత్రయిని పరిశీలించి సృష్టి క్రమమును గ్రహించెను. "ధాతా యథాపూర్వమకల్పయత్" గదా! ప్రజాపతి (విరాట్) ని కల్పించిన జ్ఞాన కర్మాత్మకమయిన రేతస్సుతో జలమును నిర్మించి అందులో తాను ప్రవేశించి (అనగా రేతో రూపముగా తాను) హిరణ్మయ మయిన అండరూపముతో గర్భముగా అయ్యెను. దానివలన సంవత్సర కాలరూపుడయిన ప్రజాపతి ఉద్భవించెను. కనుక సంవత్సరమును తయారు చేయుట ద్వారా మృత్యువు సంవత్సర రూపమయ్యెను. 7

**శ్లో॥ తం గర్భం భృతవాన్ ప్రజాపతిరసావావత్సరం చాభిన-**
**త్తస్మాదూర్ధ్వమభూత్తతోఽగ్నిరథ తం జాతం విరాజం శిశుమ్ ।**
**ఆద్యం దేహినమత్తుమాస్యమకరోద్వ్యాత్తం స మృత్యుర్నిజం**
**భీతో భాణితి శబ్దమేష విదధే పుత్రస్స వా వాగభూత్ ॥ 8**

భావ॥ ఈ మృత్యు ప్రజాపతి ఆ గర్భమును ఒక సంవత్సరకాలము భరించెను. తరువాత అది విచ్చికొనెను. అగ్ని (మృత్యు ప్రజాపతి) ఆకలిచేత ఆ బిడ్డను తినుటకు నోరు తెఱచెను. ఆ

బిడ్డయే "విరాట్". అతనే "ప్రథమ దేహధారి". "**సవై శరీరీ ప్రథమః**". ఆ బిడ్డ భయ పడి వెంటనే "భాణ్" అని శబ్దము చేసెను. అదే "వాక్కు" గా అయ్యెను. 8

**శ్లో॥ బీజస్యైవ మమాస్య భక్షణవశాదన్నం కనీయో భవే-**
**దిత్యాలోచ్య స మృత్యురేనమజహాద్బుద్ధ్వా విమృశ్య త్రయీమ్ ।**
**ఋక్సామాని యజూంషి యజ్ఞనృపశూంశ్ఛన్దాంసి సర్వం జగ-**
**చ్చక్రే స్థావరజఙ్గమాత్మకమిదం భూయోఽన్న కామస్స చ ॥ 9**

భావ॥ నేను ఈ బీజప్రాయమయిన "విరాట్" శిశువును తినినట్లయితే, నాకు అన్నంగా చాలదు అని ఆలోచించి మృత్యువు ఆ శిశువును వదలెను. తరువాత బాగుగా ఆలోచించి ఋక్సామ యజుర్వేదములను, యజ్ఞములను నరులను, పశువులను, ఛందస్సులను, ఈ మొత్తం ప్రపంచమును నిర్మించెను. మిక్కిలి అన్నవాంఛగలవాడై అతడీ చరాచర ప్రపంచమును సృజించెను. 9

**శ్లో॥ యద్యద్వస్తు ససర్జ మృత్యురశితుం తత్తత్ప్రవృత్తోఽభవ-**
**త్సర్వస్యేత్యదనాదసావదితిరిత్యాఖ్యాయతే చాగమే ।**
**యో వేదేత్యదితిత్వమస్య పురుషస్సర్వాన్నభోక్తా భవే-**
**త్సోఽన్నం తస్య సమం భవేజ్జగదిదం సర్వాత్మమృత్యూర్చినః ॥ 10**

భావ॥ ఇలా ఏయే వస్తువు సృష్టింపబడెనో ఆ వస్తువులన్నింటిని మృత్యువు తినివేసెను. సర్వ జగత్తును ఇట్లు తినుట వలన ఆగమమునందు (వేదం) మృత్యువుకు "అదితి" అని పేరు వచ్చెను. ఇతనియొక్క ఈ అదితిత్వమును తెలిసికొనిన పురుషుడు సర్వాన్న భోక్త అగును. సర్వాత్మ భూతమయిన ఆ మృత్యువును ఉపాసించువానికి ఈ ప్రపంచమంతయు అన్నమగును. సర్వభక్షకుడయిన మృత్యువే సర్వప్రాణిరూపమయి సర్వభక్షణ చేయును. (జీవునకు జీవుడే ఆహారం అగు పద్ధతి) 10

**శ్లో॥ యజ్ఞేనాథ యజేయ భూయ ఇతి వా సఙ్కల్ప్య సంశ్రామ్యత-**
**స్తప్తస్యాస్య మహానసుశ్చ తరసోదక్రామదఙ్గాత్ప్రభోః ।**
**ఉచ్ఛ్వానే వపుషి స్థితం హృదయమస్యాసీత్తదైచ్ఛత్స మే**
**మేధ్యం స్యాదిదమాత్మవానహమితస్స్యామిత్యథాశ్వోఽభవత్ ॥11**

భావ॥ నేను మరల (ఈ జన్మలో) యజ్ఞము చేసెదనని మృత్యుదేవత సంకల్పించెను. తీవ్రముగా శ్రమపడి ఆలోచించెను. అంతలో మృత్యుశరీరము నుండి ప్రాణము బయటికి వచ్చెను. కాని యీశ్వరుడయిన యీ మృత్యు ప్రజాపతికి తన శరీరము మీద కోరిక పోలేదు. (ఇంతకు ముందీయనకు అశ్వరూపం చెప్పాము కదా!) ప్రాణము బయటకు రావటం వలన

శరీరం ఉబ్బియున్నను ఆతడు ఆ అశ్వశరీరమునే ఉపయోగించదలచెను. ఆశరీరముతోనే తాను శరీరధారికాదలచి "అశ్వము" అయ్యెను. 11

**శ్లో॥ మేధ్యం స్వం స పశుం ప్రకల్ప్య భగవాన్నిర్ముక్తరశ్మిఙ్చ తం**
**మత్వాఽన్తే శరదస్సమాలభత తం స్వాత్మార్థమన్యాన్పశూన్ ।**
**దేవేభ్యోఽప్యపరస్సుధీరితి తతో విద్యాదిదానీమతః**
**ప్రాజాపత్యపశుం నిహన్తి కుశలో వై సర్వదైవత్యకమ్ ॥ 12**

భావ॥ ఆ ప్రజాపతి తననే అశ్వముగా కల్పించికొని, దాని పగ్గములను వదలినట్లుగా భావించి సంవత్సరం చివఱ తనకొఱకు ఆ పశువును చంపినట్లు భావించెను. (ఇదంతా మానసిక యజ్ఞము). ఆ తరువాత ఇతర దేవతల కొఱకు ఇతర పశువులను అట్లే చంపినట్లు భావించెను. ప్రజాపతి వలెనే ఇతర జ్ఞానులు సైతము తమ శరీరములను ప్రజాపతి కొఱకు, ఇతర పశువులను తనకు అవయవములుగానున్న దేవతలకు సమర్పించినట్లు భావనారూప మయిన ఉపాసన చేయవలయును. కనుకనే నిపుణుడయిన యాజ్ఞికుడు సర్వదేవతలనుద్దేశించి ప్రాజాపత్యముగా పశువును అర్పించును. 12

**శ్లో॥ యోఽసౌ ఖే రవిరశ్వమేధ ఇతి తస్యాత్మా తు సంవత్సరో**
**యోఽగ్నిస్సోఽర్క ఇతి స్మృతోఽస్య త ఇమే లోకాస్తథాఽఽత్మాయితాః॥**
**ఏకం దైవమిదన్తు మృత్యురితి తద్ధ్వర్కాశ్వమేధద్వయం**
**యో వేదేతి తు మృత్యురస్య హి భవత్యాత్మైవ తతోఽస్సోఽమృతః॥ 13**

భావ॥ ఆకాశమునందు యీ 'రవి' అశ్వమేధ స్వరూపుడే. ఆయన శరీరము సంవత్సరము. యజ్ఞాదిసాధనమయిన అగ్నియే అర్కుడు. ఈ అర్కరూపమయిన అగ్నికి ఈ లోకములు శరీరావయవములు. దైవమొక్కటే. "మృత్యువు" "అదే హిరణ్యగర్భుడు" అదే అగ్ని - ఆదిత్య ద్వయరూపము. ఈ విధముగా ఎఱిగినవాడు "మృత్యుదేవతారూపుడగును. నేనే అశ్వమేధ దేవతను, అందుకు కావలసిన అశ్వరూపమయిన అగ్నిని నేను - అని ఎఱిగిన వాని ఆత్మ మృత్యురూపమగును. అతడు "అమృతుడగును". విదేహముక్తుడగును. 13

**శ్లో॥ దేవా ఇత్యసురా ఇతి ద్రుహిణజా ద్వేధా భవన్తి ప్రజా**
**దేవాశ్శాస్త్రకృతప్రవృత్తికలితాస్తత్రాల్పసంఖ్యాశ్శుభాః ।**
**అన్యే స్వాసురతాః స్వభావజకృతిజ్ఞానప్రవృత్త్యాశ్రయా**
**దేవానాం విజయే ప్రజాపతిపదం ద్రుత్వం పరేషాం భవేత్ ॥ 14**

భావ॥ అశ్వమేధ బ్రాహ్మణం తరువాత ఇప్పుడు ఉద్గీథ బ్రాహ్మణం ప్రారంభము. ప్రజాపతి

సంతానము రెండు వర్గాలవారు సురలు - అసురులు. శాస్త్రకృతమయిన జ్ఞానకర్మ ప్రవృత్తి కలవారు సురలు. అల్ప సంఖ్య. వీరు శుభులు. అసురులకు మాత్రమే ప్రాణేంద్రియ పోషణమే ముఖ్యము. వారిది శాస్త్రసిద్ధంకాక సహజ రాగద్వేషాది కృతమయిన ప్రవృత్తి. దేవతలు గెలిస్తే ప్రజాపతి పదవి, అసురులు గెలిస్తే స్థావరాది జన్మలు వస్తాయి. (ద్రు - స్థావరం) 14

విశే॥ దైవీసంపద ఆసురీ సంపద అని గీతలో చెప్పబడినవే ఇవి. ఇందులో దైవీసంపద గలవారు సాధువులు. వారి సంఖ్య అల్పము. బలహీనము. ఆసురీ సంపద గలవారిసంఖ్య చాల అధికము. బలము. వీరు భోజన మైథునాది శరీరేంద్రియ వాంఛాలోలులు. తాము దేహమే యను ప్రవృత్తి గలవారు. శాస్త్ర జన్యమయిన జ్ఞానాదులు పెరిగితే దేవతలు జయించినట్లు. అశాస్త్రీయ హింస మొదలయినవి గెలిస్తే అసురులు జయించినట్లు అర్థము.

**శ్లో॥ భూయిష్ఠైరసురైర్జితా అథ సురాస్తే చిన్తయిత్వా మిథో**
**యజ్ఞే శత్రుగణం జయేమ వయమిత్యుద్గీథకర్త్రాశ్రయాః ।**
**నిశ్చిత్యాభ్యవదన్ గిరం కలయ నస్త్వౌద్గాత్రమేవం చ వా-**
**గుద్గాయన్త్యదిశత్సుఖం సురతతేః కల్యాణసమ్భాషిణీ ॥ 15**

భావ॥ అసుర సంఖ్య అధికము. వారిచేతిలో ఓడిపోయిన దేవతలు ఉద్గీథగానముతో యజ్ఞము చేసి శత్రుగణమును జయించెదమని భావించిరి. ఉద్గీథ కర్త అయిన వాగ్దేవిని అడిగారు. అమ్మా! మాకోసం ఔద్గాత్రమయిన గానకర్మ చేయుమనిరి. ఆమె కల్యాణభాషిణియై అట్లే ఉద్గీథమును ఉద్గానము చేసెను. ఆవిధముగా దేవసమూహమునకు సుఖము కలిగించెను. మాటద్వారా శరీరమునకు కలిగిన సుఖము దేవతల భోగమని కల్యాణమయిన వాక్కు తన కోసమని గ్రహింపవలెను. (వాక్కు ఇచ్చట సంగముతో గానము చేసెను.) 15

**శ్లో॥ తత్ర స్వేన శుభేరణస్య కలనే వ్యాసఙ్గరూపం గిర-**
**స్సమ్ప్రాప్యావసరం సురేతరభరో దేవాభిభూతీచ్ఛయా ।**
**పాప్మానం నిదధేఽథ వాచి యజమానావస్థసూత్రాత్మనః**
**పాప్మాఽసావఖిలప్రజోక్త్యనుగతః కార్యే హి హేతోర్గుణః ॥ 16**

భావ॥ వాగ్దేవి తనకోసం సురలకోసం ఉద్గానం చేసినది. శుభమయిన ఉద్గానమునందు ఆమెకున్న వ్యాసంగమును గమనించి రాక్షసులు తగిన అవకాశము చూసికొని దేవతలను పరాభవించుటకు యజమానదశలో అవతరించియున్న సూత్రాత్మ అయిన ప్రజాపతియొక్క వాక్యములో పాపమును ప్రవేశపెట్టిరి. అదే పాపము ప్రజాపతి సంతానమయిన మన మాట యందున్ను సంక్రమించినది - కారణ గుణములు కార్యమునందు సంక్రమించును. కాని ప్రజాపతి దేవతాశ్రేష్ఠుడు గదా! "**న హ దేవాన్ పాపం గచ్ఛతి**" అని గదా! శ్రుతి. ఆయనకు

పాపం ఎట్లా అంటుతుంది? నిజమే పూర్వకల్పంలో ప్రజాపతి యజమానుడుగా ఉన్న సందర్భములో జరిగినదిది. 16

**శ్లో॥ పాపేనోపహతా నృణాం వదతి వాగశ్లీలమక్ష్యీక్షతేఽ**
**ద్రష్టవ్యం శ్రవణం శృణోత్యపపదం దుర్గన్ధముజ్జిఘ్రతి ।**
**ఘ్రాణం స్వాదతి నీరసఞ్చ రసనాఽ స్పృశ్యం త్వచా సంస్పృశ-**
**త్యధ్యేయం హృదయం విచిన్తయతి ధీరజ్ఞేయమప్యిచ్ఛతి ॥ 17**

భావ॥ ప్రజలకు ఆ పాపం అంటటం వలననే ప్రజాభాషలో అశ్లీలం అమంగళం చోటు చేసికొంటున్నాయి. కన్నులు చూడరానివి చూస్తున్నాయి. చెవులు వినరానివి వింటున్నాయి. ముక్కు దుష్ట గంధాలను (మద్యం మొదలగువాని) వాసన చూస్తున్నాయి. నాలుక పనికిమాలినవి తింటుంది. చర్మము తాకరాని వాటిని తాకుతున్నది. ఆలోచింపరాని వాటిని మనస్సు ఆలోచిస్తుంది. బుద్ధి తెలిసికొనరాని వాటిని తెలిసికొంటున్నది. ఇవన్నీ పురుషుడు అప్రయత్నంగా గూడా చేయటం జరుగుతుంది. కనుక ఇంద్రియాలే ఆపని స్వయంగా గూడా చేస్తున్నట్లు లెక్క. (చవితి చంద్రుని వద్దనుకొంటూనే చూచినట్లు, అలవాటుగా బూతులు పలకటం మొదలగునవి) దీనివలన చివరకు మిగిలేది దుఃఖమే కనుక ఇంద్రియాధినేతలయిన దేవతలు దుఃఖమే పొందుతారు కనుక వారి సుఖము దెబ్బతిన్నది. ఇది అసురుల కుట్ర. 17

**శ్లో॥ పాపేనావిహతేశితుర్వదతి వాఙ్నాశ్లీలమక్ష్యీక్షతే**
**నాదృశ్యం శ్రవణం శృణోత్యపపదం నాగన్ధముజ్జిఘ్రతి ।**
**ఘ్రాణం స్వాదతి నీరసం న రసనాఽస్పృశ్యం న చ త్వక్స్పృశ-**
**త్యధ్యేయం న మనో విచిన్తయతి ధీర్నాజ్ఞేయమప్యిచ్ఛతి ॥ 18**

భావ॥ కాని ఈశ్వరుని వాక్కు జీవవాక్కువలె చెడదు. ఈశ్వరుని వాక్కు పాపమును పలుకదు. కన్ను అశ్లీలమును చూడదు. చెవి అపభాషను వినదు. ముక్కు దుర్గంధమును పీల్చదు. నాలుక దుష్టరసమును రుచి చూడదు. చర్మం అస్పృశ్యపదార్థములను స్పృశించదు. ఆయన మనసు చెడు వానిని తెలుసుకొనదు. "స ఆత్మా అపహత పాప్మా" 18

**శ్లో॥ వాణీ శ్రామ్యతి వక్తి నాపి నిఖిలం జీవస్య చష్టే న దృ-**
**క్సర్వం శ్రామ్యతి నో శృణోతి సకలం శ్రోత్రం పరం శ్రామ్యతి ।**
**ఘ్రాణం శ్రామ్యతి జిఘ్రతి స్మ న సమం జిహ్వా న భుఙ్క్తేఽఖిలం**
**భోజ్యం శ్రామ్యతి మానసం న మనుతే సర్వం పరం శ్రామ్యతి ॥ 19**

భావ॥ రాక్షసుల కుట్రవలన దోషదూషితమయిన వాక్కు మొదలగునవి అతిభాషణవలన శ్రమపడి పనిని సరిగా చేయలేకపోవును. వాక్కు పూర్తి పనిచేయక శ్రమపడి ఊరకుండును. కన్ను సమస్తమూ చూడలేదు. అలసిపోతుంది. చెవి మొత్తము వినలేదు. అలసిపోతుంది.

ముక్కు అలిసిపోవును. నాలుక తినవలసినది తినలేక అలసిపోవును. మనస్సు ఆలోచించలేక పోవును. అలసి యుండును. 19

**శ్లో॥ వాఙ్న శ్రామ్యతి వక్తి చాపి సకలం దేవస్య చష్టేఽఖిలం**
**దృఙ్న శ్రామ్యతి వా శృణోతి సకలం శ్రోత్రం చ న శ్రామ్యతి ।**
**ఘ్రాణం శ్రామ్యతి నైవ జిఘ్రతి సమం జిహ్వా చ భుఙ్క్తేఽఖిలం**
**నైవ శ్రామ్యతి మానసఞ్చ మనుతే సర్వం న చ శ్రామ్యతి ॥ 20**

భావ॥ అదే ఈశ్వరుని వాక్కయితే సమస్తమూ పలుక గలదు. ఇతర ఇంద్రియములు మనస్సు అన్ని తమతమ పనులను సమగ్రముగా చేయగలవు. 20

**శ్లో॥ ఆసన్యః పవనో బుధైరథ సముద్గానాయ సఞ్చోదితో**
**దేవార్థం వ్యదగాయదత్ర విమతాః క్షేప్తుం న శక్తా అఘమ్ ।**
**లోష్ఠోఽశ్మానమివైవమేత్య నితరాం ధ్వస్తా వినేశు స్తతో**
**వాగాద్యా నిజదేవతాత్వమగమన్ సఞ్ఛాదితం పాప్మనా ॥ 21**

భావ॥ వాక్కు మొదలయినవి చెడినతరువాత దేవతలు ఉద్గానం చక్కగా చేయుమని ముఖ్యప్రాణమును ప్రార్థించిరి. అది దేవతల కొఱకు ఉద్గానము చేసెను. దీనియందు పాపమును దోపుటకు రాక్షసులకు శక్తి లేకపోయెను. వారందరు రాతికి తగిలిన మట్టి పెళ్లలవలె ఈ ప్రాణోద్గీథమును తాకి ధ్వంసమైరి. వాక్కు మొదలయినవారు రాక్షస పీడవదలిన తరువాత తమతమ దైవత్వమును మరల పొందిరి. పాపాచ్ఛాదన తొలగిపోయెను గదా! అనగా పిండ (దేహం) మాత్రాభిమానము వదలి అగ్ని మొదలగు దేవతత్త్వమును పొందారు. 21

విశే॥ ప్రాణమునందు ఇంద్రియాలయందున్నట్లు సంగము లేదు. ఇంద్రియములకు విషయ సంగం వలన అసురులకు అవకాశం వచ్చింది. వాటివలన కామక్రోధాదులు రాగద్వేషాదులు కలుగుతాయి. ప్రాణమునకు అట్టి పరిస్థితి లేదు. అందుచేత రాక్షసులు పరాజయము పొందారు.

**శ్లో॥ మృత్యుం పాప్మమయం విమోచితవతా ప్రాణేన వాగగ్నితాం**
**ఘ్రాణం వాయుపదఞ్చ దృగ్రవిపదం శ్రోత్రం దిశాత్వం మనః ।**
**చన్ద్రత్వం ప్రతిపద్య దీప్త్యతిశయం చాయాస్యమాత్మాయితం**
**ప్రాణం చాఙ్గిరసం వివేద విదితః ప్రాణశ్చ దూరిత్యసౌ ॥ 22**

భావ॥ ప్రాణమువలన పాపమయమయిన మృత్యువు తొలగిపోయినది. అపుడు వాక్కు అగ్ని అయినది. ముక్కు వాయువుగా, కన్ను సూర్యుడుగా, చెవి దిక్కుగా, మనస్సు చంద్రుడుగాను అయినవారై అధిక కాంతిని పొంది ముఖస్థానములోపలనున్న ఆత్మ రూపమయిన అంగ

సారమయిన ప్రాణమును తెలిసికొనెను. ఈ ప్రాణమునకు "దూః" అని పేరు. మృత్యువు దీనికి దూరము కనుక "దూః" అని పేరు. 22

**శ్లో॥ వాగాద్యాశ్రయపాప్మమృత్యుమపహత్యాసౌ జనైర్నాస్తికైః**
**క్రాన్తం దేశమనీనయన్న తమయే త్కోఽప్యాస్తికస్సజ్జనః ।**
**ఏనం ప్రాణముపాసతే బుధజనా ఆత్మేత్యతిక్రమ్య తే**
**మృత్యుం భాన్తి విదుర్య ఏవమపి తే తద్వచ్చ నిస్సంశయమ్ ॥ 23**

భావ॥ ప్రాణమువలన తొలగిన దేవతల యొక్క వాగాదీంద్రియపాపము నాస్తికులయిన వారు ఆక్రమించిన ప్రదేశములకు పోయినది. కనుక ఆస్తికుడయిన సజ్జనుడెవడును అట్టి ప్రాంతములకు వెళ్లరాదు. ఈ ప్రాణమునే విద్వాంసులు ఆత్మగా ఉపాసించెదరు. అట్టివారు మృత్యువును దాటెదరు. అమృత్యులయి ప్రకాశించెదరు. ఇలా ఎవరు తెలిసికొనినా వారందరు వారివలెనే మృత్యుంజయులై ప్రకాశించెదరు. 23

**శ్లో॥ ప్రాణం స్వార్థమగాయదన్నమిహ యత్కిఞ్చాద్యతే ప్రాణిభిః**
**ప్రాణే నైవ త దద్యతే హ్యన ఇతి ప్రాణస్య నామ స్ఫుటమ్ ।**
**అన్నేఽసౌ ప్రతితిష్ఠతి ప్రతిగతే దేహాత్మనా సమ్భవం**
**వాగాద్యైస్సహ నైష పాపనిహతో వ్యాసఙ్గహీనో యతః ॥ 24**

భావ॥ ప్రాణము దేవతలకోసమేకాక తనకోసం గూడా అన్నమును గానము చేసినది. ప్రపంచములో ప్రాణులు తినే అన్నమంతయు ప్రాణములచేతనే తినబడుచున్నది. ప్రాణమునకు "అనః" అను పేరువచ్చినది. దేహము దీనివలననే బ్రతుకుతున్నది. (అనితి అనః = బ్రతుకుతున్నది) అంటే అన్నము తినటం వలననే ప్రాణము నిలుస్తుంది. దేహరూపముగా పరిణమించిన ఈ ప్రాణము అన్నమునందే నిలిచియున్నది. "**స వా ఏష పురుషోఽన్నరసమయః**" దేనితోనూ వ్యాసంగము అనగా సంగము లేనందువలన (కల్యాణము పలుకవలెనన్న రాగము అభినివేశము లేనందువలన) ఈ ప్రాణమునకు దానిని ఆశ్రయించి యున్న వాగాది అవయవములకుగాని పాపము సోకదు. హాని జరుగదు. 24

**శ్లో॥ వాగ్ఘ్రాణం శ్రుతిరక్షి చిత్తమితి తే పఞ్చాపి దేవాః స్థితాః**
**ప్రాణం స్వం పరివేష్ట్య తేన గిళితేనాన్నేన తృప్యన్తి హి ।**
**యో వేదేతి తమాశ్రయన్తి చ పరం స్వాస్తాన్బిభర్త్యప్యయం**
**శ్రేష్ఠోఽగ్రేసర ఆమయేన రహితః ప్రాణో యథా దీప్యతే ॥ 25**

భావ॥ వాక్కు, ముక్కు, చెవి, కన్ను, చిత్తము - అని ఐదుగురు దేవతలున్నారు. వారు

తమ ప్రాణమును చుట్టికొని ఉండి, ఆ ప్రాణముతిన్న అన్నము ద్వారా తాముగూడా తృప్తి చెందుచున్నారు. ఇట్లు ఉపాసన చేసినవానికి వాని దాయాదులు అనుచరులయి యుందురు. వారినీతడు పోషించును. ఇతడు ప్రాణమువలె శ్రేష్ఠుడై అగ్రేసరుడై రోగరహితుడై ప్రకాశించును. "**ప్రాణోపహారేణ యథేన్ద్రియాణాం**" భాగవతము. 25

**శ్లో॥ ఉత్క్రాన్తాసుషు శోషదర్శనవశా దఙ్గేషు సంకీర్త్యతేఽ**
**నోఽసావఙ్గిరసోఽత ఆత్మతి పరం దేహేన్ద్రియాణామయమ్ ।**
**ఏష హ్యేవ బృహస్పతిర్భవతి యద్వాచః పతిర్బ్రహ్మణ**
**స్పత్యాఖ్యస్తదసావుపాస్య ఇతరాన్ దేవాన్విహాయాస్తికైః ॥ 26**

భావ॥ ప్రాణములు తొలగిన శరీరమునందు అవయవములందు శోష కనబడుతుంది. అందువలన ప్రాణమే అంగిరసమని (అంగసారమని) చెప్పబడుచున్నది. అందువలన ఇది దేహేంద్రియములకు ఆత్మ అయినది. ఈ ప్రాణమే బృహస్పతి. బృహతి అనగా వాక్కు. దానికి పతి కనుక బృహస్పతి. అందువలననే బ్రహ్మణస్పతి అని గూడా అంటారు. 'బృహతీ, బ్రహ్మ' అనునవి వేద, వాక్యనామములు. అందువలన ఆస్తికులు వాగాది దేవతలను వదలి యీ ప్రధానదేవతనే ఆరాధింపవలెను. 26

**శ్లో॥ వాక్సామోఽన ఇతి శ్రుతః పునరయం సామేతి యద్వా సమః**
**కీటేనాపి చ దన్తినా త్రిభువనైస్సర్వప్రపఞ్చేన చ ।**
**సర్వవ్యాపినమేనమేవమయతే యః పణ్డితః ప్రాప్నుయాత్**
**ప్రాణస్యైష సలోకతామపి తథా సాయుజ్యమేతద్ధ్రువమ్ ॥ 27**

భావ॥ ప్రాణమును "సామం" అందురు. సా అనగా వాక్కు. అమః = అనగా ప్రాణము కాగా వాక్కు ప్రాణములను సామమని పిలచెదరు. లేదా కీటముతో ఏనుగుతో లోకత్రయముతో సర్వప్రపంచముతో సమమయినది గనుక "సామము" అనవచ్చును. ఈ విధముగా ప్రాణమును సర్వవ్యాపిగా ఎవడయితే తెలిసికొని ఉపాసించునో అతడు ప్రాణముతో సమానలోకవాసి అగును. సాయుజ్యమును పొందును. ఇదంతా వాస్తవము. 27

విశే॥ 1. స్త్రీలింగశబ్దంతో చెప్పబడేవస్తువులన్నీ 'సా'. పుంలింగ శబ్దంతో చెప్పబడే వస్తువులన్నీ = అమ. దీనికి శ్రుతి ప్రమాణము. "కేన మే పౌంస్నాది నామాన్యాప్నోషీతి ప్రాణేనేతి బ్రూయాత్" "కేన మే స్త్రీనామానీతి వాచేతి బ్రూయాత్" అని శ్రుతి. కాగా ప్రాణము = సా. వాక్కు = అమ. ప్రాణంచేత పలుకదగిన స్వరాది (వాక్కు) సముదాయము సామ. వాక్కుకన్నా ప్రాణమును ప్రధానముగా చెప్తుంది కనుక సామ = ప్రాణము.

2. సమస్త శరీరములయందు సమానంగా అంతటా వ్యాపించినందువలన ప్రాణము

సమము శరీరపరిమాణంలో కాదు. అది మూర్తమయిన శరీరము లేనిది మరియు సర్వగతము. ఆకాశము వంటిది.

**శ్లో॥ ఉద్గీథోఽయమితి శ్రుతో హి జగతీ ముత్తమ్భయన్నుద్గిరో**
**గీథాయాశ్చ వశీ భవత్యథ పునస్సామ్నస్సువర్ణం స్వరః ।**
**స్వం వేదేతి య ఏష తత్స భజతే వాణీ ప్రతిష్ఠాఽస్య తత్**
**యో వేద ప్రతితిష్ఠతి స్వయమముష్యాన్నం ప్రతిష్ఠేతి కే ॥ 28**

భావ॥ ఈ ప్రాణమును ఉద్గీథమని అనెదరు. ఉద్గీథమనగా సామములలోని ఒక భక్తి. ఈ ప్రాణము 'ఉత్'. ఎందుకంటే ఇది భూమిని పట్టి నిలుపుతున్నది. 'గీథ' అను వాక్కుకు ఇది అధిపతి. (వశి) . కనుక ప్రాణము ఉద్గీథము. సామం యొక్క స్వరము సువర్ణమని ఎరిగినవాడు సువర్ణమును పొందును. (స్వరము = కంఠమాధుర్యము). ఈ ప్రాణమునకు వాణి ఆధారమని (ప్రతిష్ఠ) ఎఱిగినవారికి ప్రతిష్ఠ లభించును. కొందరు ప్రాణమునకు అన్నము ప్రతిష్ట యని అనుచున్నారు. 28

**శ్లో॥ మృత్యోర్మాం గమయామృతం త్వితి జపిత్వోద్గాతరి ప్రాణవి-**
**ద్యన్నం స్వస్య కృతేఽభిగాయతి వరం యం తం జనః ప్రార్థయేత్ ।**
**తం యాయాత్సతతస్స గర్ధయతి యం స్వార్థం పరార్థం చ వో-**
**ద్గానాదేష విసాధయత్యపి చ తం ప్రాణాత్మభావం గతః ॥ 29**

భావ॥ ప్రాణతత్త్వవేత్త అయిన 'ఉద్గాత' 'మృత్యువునుండి నన్ను అమృతమునకు చేర్చుము' (మృత్యోర్మా అమృతం గమయ) అని తనకు అన్నం కోసము గానము చేయుచుండగా అతనిని ఎవరు ఏమికోరితే అది తప్పక సిద్ధింపగలదు. స్వార్థము కోసముగాని పరార్థము కోసముగాని, యజమానుని కోసముగాని, ఏ కోరికను కోరి ఉద్గానము చేయునో, ఆ కోరికను అతను తప్పక సాధించును. ఎందుకంటే, అతడు ప్రాణములతో ఆత్మైక్యము పొందినాడు కనుక. అందువలన ప్రాణాత్మాభిమానము కలిగేదాకా ప్రాణమునుపాసింపవలయును. (ప్రాణమే ఆత్మ అను భావము ప్రాణాత్మభావము) 29

**శ్లో॥ సృష్టేఃప్రాగిదమేక ఏవ సమభూదాత్మా శరీర్యాదిమః**
**పశ్యన్నాత్మన ఏష నాన్యదహమస్మ్యేవం పురా వ్యాహరత్ ।**
**సోఽహన్నామక ఆసతే స మనుజోఽద్యామన్త్రితః కేన వా**
**ప్రబ్రూతేఽహమయం త్వయం స పురుషః పాపం యదౌషత్పురా ॥30**

భావ॥ సృష్టికి ముందు ఈ స్థావరజంగమాత్మకమయిన ప్రపంచము ఏకముగా నుండెను. అది ప్రథమశరీరి అయిన ప్రజాపతి రూపమున నుండెను. అనగా ప్రజాపతి శరీరమునందే

అవిభక్తంగా ఉండెను. తనకన్న భిన్నంగా ఏదీ లేనందువలన తన ఏకత్వమును గమనించి ఆ ఆదికాలమున "నేను ఒక్కడినే ఉన్నాను" అని పలికెను. (నేను = అహం) అందువలన ఆయనకు "అహం" అని పేరు వచ్చెను. అందువలననే మనిషి తనను ఎవరు పిలిచినా "అహమయం" (నేను ఫలానా) అని "అహం"తో మొదలుపెట్టి మాట్లాడుతాడు. ప్రజాపతిని పురుషుడనియు అందురు. అందుకు కారణము పురు = పూర్వము 'ష' = పాపమును దహించెను కనుక పురుషుడు. ("పురా ఔషత్" = పురుషః పృషో దరాది గణముతో తయారవుతుంది) 30

విశే॥ 1. పూర్వజన్మార్జితమయిన వేదవిజ్ఞానంద్వారా ప్రజాపతి "సర్వాత్మా హమస్మి" అని అనుకొన్నాడు.

2. ముందు అహం = నేను అని తరువాత తనపేరు ఊరు చెప్పాడు.

3. ఆకారణమును బట్టి పురుషుడయినా సర్వపాపదహనమువలన గూడా పురుషుడవుతాడు.

**శ్లో॥ ఏవంవిత్పురుషో బుభూషతి తు యస్తం నిర్దహేద్ జ్ఞానతోఽ**
**థైకాకీ స పుమాన్బిభాయ జనవత్పశ్చాద్విచార్యాత్మనా ।**
**మత్తోఽన్యన్న కిమప్యహమ్బయమిదం కస్మాత్ప్రయామీత్యయం**
**సన్తత్యాజ భయం భయమ్భవతి వై పుంసో ద్వితీయాద్భువి ॥ 31**

భావ॥ ప్రజాపతి కాదలచిన పురుషుడు ఎవడయినా ఈ విధముగా విషయమును తెలిసికొన్నవాడై తన జ్ఞానము వలన ప్రజాపతినిగూడా పరాభవింపవలెను. అనగా ఆయనను మించవలెను. అనేక వ్యక్తులు తమ జ్ఞాన కర్మలతో ప్రజాపతిపదవికి పోటీ పడతారు. వారిలో ఎవడు మిగిలిన వారిని మించుతాడో వాడు ప్రజాపతి కాగలడు. ప్రస్తుతం ప్రజాపతి అయిన వాడయినా అంతేగదా! ఈ విధముగా ప్రజాపతియొక్క 'పురుష' అను పేరును నిర్వచించి అతనిని తెలిసికొనటం వలన కలుగు ఫలమును చెప్పి, ఆయన జగమును సృష్టిచేసిన విధానము వివరింపబోతున్నాడు.

ఆ ప్రజాపతి (బ్రహ్మ) పుట్టినపుడు ఏకాకిగా ఉండెను. మనవలెనే ఆయన భయపడెను. తరువాత జాగ్రత్తగా ఆలోచించి ఇట్లనుకొనెను. నేను తప్ప మరో వస్తువు ఇచ్చట లేదు. నాకు ఎవరినుంచి భయము కలుగుతున్నది? అని భయమును వదలెను. కనుకనే మనకందఱకు భూమియందు ఇతరులనుంచి భయము కలుగుతుంది. 31

విశే॥ 1. సర్పవ్యాఘ్రచోర శాత్రవాదులవలన భయంకలుగుతుంది. దేవునివలన మృత్యువు వలన భయము కలుగుతుంది. ఇవన్ని ద్వితీయ పదార్థాలు. బ్రహ్మాత్మ భావన లేకపోవటం వలన ఇవి భయము కలిగిస్తాయి.

2. ప్రజాపతికి ముందుగా ఆకాశాదులున్నాయి గదా! జలభయం అగ్నిభయం వంటివి ఉండవచ్చుగదా! కాని విరాట్టు అయిన **ఈ ప్రథమ ప్రజాపతి భయము వీటివలన కాదు. ఆత్మదృష్ట్యా. మరో ఆత్మ ఉన్నదా - అన్నదే భయం.** "ఆత్మా హ్యేకమేవా ద్వితీయం బ్రహ్మ" 'నేహ నానాస్తి కించన" అని శ్రుతి. ఈ జ్ఞానం ఆయనకు జన్మాంతర సంస్కారం వలన సహజంగానే వచ్చింది. పూర్వజన్మలో ఆయనకు ప్రజాపతి పదవిపై అభిలాష ఉండటం వలన ఆ జన్మలో ఆయనకు మోక్షం రాలేదు. ఈ ప్రతిబంధకం లేకుంటే ఆయన అర్హతలకు మోక్షం వచ్చేదే. అందువలన ఆత్మసాక్షాత్కారం గూడా జరుగలేదు. కనుకనే భయం కలిగింది. అవిద్య పోలేదు గదా! ఈ జన్మలో ప్రతిబంధము క్షీణమయినది కనుక, జన్మాంతర శ్రవణ మననాది మహిమ చేత, పునర్విచారముచేత ఆత్మ సాక్షాత్కారం కలిగింది. భయం పోయింది. ఇంత అయినా భూలోకంలోని జీవన్ముక్తునివలె ఆయనయు బ్రహ్మజీవితముననుభవించి బ్రహ్మప్రలయం తరువాత విదేహముక్తి పొందును. "తస్యతావదేవచిరం యావన్న విమోక్ష్యేథ సంపత్స్యే" ప్రారబ్ధం భోగంతోనే నశిస్తుంది.

**శ్లో॥ ఏకాకీ న రతిం ప్రపద్య చకమే సోఽయం ద్వితీయం నృవత్**
**స్త్రీవస్త్వస్య తయాఽస్మి సక్త ఇతి ధీర్జజ్ఞేఽథ పత్నీ పతిః ।**
**పత్న్యాథో శతరూపయా కృతరతిస్స్వాయమ్భువోఽయం మను-**
**స్సర్గార్థం విధిచోదితో వ్యజనయత్కామం మనుష్యాన్ స్వయమ్ ॥ 32**

భావ॥ ఈ ప్రజాపతి ఏకాకిగానుండి అసంతుష్టుడై తనకు ద్వితీయంగా ఒక స్త్రీ వస్తువు కావలయునని కోరుకొనెను. వెంటనే ఆయనకు ఒక స్త్రీ పదార్థము కౌగిలించుకొన్నట్లు భావన కలిగెను. అంతట స్త్రీ పురుషులయిన భార్యభర్తల జంట వెలసెను. ప్రజాపతి సంకల్పము సత్యమయినది గదా! ఆ పత్ని పేరు శతరూప. ఆ పురుషుడే స్వాయంభువ మనువు. వారు ప్రజాపతి ఆజ్ఞతో స్వేచ్ఛగా కలిసిన వారయి మనుష్యులను పుట్టించిరి. అందువలననే నరులకు మానవులు, మనుజులు మొదలయిన పేర్లు వచ్చినవి. 32

**శ్లో॥ మామప్యేతి పుమానయం దుహితరం నిర్లజ్జ ఇత్యఙ్గనా**
**గౌరాసీదృషభో మనుస్స మిథునాత్తస్మాదభూద్గోకులమ్ ।**
**భూయస్సా బడబాఽభవత్స చ హయస్సా గర్దభీ గర్దభ-**
**స్స ద్వన్ద్వాదభవత్తతోఽశ్వముఖరం తచ్చైకశాఫం కులమ్ ॥ 33**

భావ॥ పురుషుడయిన ఈ ప్రజాపతి తనకూతురయిన నన్ను శారీరకంగా కలుస్తున్నాడు ఇతనికి సిగ్గులేదు - అని భావించిన శతరూప 'ఆవు'గా మారెను. కాని కోరిక (సృష్టి) తీరని మనువు ఎద్దు అయ్యెను. అనగా సృష్టికావలసిన ప్రాణుల కర్మ విచిత్రత వలన ఈ మిథునమునకు

ఇట్టి సంకల్పములు కల్గినవి. ఈ జంట వలన గోసమూహము ఏర్పడినది. తరువాత ఆమె "బడబ" (ఆడుగుఱ్ఱము) అయినది. అతడు గుర్రము అయ్యెను. మఱల వారు గాడిదలయిరి. ఈ జంటలనుండి గుర్రములు గాడిదలు, కంచర గాడిదలు అను 'ఒంటిగిట్ట' జాతి ఏర్పడెను. 33

**శ్లో॥ సాఽజాఽభూత్పునరేష బస్త ఉదభూత్సాఽవిస్స మేషస్తథా**
**తద్ద్వన్ద్వద్వితయాదజావినికరా ఆసంస్తదేవం విధిః ।**
**తత్తద్ద్వన్ద్వవిధానపూర్వకమథాదాకీటజన్తువ్రజం**
**జజ్ఞే సృష్టి రితీక్షణాద్భగవతః సృష్టిః పుమానేవ సః ॥ 34**

భావ॥ ఆమె మేక అతడు మేకపోతు అయిరి. ఆమె గొఱ్ఱె, అతడు గొఱ్ఱెపోతు అయిరి. ఈ రెండు జంటలనుండి మేకలు గొఱ్ఱెలు ఏర్పడినవి. ఈ విధముగా ప్రజాపతి ఆయా జంటల రూపాలను స్వీకరించుట ద్వారా కీటములను జంతువులను సృష్టించినాడు. ఇదంతయు బ్రహ్మయొక్క సంకల్పము వలననే సృష్టిగా ఇలా ఏర్పడినది. ఆయన వలన వచ్చిన సృష్టి కనుక ఇది ఆయన రూపమే. శతరూపామనువులను ఆధారంగా సృష్టి జరిపెను. కార్యము కారణం కన్న భిన్నం కాదు కనుక ఈ సృష్టి యంతయు ప్రజాపతి రూపమే. ఘటము మట్టియే కదా! కనుక 'సృష్టి' అని ప్రజాపతికి పేరు. 34

**శ్లో॥ నిర్మథ్యాథ ముఖం కరేణ భగవానుత్పాదయామాస త-**
**ద్యోనిభ్యో దహనం తదన్తరభవన్నిర్లోమకం తత్ర్తయమ్ ।**
**బాహ్వాదేరయమిన్ద్రముఖ్యమసృజద్దేవవ్రజం యత్తతోఽ**
**సావేతస్య విసృష్టి రేష సకలా దేవా అముం తద్యజేత్ ॥ 35**

భావ॥ ప్రజాపతి తన చేతులతో తన నోటిని మథించెను. అని జన్మస్థానములుగా వాటినుండి అగ్ని పుట్టెను. అందువలన నోటిలోపలిభాగము చేతుల లోపలిభాగము (అఱిచేతులు) రోమ రహితమయినవి. తన బాహువులు మొదలయిన వానినుంచి ఇంద్రుడు మొదలగు దేవతాసమూహములను సృజించెను. ఇదంతా ప్రజాపతి యొక్క విసృష్టి. కనుక దేవతలందరు ఈయనయే. కార్యములన్నియు కారణరూపము కదా! కనుక సర్వదేవాత్మకుడయిన ప్రజాపతిని పూజింపవలయును. 35

విశే॥ 1. ఈ ప్రజాపతి ఎవరు? హిరణ్యగర్భుడా? అండజుడు ప్రథమశరీరి అయిన విరాట్పురుషుడా? జీవుడా? ఈశ్వరుడా? హిరణ్యగర్భుడయితే ఆయన సర్వదేవస్వరూపుడు కాలేడు. (అప్పటికి దేవతాసృష్టి లేదు), విరాట్టయితే (భయం, అసంతృప్తి కుదరవు.) కనుక జీవుడే కావాలి. ఎందుకంటే;

ఎ) పూర్వజన్మకృతధర్మఫలితంగా ప్రజాపతి పదవి వచ్చిందిగనుక ధర్మ – అధర్మ

పరతంత్రత జీవలక్షణం కనుక. బి) అజ్ఞానం, దానివలన భయం, అసంతృప్తి, జీవలింగములు. కూతురిపై కామము. సి) శరీరిగా అండమునుండి పుట్టటం.

ఈశ్వరునకు ఈ లక్షణములు లేవు

ఎ) ఆయనది కర్మాది పరతంత్ర పదవి కాదు. బి) అజ్ఞానము, అజ్ఞానకార్యమయిన భయ, అసంతృప్తులు లేవు. పూర్ణకాముడు, కనుక కామం కుదరదు. సి) శరీరత్వము లేదు.

"స సర్వజ్ఞః సర్వవిత్" "అకాయమవ్రణమ్"

డి) ఇక జీవుడు సర్వదేవాత్మకుడు కావచ్చు అది ఈశ్వరలక్షణమే కానక్కరలేదు. అతని పాపములు (పూర్వజన్మలోనివి) జ్ఞానాగ్నిదగ్ధములు. కనుక శుద్ధ చిత్తుడై ఆత్మ సాక్షాత్కారము పొందినట్లు చెప్పబడినది. కనుక బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి" అన్నట్లు వామదేవుని వలె అతడు అఖండము, సచ్చిదానందము అయిన బ్రహ్మమే కదా! "సర్వం ఖల్విదం బ్రహ్మ" కదా!

ఇ) కామం కొంత ఉండటానికి కారణం ప్రారబ్ధావసానం అయి బ్రహ్మ శరీరమున్నంత వఱకు విక్షేపశక్తి అయిన మాయ పనిచేస్తుంది కనుక ఎపుడయినా కామాదిలేశం కనబడవచ్చును. సహజంగా మాత్రము 'ఆత్మరతి రాత్మ క్రీడః" అంతే. సర్వజీవులు బ్రహ్మమే. అయినా వారిలో ఆ జ్ఞానము లేకపోవుట వలన వారు సర్వాత్మలు కాలేరు. ప్రజాపతికి బ్రహ్మాత్మైక్య నిశ్చయం ఉన్నది కనుక సర్వాత్ముడు అవుతాడు. అలా అయితే హిరణ్యగర్భునికి అండజుడు ప్రధమశరీరి అయిన విరాట్టుకు అభేదం ఎలా కుదురుతుంది? మట్టి - కుండలలాగా కార్య కారణభావం వలన సూత్రాత్మకు విరాట్టుకు ఏకత్వం చెప్పవచ్చును. మరియు, స్థూలశరీరంలోపల సూక్ష్మశరీరంలోని తైజసుడే తరువాత విశ్వుడయినట్లు, విరాట్టులోని సూత్రాత్మయే విరాట్టు కావచ్చును. ఉపాధియే తేడా.

యఫ్) అలా అయితే అవ్యాకృతోపాధిలోని యీశ్వరుడే ఉపాధి తేడా వలన హిరణ్యగర్భుడయినాడని ఈశ్వరుడే హిరణ్యగర్భుడనవచ్చునా? - సమా - మీ భావం ఏమిటి?

1) ఈశ్వరుడు హిరణ్యగర్భుడా? ఇది మాకు సమ్మతమే. మట్టియే కుండగదా! కారణమే కార్యము. 2) హిరణ్యగర్భుడే ఈశ్వరుడా? ఇది కుదరదు.

కార్యంకన్న కారణం భిన్నము. నామరూపాలు వేరు ఉపాదానకారణం వేరు. అది మిథ్య. ఇది సత్యము. కనుక హిరణ్యగర్భుడు వేరు. ఈశ్వరుడు వేరు.

జి) ఈశ్వరుడే జీవరూపముతో దేహమునందు ప్రవేశించాడని శ్రుతి "అనేన జీవేనాత్మనా...". అందువలన హిరణ్యగర్భుడయినా మరొకరయినా జీవుడు ఈశ్వరాత్మకుడే. అయితే. ఉపాధివలన భేదం. "కార్యోపాధిరయం జీవః, కారణోపాధిరీశ్వరః" అంతేగాని

సహజభేదం కాదు. "ఏకమే వాద్వితీయం బ్రహ్మ" కదా! జీవేశ్వరుల సమాన తత్త్వం చైతన్యం కదా! హిరణ్యగర్భుడు కార్యోపాధి కనుక జీవుడు. సూక్ష్మశరీరం కార్యమే కనుక హిరణ్యగర్భుడు జీవుడే. కారణం అయిన అజ్ఞానం ఒక్కటే. అదే యీశ్వరోపాధి.

హెచ్) ఈ హిరణ్యగర్భుడు ప్రాణమే. అగ్ని, వాక్కు, ఆదిత్యుడు నేత్రము వీరు ముగ్గురు క్రమంగా ప్రాణ వాక్ నేత్రములకు అభిమాని దేవతలు. సమష్టి లింగశరీరాభిమాని హిరణ్యగర్భుడు. లింగశరీరం ప్రాణాత్మకమే కదా! కనుకనే ప్రాణోపాసకుడు ప్రాణమును హిరణ్యగర్భరూపముగా ధ్యానించాలి. అపుడే అతనికి హిరణ్యగర్భునితో సాలోక్యమో, సాయుజ్యమో వస్తుంది. కేవలం ప్రాణంతో సాలోక్యం మొదలయినవి కుదరవు. (దానికంటూ ప్రత్యేక లోకము ఏదీ లేదు) ప్రాణము జడము. దాని అభిమాని దేవత హిరణ్యగర్భుడు. కనుకనే అది సొంతంగా సృష్టి చేయలేదు. అది జడమనటానికి సూచన ఏదంటే; సుషుప్తిలో ప్రాణం ఉన్నా చేతన క్రియలయిన దర్శనాదులుండవు. కనుక హిరణ్యగర్భోపాధి ప్రాణము.

**శ్లో॥ ఆర్ద్రం యత్తదథాసృజత్స చ రసాత్సోమస్తదన్నం చ సోఽ**
**న్నాదోఽగ్నిః కథితాతిసృష్టిరితి సైషా బ్రహ్మణః శ్రోత్రియైః ।**
**మర్త్యస్సన్నమృతాన్ ససర్జ యదయం దేవాన్ స్వయం శ్రేయసో**
**యో వేదేత్యతిసృష్టిమేష స పుమానస్యాం ప్రజేశాయతే ॥ 36**

భావ॥ ప్రపంచములో ఆర్ద్రపదార్థములన్నియు ప్రజాపతి రసమునుండి (రేతః) (రేతస ఆపః – శ్రుతి) సృజించెను. అందువలన అవి సోమం. అదే అన్నం. అన్నము తినునది అగ్ని. ఇది **బ్రహ్మ చేసిన 'అతి సృష్టి'** అని వేదవేత్తలు అంటారు. ఇవి అతి సృష్టి అనటానికి కారణం – బ్రహ్మ స్వయంగా మర్త్యుడు. కాని ఆయన మర్త్యులు కాని దేవతలను సృజించాడు. తనకన్న శ్రేష్ఠులయిన వారిని సృష్టించాడు. కనుక ఇది అతిసృష్టి. (మనం మనకన్న శ్రేష్ఠమయిన కంప్యూటరును సృష్టించినట్లు). ఈ విషయమును తాత్త్వికముగా గ్రహించిన వాడు అతిసృష్టిలో ప్రజాపతి అగును. 36

విశే॥ 1. సోమమే ద్రవాత్మకంగా ఆహ్లాదనం కలిగిస్తుంది కనుక అన్నము. అన్నాదుడు అగ్ని – జఠరాగ్ని. అగ్నిని సోమంగాను, సోమమును అగ్నిగానూ చెప్పిన సందర్భాలున్నాయి. కాని సోమమే అన్నము. అగ్నియే అన్నాదుడు – అని నియమము. ప్రపంచమంతయు అగ్నీషోమ స్వరూపము. ఇట్లు గ్రహించినవానికి అన్నదోషముండదు.

2. అతిసృష్టి – తనకన్న గొప్ప సృష్టి అతిశయమయిన సృష్టి.

సృష్టి మూడురకాలుగా చెప్పబడినది.

1. సృష్టి – మనుష్యాది పిపీలికలదాకా జంటలు.

2. అతిసృష్టి – తనకన్న మించిన దేవతలను సృష్టించటం

3. విసృష్టి – ఇంద్రాది దేవసృష్టి అని అని ఇంతకు ముందు శ్లోకంలోనున్నది.

4. అతిసృష్టి విసృష్టుల మధ్య భేదం అగ్ని, ఇంద్రాది విశేష దేవతాసృష్టి అతిసృష్టి. **సామాన్యంగా దేవతలందరి సృష్టి విసృష్టి. అనగా విసృష్టిలో భేదం అతిసృష్టి.** అందువలన ఇంచుమించుగా రెండూ ఒకటే.

**శ్లో॥ ప్రాగవ్యాకృతమేతదాస సకలం తద్విష్ణునా వ్యాకృతం**
**నామ్నా చాకృతినాయమేతదభిధశ్చేదంస్వరూపస్త్వితి ।**
**కోశే ఖడ్గవదగ్నిరిన్ధన ఇవైతస్మిన్ ప్రవిష్టః పుమాన్**
**సోఽయం దేహ ఇహానఖేభ్య ఇతి నైనం యన్త్యకృత్స్నోహ్యయమ్ ॥37**

భావ॥ జ్ఞాన కర్మ రూప సాధనము కర్త మొదలగు వారు. ప్రజాపతిత్వం దాకా ఫలాలు – ఇదంతా కలిపి వ్యాకృతమయిన జగత్తు. ఇదే సంసారము. ఈ వ్యాకృత మయిన ప్రపంచము సృష్టికి పూర్వము అవ్యాకృతంగా ఉన్నది. అదే మాయారూపం. కారణావస్థ. అదే ఈశ్వరోపాధి. పరమేశ్వరుడు దానిని వ్యాకరించాడు. తరువాత నామరూపములు ఏర్పరచాడు. ఇది పేరు, దీని ఆకారము ఇది అని ఒక వ్యవస్థ చేశాడు. (ఇసుకలో ఇళ్ళు గూళ్ళు విగ్రహాలు ఏర్పరచినట్లు) ఆ యీ పురుషుడు ఒఱయందు కత్తివలె, కట్టెయందు అగ్నివలె ఈ శరీరమునందు జీవుడుగా కేశములనుంచి గోళ్లదాకా ప్రవేశించి యుండెను. కాని ఈ పురుషుని ఎవరూ గ్రహించలేరు. ఎందుకంటే వీరు గ్రహించే పురుషుడు సమగ్ర పురుషుడుగాడు. 37

విశే॥1. అవ్యాకృతమే జగద్రూపం అయ్యేటట్లుగా ఈశ్వరుడు చేశాడు. అది స్వయంగానే జగత్తుగా పరిణమించదు. అందుకు సంకల్పం ఉండాలి. అది చేతనునిదే కాని అచేతనమున కుండదు. పైగా శ్రుతి సంకల్పం ఉన్నదని చెప్పింది “నామరూపే వ్యాకరవాణి” పరమేశ్వరుడే సంకల్పించినట్లు “తదైక్షత” అని శ్రుతి అన్నది. “కామస్సంకల్పః – ” మొదలయినవి మనోధర్మములే కాని ఆత్మధర్మములు కావు గదా! ఆత్మ ఎలా సంకల్పిస్తుంది? – మాయవలన లేదా చేతనాభాసమువలన వచ్చిన మనస్సువలన సంకల్పం వస్తుంది. కనుక మాయోపాధి అయిన పరమేశ్వరుడు ఆకాశాది సంసారమునకు కారణము. ఇదంతా మాయయే కనుక ఆయన నిర్ధర్మకుడే. “యతోవా ఇమాని భూతాని...” హిరణ్యగర్భుడు మహాభూత స్రష్ట కాడు, కనుక ఈశ్వరుడు కాడు.

2. ఆత్మ హృదయగుహలో లభిస్తాడు కనుక కోశంలో కత్తి ఉపమానం. సర్వదేహమునందు వ్యాపించి ఉండటానికి ఉపమానం చెక్కలో సర్వత్ర వ్యాపించిన అగ్ని. కనుక జీవుడు అణు పరిమాణుడు అన్నది తప్పని తేలినది. లేదంటే జీవుడు సర్వశరీర వ్యాపి కాడు. మధ్యమపరిమాణు

డన్నా అంతే. అనిత్యుడవుతాడు. కనుక జీవుడు విభువే. అయ్యా! పరమేశ్వరుడు గదా! విభువు! సమా – పరమేశ్వరుడే జీవరూపంగా శరీరంలో దొరకుతున్నాడు. "అనేన జీవేనాత్మనాను ప్రవిశ్య" కనుక దేహంలోనున్న చైతన్యం ఈశ్వరుడే. అదే పేరుకు జీవుడు.

3. అఖండ పరిపూర్ణ చైతన్యము దేహంలో ప్రవేశించదు. అది సర్వత్ర ఆకాశంవలె వ్యాప్తమే. లేదంటే అఖండత్వం ఉండదు. **ఘటమునందు ఆకాశం ప్రవేశించిందనుకొనవచ్చు.** కాని అది అక్కడ ముందునుంచి ఉన్నదే. పరిచ్ఛిన్నమయిన నీరు ప్రవేశిస్తుంది. కనుక ప్రవేశం అన్నది ఔపచారికమే. పరమాత్మ దేహంలోనే ఆత్మరూపంగా తెలియటం వలన దేహగతుడని ప్రవిష్టుడని అంటాము. పాషాణాదులలో అలా చైతన్యం తెలియదు కనుక అనము. కనుకనే భాగవతంలో

" మనీషిణోంతర్హృదిసన్నివేశితం స్వశక్తిభిర్నవభిశ్చ త్రివృద్భిః
వహ్నిం యథాదారుషు పాంచదశ్యం మనీషయా నిష్కర్షంతీహగూఢమ్"

దేహంలోగూడా బుద్ధి గుహలోనే దొరకుతాడు కనుక బుద్ధ్యవచ్ఛిన్నమయిన ఆత్మ అంటాము. అంతేతప్ప అక్కడికొక ముక్క, భాగము కాదు. అలా అయితే ఖండము, జడము, అనిత్యము అవుతుంది.

4. లేదా, **పరమాత్మ దేహమున ప్రతిబింబరూపంగా ప్రవేశించాడు.** "రూపం రూపం ప్రతిరూపోబభూవ" – శ్రుతి. "అత ఏవచోపమా సూర్యకాదివత్" అని సూత్రము. జలంలో సూర్యుడు ప్రతిబింబించినట్లని అర్థము. సూర్యుడు పరిచ్ఛిన్నుడు. కాని అఖండం అయిన ఆత్మ ఎలా ప్రతిబింబిస్తుంది? – ఆకాశం లాగా. ఆకాశం నీటిలో కొంత భాగమే ప్రతిబింబిస్తుంది. (ఉపాధి ఎంతో అంతే ప్రతిబింబం గదా! ఆకాశం) బింబం లేనిచోట ప్రతిబింబం పడవచ్చు. సర్వవ్యాప్తమయిన ఆత్మకు ప్రతిబింబం ఏమిటి? మీరు ప్రతిబింబం పడినదన్నచోట గూడా ఆత్మ వ్యాపించియే యున్నది గదా! – సమా – జలంలో ఆకాశం ప్రతిబింబించినట్లు. **జలంలో ఆకాశం ఉన్నది కనుకనే మనం జలములోనికి దిగగలుగుతున్నాము**. (గోడలోకి మేకు దిగుతుంది.) **అయినా ఆకాశం జలంలో ప్రతిబింబించవచ్చును.** కుండలో ఆకాశం జలంచేత కనబడదు. అట్లే చెరువులోని ఆకాశము చెరువుచేత కనబడదు. (ఇవన్నీ ఆకాశంలోనే గదా ఉన్నవి.)

అన్ని ఆకాశకార్యములు గదా! పరంపరయా భూమిగూడా. కారణం కార్యంలో ఉంటుంది గదా! ఆకాశం – వాయువు – అగ్ని – ఆప్ – భూ కదా!

5. బింబాకాశము జలముచేత అదృశ్యమయినందువలన సరస్సులో సూర్యుడు ప్రతిబింబించవచ్చు. కాని చైతన్యంగల బుద్ధిలో మరల చైతన్య ప్రతిబింబం ఏమిటి? సమా –

**ఉన్న ఆకాశం ఎలా జలాదులందు అదృశ్యమయినదో అట్లే బుద్ధిలో చైతన్యం ఉన్నా అది తెలియటం లేదు కనుక ప్రతిబింబింపవచ్చును.** జలంలో ఆకాశ ప్రతిబింబము అలాగే గదా ఉన్నది. అయ్యా! ఆకాశం రూపరహితం. జలం రూప సహితం. అక్కడ ఏదోవిధంగా ప్రతిబింబం దొరకుతుంది. కాని ఇచ్చట బుద్ధి, చైతన్యము రెండూ రూపరహితములే. ప్రతిబింబం ఎలా పడుతుంది? సమా – ఉపాధి స్వచ్ఛంగా ఉంటే (Sensitive) చాలు. ప్రతిబింబించటానికి అవకాశముంటుంది. ఆకారం ముఖ్యం కాదు. అంతేకాదు, అంతఃకరణము జడము. దానికి సుఖదుఃఖాది స్పందనలు సంభవము కావు. నేను సుఖిని, నేను దుఃఖిని – వంటి భావనలు కలగాలంటే చైతన్యం తప్పదు. ఈ అన్యథానుపపత్తి వలన బుద్ధియందు ఆత్మ ప్రతిఫలనమో ఆత్మ వ్యాప్తినో (అవచ్ఛేదం) అంగీకరింపక తప్పదు. చూడండి. "అన్యథానుపపత్తిశ్చేదస్తి వస్తు ప్రసాధికా పినష్ట్యదృష్టిం వైమత్యం సైవసర్వబలాధికా॥"

6. అయితే బుద్ధినే చైతన్యమనవచ్చు గదా! అంటే కుదరదు. "నాన్యోతోస్తి ద్రష్టు" అని శ్రుతి మరో చైతన్యము నొప్పదు. ఆత్మయే ద్రష్ట. బుద్ధియే క్షేత్రము. అచేతనము. దేహము అచేతనమే కాని బుద్ధియందు ప్రతిఫలించిన ఆత్మవలన దేహేంద్రియాదులందును ప్రతిఫలించినదే (అయితే అలా కనబడదు.) కనుక అదీ చేతనంగా కనబడుతుంది. కాని తనవఱకు అది జడమే. (సూర్యకాంతినిబట్టి తగరం మెరసినట్లు) తగరం వంటి బుద్ధి స్వీకరించిన ప్రతిబింబం ద్వారా దేహేంద్రియాదులు గూడా ఆత్మ ప్రతిబింబమును స్వీకరిస్తాయి. (బింబ చైతన్యం సర్వవ్యాప్తమయినా ప్రతిబింబచైతన్యం సర్వవ్యాప్తం కాదు.) **కనుక దేహము నందు పరమాత్మ ప్రతిబింబరూపంగా ప్రవేశించటం సాధ్యమే.**

7. లేదా, అనాత్మ అయిన దేహమునందు ఆత్మకు ఆత్మయందు దేహమునకు అధ్యాస ఉన్నది. కనుకనే 'నేను చూచుచున్నాను' అని అంటుంటాము. అధ్యాస అనగా "అది కాని దానిని అది అనుకొనటము'. అందుకు కారణము అనాది అయిన మాయ. ఈ పరస్పరాధ్యాస వలన దేహమునందు ఆత్మ ప్రవేశించినదంటాము. ఈ అధ్యాసనే "ఆత్మ యొక్క దేహ ప్రవేశం" అంటారు. **అధ్యస్త రూపం గావటమే దేహప్రవేశము.** పాషాణాదులలో ఇలాంటి ప్రవేశం లేదు. వాటికి జడత్వం వలన అధ్యాస లేదు గదా? అధ్యాసవలననే ఈ ప్రవేశము కల్పితము.

**ప్రవేశము, ప్రతిబింబము మొదలయిన విషయాలు శ్రుతి తాత్పర్యం కాదు.** అభేదమే తాత్పర్యము. మహావాక్య ప్రతిపాదన అదే. కాగా పరమాత్మయే జీవభావం పొంది దేహమునందున్నాడని సారాంశము. చూడండి.

"భగవానేక ఏక ఏవైష సర్వక్షేత్రేషు భారత" – భాగవతము

"క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" – గీత

"ఏకోదేవస్సర్వభూతేషు" – శ్రుతి

8. అనేక జీవులు – ఈశ్వరుడు ఒకడు. వీరిమధ్య అభేదం ఎలా సాధ్యం? – సమా – అనేక ఘటాకాశములు – ఒకే ఆకాశం. అనేక సూర్య ప్రతిబింబాలు – ఒకే సూర్యుడు. అనేక ఉపాధులు – ఒకే పదార్థము లాగా ఈ భేదం – అభేదము కుదురుతాయి. అంతా మాయ. ఔపాధికము.

9. ఏకజీవ వాదములో నయినా ఒకే జీవుడయినా ఉపాధి భేదం వలన దశా అనుభవ సాంకర్యం ఉండదు. అంతఃకరణముకు అవి పరిమితము.

10. జీవేశ్వరులు అభేదంగల వారయితే, సంసారి లేడు. ఈశ్వరుడూ లేడు. ఇక శాస్త్రం మోక్షం ఉండవు. పైగా ప్రత్యక్ష విరోధము – సమా – సంసారం ఆత్మ ధర్మం కాదు. ఘటమును చూచే మనకు ఘటం ధర్మం కాదు. ఆత్మకు సంసారం కనబడుతుంది. కాని ఆత్మకు ధర్మం కాదు. అనాత్మ ధర్మమే. సంసారము = జన్మ జరా మరణాదులు, ప్రాణము = ఆకలి దప్పికలు, అంతఃకరణము = శోకమోహాదులు. ఈ సంసారము జడమయిన దేహానికి ఉండదు. అభాసతో గూడిన దేహానికి మాత్రమే ఉంటుంది. అందుకే ఘటం సంసారి కాదు. "ద్రష్ట అయిన ఈ ఆత్మ ఈశ్వరుడే కనుక సంసారి – ఈశ్వరుడు" లేకపోవటం లేదు. అనాత్మ ధర్మమయిన సంసారము ఆత్మయందు మోపబడినది. ఈ అధ్యాస నివృత్తికి శాస్త్రం అవసరం. కనుక శాస్త్రం వ్యర్థం కాదు.

11. ఆత్మ – అనాత్మ పరస్పరం బాగా భేదం. వీటికి అధ్యాస ఎలా. సామ్యం ఉంటే రజ్జు సర్పముల మధ్యలాగా అధ్యాస జరుగవచ్చును. – సమా – ఎలా చేసిందో మాయను అడగాలి. ఘటం ఎలా తయారయినదో కుమ్మరినడగాలి. అనుభవంలో నున్నదానిపై ప్రశ్నలెందుకు? అందరికి నేను లావు, సన్నం, గ్రుడ్డి, కుంటి మొదలయిన "దేహం తామే" అన్న భావములున్నాయి గదా? 'నేను' అని పిలిచే ఈ ఆత్మకు సుఖదుఃఖాదులు లేవు. అనాత్మలయిన మనస్సు మొదలయిన వానికి "నేను" అను పేరు రాదు. అయినా "అహం సుఖీ" అనే అనుభవము వస్తుంది. అదిగూడా అధ్యాసవలన జరిగేదే. "ఇనుము కాలుతున్నది (అయో దహతి)" అన్నట్లు. ఇందులో ఇనుము కాలదు. దానిలో ఎక్కిన అగ్ని కాలుతుంది. వహ్ని తాదాత్మ్య – అధ్యాస వలన ఇనుము కాలుతున్నదంటాము. కనుక విచారణకు నిలవక పోయినా ఆ ఆత్మ – అనాత్మల అధ్యాసను అనుభవం వలన అంగీకరించాలి. సూర్యోదయం మొదలయినవి అంగీకరించినట్లు. మిథ్య కనుకనే శాస్త్రంవలన ఇది తొలగుతుంది. ప్రత్యక్షంగా కనబడుతున్నా ఇది భ్రమవలె, రజ్జుసర్పం వలె మిథ్యయే. విచారణలో నిలువనిది, జ్ఞానంతో తొలగేది ఏదయినా మిథ్యయే. బ్రహ్మమొక్కటే – "యత్సాక్షాదపరోక్షాత్ బ్రహ్మ". సత్యప్రత్యక్షం.

"ప్రమ" అంటే అబాధితమయిన నూతన విషయజ్ఞానము. ప్రపంచము బాధితము. భూతభవిష్యత్తులలో ఉండదు గదా!

12. సద్రూపం (కారణరూపం- బ్రహ్మరూపంలో) ప్రపంచం నిత్యమయినా ప్రపంచ రూపంతో మిథ్యకనుక, అందుకు కారణమయిన అధ్యాస, మాయ - అన్నియు మిథ్యలే. "తత్సత్యం అతోన్యదార్తం" గదా! ఆత్మయందు కల్పితమయిన ఈ ప్రపంచం ఆత్మ సాక్షాత్కారముతో తొలగిపోతుంది. దానికి వేదాంత శ్రవణం కావాలి. కనుక శాస్త్రం ఆవశ్యకము. ఆత్మ ఒక్కటే అయినా ఉపాధి భేదం వలన అనేకమని కనుక బంధం-ముక్తి ఉన్నాయి. ఈశ్వరుడే జీవుడు. వేరు కాదు. అందువలననే పరమాత్మ దేహంలో ప్రవేశించాడని చెప్పబడినది.

13. అయ్యా! ఈ ప్రవేశము నోట్లో చేయి ప్రవేశించినట్లు జరిగిందనవచ్చు గదా! - సమా - పరమాత్మ అఖండ స్వరూపం కదా! నిరవయవం కదా! సావయవం అయితే అనిత్యం అవుతుంది.

14. మాయలో అంతఃకరణంలో అవచ్ఛిన్నమయిన చైతన్యం ఒక్కటే. బ్రహ్మాండంలో ఘటంలోనూ వ్యాప్తమయిన ఆకాశం ఒక్కటే గదా! లేదా, ఉపాధులయిన అంతఃకరణములలో భేదం ఉన్నా చైతన్యం ఒక్కటే. అందుకే "తత్త్వమసి" వద్ద జహదజహల్లక్షణ స్వీకరించాము.

15. అవచ్ఛేద వాదములో జీవేశ్వరాభేదం ఉన్నది. ప్రతిబింబ వాదము లోనూ బింబ ప్రతిబింబములకు అభేదమే. కౌంతేయుడు, రాధేయుడయినట్లు మాయచేత ఈశ్వరుడు జీవుడయినాడు - అనే పక్షంలోనూ అభేదమే కదా! అయ్యా! వారొక్కరే అయితే అభేదం చెప్పటం ఎందుకు? ఇద్దరయితే అభేదం ఎలా? - సమా - అవిద్యాదశలో భేదం ఉన్నట్లు కనబడుతుంది. విద్యాదశలో అభేదం. తిమిరదోషంలో చంద్రద్వయం, దోషాభావంలో ఏకచంద్రుడు - లాగానే ఇది. అవిద్యాదశలో జీవేశ్వరులకు హస్తిమశకాంతరము. ఇదంతా భ్రాంతి. కనుక ఈశ్వరుడే జీవుడన్నది వాస్తవము. అయితే ఇదంతా "సేయం భగవతో మాయా యన్నయేన విరుధ్యతే" అని మాయా ప్రభావము. సర్పంలాగా కనబడే రజ్జువు రజ్జువే. అలాగే జీవునిలాగానే కనబడే యీశ్వరుడు ఈశ్వరుడే.

16. ప్రజలు అహంపశ్యామి కరోమి - అని దర్శనం మొదలయిన క్రియావిశిష్టుడయిన ఆత్మనే చూస్తున్నారు. కాని సచ్చిదానంద స్వరూపమయిన ఆత్మను కాదు. క్రియా విశిష్టమయిన ఆత్మ సంపూర్ణాత్మ కాదు. ద్విచంద్రులను చూచేవాడు నిజమయిన చంద్రుని చూచినట్లు కాదు. శాస్త్రశోధితమతి అయిన వాడే కేవలాత్మను చూడగలడు. లేనివారు చూడలేరు. చూడండి. గీత

"ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితం
విమూఢానానుపశ్యంతి పశ్యంతి జ్ఞాన చక్షుషః

సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్
వినశ్యత్సు అవినశ్యంతం, యః పశ్యతి స పశ్యతి"

17. జీవుడు పరిపూర్ణుడు కాడు. అతడు విభువు కాదు అని శ్రుతి. "అకృత్స్నోహిసః" అని చెప్పింది. అది క్రియావిశిష్టుడయిన ఆత్మ, అంతేగాని కేవలాత్మ గూర్చి కాదు. కేవలాత్మ పూర్ణమయినదే. "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్మృతః" – శ్రుతి.

"యేన సర్వమిదంతతమ్" – గీత. జీవునియందు ప్రాణనం, దర్శనం మొదలయిన క్రియలు అధ్యాసజన్యములే కాని వాస్తవము కాదు. భ్రాంతి జన్యము.

**శ్లో॥ ప్రాణన్ ప్రాణ ఇతీరయన్ భవతి వాక్పశ్యన్ స చక్షుస్తథా**
**శృణ్వన్ శ్రోత్రమివామనన్నితి మనః కర్మాభిధా అస్య తాః ।**
**ప్రాణాద్యన్యతమం విచిన్తయతి యస్త్వాత్మేతి వేదైష నాఽ**
**కృత్స్నో హ్యన్యతమో భవత్యసకలాత్మజ్ఞో న చైవాత్మవిత్ ॥ 38**

భావ॥ ఆత్మకు శరీర సంబంధమయిన క్రియలను బట్టి రకరకాల పేర్లున్నాయి. ప్రాణనం వలన ప్రాణమని, పలకటం వలన వాక్కని, చూడటం వలన నేత్రమని, వినటం వలన శ్రోత్రమని, తలచటం వలన మనస్సని పేర్లు. ఎవడయితే ఆత్మను ప్రాణాదులలో ఒకడని అనుకొంటాడో వాడు ఆత్మజ్ఞానికాడు. ఇందులో ఒకడనిపించే ఆత్మ ప్రాణనం మొదలయిన క్రియలతో గూడిన వాడు కనుక అకృత్స్నుడు అనగా అసమగ్రుడు. వాడు అసమగ్ర మయిన ఆత్మను ఎరిగినట్లే. అతడు ఆత్మవేత్త గాడు. 38

విశే॥ 1. అక్రియమయిన ఆత్మకు సక్రియమయిన యీ పేర్లు మిథ్యలే. నామరూపములు మిథ్యలే.

2. పూర్వశ్లోకంలో చెప్పినది. ఆత్మకేవలం. క్రియా విశిష్టాత్మ మిథ్య. అట్టి ఆత్మవేత్త ఆత్మవేత్త కాదు అని. ఈ శ్లోకంలో చెప్పినదిది – ఆత్మ సర్వక్రియా విశిష్టం కనుక ఏక క్రియావిశిష్టం కాదు. కనుక అట్టి ఆత్మనెరిగినవాడు ఆత్మవేత్త కాడు – అని. ఇది తనమాటనే తనే కాదనటం కాదు.

ఎ) వస్తుతః ఆత్మ కేవలం అక్రియం అయితే బి) వ్యవహారతః అది సర్వక్రియా విశిష్టం.

సి) ఈ వ్యావహారిక – ఆత్మను గూడా ఎఱుగక ఆత్మ ప్రాణమని, ద్రష్ట అని శ్రోత అని విడిగా చెప్పువారు మరీ మూఢులు. పూర్తిగా ఆత్మవేత్త ఎవరంటే "ఎ" వారు, బి. వారు వ్యావహారిక ఆత్మవేత్తలు.

3. సారాంశము : ఆత్మ ఒక్కటే దేహవ్యాపకము. ఆయా ప్రాణాధిష్ఠానములను బట్టి అచ్చట తాదాత్మ్యాధ్యాస పొంది ప్రాణనాది క్రియలతో కలిసి సర్వ క్రియావంతుడవుతాడు.

ప్రాణము, మనస్సు అని గూడా పిలుస్తాము. దర్శనాదులు ఇంద్రియాలని. వాటితో తాదాత్మ్యాధ్యాస చేతగాని, నేత్రాదులు కరణములు కనుక ఆత్మయే కర్త కనుక ఆత్మనే కన్నని చెవియని పిలువ వచ్చును. ఈ కర్తృత్వం ఆ తాదాత్మ్యం ఏదయినా అధ్యాసవలన వచ్చినదే మిథ్యయే. ఆత్మ అసంగము. అక్రియం. కనుక వాస్తవంగా తాదాత్మ్యం గాని, కర్తృత్వంగాని లేవు. కనుక ప్రాణాదులను దేనికదే ఆత్మగా భావించువారు మూఢులే. ఎందుకంటే నేత్రమే ఆత్మ అయితే శ్రోత్రం అనే ఆత్మతో దానికి సంబంధం లేదు. శరీరం నిండా ఉన్న యీ ఆత్మలకు మధ్య అనుసంధానము లేదు. కనుక "ఘటమును చూచిన నేనే ఘటశబ్దమును వింటిని ఘటమును తాకితిని" అని ఏక కర్తృక భావన ఎలా వస్తుంది? కనుక అన్ని క్రియలకు ఆత్మ ఒక్కటే కర్త అయితేనే యీ అనుసంధానం సాధ్యము. అక్రియమయిన ఆత్మకు ఇదంతా అధ్యాస వలన అంటించినదే. కనుక ఆత్మ ఒక్కటే అద్వితీయం నిష్కలం. నిష్క్రియం. పరిపూర్ణం. ఇది తెలిసినవాడే ఆత్మవేత్త.

**శ్లో॥ హృత్ప్రాణేన్ద్రియనామకోపధివశాద్ధ్యానాననాలోకన-**
**ప్రష్ఠం కర్మచయం విభాతి విదధద్వాఽఽత్మేత్యుపాసీత నా ।**
**తోయార్కప్రతిబిమ్బసఙ్ఖ్య ఇవాదిత్యే విశేషాస్సమే**
**ప్రాణాద్యాః ప్రతియాన్త్యభేదమిహ యద్విధ్వస్తవిశ్వోపధౌ ॥ 39**

భావ॥ హృదయమునందుండి ధ్యానము, ప్రాణములవలన అననము (ఊపిరి) నేత్రాదీంద్రియాల వలన దర్శనాది క్రియలు చేయుచున్నట్లు మాత్రమే ఆత్మ భాసించుచున్నది. "ధ్యాయతీవ లేలాయతీవ" కదా! ఇట్టి భావనతో ఉపాసన చేయవచ్చును. దీనిలో ఆత్మ నిర్వికారమని అసంగమని, వికారములు ఆభాసములని కనబడుతున్నది కనుక ఈ ఉపాసన మంచిదే. విశ్వమను మిథ్యా - ఉపాధి నశిస్తే ప్రాణాదులు అన్నీ ఆత్మలోనే కలిసిపోతాయి. భ్రాంతి నశిస్తే భ్రాంతి సర్పము రజ్జువులోనే కలిసిపోతుంది. నీటిలోని సూర్యప్రతిబింబములు నీరుపోయిన తరువాత సూర్యునియందే కలిసిపోతాయి కదా! ప్రాణాది విశేషములు నిర్విశేష బ్రహ్మమునందు కలిసిపోతాయి. క్రియలు ప్రాణాది రూపములు మిథ్యలే. బ్రహ్మమునకు వాస్తవ నామరూపములు కర్మలు లేవు. జ్ఞానమువలన మాయ నశించితే ఉపాధులు నశిస్తాయి. భేదమూ పోతుంది. అభేదమయిన ఆత్మయే ప్రకాశిస్తుంది. 39

**శ్లో॥ సర్వేషామయమేక ఏవ పురుషో జ్ఞాతవ్య ఆత్మాఽమునా**
**విజ్ఞాతేన సమస్తమేవ హి భవేద్ జ్ఞానం విజిజ్ఞాసునా ।**
**నష్టం యాతి పశుం యథా పదవశాల్లోకస్తథా బుద్ధిమా-**
**నాత్మానం యది యాతి తర్హి సకలం సమ్ప్రాప్తవానేవ సః ॥ 40**

భావ॥ ఈ పురుషుడొక్కడే ప్రాణాదులన్నింటిలో అందరికీ తెలిసికొనదగిన ఆత్మ. ఈయన

తెలిసినచో జిజ్ఞాసువుకు సమస్తము తెలిసినట్లే. తప్పిపోయిన పశువును దాని అడుగుజాడలను బట్టి పట్టికొనగలిగినట్లు బుద్ధిమంతుడు ఆత్మను శాస్త్రోపదేశాదుల ద్వారా పొందగలిగినచో అతను సర్వమును పొందినట్లే. "సర్వం ఖల్విదం బ్రహ్మ" గదా! "యథైకేనమృణ్మయేన సర్వం మృణ్మయం విజ్ఞాతం భవతి..." మట్టి తెలిస్తే మట్టితో తయారయినవన్నీ తెలిసినట్లు ఇది. 40

**శ్లో॥ ప్రేయా నేష కలత్రపుత్రధనపశ్వాదేస్సమస్తాదయం**
**యస్మా దాన్తర ఏవ నాస్య తు పరః ప్రేయాన్యతో దుఃఖకృత్ ।**
**ఆత్మానం పరిచిన్తయేత్ప్రియతమం విద్వానుపాస్తే తు యః**
**స్వాత్మానం ప్రియమస్య నైవ భవతి క్వాపి ప్రియం నశ్వరమ్ ॥ 41**

భావ॥ ఈ ఆత్మ, కలత్ర, పుత్ర, ధన, పశు, దేహ, ఇంద్రియాదులన్నింటికన్న అత్యంత ప్రియమయినది. దీనికోసం వాటినయినా వదలికొంటాము గదా! ఎందుకంటే వాటన్నింటికన్న ఇది చాల దగ్గరది. దీనికన్న పరమయినది ప్రియమయినది కాదు. ఏదయినా అనాత్మ అయినది దుఃఖకరమే. పుత్రాదులయిన అవినయం, దుర్గుణాలు, మరణం మొదలయిన వాటివలన దుఃఖకారకులే. అందువలన ప్రియతమమయిన ఆత్మనే ధ్యానింపవలయును. ఎవడయితే జ్ఞాని అయి ఆత్మను ప్రియముగా నుపాసించునో వానికి ఎచ్చటను ప్రియములు నశించవు. 41

విశే॥ 1. పుత్ర, విత్త, ధనాదులు అనాత్మలు. అవి ఎట్లయినా దుఃఖకరములు. "అర్థా నామార్జనే దుఃఖం తథైవ పరిపాలనే, నాశే దుఃఖం వ్యయే దుఃఖం, ధిగర్థాన్ క్లేశకారిణః"

2. ఆత్మ భిన్నమయిన సమస్తము ప్రియము కాదని అతనికి నిశ్చితం కనుక అతనికి ప్రియమయినదేదీ నశించదు. అనగా ఆత్మయే అతనికి ప్రియము. అది నశించదు. లేదా, ఆత్మవేత్తకు పుత్రాది మరణం సంభవించదు. అందువలన దుఃఖం రాదు. నిజానికిది అనువాదం మాత్రమే. లోకంలో అనుకొనే దానిని చెప్పటమే. ఆత్మవేత్తకు లోకంలో ప్రియాప్రియాలుండవు. కేవల ఆత్మయే ప్రియము – ఎందుకంటే ఆత్మ తప్ప అంతా మిథ్య కదా! విషయ సుఖం లాగా ఆత్మసుఖం నశించదని చెప్పటమే దీని తాత్పర్యము.

**శ్లో॥ యద్విద్యావిభవాద్వయం చ నిఖిలం స్యామేతి మర్త్యా విదుః**
**కిం తద్బ్రహ్మ వివేద యేన సకలం బ్రహ్మేభవచ్చేతి చేత్ ।**
**బ్రహ్మైవాగ్ర ఇదం బభూవ బుబుధే బ్రహ్మాహమస్మీతి త-**
**త్స్వాత్మానం స్వయమేవ సర్వమభవత్తస్మాత్పరం బ్రహ్మ తత్ ॥ 42**

భావ॥ ఏ బ్రహ్మవిద్యా వైభవం వలన మనమంతా "సర్వం" అవుతామని మర్త్యులను కొంటారో ఏ బ్రహ్మను తెలిసికొని నిజంగానే సమస్తము బ్రహ్మమే అయినదో, ఆ బ్రహ్మం ఏది? సమా – గురూపదేశము కన్న ముందునుంచే బ్రహ్మము ఉన్నది. "అహం బ్రహ్మాస్మి" అని ఆ

బ్రహ్మమును తన ఆత్మగా గుర్తించినవాడు స్వయంగానే "సర్వం" అవుతాడు. కనుక అది పరంబ్రహ్మ. 42

విశే॥ 1. మర్త్యులకే బ్రహ్మవిద్యలో విశేషాధికారము.

2. "తత్త్వమసి" అను గురూపదేశం కన్న ముందే బ్రహ్మం (తత్) ఉన్నది. పరబ్రహ్మమే దేహంలో ప్రవేశించింది కదా!

3. దేహంలోనే పరబ్రహ్మ ఉన్నది. అది సర్వాత్మభూతము. కాని అవిద్యవలన బ్రహ్మం అబ్రహ్మంగా సర్వాత్మ కానట్లు కనబడుతుంది. ఆకాశం తలంగాను మలినంగాను అజ్ఞానం వలన కనబడుతుంది గదా! అహం బ్రహ్మాస్మి అను జ్ఞానంతో అజ్ఞానం పోతుంది. దానివలన బ్రహ్మం, అబ్రహ్మం, అసర్వం అన్న భ్రమ తొలగుతుంది. దానివలన మనుష్య శరీరంతో తాదాత్మ్యం పొందిన జీవుడు బ్రహ్మం కనుక బ్రహ్మమే సర్వం కనుక అది అపరిచ్ఛిన్నం కనుక బ్రహ్మాత్మైక్య భావన గల వానికి సర్వాత్మ భావన సహజము. అదే మోక్షము. ఇది ముందు నుంచే ఉన్నదే కనుక బ్రహ్మ భావము సిద్ధమే. సాధ్యము కాదు కనుక అనిత్యం కాదు.

4. అయ్యా! బ్రహ్మజ్ఞానం వలన సర్వాత్మభావం కలుగుతుందన్నారు. సర్వాత్మభావం కలిగించే ఆ బ్రహ్మం జ్ఞానం ద్వారా సర్వోపాధులను ధ్వంసము చేస్తుందంటారు. ఆబ్రహ్మయే విజ్ఞానం వలన సర్వం అయిందంటారు. ఏమిటిదంతా? – సమా – బ్రహ్మం వస్తుతః నిరుపాధికం. కేవలం అపరిచ్ఛిన్నం. అదే అవిద్యవలన పరిచ్ఛిన్నంగా కనబడుతున్నది. కాని మరల విజ్ఞానం వలన అపరిచ్ఛిన్నంగా 'సర్వం'గా అయింది. దానినే మర్త్యులు మోక్షం కోసం తెలిసికొంటారు.

అయ్యా! ఎందుకీ వంకర బాట. నిరుపాధికమయిన బ్రహ్మమే తెలిసికొనదగినదని చెప్పవచ్చు గదా! – సమా – బ్రహ్మమును తెలిసికొనగోరువాడే బ్రహ్మం అని చెప్పటానికి శ్రుతియే ఈ వక్రమార్గమును స్వీకరించింది. అదే వివరిస్తాం.

5. సచ్చిదానంద స్వరూపుడయిన పరమాత్మయే మనుష్యదేహంలో వ్యాపించి/ప్రతిబింబించి మాయవలన దేహాదితాదాత్మ్యం పొంది సంసారి అయినాడు. దానినుంచి బయటపడటానికి సిద్ధుడయిన గురువును చేరి "తత్త్వమసి' అను ఉపదేశమును పొంది మననాదికము చేసి "అహం బ్రహ్మాస్మి" అను జ్ఞానమును పొంది మరల అపరిచ్ఛిన్నుడయిన బ్రహ్మమును తానే అని తెలిసికొనెను. ఇట్లు తెలిసికొన్న మనిషి బ్రహ్మమే. లేదా;

6. సంసారిగా అయిన బ్రహ్మమే తన యథార్థ స్వరూపం తెలిసికొని 'సర్వభావం' పొందుతుంది. కనుక అదే బ్రహ్మం. మనుష్యులు తెలిసికొనదగినది. కనుకనే తరువాత వాక్యములో 'ఇదం' అని గ్రహింపబడినది – అదే కనుక ఇందులో వక్రమార్గము ఏమీ లేదు. సారాంశం

ఏమంటే, అవిద్యవలన బ్రహ్మమే పరిచ్ఛిన్నమయినట్లు కనబడి విద్యతో మరల 'సర్వం' అయినట్లు కనబడినది.

7. తన ఆత్మయే బ్రహ్మమయినట్లు కనుగొన్నదని చెప్తున్నారు. అసలు ఈ ఆత్మ అంటే ఎవరు? – నేను చూచుచున్నాను, తినుచున్నాను, వినుచున్నాను, అని 'నేను' అని కర్తగా కనబడేది, జాగరణ స్వప్న ప్రపంచములకు, సుషుప్తిలోని అజ్ఞానమునకు, సుఖాది ఆకారంగా పరిణమించే బుద్ధి వృత్తులకు, వృత్త్యభావానికి గూడా ఎవడు సాక్షియో, ఆ కూటస్థుడు సచ్చిదానంద స్వరూపమయిన ఆ చైతన్యమే ఆత్మ. 'స ఆత్మా తత్త్వమసి' కనుక ఆ ఆత్మ బ్రహ్మమే. బ్రహ్మ భిన్నమయితే ఆత్మ అనిత్యము. ఇందులో ఒకరు జ్ఞేయంగూడా అవుతారు. కాని "నాన్యోతోస్తి ద్రష్టా" కనుక ఒకరే జ్ఞాత కనుక ఒకరు జ్ఞేయంకాక తప్పదు. ఒకరే జ్ఞాత జ్ఞేయము రెండూ కారు. బ్రహ్మమే జ్ఞేయమంటే అది ఘటం వలె జడపదార్థమవుతుంది. అది జ్ఞానమేగాని జడం కాదు "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" కదా! జ్ఞానం ఎప్పటికి జ్ఞేయం కాదు. అవుతుందంటే మరల యీ జ్ఞానము యొక్క జ్ఞానం గూడా జ్ఞేయం అనాలి. కను అనవస్థ. ఆత్మ బ్రహ్మ. రెండూ జ్ఞానములే కనుక అభేదమే.

8. ఆత్మ = అతత్ – సర్వం వ్యాపించినదను అర్థంలో ఆత్మయు అపరిచ్ఛిన్నమని అర్థం. దేహమును పొందినదే 'ఆత్మ' అంటాము. అందువలన పాషాణాదులలో ఆత్మ లేదు – అంటారా? – తప్పు – సర్వవ్యాపి ఆత్మ. చూడగలిగే సాధనం లేనందువలన పాషాణాదులలో దొరకదు. బుద్ధివలన ఆత్మ దొరకుతుంది. బుద్ధిని బట్టి ఆత్మ పరిచ్ఛిన్నము. సంసారి. "సాభాస బుద్ధేః కర్తృత్వం అపరిచ్ఛిన్నే వికారిణి సాక్షిణ్యారోప్యతే భ్రాంత్యా జీవత్వంచ తథా బుధైః" అధ్యాత్మరామాయణము. పరమాత్మయే ఆత్మగా దేహంలో ఉన్నదని చెప్పటం వలన ఆత్మ – పరమాత్మలకు భేదం లేదు. భేద కారణం అవిద్య. అది విద్యతో పోతుంది. "అహం బ్రహ్మాస్మి" అను జ్ఞానం వస్తుంది. దానివలన "తత్ సర్వం" అవుతుంది. "సర్వం ఖల్విదం బ్రహ్మ". కనుక ముముక్షువులకు "అహం బ్రహ్మాస్మి" అను జ్ఞానము మోక్షకారకము. కనుక అదే సాధించాలి. ఇతరం అనవసరం.

**శ్లో॥ దేవానాఞ్చ నృణామబుద్ధ్యత పరం బ్రహ్మాహమస్మీతి య–**
**శ్చర్షీణామభవత్తదేవ స పుమాంస్తద్వామదేవో విదన్ ।**
**సూర్యోఽహం మనురస్మ్యహం సకలమిత్యానర్చ సర్వాత్మతాం**
**వేదాద్యాపి య ఏతదస్మ్యహమితి స్యాత్సర్వమేవైష సః ॥ 43**

భావ॥ అవిద్యచేత జీవుడుగా అయిన బ్రహ్మమునకు విద్యతో మరల బ్రహ్మాత్వము సర్వత్వము సిద్ధిస్తుంది. అందువలన దేవతల మధ్యలో ఇంద్రుడు, మనుష్యులమధ్యన శుకుడు

ఋషులమధ్య నారదుడు, అసురుల మధ్య ప్రహ్లాదుడు, "అహం పరం బ్రహ్మ" అని జ్ఞానులయిరి. ఆ పురుషులు బ్రహ్మమయిరి. జ్ఞానము రాకముందయినా వారు బ్రహ్మములే. అవిద్యచేత వచ్చిన అబ్రహ్మత్వం (సంసారి జీవత్వము) విద్యచేత తొలగుతుంది. వామదేవమహర్షి ఆ బ్రహ్మమును తన ఆత్మగా గ్రహించాడు. అందువలన తాను సర్వాత్మ అయినట్లు గ్రహించాడు. కనుకనే నేను సూర్యుడనని, నేను మనువునని, నేను సకల జగత్తునని తన సర్వత్వానుభవమును ప్రకటించాడు. కనుక ఇపుడయినా ఎవడు తాను బ్రహ్మమునని గ్రహించునో ఆ జ్ఞాని వామదేవాదులవలె బ్రహ్మము అవుతాడు. 43

**శ్లో॥ నైనం బ్రహ్మవిదం సురః పరిభవేత్కోఽప్యాత్మభూతం క్వచి-**
**న్నైవ స్వాత్మని కా క్రియాపి ఘటతే వ్యాఘాతహేతోర్యతః ।**
**అన్యోఽసావహమన్య ఇత్యథ పుమాన్యోఽన్యం సురం సేవతే**
**దేవానామ్ప్రియ ఏష దైవతపశుర్మర్త్యస్య గౌర్వా పశుః ॥ 44**

భావ॥ ఇట్టి బ్రహ్మవేత్తను దేవతలు ఋషులు పితృదేవతలుగాని తమతమ ఋణములను తీర్చలేదని బాధింపరు. ఎందుకంటే అతను వారికిన్ని ఆత్మయే. బ్రహ్మ అయినాడు కదా! "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" కదా! యజ్ఞాదులు మాని బ్రహ్మచర్యంతోనే సన్న్యసించినా దేవతలు బాధించరు. అక్రియమయిన ఆత్మయందు ఎటువంటి క్రియలు జరుగవు. ఆత్మహత్యాదులున్నా అవి శరీర హత్యలే కాని ఆత్మను చంపటం కాదు. "నాయం హంతి న హన్యతే" "నైనం ఛిందంతి శస్త్రాణి" కదా! ఆత్మ తనే కర్త, కర్మ కాదు. దేవతను ఆత్మభావనతో పూజించక "దేవత వేరు తాను వేరు" అను భావనతో పూజించివాడు మూర్ఖుడు. వానిని దేవతలు పశువును వలె తమభృత్యునిగా వాడికొనెదరు. మనము గోవునో మరో పశువునో వాడినట్లు వాడెదరు. 44

విశే॥ 1. అక్రియమయిన ఆత్మయందు నేరుగా ఎటువంటి క్రియలు వికారాలు పరిమితులుండవు. కాని అవిద్యవలన, దేహాది - ఉపాధులాధారంగా ప్రాణనం, దర్శనం మొదలయిన క్రియలు అధ్యాస అవుతాయి. కర్తృత్వం లాగానే కర్మత్వం గూడా లేదు. "అచ్ఛేద్యోయ మదాహ్యోయం –" గీత. దానికి కర్తృత్వం లేదు. కర్మత్వం లేదు. ఎటువంటి పరాభవమూ లేదు. ఆత్మను ఆత్మయే పరాభవించికొనదు. ఒకే వస్తువు కర్మ కర్త కాదు. అనాత్మ పరాభవించదు. అది జడము. బ్రహ్మం పరాభవించదు. అది ఆత్మయే గదా! మరయితే దేవతలు ఎందుకు ముముక్షువులకు వ్యతిరేకంగా ఉండగలుగుతారు. సమా - ముక్తుడయిన వాడే దేవతలకు ఆత్మ. ముముక్షువు కాదు. వీడింకా బ్రహ్మత్వంతెలియని జీవుడు. కనుక బ్రహ్మవేత్త విషయంలో దేవతలు విఘ్నం చేయలేరు. బ్రహ్మజ్ఞానం రావటం వానికి మోక్షం కదా! "బ్రహ్మవిద్ బ్రహ్మైవ

భవతి" గదా! కాని ప్రారబ్ధం తీరునంతవఱకు బ్రహ్మవేత్త బ్రతికి యుంటాడు కనుక మోక్షం మరణానంతరం కనుక దేవతలు ఈ లోపల విఘ్నం కలిగించరా? – సమా – జ్ఞానం కలిగిన తరువాత వాడు ముక్తుడే. సర్వం బ్రహ్మమయమే. రజ్జువు తెలిసిన తరువాత సర్పం ఉండదు. బ్రహ్మవేత్తలకు వ్యవహారం గూడా ఉండదు. వ్యవహారం అనాత్మ అయిన శరీరానికి సంబంధించినది. (జక్షన్ క్రీడన్ రమమాణః) వారెపుడూ "ఆత్మన్యేవాత్మానం పశ్యేత్" కదా! బ్రహ్మవేత్తకాని వానికయినా వ్యవహారం శారీరకమే. అయితే శరీరమే ఆత్మగా అతను భావించటం వలన బంధం, మోక్షం కోసం శాస్త్రం తప్పవు.

2. దేవుడు వేరు, తానువేరని ఆయనకు దాసుడనని పాదధూళి రేణువునని భావించు అతి వినయశీలుడయిన అజ్ఞానిని దేవతలు అలాగే భావించి వాడుకొంటారు. సన్న్యసించి మోక్షమార్గమున బయలు దేరిన వానికి దేవతలు విఘ్నములు కల్పిస్తారు. అనగా ముక్తుడు ఆత్మయే. కర్మఠుడు పశువు. ముముక్షు సన్న్యాసి దేవతలకు గిట్టడు.

**శ్లో॥ భూయాంసః పరిపాలయన్తి పశవో మర్త్యం యథా నిర్జరా–**
**నేకైకో మనుజో భునక్త్యపి పశోరేకస్య నాశోఽ ప్రియః ।**
**కిం వాచ్యం బహునాశ ఇత్యత ఇదం నో నిర్జరాణాం ప్రియం**
**మర్త్యా బ్రహ్మ విదన్తి తత్త్వమితి యత్తద్విఘ్నకృద్దైవతమ్ ॥ 45**

భావ॥ (భునక్తి = పాలయతి) అనేక పశువులు ఒక్కమనిషికి ఎన్నో సేవలు చేస్తాయి. పాలు, నాగలి, బండి, ఇలా. అలాగే ఒక్క మనిషి యజ్ఞాదులతో అనేక విధాలుగా అనేక దేవతలకు ఉపయోగపడతాడు. ఒక మనిషియే అనేక పశువులతో సమానము. ఒక పశువు పోయినా మనం ఎంతో బాధపడతాము. ఇక అనేక పశువులు పోతే ఎంతబాధ? దేవతలది అదే బాధ. మనుషులు బ్రహ్మతత్త్వమును గ్రహించటానికి సన్న్యసించితే దేవతా పశువులు దారితప్పినట్లు. అందుకని వారు అనేక విఘ్నములు కలిగిస్తారు. "శ్రేయాంసి బహు విఘ్నాని"45

విశే॥ 1. క్రియావద్భిర్హికౌంతేయ! దేవలోకస్సమావృతః నచైతదిష్టం దేవానాం మర్త్యైరుపరివర్తనమ్ – అనుగీత.

2. మోక్షమార్గంలో దేవతలు విఘ్నములు కలిగిస్తారు. ఫలాకాంక్షతో కర్మమార్గంలో ఉంటే మూర్ఖత్వం పశుత్వం అంటిరి. మరి ఏమి చేయాలి? సమా – వినాయకుడు విఘ్నకర్త అయినా, సేవించినవారి విఘ్నములు తొలగించినట్లు, దేవతలు గూడా ముముక్షువు సేవిస్తే విఘ్నములు చేయరు.

"న దేవాదండమాదాయ రక్షంతి పశుపాలవత్, యం హిరక్షతు మిచ్ఛంతి బుద్ధ్యా సంయోజయంతితమ్"

3. శుద్ధచిత్తుడు ఆత్మోపాసన చేయాలి. చిత్తశుద్ధికోసం ముందు అసంగంగా ఈశ్వరార్పణంగా (ఫలకాంక్షారహితంగా) దేవయజనము చేయాలి. వీడు దేవపశువు కాడు. వీనికి విఘ్నాలు రావు. దొంగలయినా తమకొడుకుల సొమ్ము దొంగిలించరు గదా! దీనికి దేవతలు అనుగ్రహించి చిత్తశుద్ధి కలిగించెదరు.

**శ్లో॥ బ్రహ్మాగ్నిస్సమభూత్పురా న తదలం సత్కర్మణే సృష్టవత్**
**శ్రేయః క్షత్త్రమిదం సురేషు మఘవా పాశీ శశీ శఙ్కరః ।**
**అబ్దో మృత్యుపరేతపావితి నరేష్వర్కేన్దువంశద్వయం**
**క్షత్త్రాన్నాస్తి పరం తతోఽముమయతేఽధో రాజసూయేఽగ్రజః ॥ 46**

భావ॥ బ్రహ్మం ముందు అగ్ని అయ్యెను. అనగా బ్రాహ్మణుడయ్యెను. దేవతలలో అగ్ని ఒకడే బ్రాహ్మణుడు. అగ్ని సృష్టితో మనుష్యులలో బ్రాహ్మణ సృష్టి జరిగెను. ఈ అగ్నిరూప బ్రహ్మం కర్మలకు చాలలేదు. అందువలన అంతకన్న పాలకమయిన ప్రశస్తమయిన క్షత్రియజాతిని సృష్టించెను. దేవతలలో ఇంద్రుడు, వరుణుడు, చంద్రుడు, శంకరుడు, పర్జన్యుడు, మృత్యువను రోగనాయకుడు, యమధర్మరాజు వీరు రాజులు. వీరు బ్రాహ్మణజాతికి గూడా నియంతలే. మనుష్యులలో సూర్యచంద్రాది వంశములయందు రాజులను సృజించెను. క్షత్రియునికన్న శ్రేష్ఠమయిన నియంతృ జాతి లేదు. అందువలననే అగ్రజుడయిన బ్రాహ్మణుడు క్రిందనున్న వాడై రాజసూయమున క్షత్రియుని "త్వం రాజన్ బ్రహ్మాసి" అని సేవించును. 46

**శ్లో॥ క్షత్త్రే తత్స్వయశో దధాతి భవతి క్షత్త్రస్య యోనిర్యతో**
**బ్రహ్మైనన్న తతః పరోఽ ప్యవనిపస్సేవేత వై బ్రాహ్మణమ్ ।**
**భూత్యై తం చ పురోదధీత మహిపో యో నాదరేణాగ్రజం**
**పశ్యత్యేష హినస్తి యోనిమఘవాన్స్యా శ్రేయసో హింసనాత్ ॥ 47**

భావ॥ బ్రాహ్మణజాతి క్షత్రియునియందు తన యశస్సును ఉంచెను. అది క్షత్రియజాతికి కారణము. (అనగా ప్రజాపతి మొదట అగ్నిని బ్రాహ్మణులను సృష్టించి అగ్నిగాను బ్రాహ్మణుడుగాను అయ్యెను. ఆయనయే తరువాత క్షత్రియుడయ్యెను. కనుక క్షత్రియజాతికి అగ్ని బ్రాహ్మణుడు కారణమని అర్థము) అందువలన క్షత్రియుడు గొప్పవాడయినను బ్రాహ్మణుని సేవింపవలయును. ఐశ్వర్యము కొఱకు అతనిని పురోహితునిగా నుంచికొనవలెను. ఏ క్షత్రియుడయితే బ్రాహ్మణుని ఆదరంగా చూడడో అతడు తన వంశమును చెఱచి కొనుచున్నాడు. శ్రేయస్సును చెడగొట్టటం వలన పాపవంతుడగును. 47

విశే॥ 1. శ్రేష్ఠులయిన నారదాదులను అవమానించటం ద్వారా యమలార్జునాదులు భంగమయినట్లు క్షత్రియుడున్ను బ్రాహ్మణుని హింసించి భ్రష్టుడగును.

**శ్లో॥ నాలం కర్మణ ఏష సన్పునరపి బ్రహ్మా విశం సృష్టవాన్**
**దేవానాం గణదేవతా విశ ఇతి ఖ్యాతాస్తు వస్వాదయః ।**
**మర్త్యానాం ప్రథితా విశః పునరయం శూద్రం ధరణ్యాత్మకం**
**వర్ణం సంవిదధే పునస్సమసృజద్ధర్మఞ్చ సత్యం పరమ్ ॥ 48**

భావ॥ అయినను క్షత్రియుడుగా గూడా ప్రజాపతి కర్మ సమర్థుడు కాక వైశ్యజాతిని సృష్టించెను. వసువులు మొదలయినవారు గణ దేవతలు. వారు 'విట్' అనగా వైశ్యులు. ధన సంపాదనకు వారిని సృష్టించెను. ఇక మనుష్యులలోను ధనసంపాదనా చతురులయిన వైశ్యులు కలరు గదా! అప్పటికి సరిపోక ప్రజాపతి సేవలకై శూద్రజాతిని సృష్టించెను. చాతుర్వర్ణ్యము సృష్టించిగూడ చాలక ధర్మమును సత్యమును సృష్టించెను. 48

విశే॥ 1. గణ దేవతలు = అష్టవసువులు ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, త్రయోదశ విశ్వేదేవతలు, వీరు దేవతలలో వైశ్యులు.

2. బ్రాహ్మణులు యాగములను, రాజు న్యాయ పాలనను, వైశ్యుడు యాగార్థమయిన ధనమును, శూద్రుడు యాగసేవలను చేయవలయును. ఇదంతా సత్యధర్మ పూర్వకంగా జరుగుతుంది. సత్యధర్మములు రెండూ ఒకటే. అవే వీటన్నింటికి నియామకములు.

**శ్లో॥ అగ్నిర్బ్రాహ్మణతాం సురేషు నృషు చ బ్రహ్మా స్వయం ప్రాప్తవా**
**నిన్ద్రక్షత్త్రపదాదిక మ్మున రయం రూపాన్తరేణేత్యతః ।**
**ఆస్తే కర్మఫలం సురేషు దహనే మర్త్యేషు తు బ్రాహ్మణే**
**ప్రైత్యస్మాత్స్వమనేక్ష్య లోకమథ యోఽజ్ఞాతేన నో సోఽవ్యతే ॥ 49**

భావ॥ బ్రహ్మ దేవతలలోను, మనుష్యులలోను, స్వయంగా అగ్నిత్వమును బ్రాహ్మణత్వ మును పొందెను. సురలలో ఇంద్రత్వమును, నరులలో క్షత్రియత్వమును ఇంద్రాది రూపములతో పొందెను. కనుక దేవతలలో కర్మ ఫలము అగ్నియందు, నరులలో బ్రాహ్మణునియందు నుండెను. అగ్ని బ్రాహ్మణులు సాక్షాత్తూ ప్రజాపతి రూపులు. ఇదంతా సంసారము. ఇదే మార్గంలో పరమాత్మను గూడా పొందవచ్చును. ఇచ్చటనే ఈ పరమాత్మ లోకమును చూడకుండగా మరణించిన జీవుడు, ఆ పరమాత్మ తత్త్వం తెలియని, వాడవటం వలన, దాని నుండి రక్షణయే పొందలేడు. అజ్ఞానంతో చనిపోయిన వానికి జ్ఞానం వలన రావలసిన ముక్తి రాదు. వాడు మరల సంసార సముద్రమునందే పడును. 49

**శ్లో॥ నాధీతో న యథా భునక్తి నిగమో విప్రం న కర్మాకృతం**
**నాజ్ఞాతో దశమస్తథా న పరమోఽ ప్యాత్మా న సాక్షాత్కృతః ।**

**ఆత్మజ్ఞానవివర్జితో యది శుభం కుర్యాన్మహత్కర్మ త-**
**ద్దత్వా స్వస్య ఫలం తతః క్షయమయేత్సర్వం హ్యనిత్యం కృతమ్ ॥50**

భావ॥ అధ్యయనం చేయనిదే వేదం రక్షించదు. ఆచరింప బడని యాగాదికర్మలు బ్రాహ్మణుని రక్షింపవు. "దశమః త్వమసి"లో దశముడు అనగా ఆత్మ - గూడా తనను గుర్తించలేనివానిని రక్షించదు. అలాగే పరమాత్మగూడా తనను సాక్షాత్కరించికొనని వానిని ఉద్ధరించలేడు.

ఆత్మజ్ఞాన శూన్యుడయినవాడు శుభమయిన అశ్వమేధాది మహాయాగములను చేసినా అట్టి కర్మ తన ఫలమును మాత్రమే ఇచ్చి కఱిగిపోవును. ఎందుకంటే కృతమయినది అనిత్యము. దాని ఫలితము అనిత్యము. 50

**శ్లో॥ యస్త్వాత్మానముపాస్త ఏవ న భవత్యేతస్య కర్మక్షయా-**
**ద్దుఃఖం యత్కిమపి ప్రయాతి యదయం నిత్యం విపారం సుఖమ్ ।**
**యం యం కామయతే బుధస్స్వయమయం స్వార్థం పరార్థం వరం**
**తం తం స్వాత్మత ఏవ సృష్టమయతే సేవ్యోఽస్య నాస్తీతరః ॥ 51**

భావ॥ కర్మక్షయంవలన వచ్చే దుఃఖము ఆత్మోపాసకునికి ఉండదు. ఎందుకంటే, పాపక్షయం వలన ఎటూ దుఃఖం ఉండదు. పుణ్యక్షయం వలనగూడా జ్ఞానికి దుఃఖం ఉండదు. ఎందుకంటే అదీ కర్మఫలం కనుక బంధకమే. "క్షీయంతే చాస్య కర్మాణి" శ్రుతి. "జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతేర్జున!" - గీత. (ఆత్మోపాసన వలన వచ్చే మోక్షం క్షయం కాదు గనుక ఈతనికి కర్మ ఫలక్షయభయం ఉండదు. అసలు ఈతనికి అసంగత వలన కర్మలుండవు కనుక ఫలము లేదు. కనుక కర్మ ఫలక్షయభయంలేదు.) ఎందుకంటే కర్మక్షయం వలన జ్ఞానం వలన జ్ఞాని అపారమయిన సుఖమును పొందును.

ఈ జ్ఞాని తనకొఱకు గాని, పరులకొఱకు గాని ఏ వరమును కోరుతాడో అవి అన్నియు తన సంకల్పమునుండియే కల్పింపబడును. అందువలన ఇతనికి ఇతర సేవకుడు కావలసిన అవసరము లేదు. అనగా ఇది ఆత్మవేత్తకు స్తుతి. ఎందుకంటే నిష్కాముడే ఆత్మవేత్త కాగలడు. మరల అతనికి సొంత కోరికలుండవు. ఒకవేళ లీలావిలాసంగానో, పరులకోసమో అలా సంకల్పించవచ్చును. కృష్ణుని విలాసములు, రుక్మిణ్యాదివివాహములు అట్టివే. 51

**శ్లో॥ సర్వేషామపి లోక ఏష పశువద్దేహీ కృతీ ప్రాణినాం**
**యజ్ఞైర్దైవపశుః స్వవేదపఠనైరార్షః పశు స్తర్పణైః ।**
**సన్తత్యా పితృలోక ఇత్యపి నృణాం వాసోఽన్నదానైర్గవాం**
**తార్ణామ్భః ప్రతిపాదనాద్బలికణైః కాకశ్వకీటావళేః ॥ 52**

భావ॥ కర్మఠుడయిన పురుషుడు ఈ సమస్త ప్రాణులకు పశువు వంటి భోగ్య వస్తువు. ఎలాగంటే పశువు మన పనులు చేసి మనలను పోషిస్తుంది గదా! అలాగే పురుషుడు యజ్ఞములచేత దేవతలను పోషిస్తాడు కనుక దేవపశువు. వేదశాస్త్రపఠనముచే ఋషి పశువు. సంతాన, పితృతర్పణాదులచేత పితృపశువు. అన్న, వస్త్ర ప్రదానములచేత మనుష్య పశువు, తృణ జలములు సమర్పించి గోవులకు పశువు, బలులు సమర్పించి కాకి, గుఱ్ఱము, కీటకములకు పశువు. **ఇవే గృహస్థుయొక్క పంచమహాయజ్ఞములు.** 52

**శ్లో॥ దేహస్యేవ నిజోపకర్తురనిశం దేహీ గృహస్థస్య త-**
**త్సర్వో భూతగణో క్షయం కలయతే దేవాదయోఽముం పునః ।**
**రక్షన్త్యేవ పశూన్నరా ఇవ తతః కర్మీ గృహస్థోఽ బుధః**
**కుర్యాదేవ నిజాశ్రమోచితమహాయజ్ఞాదికర్మవ్రజమ్ ॥ 53**

భావ॥ దేహధారి అయినవాడు తనకుపయోగపడే దేహమును కాపాడుకొన్నట్లు సమస్త భూతగణములు ఈ పురుషుని నిత్యము కోరుకొందురు. ఈ పురుషుడు మనము పశువును కాపాడుకొన్నట్లు కాపాడు కొనుచుండును. అందువలన ఆత్మజ్ఞాన రహితుడయిన కర్మఠుడు గృహస్థుగా తన ఆశ్రమోచితమయిన పంచమహాయజ్ఞములను చేయవలసినదే. చూడండి గీతలో.

“**దేవాన్భావయతాఽనేన తే దేవా భావయన్తు వః, పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ**” 53

**శ్లో॥ జాయా మేఽస్తు ధనం ప్రజా చ పునరప్యాత్మా ఽగృహస్థః కృతం**
**కుర్వీయేత్యభికమ్య సంస్కృతివశాత్ప్రాప్నోతి సర్వం చ తత్ ।**
**నేచ్ఛం శ్చాపి తతః పరస్తు న భజేదేతావతీ కామనా**
**య స్సర్వం తదిదం ప్రయాతి పురుషః కృత్స్నస్స వై నేతరః ॥ 54**

భావ॥ (అగృహస్థః = బ్రహ్మచారి) బ్రహ్మచారి ఇలా కోరికొనును. “నాకు భార్య, ధనము, సంతానము, కావాలి. పూర్వజన్మ కృతమయిన యాగాది కర్మలు మరల చేసెదను.” అని సంస్కారవశమున కోరికొని అవి అన్నియు చేయును. పొందును. పొందక పోవచ్చును. భార్యా ధన సంతాన సత్కర్మలను తప్ప ఇంకేమియు పొందలేడు. కోరిక ఇంతవఱకే. ఇంతకన్న ఏమికోరగలడు. ఈ మొత్తమును అనుకొన్నట్లు పొందగలవాడు పరిపూర్ణ పురుషుడనుకొంటాడు. వీటిలో ఏ ఒకటో పొందిన వాడు సమగ్రపురుషుడు గాడు. ఇది అట్టివాని భావము. 54

**శ్లో॥ ఆత్మైవాస్య మనఃప్రియా భవతి వాక్ప్రాణః ప్రజా మానుషం**
**విత్తం చక్షురమానుషన్తు భవతి శ్రోత్రం శరీరం కృతమ్ ।**

**యజ్ఞోఽయం స చ పాఙ్క్త ఏవ చ పశుః పాఙ్క్తశ్చ పాఙ్క్తః పుమాన్**
**పాఙ్క్తం సర్వమిదఙ్చ వేద య ఇతి ప్రాప్నోతి సర్వం స నా ॥ 55**

భావ॥ ఇతనికి మనస్సే ఆత్మ. వాక్కే ప్రియురాలు. ప్రాణమే సంతానము. నేత్రమే మనుష్య సంబంధమయిన ధనము. శ్రోత్రము అమానుషమయిన విత్తము. శ్రోత్రము అనగా విజ్ఞానము. శరీరమే కృతమయిన యాగాదికర్మ. ఈ యజ్ఞము పాంక్తము. పంచ వస్తువుల చేత అనగా, ఆత్మ, జాయా, సంతాన, విత్త, శరీరములతో అయిన యజ్ఞము కనుక పాంక్తము. పశువు పాంక్తమే. పురుషుడు పాంక్తుడే. ఈ సర్వకర్మ ఫలము పాంక్తము. ఇదంతా చక్కగా తెలిసినవాడు సర్వమును పొందును. వీడు "కృత్స్న" పురుషుడవుతాడు. 55

విశే॥ 1. ఆత్మ అంటే తాను స్వతంత్రము. తనకు పరతంత్రులుంటారు. అలా చూచినపుడు మనస్సు స్వతంత్రం. దానికి దేహేంద్రియాదులు పరతంత్రములు.

2. వాక్కు, స్త్రీ = భార్య. మనస్సు భర్త, మనస్సు అదుపులో వాక్కు ఉంటుంది. వీనివలన కర్మలకొఱకు ప్రాణం పుట్టుంది. అది సంతానము.

3. మానుష విత్తము గవాది సంపద. దైవ విత్తము – విజ్ఞానం. అది వినటం వలన వస్తుంది. కనుక శ్రోత్రం విజ్ఞానం. శ్రుతి = వినటం గదా! సామాన్యమయిన జ్ఞానం = జ్ఞానము. విశేషమయినది = విజ్ఞానము.

**శ్లో॥ కర్మజ్ఞానవశాత్పితాఽయమకరోదన్నాని సప్తాస్య వా**
**తత్సాధారణమేకమన్నమిహ యత్సర్వైరిదం భుజ్యతే ।**
**ఏతద్యస్సముపాస్త ఏష స పుమాన్నావర్తతే పాప్మనో**
**యస్మాన్మిశ్రమిదం భవత్యసుభృతాం విత్తం సమేషామపి ॥ 56**

భావ॥ గృహస్థుడయిన కర్మరుడు అందరికీ భోగ్యమయిన లోకము. సర్వజగత్తుగూడా గృహస్థులందరికీ భోగ్యము. అందువలన అందరికీ కర్త, కార్యము, భోక్త, భోగ్యము అవుతారు. కనుక గృహస్థుడు ప్రపంచము పరస్పరము తమతమ కర్మలచేత సంపాదింపబడువారు. లేదంటే పరస్పరం ఉపకారం ఎలా చేసికొనే రాత వచ్చింది. కనుక పూర్వకల్పమునందు చేయబడిన పాప పుణ్యకర్మల ఫలము వలన పూర్వ సృష్టి తరువాత సృష్టికి తండ్రి అవుతుంది. కనుక పూర్వసృష్టి ఉత్తరసృష్టిలో కర్మజ్ఞానముల వలన సప్తాన్నములను సృష్టించెను. అందులో మనమందరము తిను అన్నము ఒకటి. ఈ అన్నమును బాగుగా సేవించినవాడు, పాపములనుండి మరలడు. ఎందుకంటే ఈ యన్నము సమస్త ప్రాణులకోసము భగవంతుడు సృష్టించిన అన్నము. ఇది మిశ్రము. అనగా అందరికీ భాగాలు కలిసి ఉన్నాయి. అందరి అన్నమును విభజించకుండా ఒక్కడే తినటం వలన పాపి అవుతాడు. అని తాత్పర్యము.

"తైర్దత్తాన ప్రదాయైభ్యో యోభుంక్తే స్తేన ఏవసః" – గీత. "ఆదత్వాతు య ఏతేభ్యః పూర్వం భుంక్తే విచక్షణః, స భుంజానో న జానాతి శ్వగృధ్రైః జగ్ధిమాత్మనః" 56

**శ్లో॥ ద్వే దేవాననయద్ధుతం ప్రహుత మిత్యన్నే తు యద్వా పితా**
**దర్శశ్చే త్యథ పూర్ణమాస ఇతి తన్నైవేష్టియాజీ భవేత్ ।**
**ప్రాయచ్ఛచ్చ పశుభ్య ఏకమితి తత్క్షీరం ప్రతిష్ఠాయితం**
**సర్వస్యాపి పునస్స మృత్యుమయతే నైకాహ్ని హుత్వా పయః ॥ 57**

భావ॥ 'పిత' దేవతలకు హుతము. ప్రహుతము అను రెండు అన్నములను ఇచ్చెను. లేదా, వాటినే దర్శమని పూర్ణమాసమని రెండు అన్నములను ఇచ్చెను. అవి దేవతల కొఱకు కనుక గృహస్థుడు వానితో కామ్యేష్టులు చేయరాదు. పశువులకు (పిల్లలకు) క్షీరమును అన్నముగా ఇచ్చెను. పశువులంటే దేవ పశువులయిన మనుష్యులు అని గూడా చెప్పాలి. అది అందరికి ప్రతిష్ఠ అయినది. ఒక్కరోజు పయస్సును అగ్నియందు హోమము చేసినవాడు మృత్యువును పొందదు. 57

విశే॥ సర్వమునకు పయస్సు (పాలు) ఆధారం. "అగ్నౌ ప్రాస్తాహుతిః సమ్యగాదిత్య ముపజీవతి ఆదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టే రన్నం తతః ప్రజాః" కనుక **ఈ పయోహోమం** ప్రపంచ ప్రవర్తకము.

**శ్లో॥ తాన్యన్నాని సదాఽసుధారినికరైస్సమ్భుజ్యమానాన్యపి**
**క్షీయన్తే న యతః పితా జనయతి జ్ఞానక్రియాభ్యామ్పునః ।**
**తస్మాదక్షితిమేనమాహురితి యో వేదాత్తి సోఽన్నం ముఖే**
**నామర్త్యత్వముపైతి యాత్యమృతమిత్యేషా ప్రశంసాపరమ్ ॥ 58**

భావ॥ పిత 'జ్ఞాన క్రియలచేత' నిత్యము మరల మరల పుట్టిస్తాడు కనుక. ఈ అన్నములు ఎంత తిన్నను తఱుగవు. అందువలన పురుషుని 'అక్షితి' (క్షయము లేనివాడు) అనెదరు. అక్షితిని భావించి తెలిసికొన్నవాడు, నోటితో అన్నము తినుచుండును. అమరుడగును. అమృతమును పొందును. 58

**శ్లో॥ త్రీణ్యన్నాని పితాఽఽత్మనేఽకురుత హృద్వాక్ప్రాణసఙ్జ్ఞాన్యథో**
**రూపాదీన్ యదనుప్రయుక్తకరణైర్జానాతి దేహీ యతః ।**
**స్పర్శస్యాపి వివేకధీర్భవతి యత్సఙ్కల్పకామత్రపా-**
**శ్రద్ధాసంశయభీతిధీధృతిమయం తత్తత్ర హృత్కథ్యతే ॥ 59**

భావ॥ మరో మూడు అన్నములను "పిత" తన కోసము చేసికొనెను. అవి హృదయము

వాక్కు, ప్రాణము. అందులో హృదయము అనగా మనస్సు. మనస్సుతో కలిసిన ఇంద్రియాల వలననే రూపాదులు గ్రహింపబడును. స్పర్శం గూడా అందులోని తేడాలు పాద స్పర్శ హస్త స్పర్శ ప్రదేశ స్పర్శ మొదలయినవి గూడా మనస్సువలన వివేక (తేడా) పూర్వకంగా తెలుస్తాయి. సంకల్పం, కామం, లజ్జ, శ్రద్ధ, సంశయము, భయము, బుద్ధి, ధైర్యము ఇవన్నీ దీని ధర్మములు. 59

**శ్లో॥ వర్ణాత్మా నినదాత్మకశ్చ భువనే శబ్దో౽స్తి యస్సైవ వాక్**
**సర్వఞ్చాప్యభిధేయజాతమనయైవాభాస్యతే భానువత్ ।**
**ప్రాణో౽పాన ఉదాన ఇత్యపి భువి వ్యానస్సమానో౽న ఇ-**
**త్యేష ప్రాణ ఉదీర్యతే స చ పుమానేతన్మయో జాయతే ॥ 60**

భావ॥ వాక్కు ఒక అన్నం గదా! దాని స్వరూపం ఇది. అక్షరరూపమయిన శబ్దము, కేవల నాదరూపమయిన భేరీ మృదంగాది శబ్దము - అదే వాక్కు. సూర్యునిలాగా ఈ వాక్కు సమస్త వాఙ్మయమును ప్రకాశింపజేయును. ప్రాణమనగా అనః. ఇది ప్రాణము, అపానము, ఉదానము, వ్యానము, సమానము అనిచెప్పబడును. ఆ పురుషుడు మనో వాక్ప్రాణమయు డగును. 60

విశే॥ 1. ప్రాణము ఒక్కటే. కాని వృత్తి స్థల భేదాల వలన పేర్లు మార్పు. మామూలుగా 'ఆనః' అనవచ్చును. ఆనః = ఊపిరి పీల్చుట విడచుట

ప్రాణము = ముందునుంచి వదలబడును; అపానము = క్రిందనుంచి వదల బడును; ఉదానము = ఊర్ధ్వగతము; వ్యానము = ప్రాణాపానములను నియమించునది; సమానము = అన్నపానములను సమానముగా నడుపునది. ఆనః = సర్వ సామాన్యమయిన శారీరక వాయువు.

2. పరమాత్మకిదంతా మాయవలన (అజ్ఞానకృతమయిన అధ్యాసవలన) ఏర్పడినది.

**శ్లో॥ వాగ్భూ ఋఙ్నిగమస్సురాశ్చ జననీ విజ్ఞాతమిత్యుచ్యతే**
**హృత్త్వభ్రం యజు రాగమశ్చ పితరస్తాతో విజిజ్ఞాసితమ్ ।**
**ప్రాణః స్వర్భువనఞ్చ సామ మనుజాః పుత్రో౽ప్యవిజ్ఞాతకం**
**తద్రూపత్రితయేన తత్త్రయమిదం భోక్తుర్భజత్యన్నతామ్ ॥ 61**

భావ॥ వాక్కు లోకత్రయంలో భూమి, వేదత్రయంలో ఋగ్వేదము, దేవపితృమనుష్య త్రయంలో దేవతలు, మాతా పితృ సంతాన త్రయంలో మాత, విజ్ఞాత, విజిజ్ఞాసిత, అవిజ్ఞాత త్రయంలో విజ్ఞాతము.

హృదయం = మనస్సు భువర్లోకం (అంతరిక్షం) యజుర్వేదము, పితృ దేవతలు, తండ్రి విజిజ్ఞాసితము, ప్రాణము = స్వర్లోకము, సామవేదము, మనుష్యులు, పుత్రుడు, అవిజ్ఞాతము.

ఈ విజ్ఞాత విజిజ్ఞాసిత, అవిజ్ఞాతకమను రూపత్రయముతో పై వాక్కు మనస్సు ప్రాణములు – భోక్తకు అన్నముగా అగును. 61

విశే॥ వాక్కు మనస్సు ప్రాణములను "పిత" తనకు అన్నముగా సృష్టించెనని ఇంతకు ముందు చెప్పబడినది. అదే వివరింపబడినది.

1. వాక్కు ప్రకాశరూపం గనుక అందరికీ తెలిసినదే గనుక విజ్ఞాతం. అది అన్నింటినీ తెలియ పరుస్తూ భోగయోగ్యం కావటమే – అన్నము.

2. మనస్సు దాని ఆకారము సందేహాస్పదం. కనుక తెలియవలసినవన్నీ సందిగ్ధ వస్తువులే. అందువలన అది విజిజ్ఞాస్యము. అందువలన జిజ్ఞాస్యమయి మనస్సు భోగ్యం అవుతుంది.

3. ప్రాణము – విజ్ఞానమునకు అందదు. అది అవిజ్ఞాతము. అయినా అలాగే భోగ్యము. అనగా తండ్రి ఉపకారాలు తెలియక పోయినా నెలబాలుడు అతని ఆధారంగా బ్రతుకుతాడు. కనుక అతనికి తండ్రి అన్నము అనగా భోగ్యము.

**శ్లో॥ వాచో భూర్వపురగ్నిరేష కరణం తుల్యప్రమాణం త్రయం**
**ద్యౌశ్చిత్తస్య వపూ రవిస్తు కరణస్తుల్యప్రమాణం త్రయమ్ ।**
**తద్ద్వన్ద్వస్య సమాగమాత్సమభవత్ప్రాణోఽ సపత్నః ప్రభుః**
**ప్రాణస్యామ్బు వపుశ్శశీ తు కరణం తుల్యప్రమాణం త్రయమ్ ॥ 62**

భావ॥ వాక్కుకు భూమి శరీరము. అనగా బాహ్యాధారము శరీరము. అగ్ని కరణము ఆధేయం. ప్రకాశం కదా! ఈ వాక్కు భూమి అగ్నియు సమాన ప్రమాణమయినవి.

మనస్సునకు ద్యులోకము శరీరము, ఆధారము. సూర్యుడు కరణము. ఆధేయము. ఈ మనోద్యులోక సూర్యులు సమాన పరిమాణులు. ఈ ద్వంద్వము యొక్క కలయిక వలన ప్రాణము పుట్టెను. అది ఎదురులేనిది. ప్రభువయినది. ఈ ప్రాణమునకు శరీరము జలము అదే ఆధారము. చంద్రుడు కరణము. ఆధేయము. ఈ మూడున్నూ సమాన ప్రమాణమయినవి. ప్రాణోపాసక పురుషుడు శత్రురహితుడగును. 62

**శ్లో॥ ఏతైశ్చ త్రిభిరేవ సర్వభువనం వ్యాప్తం హ్యనన్తైస్సమై–**
**రవ్యస్తా స్త ఇమే ప్రజాపతిరమూ న్యోఽధీరుపాస్తేఽన్తగాన్ ।**
**లోకం సోఽన్తయుతం జయత్యథ పుమానేతానుపాస్తే తు యోఽ**
**నన్తానేష స లోకమఙ్ఛతి మహానన్తాతిగం శాశ్వతమ్ ॥ 63**

భావ॥ అపరిచ్ఛిన్నమయినవి పరస్పరం సమానమయినవి అయిన ఈ వాక్కు మనస్సు ప్రాణము సమస్తమును వ్యాపించినవి. ఈ మూడూ కలిసి ప్రజాపతికి ఆత్మ. అతడు

సమష్టిలింగాభిమాని కదా! అనంతములయిన వీటిని అంతముగలవానినిగా ఉపాసించిన వాడు అంతయుతమయిన యీ లోకమును జయించును. వీటిని అనంతములుగానే ఉపాసించువాడు అనంత లోకములను చెందును. తరువాత ఆ మహాత్ముడు అంతములేని శాశ్వత స్థానమును పొందును. సర్వాత్మభూతుడగును. 63

**శ్లో॥ యస్సంవత్సర ఏష షోడశకలః ఖ్యాతః ప్రజేశః కలా**
**ఆసన్ పఞ్చదశ క్షపాస్తత ఇయం సా షోడశీ యా ధ్రువా ।**
**శుక్లే నిర్భిరసౌ ప్రపూర్యత ఇవాపక్షీయతే కృష్ణకే**
**షోడశ్యా నిశమేత్యమామనుగతస్సర్వం జగత్ప్రాణభృత్ ॥ 64**

భావ॥ "పిత" పాంక్తమయిన కర్మతో సప్త-అన్నములను సృష్టించెను. వాటిలో మంచిని తనకొఱకు సృజించుకొనెను. అవే వాక్, మనః ప్రాణములు. అవి పాంక్తమయిన కర్మఫలములు. పాంక్తమనగా పంచరూపమయినదని ముందే చెప్పబడినది. "మాత పిత సంతానం, ధనము, కర్మ" అను '5'లో మాతా పితృ సంతానములను చెప్పటం జరిగింది. పృథివి, అగ్ని మాతలని, ద్యు, ఆదిత్యులు పిత అని, ప్రాణము ప్రజ అని చెప్పబడినది. విత్త కర్మలను గూర్చి చెప్పలేదు. కనుక అన్నత్రయము పాంక్తం ఎలా అవుతుంది? - సమా - కనబడుచున్న యీ సంవత్సర కాలస్వరూపుడు షోడశకలావంతుడు అయి చంద్రుడు ప్రజాపతి. ఈయనకు 15 రాత్రులు 15 కలలు. అందుకు అతీతమయిన అసలు కల 16వది ఉన్నది. అది ధ్రువ. ఈ చంద్రుడు శుక్ల పక్షమున "15" రాత్రుల చేత పూరింపబడును. కృష్ణ పక్షమున తరుగుపడును. ఆ సమయమున అతడు 16వ కలతో ఈ జగమున వ్యాపించినవాడై, అమావాస్యా రాత్రిని పొందును. అమావాస్య రాత్రి షోడశకలతో సమస్త ప్రాణులను వ్యాపించి యుండును. అందువలననే ఆయన బయట దొరకడు. 64

**శ్లో॥ తత్ప్రాతః ప్రతిపద్యుదేతి స తతో మాయాం స హన్యాదపి**
**క్షుద్రం జన్తుమపి ప్రపూజయితుమిత్యుక్తాం శరద్దేవతామ్ ।**
**య స్సంవత్సర ఏష ఏవ స పుమానేవంవిదస్తస్య త-**
**ద్విత్తం పఞ్చదశామనన్తి హి కలా ఆత్మాఽస్య వా షోడశీ ॥ 65**

భావ॥ తరువాత పాడ్యమినాడు ప్రొద్దున చంద్రుడు ఉదయించును. అందువలన **అమావాస్యనాడు ఎంతటి తొండ వంటి క్షుద్రజంతువునయినా చంపరాదు**. ఎందుకంటే **సర్వప్రాణులయందును చంద్రుడు షోడశీ (ధ్రువా) కలారూపముతో వ్యాపించియుండును.** ఆరోజు సోమదేవతను గౌరవించుటకు ఏప్రాణిని చంపరాదు. కొట్టరాదు. చంపితే సోమదేవతను చంపిన పాపము తగులును. ఈ సోమదేవతయే సంవత్సర దేవత. ఈ సంవత్సర రూప

ప్రజాపతి తన ఆత్మయేనని తెలిసిన పురుషుడు సంవత్సర ప్రజాపతియే అగును. అతని విత్తము ఈ 15 కలలు. వాని ఆత్మ 16వ కళ. ఇట్లు 16 కళలు గల పురుషుడే ప్రజాపతి. 65

**శ్లో॥ విత్తేనైవ స పూర్యతే చ పురుషో వృద్ధేన చ క్షీయతే**
**క్షీణేనేవ కలాభిరిన్దురరిణో నేమ్యాదివచ్చాత్మనః ।**
**విత్తం తత్పరివారభూతమఖిలే క్షీణేఽపి తస్మిన్నసా-**
**వాత్మా జీవతి నాభివద్యది పునర్విత్తేన సమ్పూర్యతే ॥ 66**

భావ॥ ఆ పురుషుడు విత్తము పెరిగితే పూర్ణ చంద్రుడవుతాడు. విత్తము తగ్గితే క్షీణ చంద్రుడవుతాడు. ఇదంతా కలలకు విత్తమునకు సామ్యం. చక్రనాభికి చుట్టూ ఆకులు వలె ఈ కలలు పురుషునియందు కూర్చబడియుండును. నాభి 16వ కళ ఆత్మరూపము. కనుక పరివారమయిన విత్తం తగ్గినా 'ఆత్మ' (దేహం) బ్రతికియుంటేచాలు – మరల బండికుండకు ఆకులు పెట్టినట్లు – విత్తపూర్ణుడగును. క్షీణచంద్రుడు పూర్ణచంద్రుడయినట్లు. ఆయన 16వ కళ అను ఆత్మ ఉండిన చాలు. అదే పోలిక. 66

విశే॥ 16వ కళ 'ధ్రువ' అది పోదు. అది తేనెపట్టువంటిది. అది ఉంటే పూర్ణిమకు 15కళలు కలుస్తాయి. విత్తం వస్తూ పోతూ ఉన్నా పోకుండా ఉండే ఆత్మ ధ్రువము. దానికి ఆగమాపాయములు లేవు. చంద్రుని 16వదయిన ధ్రువ కళవంటిది.

**శ్లో॥ లోకాస్సన్తి భువి త్రయో నరపితృస్వర్గాభిమానాశ్రయాః**
**పుత్రేణైవ మనుష్యలోకమముకం లోకం పితౄణాం కృతైః ।**
**మర్త్యో దేవపదం జయేదనఘయా సర్వోత్తమం విద్యయా**
**విద్యా తత్ఫలు సాధనేషు సకలేష్వత్యుత్తమేతి స్మృతా ॥ 67**

భావ॥ సంసారభూమిలో మనుష్యలోక పితృలోక స్వర్గలోకములు మూడున్నవి. పుత్రునిచేత మనుష్యలోకము. కృతమయిన అగ్నిహోత్రాది కర్మలచేత పితృలోకమును, అనఘమయిన అపర విద్యచేత దేవలోకమును పొందవచ్చును. దేవలోక సాధనలలో విద్య అత్యుత్తమ సాధనము. (పరవిద్య అయితే బ్రహ్మలోక దాయకము.) 67

**శ్లో॥ ప్రైష్యన్తం పురుషో యదైష మనుతే స్వం పుత్రమారాత్తదా**
**బ్రహ్మ త్వమ్భవసి త్వమేవ వివిధో యజ్ఞశ్చ లోకో భవాన్ ।**
**ఇత్యాహాథ సుతస్తమాహ పితరం బ్రహ్మాస్మి యజ్ఞోఽస్మ్యహమ్**
**లోకోఽస్మీతి మృతః పితా ప్రవిశతి ప్రాణైస్స లోక్యం సుతమ్ ॥ 68**

భావ॥ పురుషుడు తాను మరణించు సమయమున తన సమీపమున నున్న పుత్రుని చూచి నీవు వేదము కావలెను. యజ్ఞము కమ్ము. లోకము కమ్ము. అని పలుకును. కొడుకు

తండ్రితో ఇట్లనును. నేను వేదమునగుదును. నేను యజ్ఞము నగుదును. నేను లోకము నగుదును. – తరువాత మరణించిన తండ్రి తన ప్రాణములతో సహా సుతునిలో ప్రవేశించి సలోకుడగును. 68

విశే॥ విద్యా కర్మలవలన దేవ పితృలోకప్రాప్తి కలుగదు. మనుష్యలోకం దేనివలన లభించును? – సమా – మరణించబోవు తండ్రి తన జీవించిన పుత్రునిద్వారా మనుష్యలోకమును జయించును. తాను చదివీచదవక మిగిలిన వేదమును చేసిచేయక మిగిలిన యజ్ఞములను, తాను గెలిచీ గెలవని లోకములను తన కొడుకే పూర్తిచేయవలయునని, (తనకు సమయం అయిపోయినదని) ఈ విధంగా కోరును. కొడుకు ఈ బాధ్యతలను నెరవేర్చెదని అంగీకరించును. అవన్ని అలాగే చేసి తండ్రిని ఆయా లోకములకు చేర్చును. **కనుక పుత్రుని లోక్యుడందురు.** మరణించిన వెంటనే తండ్రి కొడుకులోనికి ప్రవేశించును. (అనగా ప్రేతాత్మ పట్టి పీడించటం కాదు) ఘటం పగిలిన తరువాత ఘటంలోని దీపం అంతట వెలుగును. పరిచినట్లు శరీరభంగం తరువాత తండ్రి ప్రాణాలు అధిదైవిక రూపముతో పృథివి, అగ్ని మొదలగు రూపములతో సర్వత్ర వ్యాపించును. వాఙ్మనః ప్రాణాత్మ భావన కలవాడు గనుక తండ్రి పుత్రుని ప్రవేశించును. పుత్రుడు తండ్రిరూపమున ఈ లోకములోనున్నట్లు గ్రహింపవలయును. చూడండి శ్రుతి. "సోస్యాయమితర ఆత్మా పుణ్యేభ్యః కర్మభ్యః ప్రతిధీయతే" కనుకనే "అపుత్రస్య గతిః నాస్తి" అన్నారు. మనుష్య లోకమును పుత్రరూప నివాసము ద్వారా జయించినట్లు గ్రహింపవలయును.

**శ్లో॥ పిత్రా యన్న కృతం చ కృత్యమపి తత్కృత్వా స్వయం బన్ధనా-**
**దేనం మోచయతీతి పుత్రపదభాగేవంవిధస్సన్ సుతః ।**
**పుత్రేణ ప్రతితిష్ఠతీహ జనకః ప్రేతం విపాపం తతో**
**దైవః ప్రాణగణోఽమృతో విశతి తం దైవీ తు వాక్ క్ష్మానలాత్ ॥ 69**

భావ॥ తండ్రి చేసీచేయక మిగిలిన కర్తవ్య శేషమును పూరించి తండ్రిని కర్తవ్య శేష ఋణబంధమునుండి తప్పించినవాడు పుత్రుడు. **పుత్ (తండ్రియొక్క) ఛిద్రమునుండి త్రః = కాపాడు వాడు పుత్త్రుడు.** ఈ విధంగా తండ్రి పుత్త్రుని చేత ప్రతిష్ఠ పొందును. అపుడు పాపరహితుడయిన తండ్రి లోనికి హిరణ్యగర్భసంబంధి అయిన అమృతమయిన వాఙ్మనః ప్రాణ సమూహం ప్రవేశించును. అడ్డు తొలగిన తరువాత నీరు చొచ్చుకొని వచ్చినట్లు, ఆవరణం పగిలిన తరువాత దీపం వెలుతురు అంతటా పారినట్లుగా దైవవాక్కు అతనిని ఆవేశించును. ఇది పృథివినుండి అగ్నినుండి వచ్చును. సర్వ వాక్కులకు ఉపాదానమయిన దైవవాక్కు పృథివ్యగ్ని స్వరూపమయినది. 69

**శ్లో॥ యత్రోక్తం వితథం న వాగ్భవతి సా దైవీ తదేనం దివ-**
**స్సూర్యాద్దైవమశోకమావిశతి హృన్మోదాత్మకం సర్వదా ।**

**అద్భ్యశ్చన్ద్రమసశ్చ దైవ ఉదితః ప్రాణో వ్యథశ్చాక్షయ-**
**శ్శోచన్త్యేనమయేత్రుజా పునరమాం పుణ్యస్తు తం గచ్ఛతి ॥ 70**

భావ॥ (ఉత్ = చ అని ప్రాణుత్ = ప్రాణంగూడా) 'దైవీ' వాక్కు పలికిన దేదియు అసత్యము కాదు. మృతుడయిన యీ అపరవిద్యా విద్వాంసుని లోనికి ద్యులోక సూర్యులనుండి శోకరహితము, ఆనందమయము అయిన మనస్సు వచ్చి చేరును. జల చంద్రుల నుండి అక్షయము, బాధారహితమూ అయిన దైవమయిన ప్రాణము వచ్చి చేరును. మృతుడయినాడని సంతానాదులు శోకదౌర్భాగ్యమును (అమా = దౌర్భాగ్యము) పొందుదురు. కాని మృతుడు మాత్రము పుణ్యమును పొందును. 70

విశే॥ ఈ విద్వాంసుడు అపరవిద్యా విద్వాంసుడు. ఇతనికి మోక్షం లేదు. విద్యాతారతమ్యం వలన ప్రాజాపత్యం పొందటం వరకు ఫలితాలు. అదే హిరణ్యగర్భుని వాఙ్మనః ప్రాణములు ఆవేశించటం. పరా విద్యగల వానికే మోక్షము. ఇతనికిన్ని హిరణ్యగర్భునివలె ఒకే ప్రాజాపత్య స్థితి వస్తుంది.

**శ్లో॥ నో దేవానఘమేతి స హ్యుపగతో దైవం స్వభావం మృతో**
**యో వేదేతి భవత్యయం స హి పుమానాత్మాఽఖిలప్రాణినామ్ ।**
**సర్వజ్ఞం చ హిరణ్యగర్భమివ తం విద్వాంసమేనం జగ-**
**ద్దుఃఖాదుఃఖకలాభిమర్శరహితం భూతాన్యవన్త్యన్వహమ్ ॥ 71**

భావ॥ ఈ విద్వాంసునికి పుణ్యమే వస్తుంది. ఎందుకంటే దేవతలకు పాపం అంటదు. వారిది పుణ్యకర్మఫలంగా వచ్చిన శరీరం గదా! ఈ విద్వాంసుడు గూడా మృతుడయి దైవ స్వభావమునే పొందాడు గదా! అతడు ఇలా జ్ఞానం కలిగి ఉన్నాడు కదా! కనుక ఇతడు అపర విద్యా జ్ఞాని. అందువలన ఇతడు సర్వప్రాణులకు ఆత్మ అయినాడు. ఎందుకంటే ఇతడు వాఙ్మనః ప్రాణరూపుడు. కనుక సర్వభూతములయందు హిరణ్యగర్భునివలె వ్యాపించియున్నాడు. వాఙ్మనః ప్రాణముల విషయంలో సర్వభూతములకు 'ఆత్మ' అన్న బుద్ధి ఉన్నది గదా! కనుక హిరణ్యగర్భునివలె ఈ మూడు అన్నములను ఆత్మగా దర్శించినవాడు అఖండ వాఙ్మనః ప్రాణ రూపుడగును. కనుక సర్వాత్మ కనుక సర్వజ్ఞుడు, అఖండరూపుడు కనుక ఖండశరీరాల దుఃఖాదులతో సంబంధమయిన ఈ అపరవిద్యా విద్వాంసునికి సర్వ భూతములు హిరణ్యగర్భునికి వలె గౌరవము నిచ్చును. హిరణ్యగర్భునివలె ఇతడున్ను ప్రజాపతి పదవిలో ఉన్నాడు గదా! 71

**శ్లో॥ కర్మాణీశ్వరనిర్మితాని సకలాన్యన్యోన్యమీర్ష్యాం దధు-**
**ర్వక్ష్యామ్యేవ సదేతి వాగ్వ్రతమధాద్ద్రక్ష్యామ్యహం వేతి దృక్ ।**

**శ్రోష్యామీతి చ సా శ్రుతిస్తదితరాణ్యప్యేవమాత్మక్రియాం**
**మృత్యుస్తాన్యరుణత్ శ్రమాకృతిధరశ్శ్రాన్తిం యయుస్తాన్యథ ॥ 72**

భావ॥ ఈశ్వర నిర్మితమయిన ఇంద్రియములన్నియు అన్యోన్యము అసూయ పడినవి. నేను నిత్యము మాటలాడెదనని లొడ లొడ వాగుచునే యుండెను. కన్నులు T.V.లు మొదలగునవి చూచుచునే యుండెను. చెవి ఎప్పుడూ వినుచూనే (పాటలు మొదలగునవి) యుండెను. ఇట్లే ఇతర ఇంద్రియములు తమ పనిని చాల ఎక్కువగా చేయుచునే యుండెను. మృత్యువు 'శ్రమ' రూపముతో చొఱబడి వాటిని బాగా డస్సి పోవునట్లు చేసెను. 72

**శ్లో॥ తాని ప్రాణమమృత్యువిద్ధమథ నః శ్రేష్ఠోఽయమాయంస్తథా**
**నాయన్ శ్రామ్యతి నో యదిత్యుదమనన్ రూపం దధుస్తస్య చ ।**
**ప్రాణా ఇత్యత ఏవ తాన్యభిధయా గీయన్త ఏవంవిదా**
**య స్స్పర్ధాం కురుతే స నశ్యతి పుమాన్ శుష్యచ్ఛరీరః క్రమాత్ ॥ 73**

భావ॥ ఈ ఇంద్రియములు చివఱకు ప్రాణమును గమనించినవి. అది శరీరమంతట సంచరించినా సంచరింపక (స్థావర శరీరములలో) యున్నను ఒక్క విధముగా అలసట లేకుండా యున్నది. ఆ విషయమును గమనించిన ఇంద్రియాలు గూడా ప్రాణరూపమునే ధరించినవి. కనుకనే ఇంద్రియములను ప్రాణములందురు. ఇట్టి ప్రాణవిద్య తెలిసిన వానితో కలహించువాని శరీరము క్రమముగా శుష్కించి చనిపోవును. 73

**శ్లో॥ ధక్ష్యామీత్యనలోఽహిమాంశురమనత్తప్స్యామ్యహం వేత్యథో**
**భాస్యామీతి శశీ తథైవ సకలా దేవాః పరే మేనిరే ।**
**స్వం స్వం శ్రేష్ఠమథామనన్త ఇతి తే నిమ్లోచ మాపుస్తతో**
**వాయుశ్శ్రేష్ఠతమో బభూవ యదయం నిమ్లోచమాయాతి నో ॥ 74**

భావ॥ అధ్యాత్మ విషయాలు చెప్పి అధిదైవతము చెప్పుచున్నాడు.

అగ్ని నేను తగులబెట్టగలను - అని తగుల బెట్టుచునే యుండెను. సూర్యుడును అట్లే భావించి ఎండకాయుచుండెను. చంద్రుడట్లే వెన్నెల కురియుచుండెను. ఇతర దేవతలందఱును అట్లే తమ తమ కృత్యములను తమ పౌరుషముతో అసూయతో పోటీ పడి కొనసాగించిరి. చివరకు తీవ్రమయిన శ్రమకు లోనయి ఆగిపోయిరి. ఒక్క వాయువు మాత్రము అట్లు ఢీలా పడలేదు. వీచుచునేయున్నది. అందువలన వాయువు శ్రేష్ఠ దేవత అయ్యెను. అనగా సూర్యచంద్రాదులకు ఉదయాస్తమయాలు, అగ్నికి చల్లారటం మొదలగునవి ఉన్నాయి. గాలి ఎపుడును మనకు సిద్ధముగనే యున్నది. కనుకనే ఊపిరి పీల్చుటకు దొఱకుచున్నది. (Air, Wind) కనుక నిత్యస్ఫురణ గతులు గలది వాయువు. సర్వవ్యాపి సదాగతి. 74

**శ్లో॥ వాయోః ప్రాణత ఏవ చక్షురరుణశ్చోదేతి యాత్యప్యయం**
**తం దేవా విదధుశ్చ ధర్మమయమేవాద్యాపి స శ్వో భవేత్ ।**
**మృత్యుర్మాం న భజేదితీచ్ఛతి తు యః ప్రాణ్యాదపాన్యాచ్చ న**
**వ్రత్యేవం దృఢధీస్సలోకమథవా సాయుజ్యమస్యాప్నుయాత్. 75**

భావ॥ వాయువునుండి సూర్యుడుదయించును. ప్రాణములనుండి (శరీరగత) నేత్రముదయించును. అందులోనే లీనమగును. ఇది త్రికాలసత్యము. ఆధ్యాత్మముగాను, అధిదైవతముగాను ఇదే పరిస్థితి. రాగాదులు అగ్న్యాదులు దేవతలు వాయువును, ప్రాణమును ధర్మముగా స్వీకరించి వాయుపుత్రులుగాను, ప్రాణపుత్రులుగాను ఉండిరి. ఎవడయితే మృత్యువును కోరడో వాడు నిత్యము ప్రాణాపానవాయువులతో ప్రాణవ్రతము పట్టవలయును. అనగా దృఢమయిన భావనతో ఇలా ధ్యానింపవలయును. "భూతములందున్న వాక్కు అగ్ని మొదలగు దేవతలయందు ప్రాణాత్మగా నేను ఉంటిని. సర్వ పరిస్పందనలకు నేను కర్తను" అని. అట్టివాడు ఆతని ఉపాసనా తారతమ్యం వలన సాలోక్యమో, సాయుజ్యమో పొందగలడు. 75

విశే॥ 1. వాయోరగ్నిః = అగ్ని వాయుకార్యం కనుక అగ్ని పదార్థమయిన సూర్యుడు వాయువునందే ఉదయాస్తమయములను పొందును. లేదా; సూర్యుడస్తమించినా వాయువస్తమించడు కనుక వాయువునందే సూర్యుని ఉదయాస్తమయములు జరుగునని భావన. కన్ను గూడా అంతే. ఇంద్రియాలన్ని అంతే ప్రాణము నిత్య వ్యాపారి.

"యదా వై పురుషః స్వపితి ప్రాణం తర్హి వాగప్యేతి, ప్రాణం మనః, ప్రాణం చక్షుః, ప్రాణం శ్రోత్రం, యదా ప్రబుధ్యతే ప్రాణాదేవాధి పునర్జాయంతే"

2. దేవతలు భగ్న వ్రతులు. ఇంద్రియాలు భగ్నవ్రతులు. వాయువు ప్రాణము అభగ్న వ్రతులు. దృఢ/స్థిర వ్రతులు.

**శ్లో॥ త్రిస్రస్సన్తి హి నామరూపకృతయో నామ్నాన్తు వాగుచ్యతే**
**ఉక్థం బ్రహ్మ చ సామ చేతి కలనాదాత్మప్రదానాత్తథా ।**
**సామ్యా ద్రూపచయస్య చక్షురితి వా దేహః పునః కర్మణా-**
**మాత్మైతత్త్రయమేకమేతదమృతం సత్యేన సఞ్ఛాదితమ్ ॥ 76**

భావ॥ నామ రూప కృతులు మూడే యీ ప్రపంచము. అందులో నామములకు వాక్కు ఉక్థము. బ్రహ్మము సామ. ఉక్థమనగా ఉత్పత్తి స్థానము (దీనినుండి అన్ని ఉత్థానము/కలనం చెందును) బ్రహ్మము = ధారణ స్థానము. సామము = సమమయినది. రూపమునకు నేత్రము ఉక్థము = కలనము, బ్రహ్మము = ఆత్మ ప్రదానము ధారణము. సామము = సామ్యము. కర్మలకు దేహము ఉక్థము. బ్రహ్మము సామము. ఈ త్రయము కలిపి ఆత్మ. కార్య కరణ

సంఘాతమయిన ఈ శరీరంలో అదే ప్రధానం కనుక ఆత్మ. (అసలు ఆత్మ కాదు. ఆత్మ వంటిది ప్రధానము) దీనిలో ఒకటి అమృతం అదే ప్రాణము. అది సత్, త్యత్ అను ద్వయము చేత ఆవరింపబడియున్నది. సత్ = వాయువు, ఆకాశము= త్యత్ = అగ్ని జల భూములు, సత్+త్యత్ = సత్త్యం = పంచభూతములు. అనగా పంచభూతాత్మకమయిన శరీరము చేత ఆవరింపబడినది. అందువలన అది కనబడదు. 76

విశే॥ 1. నామములకు ఉత్పత్తి వాక్కువలననే గదా! కనుక వాక్కు వలననే సాకారమవుతాయి. వాక్కుతో సమానమయినవి. శబ్దత్వం గదా! అలా మిగిలినవి. నేత్రం అంటే రూపసామాన్యం అని అర్థము. కనుక రూపవిశేషములకు రూపసామాన్యము ఉక్థం, బ్రహ్మం సామ. కర్మలకు దేహము ఉపలబ్ధి స్థానం కనుక ఉక్థము. అలా మిగిలిన విషయాలు (ఉక్థం = ఉపాదాన కారణము) కార్య కరణసంఘాతమనగా మన ఇంద్రియాది సమూహమయిన శరీరము.

2. అజ్ఞానికి స్థూలదేహం తప్ప సూక్ష్మదేహం తెలియదు. స్థూలదేహమే ఆత్మ అనుకొంటాడు. ప్రాణమనేది ముఖ్యమయిన ఆత్మ కాదు. ఇది అసలు ఆత్మ మీద ఆవరణంగా ఉన్న ఆత్మయే. అయినా అపరవిద్యలో ఇదే ఆత్మగా చెప్తారు. దీనివలన తరువాత అసలు ఆత్మ దాకా వెళ్లవచ్చును. స్థూలారుంధతీ న్యాయము. కనుకనే బృహదారణ్యంలో చతుర్థాధ్యాయంలో **ఇక ముందు విద్యా విషయమయిన ఆత్మను చెప్పమని అడుగుతాడు.**

**శ్లో॥ ఆదిత్యేఽక్ష్ణి చ యోఽస్తి హృద్యసుభృతామ్మూర్ధేతి రాజేతి తం**
**బ్రహ్మేతి ప్రతియాత్యతిష్ఠ ఇతి యో మూర్ధా స రాజా భవేత్ ।**
**యశ్చన్ద్రే హృది పాణ్డరామ్బరధరస్సోమశ్చ రాజా బృహ-**
**న్నేవం సంవిదితః పుమాంస్తమయతే యస్సోఽక్షయాన్నో భవేత్ ॥77**

భావ॥ నామరూపముల ఆవరణలో ప్రాణమున్నది. అదే అందరికి ఆత్మ. ప్రాణమునకే విరాట్, హిరణ్యగర్భుడు, ప్రజాపతి మొదలయిన పేర్లు. కనుక వ్యష్టిగాని సమష్టిగాని ఇదంతా హిరణ్యగర్భమాత్రమే. **ఇది ప్రాణాత్మవాది అయిన గార్గ్యుని సిద్ధాంతము.** (తరువాత అజాతశత్రుని ఉపదేశంతో మారాడు)

ఆదిత్యుని యందు ప్రాణుల నేత్ర హృదయములందు మూర్ధ అని, రాజా అని అతిష్ఠుడని, ఉన్న పురుషుని బ్రహ్మముగా నుపాసించువాడు ప్రాణులందరికి రాజు మూర్ధ అతిష్ఠుడు కాగలడు. అట్లే చంద్రునియందును హృదయమునందును ధవళ వస్త్రుడై సోముడని, రాజు అని, బృహన్ అని ఉన్న పురుషుని బ్రహ్మమని భావించిన వాడు అక్షయమయిన అన్నము గలవాడగును. (ధవళ వస్త్రములు అనగా ప్రాణమునకు జలము వస్త్రమని. జలము తెలుపు గనుక తెల్లని వస్త్రము గల ప్రాణపురుషుడే బ్రహ్మమని ఉపాసన.) 77

**శ్లో॥ శమ్పాయాం త్వచి సన్తమన్తరపి యస్తేజస్వినం పూరుషం**
**బ్రహ్మేతి ప్రతిచిన్తయేత్స పురుషస్తేజస్స్వ్యయం జాయతే ।**
**వ్యోమ్ని స్థం హృది చాప్రవర్తినమిమం పూర్ణాభిధం పూరుషం**
**బ్రహ్మ ధ్యాయతి యః పుమానవిరతః పూర్ణస్స కామైర్భవేత్ ॥ 78**

భావ॥ మెఱుపునందు చర్మమునందు హృదయమునందు ఉన్న తేజస్వి అను పేరుగల పురుషుని బ్రహ్మముగా ఉపాసింపవలయును. అట్టి ఉపాసకుడు తేజస్వి కాగలడు. ఆకాశమునందు హృదయమునందును ఉన్న "అప్రవర్తి" మరియు పూర్ణుడు అను పురుషుని బ్రహ్మముగా ధ్యానించినవాడు పూర్ణకాముడగును. అవిచ్ఛిన్న సంతానుడగును. అనగా వంశము సాగును. 78

**శ్లో॥ యో వాయావపరాజితోఽ సుషు మతౌ వైకుణ్ఠ ఇన్ద్రో బృహ-**
**త్తం యో ధ్యాయతి సోఽపరాజిత ఇహ స్యాజ్జిష్ణురేవ ద్విషామ్ ।**
**అగ్నౌ వాచి మతౌ విషాసహిమథో బ్రహ్మేత్యుపాస్తే తు య-**
**స్స స్యాదేవ విషాసహిః కులమపి స్యాదస్య తాదృగ్ధ్రువమ్ ॥ 79**

భావ॥ వాయువునందు అపరాజితుడని ప్రాణములందు వైకుంఠుడని, మతియందు ఇంద్రుడని ఉన్న పురుషుని ఎవడయితే బ్రహ్మముగా ధ్యానము చేయునో అతడు శత్రువిజేత అపరాజితుడు అగును. అగ్నియందు వాక్కునందు బుద్ధియందు ఉన్న "విషాసహి" అను పురుషుని బ్రహ్మమని ఉపాసన చేయువాడు "**విషాసహి**" అగును. అతని వంశము **విషాసహి** అగును. 79

విశే॥ విషం అనగా విష్యతే = క్షిప్యతే పడవేయబడును కనుక హవిస్సు. దానిని భస్మీకరించటం ద్వారా సహిస్తాడు అనగా తట్టుకొంటాడు కనుక అగ్ని విషాసహి. అలాగే శత్రువులను చంపటం ద్వారా తట్టుకొని నిలబడతాడు కనుక 'విషాసహి'.

**శ్లో॥ యశ్చాప్సు ప్రతిరూప ఇత్యమమయేద్బ్రహ్మేతి యస్తం సమం**
**సంయాయాత్ప్రతిరూపమేవ తనయో జాయేత తాదృక్తతః ।**
**రోచిష్ణుం పురుషన్తు దర్పణగతం బ్రహ్మేత్యుపాస్తే తు యో**
**రోచిష్ణుస్స పుమాన్భవేదపి కులం రోచిష్ణు సర్వాతిగమ్ ॥ 80**

భావ॥ జలమునందు రేతస్సునందు, హృదయమునందు "ప్రతిరూపుడను" దేవుడు గలడు. ఆయనను బ్రహ్మముగా నుపాసించువాడు అందుకు సమానమయిన కులమును, తనకు ప్రతిరూపుడయిన కుమారుని పొందగలడు. దర్పణమునందున్న కాంతిశాలి అయిన పురుషుని బ్రహ్మముగా ఉపాసించిన వానికి కాంతిశాలి అయిన పుత్రుడు కలుగును. అతని వంశమున్ను కాంతివంతమగును. 80

**శ్లో॥ అస్వాఖ్యం ప్రతిశబ్దమఞ్చతి పుమాన్బ్రహ్మేతి యోఽస్మిన్ స నా**
**సర్వఞ్చాయురుపైతి పూర్వమముకం కాలాదసుర్న త్యజేత్ ।**
**దిక్ష్వో యోఽనపగో ద్వితీయ ఇతి తం బ్రహ్మేతి యో ధ్యాయతి**
**స్యాత్సోఽయం పురుషో ద్వితీయసహితశ్చిద్యేత నాస్మాద్గణః ॥ 81**

భావ॥ 'అసువు' అను ప్రతిశబ్దమును (మనిషి నడుచునపుడు వచ్చే గాలివేగపు శబ్దం) బ్రహ్మముగా నుపాసించువాడు పూర్ణాయువును పొందును. వాడు అకాల మరణమును పొందదు. దిక్కులందు అనపగుడని, అద్వితీయుడని, ఉన్న ఒక పురుషుని బ్రహ్మముగా సేవించినచో ఆ ఉపాసకునకు అనుచరులు బహుళముగా నుండెదరు. (దిక్ = చెవులయందు, హృదయము నందు) 81

**శ్లో॥ మృత్యుం యః పురుషం సదా బృహదితి చ్ఛాయామయం ధ్యాయతి**
**స్యాత్పూర్ణాయురయం భజేత న పురా కాలాత్తు మృత్యుం క్వచిత్ ।**
**ఆత్మస్థం పురుషం విచిన్తయతి యో బ్రహ్మేతి చాత్మన్వినం**
**లోకే స్యాదయమాత్మవానపి కులం తస్యాత్మవత్సమ్భవేత్ ॥ 82**

భావ॥ మృత్యువను పేరుగల ఛాయామయ పురుషుని బ్రహ్మముగా సేవించువాడు పూర్ణాయువగును. వానికి అకాలమృత్యువు రాదు.

ఆత్మ అనగా విరాట్టునందు బుద్ధియందు హృదయమునందు ఉన్న "ఆత్మన్వి" అను పురుషుని బ్రహ్మగా ఉపాసించినవాడు ఆత్మవంతుడగును. అనగా జితేంద్రియుడగును. అతని వంశముగూడా జితేంద్రియమగును.

'ఆత్మవంతుడు' అను పదములో 'ఆత్మ' = శరీరము. 82

**శ్లో॥ రాజన్ సోమ బృహన్నసో ఇతి పుమాన్ సుప్తస్సమాకారితో**
**నైవోత్తిష్ఠతి పాణినా తు నిహతో దేహే ప్రబుద్ధ్యేత సః ।**
**తద్విజ్ఞానమయోఽన్తరస్తి పురుషో భోక్తా శరీరస్య య-**
**స్స బ్రహ్మైవ నచేతరస్తు యదిదం స్యాత్మాఖిలప్రాణినామ్ ॥ 83**

భావ॥ రాజన్, సోమ, బృహన్ అసో! అని పిలిచినంతమాత్రమున ఈ సుప్త పురుషుడు లేవడు. అలాగ తేజస్వీ! అప్రతివర్తీ! ప్రాణా! అని పిలిచినా లేవడు. కనుక వారు ముఖ్య బ్రహ్మములు కారు. చేతితో దెబ్బ వేసినచో సుప్త పురుషుడు లేచి కూర్చొనును. వాడే. విజ్ఞానమయుడయిన అంతర పురుషుడు. అతడే శరీరమునకు భోక్త. అతడే అఖిల ప్రాణులకు ఆత్మ. 83

విశే॥ 1. ప్రాణం బ్రహ్మ కాదు. బ్రహ్మం అయితే భోక్త కావాలి. "సలిల ఏకో ద్రష్టా". ఆయనకు భిన్నమయినదంతా భోగ్యమే. "నాన్యోతోస్తి ద్రష్టా" గదా!

2. భోక్తా – అనగా తినటం అనే భోజనం చేసేవాడు కాదు. అనుభవం. జ్ఞానం. తినటమయితే దేహం చేసే పని. అది ఆత్మకాదు. అలాగే కర్మఫలభోగం గూడా ఇచ్చట భోగం కాదు. కర్మఫలములు తనవిగా గమనించటమే భోగం. 'తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి" అన్నచోట గూడా పిప్పలం = కర్మఫలమును తనదిగా భావిస్తున్నాడు అనే అర్థము. ఆత్మ తినటం ఉండదు. అనగా సంగం కలిగియున్నాడు. సుఖదుఃఖాలను ఎవరూ తినలేరు కదా! "అనశ్నన్ అన్యాః" అన్నచోట అనశ్నన్ అనగా అసంగుడై గమనించటం అని అర్థం. అనగా సంగంతో తనవి అని దర్శించటం భోగం. అసంగంతో తనవి కాదని దర్శించటం "సాక్షిత్వం" అదీ తేడా.

3. కనుక జ్ఞాతృత్వమే భోక్తృత్వము. అది శబ్దాది విషయ గ్రహణం. అట్టి పని ప్రాణం చేయదు. కనుకనే "రాజన్" మొదలయిన పిలుపులు ప్రాణం మీద పనిచేయలేదు. సుషుప్తిలో ఉండేది, పని నడిపేది ప్రాణమే కదా! కనుకనే వ్యక్తి లేవలేదు. ప్రాణం గూడా నిద్రపోయిందనటం కుదరదు. దానికి స్వప్నాలు సుషుప్తులు జాగరణలు లేవు. కనుక దేహం నిశ్చేష్టం. పురుషుడు శయనించాడు. ప్రాణం పనిచేస్తూనే ఉంటుంది. (అది గుండె వంటిది) శ్వాస కదా!

(ప్రాణం మేల్కొని యున్నదే కనుక అది రాజన్! సోమా! పాండరవాసా! అని పిలిస్తే పలకాలి. కనీసం లేవాలి. ఇంద్రియాదులు మనస్సుతో సహా నిద్రలో ప్రాణంలోనే ఉంటాయి గదా! కనుక ప్రాణం ఆత్మ కాదు.)

4. పురుషుడయితే దెబ్బలను, కుదుపును, తన తల్లిదండ్రుల స్వరమును, లేదా పెద్ద శబ్దమునో గ్రహించగలడు (భోక్త) కనుక లేస్తాడు. (కోమాలో ప్రాణం ఉన్నా ఇవేవి గ్రహించలేడు.) సుషుప్తిలో ఇంద్రియ సామీప్యం లేనందువలన పలుకడు. జీవుడు విభువు. సర్వవ్యాపి అయినా బుద్ధిలో పరిచ్ఛిన్నముగానే ఉంటాడు కనుక ఇంద్రియ సామీప్యం కలుగదు. అంతమాత్రం చేత అతడు బ్రహ్మం కాదనరాదు. బుద్ధి, దానిపరిచ్ఛేదం అంతా తత్త్వరీత్యా మాయికం మిథ్య గదా!

కనుక సుషుప్తిలో జీవుడు హృదయాకాశంలో ఉంటాడు. (ఆనందమయకోశం). కనుక ఇంద్రియ సంబంధం ఉండదు. (విజ్ఞాన మనోమయకోశాలు మూసికొని ఉంటాయి)

4. ప్రాణం అచేతనం కనుక భోక్త కాదు. ఇంద్రియాలున్నా అంతే. దానికి ఇంద్రియ సంబంధం నియతం. కనుక సుషుప్తిలో ప్రాణం భోక్త కాదు. అదే న్యాయంతో జాగరణంలోనూ భోక్త కాదు.

5. జీవునకు కరణములతో సంబంధం ఉండదు. బుద్ధి ద్వారానే సంబంధం. కనుక

జీవుడు సుషుప్తిలో పలకకపోవటం యుక్తం. చేతన జీవుడే భోక్త. అచేతన ప్రాణము భోక్త కాదు. ఈ "కాశ్యని" మతం సరి అయినది.

6. భోక్త అంటే జ్ఞాత అనగా తెలిసికొనటం మాత్రమే. అది వికారం కాదు. కనుక భోక్త అయినా జీవుడు బ్రహ్మమే. నిర్వికారముగానే దర్శించవచ్చును. అయితే ప్రాణం గూడా ద్రష్టయే. నేత్రాలు మూసికొనటం వలన సుషుప్తిలో ఆ సంగతి తెలియదు అని ప్రశ్న. చెవులు ముక్కులు మూసికొని లేవు గదా! శబ్దములు వాసనలు ఎందుకు అందవు? జ్ఞాత అన్న తరువాత అది దాని శక్తి కనుక ఎప్పటికి పోదు. అగ్నికి దహనశక్తి పోదు. మణిమంత్రాదుల వలన అగ్ని శక్తిలాగా ప్రాణానికి ఉన్న జ్ఞాన శక్తి నిద్రవలన ప్రతిబద్ధమయినదంటారా? అలా అయితే నిద్రలో ఊపిరిగూడా ఆగాలి గదా!

7. ప్రాణమునకు జ్ఞానశక్తి క్రియాశక్తి రెండూ ఉన్నాయందాము. నిద్రవలన జ్ఞానశక్తి ఆగుతుంది. క్రియాశక్తి అయిన "ఊపిరి" నడుస్తుంది గదా! మరణంలో రెండూ ఉండవు గనుక (జ్ఞాన క్రియలు) అన్నీ పోతాయి. సమా -

మేము చెప్పేది స్వరూప జ్ఞానము. ఇపుడు మీరు చెప్పిన జ్ఞానశక్తి క్రియా రూపము. అనగా క్రియాశక్తిలో భాగమే. నిద్రవలన క్రియాశక్తి ఆగినపుడు జ్ఞానమనే క్రియగూడా ఆగాలి. ప్రాణానికి జ్ఞానం ఉన్నదనటానికి ప్రమాణాలు లేవు. "నేను చూస్తున్నాను" మొదలయిన అనుభవాలు మరోరకంగా గూడా కుదురుతాయి. పైగా ప్రాణము జీవునకు తెలుసు - ఇది నా ప్రాణము - అనుకొనటం ఉన్నది. ప్రాణధర్మములయిన ఆకలిదప్పికలు జీవుడనుభవిస్తాడు గదా! కనుక భోక్తయే ధర్మి కావాలి. అదిజ్ఞేయం కాదు. తన ధర్మము తనకే తెలియదు గదా! జ్ఞేయ ధర్మం గల వస్తువు జ్ఞాత కాదు. జ్ఞేయం జ్ఞేయమే - జ్ఞాత జ్ఞాతయే. కనుక జ్ఞేయమయిన ప్రాణము భోక్త కాదు. ప్రాణం అందుకే - అనాత్మ. భోక్తయే ఆత్మ.

8. సుషుప్తిలోనయినా జీవుడు భోక్తయే. అజ్ఞానానందములను అనుభవిస్తాడు. "న కించిదవేదిషం" సుఖమహమస్వాప్సమ్" (ప్రాణానికి అసలు ఏరకమయిన భోక్తృత్వం ఉండదు. అచేతనం గదా!) కాని శబ్దాది విషయ భోగం జాగరణస్వప్నాలలోలాగా ఉండదు. ఇంద్రియాలు పని చేయవు గదా! ప్రాణమునకు నిద్రలో అనుభవం లేదనటానికి కారణం నిద్రపోయినవానిని పిలచినా పలకక పోవటమే. ఒకవేళ పలికినా పెద్దగా పిలిస్తేనే పలుక గలుగుతాడు. కాని ప్రాణమే ఆత్మ అయితే ఇంద్రియాలు దానిలోనే ఉంటాయి కనుక చిన్నగా మామూలుగా పిలిచినా పలుకవలెకదా! కనుక ప్రాణం, భోక్త కాదు.

9. జీవునకయినా నిద్రలో మెల్లగా పిలిస్తే వినబడకపోవచ్చు గదా! కనుక జీవుడు మాత్రం భోక్త ఎలా అవుతాడు? అలాగే జీవుడు చెవిటి వాడయితే, పెద్ద శబ్దమయినా వినబడదు

కదా! సమా – **"ఖాదిత్యదీపితే కుడ్యే దర్పణాదిత్య దీప్తివత్ కూటస్థ భాసితో దేహో ధీస్థజీవేన భాస్యతే"** అనగా "సూర్యుని ఎండలో వెలుగుతున్న గోడమీద అద్దంలో సూర్యుని ప్రతిబింబకాంతి పడినట్లు **కూటస్థ భాసితమయిన దేహము బుద్ధిగతమయిన జీవ చైతన్యము చేత విశేషంగా భాసించును".**

కనుక **శరీరంలో కూటస్థ సామాన్య చైతన్యము, జీవ విశేష చైతన్యము అభాసంగా ఉన్నాయి. కనుక కూటస్థ చైతన్య సంబంధం వలన పెద్ద శబ్దం అయితే చూచాయగా అందుతుంది.** ఈ చైతన్యము సూక్ష్మంగా సర్వేంద్రియవ్యాప్తం కనుక శబ్దం అందుతుంది. (కనులు మూయటం వలన దృశ్యం అందదు) (ఏదయినా వెలుగు తీవ్రంగా మొహం మీద పడితే మెలకువ రావచ్చును) ఈ శ్రవణం సంకల్ప పూర్వకంగా వినే సంగీతం వంటిది కాదు. **కనుక ఆకస్మిక శబ్దం వినటానికి మనస్సు – ఇంద్రియ సంయోగం అవసరం లేదు.**

10. కొందరంటారు. జీవునకు ఇంద్రియాదులు అవసరం. ఈశ్వరునకు వాటి అవసరం లేదు. అందువలన కూటస్థ చైతన్యం ఇంద్రియాపేక్ష లేకుండానే నిద్రపోవు వానిని లేపును. "ఈ పిలుపులో ఉన్నది నా పేరే' అని వానికి తెలుస్తున్నది గదా!

11. సుషుప్తిలో ఇంద్రియాలు తమచోట ఉండవు. అవి అన్నియు, హృదయ పుండరీకంలో బుద్ధిలోపల లీనమవుతాయి.

12. కనుక జీవుడుంటేనే విషయాది భోగాలు. లేదంటే లేవు – కేవల ప్రాణంతో కుదరదు. సాక్షి చైతన్యంలోనూ భోగం లేదు. ప్రాణం ఉన్నా సుషుప్తిలో భోగం లేదు కదా!

13. మరణంలో ప్రాణాభావం మూలంగా వచ్చిన జీవాభావం వలననే భోగం లేదనాలి. జీవాభావం అంటే అర్థం కూటస్థుని అభావం కాదు. అతడు నిత్యుడు. బుద్ధిలో ప్రతిబింబంగా గాని, అవచ్ఛిన్నంగా గాని జీవుడు అనిత్యుడే. ఉపాధి అయిన బుద్ధి అనిత్యం కదా! లేదంటే నిత్యవస్తువుకు నిద్ర మొదలగు వికారాలుండవు. ఈశ్వరుడు నిరంతర నిర్నిద్రుడు గదా! జీవుడు విజ్ఞానమయుడని అన్నా ఆ విజ్ఞానం బుద్ధియే. అది జన్యమే. లేదా, విజ్ఞానం ప్రచురంగా గలవాడు, విజ్ఞానమునందు దొరకేవాడు. విజ్ఞానం అనగా చైతన్యం. దానియొక్క కోశం అనగా బుద్ధి. దానియందున్నట్లు అధ్యాసవలన విజ్ఞానమయుడు. విజ్ఞాన ప్రతిబింబం కనుక విజ్ఞానమయుడు. విజ్ఞానము బుద్ధిలో ప్రతిబింబించి జీవుడగును. ప్రతిబింబం బింబము యొక్క వికారము.

14. "బుద్ధ్యవచ్ఛిన్నుడు జీవుడు" అను పక్షంలో, జీవుడు బ్రహ్మ ఒకటే. ఘటావచ్ఛిన్న – ఆకాశం మహాకాశం ఒక్కటే కదా! అయితే ప్రతిబింబ పక్షంలో జీవుడు బ్రహ్మం ఒక్కటే అనటం ఎలా? – సమా – బింబ ప్రతిబింబ చైతన్యములు ఒకే చైతన్యము కదా! ఒకే చైతన్యం

ఉపాధి వలన బింబం – ప్రతిబింబం అయినది. కనుక అద్వైతం కుదిరింది. ప్రతిబింబం మిథ్య కాదు. అలా అయితే బింబం గూడా మిథ్యయే. ఉపాధిపోతే ప్రతిబింబం పోతుంది గాని బింబం పోదుగదా! కనుక మిథ్య కాదంటారా? – ఉపాధిలేనపుడు “బింబం” అనటం ఎలా? రథం ఉంటేగదా రథికుడు. అద్దం లేని వేళలో ముఖం బింబమూ కాదు. ప్రతిబింబమూ లేదు. ఇదంతా ఔపాధికం. కనుక మిథ్య. తిమిరరోగం వలన చంద్ర ద్వయం కనబడినట్లు దర్పణ మాయ వలన ఒకే వస్తువు బింబ ప్రతిబింబములుగా రెండుగా కనబడ వచ్చును. కాని వస్తువు ఒకటే కదా! కనుక బింబ ప్రతిబింబములలో ఏది మిథ్య. ఏది సత్యం చెప్పటం కష్టం. సరే ప్రతిబింబం మిథ్య అన్నా మనకు ఇబ్బంది లేదు. వాటియందు అనుగతంగా ఉన్న చైతన్యం మిథ్య కాదు గదా! అది బ్రహ్మమే.

కనుక ప్రతిబింబ జీవుడయినా బ్రహ్మమే. అనుగతమయినా చైతన్యం అదే గదా! కనుక భోక్త సర్వదా జీవుడే. అతడే బ్రహ్మం. ప్రాణం భోక్త కాదు. బ్రహ్మం కాదు.

**శ్లో॥ విజ్ఞానేన సమాకలయ్య కరణప్రజ్ఞానశక్తిం పుమాన్**
**హార్దాభ్రే స్వపదేఽస్త్యతస్స్వపితి నేత్యాచక్షతే పణ్డితాః ।**
**వాగాదావుపసంహృతే చ కరణగ్రామే తదానీం పుమా-**
**నధ్యాసస్య వినాశతో న కిమయేత్స్వాత్మానమేవాద్వయమ్ ॥ 84**

భావ॥ పురుషుడు అంతఃకరణ ప్రతిబింబితమయిన చైతన్యముతో తన ఇంద్రియ జ్ఞానములను ఉపసంహరించికొని తన ఉపలబ్ధి స్థానమయిన హృదయాకాశమునందు – స్వపితి. తనలో తనే లీనమగును – అని పండితులందురు. అలా ఎందుకంటారు? – సమా – వాక్కు మొదలయిన ఇంద్రియసమూహము ఆపుకొనబడినది. అంతఃకరణం వ్యాపారరహితమయింది. అందువలన అధ్యాస. దానివలన వచ్చిన సంసారమూ లేదు. కనుక పురుషుడు అద్వితీయమయిన తన ఆత్మలో కలియును. 84

విశే॥ 1. ఆత్మను పొందినపుడు ముక్తునికి లాగా ప్రతిజీవికి సుషుప్తిలో ముక్తి రావలెను. కాని రాదు. ఎందుకంటే అజ్ఞానం అలాగే ఉన్నది కనుక. (పాల పాకెట్టు నీళ్లలో పడవేసినా పాలు కలవవు. చుట్టూ ప్లాస్టిక్ పొర ఉన్నది గదా! అట్లే అజ్ఞానావరణం ఉన్నది). అందువలన ఆత్మలో కలిసినా అది తెలియదు.

(నిద్రలో నడిచేవాడు ఎంతనడిచినా ఏమీ తెలియదు) చూడండి. ‘సతి సంపద్యన విదుః సతి సంపత్స్యామహ ఇతి’

2. సుషుప్తిలో ఆత్మలో కలిసిన యీ జీవుడు ప్రతిబింబజీవుడా? – కాదు. ప్రతిబింబం బింబంలో కలియదు. అవచ్ఛిన్న జీవుడా? – కాదు – అవచ్ఛిన్నుడుగా ఉన్నవాడు మరల తన

ఆత్మలో ఉండలేదు. మరి ఎవరు? – సమా – ఎ) ఉపాధి ఉంటే బింబము వలన ఏర్పడిన ప్రతి బింబము లేదా అవచ్ఛిన్నమయిన చైతన్యము. ఉపాధి పోయిన తరువాత ప్రతిబింబత్వం లేదా అవచ్ఛిన్నత్వం అను ధర్మములను వదలి కేవల చైతన్యంగా ఉంటుంది. కనుక ఇబ్బంది లేదు.

3. జీవుడు ప్రతిబింబము కాదు. అవచ్ఛిన్నుడూ కాదు – బుద్ధిలో దొరకుతాడు. కనుక బుద్ధికి సాక్షి కనుక బుద్ధ్యవచ్ఛిన్నుడని అంటారు – అనే మతంలో జీవుడెపుడూ తనయందే ఉంటాడు కనుక సుషుప్తిలోనూ అదే స్థితి అనటంలో ఇబ్బంది లేదు. ఈ మతంలో జాగరణలో బుద్ధి ఉండటం వలన తేడా ఉంటుంది. ఆత్మను బుద్ధి యందున్నాడంటారు. సుషుప్తిలో బుద్ధి లేదు గనుక తనయందే ఉన్నాడంటారు. (సూర్యుడాకాశమునందే ఉన్నాడు. అద్దం ఉంటే అద్దంలో ఉన్నట్లు అనిపిస్తుంది.)

4. అయ్యా! మొదట చెప్పిన అవచ్ఛిన్న పక్షానికి ఇపుడు చెప్పిన అవచ్ఛిన్న పక్షానికి తేడా ఏమిటి? సమా – బుద్ధితాదాత్మ్యాధ్యాస వలన బుద్ధి విశిష్టుడు మొదటి బుద్ధ్యవచ్ఛిన్నుడు.

బుద్ధియందు కనబడుచూ బుద్ధికి సాక్షికనుక బుద్ధ్యవచ్ఛిన్నుడని రెండవది. (ఉపహితుడు.)

సారాంశము : సుషుప్తియందు పురుషుడు కూటస్థుడుగా ఉంటాడు.

**శ్లో॥ స్వప్నేఽసావుపసంహృతేన్ద్రియచయో దేహే మహారాజవ–**
**ల్లోకమ్పాలయతి క్వచిత్క్వచ ఋషిర్గుహాం విధత్తే తపః ।**
**వ్యాఘ్రానుద్రుతవత్కదాచిదయతే భీతిం మృతః ఖిద్యతే**
**తద్వజ్జాగ్రతి చేతి సంసృతిరియం మిథ్యైవ శుద్ధః పుమాన్ ॥ 85**

భావ॥ పురుషుని అసలు ధర్మమేది? ఆగంతుక ధర్మమేది? కూటస్థత్వమా? సంసా–రిత్వమా? ఏదీ గూడా స్వాభావికం కాదనిపిస్తున్నది. స్వాభావిక మయితే నిత్యం. మారదు కాని ఇక్కడ సుషుప్తిలో ఒకరకము జాగర స్వప్నములలో మరొక రకము అనగా సంసారిత్వం. ఈ లెక్కన కూటస్థత్వం అనిత్యమయితే అందుమూలంగా వచ్చే మోక్షము జ్ఞానము అనిత్యమనవలసి వస్తుంది – అని ప్రశ్న – సమా – కూటస్థత్వమే వాస్తవము. సంసారిత్వం ఔపాధికము. అనిత్యము. విజ్ఞానమయుడయిన జీవుడు స్వప్నావస్థలో ఇంద్రియములన్నింటిని మూటకట్టికొని పరివారమును తనతోనుంచికొన్న మహారాజువలె నుండును. సుషుప్తిలో ఋషివలె గుహలో నుండి తపస్సు చేయును. జాగరణంలో ఒక్కొక్కసారి పెద్దపులి వెంబడించినట్లు భయపడి పరుగెత్తుచుండును. మరణించి బాధపడును. అదేవిధంగా ఋషి కావచ్చును. కనుక ప్రత్యక్షంగా కనబడే యీ సంసారం సుఖదుఃఖభోగాది రూపమయినది. ప్రపంచరూపమయినది. మిథ్య. పురుషుడయిన జీవుడు శుద్ధమయినవాడు. కూటస్థుడు. 85

విశే॥ 1. ప్రత్యక్షమయిన సంసారం భ్రమ. ప్రమకాదు. అది బాధితము గదా! స్వప్న సంసారంలాగా మామూలు సంసారం గూడా జ్ఞాన బాధితము. కనుక రాకపోకలు గలదికనుక ఇది మిథ్య. అలాగే స్వప్నంలాగే ఈ మహారాజాది భోగాలు కనబడినంతసేపే ఉంటాయి. తరువాత ఉండవు. రజ్జు సర్పం వంటివి. జాగరణ పదార్థాలు గూడా అంతే సుషుప్తి మొదలగు వానిలో అవి ఉండవు. కనుక స్వప్నం ఎంతో జాగరణం అంతే. ఇది దీర్ఘకాలిక స్వప్నం. బ్రహ్మజ్ఞానంతో బాధితం. అంతే తేడా.

2. స్వప్నంలో 5-6 అడుగుల శరీరంలోనే ఉండే జీవుడు అందులోనే రాజవుతాడు. రంగప్ప అవుతాడు. సకల తీర్థాలు సకల దేశాలు పర్యటిస్తాడు. సకల పరిజనులు ఇల్లు వాకిలి అన్నీ ఉంటాయి. ఇవన్నీ వాడి శరీరంలో ఎలా సాధ్యం? ఋషి ఎలా అవుతాడు? ఇంట్లో మంచం మీద గుహ ఎక్కడిది? తానే చచ్చినట్లు తానే కలలో చూడట మేమిటి? ఇది వాస్తవం కాదని భ్రమ అని తరువాత తెలుస్తుంది. కాని కల చూచేటప్పుడు మాత్రము అలా తెలియదు.

3. తత్త్వజ్ఞానం లేనివానికి ప్రపంచమూ ఇంతే. జ్ఞానం కలిగితే, మేల్కొన్నవానికి స్వప్నం అర్థమయినట్లే ఇదంతా అర్థమవుతుంది. అద్వితీయ బ్రహ్మమునందు సంసారం భ్రాంతి. కల్పితం. స్వప్నదశలో నాయందే అన్నీ కల్పింపబడినవి కదా! కనుక అంతా మిథ్య అని తెలుస్తుంది. అంతా కల్పితమని తేలిన తరువాత బ్రహ్మం సంసారి కాదు. కూటస్థుడే నని నిశ్చయం కలుగుతుంది.

4. సంసారిత్వం వచ్చినా అది మిథ్య కనుక వాస్తవమయిన కూటస్థతకు భంగము లేదు. ఆకాశం నీలంగా కనబడినంతమాత్రమున నిజంగా నీలం కాదు గదా! ఎండమావి నీటిలో బురద రాదు గదా! కనుక అసంగమయిన ఆత్మకు ప్రపంచంతో సంగం మిథ్య కదా! బుద్ధితో సంబంధం ఉన్నంత మాత్రాన సంగం ఉన్నట్లు కాదు. ఘటంలోని గగనం జలంలో ప్రతిబింబించిన సూర్యుడు శుద్ధంగానే ఉన్నారు కదా! జల ప్రతిబింబం జలంతో పాటు చలించినా అసలు బింబానికి చలనాలు మలినాలుండవు కదా! **కనుక ప్రతిబింబ చలనంగూడా జల చలనం వలన వచ్చిన భ్రాంతియే గదా! (చలనాధ్యాస).** ఉపాధి సన్నిధానం వలన బింబమే ప్రతిబింబం అయింది. కనుక అది బింబం కన్న భిన్నం కాదు. **అందుచేత ప్రతిబింబంలోనూ బింబంలో లేనివి ఏవీ కనబడవు.**

5. అవచ్ఛేద వాదములో, ఘటాకాశదృష్టాంతం కుదరదు. ఆకాశం జడం. దానికి ఘటతాదాత్మ్యాధ్యాసం కుదరదు. జీవుడు చేతనుడు కనుక ఇతనికి బుద్ధి తాదాత్మ్యాధ్యాస కుదురుతుంది కనుక జీవుడు అశుద్ధుడే - సమా - అదంతా మిథ్య కనుక జీవుడు శుద్ధుడే. అశుద్ధత్వం మిథ్య. లేదంటే దేహజీవులకు గూడా అన్యోన్య తాదాత్మ్యాధ్యాస వలన అన్యోన్య

వాదములు మిథ్య కాదు. వాస్తవమే అంటే జీవునకు జనన మరణాది ధర్మాలు వాస్తవమనాలి. అనగా జీవుడు నిజంగా చావాలి. మరో జీవుడు క్రొత్తగా పుట్టాడు. ఇది నాస్తికం అవుతుంది. కృతహాని అకృత ప్రాప్తి అవుతుంది. మొత్తం కర్మకాండ వ్యర్థం అవుతుంది. కనుక జీవుడు శుద్ధుడే.

**శ్లో॥ సాహస్రాణి హితాః పురీతతమితి ద్వాసప్తతిః ప్రస్థితా**
**నాడ్యో వై హృదయాత్పురీతతి పుమాన్ శేతేఽవసృప్త స్తతః ।**
**పీత్వా స్తన్యరసం శిశుర్వ సకలాన్భోగానవాప్యేశ్వరః**
**స్వాత్మానం సమవాప్య యోగివదయం నన్దన్న కిఞ్చిద్విదన్ ॥ 86**

భావ॥ "హితలు" అను పేరుగల నాడులు 72000 కలవని యోగశాస్త్ర భావము. హృదయమునుండి "పురీతత్" అను నాడి వద్దకు బయలుదేరును. ఆ పురీతత్తునందు (హృదయంచుట్టూ ఉన్న పొర) దానిలోపల పురుషుడు సర్వ వ్యాపార విముఖుడై, "స్తన్యము త్రాగిన శిశువు వలె" సకల భోగములను పొంది పూర్ణకాముడై తనను తానే పొంది యోగివలె ఆత్మానందమనుభవించుచు ఏమియు ఎఱుగనివాడై పరుండును. 86

విశే॥ 1. పుండరీకాకారమయిన హృదయకోశంలో బుద్ధి ఉంటుంది. అదే అంతః కరణము. అది ఛాతీలోపల ఉంటుంది. ఇది తన నాడీ గణమును ఆయా ఇంద్రియస్థానాలవైపు ప్రసారం చేసి ఉంచుతుంది. (Network) జాగరణ కాలములో విజ్ఞాన (బుద్ధి) మయుడయిన జీవుడు తన ఆత్మ చైతన్యంలో వ్యాపిస్తాడు. నిద్రలో అవి సంకోచపడితే జీవుడు సంకోచించుతాడు. అనగా బుద్ధి వికాసమనుభవిస్తే జాగరణం. సంకోచమనుభవిస్తే నిద్ర. బుద్ధి ఉపాధి. దానికి తగినట్లుండే జీవుడు ప్రతిబింబము. జల ప్రతిబింబమయిన చంద్రుడు జలానుగుణంగా ఉంటాడు. బుద్ధిని బట్టి అతడున్ను సుషుప్తికాలమున తప్తలోహంలో అగ్ని ఉన్నట్లు శరీరమంతయు వ్యాపించి యుండును. **అనగా శరీరమునందున్న బుద్ధిలోనున్న ఆత్మలో కలిసి శయనించి యుండును.** కర్మ ఫలమయిన బుద్ధిలో అనువృత్తుడై పురీతత్తులో నుండును. సుషుప్తిలో బుద్ధి సంకోచంలో ఆత్మకు సర్వశరీర వ్యాప్తి ఎలా కుదురుతుంది? అంటారా? – **బుద్ధి సర్వశరీర వ్యాప్తమే.** అయితే అది ఇంద్రియాల ద్వారా విషయానుభవం పొందితే వికాసమని, పొందకపోతే సంకోచమని అంటాము. అయితే మరి బుద్ధి స్థానం హృదయమని ఎలా పరిమితం చేశారు? – దీపం ఇంట్లో ఒకచోట ఉన్నా కాంతిరూపంగా అంతా వ్యాపించినట్లు **హృదయగతబుద్ధి విజ్ఞాన రూపంతో అంతా వ్యాపిస్తుంది**. అయ్యా! బుద్ధిలీనం కావటమే గదా! సుషుప్తి. మరల శరీరవ్యాప్తి ఏమిటి? **లీనం కావటం అంటే జ్ఞానం లేక పోవటమే**. అందుకు కారణం ఇంద్రియాదులు పనిచేయక పోవటం. ఇంద్రియాలలో బాహ్య జ్ఞానం కలిగిస్తాయి. మరి సుషుప్తిలో అంతర జ్ఞానం ఎందుకు లేదు? – అజ్ఞానంలో మునిగి యుండటం వలన– అంటాము.

2. బుద్ధి సర్వేంద్రియాలను ఆపికొని, తనకు కారణమయిన అజ్ఞానమునందు లీనమయినది. **ఆ అజ్ఞానం సర్వశరీరవ్యాపి కనుక అజ్ఞానం ద్వారా బుద్ధి దాని ద్వారా జీవుడు సర్వ శరీర వ్యాపులు**.

3. లేదా, తప్తలోహంలో అగ్నివలె జీవుడు బుద్ధిలోను, సర్వశరీరంలోనూ వ్యాపిస్తాడని తెలిసిన సంగతి. వస్తువు, శరీరము అంతా చైతన్య వ్యాప్తము. జీవుడు సుషుప్తిలో చైతన్యమాత్ర రూపుడు. కనుక శరీరమంతావ్యాపించి యుండటం హృదయాకాశంలో ఉండలం - అంతా ఏకార్థమే కనుక విరోధం లేదు.

4. కొందరంటారు. పురీతత్తు అని ఒకనాడి ఉన్నది. దానియందు బుద్ధి ప్రవేశిస్తే అచ్చుట సుషుప్తి. అచ్చుట జ్ఞానం లేదు గనుక. ఇతర నాడులలో సంచరించినపుడు సుషుప్తి లేదు. అచ్చుట జ్ఞానం ఉన్నది గనుక.

5. కనుక ఏదయిన అనగా పురీతత్తునందు శయనించునన్నా బ్రహ్మమునందు శయనించునన్నా పురీతత్తులోనున్న బ్రహ్మమునందే శయనించునని అర్థము. ఈ మతంలో జీవబ్రహ్మములకు అధారాధేయభావం ఉన్నది. దానియందు పరుండటం కదా! కనుక ఐక్యము లేదనాలి. అందువలన "సంపద్య" అను శ్రుతితో విరోధము. కనుక జీవునికి సుషుప్తిలో అనాత్మ తాదాత్మ్యా ధ్యాస లేదుగనుక సంసారం లేదు. కనుకనే "తీర్ణోహి తదా సర్వాన్ శోకాన్ హృదయస్య" అని శ్రుతి.

అనుభవమూ అంతే. సుషుప్తిలో జ్వరాది బాధలు తెలియవు. వైకల్యాది బాధలు తెలియవు. విషయ సుఖాలూ తెలియవు – భోగసాధనములు లేవంటారేమో? **అవిద్యావృత్తి ఉన్నది. దానివలన స్వరూపచైతన్యము నిద్రాసుఖమును, అజ్ఞానమును అనుభవిస్తున్నది**. అపుడు జీవుడు "అజ్ఞానోపహితబ్రహ్మం"గా ఉంటాడు. జాగరణంలో మాత్రం తాను సంసారినన్న విపర్యయ రూపమయిన అజ్ఞానంలో ఉంటాడు. సుషుప్తిలో ఈ విపర్యయం గ్రహించే ఇంద్రియాది సామగ్రి లేదు. (పూర్తి చీకటిలో రజ్జు సర్పం కనబడదు. రజ్జువూ కనబడదు.)

6. లేదా, అజ్ఞానశక్తులలో సుషుప్తియందు ఆవరణశక్తి మాత్రమే ఉంటుంది. విక్షేప శక్తి ఉండదు. కనుక సంసారం కనబడదు. ఆవరణరూపమయిన అజ్ఞానంలో బ్రహ్మ ప్రతిబింబం ఉంటుంది. కనుక ఆనందం ఉంటుంది. జాగరణంలోని అజ్ఞానంలో గూడా బ్రహ్మం తెలియక పోయినా ఆనందం ప్రతిబింబిస్తుంది గదా! అయ్యా! జీవుడు అపరోక్షం గదా! అతనే బ్రహ్మం అయితే ఆవరణం ఎలా ఉంటుంది. పరోక్షమయితే గదా అజ్ఞానావృతి అయ్యేది - సమా - జీవుడు బ్రహ్మమే అయినా తానే బ్రహ్మమని తెలిసేంతవఱకు పరోక్షత్వం లేదు. "నేనే దశముడను" అను జ్ఞానం కలిగేదాకా "దశముదున్నాడని" పరోక్ష జ్ఞానమే గదా ఉండేది.

7. జీవుడు సుషుప్తిలో కూటస్థుడుగా ఉంటాడన్నారు గదా! కూటస్థ దశలో అజ్ఞానం ఉండదు గదా! సూర్యునికి గూడా చీకటి అడ్డుపడుతుందా? సమా – సూర్యునికి చీకటికి శత్రుత్వం ఉన్నది. కాని బ్రహ్మమునకు అజ్ఞానమునకు అట్టి విరోధము లేదు. సూర్యుడు – ఘటములాగా ప్రకాశ్య ప్రకాశక భావమే. కూటస్థునివలననే అజ్ఞానం భాసిస్తుంది. (సూర్యుని వలననే రాహువు తెలుస్తాడు) కనుకనే చైతన్యము అజ్ఞానోపహితమవుతుంది. (సూర్యుడు – మేఘం లాగా.) బాధకంలో బాధ్యం నిలవదు గదా! అయ్యా! జీవుడు కూటస్థుడయితే సుషుప్తిలో అతను సర్వభాసకుడు, సర్వజ్ఞుడు కావాలి కదా? – సమా – **అతడు సర్వజ్ఞుడే. అతనికి ఏమీ తెలియదంటే అర్థం జ్ఞానం లేదని కాదు. అజ్ఞానమును, ఆనందమును అనుభవిస్తున్నాడని అర్థము. జీవుడు కూటస్థదశలో ఉన్నపుడు ద్వైత ప్రపంచమే లేదు. కనుక అతనికి విషయజ్ఞానముండదు.**

"యత్ర సర్వమాత్మైవాభూత్ తత్కేన కంపశ్యేత్ కేనకం జిఘ్రేత్" అనుభవం గూడా అలాగే ఉన్నది.

కనుక సుషుప్తిలో జీవుడు అజ్ఞానమును ఆనందమును అనుభవించుచు కూటస్థుడుగా నుండును.

**శ్లో॥ లూతాకీటవదుచ్చరన్తి గుణతో వహ్నేస్స్ఫులిఙ్గా యథా**
**తద్విజ్ఞానమయాత్సురా అపి సమే ప్రాణాశ్చ లోకాస్సమే ।**
**భూతాన్యాత్మన ఉచ్చరన్తి తమిమం సత్యస్య సత్యం విదుః**
**ప్రాణాస్సత్యమితి స్ఫుటఞ్చ భువనే సత్యఞ్చ తేషామయమ్ ॥ 87**

భావ॥ నోటి జిగురు దారాలతో సాలెపురుగులు తిరిగినట్లు అగ్నినుంచి రవ్వలు రేగినట్లు. ఆ విజ్ఞానమయుని నుంచి సమస్త దేవతలు సర్వ ప్రాణములు, ఈ లోకములు, ఈ భూతములు బయటకు వచ్చుచున్నవి. ఈ విజ్ఞానమయాత్మను సత్యమునకే సత్యమని అందురు. ఈ లోకమున ప్రాణములు సత్యములంటారు. "ప్రాణావై సత్యం" అట్టి ప్రాణముల కున్న ఈ ఆత్మ సత్యము. "ప్రాణస్య ప్రాణః" 87

విశే॥ 1. ఆత్మ భిన్నముగా ప్రాణములున్నాయి కనుక ఆత్మ అద్వితీయము కాదు – అని ఆక్షేపణ. – సమా – లూతాకీటములు, పైకి పోయినట్లు, నిప్పునుండి రవ్వలు రేగినట్లు, **ఈ సమస్తము కర్మవశమున విజ్ఞానాత్మనుండియే వచ్చినవి. కర్మవలననే ప్రపంచం పుట్టింది** – ఇందుకు సాలెపురుగు ఉదాహరణము. ఆత్మనుండియే ప్రపంచం పుట్టినది – దీనికి నిప్పురవ్వలు ఉదాహరణము. కనుక కారణం కన్న భిన్నమయిన ఏ పదార్థము లేదు గనుక ప్రాణాదులు భిన్న పదార్థములు కావు. అవి మిథ్యలు. వాటివలన బ్రహ్మం సద్వితీయం కాదు. జాగరణంలోనే

ఇలా ఉంటే స్వప్నంలో సంగతి మిథ్య అని చెప్పనవసరము లేదు. ఇక సుషుప్తిలో అసలు ప్రపంచమే కనబడదు. సర్వకారణం కనుక ఇది సత్యానికి సత్యము.

2. దేహనాశమయినా ప్రాణనాశం కాదు. కనుక ప్రాణములు సత్యము. అవి మరో దేహాన్ని లింగ శరీరం ద్వారా చేరుతాయి. కనుక సత్యములు. కాని మోక్షంలో ప్రాణమున్ను అసత్యమే. అది వ్యావహారిక సత్యము మాత్రమే.

3. 'యతోవా ఇమాని భూతా-' అను శ్రుతి వలన బ్రహ్మమునుంచి గదా భూతోత్పత్తి. అవును బ్రహ్మమే జీవుడు గదా! అందువలన జీవునినుంచి అనిగూడా అనవచ్చును. **బుద్ధిలో దొతికే బ్రహ్మమే జీవుడు.** "ఆత్మన ఆకాశస్సంభూతః" అని మరోశ్రుతి. ఆత్మ అనగా జీవునినుంచి సృష్టి అని చెప్పింది గదా! కనుక ఆత్మ "బ్రహ్మ" బ్రహ్మ = ఆత్మ.

**శ్లో॥ యః ప్రాణోఽస్తి శరీరమధ్యనిలయస్సోఽయం శిశుస్తస్య చా-**
**ధానం వర్ష్మ బలం నిగద్యత ఇతి స్థూణౌదనం దామకమ్ ।**
**ప్రత్యాధానమితి ప్రవేదయ ఇదం సప్తాప్యసౌ విద్విషో**
**భ్రాతృవ్యాన్వినివారయన్ పరతరస్వాత్మప్రవృత్తో భవేత్ ॥ 88**

భావ॥ 'హృది ప్రాణో గుదే పానః'' అన్నట్లు ప్రాణం హృదయస్థితము. అది శరీరమధ్యమునందున్న శిశువు వంటిది. దూడ వంటిది. దానికి శరీరం (వర్ష్మ) ఆధారం. బలం స్థూణ=కట్టుకొయ్య. అన్నము కట్టు త్రాడు. కం అనగా శిరస్సు ప్రత్యాధానము. ప్రత్యాధారము. ఈ విషయమును భావించినవాడు శత్రువిజేత అయి పరాత్పరమయిన ఆత్మయందు నిలుచును. శత్రువులు ఎవరంటే, తలలోనున్న ఇంద్రియములు (ప్రాణములు) కన్నులు 2, చెవులు 2, ముక్కులు 2, నాలుక 1. 7గురు శత్రువులు. వీటి వలన వచ్చు విషయాభిలాషలను జయించును. అనాత్మవర్గం కన్న భిన్నమయినవాడు పరాత్పరుడు. 88

**శ్లో॥ లోహిన్యాఽక్షణి రేఖయా త్వనుగతో రుద్రోఽమ్బుభిర్వారిదః**
**సూర్యస్తారకయాఽసితేన దహనశ్శుక్లేన దేవాధిపః ।**
**వర్తన్యాఽధరయా ధరోర్ధ్వగతయా ద్యౌరిత్యసావక్షితిః**
**ప్రాణం సప్తవిధాఽయతే శిశుమిదం వేత్తాఽక్షయాన్నో భవేత్ ॥ 89**

భావ॥ కంటియందలి అరుణరేఖ రుద్రుడు, కన్నీరు (కంట్లోని నీరు) మేఘము. నల్ల గ్రుడ్డు సూర్యుడు, తెల్లగ్రుడ్డు ఇంద్రుడు. క్రింది రెప్ప భూమి. పై రెప్ప ద్యులోకము - ఈ ఏడు రకాలది అక్షితి = క్షయము లేనిది. ఈ సప్త విధమయిన "అక్షితి" శిశువయిన ప్రాణమును సేవించును. ఈ శిశువును గూర్చి గ్రహించిన వానికి అన్నము అక్షయముగా లభించును. 89

**శ్లో॥ సన్ మూర్ధా చమసః స్మృతోఽధరబిలోఽసావూర్ధ్వబుధ్నో బుధై**
**రస్మిన్ ప్రాణమయం పరేణ నిహితం తద్విశ్వరూపం యశః ।**
**తత్తీరే ఋషయశ్చ సప్త నివస న్త్యక్షిశ్రుతిఘ్రాణకం**
**జిహ్వా చేతి హి సఙ్గతిం భజతి వా గ్యా బ్రహ్మణా సాఽష్టమీ ॥ 90**

భావ॥ క్రింద బిలము పైన కొప్పువంటి శిరస్సు గలది. చమసపాత్ర. అందులో సోమరసం పోస్తారు. కనుక **మన తల ఆ చమస పాత్ర** వంటిది. దీనికి పైన మాడు క్రింద 'నోరు' అను రంధ్రము ఉన్నాయి. దీనియందున్న ప్రాణమయమయిన అనగా నానారూపమయిన ఇంద్రియమయమయిన రూపము భగవంతునిచే నుంచబడినది. ఇది "యశః". యశోరూపము. దీనితీరమున నేత్ర, కర్ణ, నాసాగోళములు, నాలుక **అను ఋషులు ఏడుగురున్నారు**. శబ్దరాశిలో కలిసే వాక్కు 7వది. అనగా కన్ను 2, ముక్కులు 2, చెవులు 2, నాలుక 1, వాక్కు 1 = 8. 90

**శ్లో॥ సవ్యా గౌతమతి శ్రుతిర్నను భరద్వాజాయతేఽదక్షిణా**
**విశ్వామిత్రతి దక్షిణాక్షి జమదగ్న్యాఖ్యం కిలాదక్షిణమ్ ।**
**నాసైకా తు వసిష్ఠ ఇత్యభిమతాఽన్యా కశ్యపో యోత్తరా**
**వాగేవాత్రిరియం యదన్నమఖిలం వాచాద్యతేఽత్తిర్హి సః ॥ 91**

భావ॥ ఇందులో కుడి చెవి గౌతముడు. ఎడమ చెవి భరద్వాజుడు. కుడికన్ను విశ్వామిత్రుడు. ఎడమకన్ను జమదగ్ని. ముక్కు (కుడి) వశిష్ఠుడు. ఎడమ ముక్కు కశ్యపుడు. వాక్కు అత్రి. సమస్త అన్నమును వాక్కు తింటుంది కనుక అత్రి. కనుక వాక్కు అత్రి. పరోక్ష కరణం. ఇదంతా ఉపాసనకోసం చేయబడిన కల్పన. 91

**శ్లో॥ రూపే ద్వే బృహతః స్త ఏకమనయోర్మూర్తఞ్చ మర్త్యం స్థితం**
**సచ్చేతి ప్రథితం ధరామ్బుదహనాభిఖ్యం రసోఽస్యార్యమా ।**
**వాయ్వాకాశమయం త్వమూర్తమమృతం యత్త్యచ్చ రూపం పరం**
**తస్యైతస్య రసోఽర్కమణ్డలగతో దివ్యః పుమాన్ సంస్మృతః ॥ 92**

భావ॥ బ్రహ్మమునకు రెండు రూపములు. 1.మూర్తము 2.అమూర్తము. అందు మూర్తము మర్త్యము. అదే సత్. భూమి, జలము, అగ్ని. దీనికి సారము సూర్యుడు. అర్యమ. అమూర్తము అమృతము. వాయువు ఆకాశము. దీనిని త్యత్ అందురు. దీని సారము అర్క మండలమునందలి దివ్య శుద్ధ పురుషుడు. 92

విశే॥ 1.సత్యమునకు అనగా ప్రాణమునకున్ను సత్యము బ్రహ్మ. అయితే ప్రాణములు సత్యములు అని ఇపుడు వివరించుచున్నాడు.

2. బ్రహ్మయందు నామ రూపాత్మకమయిన మూర్తామూర్తములు మాయా కల్పితములు.

బ్రహ్మం అధిష్ఠానము. దానియందే పుట్టి దానియందే లీనమగును. ఈ మూర్తామూర్తములయందు అదే అనుగత పదార్థము. సర్పమునందు రజ్జువు. కుండయందు మట్టి.

3. మూర్తత్వం, మర్త్యత్వం, స్థితత్వం (అవ్యాపకం) సత్త్వం (ప్రత్యక్షం) ఈ 4 ధర్మాలు గలవి మూర్తములు. భూ జల వాయువులు.

అమూర్తం అమృతం, అస్థితం (అపరిచ్ఛిన్నం) = వ్యాపకం, పరోక్షం - ఇవి వాయువు ఆకాశములు. ఈ నిత్యత్వం వ్యాపకత్వం మూర్తములదృష్ట్యా మాత్రమే. బ్రహ్మ దృష్ట్యా కాదు.

4. ప్రత్యక్షం అనగా ఇచ్చట కంటికి కనబడటం. వాయువు చర్మమునకు తెలిసినా కంటికి కనబడదు.

5. ఇంతకుముందు సత్ = వాయువు ఆకాశములు. త్యత్ = పృథివీ జలాగ్నులు అని చెప్పి ఇపుడు అందుకు విరుద్ధంగా ఎందుకు చెప్పటం? సత్ = అనగా నిత్యం అనే అర్థంలో వాయువు ఆకాశం చెప్పాము. ప్రత్యక్షం అనే అర్థంలో భూజలాగ్నులు చెప్తాము.

6. దివ్యపురుషుడు హిరణ్యగర్భుడు. ఇతడు సూర్యమండల గతుడు. హిరణ్యశ్మశ్రుః మొదలగు రూపము గలవాడు.

**శ్లో॥ అధ్యాత్మం వపురమ్బరాద్యదితరత్ప్రాణాచ్చ మూర్తస్తు త-**
**న్మర్త్యం చ స్థితమేవ సచ్చ కథితం చక్షుస్తదేతద్రసః ।**
**ప్రాణస్తద్వపురన్తరస్థితనభశ్చామూర్తమేవామృతం**
**యచ్చ త్యచ్చ రసస్స తస్య పురుషో యో దక్షిణాక్షిస్థితః ॥ 93**

భావ॥ అధిదైవతముగా బ్రహ్మముయొక్క సత్ త్యత్ అనురూపములు చెప్పబడినవి. ఇక అధ్యాత్మం అనగా దేహమునందు బ్రహ్మము యొక్క రూపములు. శరీరంలో నున్న ఆకాశ ప్రాణ (వాయువు) ల కన్న భిన్నమయిన చర్మము - సాది. పృథివీ జలాగ్ని రూప వస్తువులు మూర్తములు, స్థితములు. మర్త్యములు. సత్తులు. వీటి రసము అనగా సారము 'నేత్రము'.

ఇక శరీరంలోని ప్రాణవాయువు, ఆకాశము అమూర్తములు. అమృతము యత్ = వ్యాపకము. త్యత్ = ప్రత్యక్షముకానిది. పరోక్షము. అనగా అసత్తులు. వీటి సారము కుడికంటిలోకనబడు పురుషుడు. 93

విశే॥ 1. నేత్రేంద్రియము కనబడదు. అయినా దాని ఆధారమయిన తారక కనబడుతుంది. అందువలన ప్రత్యక్షము.

2. బ్రహ్మ సాక్షాత్కారం వఱకే అమృతములు - మృతములు అను వ్యవస్థ. ఆ తరువాత బ్రహ్మమే ఆత్మయే అమృతము.

3. అక్షిగత పురుషుడు – అనగా ఒక మనిషి కంటిలోనికి మనము చూచునపుడు అందులో పడే మన ప్రతిబింబముకాక, ఆ మనిషిలోని భావములను తెలియపఱచే ఒక నీడవంటి పురుషుడు. అనగా అందలి ద్రష్టయే పురుషుడు. అదిన్ని దక్షిణాక్షి యందున్నవాడే పురుషుడు. (అద్దంలో తన ప్రతిబింబం ద్వారా తన కంటిలో కనబడే తన దేహం గూడా పురుషుడు గాడు.) ఈ పురుషునికి మూర్తి లేదు. దేహం లేదు. అమృతుడు. ఇది దృశ్యం కాదు. ద్రష్టయే. ఇతడు అతను నేత్రమునందుండి దృశ్యములను చూస్తాడు కనుక అక్షిపురుషుడుగా ఔపచారికము. "శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవచ అధిష్ఠాయమనశ్చాయం విషయానుపసేవతే" – గీత.

4. మనస్సు = బుద్ధి, ఒకే అంతఃకరణంలోని భాగములు. వికల్పాత్మకం మనస్సు. నిశ్చయాత్మకం బుద్ధి. పురమునందు శయనించుట వలన పురుషుడు. మూర్తి ఉంటేనే పురుషుడని కాదు. పూర్ణుడు కాబట్టి పురుషుడు. పురుషాకారంలో వ్యాపించి యున్నాడు గనుక (లోహంలో నిప్పువలె) పురుషుడు.

5. దక్షిణాక్షి అని ప్రత్యేకించటానికి కారణం వామనేత్రం కన్న దక్షిణ నేత్రం ప్రశస్తం కనుక, (అవయవాలలో దక్షిణం సమర్థం వామం బలహీనం అలవాటు లేనిది) దక్షిణ కర్ణం గూడా చెప్పవచ్చు. కాని శ్రవణం కన్న దర్శనం వలననే జ్ఞానం తృప్తి బాగావస్తాయి కనుక అలా చెప్పారు. (పురుషునిలోని అంతర్లీన భావాలు కంటిద్వారా కనిపెట్టవచ్చును. చెవిద్వారా కనిపెట్టలేము. కనుక పురుషుని పట్టి యిచ్చేది కన్ను అందుకున్ను అలా చెప్పి ఉండవచ్చును.) ఏదయినా నేత్రం ఇతరజ్ఞానేంద్రియాలకుపలక్షణము. దర్శనం, శ్రవణం మొదలయిన క్రియలలో 'నేను' అను కర్తృత్వమునకు ఆలంబనమయిన జీవుడు అక్షి పురుషుడు.

6. అలా అయితే అహంకారమే జీవుడు – అనాలి. 'నేను' కు ఆలంబనము అదే గదా! సమా – అది అనిత్యం సుషుప్తి, మరణ, మూర్ఛాదులలో అది ఉండదు గదా! జీవుడు నిత్యము గదా!

7. అంతఃకరణం రెండు రకాలు. అహం – ఇదం అహం వృత్తి గల అంతఃకరణమే అహంకారం. దీనికి విజ్ఞానాత్మ అయిన జీవునిలో తాదాత్మ్యాధ్యాసవలన జీవుడు సుఖదుఃఖ దర్శన స్పర్శనాదులను తనవిగా కర్తృత్వం, భోక్తృత్వం వేసికొంటాడు. ఈ అధ్యాసలేకపోతే ఈ కర్తృత్వాదులు జీవునకు రావు. లేవు. సుషుప్తిలో అదేగదా పరిస్థితి. (స్వప్నానుభవం తర్వాత గూడా అకర్తృత్వ భోక్తృత్వాలు తనవికావని అనుకొంటాడు గదా!) కనుక అంతఃకరణం జడం. జీవుడు చైతన్యం. కాని తాదాత్మ్యం వలన అంతఃకరణం జీవుడుగా కనబడుతుంది. అహంకార రహితుడయిన జీవుడు అహంకారిగా కనబడుతాడు. చివరకు "అహం బ్రహ్మాస్మి" వద్ద గూడా

'అహం' ఉంటున్నది. దానికి లక్షణయా విజ్ఞాన స్వరూపుడని అర్థం చెప్పవలసి వస్తుంది. ఆత్మాంతఃకరణములు క్షీరనీరములవలె కలిసిపోవటం వలన విడదీయలేని స్థితి వచ్చింది. అందువలన విజ్ఞానస్వరూపుడయిన జీవుని రాగాదివంతునిగా చూస్తున్నాము. నిజానికి రాగాదులన్నీ మనోధర్మాలని "సర్వం మన ఏవ" అని శ్రుతి చెప్పినది. జీవుడు "విజ్ఞానమాత్ర" రూపుడని శ్రుతి. (ప్రజ్ఞానం బ్రహ్మ)

8. జీవుడు జ్ఞాతయా? జ్ఞానమా? జ్ఞాత అన్నా అతని స్వరూపము జ్ఞానమే. నిరహంకారదశలో అతను జ్ఞానమే. సాహంకారదశలో జ్ఞాత అవుతాడు. కనుకనే అతడు నేను జ్ఞాతను అంటాడు. జ్ఞానమును అని తెలిసికొనడు. అహంకారం లేని దశలో గూడా 'అహం' లేదు కనుక 'అహం జ్ఞానం' అన్న ప్రతీతి రాదు. ఈ సాహంకారుని జ్ఞానము స్వరూపము కాదు. క్రియ. శుద్ధునికయితే జ్ఞానం స్వరూపం. "నిష్కలం, నిష్క్రియం" శ్రుతి. క్రియ అయిన జ్ఞానం జన్యం కనుక అనిత్యం. కనుక జ్ఞాతరూపము జ్ఞానమే.

9. వృత్తి జ్ఞానం క్రియాత్మకం. అది జ్ఞాతకన్న భిన్నము. స్వరూపజ్ఞానము భిన్నము కాదు. విజ్ఞానమే ఆత్మ. అంటే క్షణికమయిన వృత్తి జ్ఞానమే అనుకొని బౌద్ధులు విజ్ఞానాత్మ వాదులయ్యారు. కాని అది తప్పు. ఆత్మ నిత్యం. కనుకనే అనేక గత వర్తమాన భవిష్యద్విషయాల మధ్య అనుసంధానం జరుగుతున్నది.

10. విశిష్టాద్వైతులు చైతన్యం ఆత్మకు స్వరూపమని అంగీకరించి వృత్తి జ్ఞానమును ఆత్మయొక్క ధర్మముగా చెప్పారు. కనుక ఆత్మ జ్ఞాన స్వరూపము. జ్ఞాన గుణకం గూడానని చెప్తారు. అది తప్పు. వృత్తి జ్ఞానం అంతఃకరణ ధర్మమే కాని ఆత్మ ధర్మం కాదు. జీవ స్వరూపం గూడా జ్ఞానమే. జీవుడే బ్రహ్మం కనుక. బ్రహ్మమే దేహ స్థితమయిన దశలో జీవుడు.

11. జీవబ్రహ్మముల అభేదం వలన జీవుడే తప్ప బ్రహ్మం లేదని జీవుడే చైతన్యమని సాంఖ్యులు భ్రాంతి పడినారు. జీవరూపంతో శరీరంలో ప్రవేశించినట్లు శ్రుతి చెప్పినది. "బ్రహ్మమును" సాంఖ్యులు లేదనటం భ్రాంతి కదా! ఘటాకాశం తప్ప మహాకాశం లేదని అనటం తప్పే కదా! అయితే బ్రహ్మే అయిన జీవునకు సంసారం ఎలా వచ్చినది? – బ్రహ్మయే అయిన అసంగుడయిన జీవునకు సంసారం రాదు – ఈశ్వరేచ్ఛతోనయినా రాదనాలి. ఆకాశం ఈశ్వరేచ్ఛలో సంగసహితం కాగలదా? రూపసహితం కాగలదా? అలాగే జీవుడు ససంగుడు కాలేడు. ప్రకృతిసంగం గూడా ఏర్పడదు. అసంగులను ససంగులుగా చేసి ఏడిపిస్తే ఈశ్వరుడు దుష్టుడవుతాడు. జీవాదృష్టం కారణమన్నా అది అసంగుడయిన జీవునికి తగలదు. ఈశ్వరుని మాయగూడా అసంగునికి తగలరాదు. (ఈశ్వరునికి తగలదుగదా! అట్లే ఇదీ).

12. మాయ అఘటన ఘటనా పటీయసి – అంటారా! అయితే, జీవుడు సంసారిగా

కనిపించటం మాయయే. వాస్తవం కాదు. కనుకనే విద్య (జ్ఞానం) తో పోతుంది. అందుకే భగవంతుడు విద్యను ఏర్పరచాడు.

అయ్యా! ఎవరీ భగవంతుడు? అవ్యాకృతోపాధిలోనున్న బ్రహ్మమే = ఈశ్వరుడే. ఈ ఈశ్వరునివే ఇంతకుముందు చెప్పిన మూర్తం, అమూర్తం అని చెప్పిన బ్రహ్మరూపములు.

13. లేదా, మూర్తం అమూర్తం అలాగే అవ్యాకృతము (అవ్యక్తం మాయ మూల - అజ్ఞానం) గూడా బ్రహ్మమునకుపాధి. కాని అవ్యాకృతముద్వారా బ్రహ్మమును చేరలేము. అందువలన దానిని ఈ సందర్భములో చెప్పలేదు. మూర్త అమూర్తముల వఱకే చెప్పారు. ఉపాధి అనగా రూపం అని అర్థం కాదు.

14. అమూర్త ద్రవ్యసారమయిన పురుషుడు బ్రహ్మరూపుడు. ప్రాణాలలాగా బ్రహ్మం ఎలా అవుతాడు? కేవలాత్మయే బ్రహ్మము. నిజమే. కాని అహంకార విశిష్టమయిన ఆత్మ గూడా బ్రహ్మమే. ఆయన బ్రహ్మప్రాప్తిద్వారం కదా! ఆకాశాదుల లాగానే పురుషుని ద్వారా గూడా బ్రహ్మమును పొందవచ్చును. ఎలాగంటే. ఇలా-

'ఆకాశః సన్' ఇందులోని 'సన్' బ్రహ్మం. అందువలన ఆకాశం ద్వారా బ్రహ్మమును పొందవచ్చును. అట్లే 'అహం పశ్యామి' ఇందులోని 'అహం' అను పురుషుని అసలు రూపము జ్ఞానము మాత్రమే. కనుక ఈ జ్ఞాతలోని జ్ఞానమును అనగా బ్రహ్మమును పొందవచ్చు. కనుక పురుషుడు సత్తు, జ్ఞానము, బ్రహ్మము. అంతే కనుక పురుషునిద్వారా బ్రహ్మమును పొందవచ్చును. కనుక

ఈ ప్రకరణంలో పురుషుడనగా అంతఃకరణ విశిష్టుడని అర్థము. శుద్ధ చైతన్యము కాదు. అందుకు ముందు చెప్పబోవు "మాహారజనం" (పసుపు గుడ్డ) మొదలయిన ఉపమానాలు సాక్ష్యము. కనుక వస్తుతః అమూర్త సారమయిన, బ్రహ్మోపాధి అయిన అంతఃకరణమే ఇచ్చుట పురుషుడు - ఇది సారాంశము.

**శ్లో॥ తం మాహారజనామ్బరానలశిఖాపాణ్డ్వావికాబ్జేన్ద్రగో-**
**పాభం హన్త సకృత్తటిత్ప్రభమయేద్యస్తస్య సుశ్రీర్భవేత్ ।**
**ఆదేశోఽస్య తు నేతి నేతి బృహతో నాస్మాత్పరో విద్యతే**
**ప్రాణాస్సత్యమతస్స సత్యమభిధా సత్యస్య సత్యం విభోః ॥ 94**

భావ॥ "మాహారజనాంబరము = పసుపు పూసిన గుడ్డ లేదా రంగువేసిన బట్ట, అగ్ని జ్వాల, తెల్లని ఉన్ని తెల్లని కమలము, ఎఱ్ఱని ఆర్ద్రపురుగు, క్షణం మెరిసే మెరుపు - ఇట్టివాడు పురుషుడు. అని అట్టి పురుషుని తెలిసికొన్న వానికి మంచి ఖ్యాతి కలుగును.

ప్రత్యగాత్మ అయిన బ్రహ్మమును ఏ విధంగాను నేరుగా వర్ణించలేము. అందువలన

ఏది బ్రహ్మముకాదో దానినంతా బ్రహ్మము కాదు కాదు అని చెప్పటం ద్వారానే బ్రహ్మమును బాగా చెప్పగలము. కనుక “న, న” అని చెప్పటం కన్న గొప్ప దారిలేదు. ప్రాణములు సత్యము. అంతకన్న ఆ బ్రహ్మము సత్యము. కనుక బ్రహ్మమునకు “సత్యమునకే సత్యం” అని పేరు. 94

విశే॥ 1. పురుషునకు ఉపాధి అయిన అంతఃకరణమునకు అనేక వాసనలు. చిత్ర విచిత్ర వాంఛలు. వాటికి ఆద్యంతములు లేవు. సంఖ్య కాలం దేశం నిమిత్తం ఏమీ లేవు. మనస్సు స్త్రీ గురించి రాగంతో ఉండవచ్చు - అది మహారజన వస్త్రం. మహాకోపం గలది- కావచ్చును. అది ఇంద్రగోపం కావచ్చు. అలా రకరకాల రంగులు రకరకాల రాగద్వేషాలను సూచించును. జ్ఞానాన్నిబట్టి తెలుపు, కనుక చిత్తవాసనా విచిత్రత వలన పురుషునిలో ఈ విచిత్రత ఏర్పడవచ్చును.

2. కనుక బ్రహ్మమునందు వస్తుతః నామరూప కర్మ జాతి సంబంధమయిన గుణభేదములు ఏమియు లేవు. కనుక 'న,న' అని చెప్పటం వలన బ్రహ్మమును వర్ణించగలము. నిర్విశేషమయి నను 'బ్రహ్మము' చైతన్య రూపమయినది. ఉన్నది కనుక ఇది శూన్యవాదము కాదు. నిర్విశేషము అధిష్ఠానము గదా బ్రహ్మము. అందువలననే దానిని వర్ణించలేము. ఆవును వర్ణించగలము. కొమ్ములున్నాయి. తెల్లగా ఉన్నది. ఇలా బ్రహ్మమును వర్ణించలేము.

3. ప్రాణములు మిగిలిన శరీరాది దృష్ట్యా సత్యము. దానికన్న సర్వముకన్న బ్రహ్మము సత్యము. కనుక ప్రాణాదులది ఆపేక్షిక సత్యత. బ్రహ్మము నిరపేక్ష సత్యము. నిర్గుణ బ్రహ్మమునకు ఈ సత్యత్వము వ్యావహారికంగానే. మాయవలననే. పరమార్థదశలోనూ (సుషుప్తిలోనూ) ఏ విశేషములూ కనబడుటలేదు. కేవలము సాక్షిగా బ్రహ్మం ఒక్కటే ఉన్నది గదా! కనుక నిర్విశేష బ్రహ్మం యొక్క వాస్తవ రూపము.

**శ్లో॥ పూర్ణా విత్తగణైరియం వసుమతీ సర్వాపి పుంసోఽమృతం**
**శక్నోత్యేవ న దాతుమేత్య విరతిం స్వాత్మానమేవాశ్రయేత్ ।**
**పత్యుః కామకృతే పతిః ప్రియతమో నైవ స్త్రియా ఆత్మనః**
**కామాయైవ పతిః ప్రియస్సుతధనక్షోణ్యాది విద్యాదితి ॥ 95**

భావ॥ సమస్త ధనధాన్య పూర్ణమయిన యీ భూమి అంతా కలిసిగూడా పురుషునకు అమృతత్వమును ఇవ్వజాలదు. కనుక ఈ భౌతిక విషయములపై విరక్తిని పొంది తన ఆత్మనే ఆశ్రయించవలెను. ఏ భార్య అయినా భర్త కోరికల కోసం భర్తను ప్రేమించదు. తన కోరికల కోసమే భర్త ప్రియమవుతాడు. పుత్ర ధన భూమి – మొదలయినవి గూడా మనకోసమే ప్రియం. వాటి కోసం అవి ప్రియం కావు. 95

విశే॥ 1. అట్టి బ్రహ్మం జ్ఞానమాత్రంతోనే దొరకుతుంది. కర్మ లభ్యం కాదు. జ్ఞాన కర్మ

సముచ్చయం వలన గూడా రాదు. అవి రెండూ పరస్పర విరుద్ధములు. కర్మ అనిత్య స్వర్గాదిఫల సాధనం. మోక్షం కర్మ సాధ్యం కాదు. "శాస్త్రకృతః కృతేన" గదా!

2. ఆత్మ అనగా ఈ శ్లోకంలో కార్యకరణసంఘాతమయిన శరీరాభిమాని. భార్యాభర్తల సుఖం అన్యోన్య సుఖం. కనుక దానికన్న ఏకపక్షసుఖమయిన ధనములు మొదలయిన వానిని చెప్పాడు. ధనం వలన పురుషునికి సుఖం. పురుషున వలన ధనానికి సుఖం లేదు.

**శ్లో॥ కాన్తాకామకృతే ప్రియా భవతి నో కాన్తా నరస్యాత్మనః**
**కామాయైవ పరం ప్రియా భవతి సా రూపార్థగేహోదయః ।**
**రూపార్థావసథాదికామకృతయే నైవ ప్రియా ఆత్మనః**
**కామాయైవ పరం ప్రియాః కిమపరం సర్వం ప్రియం స్వాత్మనే ॥96**

భావ॥ అట్లే భర్తకు తనసుఖం కోసమే భార్య ప్రియమయినది. అంతేగాని భార్య సుఖం కోసం కాదు. రూపం, ధనం, గృహం మొదలయినవన్నియు వాటికోసం అవి ప్రియం కావు. ఆ రూపాదులు మనకోసం దొరికితే ప్రియములు. శత్రువుకో ఇతరునికో దొరికినచో ప్రియం కావు గదా! ఇంత ఏల? అన్ని తనకొఱకయితేనే ప్రియము. 96

**శ్లో॥ యద్భోగప్రదమాత్మనస్తదఖిలం లోకః ప్రియమ్మన్యతే**
**సమ్పుష్ణాతి చ గోగణానివ పయోభోగాయ గోమాన్ పుమాన్ ।**
**యచ్చాభోగదమాత్మనస్తదఖిలం నైవ ప్రియమ్మన్యతే**
**నో పుష్ణాతి చ వన్యజన్తుమివ తత్సర్వం ప్రియం స్వాత్మనే ॥ 97**

భావ॥ తనకు భోగప్రదమయిన వానిని అన్నింటిని లోకం తనకు ప్రియమయినదిగా భావించును. పాలకోసం గోవులను పెంచినట్లు. తన భోగసాధనములను పెంచికొనును. తనకు భోగప్రదం కాని దానిని తనకు ప్రియముగా తలచడు. అడవిజంతువులను ఎలా పోషించడో అలాగే పోషించడు. కనుక ఏదయినా తనకు పనికి వచ్చేదే ప్రియము. 97

**శ్లో॥ యచ్చానిష్టదమాత్మనస్తదఖిలం ద్వేష్ట్యేవ లోకో యథా**
**సర్పం వృశ్చికమాత్మనో భవతి సా సర్పాదిహింసా ప్రియా ।**
**సర్పాదేర్న తు సా ప్రియా తదఖిలం శేషమ్భవత్యాత్మనః**
**శేషీ స స్వయమేక ఏవ న పరస్యార్థే యదాత్మా ప్రియః ॥ 98**

భావ॥ తనకు ఇష్టదాయకం కాని దేదయినా అతనికి అసహ్యమే. ఇష్టం కానిదంతా అతనికి తేలులాగా కనబడుతుంది. సర్పము మొదలయిన వాని హింస అతనికి ప్రియమయినది. కాని సర్పాదులకు ఆ హింస ప్రియమయినది కాదు. **కనుక ఈప్రపంచం అంతా అతనికి**

**శేషము. అతడే శేషి.** ఇతరులకోసం తన ఆత్మ ప్రియము కాదు. కనుక ఆత్మయే శేషి. ఇతరులు శేషము. 98

**శ్లో॥ యస్యార్థే సకలం ప్రియం స తు పుమానాత్మా నితాన్తం ప్రియః**
**శేషీతి ప్రతిపత్తుమస్య జగతః కో వాఽస్తు శఙ్కాలవః ।**
**ద్రష్టవ్యోఽయమతః పుమాన్ ప్రియతమః స్వాత్మా ముముక్షోర్గురో-**
**శ్శ్రోతవ్యో మననీయ ఏవ నితరాం ధ్యాతవ్య ఏవాన్వహమ్ ॥ 99**

భావ॥ ఎవనికోసం ఇదంతా ప్రియమో అట్టి ఆత్మయే మనకు అత్యంతము ప్రియుడు. అందువలన అతడే "శేషి" అని నమ్మటానికి అభ్యంతరముండదు. కనుక అట్టి ఆత్యంత ప్రియుడయిన స్వాత్మరూపుడయిన పురుషుడే మనకు తెలిసికొనదగినవాడు. అట్టి ఆత్మను గూర్చి గురువు వద్ద శ్రవణము చేయవలయును. మిక్కిలి మననము చేయవలయును. ప్రతిరోజు ధ్యానము చేయవలయును. 99

విశే॥ 1. సర్వవాంఛాసాధనము కనుక విత్తం ప్రియం. అంతకన్నదగ్గరిది సంతానము. అంతకన్న దగ్గరిది తన ఆత్మ. తనకోసం అవసరమయితే పుత్రునినయినా బలి ఇవ్వగలడు (శునశ్శేపుడు) శరీరమే ఆత్మ అయితే శరీర రక్షణ కోసం గృహ కళత్రాదులు అవసరమే. అందువలన వానిని సన్న్యసింపరు. సంఘాతం (శరీరం) ఆత్మకాదు. ఆత్మకోసమే సంఘాతము. ఆత్మశేషి. అయితే ఈ ఆత్మ అందరికీ తెలియదుకనుక ద్రష్టవ్యము. శ్రోతవ్యము అవుతుంది.

2. ఇందులో దేహం ఆత్మకు ప్రియము. కొంచెం దూరము. మరీ దగ్గరివి ఇంద్రియాలు. అంతఃకరణం అంతకన్న దగ్గరిది. వికలాంగుడయినా మనస్సుతోనయినా సుఖపడతాడు. చావగోరడు. అంతకన్న 'ఆత్మ' అతి ప్రియం. మరింత దగ్గరిది గదా! సుషుప్తిలో అంతఃకరణం గూడా లయమయి కమ్మని నిద్ర కోరతాడు గదా! (ఆలోచనలతో నిద్ర పట్టక మత్తుమందుతో అంతఃకరణాన్ని లీనం చేస్తాడు గదా!)

3. కాని ఇంతముఖ్యమయిన ఆత్మ సంసారులకు కనబడదు. తెలియదు. వీరు బహిర్ముఖులు గదా! ఇంద్రియాలు లోపలికి పనిచేయవు. "పరాంచిఖాని వ్యతృణత్ స్వయంభూః" ఏకాగ్ర చిత్తమునకు అది అందుతుంది.

"మనసైవాను ద్రష్టవ్యమ్'. కాని గృహస్థుకు అనేక వ్యవహారాలుంటాయి. కనుక ఆత్మ దర్శనం దుర్లభము.

"దృశ్యతే త్వగ్ర్యయాబుద్ధ్యా" శ్రుతి. కనుక ఆత్మదర్శనం కావాలంటే ఇంద్రియాలనే వదలుకొనాలి. ఇక గృహకళత్రాదుల సంగతి చెప్పేదేమిటి?

4. త్యాగం అంటే సంగం వదలటం - ఇంద్రియ త్యాగం. విషయసంగం వదలటం.

శరీర త్యాగం. శరీరాభిమానం వదలటం. అలాగే చిత్త ప్రవృత్తిని గూడా కట్టడిచేయాలి. మనస్సులో సంకల్పవికల్పాలు ఆపాలి. కనుక అతిప్రియమయిన ఆత్మజ్ఞానం కావాలంటే సర్వత్యాగాలు తప్పదు.

5. ఆత్మదర్శనం అఖండానందము. అందువలననే అంత ఆసక్తి. "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" గదా! సుషుప్తి ఇందుకుదాహరణము. కనుక ముముక్షువుకు ఆత్మ దర్శనం ముఖ్యము.

6. శ్రోతవ్యః మంతవ్యః – ఇచ్చట ఈ తవ్య ప్రత్యయమునకు అర్థమేమి? శ్రవణము చేయవలయును అని 'విధి' అయితే ఇది ఎ) అపూర్వవిధియా? బి) నియమవిధియా? సి) పరిసంఖ్యావిధియా?

విధిలక్షణం ఇది : "విధిరత్యంతమప్రాప్తే నియమః పాక్షికే సంతి తత్ర చాన్యత్ర చ ప్రాప్తే పరిసంఖ్యేతి గీయతే"

వ్రీహీన్ ప్రోక్షతి = ఇది అపూర్వ విధి (క్రొత్తగా చెప్పబడిన విధి)

నియమవిధి : వ్రీహీనవహంతి – వ్రీహులను దంచును. వ్రీహులను దంచటం పొట్టుతీయటానికి గదా! ఆ పొట్టు తీయటం మరోరకంగానయినా చేయవచ్చును. కనుక దంచటమే చేయాలని నియమవిధి.

పరిసంఖ్యావిధి : "ఋతౌ భార్యాముపేయాత్" గృహస్థునకు భార్యా సంగమం ఎపుడయినా ఉన్నదే. ఋతువునందే భార్యను కలియవలయునని పరిసంఖ్య చేయబడినది. కనుక శ్రవణాది విధి ఇందులో ఏది? – సమా

1. ఆత్మా ద్రష్టవ్యః – ఇది అపూర్వ విధి. మరే విధితోనూ ఆత్మ దర్శనం ఇలా చెప్పబడలేదు గదా!

2. కొందరు నియమ విధి అంటున్నారు. ఇది అపూర్వవిధి కాదు. "తమేవం విదిత్వాతి మృత్యుమేతి" అని శ్రుతివలన ఆత్మజ్ఞానం విధింపబడినది. కనుక క్రొత్త విషయం కాదు. ఇక "అక్షయ్యగ్ంహవైచాతుర్మాస్యయాజినః సుకృతం భవతి" అని కర్మణైవహిసంసిద్ధిమాస్థితా జనకాదయః" – కనుక కర్మగూడా మోక్షకారణంగా వస్తుంటే – జ్ఞానం వలననే మోక్షం కనుక 'ద్రష్టవ్యః' అని నియమవిధి.

3. మరికొందరు అంటున్నారు –

ఇది పరిసంఖ్యావిధి. ముముక్షువులు ఆత్మదర్శనము, అనాత్మదర్శనమునందున్ను భ్రాంతివలన ప్రవర్తిస్తే ఆత్మ దర్శనమునందే ప్రవర్తింపవలయునని పరిసంఖ్యావిధి.

వాస్తవమేమంటే; జ్ఞానము వస్తువునకధీనం. పురుషుని చేతులలో లేదు. (కశ్చిద్యతతి

సిద్ధమే) యజ్ఞాదులయితే పురుషాధీనం. సాధ్యం. కనుక యజేత అనునది 'విధి' కావచ్చును. కాని 'ద్రష్టవ్యః' అన్నది విధికాదు. ఆత్మజ్ఞానం గూడా ఒక క్రియ అయితే విధింపవచ్చును. 'వృత్తి' అనగా మనస్సుయొక్క వ్యాపారం క్రియ. అంతేగాని వృత్తిలో ప్రతిబింబించిన జ్ఞానం మాత్రం క్రియగాదు. బింబచైతన్యం క్రియ అయి ఉంటే ప్రతిబింబచైతన్యం క్రియ అవుతుంది. 'జానాతి' అనగా 'జ్ఞానం కరోతి' అని అర్థం రాదు. జ్ఞానాశ్రయమయిన మనోవ్యాపార రూపమయిన క్రియగలవాడు. లేదా జ్ఞా – అవబోధన అనగా 'తెలియుట' అని యర్థము. కనుక తెలియటం క్రియ కావచ్చును. కాని "తెలివి" క్రియకాదు. అది "సంవిత్". జ్ఞానం విషయి. విషయం కాదు. దానికేదయినా విషయం అవుతుంది. కనుక 'ఘటం జానాతి' అనగా ఘటమును తెలిపే మనోవ్యాపార రూప క్రియకు ఆశ్రయమని అర్థము. అంతేతప్ప జ్ఞానక్రియకు ఆశ్రయమని కాదు. లేక జ్ఞానం అనగా తెలియటం అని అర్థం చెప్తే జ్ఞానక్రియాశ్రయా అని అర్థం చెప్పవచ్చు. కనుక 'జ్ఞానం' క్రియగాదు. అది "తెలివి" మాత్రమే.

4. "జ్ఞానము అవబోధము (తెలివి)" అనే అర్థంలో అది క్రియకాదు కనుక జ్ఞానవిధి కాదు. "అవబోధనం" అను పక్షంలో క్రియ కనుక 'జ్ఞానవిధి' అనవచ్చుకదా! నిజమే. కాని 'జ్ఞానం' అను శబ్దమునకు "తెలివి" అను అర్థమే ప్రసిద్ధం కాని "అవబోధనం" అను అర్థంలో ప్రసిద్ధిలేదు. కనుక కర్మవిధిలాగా జ్ఞాన విధి ఉండదు. అయితే 'తవ్య' సంగతి ఏమిటి? అంటే "అనాత్మ"లను చూడవద్దని వ్యతిరేకార్థం చెప్పాలి. (కాని తవ్య వద్ద అర్వార్థం చెప్పవచ్చు. విధి అక్కర లేదు అని **సంక్షేప శారీరకం.**)

5. దృశి ధాతువుకు తవ్యం చేస్తే అది చూడ వలెనన్న క్రియార్థమునే ఇస్తుంది. ఆవబోధనం గూడా అంతే. క్రియయే. కనుక ఆత్మదర్శనం కర్తవ్యమేనని అర్థం. కనుక విధియే. ఘటాది అనాత్మ దర్శనం విధి అయినా ఆత్మ దర్శనం విధికాదు. తనను దర్శించాలని తనకే ఎలా విధింపు జరుగుతుంది. అలా కాదయ్యా! ఈ విధిని బట్టి వారొకరుకాదని భిన్నమని ఊహించవచ్చు నంటారా? లేదు. ఆత్మ ఒక్కటే. అఖండం అద్వితీయం. కనుక ఒకే ఆత్మ తనకు తనే కర్తకర్మ ఎలా అవుతుంది? పైగా ఆత్మతెలియనిది కాదు. తనకు తాను తెలియును గదా! కనుక క్రొత్తగా తెలిసికొనుమని "విధి" ఎందుకు? వ్యర్థ విధిని వేదం విధించదు కదా! కనుక ఇది విధి కాదు. కనుక అనాత్మలను చూడటం మానమని అర్థము. అయ్యా! అదయినా విధియే గదా! అంటారా? నివృత్తి క్రియకాదు కనుక విధి కాదు. లేదా క్రియయే అనుకొందాము. కంఠోక్తిగా ఆ విధిలేదు కదా! కనుక ఇది విధి కాదు.

6. శ్రోతవ్యః – (మంతవ్యః నిదిధ్యాసితవ్యః అనునవి గూడా దీనితో గతార్థం అవుతాయి) "శ్రోతవ్యః" ఇది గూడా అపూర్వవిధి అని కొందరు. శ్రవణ విధి ఇతరత్ర చేయబడలేదు కనుక

క్రొత్త విధి అని వారి భావము. శ్రవణం లేకున్నా వామదేవాదులు సాక్షాత్కారం పొందారు. ఉన్నా పొందనివారున్నారు.

మరి కొందరు నియమ విధి అన్నారు. వేదాంతశ్రవణం సాక్షాత్కార హేతువే. "దశమః త్వమసి" వలన దశమ సాక్షాత్కారం కలిగినట్లు. "తత్త్వమసి" వలన బ్రహ్మ సాక్షాత్కారం కలుగుతుంది. అయితే ప్రబోధచంద్రోదయాది గ్రంథశ్రవణం గూడా చేయవచ్చును కనుక అదికాదని, వేదాంత వాక్య శ్రవణమే చేయవలెనని నియమ విధి. లేదా, గురువు వద్దనే శ్రవణం చేయవలయునని నియమం కావచ్చు. ప్రతిబంధము లేకుంటే విచారసహితమయిన యీ శ్రవణం వలన సాక్షాత్కారం. అలా కాని వారికి శ్రవణం వలన పని జరుగదు. వామదేవ హిరణ్య గర్భాదులకు శ్రవణం పూర్వజన్మలో జరిగి ఉండవచ్చు. దానివలన ఈ జన్మలో శ్రవణం లేకుండానే సాక్షాత్కారం జరుగుతుంది.

మరికొందరు పరిసంఖ్యావిధి అన్నారు. ఇతర కర్మవ్యాసంగం లేకుండా వేదాంతశ్రవణమే చేయవలెనని ఇతర వ్యాసంగనిషేధపూర్వకమయిన విధి కనుక ఇది పరిసంఖ్యావిధి. బ్రహ్మసంస్థోమృతత్వమేతి, "ఆసుప్తే రామృతేః కాలం నయేద్వేదాంతచింతయా" గదా!

7. కాని శ్రవణవిధి అయినా కేవలం వేదాంతశ్రవణం కాదు. దానివలన వచ్చే ఆత్మజ్ఞానమే. కనుక దీనికి గూడా విధి కుదరదు. మననం వలన వచ్చే ఆత్మజ్ఞానం నిదిధ్యాసనం. కనుక వీటికిన్నీ విధి కుదరదు. ఇవన్నీ ఆత్మ జ్ఞానరూపమయితే వీటిని విధిగా చెప్పటం దేనికి? అవి జ్ఞానసాధనములని చెప్పటానికి. అనగా శ్రవణం చేత ఆత్మను చూడాలి. మననం చేత ఆత్మను చూడాలి. ధ్యానం చేత ఆత్మను చూడాలి – అని అర్థము. (జ్ఞానానికి విధి లేనపుడు శ్రవణాది జ్ఞానసాధనాలకు విధి ఉండదని భావము). అయ్యా! నిత్యం అపరోక్షమయిన ఆత్మను తెలిసికొనటానికి శ్రవణాదులెందుకు? – అజ్ఞానులు దేహేంద్రియాదులను ఆత్మ అనుకొంటారు గదా! దానిని వారించుటకు వీటి అవసరము. కనుక శ్రవణాదికం ముముక్షువులకు అవసరం.

**శ్లో॥ సాక్షాత్కారవశాదముష్య పురుషస్తస్యామృతం ప్రాప్నుయా–**
**దాత్మాఽసావమృతో యతో న తు పునర్మృత్యుం క్వచిద్యాస్యతి ।**
**పుంసోఽముష్య చ దర్శనేన సకలం శ్రుత్యా చ మత్యా తథా**
**విజ్ఞానేన భవేదిదం సువిదితం సర్వం యదాత్మా జగత్ ॥ 100**

భావ॥ ఈ ఆత్మ సాక్షాత్కారం వలన పురుషుని, అతని అమృతత్వమును పొందును. ఎందుకంటే ఆత్మ అమృతమయినది గదా! అది ఎన్నడూ మరణమును పొందదు గదా! ఈ పురుషుని దర్శనము చేత శ్రవణముచేత మననము చేత విజ్ఞానముచేత ఇదంతయు పూర్తిగా తెలియదు. ఎందుకంటే యీ ప్రపంచమంతా ఆత్మయే గదా! 100

విశే॥ 1. ఇంత కష్టపడి ఇంద్రియజయం సన్న్యాసం ఆచరించి చివఱకు ఈశ్వరుడూ కాక సర్వజగత్తుగాక కేవలం 'ఆత్మను' (మనను మనమే) పొందితే ఏమి లాభము? – సమా –

ప్రపంచమయినా ఈశ్వరుడయినా ఆత్మయే గదా! 'బ్రహ్మ విదా ప్నోతి పరం' కదా! ఆ బ్రహ్మమే ఆత్మ.

2. స్వర్గములో దొఱకే అమృతము కన్న ఇది గొప్పది. దీనిని పొందినవాడు ఎన్నటికీ మృత్యువు పొందడు. దేవతలకు పునరావృత్తి యున్నది. ఎందుకంటే ఆత్మయే అమృతము. దానిని పొందటం మరణరాహిత్యం. మరణరాహిత్యం పొందిన వానికి మరణ సాహిత్యం కుదరదు. అట్లే ప్రాణ సాయుజ్యం చేసిన ప్రాణోపాసకునకయినను అమృతత్వం అనిత్యమే. ప్రాణసాయుజ్యం ముక్తివఱకే. ఆత్మ సాయుజ్యమే ముక్తి కనుక అది అమృతము. "న జాయతే మ్రియతే వా విపశ్చిత్", "అజో నిత్యః శాశ్వతోయం" గదా!

3. ఇంతకు ముందయినా పురుషుడు మరణించలేదు. కాని ఆత్మానాత్మ తాదాత్మ్యాధ్యాస వలన శరీరము మరణించితే తానే మరణించినట్లు భావన. కనుక తత్త్వం తెలియటం వలన స్వరూపానుభవం వలన అతనికి 'ఆత్మకు' మరణం ఉండదు. కనుక వాడు మరల జన్మకు రాడు " న స పునరావర్తతే" ఆత్మను పొందటం అది మరల విడిపోవటం అన్నదానికి దారితీయవచ్చు. "సంయోగావిప్రయోగాంతాః" కదా! కనుక "బ్రహ్మవిదాప్నోతి పరం" అంటే "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" అని 'ఆత్మ' కావటమే. తను ఆత్మనని ఎఱుగుటయే.

4. ఆత్మ స్వయంగా నిత్య ప్రాప్తమే కదా! దానిని పొందటమే కుదరదు. కనుక అది భిన్నమయితే దానిని పొందటం వలన నూతన ఫలం కలుగుతుంది. అని సందేహం – ఆత్మ భిన్నమయిన వస్తువే లేదు. దానిని తెలిసికొనటమే ఫలం. ఆత్మజ్ఞానమే ఆత్మ ప్రాప్తి. జ్ఞాతయే ఆత్మ. ఆత్మ జ్ఞానం స్వాభావికం. దానికది ప్రత్యక్షమే. సర్వజ్ఞుడయితే ఫలము లభించినట్లు – అంటారా! – మంచిది. ప్రపంచం అంతా ఆత్మయే కనుక సర్వజ్ఞత్వం తప్పక లభిస్తుంది.

5. రజ్జువునందు కల్పితమయిన భ్రాంతి సర్పము తొలగితే రజ్జువు తెలుస్తుంది. ఆత్మయందు కల్పితమయిన ప్రపంచం తొలగితే ఆత్మయే కనబడుతుంది. కుండ తొలగితే మట్టి మిగులుతుంది. మరి ప్రపంచం అనగా సర్వం తొలగితే ఇక సర్వజ్ఞుడెలాగవుతాడు? సమా – ఆత్మ రూపంగా సర్వం తెలియటమే. అనాత్మజ్ఞునిలాగా ఆత్మజ్ఞుడు తన దగ్గరనున్న ఘట పటాలను మాత్రమే గాక సర్వలోక సర్వకాల ఘటపటాదులను చూడగలడన్న భౌతిక జ్ఞానము కాదు. ఈ సర్వజ్ఞత మరింత పెద్ద సంసారమే కదా! "ద్వితీయాద్వైభయం భవతి"

"మృత్యోస్స మృత్యుమాప్నోతియ ఇహ నానేవ పశ్యతి" కదా! కనుక 'సర్వం ఖల్విదం

బ్రహ్మ' అని తెలియటమే సర్వజ్ఞత. ఈశ్వరుడు గూడా అట్టి సర్వజ్ఞుడు. హిరణ్యగర్భుడు గూడా ద్వైత దృష్టిలేనిచో ఈశ్వరుడే, సర్వజ్ఞుడే. లేదంటే సంసారి కావచ్చు.

6. సర్వజ్ఞత్వం అంటే సర్వద్వైతములను చూడటమే అని. పట్టుదల అయితే. – సమా – ఆత్మ ఒక్కటే సర్వజగత్తును వ్యాపించింది గనుక ఆయా ఇంద్రియ మనస్సులలో ఆయా వ్యక్తులు సంపాదించేదంతా ఆత్మయొక్క జ్ఞానము కనుక ఆత్మ సర్వజ్ఞము. ఆత్మవేత్త దృష్టిలో ఆత్మ ఒక్కటే అన్ని తన పనులగానే భావించును. అనాత్మవేత్త అయితే తన శరీర కృత్యాల వఱకే తను చేస్తున్నట్లు భావించును. కేవలం అభిమానించినంతమాత్రాన ఇతర కృత్యాలు తనవి ఎలా అవుతాయి? నేను మహారాజును అనుకొన్నంతమాత్రాన క్షుద్రుడు మహారాజు అవుతాడా? (వారి పాప పుణ్యాలు ఇతనికి చెందుతాయా? – చెందితే ఆత్మ జ్ఞానం వలన సర్వజ్ఞత వలన సంసారం పెద్దదవుతుంది.) సమా – శరీరం మీద అభిమానంతో శరీరి అవుతాడు. అలాగే సర్వజ్ఞుడూ అవుతాడు. శరీరికావటం మిథ్య అయితే సర్వజ్ఞత్వమూ మిథ్యయే కదా! ఆత్మజ్ఞానికి అసంగత ఎటూ ఉంటుంది. **సర్వమే ఒక మిథ్య. సర్వజ్ఞత్వమూ మిథ్యయే. జీవేశ్వరుల సర్వజ్ఞతలు ఈ పరిధిలోవే.**

7. ఆస్తికులందరు "సర్వజ్ఞుడు, సర్వశక్తుడు, అయిన ఈశ్వరుడున్నాడని భావిస్తారు. అందుకు కారణం "స సర్వజ్ఞ స్సర్వవిత్", "పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే" గదా! తార్కికులు గూడా అట్టి యీశ్వరునే జగత్కారణంగా జగత్కర్తగా ఊహిస్తారు.

8. పరమార్ధ దశలో కేవలం బ్రహ్మమే. వ్యవహారదశలో జీవేశ్వరులున్నారు. భేదమూ అంతే. కాని సాంఖ్యుల లాగా నిరీశ్వరులము కాదు. వ్యవహారంలో ఈశ్వరుడు సర్వజ్ఞుడయినట్లు ఆత్మవేత్త గూడా సర్వజ్ఞుడు కావచ్చు గదా! వసిష్ఠాదులు అలాగే సర్వజ్ఞులు గదా! – సమా – వారి సర్వజ్ఞత యోగ మహిమతో వచ్చినది. జ్ఞానికి సిద్ధులు కోరదగినవి కాదు. కనుక ఆత్మవేత్త అట్టి సర్వజ్ఞుడు కావలెనన్న నియమం లేదు. యోగజ్ఞానములకు సాహచర్య నియమమూ లేదు. అనాత్మవేత్తలయిన యోగులున్నారు. యోగులు కాని ఆత్మవేత్తలున్నారు. "ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి" (సాంఖ్య యోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః") కనుక సాంఖ్యయోగములకు సాహచర్యం ఉన్నదంటారా? – **దాని అర్థము జ్ఞానయోగమునకు అసంగకర్మయోగముపాయమని అర్థము.** ఆత్మవేత్తకు ఈశ్వరానుగ్రహం వలన సర్వ (ద్వైత) – జ్ఞత వస్తుందనటం తప్పే. ఆత్మవేత్తకు భిన్నంగా ఈశ్వరుడు లేడు. అల్పజ్ఞుడయిన జీవుడూ లేడు. ఇంక అనుగ్రహం ఏమిటి? "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్ తత్కేనం కం పశ్యేత్" గదా! వ్యవహారం లోనయినా ఆత్మజ్ఞాని సర్వమును ఆత్మగానే దర్శిస్తాడు. (త్రాడు ఉన్నది పాము లేదని తెలిసిన వాడు పాములాగా కనబడుతున్నా త్రాడుగానే దర్శిస్తాడు గదా! ఒకరిని

భయపెట్టటానికి త్రాడు పడవేసినవాడు అంతేగదా!) సర్వం అంటే ఆత్మయే కనుక ఆత్మవేత్త సర్వజ్ఞుడే. ఇతర ధ్యానాదులను వదలి ఆత్మజ్ఞుడు కావటం మంచిది.

**శ్లో॥ బ్రహ్మక్షత్రియలోకవేదదివిషద్భూతేషు మధ్యే పుమాన్**
**యద్యద్వేద తు యః పరత్ర పురుషాత్తత్తచ్చ తం వఞ్చయేత్ ।**
**సర్వం వేద తు యః పరత్ర పురుషాత్సర్వఞ్చ తం వఞ్చయేత్**
**బ్రహ్మక్షత్రియలోకవేదదివిషద్భూతాని సర్వం స యత్ ॥ 101**

భావ॥ ఎవడయినా బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యములోనూ, లోకములలో వేదములలోను, దేవతలలోను, సమస్త ప్రాణులలోనూ ఆత్మభిన్నంగా ఏదయినా దర్శిస్తాడో వానినది వంచించును. అనగా మోక్షపథము తప్పించును. అంతేగాక పంచభూతాది సృష్టిలోనూ సమస్తమును బ్రహ్మముకన్న భిన్నముగా ఎవడుచూచునో అదియు వానిని వంచించును. ఎందుకంటే పైన చెప్పిన వానిలో ఆత్మ 'బ్రహ్మం' తప్ప మరేదీ లేదు. 101

**శ్లో॥ వీణాదున్దుభిశఙ్ఖసఙ్కులనజాన్ శబ్దాన్విశేషాత్మన-**
**స్సామాన్యాన్నినదాద్వివిచ్య పురుషో నైవ గ్రహీతుం క్షమః ।**
**చిద్వ్యాప్తం తదిదం జగత్కలయితుం తద్వద్వివిచ్యాత్మనో**
**నో శక్నోతి మృదో వివిచ్య న ఘటం గృహ్ణాతి కశ్చిత్క్వచిత్ ॥ 102**

భావ॥ వీణా దుందుభి శంఖముల ధ్వనిని విని దానిని ముందు శబ్దముగనే గ్రహించి తరువాత అది ఏ శబ్దమో గ్రహిస్తాం. (ఇది దూరం నుంచి సన్నగా విన్నపుడు తెలుస్తుంది. వాద్యకదంబంలోనూ తెలుస్తుంది.) అనగా ముందు సామాన్యాకారంగా తరువాత విశేషాకారంగా తెలుస్తుంది. సామాన్యం మీదనే విశేషం నిలుస్తుంది. కనుక శబ్దసామాన్యం గ్రహించకుండా శబ్ద విశేషం మాత్రమే తెలియదు. అదే విధంగా చిత్తునందు కల్పింపబడిన జగత్తులో చిత్తు వ్యాపించును గనుక చిత్తు మినహాయిస్తే జగత్తే లేదు. (1 మీద కల్పింపబడిన సున్నాలలో 1 తీస్తే విలువ లేదు.) అలాగే మట్టిని మినహాయిస్తే కుండలేదు. (ఇది కవి చెప్పిన ఉపమానం) కారణం లేని కార్యం ఉండదు. రజ్జువు లేని రజ్జు సర్పం ఉండదు. 102

విశే॥ 1. ఇంద్రియాలున్నంతసేపే ఇంద్రియగ్రాహ్యమయిన జగత్తు యొక్క అస్తిత్వం. కనుక సుషుప్తి మృతులయందు జగత్తు లేదు. జగత్తు ఉన్నది (సత్తు) జగత్తు తెలుస్తున్నది (చిత్తు) జగత్తునందున్న సత్త, చిత్తులు వాస్తవంగా సచ్చిద్రూపమయిన ఆత్మ వ్యాప్తివలన జగత్తునందు సోకినవే. అచేతనమయిన జగత్తు స్వతహాగా స్ఫురించదు. స్ఫురణం (చిత్, భానం) స్వయం ప్రకాశమయిన ఆత్మయొక్క స్వరూపము. ఆత్మయందు అహంకారాధ్యాసవలన "నేను సుఖిని" అని సుఖం ప్రతీతి అయినట్లు ప్రపంచమునందు 'చిత్తు' అనుస్యూతివలన కలుగుతుంది.

అందుకు కారణం జగత్తు చిత్‌యందు కల్పితం కావటమే. ఘటము నందు మట్టి వ్యాపించినది గదా! కనుక స్ఫురణకారణం అయిన మట్టిని మినహాయిస్తే కుండే లేదుగదా! సత్తాంశంగూడా బ్రహ్మముదే కనుక అదీ ఇంతే. మట్టియొక్క సత్తవలననే కుండకు గూడ ఉనికి. శబ్దసామాన్యం లేకుండా శబ్దవిశేషం లేదు. మట్టి లేకుండా ఘటం లేదు. బ్రహ్మం లేకుండా ప్రపంచం లేదు. రజ్జువు లేకుండా రజ్జుసర్పం లేదు.

2. అలాగే కారకశిల్పమునుబట్టి మట్టి ఘటంగాను, నేత్రాది దోషంవలన రజ్జువు సర్పంగా వివర్తించినట్లు, శబ్దసామాన్యం వాద్య విశేషాలవలన శబ్దవిశేషంగా పరిణమించినట్లు మాయచేత బ్రహ్మం జగదాకారంగా కనబడుతున్నది. కనుక సర్వజగత్తు ఆత్మయే.

**శ్లో॥ ఆర్ద్రైధఃకలితానలాదివ పృథగ్ధూమా అముష్మాన్మహా–**
**భూతాదాత్మన ఉత్పతన్తి పురుషాన్నిశ్వాసవచ్చాగమాః ।**
**విద్యాశ్లోకపురాణసూత్రనిచయవ్యాఖ్యేతిహాసా అను**
**వ్యాఖ్యానోపనిషద్గణాశ్చ సకలం నిశ్వాస ఏతస్య హి ॥ 103**

భావ॥ తడికట్టెలు తగిలిన నిప్పునుండి మహాభూతమయిన ఈ ఆత్మనుండి పురుషులు పొగలవలె, రవ్వల వలె ఎగిరిపడినారు. నిశ్వాసముల వలె ఆగమములు వచ్చినవి. విద్యలు, శ్లోకములు, పురాణములు, సూత్రములు, వ్యాఖ్యలు, ఇతిహాసములు అనువ్యాఖ్యానములు ఉపనిషత్తులు అన్ని ఆయన నిశ్వాసములే. "తదేతేశ్లోకాభవంతి" 'తదప్యేషశ్లోకోభవతి" అసద్వా ఇదమగ్ర ఆసీత్ అసదేవేదమగ్రమాసీత్" "ఆత్మేత్యేవ మాసీత" "వాయుర్వైక్షేపిష్ఠాదేవతా" "ఊర్వశీ హాప్సరాః" "ఆత్మేత్యేవోపాసీత – దీనికి అనువ్యాఖ్యగా "యోన్యాం దేవతాముపాస్తే అన్యోసావన్యోహ మస్మీతి, న స వేద యథా పశుః ఏవం సదేవానాం" "ప్రియమిత్యే తదుపాసీత"103

విశే॥ 1. నిశ్వాసం అనగా లీలాప్రాయంగా అప్రయత్నంగా అని అర్థము.

2. ఉత్పత్తికి ముందు ప్రపంచం అంతా బ్రహ్మరూపమే. కనుక ఇదంతా బ్రహ్మమే.

3. వేదములు బ్రాహ్మణములు అపౌరుషేయములని చెప్పటం వలన అవి స్వతః ప్రమాణములు అవుతాయి. వాటికి ప్రామాణ్యం వస్తే అది చెప్పిన భూతసృష్టి మొదలగువానికి ప్రామాణ్యం వస్తుంది.

అలాగే వేదసృష్టి తర్వాతనే భూతసృష్టి వేదం ప్రకారం ప్రజాపతి సృష్టించాడు. "ధాతా యథాపూర్వమకల్పయత్" అందువలన ముందు వేదసృష్టి దాని తరువాత ప్రపంచసృష్టి చెప్పబడినది.

4. లేదా, సృష్టి అనాది కనుక వేదం గూడా అనాదియే. దానిని పరమేశ్వరుడు స్మరించి బ్రహ్మకు ఇచ్చెను. "తేనే బ్రహ్మ హృదాయ ఆది కవయే" – భాగవతము. ఆ తరువాత పరంపరయా

ఉచ్చారణాత్మకంగా (శ్వాస - నాద) అందువలననే వేదమునకు "అను(శవము" అను పేరు. అనగా (శవణముననుసరించి ఉచ్చరింపబడునది. కనుక వేదం అపౌరుషేయము.

**శ్లో॥ సర్వేషాం పయసాం యథా జలనిధి(శ్శ్రోత్రాదిరేకాయనం**
**శబ్దాదేర్వదనాదికస్య తు తథా వాగాదిరేవం మనః ।**
**కామానాం హృదయం ధియాం బృహదిదం సర్వస్య తస్మాత్సమం**
**శబ్దాదౌ కరణైర్లయం గతవతి బ్రహ్మైకమస్త్యద్వయమ్ ॥ 104**

భావ॥ సమస్త జలమునకు సముద్రము ఏకగమ్యస్థానం. అట్లే శబ్దాదులకు చెవి మొదలగునవి, మాట్లాడుట మొదలగు క్రియలకు వాగాదులు, కామాలకు మనస్సు, బుద్ధులకు హృదయము, ఈ సమస్తమునకు బ్రహ్మం ఏకాయనము. తమతమ ఏకాయనములయిన కరణములతో సహా శబ్దాదులు అస్తమించగా అద్వితీయమయిన బ్రహ్మమొక్కటే మిగిలినది. 104

విశే॥ 1. సామాన్యంలో విశేషాలు లయమవుతాయి. మట్టిలో మట్టి విశేషాలయిన కుండ, చట్టి లయమవుతాయి. జలసామాన్యమయిన సముద్రంలో నదులు లయమవుతాయి. అంటే వాటి నామరూపాలు పోతాయి. అలాగే స్పర్శ జాతిలో (సామాన్యం) స్పర్శభేదాలు (విశేషాలు) లయమవుతాయి. గంధ సామాన్యంలో గంధ విశేషాలు లయమవుతాయి. శబ్దాది సామాన్యాలన్నీ సంకల్ప (మనః) సామాన్యంలోకి సంకల్ప సామాన్యం విజ్ఞాన సామాన్యంలోకి, నిత్య విజ్ఞానమయిన ఆత్మలోనికి చేరును. ఈ క్రమంలో అంతా ఆత్మలోనికి చేరును. శబ్దాదులను చెప్పాము. అందులోనే ఆకాశాది భూతములు గూడా చెప్పినట్లే. శబ్దాది విశేషములు శ్రోత్రంలో లయమవుతాయని చెప్పటానికి కారణం శ్రోత్రం అనగా శబ్దసామాన్యం అని అర్థం. వదనాది క్రియలన్ని ప్రాణములే. ప్రాణము ప్రజ్ఞానమే. అది అంతఃకరణముయొక్క క్రియాశక్తి. జ్ఞానశక్తి బుద్ధి. ఇవి అన్ని ప్రజ్ఞానమాత్రమయిన బ్రహ్మమునందే లయము. కనుక ఆత్మకన్న వేరే వస్తువే లేదు. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" కనుక త్రికాలములలోనూ సర్వ ప్రపంచము ఆత్మయే.

2. లేదా, విషయములు ప్రాతిభాసికములే కనుక, అవి "తెలియబడటం" ద్వారానే వాటికి అస్తిత్వం, లేదంటే లేదు. కనుక గ్రాహకములయిన ఇంద్రియాలవలన "గ్రాహ్యమయిన" శబ్దాదులకు అస్తిత్వము, అనగా వాటి ఏకాయనం వలననే వాటి అస్తిత్వం. కనుక సర్వ - అస్తిత్వాలు "సర్వ - ఏకాయన" మయిన బ్రహ్మమునుంచియే. ఏకాయనం లేకపోతే వాటి క్రియలు లేవు. మనస్సు లేకపోతే కామాలు లేవు. కనుక ఇవన్ని తమతమ ఏకాయనంలో పుట్టాయి. గిట్టాయి. కార్యం తన కారణంలోనే లయించటం నియమం.

3. లయంవలన మోక్షమయితే ప్రతి ప్రలయంలోనూ జీవులకు మోక్షం వస్తుందా? - రాదు. నిత్య ప్రలయం (నిద్ర) నైమిత్తిక ప్రలయం, (బ్రహ్మ దిన ప్రళయం) మహాప్రలయం (బ్రహ్మప్రలయం) లోనూ రాదు. ఆత్యంతిక ప్రళయం (మోక్షం) లోనే మోక్షం.

4. లేదా, ఈ శ్లోకంలో చెప్పిన ప్రళయం ఇది. శబ్ద సామాన్యంలో శబ్ద సామాన్యం తప్ప శబ్ద విశేషము లేదు. మట్టి తప్ప ఘటము లేదు. ఇలా "ఆత్మకార్యమయిన జగత్తు ఆత్మకన్న భిన్నంగా లేదు" అన్న భావనయే ప్రలయం. మానసికంగా లయచింతనం. కాగా సర్వ జగత్తు ఆత్మయేనని తెలుతుంది. అదే మోక్ష పథము.

**శ్లో॥ క్షిప్తస్సైన్ధవఖిల్య ఏవ సలిలే పాథోఽనులీయేత త-**
**న్నైవాస్యోద్గ్రహణాయ కోఽపి పురుషశ్శక్తోఽమ్బు యల్లావణమ్ ।**
**ఏవంభూతమపారమన్తరహితం విజ్ఞానమాత్రం మహ-**
**ద్భూతాన్యన్వపయాతి భూతనికరాదుత్థాయ నిశ్చేతనమ్ ॥ 105**

భావ॥ ఆత్యంతిక ప్రలయం (ముక్తి)లో ఆత్మ ఒక్కటే ఎలా మిగులునో వివరణ. సైంధవ లవణ శిలను నీటిలో పడవేసినచో అది ఆ నీటి కనుగుణముగా లీనమయిపోవును. దానిని బయటకు తీయుట ఎవనికిని కుదరదు. ఎందుకంటే అది ఉప్పు నీరుగానే అయినది గదా! అట్లే అపారము, అనంతము, విజ్ఞానమాత్రము, సత్ అయిన బ్రహ్మము విజ్ఞాన శూన్యమై (బుద్ధివృత్తి శూన్యమై) భౌతిక శరీరమునుండియే భూతములను అనుసరించి నశించును. అనగా అదృశ్యమగును. 105

విశే॥ 1. భూమి తేజస్సంపర్కమువలన సముద్రలవణం "ఉండగా" అయినది. అది మరల తన ఉపాదాన కారణమయిన నీరు తగిలిన తరువాత తన కాఠిన్యమును కోల్పోవును. అలాగే బ్రహ్మం మహత్తు. అది యీ శరీరంలో కేశాది నఖాంతము వ్యాపించినది. దానినుండి లేచి అనగా బ్రహ్మవిద్యతో స్థూలభాగమునంతటిని కరగించి ఆ భూతములతోపాటు అదృశ్యమగును.

2. కార్యకారణ సంఘాతముగా పరిణమించిన శరీరంతో అవిద్యవలన తాదాత్మ్యాధ్యాసము పొంది బ్రహ్మవిద్యతో అధ్యాస వదలించికొని అనగా పూర్వ శ్లోకాలలో చెప్పినట్లు కారణమునందు (ఏకాయనం) కార్యములను లయము చేసికొని అదృశ్యమగును. విజ్ఞానమాత్రం అయిన ఆత్మ విజ్ఞాన శూన్యం కావటం అంటే వృత్తిరూప విజ్ఞానం లేనిదయి కేవల విజ్ఞాన రూపంగా మిగులుతుందని అర్థము. అంతేతప్ప నశించదు. కనబడదని అర్థం.

3. కనబడదంటే అర్థమేమి? – సమా – ఆత్మ ద్రష్ట లేదా దృశి. అంతేగాని దృశ్యము కాదు. అనగా అది అదృశ్యమయిన విజ్ఞానరూపం అవుతుందని అర్థం. ఆత్మ దృశ్యం కావాలంటే ఎవరు చూస్తారు? – చూచేందుకు మరో ఆత్మ లేదు. నాన్యోతోస్తి ద్రష్టా. జడమయినవి చూడలేవు. పైగా అవి మిథ్యలు. తనను తానే చూడలేదు. కర్మ కర్తృభావం. ఒకే వస్తువుకు రాదు. అయితే అది అదృశ్యం కావటం స్వాభావికమే కదా! మరి మీరు అదృశ్యం అవుతుందని చెప్పటం

ఎందుకు? అది ఎపుడయినా దృశ్యమయితేనే గదా! సమా – శరీరతాదాత్మ్యాధ్యాస వలన శరీరమే ఆత్మ అని ఆత్మ దృశ్యం అయినట్లు భావిస్తారు. అవిద్యవలన వచ్చిన దృశ్యత్వం పోయి విద్యవలన ఆత్మ ద్రష్ట లేదా దృశి అవుతుంది.

4. సారాంశము : శరీరం ఇనుపగుండు. దానిలో ప్రవేశించిన అగ్ని "ఆత్మ". అవిద్యవలన తాదాత్మ్యాధ్యాస. అందువలన మనుష్యుడను, ముసలివాడను, సుఖిని, అనుకొంటూ దృశ్యం వికారి అయినది ఆత్మ. సూక్ష్మదేహనాశమయి ముక్తి కలుగునంతవఱకు ఇంతే, బ్రహ్మవిద్యతో అధ్యాసపోయి జీవన్ముక్తి. ప్రపంచం శరీరం దగ్ధ పటన్యాయంగా అలా ఉంటుంది. బంధం ఉండదు. ప్రారబ్ధాంతంతో విదేహముక్తి అదే ఆత్యంతిక ముక్తి. అపుడు ఆత్మ సంసారరహితం. శరీరరహితం, అఖండం, ప్రజ్ఞానఘనం, అనంతం, అపారంగా స్వస్వరూపంతో మిగులుతుంది. కరణములు లేవు కనుక విశేషజ్ఞానం లేదు. ఉపాధి లేదు కనుక అదృశ్యం అఖండం. అంతకు ముందు గగనం నీలం అన్నట్లు ఆత్మ దృశ్యం ఖండం. తత్త్వవేత్త అయిన తరువాత జ్ఞాని విశేష జ్ఞానం లేనివాడే. దర్శనమననాదులు అంతఃకరణ, బహిఃకరణ ధర్మములేగాని ఆత్మధర్మములు కావు.

5. సామ్యం – సైంధవ శిల జలసంబంధంతో లవణోదకం అవుతుంది. శరీరంలాగా స్థూలంగా కనబడిన జీవుడు విద్యవలన బ్రహ్మతాదాత్మ్యం పొందితే బ్రహ్మం అవుతాడు. రెండూ విజ్ఞానరూపములే కదా! ఆ విధంగా జీవుడు నామరూపరహితుడు అవుతాడు. పునరావృత్తి చెందరు.

**శ్లో॥ విజ్ఞానాత్మక ఏష భూతనికరాదుత్థాయ యాతః పరం**
**స్వాపే వా మరణే బృహన్నిజపదం జానాతి నో కిఞ్చన ।**
**యత్ర ద్వైతమివాస్తి తత్ర తు పరో జానాతు నామేతరం**
**యత్రాత్మైవ సమస్తమత్ర తు కథం కః కేన కం ప్రాప్నుయాత్ ॥ 106**

భావ॥ విజ్ఞానాత్మకుడయిన జీవుడు సుషుప్తిలోగాని మరణంలోగాని భూతనికరమయిన శరీరమునుండి అతీతుడై నిజరూపమయిన బ్రహ్మమును కలిసినపుడు, అచ్చట ఏమియు ఎఱుగడు. ఎచ్చట ద్వైతము కలదో అచ్చట ఇతరుడు ఇతరుని ఎఱుగవచ్చును. ఎచటనయితే సమస్తమూ ఆత్మయో అచ్చట (సుషుప్తి సమాధి) ఎవరు ఎవరిని ఎలా పొందగలరు? 106

విశే॥ 1. ముక్తియందు జీవుడు బ్రహ్మత్వం పొందుతాడనటానికి ఉదాహరణం ఏమిటి? – సుషుప్తి, మరణాలు ఉదాహరణము. అయితే ముక్తిలో జ్ఞానంతో జరుగుతుంది. కాబట్టి జీవునకు పునరావృత్తిలేదు.

2. జ్ఞానదశలో కల్పితమయిన ద్వైతము నశిస్తుంది. అయితే ఇదంతా ఆత్మరూపంలోనే

ఉంటుంది కనుక జీవనాశం ఉండదు. జీవుడు చైతన్యరూపంకనుక ఆత్మరూపంలో ఉండవచ్చును. జడమయిన జగత్తు ఎలా ఆత్మరూపం అవుతుంది? – సమా – కార్యం కారణరూపంగా ఉంటుంది గదా! కాని కారణం అచేతనం. కార్యం జడం కదా? – ఎలా? రజ్జువునుండి సర్పంవలె. బ్రహ్మ కార్యంకాని జీవుడు బ్రహ్మంలో ఎలా లయమవుతాడు? బ్రహ్మయే జీవుడుగా అయినాడు కనుక జీవుడు తిరిగి బ్రహ్మం అవుతాడు. నిర్వికార బ్రహ్మకు వికారం గగనానికి "తల మాలిన్యము లవలె" భ్రాంతి కల్పితం. అయినా గగనం నిర్వికారమే కదా! మాయవలననే ఇదంతా కనుక ద్రష్ట దృశ్యం అంతా మిథ్య. 'దృశి' సత్యము. (జడప్రపంచము బ్రహ్మంలో కలియటం అంటే మాయలో కలియటమే. అది మిథ్యయే కనుక బ్రహ్మం అద్వితీయమే)

**శ్లో॥ యేనేదం సకలం పుమాన్ కలయతే జానాతు తం కేన వా**
**యశ్చేదం సకలం పుమాన్ కలయతే జానాతు తం కేన వా ।**
**జ్ఞాతా జ్ఞానమయోఽప్యయం యది భవేద్ జ్ఞేయః పరేణాపి స**
**జ్ఞేయశ్చే త్యనవస్థితశ్చ బలవాన్వ్యాఘాత ఏవేష్యతామ్ ॥ 107**

భావ॥ అవిద్యాదశలోనూ ఆత్మ అదృశ్యమే. కల్పిత శరీరం ఆత్మగా దృశ్యమే తప్ప వాస్తవంగా ఆత్మ అదృశ్యమే– ప్రజ్ఞాన రూపమయిన ఏ ఆత్మతో పురుషుడు ఈ ప్రపంచమును దర్శించుచున్నాడో ఆ ఆత్మను దేనితో చూడాలి? ఏ పురుషుడు ఇదంతా గమనించుచున్నాడో అతనిని మనము దేనితో గమనింపగలము? జ్ఞానస్వరూపుడయిన ఈతడు జ్ఞేయుడే అంటే ఆ జ్ఞాత కూడా జ్ఞేయుడే కనుక వానికొక జ్ఞాత ఉండాలి. అలా అనవస్థ ఏర్పడుతుంది. అలాగే బలమయిన వ్యాఘాతం గూడా. వ్యాఘాతమనగా తనమాటను తనే కాదనటం – జ్ఞాత అని చెపుతూ అది జ్ఞేయం అనటం, జ్ఞానం జ్ఞేయం అనటం తప్పు. 107

విశే॥ 1. ఆత్మ ప్రజ్ఞానస్వరూపం. వ్యవహారంలో అదే జ్ఞాత. కనుక దీనిని జ్ఞేయమనటం తప్పు. జ్ఞేయమును తెలిసికొనటానికి జ్ఞాతకు కరణములున్నవి. జ్ఞాతను తెలిసికొనటానికి కరణములు లేవు. "నాన్యోతోస్తి ద్రష్టా"

2. ప్రజ్ఞానంతో అంతా చూస్తాడు – ఇంతకూ ఆ చూచే వాడెవరు. జీవుడు కూటస్థుడా? ఈశ్వరుడా? బ్రహ్మమా? ఇందులో **అంతఃకరణం చేరినవాడు జీవుడు. అంతఃకరణం పైన ఉన్నవాడు కూటస్థుడు. మాయాసహితుడు ఈశ్వరుడు. మాయ పైనున్నవాడు బ్రహ్మం. (ఉపాధి అయితే ఉపాధిలో ఉన్నవస్తువు కార్యంలో కలియదు. గిన్నెలో ఉప్పు. అవచ్ఛిన్నమయితే కార్యంలో కలుస్తుంది – కూరలో ఉప్పు)** ఇక వీరిలో ద్రష్ట ఎవరు? – జీవుడా – కాదు. వాడు అంతఃకరణముతోను ఇంద్రియములతోను తెలిసికొంటాడు. కూటస్థుడు కాదు – ఆయన విశేషజ్ఞానం ఉండదు. (అసలు విశేషమే ఆయనకుండదు) ఈశ్వరుడూ కాదు. ఆయన అంతా మాయతోనే

చూస్తాడు. ప్రజ్ఞానంతో కాదు. బ్రహ్మమూ కాదు. ఆయన కూటస్థునివలె విశేష దృష్టి గలవాడు కాడు.

3. మరి ఎవరు ద్రష్ట – సమా – జీవుడే. ఎందుకంటే ఇంద్రియాలు అంతఃకరణం స్వయంగా పని చేయవు. అవి జడములు. వాటిద్వారా బయటకు పోయిన వృత్తిరూప జీవచైతన్యమే అలాగే సుఖాది – ఆకారంగా పరిణమించి అదే అంతర చైతన్యము విషయగ్రహణం చేస్తుంది. కనుకనే జీవుడు "సర్వం ప్రజ్ఞానేన పశ్యతి" అన్నారు. "యేన వా రూపం పశ్యతి" (ఐతరేయం) "యేనేక్షతేశృణోతీదం జిఘ్రతివ్యాకరోతి చ స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞాన ముదీరితం" బింబ ప్రతిబింబములొక్కటే కనుక వృత్తి ప్రతిబింబ చైతన్యము బింబ జీవ చైతన్యమూ ఒకటే. బుద్ధిలో ప్రతిఫలితమయిన చైతన్యం ఆంతరబాహ్యసాధనముగా నుపయోగపడును. వృత్తిజడము కనుక అది ప్రత్యక్షంగా కరణం కాలేదు. అందులో ప్రతిబింబించిన చైతన్యము కరణము. ఈ రకమయిన చైతన్యము స్వరూపము కాదు. సాధనమయిన జ్ఞానం. ఎందుకంటే, ఘటాకార పరిణతమయిన ఆభాస చైతన్యంతో గూడిన బుద్ధివృత్తివలన పుట్టినదిగనుక ఘటజ్ఞానం వంటివి జన్యములు. జన్యజ్ఞానం "అవగతి". అది ప్రజ్ఞానం ఎలా అవుతుంది? – సమా – వృత్తిలో ప్రతిఫలిస్తే అలా అవుతుంది. అనగా నిత్యజ్ఞానమునందు బుద్ధి వృత్తిద్వారా ఘటాదులు చేరినపుడు (విషయం) అది ఘటాది జ్ఞానరూపం అవుతుంది. (నదిలో నీరు నది. అందునుంచి చెంబులో తెచ్చిన నీరు నది కాదు. చెంబునీరు. గంగ చెంబు లాగా) (అవగతి అనగా ఘటాది జ్ఞానం)

4. లేదా, బుద్ధివృత్తిలో అవచ్ఛిన్నమయిన చైతన్యం సాధనము. బుద్ధివృత్తిలో ప్రతిఫలించిన ఘటాదిచైతన్యము ఫలము. చైతన్యరూపమయిన ఆత్మ బుద్ధి – అవచ్ఛిన్నమైన ప్రజ్ఞానము, బుద్ధివృత్తి ప్రతిబింబితమయిన ఫలచైతన్యము అవగతి. ఈశ్వరుడున్ను మాయావృత్త్యవచ్ఛిన్న చైతన్యం. లేదా, మాయావృత్తి ప్రతిఫలిత చైతన్యం గాని అయితే ప్రజ్ఞానము చేత సర్వజ్ఞుడగును. అలాగే కూటస్థుడు స్వరూపచైతన్య లక్షణమయిన ప్రజ్ఞానంతో సమస్తమును సామాన్యముగా భాసింపజేయును. కనుక కూటస్థుడనియు చెప్పవచ్చును.

5. కూటస్థుడయిన ఒకే స్వరూపచైతన్యం తనే ఒకే జ్ఞానక్రియకు కర్త కరణం ఎలా అవుతుంది. – ఇచ్చట కరణం అనగా "స్వయంగా" చూస్తున్నాడు అన్నట్లు. అంతేగాని తనచైతన్యమును సాధనంగా చేతిలో పట్టికొని అని అర్థంకాదు. "అపాణిపాదో జవనోగ్రహీతా" అలాగే బ్రహ్మం గూడా స్వరూపచైతన్యంతో అంతా చూస్తున్నాడని చెప్పవచ్చు. సామాన్యంగానే విశేషంగా కాదు. **కనుక జీవ ఈశ్వర కూటస్థ బ్రహ్మలు జ్ఞానక్రియా కర్తలు కరణములు కావచ్చును**. ఇద్దరిది విశేషజ్ఞానం. ఇద్దరిది స్వరూపమయిన సామాన్యజ్ఞానం.

6. ఒకే బ్రహ్మం జ్ఞానక్రియా కర్త కరణం, ఫలం కావటం ఎలా? – ఉపాధి భేదం వలన అవుతుంది. చూడండి. (సీసాలోని ఇంకు కలంలో చేరితే కరణం అవుతుంది.)

అంతఃకరణం లేదా మాయలో = కర్త ; వృత్తిలో కలిసినది = కరణం; వృత్తిలో ఫలించినది = ఫలం, విషయంలోది (ఘటచైతన్యం) = జ్ఞేయం – (కర్మ) న్యాయమతంలో గూడా ఒకే ఆకాశం చెవిలో ఉంటే ఇంద్రియం అనగా కరణం, ఘటంలో ఉంటే విషయం అవుతుంది.

**అలా అయితే ఆత్మజ్ఞేయం ఎందుకు కాదు? – మరో జ్ఞాత లేదు కదా!** అంతేకాని, విషయావచ్ఛిన్న చైతన్యము లేదని కాదు. ఆత్మాకారంగా బుద్ధివృత్తిలో నున్న ఆత్మ ఆత్మను తెలిసికొను చున్నది గదా! సమా – కరణ వ్యాపారం కన్న జ్ఞాన స్వరూపమయిన ఆత్మ తెలుస్తూనే ఉన్నది గదా! తనకు తాను ఎపుడూ పరోక్షము కాదు గదా! **కనుక ఆత్మ జ్ఞేయము కాదు.** జ్ఞాతయే.

**శ్లో॥ భూతానాం మధు భూర్భువశ్చ మధు తాన్యస్యాం చ తేజోమయోఽ**
**ధ్యాత్మం దేహ్యామృతస్స ఏతదమృతం చాత్మైష సర్వం బృహత్ ।**
**భూతానాం మధు వార్జలస్య మధు తాన్యస్మింశ్చ తేజోమయోఽ**
**ధ్యాత్మం రైతస ఏష చామృతమయో బ్రహ్మోఽయమాత్మాఽమృతమ్ ॥108**

భావ॥ సర్వజగత్తు ఆత్మయందే సృష్టి స్థితి లయములు పొందును. సమాన విషయము ఆత్మ. ఇదంతా ఆత్మ. "ఆత్మై వేదం సర్వమ్" ఉదా॥ ఘటం – మట్టి యందిదేవిధముగా నుండును. కనుక ఈ కారణముగా జగత్తు ఆత్మయే – సృష్టి స్థితి లయాద్యాధారం అయిన సమాన పదార్థమే. ఆ విశేషపదార్థము. మట్టియే ఘటము – దీనిని ప్రతిపాదించటానికే యీ మధు బ్రాహ్మణం. తేనెతుట్టెను అనేక మక్షికలు నిర్మిస్తాయి. అలాగే ఈ భూమి బ్రహ్మాది తృణ పర్యంత భూతములకు 'మధు' అనగా అవి నిర్మిస్తాయి. భూమికి అవి "మధు" వు కార్యములవుతాయి. ఈ భూమి యందున్న భౌముడు, చిన్మాత్రమయుడయిన పురుషుడు దేహమునందొక పురుషుడు అమృతుడు. వీరు భూతములకు "మధువు". భూతములు వీరికి మధువు కాగా 1) భూమి 2) భూతములు 3) భౌమ పురుషుడు 4) శారీర పురుషుడు – 4 = 1 మధువు. ఈ నాల్గురకాల మధువు ప్రస్తుత ఆత్మయే. "ఇదం సర్వం యదయమాత్మా" కదా! అలాగే భూతములకు జలము మధువు. జలమునకు భూతములు మధువు. జలములో ఉన్న తేజోమయ అమృత పురుషుడు, అలాగే దేహమునందున్న తేజోమయ అమృత పురుషుడు (=ఇతడు రేతోమయుడయిన పురుషుడు – భూతములకు మధువు. ఇతనికి భూతములు మధువు.

1) జలము 2) భూతములు 3) జలపురుషుడు 4) రైతసుడు ఈ 4 కలిసి ఒక మధువు. ఇవన్నియు అమృతమయిన బ్రహ్మము. బ్రహ్మాభిన్నమయినది గనుక ఆత్మ అగును. లేదా, ఆత్మ స్వరూపమయిన అమృతమయిన బ్రహ్మమే అగును. 108

విశే॥ అమృతం ఇతడే. సర్వం ఇతడే. బ్రహ్మాం ఇతడే; సర్వం ఆత్మకార్యం కదా! కార్యం

కారణభిన్నంగా ఉండదు గదా! ఆత్మయే బ్రహ్మం, అదొక్కటే సత్యం. కనుక సర్వం ఆత్మ. బ్రహ్మం, అమృతం అని గ్రహించాలి.

**శ్లో॥ భూతానాం మధు వహ్నిరస్య మధు తాన్యస్మింశ్చ తేజోమయోఽ**
**ధ్యాత్మం వాఙ్మయ ఏష చామృత ఇదం బ్రహ్మేయమాత్మా జగత్ ।**
**భూతానామ్మధు వాయురస్య మధు తాన్యస్మింశ్చ తేజోమయోఽ**
**ధ్యాత్మం ప్రాణమయః పుమానిదమసావాత్మాఽమృతం బ్రహ్మ యత్ ॥109**

భావ॥ భూతములకు అగ్ని "మధువు". అగ్నికి భూతములు మధువు. అగ్నియందున్న అగ్నిమయుడయిన పురుషుడు శారీరకుడయిన వాఙ్మయపురుషుడు భూతములకు మధువు. ఆ భూతములు వీనికి మధువు. ఇదే బ్రహ్మం. ఈ బ్రహ్మమే ఆత్మ. అదే జగత్తు. అలాగే భూతములకు వాయువు మధువు. వాయువునకు భూతములు మధువు. వీనియందును, దేహమునందును ఉన్న తేజోమయుడు అమృతమయుడు - అయిన ప్రాణమయపురుషుడు - వీనికి భూతములు మధువు. భూతములకు వారు మధువు.

పై నాలుగు '1' మధువు. ఈ నాల్గు ఒకే మధువు. ఇవి ఆత్మ అమృతము బ్రహ్మము. 109

**శ్లో॥ భూతానాం మధు భానురస్య మధు తాన్యస్మింశ్చ తేజోమయోఽ**
**ధ్యాత్మం చామృత ఏష చాక్షుష ఇదం బ్రహ్మేదమాత్మాఽమృతమ్ ।**
**భూతానామ్మధు దిగ్దిశశ్చ మధు తాన్యస్యాం చ తేజోమయోఽ**
**ధ్యాత్మం శ్రౌత్ర ఉతామృతశ్చ తదిదం బ్రహ్మేదమాత్మాఽమృతమ్ ॥110**

భావ॥ భూతములకు సూర్యుడు మధువు. వారు వీనికి మధువు. సూర్యునియందు దేహమునందున్న తేజోమయ చాక్షుష పురుషులు భూతములకు మధువులు. వారికి వీరు మధువులు. భూతములు, సూర్యుడు, తేజోమయ, చాక్షుష - 4. మధువు. అట్లే భూతములకు దిక్కు, దిక్కులకు భూతములు మధువు. దిక్కునందున్న తేజోమయుడు దేహమునందున్న శ్రౌత్రపురుషుడు అమృతులు. ఆత్మలు. బ్రహ్మములు. ఇవన్నియు (ఈ 4) పై వలెనే. 110

**శ్లో॥ భూతానామ్మధు చన్ద్రరోఽస్య మధు తాన్యస్మింశ్చ తేజోమయోఽ**
**ధ్యాత్మం మానస ఏష చామృత ఇదం బ్రహ్మేదమాత్మాఽమృతమ్ ।**
**భూతానాం మధు చఞ్చలా చ తటితస్తాన్యత్ర తేజోమయోఽ**
**ధ్యాత్మం తైజస ఏష చామృత ఇదం బ్రహ్మేదమాత్మాఽమృతమ్ ॥111**

భావ॥ భూతములకు చంద్రుడు, చంద్రునకు భూతములు మధువునందలి తేజోమయుడు, దేహమునందు మానస పురుషుడు - వీరంతా అన్యోన్యం మధువులు. సర్వం అమృతం, బ్రహ్మ, ఆత్మ. అట్లే, భూతాలు, విద్యుత్తు, విత్యుత్తునందలి, తేజోమయుడు, దేహమునందలి తేజోమయుడు వీరు 4 పై వలెనే. 111

**శ్లో॥ భూతానాం మధు వారిదోఽస్య మధు తాన్యస్మింశ్చ తేజోమయోఽ**
**ధ్యాత్మం సౌవర ఏష శాబ్ద ఇదమాత్మేదం బృహచ్చామృతమ్ ।**
**భూతానాం మధు ఖం చ తస్య మధు తాన్యస్మింశ్చ తేజోమయోఽ**
**ధ్యాత్మం హార్దనభోమయశ్చ పురుషో బ్రహ్మేదమాత్మాఽమృతమ్ ॥112**

భావ॥ భూతములకు మేఘము, మేఘమునకు భూతములు, మేఘమునందున్న తేజోమయునకు దేహమునందున్న సౌవర (స్వర) పురుషునకు భూతములు, భూతములకు వీరు మధువులు. అట్లే, భూతములకు ఆకాశము, ఆకాశమునకు భూతములు, ఆకాశమునందున్న తేజోమయ పురుషుడు, దేహమునందున్న హృదయాకాశమయపురుషుడు – వారందరు – పైవలెనే. 112

**శ్లో॥ భూతానామ్మధు ధర్మ ఏవ మధు తాన్యస్యాత్ర తేజోమయోఽ**
**ధ్యాత్మం చామృత ఏష ధార్మ ఇదమాత్మేదం చ సర్వం బృహత్ ।**
**భూతానామ్మధు సత్యమస్య మధు తాన్యస్మింశ్చ తేజోమయోఽ**
**ధ్యాత్మం చామృత ఏష సాత్య ఇదమాత్మేదం చ సర్వం బృహత్ ॥113**

భావ॥ భూతములకు ధర్మము మధువు. ధర్మమునకు భూతములు మధువు. ధర్మమునందలి తేజోమయపురుషునకు దేహమునందున్న ధర్మపురుషునకు భూతములు భూతములకు వీరు మధువులు. అంతా బ్రహ్మమే. ఆత్మయే. భూతములు సత్యము, సత్యమునకు భూతములు, సత్యమునందలి తేజోమయునకు, దేహమునందలి అమృతుడయిన సత్యపురుషునకు భూతములు, భూతములకు ఆపురుషులు ఆహారములు. మిగిలినదంతా పైవలెనే. 113

**శ్లో॥ భూతానాం మధు మానుషం మధు తతస్తాన్యత్ర తేజోమయోఽ**
**ధ్యాత్మం చామృత ఏష మానుష ఇదం బ్రహ్మేదమాత్మా సమమ్ ।**
**ఆత్మా భూతమధు స్వయం చ మధు తాన్యస్యాత్ర తేజోమయో**
**యశ్చాత్మా పురుషోఽమృతస్స పరమోఽయం ముఖ్య ఆత్మా బృహత్ ॥114**

భావ॥ భూతములకు మనుష్యజాతి మధువు. మనుష్యజాతికి భూతములు మధువు. మనుష్యునియందలి తేజోమయపురుషుడు దేహమునందలి మానుష పురుషుడు – వీరికి భూతములు, భూతములకు వీరు మధువులు. అట్లే

భూతములకు శరీరం మధువు. శరీరమునకు భూతములు మధువు. ఆత్మ యందలి తేజోమయపురుషునకు, అలాగే ఆత్మయే అయిన పురుషునకు భూతములు భూతములకు వారు మధువు. మిగిలిది పై వలెనే. ప్రస్తుతం శరీరగతంగా చెప్పబడిన ముఖ్యాత్మయే ప్రజ్ఞాన ఘనుడయిన పురుషుడు. 114

విశే॥ 1. భూమి మొదలయినవానియందు అధిదైవతముగాను, అధ్యాత్మముగాను చెప్పిన పురుషులెవరు? – వారందరూ జీవులే. చూడండి. లింగాభిమాని జీవుడే శారీరుడు. లింగం సూక్ష్మ శరీరం గదా! ఇందులో రేతః ప్రధానుడు రైతసుడు. వాక్ప్రధానుడు వాఙ్మయుడు. ప్రాణాభిమాని ప్రాణమయుడు. ఇలా ఆయా విషయాలు ప్రధానంగా అభిమానంగా గలవాడు ఆయా అభిమాని. మానుషాభిమాని మానుషుడు. విజ్ఞానమయుడు ఆత్మ.

2. లేదా; ఎచ్చట పుట్టిన/ఉన్నవాడు ఆ పురుషుడు. నేత్రభవుడు – చాక్షుషుడు. శబ్ద భవుడు శాబ్దుడు, అయినా శరీరము, నేత్రము, శబ్దము మొదలగునవి ఉన్న వాడు ఆ అభిమాని – శబ్దమునందున్నవాడు శబ్దాభిమాని.

3. ఇక అధిదైవతములో పంచభూతములయందు, సూర్యచంద్ర పర్జన్యాదులందున్న అభిమాని దేవతలుందురు. ఆ దేవతలకా పేరుతోనే పిలుపు. కనుక వారే ఇచ్చట తేజోమయ పురుషులయి యుండవచ్చును. అట్లే ధర్మ సత్య మానుషులయందున్ను అభిమాని దేవతలే తేజోమయపురుషులే.

4. మధువులు అనగా ఉపకరించునవి. అవి అన్యోన్యం. అగ్న్యాది దేవతలు × ప్రాణులు; పృథివ్యాదులు × భూతములు; భౌతికప్రపంచం చరాచరం × పృథివ్యాది భూతాలు; విద్యుత్తు మేఘం(సస్యాదులు) × దేహధారులు(యజ్ఞాదులలో); ధర్మసత్యములు(పూర్వజన్మ– ఈజన్మ) × భూతములు (మనుష్యాది జన్మ కారకములు); మానుషాది జాతి × భూతములు (చరాచరదేహములు) జీవుడు × సర్వము (జీవభోగకరం); జీవుడు × దేహము

5. అధ్యాత్మ పురుషులు – అధిదైవత పురుషులు వీరు ఒక్కటే కనుక అన్యోన్య – ఉపకారకత్వం చెప్పలేదు. చూడండి.

“అగ్నిర్వాగ్భూత్వాముఖం ప్రావిశత్” కనుక అలాగే “అపోరేతోభూత్వా శిశ్నం ప్రావిశత్” “చంద్రమా మనోభూత్వా హృదయం ప్రావిశత్” ఇలా అగ్ని,జల,వాయు, సూర్య, దిక్, చంద్ర దేవతలు శరీరంలో వాక్, రేతః, ప్రాణ, నేత్ర, కర్ణ, మనోరూపములుగా దిగి వచ్చినారు. కనుక ఒక్కరే. ఇలాగే పృథివ్యాదులకు శారీరాది పురుషులకు ఐక్యము.

అయ్యా! దేవతలు కరణములు ఒక్కటే. అయినా కర్త అయిన పురుషుడు వాగాది స్వరూపుడు కాడు. కాని వాగధ్యాసవలన అలా భావించాలి. ఈ అధ్యాస సాక్షాత్తుగా ఉండదు. “అహం వాక్” అని ఎవడూ అనడు. “అహం వదామి” అని వాక్కు యొక్క ధర్మమయిన “వదనమును” (మాట్లాడుటను) తనయందు అధ్యాస చేసికొంటాడు గదా!

6. వహ్న్యాది దేవతలు వాగాదులను అనుగ్రహిస్తారు గాని వారు కరణ స్వరూపులుగా దిగలేదు – అనే మతంలో, వారు జీవులే – ఉపాధివలననే భేదం. కనుక ఆదిత్యాది దేహంలోనూ

మనుష్యదేహంలోనూ ఉన్న పురుషుడు ఒక్కడే. అలా అయితే మధువు 4 రకాలు ఎలా అయింది? – పార్థివ, శారీర మొదలగు తేడాలవలన అయింది కనుక అంతా ఆత్మరూపమే. ఆత్మకార్యమే. దీనియందు ఆత్మ ఆకేశనఖపర్యంతం వ్యాపించి ఉన్నాడు. కనుక "ఇదం సర్వం యదయమాత్మా".

**శ్లో॥ ఆత్మాఽయం పర ఏవ సర్వజగతాం రాజా పతిశ్చేశ్వర–**
**శ్చక్రాన్తర్గతనాభినేమియుగళే సర్వే యథాఽరాశ్రితాః ।**
**అస్మిన్నాత్మని సర్వ ఏవ కలితాః ప్రాణాశ్చ లోకాస్సురా–**
**స్సర్వే ప్రాణభృతశ్చ బుద్ధ్యుపహితాస్సర్వేఽపి జీవాస్తథా ॥ 115**

భావ॥ ఈ పరమాత్మయే సర్వ జగత్తుకు రాజు. పతి. ఈశ్వరుడు. చక్రాంతర్గతమయిన కుండనుంచి చక్రముదాకా కడ్డీలు (చువ్వలు) అమరినట్లు ఆత్మయందే సమస్త ప్రాణములు లోకములు సురలు, ప్రాణులు, బుద్ధ్యుపహితులయిన జీవులు అమరిరి. 115

విశే॥ 1. రాజు = రంజకుడు, పతి = పాలకుడు, బుద్ధ్యుపహితాః = బుద్ధ్యవచ్ఛిన్నులు, ప్రతిబింబితులు, బుద్ధితాదాత్మ్యం పొందిన వారు, చిదాభాసులు, సర్వ జగత్తు కూటస్థమయిన ఆత్మయందే కల్పితము. జీవుడు ప్రత్యగాత్మగా ఒక్కడే చిదాభాసుడుగా బుద్ధిసంఖ్యనుబట్టి అనేకము. వీరు ప్రతిబింబంగా అవచ్ఛిన్నంగా కల్పితులు. మిథ్యలు.

2. ఆత్మయే సర్వం, బ్రహ్మం. అందువలన ఆత్మవేత్త సర్వము, బ్రహ్మము అగును. ఆత్మవేత్తయే ఆత్మ. "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" "స సర్వమభవత్"

**శ్లో॥ ఆత్మా స ద్విపదశ్చతుష్పద ఇతి ఖ్యాతాః పురోఽకల్పయ**
**ద్రాజా వా పుర ఏష తా ఉదవిశజ్జీవస్వరూపేణ చ ।**
**శేతే యత్సకలాసు పూర్షు పురుషః ఖ్యాతస్స పూర్ణశ్చ య–**
**స్తైనేనాతత మస్తి కిఞ్చన తథా నాసంవృతం కిఞ్చన ॥ 116**

భావ॥ సర్వజగత్కారణమయిన ఆ పరమాత్మ ఆకాశాదులను సృష్టించి, తరువాత చతుష్పాద జీవులను ద్విపాద జీవులను సృజించెను. రాజువలె ఈశ్వరుడు ఈ దేహ పురములను కల్పించి, జీవస్వరూపంతో అందులోనికి ప్రవేశించెను. సకల పురములయందు శయనించువాడు కనుక లేదా, పూర్ణుడు కనుక పురుషుడు. ఈ జీవునిచేత వ్యాప్తము కాని వస్తువు లేదు. సంవృతము కానిదీ లేదు. 116

విశే॥ 1. "శరీరం యదవాప్నోతి, యచ్చాప్యుత్క్రామతీశ్వరః, గృహీత్వైతాని సంయాతి, వాయుః గంధానివాశయాత్" "శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవచ అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే" గీత.

దీనివలన లింగశరీరాభిమానిపురుషుడుగా (జీవుడు) ఈశ్వరుడు దేహంలో ప్రవేశించాడు. లింగశరీరిగానే స్థూలశరీరంలోకి ప్రవేశించెను. (ముత్యం పెట్టిన భరిణను సంచీలో వేసినట్లు.)

2. లింగశరీరం ఘటం వంటిది. అందులో "ఆత్మ" ఆకాశం వంటిది. కనుక లింగశరీరం లోకాలు సంచరించినా విభువయిన ఆత్మ అలా సంచరించదు. ఘటం తిరిగినా ఘటాకాశం తిరుగదు. "**ఘటో నీయేత నాకాశః తద్వజ్జీవో నభోపమః**" అలాగే ఘటంలోకి ఆకాశం ప్రవేశించదు. అది అక్కడనే ఉంటుంది. అలాగే ఆత్మ జీవరూపంతో ప్రవేశించటం గూడా కుదరదు. అది గౌణంగా చెప్పటమే. అయినా లింగ తాదాత్మ్యాధ్యాసవలన లింగశరీరం ప్రవేశిస్తే జీవుడు ప్రవేశించినట్లు భావించటం జరిగింది.

"ధ్యాయతీవ లేలాయతీవ" శ్రుతి. కనుకనే భాష్యకారులు "పక్షి" అన్న ఉపనిషత్పదమునకు లింగశరీరమను అర్థం చెప్పారు.

3. "బుద్ధి ప్రతిబింబము - జీవుడు" అను పక్షమున, జీవుడున్ను ప్రవేశించటం కుదురుతుంది. ఉపాధినిబట్టి ప్రతిబింబము పరిచ్ఛిన్నంగా ఉంటుంది. కనుక రెండు మతాలకూ సరిపడా "జీవరూపంతో" అన్నాము. శ్రుతి గూడా "అనేన జీవేన" అన్నది. భాష్యవిరోధం అంటారా అయితే జీవేన అంటే 'లింగేన' అనే అర్థము. జీవతి, అనేన = జీవః = లింగశరీరము. ప్రాణాత్మకము గదా! దీనివలన స్థూలశరీరం బ్రతుకుతుంది. విభువు అయిన ఆత్మ వ్యాపి అయినా జీవన హేతువు కాదు గదా! కూటస్థాత్మ వలన మృతశరీరం సజీవం కాదు గదా! కూటస్థాత్మ అంటే వ్యాపకమయిన బ్రహ్మం కదా!

4. కనుకనే "పురుషః" పూర్షుశేతే, పూర్ణః - (పృషోదరాది గణం ప్రకారం సాధువు) కనుకనే జీవులనేకులు కారు. జీవేశ్వరభేదము లేదు. "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" - గీత. లింగ భేదం వలన ఆత్మభేదం రాదు. ఘటభేదం వలన ఆకాశభేదం రాదు గదా! మట్టికుండ రాగిచెంబు బంగారు గిన్నె వీటిలోని ఆకాశంలో భేదం లేదు. "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" గదా! కనుక పూర్ణుడు.

5. లోపల మాత్రం ఉంటే "ఆత్మ" అనవచ్చును. లోపల బయట ఉంటే ఆత్మ ఎలా అవుతుంది? - సమా - మృత్తు ఘటంలో వ్యాపించినట్లు ప్రపంచమంతా ఆత్మ వ్యాప్తం కనుక ఆత్మ సర్వాత్మయే. అదే, ఆ పూర్ణమే మన ఆత్మ అయి తీరాలి. మరో వస్తువు లేదు గదా! ఘటానికి మట్టి, భ్రాంతి సర్పమునకు రజ్జువు తప్ప ఇంకేది ఆత్మ కాగలదు? "యత్ర నాన్యత్పశ్యతి నాన్యత్ శృణోతి నాన్యద్విజానాతి స భూమా" - అని చెప్పబడిన భూమ ఇదే. కనుకనే ఇది "ఏకమే వాద్వితీయం బ్రహ్మ".

**శ్లో॥ రూపం ఖ్యాపయితుం తదేతదమృతం సర్వేషు రూపేష్వసా-**
**వాత్మాఽభూత్ప్రతిరూప ఏవమథవా జానాతు కో వా కథమ్ ।**
**మాయాభిః పురురూప ఏష భగవానిన్ద్రః పుమానీయతే**
**యుక్తాన్యస్య రథే హయా ఇవ తనౌ సర్వేన్ద్రియాణ్యేవ యత్ ॥ 117**

భావ॥ పరబ్రహ్మం/ఆత్మ అమృతమయిన తన రూపమును అందరికి తెలియపఱచుటకు సర్వరూపములయందును ప్రతిరూపమయిన ఆత్మగా అయ్యెను. అనగా ప్రతిబింబముగానో లేదా ఉపాధికి అనురూపముగానో (అవచ్ఛిన్నము) అయినది. లేనిచో ఆయనను ఎవరయినా ఎలా తెలిసికొనగలరు. లేదా, అసలు జ్ఞానం ఎలా జరుగగలదు? కనుక భగవంతుడయిన పరమేశ్వరుడు మాయలతో అనేకరూపములు గలవాడుగా తెలియుచున్నాడు. రథమునందు అశ్వములవలె ఆయన రథమయిన యీశరీరమునందు సర్వేంద్రియములు నియమింప బడినవి. 117

విశే॥ 1. ఆత్మ చేతనం. మిగిలినదంతా జడము. ఆత్మ బుద్ధిలో ప్రతిబింబించితే బుద్ధి చేతనం అవుతుంది. లేదంటే అదీ జడమే. బుద్ధి ఇంద్రియాలు అన్నియు జడమయితే జ్ఞానం ఎలా? ఆత్మజ్ఞానం ఎలా? ఘటాది లోకవ్యవహారజ్ఞానం ఎలా? కేవల చైతన్యం ఉన్నా దానికి దర్శనాది క్రియావికారాలుండవుగదా! కనుక జగత్తే లేనిది గ్రుడ్డిది అవుతుంది. అందువలన ఆత్మ బుద్ధుల యందు ప్రతిబింబించింది. (లేదా వ్యాపించింది.) కనుకనే బుద్ధి ప్రతిబింబిత జీవుడుంటేనే వ్యవహారం. నిద్రించినా మరణించినా వ్యవహారం లేదు. "రూపం రూపం ప్రతిరూపో బభూవ" అని శ్రుతి. **ఇదంతా ప్రతిబింబవాద పద్ధతి.**

2. **అవచ్ఛిన్న వాద పద్ధతిలో** : ప్రతిరూపః = అనురూపః అనగా అనుకూలమయినది. అనగా ఉపాధులందు అనుకూలంగా వ్యాపించినది. తద్ద్వారా బుద్ధి జీవులకు అన్యోన్య తాదాత్మ్యాధ్యాస జరిగింది. అది జరిగితేనే ద్రష్ట శ్రోత జ్ఞాత అయిన జీవుడు ఏర్పడుతాడు. లేదంటే ప్రపంచం అంధకారమే. కనుక తనను ప్రపంచమును తెలుపుకొనుటకు ఆత్మయే జీవుడయ్యెను.

"మేనేఽసంతమివాత్మానం సుప్తశక్తిరసుప్తదృక్" – భాగవతము.

3. దీనివలన ఈశ్వరుడు తనకు అనర్థకరమయిన సంసారమును ఎందుకు సృష్టించాడు? తనే జీవుడయి ఎందుకు సంసారంలో పడినాడు? – రెంటికీ సమాధానం లభించినది. ద్రష్ట అయిన జీవుడు దృశ్యమయిన జగత్తు ఉంటేనే ఆత్మకు స్వరూపలాభం. లేదంటే ఆత్మ ఎవరికి తెలుసు. ఉన్నా లేనట్లే గదా!

4. నిర్విశేషము నిరుపాధి అయిన ఆత్మను తెలుసుకొనటానికి ద్రష్టగా జీవుడవసరం.

దృశ్యమయిన జగత్తు ఎందుకు? సమా – జీవుడు బుద్ధిని బట్టి ఏర్పడినాడు. అందుకు బుద్ధి కల్పింపబడినది. బుద్ధి ఆత్మాకారం కావాలంటే (ఆత్మను గ్రహించటం అదే) గురువు శాస్త్రమూ కావాలి. శ్రవణాదులకోసం ఇంద్రియాదులు కల్పించాల్సివచ్చింది. ఇంద్రియాల ఆశ్రయంకోసం స్థూల శరీరం అవసరం అయింది. దానికోసం ప్రాణాలు అవసరం. వాటికోసం అన్నపానాలు అవసరం. అందుకు అన్నం, జలం అవసరం, అందుకు ఓషధులు, వాటికి భూమి, పక్వంగావటానికి అగ్ని, అగ్నిమండటానికి వాయువు, వాయువు సాగటానికి ఆకాశం అవసరం. కనుక సమస్త సృష్టి ఆత్మ జ్ఞానోపయోగం కోసం వచ్చినదే. (కౌపీన సంరక్షణార్థమయం పటాటోపః) మూఢులు తాము అనుభవించటానికే యీ శరీర సంసారములని భావించి అల్లాడుతుంటారు. అందుకే నేను (రచయిత) నా రమావల్లభరాయ స్తవంలో,

" లీనాన్ స్వప్రకృతౌ ప్రదాయచ తనూరేతా స్సముజ్జీవయన్
నిశ్వాసేన గృణన్ స్వవృత్తమనఘం జ్ఞానం చ తేభ్యోదిశన్
స్వేనాంతర్యమితై స్వదత్త కరణైః శిష్యైశ్చ తైః పూజితః
తేషాం స్వం వితరన్ పదం జయతి యో వందే రమావల్లభమ్"

5. మరోరకంగా గూడా ఈ సృష్టి ఆత్మజ్ఞానం కోసం ఉపయోగింస్తుందని చెప్పవచ్చును.

"న భూమిర్నతోయం..." (శంకర) "నాఽహందేహోనేంద్రియా...(శంకర) "స ఏష ఆదేశోనేతినేతి" – శ్రుతి. ఈ ప్రకారం సర్వాతీతమయి మిగిలే (సర్వ నిషేధావధిగా) పరబ్రహ్మమును తెలిసికొనుటకు 'సర్వం' అయిన జగత్తు అవసరం కదా! కనుక జీవసృష్టి జగత్సృష్టి ఆత్మకు అనర్థకరం కాదు. అర్థకరమే.

6. అయ్యా! ఆత్మ సంసారంలోకి రావటం సంసారిత్వం అనర్థం కదా! కాదు. గగనం నీలం అన్నట్లు ఇదంతా మాయ గదా! నిర్విశేషునకు ఇట్టి ఆలోచనా విశేషం గూడా మాయవలన వస్తుంది. మాయ విశేషం కాదు. అందువలన బ్రహ్మం మాయ ఉన్నా నిర్విశేషమే. మాయ నిజమయి (సతీ) తే మాయాకృతం వలన బ్రహ్మం మాయికము సవిశేషము అవుతుంది. మాయ 'అసత్' అయితే, బ్రహ్మం సవిశేషం కాదు గదా! కనుక మాయ ఉన్నా నిర్విశేషమే. మాయే ఒక విశేషం గదా అంటారా! – సమా – మాయ అనిర్వచనీయం – సత్ కాదు. అసత్ కాదు. నిరూపించలేము. అగ్నియొక్క శక్తివలె అది విడిపదార్థము కాదు. కనుక దానివలన బ్రహ్మం సవిశేషం కాదు. నిజానికి మాయాకార్యం ప్రపంచం మిథ్య. మాయగూడా మిథ్యయే. ఎండమావులవలన ఎడారి బురద కాదు గదా! కనుక బ్రహ్మం నిర్విశేషమయినా మాయవలన ఆలోచన కుదురుతుంది. (మాయా ప్రతిబింబంకదా యీ బ్రహ్మం) "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" కదా! **శ్రౌత విషయమును తర్కంతో కాదనరాదు గదా!** అయినా కుదరదంటారా?

కుదరనిది కుదరటం మాకు (మాయావాదులకు) అలంకారము కదా! మాయచేసేది అదే. గగనం నీలం తలం ఎలా అవుతుంది. భ్రాంతి వలన. అట్టిదే మాయ. మిథ్య కనుకనే ప్రపంచం త్రికాలములలోనూ లేదు. కనుకనే "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" గదా!

7. ప్రతిరూపః అంటే ప్రతిబింబం – ఈ పక్షంలో అన్వయం కుదురుతుంది. చాల చెఱువులలో సూర్యుడు ప్రతిబింబించినట్లు అనేక ఉపాధులలో ఆత్మ ప్రతిబింబించవచ్చును. కాని ప్రతిరూపః = అనుకూలము అనగా అనేక – ఉపాధులతో అనుకూలంగా ఉండటం. ఒకే వస్తువు అనేక వస్తువులతో ఎలా కలిసియుంటుంది? సమా – మాయలతో. బహురూపుడయి అనేక ఉపాధులతో వ్యాపిస్తాడు.

8. మాయాభిః – పూజాయాం బహువచనం. అంతే. మాయ ఒక్కటే. ఈశ్వరుడొక్కడే. లేదంటే చాల ఈశ్వరులు చాలమాయలు అనవలసివస్తుంది. అపుడు మొత్తం ప్రపంచ వ్యవస్థ ఏకేశ్వరవాదం అన్నీ పోతాయి.

9. భగవాన్ – అనగా షడ్విధమయిన భగ విభాగములు గలవాడు.

"ఉత్పత్తిం చ వినాశం చ భూతానామాగతింగతిమ్, వేత్తి విద్యామవిద్యాంచ సవాచ్యో భగవానితి"

10. జీవుడొకడే అయితే ఒక ఉపాధిలోని జీవుడు ముక్తుడయితే సర్వజీవులకు ముక్తి వస్తుందా? – రాదు. ఎన్ని బుద్ధులో అన్ని ఉపాధులు. అన్ని మాయలు. అజ్ఞాననాశము ముక్తి ఆ ఉపాధులకే పరిమితము. మొత్తం మాయ ఈశ్వరోపాధి కనుక జీవోపాధిభేదం వలన ఈశ్వర సంఖ్య మారదు. ఈశ్వరుడొక్కడే. లేదా, మాయాభిః. మాయాశక్తుల చేత – అని అర్థం చెప్తే – మాయ ఒక్కటే, ఈశ్వరుడొక్కడే. శక్తిభేదం వలన ఒకనికే ముక్తి మరొకనికి బంధము. (ఒక పాముకు 1000 పడగలున్నట్లు)

11. వస్తుతస్తు, **మాయ ఒక్కటయినా ఏకముక్తివలన సర్వముక్తి రాదు. ఉపాధులున్నవి కదా! ఒక ఘటం భంగమయితే ఆ ఘటాకాశమే మహాకాశమవుతుంది. భగ్నంకాని ఘటాకాశములు మహాకాశములు కావు కదా!** జ్ఞానం వలన మాయ నశిస్తే దానివలన వచ్చిన అధ్యాసపోతుంది. దానివలన వచ్చిన బంధం గూడా పోతుంది. (వ్యాపించిన జీవుడొక్కడే కదా!) – సమా – సర్వోపాధులు లయిస్తేనే మాయ నశిస్తుంది. (ఏక జీవవాదంలో). విద్య అధ్యాసను పోగొట్టుంది కనుక వ్యర్థము కాదు. మాయ పోక పోయినా విద్య ఉన్నది కనుక మరల బంధము రాదు. కనుక ఏ బుద్ధితాదాత్మ్యాధ్యాస నశిస్తుందో ఆ బుద్ధిగత చైతన్యమునకే ముక్తి. మూలాజ్ఞానకార్యములయిన తూలాజ్ఞానములు ఉపాధులకు ప్రత్యేకం – అను మతంలో, ఈశంక అసలు రాదు.

12. ఏక జీవవాదంలో సర్వముక్తి లేనిదే ఏక ముక్తి కుదరదు. బహుగృహ వంతునకు ఒక గృహం లేకుండా పోయినా వాడు గృహపతియే. (బహుభార్యాకుడు ఒక భార్య పోయినా విధురుడు కాడు) ఒకే ఘటం పోయిన ఇతర ఘటాకాశములుగల ఆకాశము ఘటరహితం కాదు గదా! అట్లే, ఒక అంతఃకరణం నశించినా ఇతరాంతఃకరణయుక్తుడయిన ఏక జీవుడు అంతఃకరణరహితుడు కాడు కనుక అతనికి ముక్తిలేదు - సమా - ఆత్మకు సంసారిత్వం వాస్తవం కాదు గదా! బుద్ధులూ సంసారము అంతా కల్పితం మిథ్య. కనుకనే "న నిరోధో న చోత్పత్తిః న బద్ధో న చ సాధకః, న ముముక్షుః న వైముక్తః ఇత్యేషా పరమార్థతా" సంసారం ఆత్మయందు కల్పితం. భేదం జీవభేదం కల్పితం. అందువలన ఎవరి జ్ఞానము ముక్తి వారివే. కనుక ఇబ్బంది లేదు.

13. ప్రతిబింబ పక్షంలోను బింబం ఒక్కటే. దానికి బంధం లేదు. ప్రతిబింబాలు భిన్నం, దేని ఉపాధిని బట్టి దానికి బంధం, నాశమును బట్టి ముక్తి. రూపరహితమయిన ఆత్మకు రూపరహితమయిన బుద్ధులలో ప్రతిబింబాలు పడటం అసంభవమయినా మాయాశక్తివలన అంతా సంభవమే. మాయా ప్రతిబింబం ఈశ్వరుడు. అంతఃకరణప్రతిబింబం జీవుడు - అది తేడా. "జీవేశా వాభాసేన కరోతి" కదా! కనుక మాయవలన అంతఃకరణభేదం వలన జీవుడు అనేక జీవులుగా ప్రతిబింబ పద్ధతిలో కనబడుతున్నాడు.

14. మాయాభిః = మాయ, దాని కార్యములు అని గూడా అర్థం చెప్పవచ్చును. మాయా కార్యములు = అంతఃకరణములు. అవి అనేకం కనుక జీవభేదం సరిపోతుంది. లేదా, మాయాభిః నామరూపకృతములైన మిథ్యాభిమానములచేత అని అర్థం. ప్రజ్ఞానఘనమయిన ఆత్మ ఏకరూపమయినా బహురూపంలాగా కనబడుతుంది.

15. లేదా, ఇంద్రియాలు విషయాలు బహుసంఖ్య కనుక ఆయా రూపములతో ఆత్మ బహురూపం అయినదే. లేదా, ఒకేఆత్మ వివిధ బుద్ధి రూపసంబంధం వలన (ప్రతిబింబం - అవచ్ఛేదం) బహుజీవత్వం రావచ్చును. అత్యంత నిర్మలమయిన స్ఫటికమణివంటి బుద్ధికి సంసారం ఎలా అంటుతుంది? సమా -

శరీరం రథం. బుద్ధి ఉపాధి (సారధి) జీవుడు రథికుడు. ఇంద్రియములు అశ్వములు. శబ్దాది విషయములు విహారప్రదేశములు. కనుక బుద్ధి విషయసంగం వలన చెడుతుంది. దానిననుసరించిన జీవుడు జలచంద్రునివలె చలించును. "పరాంచిఖాని వ్యతృణత్ స్వయంభూః" కనుక ఇంద్రియాల పని విషయభోగమే. కనుక ఆత్మ బుద్ధిసంబంధం వలన ఇంద్రియ వ్యాపారం వలన విషయసంగియైనట్లు కనబడతాడు. ద్రష్ట, శ్రోత, మంత, సుఖి, దుఃఖి - బహురూపుడు బహుజీవుడు అవుతాడు.

**శ్లో॥ ప్రాణో బుద్ధిరపీన్ద్రియాణి విషయా దేహాశ్చ భూతవ్రజః**
**కాలస్సర్వమిదం జగచ్చ భగవానాత్మైవ నాస్మాత్పృథక్ ।**
**ఆత్మా వస్తుత ఏష రూపరహితోఽ పూర్వోఽపరోఽనన్తరోఽ**
**బాహ్యశ్చిన్మయమేకమద్వయమజం తద్బ్రహ్మ సర్వానుభూః ॥118**

భావ॥ ఉపాధులయిన బుద్ధి మొదలయినవి వేరు. ఆత్మ వేరు. కనుక ఆత్మ అద్వితీయము కాదు అని అనిపిస్తుంది. కాని ఇదంతా వ్యవహారంలోని విషయం. తత్త్వరీత్యా అంతా ఆత్మయే. ఆత్మయందే కల్పితం. దశవిధ ప్రాణము, బుద్ధి, 10 ఇంద్రియాలు, విషయాలు, చరాచర దేహము, పంచ భూతములు, కాలము, సర్వప్రపంచము – అంతా ఆత్మయే. భగవంతుడే. ఇంతకు మించి ఏదియు సత్యము కాదు. ఈ ఆత్మ వస్తుతః రూపరహితం. ఈ ఆత్మకు పూర్వము, పరము, ఆంతరము, బాహ్యము ఏదియు లేదు. అంతా జ్ఞానమయము. ఏకము, అద్వితీయము. జన్మరహితము. సర్వమును అనుభవించును. కనుకనే ద్రష్ట, శ్రోత, మంత, కర్త అగును. ఇదంతా మాయికం. 118

విశే॥ 1. "సర్వం ఖల్విదం బ్రహ్మ" గదా! ప్రపంచం ఆత్మయందు/బ్రహ్మమునందు కల్పితం. కల్పితం తన అధిష్ఠానం కన్న భిన్నం కాదు. మాయ కల్పితమే. సత్యం కాదు. అది "మాయా చా విద్యాచ స్వయమేవ భవతి" అని భిన్నమే. సాదియే. అయితే అజాం ఏకాం – ఇందులో మాయను అజాం అనటానికి కారణం దానిని ఎవరూ పుట్టించలేదు. సాదియే కదా! కనుక జన్యమే. కనుకనే ఆది జ్ఞానిలో నశిస్తుంది. "జాతస్య హి ధ్రువో మృత్యుః" అనాది అయిన ప్రాగభావం గూడా పోతుంది కదా! దీని అర్థం అజన్యమునకు మృత్యువు లేదని కాదు. జన్యమునకు మృత్యువు తప్పదని అర్థము.

2. సర్వం ఆత్మ అయినను ఆత్మయందున్నను, ఆత్మయే సర్వమునందున్నను ఆత్మకు ఈసర్వం యొక్క జాడ్యాది గుణదోషములంటవు. నామరూపములన్ని, గుణములన్ని మాయా కల్పితములు.

3. పూర్వం = కారణం, అపరం = కార్యం, ఏకం అనగా సజాతీయ వస్తుభేదము లేనిది. అద్వితీయం – విజాతీయములు లేనిది. చిన్మయం – స్వగత భేదము లేని జ్ఞాన ఘనం తత్ అనునది బ్రహ్మమునకు సంకేతము. "ఓం తత్సదితి నిర్దేశః బ్రహ్మణః త్రివిధః స్మృతః" తత్ = పరోక్షం. జ్ఞానం కలుగుదాక బ్రహ్మం పరోక్షం కదా! ఒక మతంలో బ్రహ్మమును పరోక్షం అంటారు. అది జీవులకు అంతర్యామి. అద్వైతంలో అయితే బ్రహ్మం అపరోక్షం "యత్సాక్షాదపరోక్షాత్" "సర్వంపుమాన్వేదగుణాంశ్చ తద్జ్ఞోన వేద సర్వజ్ఞమనంత మీడే" అనటం – జ్ఞానికానివాని విషయం. కనుక అపరోక్షమే బ్రహ్మం. ప్రత్యగాత్మ అగుననటం వలన జీవ పరమాత్మలొక్కటేనని సూచన. కాదనువారు అనాదరణీయులని భావము.

**శ్లో॥ వాగ్ఘోతాఽగ్నిరితీక్షణేన యజమానోఽ త్యేతి మృత్యుం జవా-**
**దక్ష్యధ్వర్యురశీతదీధితిరితి జ్ఞానేన నక్తన్దివమ్ ।**
**ఉద్గాతాప్యసవస్సదాగతిరితి జ్ఞానేన పక్షద్వయం**
**బ్రహ్మా మానసమిన్దురిత్యపి ధియా స్వర్లోకమాక్రామతి ॥ 119**

భావ॥ ఆత్మ తత్త్వములను హేతువులతో నిరూపించుటకు ఈ గ్రంథారంభము. ఆత్మదర్శన ఫలాలను ప్రశంసించుచు, ముందు వాక్, అగ్ని మొదలగు భావనల ఫలాలను చెప్తున్నాడు.

1. అధ్యాత్మం 2. అధియజ్ఞం – అధిదైవం. వాక్కు – హోత = అగ్ని. ఈ జ్ఞానం వలన అజ్ఞాన లక్షణమయిన మృత్యువును జయించును.

2. నేత్రమే ఆధ్వర్యువు, సూర్యుడు అని ఉపాసించు వాడు అహోరాత్రములను జయించును.

3. ప్రాణము ఉద్గాత వాయువు అని జ్ఞానం కలవాడు శుక్ల కృష్ణ పక్షద్వయమును దాటును. మనస్సు బ్రహ్మ (యజ్ఞంలో) అని, చంద్రుడని భావించువానికి స్వర్గలోకము లభించును. 119

**శ్లో॥ ముక్తిర్జ్ఞానచతుష్కముక్తమియమేవోక్తాఽతిమృత్యు(ముక్తిః?) స్తథా**
**యాజ్యాదిత్రివిధర్గ్భిరేష హుతవాన్ త్రైలోక్యమేతజ్జయేత్ ।**
**ఆజ్యాద్యాహుతిభి స్త్రివిష్టపపదం మాంసాదిభిః పైతృకం**
**సోమాద్యాహుతిభిర్మనుష్యభువనం సజ్జీయతేఽధ్వర్యుణా ॥ 120**

భావ॥ పైన చెప్పిన జ్ఞాన చతుష్టయము ముక్తియని అంటారు. దీనినే అతిముక్తి అంటారు. వాగాదులు అగ్ని మొదలయినవిగా కావటం ముక్తి. అసంగతవలన వచ్చేది అసలయిన ముక్తి. ఇక 'సంపత్' చెప్పుచున్నాడు.

యాజ్య శస్య పురోనువాక్య – అను మూడు ఋక్కులతో హోమము చేయు హోత లోకత్రయమును పొందును. ఆజ్యాది ఆహుతులతో సమిధలతో హోమము చేయు అధ్వర్యుడు స్వర్గమును గెలుచును. మాంసాదులతో హోమము చేయువాడు పితృలోకమును, పాలు సోమము – ఆహుతులతో హోమము చేయువాడు మనుష్యలోకమును జయించును. 120

**శ్లో॥ బ్రహ్మా దక్షిణతోఽభిరక్షతి సవం స్థిత్వాఽఽసనే చేతసా**
**తచ్చానన్త మనన్తదేవగమతోఽ నన్తం స లోకం జయేత్ ।**
**ఉద్గాత్రా పృథివీతలామ్బరతలే ప్రాణేన చాపానతో**
**వ్యానేన ద్యుతలం తనావధిసవం సజ్జీయతే వా ఋచా ॥ 121**

భావ॥ యజ్ఞంలో బ్రహ్మ అనువాడు దక్షిణంగా ఆసనమునందు గూర్చొని యజ్ఞమును మనస్సుతో కాపాడును. ఆ మనస్సు అనంతవృత్తులు గలది గనుక అనంత దేవగతము. అందువలన అది అనంతలోకములను జయించును. శరీరమునందు ఉద్గాత అయిన ప్రాణముచేతను, యజ్ఞమునందు పరోను వాక్య అను ఋక్కుతోను; అపానము చేతను, యాజ్య అను ఋక్కుతోనూ వరసగా భూః భువః (అంతరిక్షం) లోకములను జయింపగలము. వ్యానము, శస్య అను ఋక్కుతోను ద్యులోకము జయింపబడును. 121

**శ్లో॥ ఘ్రాణం వాగ్రసనాఽక్షిహృచ్ఛ్రుతిరథో హస్తస్త్వగష్టగ్రహా**
**గన్ధో నామ రసః క్రమాద్బహువిధం రూపఞ్చ కామో ధ్వనిః ।**
**కర్మ స్పర్శ ఇతి స్మృతా బుధజనైరష్టౌ తథాఽతిగ్రహా**
**ఏభిస్తే కలితా గ్రహాః కలయతేఽమీభిర్హి సర్వం పుమాన్ ॥ 122**

భావ॥ ముక్కు, వాక్కు, నాలుక, నేత్రం, హృదయము, శ్రవణము, హస్తము, చర్మము ఇవి అష్ట గ్రహములు. గంధము నామము రసము, రూపము, కామము, శబ్దము, కర్మ సర్శ 8. **ఇవి అతిగ్రహములు. ఈ అతిగ్రహములతో కలిసిన** గ్రహములు – వీనితో పురుషుడు సర్వమును గ్రహించును. 122

విశే॥ వాగాదులు అగ్న్యాదులు కావటం ముక్తి. మరి ఇక బంధం అనగా ఏమి? గ్రహముల చేత అతిగ్రహములు అయిన కరణములు బంధింప బడినవి. ఈ గ్రహ – అతిగ్రహ స్వరూపమయిన బంధము. పశువునకు పాశబంధము వంటిది. వాగాదులు అగ్న్యాది దేవతత్త్వం పొందితే ముక్తి. ఇది వాస్తవ ముక్తి కాదు. బ్రహ్మ భావం పొందటమే వాస్తవ ముక్తి. వాగాదులు అగ్న్యాది దేవతలయితే పురుషుడు హిరణ్యగర్భభావము పొందగలడు. అంతేగాని మోక్షమురాదు.

**శ్లో॥ మృత్యోర్మృత్యురిహాస్తి మృత్యురుదకం సర్వస్య మృత్యోశ్చ చే–**
**రేవం సంసరణస్య మృత్యురనఘా మృత్యోః పరాత్మైక్యదృక్ ।**
**యత్రాసౌ మ్రియతే బుధో నహి తదోత్క్రామన్త్యముష్యాసవో**
**లీయన్తేఽత్ర యతస్స ఉచ్ఛ్వయతి చాధ్మాతశ్చ శేతే మృతః ॥ 123**

భావ॥ మృత్యువుకు మృత్యువు లేకపోతే మృత్యువుపోదు. అపుడు మోక్షము రాదు. మృత్యువుకు మృత్యువున్నదందామా? – దానికి మరోమృత్యువు దానికి మరో మృత్యువు – అని గొలుసు ఆగదు – ఇది సంగతి. అయినా మృత్యువుకు మృత్యువున్నది. సర్వదాహకమయిన మృత్యువు అగ్ని కానిదానిని ఆర్పే జలం దానికి మృత్యువు. అట్లే గ్రహాతిగ్రహరూపమయిన విషయేంద్రియానుభవరూపమయిన సంసారమునకున్ను మృత్యువున్నది. అదే బ్రహ్మాత్మైక్యజ్ఞానము. సర్వం దానిముందర మిథ్యగా తేలిపోతుంది.

ఇట్టిజ్ఞాని మరణించినపుడు అతని ప్రాణాదులు ఉత్క్రమించి పరలోక మార్గమున పోవు. అవి అచ్చటనే లీనమగును. ఈ సంగతి అజ్ఞులకు కనబడదు. అందరిశరీరం వలెనే జ్ఞాని శరీరమున్ను ఉబ్బుతుంది. బూరటిల్లుతుంది. చచ్చిపడియుంటుంది. 123

విశే॥ 1. ఆత్మదర్శనానికి మృత్యువు లేదు. అదే చివరి మజిలీ. కనుక గొలుసు కొనసాగదు. అగ్ని మొదలగు గృహాది పదార్థాల దృష్ట్యా మృత్యువులు. జలం మొదలగువాని దృష్ట్యా అన్నములు. కాని ఆత్మసాక్షాత్కారం దేనికీ అన్నము కాదు. సర్వమృత్యువు అది. **ఆత్మ సాక్షాత్కారమనగా 'ఆత్మ'యే. సాక్షాత్కారమంటే జ్ఞానమే. ఆత్మ అన్నా జ్ఞానమే. కనుక అది ఘట సాక్షాత్కారం వంటిది కాదు.**

2. సారాంశము : ఆత్మాకారాంతః కరణ వృత్తిలో ప్రతిబింబించిన చైతన్యం ఆత్మ సాక్షాత్కారము. ఆత్మ బింబ చైతన్యం. బింబ ప్రతిబింబములకు భేదం లేదు. ఉపాధి మాత్రమే దానికి కారణం. కనుక ఒకే ఆత్మలో అంతఃకరణ వృత్తివలన బింబత్వం ప్రతిబింబత్వం కల్పింపబడినది. కల్పితం అధిష్ఠానాత్ భిన్నం కాదు. కనుక ఆత్మసాక్షాత్కారం అనే యీ ప్రతిబింబం బింబమయిన ఆత్మకన్న భిన్నం కాదు. ఇందులో విశేషాంశమయిన అంతఃకరణవృత్తిలో ప్రతిబింబించటం అనునది నశిస్తుంది. ప్రతిబింబితమయిన చైతన్యం విశేష్యం. అది నశించదు. దానికి మృత్యువు లేదు. అదే సాక్షాత్కారం అదే జ్ఞానం. అయితే ఘటసాక్షాత్కారం సర్వ మృత్యువు కాదు. అందులోని ఘటం ద్వైతమును తొలగించదు. ఆత్మసాక్షాత్కారము తొలగిస్తుంది. కనుక మృత్యురహితం సర్వ మృత్యువు ఆత్మయే.

3. ఈ మోక్షము సజీవునకా? మృతునకా? మృతునకే. "తస్య తావదేవ చిరం యావన్నవిమోక్ష్యేథసంపత్స్యే" గదా!

తత్త్వవేత్తకు ప్రాణములు పరలోకానికిపోవు. ఉన్నచోటనే లీనమవుతాయి. కనుకనే అతనికి పునర్జన్మ లేదు. కనుక జ్ఞానమరణం ప్రాణనిలయనం. అజ్ఞాని (సగుణజ్ఞాని) మరణం ప్రాణోత్క్రమణం. ప్రాణములు లోకాంతరం పోకపోయినా ఉన్నచోటనే లయిస్తాయి. అందువలన శరీరం పాడవుతుంది. లోకులకు ఈ సంగతి తెలియదు. అందరిలాగే జ్ఞాని గూడా మరణించినట్లు భావిస్తాడు. ప్రాణములు కనబడవు గదా! ఇదంతా శ్రుతిని బట్టి నిర్ణయము. లేదంటే అందరికి ఉత్క్రాంతి అందరికీ నిలయనము – అనుకొంటే శాస్త్రం వ్యర్థం.

**శ్లో॥ విద్వాంసం సకలం జహాతి న పునర్నామైకమస్తి క్షితౌ**
**ముక్తోఽభూచ్ఛుక ఇత్యసౌ వ్యవహృతిర్యల్లోకవేదాశ్రయా ।**
**సర్వాత్మత్వముపేత్య సంస్థితవతి బ్రహ్మణ్యముష్మిన్ బుధే**
**సర్వం వర్తత ఏవ నామ సకలం రూపఞ్చ కర్మాఖిలమ్ ॥ 124**

భావ॥ ఈ ప్రపంచమంతయు విద్వాంసుని వదలివేయును. కాని పేరు మాత్రము వదలదు. శుకుడు ముక్తుడని వామదేవుడు గర్భముక్తుడని ప్రశస్తి కనబడుతున్నది గదా! లోకవేదములందీ నామములు వినబడుచున్నది. జ్ఞాని బ్రహ్మరూపుడై సర్వాత్మయై ఉండటం వలన సర్వమూ అతనియందు (బ్రహ్మం కనుక) కల్పితమై ఉన్నది. కనుక అధిష్ఠాన రూపమయిన అతనియందే రూపం, కర్మ సమస్తం ఉన్నాయి. అయినా అధిష్ఠానమునకు కల్పిత పదార్థం అంటదు. కనుక జ్ఞానికి నిర్వికారుడు, అలిప్తుడు. 124

**శ్లో॥ యత్రాజ్ఞో మ్రియతేఽపయాతి దహనస్తత్రాస్య వాచో దృశః**
**కః ప్రాణాదనిలశ్శశీ తు మనస శ్శ్రోత్రాద్దిగజ్గాద్ధరా ।**
**లోమ్నశ్చౌషధయో వనస్పతితతిః కేశాన్నభశ్చాత్మనో**
**రేతః పాథసి లోహితఞ్చ కలితం కర్మైకమేష శ్రితః ॥ 125**

భావ॥ అజ్ఞాని మరణించిన సందర్భములో అతని వాక్కునుండి అగ్ని, చూపునుండి సూర్యుడు, ప్రాణమునుండి గాలి, మనస్సునుండి చంద్రుడు, చెవినుండి దిక్కులు, శరీరమునుండి భూమి, రోమములనుండి ఓషధులు, కేశములనుండి వనస్పతులు, ఆత్మనుండి (హృదయాకాశము నుండి) ఆకాశము, లేచిపోవును. రేతస్సు నెత్తురు నీటియందు కలియును. కర్మ ఒక్కటే అతనిని పట్టికొని ఉండును. ఆయా దేవతలు వదలటం వలననే ఆయా ఇంద్రియాదులు నిశ్చేష్టమయి పోవును. నీటిలో నిలిచిన రేతస్సు రక్తము అనంతర జీవితమునకు పునాది. బంధనంగా మిగిలిన కర్మ జ్ఞానంతో తప్ప పోదు. అది అలా పోతే గాని మోక్షం రాదు. 125

**శ్లో॥ ఉత్క్రాన్తః కరణైస్సహో బుధజనోఽజ్ఞాత్కాలదైవేశ్వరా-**
**ధీనో గచ్ఛతి కర్మణా పునరయం పుణ్యేన పుణ్యాం తనూమ్ ।**
**దైవీం పాపమయేన దుష్కృతతనూం పశ్వాదిరూపాన్తథా**
**మిశ్రేణ ప్రతియాతి మానుషతనూం మిశ్రాం కదుఃఖోదయామ్ ॥126**

భావ॥ అజ్ఞాని తన కరణములతో సహా శరీరమునుండి బయటపడి కాలేశ్వరాదృష్టములకు అధీనుడై పరలోకమునకు చేరును. పుణ్యకర్మవలన పుణ్యమయిన దైవశరీరమును పాపకర్మవలన పశ్వాది పాపదేహములను పొందును. పాపపుణ్యమిశ్రమయిన వాడు సుఖదుఃఖమిళితమయిన మానవ జన్మను పొందును. కనుక కర్మయే ప్రధానం. అని కర్మనే అజ్ఞాని ఆశ్రయించి యుండును. 126

**శ్లో॥ అహ్నైకేన రథో రవేరతిపతేద్యావత్ప్రదేశం స తు**
**ద్వాత్రింశద్గుణితో విరాట్తనుమయో లోకస్స్వలోకః పరః ।**

**లోకం తం ద్విగుణాఽభిగచ్ఛతి ధరా తాం చామృతాబ్ధిస్తథా**
**బ్రహ్మాణ్డస్య కపాలయోస్తు వివరం ఖడ్గాగ్రమాత్రం శ్రుతమ్ ॥ 127**

భావ॥ కర్మలు తమనిర్దిష్టఫలములనిస్తాయి కనుక సఫలములే. కర్మఫలభోగభూములీ లోకములే. వాటి పరిమాణములివి. మన అనుభవాలన్నియు కర్మఫల భోగములే.

సూర్యరథం ఒక అహః కాలంలో ఎంతదూరం పయనించునో ఆ మార్గమునకు “32” తో హెచ్చించినంతటిది “విరాట్తనుమయ”మను లోకము. దాని తరువాతది ఆలోకమను లోకము. దీనియందు లోకం అనగా వెలుతురుండదు. ఈ లోకమునకు రెండు రెట్లున్నది ధరాలోకము. దానికి అమృత సముద్రలోకము చుట్టి యుండును. అలాగా బ్రహ్మాండ కపాలము మధ్య ద్వారములు రెండు. ఒకటి క్రిందిది. మరొకటి పైది. అది కత్తిమొన అంత సన్నగా నుండును. దీనినుంచియే అశ్వమేధయాజులైన పారిక్షితులు బయటకు వెళ్ళెదరు. 127

**శ్లో॥ వ్యోమ్నా తేన సమాగతాంశ్చితశుచిర్ధ్యాత్వా సువర్ణస్స్వయం**
**దత్తే తాననిలాయ గత్యుపహతేః పారిక్షితానాత్మనః ।**
**సంస్థాప్యాత్మని మారుతః పునరమూంస్తం దేశమాసాదయ**
**త్యాసన్యత్ర పురాతనస్తదనిలః పారిక్షితానాం గతిః ॥ 128**

భావ॥ కత్తి మొన (క్షురాగ్రం, ఈగరెక్క) వంటి ఆ రంధ్రమునుండి వచ్చిన పారిక్షితులను వారి అశ్వమేధాగ్ని స్వయంగా సుపర్ణుడై తనకు గమనం లేకపోవటం వలన వాయువును అప్పగించును. వాయువు వారిని తనయందుంచికొని పూర్వం పారిక్షితులందరునూ ఉండు ప్రదేశమునకు తీసికొని పోవును. 128

**శ్లో॥ యస్మాత్థాస్నుచరిష్ణుభూతనివహస్యాన్తర్బహిర్వర్తతే**
**భూతప్రాణసురాత్మనాఽయమనిలో వ్యష్టిస్తతో విశ్రుతః ।**
**సూత్రాత్మా తు సమష్టిరేష భవతి స్వాత్మానమేనం పుమాన్**
**యో వేదైష స భూయ ఏవ లభతే మృత్యుం న మృత్వా సకృత్ ॥129**

భావ॥ ఈ వాయువు భూత, ప్రాణ, దేవతారూపములచేత చరాచర భూత సమూహానికి లోపల బయట వ్యాపించియున్నాడు. అందువలన ఇతనిని ‘వ్యష్టి’ అంటారు. వ్యష్టి వివిధమయిన వ్యాప్తి అని అర్థము. సూత్రాత్మ అయిన ఈ వాయువు “సమష్టి” అని గూడా ప్రసిద్ధుడే. ఈ వాయువును తన ఆత్మగా ఎవడు గ్రహించునో వాడు మరణించిన తర్వాత మరల మరణించడు. 129

**శ్లో॥ ప్రాణైః ప్రాణితి యోఽ ప్యపానితి తథాఽపానేన యో వ్యానితి**
**వ్యానేనైవముదానితి స్వయమిదన్త్వాముదానేన యః ।**

**ఆత్మా స హ్యఖిలాన్తరః పరతరో బ్రహ్మాపరోక్షో నృణా-**
**మశ్వోఽసావితివత్కథన్న్వవిషయం బ్రూయాదిదన్త్వేన కః ॥ 130**

భావ॥ ప్రాణములతో ప్రాణించును. అపానముతో అపానించును. వ్యానముతో వ్యానించును. ఉదానముతో ఉదానించును. ఆ ఆత్మ అందరికి అన్నింటికి ఆంతరుడు. పరతరుడు. బ్రహ్మమగును. నరులకు పూర్తి అపరోక్షము. అట్టి అపరోక్షమయిన ఆత్మను "ఇది గుఱ్ఱము" అన్నట్లు విషయం కానిదానిని "ఇది, ఇదిగో" అని ఎవరు చూపగలరు. 130

విశే॥ 1. ప్రాణములు కరణముగా (సాధనం) ప్రాణనమను క్రియకు ఆశ్రయమయిన వాడు. అట్లే మిగిలినవి గూడా. పరతరః = సర్వ విలక్షణమయిన వాడు. అఖిలాంతర మయినది ప్రత్యగాత్మ.

2. ఆత్మయే అఖిలాంతరము. అపరోక్షము. బ్రహ్మాభిన్నము. బ్రహ్మము సర్వాంతరము. ఆత్మయే బ్రహ్మము. అందువలన ప్రత్యగాత్మ పరమాత్మ భేదము నిర్మూలితము.

3. అక్రియమయిన ప్రత్యగాత్మ క్రియాశ్రయముకావటం అధ్యాస వలననే, లేదా, ఆత్మచైతన్యాభాసం (ప్రతిబింబం) వలననే ప్రాణాదులు క్రియలవుతాయి. స్వయంగా కాదు. అవి అచేతనములు కదా! కనుక ఆత్మయందు కర్తృత్వం ఆరోపితమయినది. (అంటే అయస్కాంతశక్తి వలన గుండు సూదులు అవే కదలితే అయస్కాంతమును కర్త అన్నట్లు)

4. ఆత్మ అపరోక్షము. కాని ఇంద్రియ ప్రత్యక్షం కాదు. "తత్, ఏతత్ అని నిర్దేశింపలేము. (ఇది సుఖం అని చూపలేము) అనగా కరణ విషయం కాదు – ఆత్మ ప్రత్యక్షమయ్యే తీరు ఆంతరము. అపరోక్షము.

5. ప్రత్యక్షం అంటే ఇంద్రియవిషయం కావటం ఒక్కటే కాదు. ప్రమాతృచైతన్యం విషయ చైతన్యంతో కలవటం ప్రత్యక్షం. అది ప్రమాణ చైతన్యం ద్వారా జరుగుతుంది. వరస ఇది.

1) ప్రమాతృ చైతన్యము (నీరు) 2) ప్రమాణ చైతన్యము ద్వారా (వృత్తి) (కాలువ) 3) ప్రమేయ (విషయ) చైతన్యంతో అభేదం చెందటం (పొలం) 4) దానివలన విషయ ప్రత్యక్షం కలుగుతుంది. (తడి) అనగా ఘటపటాదులు కనబడతాయి. ప్రస్తుతం ప్రమాతయే ప్రమేయం కనుక ప్రమాతృవిషయచైతన్యాభేదం కనుక ప్రమాత అయిన జీవునకు కూటస్థుడయిన ప్రత్యగాత్మ నిత్యం అపరోక్షుడే. అందుకే అది 'ఆత్మ' అయింది. దేహాదులుగాని నిత్య అపరోక్షం కనుకనే 'ఆత్మ' అంటాము. కనుక ఎదురుగా విషయంగా కాకపోయినా ఆత్మ అపరోక్షమే ప్రత్యక్షమే.

**శ్లో॥ దృష్టిం పశ్యతి యచ్ఛ్రుతిం భువి మతిం విజ్ఞాతిమేతం పునః**
**కోఽన్యస్తం కలయేత్తతోఽవిషయతా ద్రష్టుస్థితైవాత్మనః ।**

ద్రష్టా స్థాస్నుచరిష్ణుభూతనికరస్యాత్మాఽయమాభ్యన్తర-
స్సర్వాత్మా పరమార్థసత్య ఇతరస్తస్మాద్యదార్తం హి తత్ ॥ 131

భావ॥ ఆత్మయే దృష్టిని ప్రకాశింపచేస్తుంది. అట్లే శ్రుతిని, మతిని, విజ్ఞాతి (బుద్ధి)ని ప్రకాశింపజేస్తుంది. అట్టి ఆత్మను ఎవరు ప్రకాశింపజేస్తారు. కనుక ఆత్మ ద్రష్టకు కనబడదు. ఎందుకంటే చరాచర భూతములను దర్శించు ద్రష్టయే ఆత్మ. ఆయన ఆభ్యంతరుడు. సర్వాత్మ. పరమార్థతః సత్యమయినవాడు ఆత్మయే. ఆ భూత సమూహంకన్న వేరయిన వాడు. ఆ అనాత్మ భూతసమూహము ఆద్యం బాధితం అసత్యం. 131

విశే॥ 1. ఆత్మ ఎందుకు విషయము కాదో చెప్పబడినది. నేత్రం ద్వారా ప్రమాణ చైతన్యం వృత్తిరూపంలో వెళ్తుంది. వృత్తిలో చైతన్యంగా దానిని వెలిగించేది ఆత్మయే. కనుక అదే దృష్టిని చూడటం. అదే ద్రష్ట. దృష్టి = వృత్తి జడము. చైతన్యం వలననే దాని ఉనికి. దానికి స్వయం ప్రకాశం లేదు. అలాగే మిగిలిన వృత్తులు.

మతి = మనోవృత్తి, విజ్ఞాతి = బుద్ధి వృత్తి.

2. వెలిగించే దీపం వంటి వస్తువు మరొకదానిచేత వెలిగింపబడదు. (అగ్ని అంతే గదా) ఆత్మ భాస్యము కాదు. దానికి వేరే భాసకం లేదు. కనుక అది విషయం కాదు. అది సర్వభాసకం. అది ద్రష్ట. అది విషయములలో (దృశ్యం etc) వ్యాపించిన వృత్తులందు నిత్యచైతన్యంగా వ్యాపించియుండును. ఆత్మ సర్వావభాసకం అయ్యేది తనకోసమే. ఇతరులకోసం కాదు. దీపం ఘటభాసకం అయ్యేది తనకోసం కాదు. అది జడం. అది మనవంటి ప్రాణులకోసం అవభాసకం. ఆత్మచేతనం కనుక తనకోసం అంతా భాసింపజేస్తుంది. ప్రత్యక్ = అనగా దీపాదులకు భిన్నంగా భాసించేదని అర్థం. సర్వం తనకోసం వెలిగిస్తుంది గనుక బ్రహ్మం సర్వజ్ఞం, సాక్షి.

"స సర్వజ్ఞః సర్వవిత్ ", "సాక్షీ చేతా కేవలోనిర్గుణశ్చ"

3. ఈ ఆత్మ ఒక్కటే. "ఏకో దేవః సర్వభూతేషు గూఢః" భిన్న ఉపాధులలో చరాచరములలో సర్వప్రాణులకు ఆంతరుడు. దేహములే అనేకములు. ఆయన ఒక్కడే. అనేకత్వం దేహాలవలన వచ్చిన భ్రాంతి మాత్రమే. ఖండుడయితే సర్వమునందు అంతర్యామి కాలేడు గదా! మరియు కల్పితమయిన ఈ ప్రపంచమునకు ఆయనయే అధిష్ఠానము. భూతములకు, ప్రాణులకు, అవ్యక్తమునకున్ను ఈయనయే అధిష్ఠానము. ఆయనయందే ఇవన్నియు కల్పితము. కనుకనే ఇది పరమార్థ సత్యము. అవి వ్యవహార సత్యములు.

4. కాలత్రయమునందున్న ఆత్మ రజ్జు సర్పంలో రజ్జువు వలె సత్యము. అనాత్మ సర్పం వలె మిథ్య. ప్రపంచం ప్రలయకాలంలో సూక్ష్మరూపంలోనున్నా ముక్తికాలంలో అలాగూడా

ఉండదు గనుక మిథ్యయే. "నేహా నానాస్తి కించన" ఏకమే వా ద్వితీయం బ్రహ్మ" సర్వాధిష్ఠానం కనుక ఆత్మయే పరమసత్యం. ప్రపంచం అంతా ఆత్మయందే కల్పితం. సర్వాత్మకం కనుక ఆత్మయే సత్యం. ఘటం సర్వాత్మకం కాదు. సత్యమూ కాదు. ఆత్మభిన్నం అంతా మిథ్య, ఆత్మ యందు రజ్జు సర్పమువలె కల్పితం కనుక. అలాగే ఆత్మభిన్నం సర్వం మిథ్య. ఆత్మహీనం కనుక. ఎండమావి వలె. ఆత్మ ఒకటే సత్యం. సర్వాంతరం కనుక. సర్వాంతరమయినదల్లా సత్యము. కానిది అసత్యము – ఘటం లాగా. ద్రష్ట కనుక ఆత్మయే సత్యము. కానిది అనాత్మ ఘటం లాగా. ఆత్మ కానిది మిథ్య. దృశ్యం కనుక రజ్జు సర్పంలాగా.

5. 'దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా–' అనటంవలన ఆత్మదృశ్యమే అని భ్రాంతి పడరాదు. ఆ దర్శించేవాడే ఆత్మ. దృశ్యము ద్రష్ట ఒకరే కారు. ఒకరే కర్త కర్మ కారు. దృశ్యం అయిన ఆకాశాదులున్ను సత్యములు కాదు. అవి జన్యములు అసత్యములు. "ఆత్మన ఆకాశ స్సంభూతః". సత్యం అయిన దృశ్యం ఏదీ ఉపనిషత్తులలో అంగీకరింపబడలేదు. దృశ్యత్వం మిథ్యాత్వం కలిసియే యుండును.

**శ్లో॥ యత్సాక్షాదపరోక్షమస్తి పరమం బ్రహ్మాన్తరాత్మా చ యః**
**సర్వస్యాపి తదేష సోమ్య! తవ వా ఆత్మా న సర్వాన్తరః ।**
**క్షుత్తృట్ఛోకతమోజరామృతిదశా అత్యేతి యస్తం చరన్**
**స్వాత్మానం సమవేత్య భైక్షమటతి ధ్వస్తైషణో బ్రాహ్మణః ॥ 132**

భావ॥ బ్రహ్మం అంతరాత్మ. అది సాక్షాదపరోక్షము. సాక్షాత్కరణం అను వ్యాపారం అవసరం లేదు. సోమ్య! అదే నీకున్ను అంతరాత్మ. అదే సర్వాంతరాత్మ. దారేషణ వంటి వాంఛాత్రయము లేని బ్రాహ్మణుడు. తన ఆత్మను సాక్షాత్కరించికొనిన వాడై ఆకలిదప్పికలను దుఃఖములను, అజ్ఞానములు జరామరణములను అతిక్రమించును. భిక్షాచర్యంతో బ్రతుకును. 132

విశే॥ 1. ఆకలి దప్పులు – ప్రాణ ధర్మములు, శోకమోహములు – మనోధర్మములు, జరామరణములు – శరీర ధర్మములు, ప్రాణాది తాదాత్మ్యాధ్యాస రాహిత్యం వలన పై ధర్మాలు ఇతనిని అంటవు.

2. ఏషణా = ఇది ముఖ్యం '2'. సాధన కామం. ఫలకామం. అన్ని కామములు ఈ ద్వయంలో లీనమగును.

3. "సన్న్యాసం" ఎవరికి విధింపబడినది? ఎ) జ్ఞానికా? బి) అజ్ఞానికా? ఎ) కాదు. జ్ఞాని విధినిషేధాల కతీతుడు. అతడు ఆత్మరూపుడు. బి) కాదు. అతనికి ఏషణలు పోవు. ఆత్మజ్ఞానం లేకుండా అనాత్మ వాంఛలు పోవుకదా! సమా –

4. విద్వాంసునకే. ఆత్మను పొంది – అన్నాం కదా! అయితే పరోక్షాత్మజ్ఞానం కల

విద్వాంసుడు – అని అర్థం. అపరోక్ష జ్ఞానికేదీ అవసరంలేదు గదా! **కనుక పరోక్షాత్మవేత్తయే సన్న్యసించి భిక్షాచర్య చేయవలయును.** ఇది ఒక పక్షము. (పరోక్షజ్ఞానికి సన్న్యాసం – 1)

5. అపరోక్షజ్ఞాని అయినా కర్మలను సన్న్యసించవలయునని గీత. అతనికి అందుకే అధికారమున్నది. తత్త్వవేత్తకు విధి ఎలా? – కర్మ విధికి విషయం కావద్దని అర్థము – అట్టి సన్న్యాసం తత్త్వవేత్తకే. ఎందుకంటే అది క్రియ కాదు. విధికాదు. సర్వకర్మ సన్న్యాసం చేయాలంటే విద్వాంసునకే సాధ్యం. కనుక తత్త్వవేత్తకే సన్న్యాసం అని మరొక పక్షము (అపరోక్షజ్ఞానికి సన్న్యాసం – 2)

6. తత్త్వవేత్త కర్మసన్న్యాసం చేయాలని విధింపబడదు. కర్మలు చేయరాదని విధింపబడును. కనుక విద్వాంసునకే సన్న్యాసము. అని అపర పక్షము.

7. గృహస్థునకు వేదాంతశ్రవణాదులకు సమయం తక్కువ కనుక జ్ఞానం కోసమే సన్న్యసించాలి. కనుక బి) అవిద్వాంసునకే సన్న్యాసమని మరికొందరివాదన. (పర పక్షము). అవిద్వాంసుడనగా పూర్తి అజ్ఞాని కాదు. కొంత అర్హత సాధించిన వాడే. నిత్యానిత్య వస్తువివేకం, సర్వ కర్మఫల విరాగం, ముముక్ష, అందువలన అతను అందరిని అన్నింటిని వదలి నిష్కాముడై గురువును చేరుతాడు.

తత్త్వవేత్త అయినవాడయితే జనకాదులవలె గృహస్థుడో యాజ్ఞవల్క్యాదుల వలె సన్న్యాసియో కావచ్చు. అది ప్రారబ్ధమును బట్టి జరుగుతుంది. తత్త్వవేత్త అసంగుడు. దేహాదిక్రియలను అతడు ఆత్మయందు ఆరోపించికొనడు. అందువలన అతనికి సన్న్యాసంతో చేయవలసినదిలేదు.

"గుణా గుణేషువర్తంతే ఇతి మత్వానశోచతి", "కుర్వన్నపి నలిప్యతే", "న కరోతి న లిప్యతే" కనుక విరక్తుడయిన అవిద్వాంసుడే కర్మ సన్న్యాసం చేయవలయును. విరక్తుడు కాకపోతే కర్మ చేయవలయును. "స్వాత్మానం సమవేత్య" అన్న శ్లోక పదానికి అర్థం ఏమటంటే, ఆపాతతః తెలిసికొని అని అర్థము. పరోక్షాత్మవేత్తకు పరోక్షంగానయినా తాను బ్రహ్మమునన్న నమ్మిక బలంగా ఉంటుంది. వీనికదీ తక్కువ. లేదా, ఆత్మ పరమాత్మాభేదజ్ఞానం దృఢంగా ఉన్నది. ఆత్మదేహాతిరిక్తమని తెలుసుకనుక అది ఆకలిదప్పికలు మొదలగు ద్వంద్వములకతీతమని తెలుసు – పర పక్షము.

**శ్లో॥ త్యక్త్వా బ్రాహ్మణ ఏషణాస్తదఖిలాస్సన్న్యస్య శాస్త్రాద్గురోః**
**పాణ్డిత్యం సమవాప్య శేషరహితం బాల్యఞ్చ మౌనస్తతః ।**
**ముఖ్యబ్రాహ్మణభావమేత్య కలితబ్రహ్మాత్మసాక్షాత్కృతి-**
**ర్లోకే సంవిచరేద్యథేష్టమథవా శాస్త్రానుసారీ చరేత్ ॥ 133**

భావ॥ అఖిల = ఏషణలను సన్న్యసించి శాస్త్రం వలన గురువు వలన శేషరహితమయిన

సమగ్ర జ్ఞానమును పొంది బాల్యమును మౌనమును పాటింపవలెను. అపుడు (శ్రవణ మనన) నిదిధ్యాసన ద్వారా బ్రహ్మాత్మ సాక్షాత్కారమును పొంది ముఖ్యబ్రాహ్మణత్వమును పొంది లోకమునందు యధేచ్ఛగా సంచరింప వలెను. లేదా, లోక సంగ్రహార్థమయి శాస్త్రము ననుసరించి సంచరింపవలయును. 133

విశే॥ 1. బాల్యం = జ్ఞాన బలము అనాత్మ భావనలను తిరస్కరించుట, పాండిత్యం = ఆత్మ తత్త్వజ్ఞానము.

2. జాతిబ్రాహ్మణత్వం ముఖ్యం కాదు. బ్రహ్మజ్ఞానంతోనే బ్రాహ్మణుడు – అని శ్రుతి. **అనగా గౌణ బ్రాహ్మణుడు బ్రహ్మజ్ఞానం ద్వారా ముఖ్య బ్రాహ్మణుడవుతాడు.**

**శ్లో॥ ఓతం ప్రోతమిదం సమం పయసి తద్వాయౌ ఖలోకేష్వసౌ**
**తే గాన్ధర్వపదేషు తాని తరణేర్లోకేషు చాన్ద్రేషు తే ।**
**చాన్ద్రా శ్చోడుపదేషు తాని దివిషల్లోకేషు చైన్ద్రేషు తే**
**ప్రాజాపత్యపదేషు తాని చ విధేర్లోకేషు సూత్రే చ తే ॥ 134**

భావ॥ ఆత్మ సర్వాంతరము. భౌమ వస్తువు. నీటియందు ఓతప్రోతమయినది. లేదంటే భూమి పేలపిండివలె పొడిగా రాలిపోయేది. నీరు గాలియందు గాలి ఆకాశమున, అది గాంధర్వ లోకమున, అది సూర్యలోకమున, అది చంద్రలోకములందు, అవి నక్షత్ర స్థానమునందు, అవి దేవలోకములందు, అవి ఇంద్రలోకములందు, అవి ప్రాజాపత్య లోకములందు, అవి బ్రహ్మ లోకములందు, అవి సూత్ర బ్రహ్మలోకమునందును పడుగుపేకల వలె అల్లికొని యున్నవి. 134

**శ్లో॥ లోకోఽయఞ్చ పరశ్చ భూతనికరస్సందృబ్ధ ఏషోఽఖిలో**
**దేహాన్తర్బహిరిఙ్గతా హి మరుతా సూత్రేణ రత్నౌఘవత్ ।**
**అజ్ఞాన్యస్య భవన్తి హన్త శిథిలాన్యత్రాన్తి మాప్తేఽన్తరే**
**వాయౌ చాపి బహిర్భవేఽప్రచలతి ప్రాణీ హి నో చేష్టతే ॥ 135**

భావ॥ సూత్రము రత్న సమూహము మధ్యనుండి వ్యాపించి వాటిని నిలిపి యుంచినట్లు దేహములకు లోపల బయట వ్యాపించి నడచుచున్న యీ వాయువు భూలోక పరలోకములను, సమస్త భూత సమూహమును పట్టి యుంచినది. ఈ వాయువు అంతరమునుండి బయలుదేరినచో సర్వ – అవయవములు శిథిలమగును. బాహ్యవాయువు కదలనిచో ఏ ప్రాణియు కదలదు గదా! 135

విశే॥ 1. బ్రహ్మాది స్తంబపర్యంతము వాయువే సూత్రాత్మ. సమష్టి వాయువు సూత్రాత్మ. వ్యష్టి = ప్రాణము. సమష్టి = సూత్రము. హిరణ్యగర్భుడు, వాయువు. సూత్ర – అభిమాని అయిన పురుషుడు హిరణ్యగర్భుడనవచ్చును. సూత్రం = వాయువు.

శ్లో॥ ఊర్ధ్వం యచ్చ దివో భువశ్చ యదధో ద్యావాపృథివ్యన్తరే
యద్భూతఞ్చ భవచ్చ భావి యదిదం సూత్రం సమస్తఞ్చ తత్ ।
ఓతమ్ప్రోతముతాస్తి సోమ్య! పరమాకాశే పరాత్మన్యయం
న ప్రోతః క్వ చ నోత ఏష సకలాధారః స్వలోకే స్థితః ॥ 136

భావ॥ ఈ ద్యావా పృథివులు పైన క్రింద మధ్యన ఉన్న వస్తువుగాని, భూత వర్తమాన భవిష్యద్వర్తమాన పదార్థము ఏదయినా గాని ఈ సూత్రము పైన వర్ణింబడిన వాయువుగాని - ఇదంతాగూడా - ఓ సౌమ్యా! ఆకాశమునందు ఓతప్రోతమయినది. ఈ ఆకాశము పరమాత్మ యందు ఓతప్రోతమయినది. కాని యీ పరమాత్మ మాత్రము ఎచ్చటనూ ఓతము కాదు. ప్రోతము కాదు. సకలాధారమయిన యీ పరమాత్మ తనలోకమునందే నిలిచియున్నది. 136

విశే॥ 1. ఆకాశకార్యం అయిన వాయువు తన కారణమయిన ఆకాశమున ఓతప్రోతము. తంతువులయందు పటము ఓతప్రోతము. 2. "ఆత్మన ఆకాశ స్సంభూతః"

3. ఆత్మేతరమయిన వస్తువు లేనందున ఆత్మ నిరాధారం. స్వాధారం. సర్వాధారం. ఇదంతా వ్యవహారదృష్ట్యా.

శ్లో॥ భూవార్యగ్నిమరున్నభోద్యురవిదిక్చన్ద్రోడుఖార్చిస్తమో-
భూతప్రాణదృగాశయశ్రవణవాక్త్వగ్బుద్ధిరేతస్సు యః ।
తిష్ఠత్యాన్తర ఏవ సన్నియమయన్ జానన్తి నోతాని యం
దేహో యస్య చ తాని సోమ్య స పుమానాత్మా తవైవామృతః ॥ 137

భావ॥ సర్వాంతరుడయిన పరమాత్మయే యీ సర్వమును నియమించును కనుక ఆయన సర్వాంతర్యామి. పంచభూతములు, సూర్యచంద్రులు, దిక్కులు, చీకటి వెలుగులు, ప్రాణులు, ప్రాణము, నేత్రాదీంద్రియములు, మనస్సు, బుద్ధి, రేతస్సు వీటన్నింటియందు పరమాత్మ ఆంతరుడే. వాటిని నియమించుచునేయుండును. అందువలన అవి తమతమ గుణధర్మక్రియలను నిర్వహించును. అయినను ఆయనను అవి అనగా (జడములు గనుక) వాని అభిమానదేవతలు గూడా ఎఱుగవు. కాని అవి అన్నియు ఆయన దేహములు. ఆయనయే పురుషుడు. ఆయనయే అమృతమయిన నీ ఆత్మ. 137

విశే॥ 1. భగవంతుడు అంతర్యామిగా ఉన్నందువలన ప్రకృతి నియమాలు సాగుతున్నాయి. పదార్థగుణాలు శాశ్వతంగా ఉన్నాయి. కాఠిన్యం, ద్రవం మొదలగు స్వభావాలు అలాగే కొనసాగుతాయి.

2. అంతర్యామిని గూర్చి జడమయిన పదార్థాలకెటూ తెలియదు. వాటి అభిమాన దేవతలకు గూడా తెలియదు. అంతర్యామి ప్రయోజకత్వం వారికి అజ్ఞాతమే.

3. అంతర్యామి అయిన ఆ ఈశ్వరుడే ఆత్మ. మొత్తం చైతన్యమే. కనుక జీవస్వరూపమే అంతర్యామి. ఆయనయే ఈశ్వరుడు. ఒకే చైతన్యంలో మాయవలన ఈశ్వరత్వం, అవిద్యవలన జీవత్వం వచ్చాయి. ఉపాధి మినహాయిస్తే అంతా చైతన్యమే. అంతర్యామిత్వం గూడా ఉపాధుల వలన వచ్చినదే. కేవల చైతన్యం నియామకం కాదు. నియామ్యమూ కాదు. మాయోపాధిక మయితేనే అలా నియామ్య నియామకత్వం.

"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥"

పరోక్ష స్వభావుడయిన ఈశ్వరుడు శాస్త్రాత్ అనుమానాత్ గ్రహింపదగినవాడు. "జీవుడు పరతంత్రుడు. సంసారి కనుక, ప్రత్యుదాహరణం ఈశ్వరుడు"

4. నిజానికి జీవ పరతంత్రత అనుభవ సిద్ధము. మన దుఃఖానుభవములు, దురదృష్టములు, ఆకస్మిక – కష్టములు అన్నియు మన పరతంత్రతకు నిదర్శనములు. కాలాదృష్టములు జడములు కనుక అవి జీవుని వశీకరింపలేవు. అయస్కాంతం "లోహం" వద్ద అయస్కాంతం వలన లోహం వ్యవహరించటం స్వభావ సిద్ధమే కాని అచ్చట అది ఒక అచేతనం చేసిన నియమం కాదు. అందుకు జ్ఞానం కావాలి.

స్వభావం నియామకం కాదు. స్వభావాధీనం స్వభావం అయితే ఆత్మాశ్రయ దోషం. మరో స్వభావం నియామకంగా అంగీకరించటం అనవస్థ. జీవుడూ నియంతకాడు. వాడు సర్వజ్ఞుడు కాడు. సర్వశక్తుడూ కాడు. సమర్థుడయితే గ్రీష్మంలో తాపాన్ని శిశిరంలో చలిని బాగా తగ్గించికొనేవాడు గదా! చంద్రుని పున్నమి శాశ్వతం అయ్యేది కదా! కనుక ఈశ్వరుడే నియంత. "భీషాస్మాద్వాతః పవతే" గదా! లేదంటే పంచభూతాలు విజృంభించినా సంకోచించినా నాశనమే కదా!

5. ఈశ్వరుడు పరోక్షుడు. అంతర్యామిగా ఆయన పరోక్షుడు. ప్రత్యగాత్మగా ఆయన అపరోక్షుడు. దశలలో భేదం వలన ఒకడే అలా కావచ్చును. జ్ఞానంలో అపరోక్షత. వ్యవహారంలో అజ్ఞానంలో పరోక్షత. విద్యా దశలో ద్వైతం లేదు గనుక అంతర్యామి బహిర్యామి అన్న భావన లేదు. భూతములుంటే వాటి పరతంత్రతను బట్టి ఒక ఈశ్వరుడు కర్మఫలములను బట్టి నియామకత వస్తాయి. సర్వం లేని కేవల స్వరూప దశలో ఏదీ లేదు. అంతర్యామీ అంతే. అంతా చైతన్యరూపంగా సత్యం. ఉపాధి రూపంగా మిథ్య.

6. లేదా, ఈశ్వరుడే ప్రత్యగాత్మ. సర్వభూతములందు ఆయనయే ఉండును. అక్రియుడయినా అయస్కాంతలోహన్యాయంతో ఆయన సన్నిధిలో సర్వభూతములు భ్రమింప వచ్చును. జ్ఞానులకీయన దొరకుతాడు. సంసారి జీవుడే వస్తుతః ప్రత్యగాత్మ. కనుక జీవునకు

ఆయనయే ఆత్మ. బ్రహ్మ మాయా శక్తియే ప్రత్యగాత్మకూ ఉంటుంది. ఈయన బ్రహ్మమే కనుక. మాయ ఈశ్వరునిదంటారా? – కాదు. అది బ్రహ్మ శక్తియే. దానియందే ప్రతిబింబించిన బ్రహ్మం ఈశ్వరుడుగా కల్పితుడు. ఈశ్వరశక్తి అనుకొన్నా, ఈశ్వర స్వరూపమయిన చైతన్యమును ఆశ్రయించిన మాయయే గదా!

7. ప్రత్యగాత్మనే అంతర్యామి అంటే, జీవుడు తనే గనుక తనను తను నియమించికొనటం ఎలా? – ఈశ్వరుడంతర్యామి అన్నా ఈ సమస్య సమానమే గదా! ఈశ్వరాంశయే గదా! జీవుడు. "మమైవాంశో జీవలోకే, జీవభూత స్సనాతనః" – గీత. ఈశ్వరుని అంశ అంటే ఈశ్వరుడే. ఎందుకంటే, ఆయన అవయవరహితుడు. అంశలు ఉండవు. ఉన్నాయంటే ఈశ్వరునికిన్ని సంసారిత్వం తప్పదు. జీవులు ఆయనయొక్క ముక్కలయితే ఆయన వికలాంగుడయినట్లే. అంశ ప్రవేశ నిర్గమములవలన ఈశ్వరునిలో వృద్ధి క్షయాది వికారములు వస్తాయి. ఈశ్వరుడు, జీవుడు అంతా అనిత్యులవుతారు. వికారం గల వస్తువులు అనిత్యములు కదా! **ఈశ్వరాంశ అన్న గీతా వాక్యానికి అర్థం " నా స్వరూపమే జీవుడు (మదభిన్నః జీవః)" అని.** అయ్యా! మహాకాశం ఘటాకాశం లాగా ఈశ్వరాంశ జీవుడనవచ్చు గదా! – సమా – దానర్థం గూడా ఆ ఆకాశమే ఈ ఆకాశము అని. ఆకాశము నిరంశమని, నిరవయవమని కొందరంటారు.

8. ఈశ్వరుడు జీవుడు ఒక్కరే అయితే నియమించేదెవరిని? – అనాత్మ పదార్థములను. అయితే వానితో ఉన్న తాదాత్మ్యాధ్యాస వలన జీవులనే నియమించినట్లనిపిస్తుంది.

9. సర్వాశ్రయమయిన ఆత్మ సర్వాంతరం ఎలా అవుతుంది? – సర్వాశ్రయమయిన ఆకాశం సర్వాంతరం (గాలి అంతే, చెరువులో పడితే మనకు నీరూ అంతే. శరీరములో పంచభూతములూ అంతే గదా!) "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" కదా! **బయట పరమాత్మ లోపల అంతరాత్మ అనటం కుదరదు. అపుడు ఆత్మకు పూర్ణత్వం రాదు.** రెండు సగాలుగా భిన్నంగా ఉంటుంది. (ఘటకపాలాల లాగా) **ఉపాధికృతమయిన అంతరత్వ బాహ్యత్వాలు మిథ్యలు. స్వాభావికములు కావు.** అసలు దేహాది ఉపాధులే మిథ్యలు. వాటి వలన ఆత్మ భిన్నంకాదు. **ఎండమావినీటి వలన ఎడారిలో బురద కాదు.**

**శ్లో॥ ఏతత్తత్పదమక్షరం యదతమో స్థూలం న సూక్ష్మం చ న**
**హ్రస్వం నాయతమప్యభూతమగుణం న జ్యోతిరచ్ఛాయకమ్ ।**
**అప్రాణం సదమాత్రమన్తరహితం సఙ్గాతిగం నేన్ద్రియం**
**న స్వాన్తం న ముఖం నిరన్తరమగం చాబాహ్యమేకం బృహత్ ॥138**

భావ॥ ఈ పరమాత్మ తత్త్వము అక్షరమని చెప్పబడినది. ఇది తమస్సు కాదు. స్థూలం

కాదు. సూక్ష్మం కాదు. హ్రస్వం, దీర్ఘం కాదు. భూతం గుణం కాదు. జ్యోతి కాదు, ఛాయ కాదు. ప్రాణం కాదు. మాత్ర కాదు. అంతము లేదు. సంగము లేదు. ఇంద్రియం కాదు. మనస్సు కాదు. ముఖం కాదు. అంతరం లేదు. గమనం లేదు. (స్థిరం) బాహ్యం కాదు. అది ఒక్కటే బ్రహ్మము. 138

విశే॥ 1. తమః = అజ్ఞానం, చీకటి, అతమః.

2. భూతం = పంచ విధ భూతములలోనేదియు కాదు.

3. గుణము - 24 తర్కశాస్త్ర సిద్ధమయిన రూపరసాది గుణములు. లేదా, శబ్దస్పర్శరూపాది భూత గుణ పంచకము

4. అగుణము - గుణము కానిది. గుణములు లేనిది. నిర్గుణము

5. అజ్యోతిః = వెలుగుకానిది. జ్ఞానము కానిది. ఎండకానిది

6. ఛాయా - అజ్ఞానం, అంధకారము, నీడ. 'అతమః - అజ్యోతిః' వీటికి చెప్పే అర్థమును బట్టి "ఛాయా"కు పై అర్థాలు చెప్పాలి.

7. అప్రాణం - ప్రాణరహితం. ప్రాణభిన్నము

8. నస్వాంతం - అంతఃకరణ భిన్నం అంతఃకరణ రహితం

9. "అప్రాణో హ్యమనాః శుభ్రః, అపాణిపాదః"

10. అమాత్రం - దీనిచేత ఏదీ కొలవలేము.

11. సత్ - సత్త కలది. దీని సత్తావలననే సమస్త వస్తువులు సత్తకలవవుతాయి. కనుక ఇది "అసత్" ఎన్నటికీ కాదు.

12. స్థూలత్వాది ప్రకారములు (విశేషణం) గలది అనగా వికారములు గలది నశించును. కాని ఆత్మకు అట్టి వికారములు లేవు. కనుకనే "అవినాశీ వా అరేయ మాత్మా", "అనుచ్ఛిత్తి ధర్మా" నిత్యమయిన యీ జీవుడు అక్షరబ్రహ్మమే. సత్యమే నిత్యము. బ్రహ్మమే ఏకము సత్యము. బ్రహ్మం కన్న భిన్నమయితే జీవుడు అనిత్యం అవుతాడు కనుక అంతా బ్రహ్మమే. "అతోన్యదార్తమ్"

**శ్లో॥ అశ్నాతీశ్వర ఏష కిఞ్చిదపి నో కోప్యేనమశ్నాతి నో**
**సూర్యాచన్ద్రమసావముష్య విధృతౌ సంశాసనే తిష్ఠతః ।**
**ద్యావాభూమియుగం నిమేషదిననిణ్మాసర్తుసంవత్సరా**
**హ్రాదిన్యో నియతం స్రవన్తి పితరో దేవా మనుష్యాశ్రితాః ॥ 139**

భావ॥ అక్షర పరబ్రహ్మ స్వరూపుడయిన ఈశ్వరుడు ఈ సంసారమున దేనినీ భోగించడు. అనగా సర్వసాక్షి. ఈ ఈశ్వరుని గూడా ఎవరూ భక్షించరు. అనగా ఆయన సర్వేశ్వరుడు. ఈ

సూర్యచంద్రులు గూడా ఇతని శాసనం వలననే ఉదయాస్తమయ ప్రకాశములతో నిలిచియున్నారు. ద్యావాభూములున్ను ఇతని శాసనమునందే నిరాలంబమయిన ఆకాశమున నిలిచియున్నవి. నిమిషములు, అహోరాత్రములు, మాస ఋతు సంవత్సరములు నడచుచున్నవి. నదులు (ప్రాదినులు) నిత్యము ప్రవహించుచున్నవి. పితరులు, మనుష్యులు దేవతలు అందరూ ఆతని శాసనములను ఆశ్రయించియున్నారు. 139

విశే॥ 1. భీషోదేతి సూర్యః

2. భోక్త అయిన జీవుడు అభోక్త అయిన జడమయిన ప్రపంచము సర్వేశ్వరత్వము నందలేరు. అవి పరతంత్రములు కదా!

3. ద్యావాభూములు నిరాలంబమయిన ఆకాశంలో ఉండటం వాని స్వభావం అన్నా అట్టి స్వభావం ఈశ్వర దత్తమే.

4. సూర్యాదుల యీ కృత్యములు స్థితులు వలన ఈశ్వరుని ఊహించెదము. ప్రకృతి శక్తులలోని సూత్ర బద్ధతకు ఈశ్వరుని చండశాసనమే కారణము.

5. ఇదంతా మన కర్మఫలం, దేవతలు కారణం కాదు - అన్నా ఈశ్వర శాసనం లేనిదే దేవతలయినా ఆయా కర్మఫలములను నిర్ణయించలేరు. ఇవ్వలేరు. వారు జీవులే అల్పజ్ఞులే. హిరణ్యగర్భుడు గూడా జీవుడే. నియామకుడు కాడు. ఈశ్వరాజ్ఞా రూపమయిన వేదమును బట్టియే సృష్టి జరుపును. అలాగే భారతాదులను బట్టి వ్యాసాదులను ఊహించినట్లు వేదమును బట్టి దానికి ఆవిష్కర్త అయిన ఈశ్వరుని ఊహించెదము. కనుక ఈశ్వరుడున్నాడు. ఆయనయే అక్షరుడు. నిరుపాధిక చైతన్యము. అక్షరుడు. మాయోపాధిక చైతన్యము ఈశ్వరుడు. ఈశ్వరుడే అవిద్య వలన జీవత్వం పొందినాడు. కనుక జీవేశ్వర స్వరూపమయిన అక్షరమే ప్రశాసకము. అంతర్యామి.

**శ్లో॥ అజ్ఞాత్వాఽక్షరమేతదత్ర యజతే దేవాంశ్చ యో నా జుహో-**
**త్యగ్నీన్యోఽవిరతం తపశ్చరతి వా వర్షాన్ బహూనామృతి ।**
**త త్తస్యాన్తవదేవ చైతదవిదన్ యః ప్రైతి లోకాదిత-**
**శ్శోచ్యోఽయం య ఇదం ప్రయాతి తు విదన్ స బ్రాహ్మణో బ్రహ్మవిత్॥140**

భావ॥ ఈశ్వరజ్ఞానము, బ్రహ్మాత్మైక్య జ్ఞానము లేకుండా, ఎవడయితే దేవతలనుద్దేశించి యాగములను, హోమములను, అగ్నులను నిరంతరముగా చాంద్రాయణాది తపములను మరణపర్యంతము అనేక సంవత్సరములు ఆచరించినను, ఆ కర్మఫలము నశ్వరమే. ఈ పరబ్రహ్మమును తెలిసికొనకుండగనే ఎవడు ఈ లోకమునుండి వెడలునో వాడు శోకపాత్రుడే. తెలిసివెళ్లిన వాడే బ్రాహ్మణుడు. బ్రహ్మవేత్త. 140

విశే॥ 1. ఈశ్వరుడు మోక్షదాత. కర్మ ఫలవిధాత. కనుక ముముక్షువు ఈశ్వరారాధన కొఱకు విహిత కర్మ చేయటమే మంచిది. అని ప్రశ్న – సమా – కర్మఫలం కృతకం అనిత్యం. కనుక వాడు శోచనీయుడు. పునరావృత్తి తప్పదు. వీడు పశువు వంటివాడు. దేవతలు ఫలముతో వీనిని కొనుక్కొన్నట్లు. "తందేవాభక్షయంతి" గదా!

2. బ్రహ్మవేత్తయే ముఖ్యమయిన బ్రాహ్మణత్వము గలవాడు. ఇదంతా ముక్తి దశకు ముందు సంగతి. ముక్తిదశలో బ్రాహ్మణాది భేదం లేదు. కనుక మరణ కాలమునందయినా ఎవడు బ్రహ్మమును పొందునో వాడే బ్రాహ్మణుడు. అతడు బ్రహ్మమే. "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" అని శ్రుతి. కనుక జ్ఞానం వలననే మోక్షం. కర్మలవలన కాదు. ఈశ్వరుడు చేసిన నియమమే ఇది. "జ్ఞానాదేవతు కైవల్యం" జ్ఞానం ఈశ్వరుడివ్వగలిగినది కాదు. ఆయన చిత్తశుద్ధిని ఈయగలడు. కర్మలకు ఈశ్వరారాధనకు అదే ప్రయోజనము. ఇది జీవుని స్వరూపమే కనుక అది క్రొత్తగా ఇవ్వటం సాధ్యం కాదు. **ఈశ్వరుడు అవిద్యా నివృత్తి చేస్తాడనటం గూడా కుదరదు.** జ్ఞానం వలననే అవిద్యా నివృత్తి. తేజస్సు వలననే చీకటి పోవును. అవిద్యా నివృత్తి మోక్షం అయితే అది కృతకం అనిత్యం అవుతుంది గదా! – సమా – పోయిన అవిద్య తిరిగిరాదు కనుక అవిద్యా నివృత్తి నిత్యమే. **కనుక ఈశ్వరానుగ్రహ లబ్ధమయిన "అహం బ్రహ్మాస్మి" అన్న అపరోక్ష జ్ఞానం వలననే ముక్తి.**

**శ్లో॥ ద్రష్టేతత్సదదృష్టమశ్రుతమపి శ్రోత్రక్షరం చామతం**
**మన్త్ర జ్ఞాతమపి ప్రవేత్తృ భవతి బ్రహ్మాస్త్యతోఽన్యన్నహి ।**
**ద్రష్టృశ్రోతృ చ మన్తృ వేత్తృ తదిదం బ్రహ్మణ్యముష్మిన్ జగ-**
**త్ప్రోతం చోతమిద సమస్తభువనస్యాత్మాన్తరే సంస్థితః ॥ 141**

భావ॥ ఈ సత్తు అయిన బ్రహ్మం ద్రష్ట. అనగా సాక్షి, అది దృశ్యం కాదు. అది శ్రోత శ్రుతం కాదు. (ఎందువలనంటే దానికి ద్రష్ట శ్రోత వేరుగా ఎవరూ ఉండరు కదా! అది అద్వితీయ చైతన్యం కదా!) అది అక్షరం అమృతం. అదే మంత. (తలచునది) అదే జ్ఞాత. జ్ఞాతం కాదు. అదే బ్రహ్మం. దానికి మించిన దేదియు లేదు. దీనికన్న భిన్నంగా ద్రష్ట, శ్రోత, మంత, వేత్త ఉండదు. ఈ బ్రహ్మమునందే జగత్తు ఓతప్రోతముగా (అల్లిబిల్లిగా) అల్లుకొని యున్నది. ఈ సమస్త భువనమునకు ఆంతరముగా ఆత్మగా ఉన్నది. 141

విశే॥ 1. ఈ బ్రహ్మము తనను తాను చూడటం, తలచటం వంటివి లేవు. కర్తయే కర్మ కాదు. కర్మయే కర్తకాదు. ఆత్మయందు క్రియయే లేదు. ద్రష్ట, దృశ్యం ఒక్కటే కావు. వేరేవి లేవు. అనగా వేరే ద్రష్టలు లేరు. **కనుక జీవునకు ద్రష్టగా ఈశ్వరుడున్నాడన్న ద్వైతమతము నిర్మూలితం. జీవుడు ద్రష్ట.** ఈశ్వరుడు ద్రష్ట. మొదటిదనుభవం. రెండవది శాస్త్రీయం. "స సర్వజ్ఞ స్సర్వవిత్" ఇద్దఱు ద్రష్టలు ఒక్కటే. అక్షరం ఒక్కటే ద్రష్ట. కనుక జీవనానాత్వం ఖండితం.

2. శరీరభేదాలను చూస్తూ మనం ఆత్మలను చూచినట్లు భావిస్తాం. దేవదత్తుడు యజ్ఞదత్తుని చూడటం దేహమునే గాని ఆత్మను కాదు. చూచే దేవదత్త యజ్ఞదత్తులు ఆత్మలే కాని ఉపాధులు మాత్రము భిన్నము. అనుభవం ఉపాధుల వలన భిన్నంగా ఉంటుంది.

3. అక్షరుడొక్కడే జీవులు అనేకం - అనటం కుదరదు - అక్షరుడు జీవుడే. నిర్విశేష మయిన అక్షరమే మాయవలన సవిశేషం అవుతుంది. కనుక జీవుడే అక్షరపరబ్రహ్మం. కనుకనే "తత్త్వమసి" అన్నది శ్రుతి.

**శ్లో॥ అష్టౌ తే వసవోఽగ్నిభూమిపవనాభ్రార్కద్యుచన్ద్రోడవో**
**ధీకర్మేన్ద్రియపఞ్చకే చ హృదయం రుద్రాస్తథైకాదశ ।**
**మానా ద్వాదశ వత్సరస్య య ఇమే తే ద్వాదశాదిత్యకా**
**ఇన్ద్రోఽబ్ద స్త్వశనిః ప్రజాపతి రథో ఏకశ్చ యజ్ఞః పశుః ॥ 142**

భావ॥ అంతర్యామిని చూడటం సులభం అయ్యేందుకు అంతర్యామిచేత నియమింపబడే చిల్లర దేవతలను వివరించుచున్నాడు.

1. వసువులు - 8 మంది. వారు అగ్ని, భూమి, వాయువు, ఆకాశం, ద్యులోకము, సూర్య చంద్ర నక్షత్రములు.

వీరు ప్రాణులకు కర్మ ఫలాశ్రయంగాను, కార్య కరణ సంఘాతమయిన శరీరంగాను, దాని నివాసంగాను పరిణమిస్తూ, ప్రపంచమును నిలుపుతారు. నిలుస్తారు కనుక వసువులు. 8.

2. రుద్రులు - పంచ జ్ఞానేంద్రియములు. పంచకర్మేంద్రియములు. హృదయము (మనస్సు) - ఈ "11" రుద్రులు. వీరు కర్మఫలభోగం తరువాత శరీరమునుండి పోయి బంధువులను ఏడిపిస్తారు కనుక రుద్రులు.

3. ఆదిత్యులు - 12. వీరు సంవత్సరావయవములయిన మాస స్వరూపులు. వీరు మనుష్యుల ఆయువును తీసికొని పోతారు కనుక ("ఆదదానాః యాంతి") - ఆదిత్యులు - 12. బల స్వరూపుడయిన ఇంద్రుడు. ఇతడు అబ్దుడు అనగా మేఘుడు, ఇతడే ఆశని = అనగా పరహింసకుడు. (బలము, వీర్యము, హింసకత్వము, ఆశని, ఇంద్రుడు - అన్ని ఒక్కటే) కనుక ఈ ఇంద్రుడు ఒక దేవుడు. పశురూపమయిన యజ్ఞము. దీనిని ప్రజాపతి అనిగూడా అంటారు. కనుక ఇంద్రుడు ప్రజాపతి అని మొత్తం 33 దేవతలు. (8+11+12=31+2=33) 142

**శ్లో॥ తే త్రింశత్త్ర్యధికా మతా బుధవరైర్దేవా అథాగ్నిః క్షితి-**
**ర్వాయుః ఖం తరణిర్ద్యులోక ఇతి తే దేవాశ్చ షట్ సంస్తుతాః ।**

**లోకాంస్త్రీనపి దేవతాత్రయమితి ప్రాణాన్నయుగ్మం తథా**
**దేవద్వన్ద్వమితి బ్రువన్తి పవనం చాధ్యర్థమేకం బృహత్ ॥ 143**

భావ॥ పై శ్లోకములో చెప్పబడిన “33” దేవతలను బుధులు గణించినారు. అందులో అగ్ని, భూమి, వాయువు, ఆకాశము, సూర్యుడు, ద్యులోకము అను ‘6’ దేవతలు. మూడు లోకములను మూడు దేవతలుగాను, ప్రాణమును అన్నమును జంట దేవతలుగాను, వాయువును వృద్ధి దేవతగాను, పూర్ణమయిన ఏకదేవతగా బ్రహ్మముగా బుధులు చెప్పెదరు. ప్రాణం సర్వదేవాత్మకం. 143

విశే॥ 1. భూమి, అగ్ని (1) అంతరిక్షం వాయువు (1) ద్యు – ఆదిత్య (1) మూడు దేవతలు. అందులో భూః = భూమి, భువః = అంతరిక్షం సువః = ద్యులోకం

2. సర్వదేవతలు అన్నప్రాణములలో అంతర్భవిస్తారు.

**శ్లో॥ ప్రాణం తం త్యదితి బ్రువన్తి విబుధా దేవా ఇతి హ్యేకతామ్**
**నానాత్వఞ్చ భజన్తి తత్స్వయమయం ప్రాణో భవన్నేకకః ।**
**భూతానామధికారభేదవశతో నామస్వరూపక్రియా–**
**నానాత్వేన భజత్యనేకవిధతామ్ మాయావశాదీశితుః ॥ 144**

భావ॥ బుధులు ప్రాణమును “త్యత్” అందురు. పరోక్షం కదా! అందువలన అన్నంగా భావించి ‘త్యత్’ అందురు. దేవతలు ప్రాణాత్మనా ఏకరూపులు. అగ్ని మొదలగు స్వరూపాలతో భిన్నరూపులు. ప్రాణం స్వయంగా ఏకరూపమయినా ఈశ్వర మాయవలన జ్ఞానకర్మాధికార తారతమ్యములను బట్టి అనేక నామరూపకర్మలతో నానావిధముగా అగుచున్నది. సూత్రాత్మ అయిన ప్రాణరూప హిరణ్యగర్భుడు అగ్న్యాది రూపములను సంతరించికొని, ప్రకాశనాది కర్మలతో అనేక విధంగా కనబుతాడు. కనుక ప్రాణులు గూడా తమ అర్హతను బట్టి జ్ఞానకర్మలను పాటించి సూత్రాంశమయిన అగ్ని – మొదలగు రూపములను పొందెదరు. 144

**శ్లో॥ శారీరః పురుషో భువాఽఽయతనవాన్ సప్తార్చిషాఽలోకవాన్**
**జ్యోతిష్మాన్ మనసాఽమృతేన విదితో జ్ఞైర్దేవతావానితి ।**
**కామాత్మా పురుష స్తథాఽయతనవాన్ కామేన లోకీ హృదా**
**జ్యోతిష్మా న్మనసాఽబలాభిరుదితో జ్ఞైర్దేవతావానితి ॥ 145**

భావ॥ ప్రాణబ్రహ్మకు 8 భేదములు గలవు. 1) శారీరుడు – ఈయనకు భూమి ఆధారము. అగ్నివలన దృష్టిమంతుడు. అనగా అగ్నితో చూస్తాడు. మనస్సులతో జ్యోతి గలవాడు. అమృతమే యీతనికి దేవత. శరీరం అమృతకార్యం కదా!

2. కామమయుడు - కామం ఆధారం. హృదయం, లోకం, మనస్సు జ్యోతి స్త్రీలు దేవతలు, స్త్రీల వలన కామదీప్తి గదా! 145

**శ్లో॥ ఆదిత్యే పురుషః స్థ ఆయతనవాన్ రూపైర్దృశా లోకవాన్**
**జ్యోతిష్మాన్ మనసా ఋతేన విదితో జ్ఞైర్దేవతావానితి ।**
**యః శ్రౌత్రః పురుషస్స ఆయతనవాన్ వ్యోమ్నా శ్రుతా లోకవాన్**
**జ్యోతిష్మాన్మనసా దిశా పరిషదా జ్ఞైర్దేవతావాన్స్మృతః ॥ 146**

భావ॥ 3) ఆదిత్య పురుషుడు - ఈయనకు రూపములు ఆధారము. నేత్రం లోకము. మనస్సు జ్యోతి. ఋతము అనగా సత్యము దేవత. సత్యము నేత్రమని భాష్యకారులు చెప్పారు.

4) శ్రోత్రపురుషుడు - ఆకాశము ఆధారము. చెవి - లోకము. మనస్సు జ్యోతి. దిక్కులు దేవత 146

**శ్లో॥ ఛాయాత్మా తమసాఽయమాయతనవాన్ లోకీ హృదా చేతసా**
**జ్యోతిష్మా న్ఖలు మృత్యునా నిగదితో జ్ఞైర్దేవతావానితి ।**
**ఆదర్శే పురుషో య ఆయతనవాన్ రూపైర్దృశా లోకవాన్**
**జ్యోతిష్మాన్ మనసాఽసునా స విదితో జ్ఞైర్దేవతావానితి ॥ 147**

భావ॥ 5) ఛాయామయ పురుషుడు - ఈయనకు అంధకారం ఆధారం. హృదయం లోకం, మనస్సు జ్యోతి, మృత్యువు దేవత.

6) ఆదర్శపురుషుడు - ఇతనికి రూపం అయతనం, ఇది ప్రకాశమయిన విశేషరూపము (ఇంతకు ముందు చెప్పిన శుక్ల, కృష్ణాదులు సామాన్య రూపములు) నేత్రము లోకము. మనస్సు జ్యోతి, ప్రాణము దేవత. 147

**శ్లో॥ అప్సు స్థః పురుషోఽద్భిరాయతనవాన్ బుద్ధ్యా తథా లోకవాన్**
**జ్యోతిష్మాన్మనసా కబన్ధపతినా వా దేవతావానితి ।**
**పుత్రాత్మా పురుషస్స ఆయతనవాంస్తద్రేతసా లోకవాన్**
**జ్యోతిష్మాంశ్చ హృదాఽశయేన కభువా వా దేవతావానితి ॥ 148**

భావ॥ 7) జలపురుషుడు - ఈయనకు జలము ఆయతనము. బుద్ధి లోకము. మనస్సు జ్యోతి, వరుణుడు దేవత.

8) పుత్ర పురుషుడు - రేతస్సు ఆయతనము, హృదయము లోకము, మనస్సు జ్యోతి, ప్రజాపతి - దేవత. (క - నీరు, కబంధః = జల సమూహము, పతి = వరుణుడు, కః = బ్రహ్మ. కభూః = ప్రజాపతి) 148

**శ్లో॥ దేవః ప్రాచి రవిస్స చక్షుషి చ తద్రూపేషు తాన్యాశయే**
**దేవోఽవాచి యమస్సవే స నిహితోఽసౌ దక్షిణాయాం చ సా ।**
**శ్రద్ధాయాం హృది సా పరాచి వరుణస్తోయే స తద్రేతసి**
**స్వాన్తే సోమ ఉదీచ్యయన్తు నియమే సత్యే స తన్మానసే ॥ 149**

భావ॥ పైన చెప్పబడిన దేవతలకు నివాసములను నిర్వచించి ఆత్మయే సర్వ ప్రతిష్ఠ అని చెప్పుచున్నాడు.

రవి – తూర్పున, నేత్రమున, నేత్రము రూపమునందు, రూపము మనస్సునందు ఉండును. యముడు – దక్షిణమున, యజ్ఞమున, యజ్ఞము దక్షిణయందు, దక్షిణ శ్రద్ధయందు, శ్రద్ధ హృదయమునందు ఉండును. వరుణుడు పశ్చిమదిక్కున, జలమునందు, జలము రేతస్సునందు, రేతస్సు హృదయమునందు ఉండును. సోముడు ఉత్తరదిక్కున – నియమమునందు, (దీక్ష) అది సత్యమునందు, అది మనస్సునందున్నది. 149

**శ్లో॥ దేవోఽగ్నిర్ధ్రువదిశ్యయం వినిహితో వాచి స్థితా వాగ్ఘృది**
**స్వాన్తం వర్ష్మణి త ద్ధృది ద్వయ మిదం ప్రాణే త్వపానే చ సః ।**
**స వ్యానే స ఉదాన ఏష నిహితస్సోఽయం సమానే స్థిత–**
**శ్శారీరే చ స పుష్కరే తదమృతే స్వీయే మహిమ్న్యేవ తత్ ॥ 150**

భావ॥ అగ్ని ఊర్ధ్వదిక్కున వాక్కునందు, వాక్కు హృదయమునందు, హృదయము వర్ష్మయందు, వర్ష్మ హృదయమునందు, ఈ జంట ప్రాణము నందు, ప్రాణము అపానమునందు, అపానము వ్యానము నందు, వ్యానము ఉదానము నందు, ఉదానము సమానము నందు సమానము శారీరమయిన ఆకాశమునందు, అది అమృతమయిన ఆత్మయందు, ఆత్మ తన మహిమయందే ఉండును. 150

విశే॥ 1. ధ్రువ – దిక్కు. ఇది అందరికి అన్నిచోట్ల బయటగా కనబడుతుంది. కనుక ఊర్ధ్వ దిక్కు.

2. "స్వే మహిమ్ని ప్రతిష్ఠితః"

**శ్లో॥ ఇత్యష్టాయతనాని చాష్టపురుషానష్టాపి లోకాంస్తథా**
**దేవానష్ట చ యో నిరుహ్య పురుషాత్ప్రత్యుహ్య చాతీతవాన్ ।**
**యస్సర్వాయతనం తమౌపనిషదం పూర్ణం పురాణం విభుం**
**సర్వస్యాపి పరాయణం చ పురుషం సేవేత విద్వాన్ సదా ॥ 151**

భావ॥ ఈ ఆయతనాదులు చూపిన ఫలమిది. 8 ఆయతనములు, 8 పురుషులు, 8 లోకములు, 8 దేవతలు – వీటిని తన ఆత్మనుండి బయటకు తీసి మరల తనయందే

యథాస్థానములో అభేదంగా కలిపి ఈ ఉపాధులను అతిక్రమించిన వాడు సర్వాధారుడు, ఉపనిషత్తుల వలన తెలియదగినవాడు, పూర్ణుడు, పురాణుడు, విభువు, సమస్తమునకు పరమగమ్యము - అయిన పురుషుడయిన ఆత్మ. విద్వాంసుడు. ఇట్టి "ఆత్మను నేనే" అని సేవింపవలయును. (పురాణం = పురాపి నవం) 151

**శ్లో॥ ఆదిష్టస్తు పురాతనేన వచసా యో నేతి నేతీత్యసా-**
**వాత్మా పూరుష ఏష ఔపనిషదోఽగ్రాహ్యో న యద్గృహ్యతే ।**
**నిస్సఙ్గో హి న సజ్యతే ప్రవిమలోఽశీర్యో న యచ్ఛీర్యతేఽ**
**బద్ధో యన్న చ బద్యతే త దమృతో జాతో యతో నో మతః ॥ 152**

భావ॥ ప్రాచీన వాక్కు అయిన వేదము ఆయనను "న,న" అని నిర్దేశించింది. అనగా ఈ దృశ్యమంతయు పరమాత్మ కాదని చెప్పింది. ఈ ఆత్మయే పురుషుడు. ఉపనిషత్తులచేత తెలియదగినవాడు. ఆయన ఇంద్రియగ్రాహ్యుడు కాడు గనుక అగ్రాహ్యుడు. దేనికి అతకడు కనుక నిస్సంగుడు. ఆ నిర్మలుడు విరిగిపోడు కనుక అశీర్యుడు, అతను బంధింపబడడు కనుక అబద్ధుడు. అతను పుట్టలేదు గనుక అమృతుడు. జననం ఉంటేనే నాశం కనుక జననం లేదు గనుక నాశరహితుడు. 152

**శ్లో॥ అశ్వత్థద్రుమవత్స ఏష పురుషో మర్త్యోఽమృషా పర్ణవ-**
**ల్లోమాన్యస్య తు లోహితం రస ఇవ త్వగ్భాతి వోత్పాటికా ।**
**మాంసం తచ్ఛకలాని వల్కలమివ స్నావాస్థి దార్వాయతే**
**మజ్జా సేవ పరిక్షతా వమతి వా రక్తం రసం త్వక్పుటః ॥ 153**

భావ॥ ఆ యీ పురుషుడు అశ్వత్థ ద్రుమమువలె ఉండుట సత్యము. వ్యవహారతః లేదా, ఉపమానతః గాని సత్యము. ఈతని రోమములు ఆకులు. ఈతని నెత్తురు - రసము, ఈతని చర్మము - దాని బెరడు, ఈతని మాంసము - దాని చెక్కముక్కలు, ఈతని స్నావ - దాని నార, ఈతని ఎముక - దాని కొయ్య, ఈతని మజ్జ - దాని మజ్జ జిగురు, ఈతని చర్మమునుంచి జారు రక్తము - దాని పట్టనుంచి కారు జిగురు. 153

విశే॥ "స వా ఏష పురుషోన్నరసమయః" అన్నట్లు దేహము = పురుషుడు, ఈ శ్లోకంలో పురుషుడనగా దేహము. ఇందులో సావయవోపమాలంకారము.

**శ్లో॥ బీజాద్భూజ ఇవ ప్రరోహతి పుమాన్ జీవాన్న వా రేతసో**
**జీవో మూలమముష్య బీజమివ భూజాతస్య తస్మాదయమ్ ।**
**మూలే సత్యపి దారితః పరశునా వృక్షః పునా రోహతి**
**క్ష్మాయాం మృత్యువినాశితోఽపి పురుషో జీవే పునర్జాయతే ॥ 154**

భావ॥ దేహం వృక్షం వంటిది. అలాగే దేహానికి బీజం ఉంటుంది. అయితే ఆ బీజం రేతస్సు అనుకొంటాం. కాని కాదు. రేతస్సు ఉన్నను అది ప్రతిసారీ సంతానం కలిగించదు. అలాగే వంధ్యకు సంతానం కలిగించదు. బురదలో పుట్టే క్రిమి కీటకాదులు రేతస్సు లేకుండానే పుట్టాయి. **కనుక పుట్టుకకు రేతస్సు నిమిత్తమాత్రం. అసలు కారణం జీవుడే. అతడే జ్ఞాన కర్మలతో దేహమును కలిగిస్తాడు.** గొడ్డలితో నరికినా చెట్టు మూలం ఉండటం వలన మరల మొలుస్తున్నది. అట్లే జీవదేహము మృత్యువుతో నశించినా ఆ జీవుడు మరల మరో దేహములో పుట్టుచున్నాడు. 154

విశే॥ 1. జీవుడు వానికర్మఫలములు – ఇవి దేహబీజము. కర్మఫలం అనుభవించటానికే శరీరం. అందువలన జీవుడే దేహపరంపరకు మూలము. చెట్టువద్ద మనం నరకిన కొమ్మ పోయినట్లే చిగుళ్ళతో వచ్చేది వేరే కొమ్మ. మొత్తం నరికినా అచ్చట మరల మొలచేది వేరే చెట్టు. పాతది రాదు. దేహాలు అంతే పాతవి మరల రావు. జీవునకు మఱల వచ్చేవి కొత్తవే. ఆరిపోయిన వత్తిని వెలిగిస్తే వచ్చేది కొత్తదీపమే. అయినా సామ్యం వలన అదే దీపం అనుకొంటాము – అలాగే దీపజ్వాలలుగూడా నదీ ప్రవాహన్యాయంతో క్షణం క్షణం క్రొత్తవే. తైల కణముల దహనం వలన ఏర్పడేవే. అయినా అదే దీపం వెలుగుతున్నది అనుకొంటాము. అట్లే ఒకే జీవునకు ఏర్పడినదేహములుగూడ "అదే దేహం' అని అనుకొంటాము. అలాగే దేహం గూడా దీపజ్వాలవలె ప్రతిక్షణం ఎదుగుబొదుగులతో ఉంటుంది. కనుక దేహం బాల్యాత్ వృద్ధాప్యం దాకా ఒకటే కాదు. అయినా అదే దేహం అనుకొంటాము. కారణం సామ్యం. (వికారగతి సూక్ష్మత గూడా). మృతదేహం మరల పుట్టుంది కనుకనే "ధ్రువం జన్మ మృతస్యచ" – గీత. కనుక మూలం వృక్ష పరంపరలను సృష్టించినట్లు జీవుడు దేహ పరంపరను సృజించును. కనుక అతడు వాస్తవముగా అజుడు.

2. 'దేహమే జీవుడు' అను బౌద్ధ మతములో దేహనాశంతో ఆత్మనాశమే. వారిమతంలో కర్మలు వాటి తారతమ్యము లేదు. కనుక దేహతారతమ్యము అకారణం అవుతుంది. పూర్వజన్మ ఒక్కటే ఒప్పుకొంటే ప్రస్తుత జన్మలో చేసిన పాపపుణ్యాలు వ్యర్థం అవుతాయి. కనుక ఉత్తరజన్మను అంగీకరించాలి. జ్ఞానంలేకుండా కర్మచ్ఛేదం జరుగదు. అందుకే భగవంతుడు వేదాంతములను అనుగ్రహించాడు.

3. "ఊర్ధ్వమూలోహ్యవాక్శాఖః" అని దేహవృక్షమునకు బ్రహ్మము మూలము గదా! – జీవుడంటారేమిటి? – అది ద్వైతవాదులకు బాధ. మేము అద్వైతులము. బ్రహ్మమే జీవుడు కదా!

బ్రహ్మయందు ప్రపంచం మాయాకల్పితం కనుక దేహమునకు బ్రహ్మం మూలం

అవుతుంది. జీవుడు జ్ఞానకర్మలతో దేహం సృజించికొంటున్నాడు గనుక జీవుడూ మూలం అనవచ్చును.

4. దేహాది సృష్టి ఈశ్వరుడే. "యతోవా ఇమాని – " కదా! జీవుడు అయితే చక్కగా మంచి శరీరం సృష్టించుకొంటాడు గదా! ఈశ్వరుడయితే కర్మఫలానుగుణంగా సృష్టిస్తాడు కనుక ఆయనకు పక్షపాతమూ లేదు. మనకు స్వతంత్రత లేదు. కనుక ఈశ్వరుడే దేహమునకు మూలము. జీవుడు కాదు. – సమా – ఈశ్వరుడు జీవుడు ఒక్కరే. భేదం ఉన్నదనుకొన్నా కర్మఫలం కారణంగా శరీరమునకు జీవుడే మూలము. ఈశ్వరాదులు అముఖ్యకారణాలు. "పుణ్యః పుణ్యేన, పాపః పాపేన" కదా! నిజానికి కర్మయే దేహమూలం. కర్మి కనుక జీవుడే అని చెప్తాము. అయితే దేహం మన కర్మి అయిన జీవుడున్నాడని తెలుస్తుంది. ఈశ్వరుడున్నాడని ఎలా తెలుస్తుంది – జీవుడే పరమాత్మ కనుక. అందువలన తన అవిద్యతో కనబడే దేహమునకు మూలము ఆ ఔపనిషద పురుషుడే – అని అంగీకరింపవలసినది.

**శ్లో।। నిర్మూలం యది నాశితః క్షితిరుహో నైవ ప్రరోహేత్పున–**
**ర్నిర్మూలం యది నాశితశ్చ పురుషో జాయేత నాయన్తథా ।**
**జ్ఞానానన్దమయః పరాయణమయం విత్తస్య దాతుః కృతః**
**కర్మౌఘస్య పరాత్మని స్థితవతస్సన్న్యాసినస్తద్విదః ।। 155**

భావ।। చెట్టును వేరులతో సహా పెకలించినచో అది మరల మొలవదు. అలాగే దేహము (లింగ దేహము) నిర్మూలంగా నశించినచో అది మరల మొలవదు. పునర్జన్మ లేదు. ధనదానం మొదలయిన కర్మసమూహమునాచరించు కర్మికి ఈ జ్ఞానానందమయుడు పరమగమ్యము. పరమాత్మయందే నిలచిన (బ్రహ్మ సంస్థుడు) బ్రహ్మవేత్త అయిన సన్న్యాసికి ఆయనయే గమ్యము. 155

విశే।। 1. 'అహం బ్రహ్మాస్మి' అను జ్ఞానం వలన నశించిన దేహం మరల రాదు. దేహమూలం కర్మయే. దానిద్వారా జీవుడు మూలము. లేదా జీవుడు అనగా కర్మిరూపమయిన జీవుడు అసలు జీవుడు గాడు. అతను నశించవచ్చును. లేదా మూలం అజ్ఞానం. దానితో సహానశిస్తే దేహం తిరిగిరాదు. జీవాశ్రితంగాని, బ్రహ్మాశ్రితంగాని అయిన అజ్ఞానము దేహమూలము. అది జడం కనుక అస్వతంత్రము. కనుక అజ్ఞానవంతుడు అయిన పురుషుడే దేహమూలము.

2. పరమాత్మయే మాయి అయిన ఈశ్వరుడుగా కర్ములకు కర్మ ఫలప్రదాత. పరమాత్మగా పరబ్రహ్మముగా నిర్విశేషమయిన యీ పరమానంద స్వరూపము జ్ఞానులయిన సన్న్యాసులకు ప్రాప్యము. కనుక జీవేశ్వర బ్రహ్మాభేదము సిద్ధాంతీకరింపబడినది.

3. ప్రశ్న – "జ్ఞానానందమయః" – ఇచ్చట; "మయ" అనుదానికి ప్రచురమయిన అని అర్థము. జ్ఞానానందము లెక్కువగాగల – అని అర్థము వచ్చును. "విజ్ఞానమానందంబ్రహ్మ" అన్నచోటగూడా "ఆనందం" వద్ద "ఆనందముగల" అని అర్థము చెప్పవచ్చును. అర్శ – ఆది గణం ప్రకారం వచ్చే 'అచ్' ప్రత్యయం కలిపితే "ఆనంద+అ" = ఆనంద అని నిర్వచించాలి. ఎందుకంటే "బ్రహ్మణ ఆనందః" అని మరొక శ్రుతి 'బ్రహ్మ యొక్క ఆనందము" అంటున్నది కదా! ఆనందం బ్రహ్మ గుణం అనాలి. స్వరూపం అంటే బ్రహ్మం ఆనందం కనుక భోగ్యం అవుతుంది. అచేతనం, క్షణికం అవుతుంది. ఆనందము జీవభోగ్యము కదా! అది దేనినీ భాసింపజేయదు. విషయసంయోగం (స్త్రీ స్రక్చందనాదులు) వలన పుట్టుంది చస్తుంది గదా! – ఇది ద్వైతుల పూర్వపక్షము.

4. సమా – వృత్తిజ్ఞానంకన్న భిన్నమయిన నిత్యజ్ఞానమున్నది. అలాగే విషయానందానికి భిన్నమయిన నిత్యానందమున్నది. అదే సుషుప్తిలో అందరికీ, సమాధిలో యోగులకు లభిస్తుంది. ఆ ఆనందం స్వయంప్రకాశం. నిరుపాధికం. నిత్యం. జ్ఞాన స్వరూపము. చైతన్యమే ఆనందం జ్ఞానం.

5. విజ్ఞానం ఆనందం ఒక్కటే అంటే "విజ్ఞానమానందం బ్రహ్మ" అన్న వాక్యంలో పునరుక్తి దోషమున్నదా? – లేదు. వృత్తిజ్ఞానం ఆనందం కాదు. వృత్త్యానందం జ్ఞానము కాదు కనుక విజ్ఞానమూ ఆనందమూ రెండూ అయినది అలౌకికమయిన చిదానందరూపమయిన బ్రహ్మమే. అందుకు రెండూ చెప్పవలసివచ్చినది. లోకంలో అయితే ఇవి రెండూ అంతః కరణవృత్తులే అయినా అనుభవంలో వాటి ఆకారం భిన్నం. **జ్ఞానం విషయాకారంగా పరిణతమయిన వృత్తి చైతన్యం. ఆనందం సుఖాకారంగా పరిణతమయిన వృత్తి చైతన్యం.** అలా అయితే అన్ని చైతన్యమే కనుక లౌకిక సుఖంగూడా జ్ఞానమవుతుంది గదా! అంటే మా కిష్టమే.

6. లేదా, "ఘటాకార వృత్తిలో ప్రతిఫలించిన చైతన్యం ఘటజ్ఞానం" అన్నట్లు సుఖాకార వృత్తిలో ప్రతిఫలించిన చైతన్యం సుఖజ్ఞానము. "సుఖం" అనేది సత్త్వగుణ పరిణామము. అంతః కరణం రజోగుణం వలన రాగం గాను, తమోగుణం వలన మోహం గాను పరిణమించినట్లు సత్త్వగుణం వలన సుఖంగా పరిణమిస్తుంది.

7. లేదా, నిద్రా విక్షేపములు రెండూ లేనపుడు అంతఃకరణము అంతర్ముఖం అవుతుంది. ఆ దశలో అంతఃకరణంలో ప్రతిబింబించిన చైతన్యం సుఖము "అంతర్ముఖమనోవృత్తావానందః ప్రతిబింబతి" అని.

8. కనుక బ్రహ్మం ఆనందమే "ఆనందవత్" కాదు. "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్"

అని మరొక శ్రుతి చెప్పింది గదా! ఇక "బ్రహ్మణః ఆనందః" అన్నది మాటవరసకు అన్నమాట. "రాహోః శిరః" అన్నట్లు. రాహువే శిరస్సు కదా! బ్రహ్మమే ఆనందము. బ్రహ్మం 'ఆనందవత్' అయితే దానికి ఆనందం ఆంతరంగా ఉండనాలి. కాని బ్రహ్మమే సర్వాంతరము. దానిలోపల మరొకటి లేదు.

"యదయమాత్మా సర్వాంతరః" అని శ్రుతి. ఆనందం బ్రహ్మ ధర్మమయితే దానిని బ్రహ్మం తెలిసికొనలేదు. తన ధర్మం తనకే తెలియదు. అందుకు జ్ఞాత మరొకరు కావాలి. కన్ను తన రూపాన్ని గ్రహించదు గదా! అయితే జీవుడు గ్రహిస్తాడందామా? - అంటే కుదరదు. జీవుడే బ్రహ్మం కదా! భేదం ఉండి జీవుడు గ్రహించినా ఆ ఆనందమును గ్రహించలేని ఈశ్వరుడు సర్వజ్ఞుడు కాడు గదా! బ్రహ్మానందం గల జీవునికన్న అదిలేని బ్రహ్మం హీనుడవుతాడు.

9. ఆనందమే బ్రహ్మ అన్నపక్షంలో బ్రహ్మమునకు ఆనందానుభవం ఉంటే కర్త కర్మృస్వభావం ఒకరికే వచ్చినట్లు గదా! అదితప్పు గదా! - ఆనందం స్వయంప్రకాశం కనుక ఆనందమే అనుభవము. కనుక దానికి మరో అనుభవం అవసరం లేదు. ఉందంటే దానికి మరో అనుభవం దానికి మరల మరో అనుభవం - అని అనవస్థ. **కనుక "విజ్ఞానం బ్రహ్మ" అంటే అది లౌకికం కావచ్చునని 'ఆనందం' అని కలుపబడినది. "ఆనందం బ్రహ్మ' అని మాత్రమే అంటే లౌకిక సుఖం గూడా బ్రహ్మం అవుతుంది. అందుకని "విజ్ఞాన మానందం బ్రహ్మ" అనబడినది.**

**శ్లో॥ వా గ్బ్రహ్మాయతనం తదస్య కరణం వాక్తు ప్రతిష్ఠా నభః**
**ప్రజ్ఞేత్యేనదుపాసతేఽఖిలమపి ప్రజ్ఞాయతేఽనేన యత్ ।**
**నైవ స్యాత్కిమపి క్షితావవదతో విద్వాన్ య ఏనద్భజే-**
**దేనం వాఙ్న జహాతి సర్వమవతి ప్రాప్నోతి దైవం పదమ్ ॥ 156**

భావ॥ ''విజ్ఞానమానందం బ్రహ్మ'' - ఈ బ్రహ్మమును పొందుటకు మరొక ఉపాయముంది.

వాక్కు బ్రహ్మం. దీనికి కరణమయిన వాక్కు ఆయతనం. దీనికి ఆకాశము ప్రతిష్ఠ. కాలత్రయమునందు అదే ఆధారం (శబ్దగుణకం ఆకాశం) దీనిని ప్రజ్ఞ అని ఉపాసించెదరు. ఎందుకంటే దీనివలననే అంతా తెలియబడుతుంది గదా! వాక్కులేనివానికి ప్రపంచమున ఏదియు లేదు గదా! ఐహికం ఆముష్మికం ఏవియు ఉండవు - ఇట్లు వాక్కునుపాసించువానిని వాక్కు ఎన్నటికి విడువదు. వాక్కు సమస్త ప్రాణులను రక్షించును. అది వానికి దైవత్వము నిచ్చును. (వాక్కు = వాగభిమానిదేవత బ్రహ్మం - అన్ని ఇలాగే) 156

**శ్లో॥ ప్రాణో బ్రహ్మ శరీరమస్య బృహతః ప్రాణః ప్రతిష్ఠా నభ-**
**స్సేవేత ప్రియమిత్యదోఽస్య కురుతే స్థిత్యా అకృత్యాని యత్ ।**

**అప్రాణస్య భవేన్ను కిం భజతి యో విద్వానితీదం న తం**
**ప్రాణః క్వాపి జహాతి సర్వమవతి ప్రాప్నోతి దైవం పదమ్ ॥ 157**

భావ॥ ప్రాణమే బ్రహ్మ. ఈ ప్రాణబ్రహ్మకు శరీరము కరణరూప ప్రాణమే. దీనికి ప్రతిష్ఠ ఆకాశము. ఈ బ్రహ్మమును "ప్రియ" అని సేవింపవలెను. ఎందుకంటే ఈ ప్రాణములు నిలుచుటకై మనం అనేక – అకార్యములయినను సిద్ధపడెదము. ప్రాణరహితునకు ఏమియు జరుగదు. ఇది ఎఱిగి ప్రాణబ్రహ్మమునుపాసించువానిని ప్రాణములు విడువవు. (అకాల మరణం ఉండదు) సమస్తమును ప్రాణము రక్షించును. దైవత్వము నిచ్చును. (ప్రాణాభిమాని దేవత బ్రహ్మం). 157

**శ్లో॥ చక్షుర్బ్రహ్మ హి చక్షురాయతనమస్యాభ్రం ప్రతిష్ఠా భజే–**
**దేనత్సత్యమితి ప్రమాణమవనౌ యచ్చక్షుషా వీక్షితమ్ ।**
**నైవాపశ్యత ఏతదస్తి న పరం సేవేత విద్వానిదం**
**యస్తం నైవ జహాతి చక్షురవతి ప్రాణ్యేతి దైవం పదమ్ ॥ 158**

భావ॥ నేత్రమే బ్రహ్మం. ఈ బ్రహ్మకు కరణమయిన నేత్రమే ఆయతనము. ప్రతిష్ఠ ఆకాశము. ఇది సత్యమయినదని దీనిని సేవింపవలయును. ఎందుకంటే కంటికి కనబడినదే ప్రమాణము కదా! కన్నులేనివానికి ఈ ప్రపంచమున ఏదియు లేదు. ఐహికం లేదు. ఆముష్మికమూ లేదు. ఇట్లు గ్రహించి సేవించుజ్ఞానిని నేత్రము విడువదు. ప్రాణులందరు అతనిని రక్షించెదరు. అతనికి దైవత్వము కలుగును. (నేత్రాభిమాని దేవత బ్రహ్మం) 158

**శ్లో॥ శ్రోత్రం బ్రహ్మ శరీరమస్య కరణం శ్రోత్రం ప్రతిష్ఠా నభ–**
**స్సేవేతైనదనన్తమిత్యయతి యన్నాన్తం దిశాం పూరుషః ।**
**అశ్రోత్రస్య భవేన్ను కిం కుశలధీర్యస్సేవతేఽదో న తం**
**శ్రోత్రం క్వాపి జహాతి సర్వమవతి ప్రాప్నోతి దైవం పదమ్ ॥ 159**

భావ॥ శ్రోత్రాభిమాని దేవత బ్రహ్మం. దీనికి కరణమయిన కర్ణము శరీరము. ఆకాశము ఆధారం, దీనిని "అనంతం" అని సేవింపవలెను. ఎందుకంటే పురుషునకు దిగంతములు దొరకవు కదా! (చెవి = దిక్కు) చెవులు లేని వానికి ఏమి జరుగును? ఇట్లు నిపుణముగా భావించి సేవించువానిని ఆ శ్రోత్రము విడువదు. సమస్తములను రక్షించును. దైవత్వము లభించును. 159

**శ్లో॥ హృ ద్బ్రహ్మాయతనం హృదస్య భవతి వ్యోమ ప్రతిష్ఠా బుధోఽ**
**యేదానన్ద ఇతీదమిచ్ఛతి సుతోఽనేన స్త్రియాం యత్సుతమ్ ।**
**కిం స్యాద్వాఽమనసో య ఏనదయతే విద్వాన్మనస్తం బుధం**
**నైవ క్వాపి జహాతి సర్వమవతి ప్రాప్నోతి దైవం పదమ్ ॥ 160**

భావ॥ హృదయాభిమానిదేవతయే బ్రహ్మ. దానికి కరణమయిన హృదయం (మనస్సు) ఆయతనం. ఆకాశము దీనికి ప్రతిష్ఠ. దీనిని జ్ఞాని 'ఆనందం' అని ఉపాసింపవలయును. ఇట్లు పూజించినవాడు స్త్రీ (కోరబడిన) యందు పుత్రుని పొందును. మనస్సు లేనివానికి ఏమియు లభింపదు - ఇట్లు మనస్సునుపాసించువానికి మనస్సు ఎన్నటికీ వీడదు. సమస్తము అతనిని రక్షించును. దైవత్వము లభించును. 160

**శ్లో॥ బ్రహ్మేదం హృదయం తదస్య హృదయం స్థానం ప్రతిష్ఠా నభ-**
**స్సేవేత స్థితిరి త్యదో హృదయగం సర్వం య దేత జ్జగత్ ।**
**కిం స్యాద్వాఽహృదయస్య యః కుశలధీరేనద్భజేత క్వచి-**
**త్తం నేదం హృదయం జహాత్యవతి చ ప్రాణ్యేతి దైవం పదమ్ ॥161**

భావ॥ బుద్ధి - అభిమాని దేవతయే బ్రహ్మం. దీనికి కరణమయిన బుద్ధియే స్థానము. ఆధారం ఆకాశము. దీనిని "స్థితి" అని సేవింపవలయును. ఎందుకంటే ఈ ప్రపంచమంతయు హృదయగతము గదా! హృదయరహితునకు ఏమియు లాభము లేదు. ఇట్లు హృదయబ్రహ్మోపాసన చేయు వానిని బుద్ధి ఎన్నటికీ విడువదు. ప్రాణులందరు ఇతనిని రక్షించెదరు. దైవత్వము లభించును. 161

**శ్లో॥ ఇన్ధో నామ పుమాన్విభాతి నయనే సవ్యే తమిన్ద్రం విదుః**
**ప్రత్యక్షద్విష ఏవ హన్త విదితా దేవాః పరోక్షప్రియాః ।**
**పత్నీ తస్య విరాడితి ప్రవిదితా వామాక్షిపుంరూపిణీ**
**సంస్తావస్తు తయోర్హృదభ్రమనయోరన్నన్తు హృల్లోహితమ్ ॥ 162**

భావ॥ "ఇంధుడు" అని ఒక పురుషుడు మన సవ్య (కుడి) నేత్రమున కనబడును. అతనినే 'ఇంద్రుడు' అని పిలచెదరు. దేవతలు ప్రత్యక్ష పరిచయమును ఇష్టపడరు. దేవతలు పరోక్షప్రియులు కదా! ఆయన భార్య 'విరాట్'. ఆమె ఎడమకంటిలో పురుషునిగా (జీవునిగా) కనబడును. వారి సంస్తావము (స్థానం) హృదయాకాశము. వీరి అన్నము హృదయమునందలి లోహిత పిండము. 162

విశే॥ 1. బ్రహ్మజ్ఞాన సాధనాలుగా స్థూలారుంధతీ న్యాయంతో వాగ్బ్రహ్మ మొదలగు బ్రహ్మల ఉపాసనలు చెప్పబడినవి. వీటివలన చిత్తశుద్ధి ఉపాసనాశక్తి కలుగుతుంది. స్త్రీయందు 'అగ్ని' అను భావన చేసినట్లు వాక్కు మొదలగువానియందు బ్రహ్మబుద్ధి చెప్పబడినది. స్త్రీరూపమయిన గౌణాగ్నికన్న భిన్నంగా ఆహవనీయాది ముఖ్యాగ్నులు ఉన్నట్లు - వాగాది గౌణ బ్రహ్మములకన్న భిన్నంగా "ముఖ్య బ్రహ్మ" ఉన్నదని తెలిసికొనటం సులభమవుతుంది. ఆవరసలో జాగరాదులలో తెలియదగిన జ్ఞేయబ్రహ్మ విషయం ఇందులో చెప్పబడినది.

2. ఇంధః = దీప్తిమంతుడు. దీనినే పరోక్షంగా చెప్పటానికి శబ్దరూపం కొద్దిగా మార్చి 'ఇంద్రః' అన్నారట.

3. పురుషునికి పురుషుడు పత్ని ఎలా? – పురుషుడనగా జీవుడు. శరీరం వేరు. కనుక ఇహలోకమునందయినా స్త్రీ శరీర పురుషుడే భార్యగదా!

4. పురుషుడంటే జీవుడని ఇంతకుముందు తెలిసినది. మరల వామనేత్ర పురుషుడెవరు? ఒకే శరీరంలో ఇద్దఱు జీవులు ఎలా? – సమా – ఇది ఉపాసనకోసం కల్పన. కల్పనలో అనుపపత్తి ఏల? వామభాగం భార్య అని అర్ధాంగి అని కల్పన వంటిది. ఒకే జీవునిలో దక్షిణ నేత్ర పురుషుడు పత్ని అని కల్పన. ఇందులో దక్షిణ భాగం వామభాగం కన్న సమర్థమయినది కనుక భర్తగాను, అబలమయిన వామభాగమును భార్యగానూ కల్పన. అన్నం భోగ్యం. విరాట్టు భోగ్యం. స్త్రీ భోగ్యం. కనుక స్త్రీని "విరాట్టు" అన్నారు. కనుక భోక్త ఇంద్రుడు. భోగ్యం విరాట్టు = ఇంద్రాణి. కాగా "అత్త – అన్నం" అని జంట ఏర్పడినది. ఈ మిథునం జాగరంలో విశ్వం సత్యంలో తైజసం.

5. సంస్తావః = కలిసి అన్యోన్యం ఉండే చోటు సంస్తావము. హృదయంలో లోహితమయిన పిండ భాగము హృల్లోహితం.

6. తినిన అన్నము రెండురకాలుగా మారును.

1. స్థూలం – ఇది క్రిందకు చేరును. 2. సూక్ష్మం – ఇది జఠరాగ్నిపక్వమై మరల రెండు రకములుగా మారును.

1. మధ్యమం. ఇది లోహితం (రక్తం) మొదలగు క్రమంతో శరీరమునకు చేరును.

2. సూక్ష్మతమం – ఈ భాగము లోహిత పిండము. అది తైజసునకు అన్నమగును. ఇది సూక్ష్మనాడులయందు ప్రవేశించును. ఇది స్థితిహేతువు. ఇది లేదంటే లింగశరీరం ఉండదు. ఇది తైజసునకు విశ్వునకున్ను ఆహారము. విశ్వుడయినా లింగశరీరమే కదా! స్థూలశరీరం ఉపాధిగా ఉన్నది. అంతే గదా!

7. "యోణిష్ఠం తన్మనః' అని శ్రుతి. ఈ సూక్ష్మతమ – అన్నము మనస్సుకే భోగ్యము. అయినా మనస్సుతో అధ్యాస వలన జీవున కన్నమని చెప్పబడినది.

8. జాగరణంలో వామదక్షిణ నేత్ర – ఉపాధి భేదం వలన ఇంద్రాణీ – ఇంద్రులు అను విభజన కుదిరింది. స్వప్నంలో జీవుడు హృదయగతుడు గదా! అందువలన ఇచ్చట బుద్ధి పత్ని. జీవుడు కర్మ. హృదయ స్థానం. అయితే పురుషుడు కర్మ. బుద్ధి భార్య అని నేరుగా చెప్పకుండా ఈ వంకర దారి ఎందుకు? – సమా –

బుద్ధిలో ప్రతిబింబించిన చిదాభాసుడు పతి. సాభాస బుద్ధి పత్ని. బుద్ధిలేని ఆభాస,

అభాస లేని బుద్ధి కుదరవు. కనుక బుద్ధి ఆభాస అను జంట ఉన్నట్లే. ఈద్వయము పురుషరూపమే. ఇందులో వామాక్షిలో సాభాస బుద్ధి. దక్షిణాక్షిలో బుద్ధిగత చిదాభాసుడు.

ఈ బుద్ధి పురుషునిచే భాసించునది కనుక భోగ్యము. పురుషుడు భోక్త. వీరిద్దరికి పైన చెప్పిన సూక్ష్మతమ - ఆహార రూపమయిన లోహిత పిండము భోగ్యము.

**శ్లో॥ ఏతత్ప్రావరణం తయోస్తు తదిదం యజ్జాలకాభం హృది**
**ప్రాప్తా యా హృదయాచ్ఛిరః సృతిరియం నాడీ సుషుమ్నా తయోః ।**
**ఏతచ్చాస్రవదాస్రవత్యపి హితాఖ్యాభిస్సిరాభిస్తతో**
**భిన్నాహార ఇవైష భిన్న ఇవ భాత్యస్మాచ్ఛరీరాత్మనః ॥ 163**

భావ॥ నాడీ సహస్రంలో కలిసిన వలవంటి యీ వస్తువు ఆ ఇంద్రాణీ - ఇంద్రులకు ఆచ్ఛాదన వస్త్రమగును. తిన్నవారికి నిద్రించినవారికి మీద ఉత్తరీయం ఉండటం ఆచారం కదా! హృదయమునుండి శిరస్సుదాకా ప్రాకిన సుషుమ్నా నాడి వారిద్దరికి నడక దారి. స్వప్నమునుండి జాగరములోనికి చేరే దారి అదే. హితా మొదలయిన నాడుల ద్వారా అన్నం ప్రసరించుచు వారిని చేరును. కనుక ఈ లింగ శరీరుడయిన పురుషుడు (మిథున రూపుడు) ప్రత్యేక (సూక్ష్మతమ) ఆహారము గలవారు. శరీరోపకారకమయిన అన్నము మధ్యమము. ఇది సూక్ష్మము (సూక్ష్మతమము) కనుకనే స్థూలశరీరము కన్న ఈ లింగ శరీరం భిన్నంగానే కనబడుతున్నది. 163

విశే॥ ఈ శ్లోకంలో ఇవ = ఏవ. నిపాతలు అనేకార్థకములు.

**శ్లో॥ ప్రాచీ ప్రాగసవోఽస్య దక్షిణదిశా ప్రాణాస్తథా దక్షిణే**
**ప్రత్యఞ్చస్తు పరాగ్దిశోత్తరదిశోదఞ్చోదిగూర్ధ్వోర్ధ్వగాః ।**
**సావాచీ దిగవాఞ్చ ఏవ సకలాః ప్రాణాస్సమస్తా దిశః**
**స్వాత్మత్వేన బుధః ప్రయాతి తమితి ప్రాణం సమస్తాత్మకమ్ ॥ 164**

భావ॥ లింగశరీరుడు ప్రాణస్వరూపుడగును. స్వప్నావస్థనుంచి సుషుప్తిలోనికి చేరిన ప్రాజ్ఞుడైన ప్రాణరూపపురుషునికి తూర్పుదిక్కు. తూర్పుననున్న ప్రాణములు. అట్లే దక్షిణ దిక్కు దక్షిణ ప్రాణములు. పశ్చిమదిక్కు పశ్చిమ ప్రాణములు. ఉత్తర దిక్కు ఉత్తరప్రాణములు. ఊర్ధ్వదిక్కు ఊర్ధ్వప్రాణములు. అధార దిక్కు అధార (క్రింది) ప్రాణము. కనుక సమస్త దిక్కులు సమస్త ప్రాణాలు. ఈ సమస్త రూపమయిన ప్రాణమును జ్ఞాని తన ఆత్మగా పొందును. 164

విశే॥ 1. జాగరణంలోని స్థూలాత్మను స్వప్నంలో తైజసాత్మలో (లింగం), దానిని సుషుప్తిలో ప్రాణాత్మ అయిన ప్రాజ్ఞునిలోను కలుపును. అనగా నేను స్థూల శరీరమును కాను - స్వప్నంలో

లేదు కనుక. నేను లింగశరీరమును కాను. అది స్వప్నములో లేదు గనుక. నేను సూక్ష్మాత్మను అనగా ప్రాణాత్మను.

2. ప్రాజ్ఞునకు అజ్ఞానము కారణ శరీరము. అదే సూక్ష్మమయిన ఉపాధి. ప్రాణములు ఉపాధి కాదు. అయినా ఇచ్చట ప్రాణాత్మ, ప్రాణములు ఉపాధి అనటానికి కారణము. లింగశరీరం కారణ శరీరంలో లయం పొందినా ప్రాణము మాత్రము స్వప్న జాగర సుషుప్తులలో ఎపుడును లయం కాదు. కనుక ఆ కారణ శరీరము ప్రాణసహితము కనుక ప్రాణాత్మ ప్రాజ్ఞుడు అని చెప్పబడెను.

**శ్లో॥ సూక్ష్మప్రాణమయస్స ఏష పురుషో బ్రహ్మైవ సర్వాన్తరం**
**వేదాన్తా ఇతి నేతి నేత్యుపదిశన్త్యేనం పుమాంసం పరమ్ ।**
**అగ్రాహ్యోఽయమసఙ్గ ఏనమయతే యశ్చాద్వయం సోఽభయం**
**ప్రాప్నోత్యత్ర న సంశయో భవతి యత్పుంసో ద్వితీయాద్భయమ్ ॥165**

భావ॥ సూక్ష్మప్రాణమయుడు, సూక్ష్మశరీరాభిమాని ప్రాణమయుడు అయిన ఈ ప్రాజ్ఞపురుషుడు సర్వాంతరవర్తి అయిన బ్రహ్మమే. వేదాంతములు బ్రహ్మేతరమయినదంతా "న, న" అని నిషేధించుచు చివరకు నిషేధించకుండా మౌనము దాల్చినది, ఈ పరమ పురుషుని వద్దనే. ఇతడు ఇంద్రియాదులకు అగ్రాహ్యుడు. అసంగుడు. అద్వితీయుడయిన ఈ పరమాత్మను పొందినవాడు అభయమును పొందును. సందేహము లేదు. ఎందుకంటే; రెండవ పురుషుడుంటేనే గదా భయము? (పురుషుడు = జీవుడు) 165

విశే॥ 1. ఆ పురుషుడు ప్రత్యగాత్మయే అయిన బ్రహ్మమే. ప్రత్యగాత్మయే కారణ శరీరంలో ప్రతిబింబించి ప్రాజ్ఞుడయినాడు. వస్తుతః ప్రత్యగాత్మ నిరుపాధికమయిన బ్రహ్మాభిన్నమయిన ప్రత్యగాత్మయే. అని జ్ఞాని గ్రహింపవలయును.

2. ఈయన అగ్రాహ్యుడు కనుకనే "న, న" అని ఈయనకన్న భిన్నమయిన వానిని నిర్దేశించి నిషేధించటం ద్వారా చెప్పవలసి వచ్చినది. లేదంటే అయం అశ్వః అన్నట్లు "ఇదం బ్రహ్మ" అని నేరుగా చూపగలము.

అసంగుడు కనుకనే అగ్రాహ్యుడు. కరణం తనతో కలిసిన దానినే తెలుపుతుంది. ఈయనకు కరణాదికంతో సంగం లేదు గదా! ప్రత్యగాత్మను చేరినవాడు అద్వితీయుడవుతాడు గదా! బ్రహ్మం ప్రత్యగాత్మ ఒక్కటే గదా! " స ఆత్మా తత్త్వమసి" కదా! బ్రహ్మమే బుద్ధిలో లభ్యమయి ప్రత్యగాత్మ అనిపించికొంటుంది.

**శ్లో॥ కింజ్యోతిః పురుషోఽయమార్య! తరణిజ్యోతిర్గతేఽస్తం రవౌ**
**కింజ్యోతిర్నను సోమ్య! శీతకిరణజ్యోతిశ్చ చన్ద్రే గతే ।**

**కింజ్యోతిర్భగవన్ను సౌమ్యదహనజ్యోతిశ్చ శాన్తేఽనలే**
**కింజ్యోతిః పురుషో భవత్యయమరే వాగ్జ్యోతిరిత్యుచ్యతే ॥ 166**

భావ॥ ఇది గురుశిష్య సంవాద రూపము "విజ్ఞానమానందం బ్రహ్మ". ఇచ్చట ఆత్మ జ్ఞానస్వరూపం అన్న విషయము చెప్పబడుచున్నది.

పురుషునకు పగలు జ్యోతి సూర్యుడు (పురుషుడనగా స్థూలదేహాభిమాని). రాత్రి జ్యోతి చంద్రుడు. చంద్రుడున్ను లేనపుడు అగ్ని జ్యోతి. అగ్నిలేనపుడు (అనగా దీపం) వాక్కే జ్యోతి. 166

విశే॥ 1. వస్తు విషయాది జ్ఞానం కలిగించే పదార్థము జ్యోతి. ఇది సంఘాత (శరీర) భిన్నము. చంద్ర – అభావం ఉదయాత్పూర్వం అన్నారు అస్తమయాత్పరం, అమావాస్య.

2. సూర్య చంద్ర దీపములు లేని సందర్భమున వాక్కు అనగా శబ్దం చప్పుడు అరుపులు, ఇది కుక్క, అది చెట్టు మొదలయిన మాటలు జ్యోతి.

ఈ జ్యోతులన్నియు శరీరాత్ భిన్నములే.

**శ్లో॥ సూర్యాచన్ద్రమసోస్తథాఽస్తమితయోశ్శాన్తేఽనలే వాచి వా**
**శాన్తాయాం పురుషో భవత్యయమహో కింజ్యోతిరాఖ్యాహి మే ।**
**ఆత్మజ్యోతిరసౌ తదా భవతి యత్సోఽమ్యాత్మనా జ్యోతిషా**
**చాన్తే పర్యయతే చ కర్మ కురుతే సోఽయం విపర్యేతి చ ॥ 167**

భావ॥ సూర్యచంద్రులు అస్తమించారు. అగ్ని ఆరిపోయింది (దీపం) వాక్కు శమించింది. అట్టి స్థితిలో (సుషుప్తి వంటి) పురుషునకు ఏది జ్యోతి? అని శిష్యుని ప్రశ్న. సమా – సోమ్య! అపుడు పురుషునకు "ఆత్మ" యే జ్యోతి. దానిలోనే అన్నీ చేస్తాడు. కూర్చొనును. వ్యవహరించును. నడచును. పనులు చేయును. తిరిగి వచ్చును. కనుక పురుషునకు సర్వవ్యవహార జ్యోతి ఆత్మయే. 167

విశే॥ 1. ఆసన గమనాగమనాది వ్యవహారములకు హేతువయిన "జ్యోతి". జ్యోతి ఉంటేనే వ్యవహారం లేదంటే వ్యవహారం లేదు. అది అనుభవం మరియు జ్యోతి తనకంటె భిన్నమయినది. పురుషునికన్న సూర్యజ్యోతి భిన్నంగా ఉన్నది కదా! కనుక శరీరపురుషుడు జ్యోతి కాడు. తప్పక శరీరభిన్నంగానే జ్యోతి ఉండాలి. అది ఆదిత్యుడు కాదు. ఆదిత్యుడు లేకున్న ఇతర జ్యోతులలతో వ్యవహారం జరుగుతున్నది గదా! ఆదిత్యుడుండగానయినను వ్యవహారం తప్పక జరగాలన్న నియమం కుదరదు. నిద్రపోయేవానికి (గ్రుడ్డివానికి) వ్యవహారం లేదు గదా! చంద్రాగ్నుల విషయమయినా ఇంతే. (నిద్రలో వ్యవహారానికి అసలు వీరెవరూ ఉండరు గదా!) కాగా మిగిలిన జ్యోతి "ఆత్మయే" ("స్వయంజ్యోతిః పురుషః") ఇది ఉంటేనే అన్ని వ్యవహారాలు. ఇది లేకపోతే ఏ వ్యవహారములు లేవు. ఇది శరీరంలో ఆంతరంగా ఉన్నా

శరీరంకన్నా భిన్నం అనే అనాలి. బాహ్యమయిన జ్యోతులు అలాగే ఉన్నాయి కదా! (మనకన్న వత్తి కన్నా భిన్నంగా జ్యోతి దీపంగా వెలుగును.)

2. నేత్రం వలన దర్శనం మొదలయిన వ్యవహారమంత జరుగుతున్నది. అది శరీరంలోని భాగము కనుక "జ్యోతి" శరీరాత్ భిన్నం కాదనవచ్చును గదా! – సమా – నేత్రం వలన ఆసన స్పర్శనాదులు జరుగవు. అంధునకు అవన్నియు జరుగుతాయి గదా! దర్శనం తప్ప. దశేంద్రియాలు దశ జ్యోతిస్సులని చెప్పినా కుదరదు. స్వప్నంలో ఇంద్రియలయదశలో అన్ని వ్యవహారాలు జరుగుతున్నాయి కదా! అయితే సంఘాతంలోనే భాగమయిన "అంతఃకరణం" 'జ్యోతి' అందాము – కుదరదు. – కేవలాంతఃకరణము వ్యవహార హేతువు కాదు. స్వప్నంలో అంతఃకరణం ప్రతిబద్ధమయి ఉంటుంది. ప్రాణం జడం కనుక అదీ జ్యోతి కాదు. ప్రాణాలున్నా సుషుప్తిలో వ్యవహారం లేదు కనుక అనాత్మ రూపమయిన సంఘాతం కన్న భిన్నమయిన ఆత్మయే జ్యోతి. జ్యోతికి మరో జ్యోతి ఉండదు. ఉంటుందంటే దానికి మరో జ్యోతి అలా. కనుక సర్వభాసకమయిన జ్యోతి ఒక్కటి ఉంటుంది. అది సూర్యచంద్రాగ్నులు కాదు. వీనిని గూడా కనబఱచేది మనోనేత్రం. వేదాది రూపమయిన శబ్దం కాదు. దానిని మన 'చెవి' భాసింపచేస్తుంది. నేత్ర శ్రోత్రములుగూడా తమను తాము భాసింపజేసికొనవు. (చెవి అంటే ఇంద్రియం అది కనబడదు.) వీటిని మనస్సు భాసింపజేస్తుంది. సుఖాదులుగల అంతఃకరణమున్నదని ఆత్మ భాసింపజేస్తుంది.

3. కనుక ఈ ఆత్మయే సర్వావభాసకం "తస్య భాసా సర్వమిదం విభాతి". ఇది శరీరాత్ భిన్నమే. ఇది 'జ్యోతి' కానేరదు. జడము. ఈ కరణాలు అంతఃకరణం జ్యోతి కాదు. అవీ జడములే. కానీ జడులు కొందరు వాటిని జ్యోతి అనుకొంటారు. కనుక పురుషునకు సర్వవ్యవహారములకు ఆశ్రయమయినది "ఆత్మయే"

**శ్లో॥ ఆత్మాఽసౌ కతమస్స యో హృది పుమానన్తః ప్రభః ప్రాణగో**
**విజ్ఞానాత్మక ఏష సఞ్చరతి నా లోకౌ సమానో ధియా ।**
**చిత్తే ధ్యాయతి చిన్తయన్నివ చలత్యస్మింశ్చలన్వా విభా–**
**త్యేష స్వప్నముపేత్య లోకమిమమత్యేత్యేవ మృత్యోః పదమ్ ॥ 168**

భావ॥ "ఆత్మ యే జ్యోతి" అని గురువు చెప్పాడు. ఎవరీ ఆత్మ. నేత్రాదులలో ఒకడా? సూర్యాదులలో ఒకడా? అంతకన్న భిన్నమయిన మరొకడా? ఆయన స్వరూపం ఏమి? భ్రాంతి పూర్వకమయిన ప్రశ్న ఇది. నేత్రాది భిన్నమే ఆత్మ అని చెప్పబడినదే గదా!

సమా – హృదయమునందు అంతఃజ్యోతిగానున్నవాడు జ్ఞానస్వరూపుడు, ప్రాణముల యందున్నవాడు, (వృక్షములమధ్యన రాయిలాగా వాటికన్న భిన్నంగా వాటి మధ్య ఉండటం) "బుద్ధి – ఉపాధి"గా నున్నవాడు – అతడు ఆత్మ. ఈ పురుషుడు బుద్ధితో సమానుడై అనగా

బుద్ధి తాదాత్మ్య – అధ్యాస పొందినవాడు. ఇతడే ఈ ఐహికాముష్మికలోకములందు సంచరించును. దానికి నిదర్శనం ఏమంటే, మనస్సు అలోచిస్తే తాను ఆలోచిస్తున్నట్లు, శరీరం కదలితే తాను కదలినట్లు కనబడతాడు. స్వప్నమునందు బుద్ధి విశ్రమిస్తే తాను విశ్రమించినట్లు భావిస్తాడు. మృత్యు రూపమయిన కర్మలకు అవిద్యకు స్థానమయిన ఈ లోకమును అనగా శరీరమును స్వప్నంలో అతిక్రమించును. ఈ శరీరం (సంఘాతం)తో తాదాత్మ్యమును వదలును. ఇదంతా స్వప్నంలో సంగతి. 168

విశే॥ 1. విజ్ఞానమయమయిన ఆత్మయే స్వయంజ్యోతి. అయితే జాగరణంలో నేత్రసూర్యాది సాధనాలవలన ఆత్మ యొక్క వెలుగు స్పష్టంగా తెలియదు. అందువలన ఇవి ఏవీ లేని స్వప్నంలో అయితే ఆత్మ వెలుగు తెలుస్తుంది.

2. ఘటమును వెలిగించే వెలుగు ఘటాకారం అవుతుంది. అలాగే బుద్ధిని వెలిగించే ఆత్మ ప్రకాశం బుద్ధ్యాకారం అవుతుంది.

3. స్వతః సర్వవ్యాప్తమయిన ఆత్మకు గమనము లేదు. కాని బుద్ధితాదాత్మ్యం వలన బుద్ధి వెళ్లినచోటికి బుద్ధితోబాటు ఆత్మ వెళ్లినట్లనిపిస్తుంది. ఘటం వెళ్లినచోటికల్ల ఘటాకాశం వెళ్లినట్లు అనిపిస్తుంది.

**శ్లో॥ సో౽యం వా పురుషశ్శరీరమభిసమ్పన్నో భవన్ పాప్మభిః**
**సంసృష్టో భవతి ప్రయంస్తు విజహాత్యేవాఖిలాన్ పాప్మనః ।**
**ద్వే స్థానే భవతో౽యమస్య చ పరో లోకస్తృతీయన్తయోః**
**సన్ధ్యం స్వప్నపదం వసన్నిహ పుమాన్ స్థానద్వయం పశ్యతి ॥ 169**

భావ॥ ఈ పురుషుడు శరీరమును పొందుతూ పాప సంబంధములయిన ధర్మా-ధర్మాశ్రయములయిన కార్య కరణములతో కలుస్తాడు. మరణించుచు ఈకార్యకరణములను ఇచ్చటనే (స్థూలరూపంలో) వదలి వెళ్లును. ఇతనికి రెండులోకములు. ఈ లోకము పరలోకము. మూడవది సంధిస్థానమయిన స్వప్నము. దీనినిలోకమనటం గౌణం. ఈ స్వప్నమునందు పురుషుడు లోకద్వయమును చూచును. 169

విశే॥ 1. కార్యకరణములను వదలటం వాటిపైన తనే అన్న అధ్యాసను వదలుతాడు. అంతేగాని నేరుగా వదలడు. స్థూలశరీరం పోతుందిగాని ఇంద్రియములు లింగశరీరంలో తోడుగానే ఉంటాయి. మోక్షసమయంలోనే కరణ పరిత్యాగరూప లింగనాశము. మరణకాలంలో ఇదంతా స్వప్నకాలంలో అయితే స్థూలశరీరం గూడా వదలము. (దాని అధ్యాస మాత్రమే పనిచేయదు) ఏదయినా అసంగమయిన పూర్ణత్వమునకు బుద్ధి ద్వారానే ఈ కార్యకరణ సంయోగ వియోగాలు. అంతేగాని స్వాభావికం కాదు.

2. గ్రామ సంధి గ్రామం కాదు. అలాగే ఇహపరలోకసంధి అయిన స్వప్నం స్థానము కాదు. అయినను దానిని తృతీయ స్థానం అనటం గౌణం.

**శ్లో॥ జీవోఽయం హి యదాక్రమః పరపదే స్వాక్రమ్య తజ్ఞాక్రమం**
**పాప్మానం వివిధం ప్రపశ్యతి తథాఽఽనన్దఞ్చ నానావిధమ్ ।**
**మాత్రామత్ర సమాకలయ్య పురుషో లోకస్య హత్వా తనుం**
**నిర్మాయ స్వరుచా రుచం కలయతే యత్తత్స్వయమ్భా అయమ్ ॥170**

భావ॥ స్వప్నంలో ఉన్న జీవుడు స్వప్నంలో ఇహ పరలోకమును ఎలా కనుగొనగలడు? సమా – జీవుడు జ్ఞాన కర్మలను ఆశ్రయించియే ఇహ పరలోకములను అనుభవించును. అదేవిధముగా స్వప్నమునందు జాగరణానుభవమును వాసనారూపముగా పొందును. అట్లు నూతనమయిన అనుభవములను పొందును. అవి అంతకుముందరి పూర్వజన్మ, పరలోక అనుభవములు. కనుక జీవుడు స్వప్నములో జ్ఞానకర్మఫలమయిన దుఃఖానందానుభవములను పొందును. ఈ స్వప్నలోకము యొక్క ఒక లేశమును స్వీకరించి పురుషుడు తన స్థూలశరీరమును మఱచి తన యీ ప్రకాశముతో అంతఃకరణ ప్రకాశమును కలిగించికొని ప్రకాశించును. అందువలన అతడు స్వయంజ్యోతి (స్వయంభాః). 170

విశే॥ 1. స్వప్నము వాసనామయము. అనుభవం వలన వచ్చిన సంస్కారము వాసన. జాగరణ వాసనలే స్వప్నానుభవములు. చాలవరకు ఇంతే. స్వప్నం అంటే స్మరణం. అందువలన నూతన విషయాలు స్వప్నంలో వస్తే అవి జన్మాంతరానుభవములు కావచ్చును. లింగశరీరములో దాగినవి. స్మరణంలాగా స్వప్నమున్నూ వాసనామయమే. అందువలన పరలోకంగూడా స్వప్నంలో కనబడినట్లే. కనుక ఇహ పరలోక వాసనలే స్వప్న ప్రపంచం. కనుక జీవుడు ఉభయలోకములను చూస్తాడని చెప్పబడినది. కనుక ఇహ పరలోకములలో జ్ఞానకర్మ విశేషములు మనవే వాస్తవఫలితములను, వాసనా మయ ఫలితమును జీవుడు అనుభవిస్తాడు. పరలోక ప్రదమయిన ప్రారబ్ధకర్మలు నశించినా వాటి వాసనలు మనలను అనుసరించి ఫలపర్యంతం ఉంటాయి. అని నిర్మూలంగా పోవాలంటే జ్ఞానం మాత్రమే కావాలి. అనుభవం వలన గూడా పూర్తిగా పోవు. కొంత శేషం (అనుశయం, ఆశయం) మిగిలి తరువాత జన్మనిస్తుంది. అతీతమయిన సుఖదుఃఖాల వాసనలు ఉన్నట్లు అతీత కర్మ గూడా వాసనారూపంగా ఉంటుందని అంగీకరించాలి. లేదంటే పరలోక కర్మమూ అనుభవ సమానమయిన యీ స్వప్నానుభవాలు నిష్కారణంగా వచ్చినట్లు (అకృతాగమం) అవుతుంది. కారణం లేకుండా కార్యం రాదు. వస్తుందంటే మోక్షంలో గూడా అజ్ఞానం పోయినా గూడా సంసారం వస్తుందనవచ్చును. కనుక స్వప్న దర్శన బలం వలన పరలోకమును ఊహించెదము.

2. అట్టి యీ స్వప్నంలోనే పురుషుడు "స్వయం జ్యోతి" అన్న నిర్ధారణ జరుగుతుంది. స్వప్నావస్థలో జీవుడు శరీరస్పృహవదలి మంచం మీద పడి మాయామయమయిన శరీరమును (తైజసం) పొంది ఆత్మజ్యోతివలన మాత్రారూపమయిన అంతఃకరణ ప్రకాశమును పొంది వెలుగును. కనుక "స్వయంభాః" "స్వయం జ్యోతిః". ఆదిత్యాది దేవతానుగ్రహం వలన పనిచేసే నేత్రాది సాధనములవసరం ఆయనకు లేదు. సర్వం అవభాసనం చేస్తూ తను గూడా వెలుగుతాడు.

3. జాగరణంలోనూ నిజానికి జరిగేదిదే. ఆయన స్వయంజ్యోతియే. అవికారుడే. ఏకరూపుడే. జ్ఞానస్వరూపుడే. అగ్ని ఎపుడూ ప్రకాశస్వరూపమే. కనుక ఆత్మ ఎపుడు జ్ఞాన స్వరూపమే. అది స్వయంప్రకాశమే. కాదంటే దానిని తెలుపటానికి మరోజ్ఞానం. దానికి మరోజ్ఞానం – అని అనవస్థ తగులుతుంది. క్షణిక విజ్ఞానంమాత్రం స్వయంజ్యోతి కాదు. అది ఆత్మ జ్ఞానం వలన వెలిగింపబడిన వృత్తి (వత్తి) వలన కలిగేది. కనుక పరిశేషన్యాయంతో ఆత్మ ఒక్కటే స్వయంజ్యోతి.

"స్వయంజ్యోతి – తనే వెలుగును. ఇతరమునంతటినీ వెలిగించేది". దీపాదులు ఇంచుమించు ఇట్టివి. కాని అవి గ్రుడ్డివానికి ఆత్మావభాసనం చేయలేవు. 'ఆత్మ' అందరికి తనను తాను తెలుపగలదు. లేదా, స్వయంగా భాసించటం స్వయంజ్యోతి లక్షణం. దీపం స్వయంగా భాసించదు. నేత్రసహాయం అవసరం. లేదా, సదావభాస్యం కాకుండా పరభాసకం అయ్యేదనవచ్చును. దీపం పరభాస్యం. ఆత్మ స్వయంభాః.

4. అయ్యా! జీవుడు 'ఆత్మజ్యోతివలన మాత్రారూపమయిన అంతఃకరణ ప్రకాశమును పొంది" అన్నారు. అనగా అర్థమేమి? సమా – బుద్ధి తప్ప జాగరణంలోని దేహేంద్రియ వ్యాపారములను నిద్ర ఆపుతుంది. మాయ ఒక విలక్షణమయిన శరీరము నిస్తుంది. ఆ శరీరాకారమయిన బుద్ధి వృత్తిని కలిగిస్తుంది. కాని వాని జాగరణసంస్కారాలనుబట్టి ఆ దేహం మీద "బ్రాహ్మణుడను, దరిద్రుడను" మొదలగు దేహాభిమానాలు కలుగుతాయి (కలలో). మాయయే స్వప్నంలో రథాది దృశ్యములను కల్పిస్తుంది. ఆ దృశ్యాల ఆకారంగా బుద్ధివృత్తి పరిణమిస్తుంది. ఆ వృత్తి చైతన్యంతో సర్వం ప్రత్యక్షమవుతుంది. అయితే ఇంతమాత్రం చేత స్వప్నంలో శరీరం సూర్యాది నేత్రాది సహాయములున్నాయి కనుక ఆత్మ స్వయంజ్యోతి కాదు – అని అనరాదు – ఎందుకంటే లోకదృష్ట్యా ఆదిత్యాదులు శరీరంలోపల లేవు గనుక స్వప్నంలో ఆత్మ స్వయంజ్యోతి అని నిశ్చయించవచ్చునని చెప్పాము.

5. లేదా, జీవుడే స్వప్నంలో స్వయంగా తనమీద తనే సూర్యాదులను అగ్న్యాదులను శరీరాన్ని మాయతో సృష్టించికొనును. భాసనం చేసికొనును. కనుక స్వయంజ్యోతి. జాగరణంలో అయితే బ్రహ్మసృష్టి కనుక ఆత్మ స్వయంజ్యోతి అని నిశ్చయించటం కుదరలేదు. మరియు జాగరణంలో జీవుడు సర్వభాసకుడు కాడు. అతడు అల్పజ్ఞుడు అల్పశక్తిమంతుడు. అతనిని

ఈశ్వరుడు అవభాసింపజేయును. స్వప్నంలో మాత్రం జీవుడే జగత్తును ఈశ్వరుని గూడా భాసింపజేయును. కనుక జీవుడు స్వప్నంలో స్వయంజ్యోతి. స్వప్నసృష్టి అంతా జీవునిదే కనుక ఆయనయే సర్వావభాసకుడు. సర్వజ్ఞుడు. తనకు నియంత అయిన ఈశ్వరుని గూడా ఆయనయే సృజించి కొంటాడు. (జాగరణంలోనూ ఈశ్వరుని కల్పించేది మనమే కదా!) – అదెలా అంటే తనను తినివేసే వ్యాఘ్రాదులను గూడా తనే కల్పించికొంటాడు. స్థిర ప్రపంచ కల్పనా శక్తిమంతుడయిన ఈశ్వరుడు క్షణిక స్వప్న ప్రపంచ నిర్మాత అనటం సబబు కాదు.

6. జీవుడే తన జ్ఞానకర్మలతో జాగరణ ప్రపంచమును సృష్టించును. అన్నమతంలో జాగరణంలో గూడా జీవుడే స్వయంజ్యోతి. జ్ఞానకర్మపరతంత్రుడు కనుక తనకు అనర్థకరమయిన ప్రపంచమును సృష్టించికొని సుఖదుఃఖానుభవము పొందును. జడములయిన జ్ఞానకర్మలు స్వయంగా బంధించవు. అవి ఆధారంగా జీవుడే ఈశ్వర పరతంత్రుడవుతాడు. **ఈశ్వరుడు క్రియాదిరహితుడు కనుక స్వయంగా సృష్టించడు. అయితే మాయ వలన అలా సృష్టి చేయవచ్చునని** కొందరు జాగరణ ప్రపంచ స్రష్ట ఈశ్వరుడే అని చెప్తారు. ఆ ఉదాహరణంతో స్వప్న ప్రపంచంగూడా ఈశ్వరునిదే అనవద్దు. **అంత క్షణిక తుచ్ఛమయిన స్వప్నప్రపంచం ఈశ్వర కల్పితం కాదు**. లీలా విలాసంగా అలా చేశాడని సరిపుచ్చికొనవచ్చునంటారా? – కాని బృహదారణ్యకంలో "నిహత్య ,నిర్మాయ" (హిత్వా తనుం నిర్మాయ – వే। ము) అని శ్రుతియే జీవుని నిర్మాతగా చెప్పింది. అంతేగాక తరువాత జీవుడు స్వప్నంలో రథాదులను సృష్టించినట్లు శ్రుతి చెప్పబోతున్నది. పైగా రజ్జుసర్పములాగాజీవుని స్వప్న సృష్టి వాని ఒక్కనికే వాని దృష్టిసమయంలోనే జరుగుతుంది. ఈ సామర్థ్యం జీవునికి అవిద్య వలన వచ్చినది. అయితే జీవేశ్వరులు తత్త్వదృష్ట్యా ఒక్కరే కనుక జీవ సృష్టి అయిన స్వప్నం ఈశ్వర సృష్టి అనియు చెప్పవచ్చును. ఈశ్వరుడే గదా జీవుడు. అయితే జాగరణ ప్రపంచం – అదే న్యాయంతో జీవసృష్టి అనరాదు. లింగశరీరంతో గూడిన జీవత్వం రాకముందే ఈశ్వరుడు మహాభూత సృష్టిని పూర్తిచేశాడు కదా! అందువలన ద్రష్ట అయిన హిరణ్యగర్భుడు గూడా జీవుడే. ఎందుకంటే ఆయన మహాభూతములను సృష్టించలేదు గనుక.

7. కనుక ఈశ్వర నిర్మితమయిన జాగరణ ప్రపంచం జీవభాస్యం అయినట్లు ఈశ్వర భాస్యం గూడా అవుతుంది. కనుక జీవుడే సర్వ ప్రపంచభాసకుడని నిశ్చయింపలేము. **స్వప్న ప్రపంచం మాత్రం జీవనిర్మితం. జీవైక భాస్యము**. స్వప్న ప్రపంచం భాసింపజేయనంత మాత్రమున ఈశ్వర సర్వజ్ఞత్వమునకు లోపము లేదు. "స సర్వజ్ఞః సర్వవిత్" గదా! జీవుడుగా ఈశ్వరుడే స్వప్నమును భాసింపచేస్తున్నాడు. జాగరణంలో అయితే జీవేశ్వరులిద్దరు ప్రపంచ భాసకులు. జీవుడు తనతో కలిసిన సర్వవిషయాలను భాసింపజేయటం అనుభవంలోని సంగతియే. ఈశ్వరుని విషయం శాస్త్రసిద్ధం. అనుమాన ప్రమాణ సిద్ధము. ఈశ్వరుడు పరోక్షుడు గదా!

8. జీవులు ఎవరికి వారు వ్యష్టిగా తమ సంబంధంలోనికి వచ్చిన ప్రపంచమును భాసింపజేస్తాడు. సర్వజీవ సమష్టి అయిన ఈశ్వరుడు సర్వజీవుల ద్వారా సర్వసాక్షాత్కారము పొందుతాడు. కాని స్వప్నప్రపంచం ప్రతి జీవునకు భిన్న ప్రపంచం కనుక దానిని ఈశ్వరుడు సాక్షాత్కరింపజేయడు. ప్రపంచం అయితే అందరికీ ఒక్కరకంగా కనబడుతుంది. కనుక స్వప్న ప్రపంచం జీవసృష్టి జీవ భాస్యం. **కనుక జీవుడు స్వప్నంలో స్వయంజ్యోతియే. బుద్ధి వృత్తి చేతనే ఈ ప్రకాశం జరుగుతుందనరాదు. అది జడము. అదిగూడా జీవచైతన్యం ద్వారానే భాసిస్తుంది.** బుద్ధివృత్తికన్న భిన్నంగా జీవుడున్నాడు. "స్వేన భాసా స్వేన జ్యోతిషా" అని శ్రుతి. అతీంద్రియవిషయాలలో శ్రుతియే ప్రమాణము.

9. శ్రుతి చెప్పిన ఈ విషయానికి ఉపపత్తి గూడా ఉన్నది. ఘటాకార వృత్తి వలన ఘటము. పటాకార వృత్తి వలన పటము భాసిస్తాయన్నది అనుభవము. కనుక వృత్తి పుట్టటం గిట్టటం ఉన్నాయి కనుక వృత్తి అస్థిరం. వృత్తియొక్క ఈ క్షణికతలు మనకు తెలుస్తున్నాయి. మరి యీ తెలిసికొనేదెవరు? వృత్తియే తన జన్మనాశములను తనే తెలిసికొనటం కుదరదు. మన జన్మనాశాలను మనం గ్రహించలేం కదా! వృత్తికన్నా వేరుగా మరొకరున్నారు. వారు వృత్తి జన్మనాశములను గ్రహిస్తారు - అంటారా? - అపుడు వృత్తి స్వయం ప్రకాశం కాదని, దానికి భిన్నంగా జీవుడున్నాడని అంగీకరించినట్లే కదా? **భిన్నమయిన వృత్తిచేత గ్రహింపబడే ఘటాదులు వృత్తిని గ్రహించలేవు. వృత్తియు తనను తాను గ్రహించలేదు. కనుక మిగిలినది "జీవుడు" గానే చెప్పాలి**. వృత్తి జన్మనాశములు అసలు తెలియవంటే వృత్తికి జన్మనాశము-లున్నాయనే అధికారం పోతుంది. లేవంటే జీవితమంతా ఘటవృత్తిగాని, పటవృత్తిగాని ఉంటుందని చెప్పాలి. సాక్షిలేకుండా ఏదీ ఉన్నదని లేదని అంగీకరింపలేము కదా! లేదంటే కుందేటికొమ్ము గూడా ఉందనవచ్చును.

10. వృత్తి జన్మనాశములకు మరో వృత్తి పుట్టుందనరాదు. ఏ విషయం ఆకారంగా వృత్తి (ఘటవృత్తి) ఏర్పడుతుందో అది ఆ విషయమునే తెలుపుతుంది. ఘటవృత్తి ఘటమునే తెలుపుతుంది. పటమును తెలుపదు. దీనికొక (కొత్త) వృత్తి పుట్టుందంటారా? - అయితే ఆ వృత్తి స్థిరమా? చరమా? స్థిరమయితే ఇక జీవితంలో మరో వృత్తి జ్ఞానం పుట్టదు. చరమయితే ఈ వృత్తియొక్క జన్మనాశములు తెలియటానికి మరో వృత్తి మరల మరోవృత్తి - అంటూ అనవస్థ. కనుక **వృత్తి భిన్నమయినది వృత్తికి ప్రకాశం కలిగించేది వృత్తి జన్మనాశములకు సాక్షి అయిన "ఆత్మజ్యోతి" ఒకటి ఉన్నది**. కనుక విజ్ఞానం తప్ప మరేదీ లేదని చెప్పే "విజ్ఞాన వాదము" సరికాదు. విజ్ఞాన భిన్నంగా సర్వసాక్షి అయిన ఆత్మజ్యోతి ఉన్నదని స్థాపించినాము గదా!

11. మరియు విజ్ఞాన భిన్నంగా ఎదురుగా ఉన్న ఘట పటాదులను మీరు గ్రహించి

అవి లేవంటారా? గ్రహింపకుండా లేవంటారా? 'గ్రహించి' అంటారా – అయితే అవి ఉన్నట్లే. లేనివి గ్రహించలేము కదా! లేనివే – అంటారా? అలా అయితే వాటిని ఘటాదులని అవి లేవని ఎలా అంటారు? కనుక విజ్ఞానవాదికి మాట్లాడే అవకాశం గూడా ఉండదు. ప్రతివాది గూడా అతనికి లేనట్లు లెక్క. అయితే అద్వైతి వ్యవహారం వఱకు వీటన్నింటికి అస్తిత్వమును అంగీకరిస్తాడు. కనుక అద్వైతికి ఈ దోషములు లేవు. పరమార్థతః మాత్రం సర్వవ్యవహార శూన్యత ఆమోదమే. అందువలన మాధ్యమికులు చెప్పిన శూన్యవాదము గూడా నిలువదు. దేహజీవవాదము, ఇంద్రియజీవవాదము, పోయినవి. శరీరాది విలక్షణుడయిన జీవుడు స్వప్నం చూస్తున్నాడు – అనటం వలననే ఆవాదాలు పోయినవి.

జీవుడే స్వయంజ్యోతి అనటం వలన ద్వైతవాదం నిరాకరింపబడినది. జీవభిన్నంగా జీవ భాసకంగా జీవ నియామకంగా ఈశ్వరుడున్నాడని ద్వైతవాదము. జీవుని స్వరూపమే జ్ఞానం అనటంవలన "జీవునికి జ్ఞానం గుణము" అను తార్కిక వాదము నిరాకృతము. కనుక "ఈశ్వరాభిన్నుడు స్వయం ప్రకాశుడూ జ్ఞానరూపుడు అయిన వాడు జీవుడు" అని అద్వైతం స్థాపితం.

**శ్లో॥ యత్రాయం పురుషః స్వపిత్యనుదినం నో తత్ర రథ్యా రథా**
**నో ధుర్యా రథికా న పల్వలసరిత్పాథోధయో నో ముదః ।**
**నానన్దాశ్చ న భూమయో న కుధరా న ప్రాణినో నేతరే**
**సర్వం తత్ర పుమానయం కలయతి స్వేనాత్మనా యద్విధిః ॥ 171**

భావ॥ జీవుడు స్వప్నంలో సర్వద్రష్ట. ఎందుకంటే, అల్పమయిన హృదయదేశంలో వాస్తవమయిన (స్వప్న) దృశ్యాలు ఉండటం సాధ్యం కాదు. జీవుడు హృదయంలో చేరి నిద్రిస్తాడు. అచ్చట స్వప్నంలో ఆయన కనుగొనే వీధులు, రథాలు, అశ్వాలు, రథికులు, చెరువులు, నదులు, సముద్రాలు, సుఖాలు, సంతోషాలు, సంబంధబాంధవ్యాలు, నేలలు, కొండలు, తీర్థాలు, ప్రాణులు ఇంకా అనేకం అనూహ్యం ఏవీ ఉండవు. కేవలం అవి అన్నీ అతను తనరూపమయిన జ్ఞానంతోనే సృష్టి చేయును. కనుకనే అతడు విధి – కర్త, స్రష్ట. 171

విశే॥ 1. స్వప్న ప్రపంచం వాసనామయం. వాసనాశ్రయమయిన చిత్తవృత్తిని పుట్టించే కర్మలకు హేతువు కనుక జీవుడు స్వప్న ప్రపంచకర్త. కనుక జీవభిన్నుడయిన ఈశ్వరుడు స్వప్న ప్రపంచ కర్త – అనటం తప్పని తేలినది. మన మనోరథములవలె స్వప్న ప్రపంచముగూడా వాసనా మయమే. కనుక మన కోరికలను ఈశ్వరుడు సృజించడు. అట్లే స్వప్నమును ఈశ్వరుడు సృజించడు.

2. వాసనామయం కనుకనే మనోరథముల లాగా రజ్జుసర్పముల లాగా స్వప్న ప్రపంచము

మిథ్య. ఇట్టి అభాసమును కల్పించుటకు ఈశ్వరుడు అవసరం లేదు. ప్రపంచం గూడా మిథ్యగదా అదయినా ఈశ్వర సృష్టం ఎందుకయిందంటారా? – పరమార్థతః మిథ్య అయిన యీ ప్రపంచం వ్యవహారతః వాస్తవం – స్వప్న ప్రపంచం వ్యవహారతః గూడా వాస్తవం గాదు. పరమార్థ దశలో ఈశ్వరుడే లేడు. బ్రహ్మమే – కనుక స్వప్న ప్రపంచ కర్త జీవుడే. ఆ ప్రపంచం రజ్జుసర్పం వంటిది. స్వప్న జన్యములయిన ఆదిత్యాదులు నేత్రాదులు అతనితో కలియవు. అందువలన స్వప్న పురుషుడు స్వయంజ్యోతియే. అసంగుడయిన ఆత్మకు జాగరణంలోనయినా జ్యోతులతో సంబంధము లేదు. అయినా జాగ్రత్ప్రపంచము మిథ్య అను విషయంలో వివాదములున్నవి కనుక స్వప్న ప్రపంచం మిథ్య అనటంలో ఎవరికీ వివాదం లేదు కనుక ఆత్మ స్వయంజ్యోతి అని ఇందులో నిరూపించగలము.

3. స్వయంజ్యోతి అంటే స్వయంగాప్రకాశించేది. కాని విడిగా వివిక్తంగా ప్రకాశించేది అని ఇపుడు చెప్తున్నారు. అనాత్మలయిన జ్యోతులతో కలవకుండా – అని చెప్తున్నారు? సమా – తేడా లేదు. సమానార్థములే. దీనితో కలియకుండా భాసించేదే స్వయంగా భాసించినట్లు. పగలు నేత్రం సూర్యునితో కలిసియే భాసిస్తుంది. కాని స్వప్నంలో అలా ఏదీ కలియకుండానే "ఆత్మ" భాసిస్తుంది. కనుకనే కలలో ఘటాదిదృశ్యాలు సూర్యనేత్రాది సమయం లేకుండా కనబడతాయి. అయితే జాగరణంలో లాగా స్వప్నంలోనూ బుద్ధి వృత్తి రూపమయిన జ్యోతితో కలిసియే ఆత్మజ్యోతి ఉంటున్నది. అయినా బుద్ధి – ఆత్మలను కలిపియే యీ 'నిద్ర' అని అంటాము. కేవలాత్మకు 'నిద్ర జాగరణ' అని దశలు లేవు. అది నిరంతర నిర్నిద్రమయిన జ్ఞానస్వరూపము (గుండెలాగా). ఇవన్ని బుద్ధి దశలే. బుద్ధిని బట్టి ఆత్మ పరుండినదన్న వ్యవహారము అధ్యాసతో వస్తున్నది. కనుక బుద్ధి వృత్తితో కలిసి ఉన్నా నేత్రాదులతో దూరంగా ఉంటుంది గనుక, మరియు, ఆ బుద్ధి వృత్తిని గూడా భాసింపజేసే ఆత్మ బుద్ధి కన్న భిన్నమని యింతకుముందే చెప్పాము కనుక, ఆత్మ స్వయంజ్యోతియే. ఇది గౌణంగాను, వాస్తవము. దీనినే "తన వెలుగు అంతఃకరణ ప్రకాశము (రుచం) ను కలిగించునని చెప్పాము.

**శ్లో॥ ఏకో హంస ఇహాసుభిస్తనుమవన్నవ్యాపృతిం శుక్రధృ-**
**త్స్వవర్ణః పురుషోఽమృతో బహిరయన్ రూపాణి నానా సృజన్ ।**
**స్త్రీభిః ఖేలతి మృష్టమత్తి చ బిభేత్యప్యగ్నిసింహోరగ-**
**వ్యాఘ్రాదిభ్య ఇమం న పశ్యతి చ కోఽప్యారామమస్యేక్షతే ॥ 172**

భావ॥ స్వప్న దశలో జీవుని కర్తృత్వము ఇది. జాగరణాది లోకములలో ఏకాకిగా తిరిగే హంస, హిరణ్మయమయినది. అనగా చైతన్య జ్యోతి. ఆవృతమయినది. స్వప్నంలో శయ్యలో తనశరీరమును నిశ్చేష్టముగా వదలి, ప్రాణములతో రక్షించుచు, శుక్రం అనగా ఇంద్రియ

మాత్రారూపమును ధరించినదై దేహ సంబంధమును వదలి బయట తిరుగుచు వాసనా రూప మయిన రథాదులను సృజించుచు స్త్రీలతో విహరించును. మృష్టాన్నమును తినును. అగ్ని సింహాదుల నుండి భయమును పొందును. కాని ఎవరున్ను ఇతనిని గమనింపలేరు. అత్యంత భిన్నముగా దృష్టి గోచరమయినను ఈ పురుషుని చూచే ఆదృష్టము ఎవరికీ లేదు. కాని యీ పురుషునియొక్క ఆరామస్థానములయిన గ్రామనగరాదులు మాత్రం కనబడతాయి. ఈ పురుషుని ఎవరూ చూడరు – అంటే అర్థం దేహాభిమానం గల ఏ జీవుడయినా స్వప్నంలో శరీరభిన్నంగా సంచరించు తమ స్వరూపమును గమనించలేరని అర్థము. అనగా శరీరాదులకన్న తాను భిన్నమన్న స్వరూప యదార్థ స్థితిని గమనించరని అర్థము. 172

**శ్లో॥ యస్మాద్యత్ పురుషః ప్రగృహ్య గతవాన్ దేహాద్బహిః క్రీడితుం**
**తత్థానం న తదిన్ద్రియం హి గమయేదన్యై ర్హఠాద్బోధితః ।**
**బాధిర్యాన్ధ్యముఖస్తతోఽస్య చ భవేద్రోగోఽ చికిత్స్యో బుధై-**
**రిత్యేషా ప్రథితిర్భువి స్థితవతీ మానం పృథక్త్వే విభోః ॥ 173**

భావ॥ ఆత్మ శరీరేంద్రియాది భిన్నమనటానికి లోక ప్రసిద్ధి గూడ ఉన్నది. లోకంలో ఒక వదంతి ఉన్నది. ఏమంటే నిద్రపోతున్నవానిని హఠాత్తుగా లేపితే వానికి చెముడు మున్నగు రోగాలు (షాక్ వలన) వస్తాయని. అందుకు కారణం ఏమంటే, స్వప్నంలో జీవుడు తన ఇంద్రియాలను వాటి స్థానంనుంచి తీసికొని బయట అనుభవాలకు పోతాడని, హఠాత్తుగా లేపితే ఆయా ఇంద్రియాలు ఆ స్థానాలకు చేరవని అందువలన ఏదో ఒక ఇంద్రియ రోగం వస్తుందని దానికి చికిత్స చాల కష్టమని ఒక వదంతి. ఇది నిజమయినా కాకపోయినా, ఒకటి మాత్రం నిజం. జీవుడు వేరు. ఇంద్రియాదులు వేరు. శరీరం వేరు అని. జనంలో మొదటి నుంచి ఒక 'రూఢి' ఉన్నదని. వేరుగాబట్టి ఆయనయే స్వయం 'జ్యోతి'. 173

**శ్లో॥ జాగ్రత్యేష పుమాన్విలోకయతి యత్స్వప్నే తదేవేక్షతే**
**జాగ్రద్దేశగ ఏవ తన్న పురుషః స్వప్నే స్వయమ్భాసనః ।**
**మైవం స్వప్నపదే పుమానుపరతవ్యాపారసర్వేన్ద్రియః**
**సర్వమ్పశ్యతి యత్స్వయైవ విభయా తస్మాత్స్వయమ్భాసనః ॥ 174**

భావ॥ జాగరణంలో ఏది ఎక్కడ చూచాడో దానిని అదే స్థలంలో ఉన్నట్లు గా పురుషుడు స్వప్నంలోగూడా చూస్తాడు. కనుక స్థలభేదం లేదు గనుక పదార్థభేదమూ లేదు. అపుడు అచ్చట ఉన్న సూర్య నేత్రాదులు స్వప్నంలోనూ ఉంటాయి కనుక జీవుడు స్వయంజ్యోతి కాడు – అని ప్రశ్న. సమా – అలాకాదు. స్వప్నంలో పురుషుని ఇంద్రియ వ్యాపారములు లయము పొంది ఉండును. అందువలన సమస్త దర్శనములు అతనికి స్వయంప్రభతోనే జరుగును. కనుక అతడు స్వయంజ్యోతియే. 174

శ్లో॥ జీవోఽయం హృదయామ్బరే పరసుఖం భుక్త్వా సుషుప్తావథ
స్వప్నం ప్రత్యుపయాతి కర్మవశతః స్వప్నే చ యత్పశ్యతి ।
పుణ్యం పాపమనేన చాననుగతో బుద్ధాన్తమాపద్యతే
దృష్టన్తత్ర విహాయ యాతి చ పునస్స్వప్నం హ్యసఙ్గస్తతః ॥ **175**

భావ॥ జీవుడు సుషుప్తిలో హృదయాకాశమున పరమానందమును పొంది తరువాత మరల కర్మవశుడై సుషుప్తినుంచి స్వప్నములోనికి వచ్చి అందులో పాపపుణ్యమయ కష్ట సుఖములను గమనించి వాటిని అచ్చటనే వదలి జాగరణంలోనికి వచ్చును. జాగరణంలోని అనుభవములను వదలి మరల స్వప్నములోనికి పోవును. కనుకనే జీవుడు అసంగుడు. ఏ దశలోనివి అతనితో కలిసిరావు. అతనొక్కడే అసంగుడై అన్ని దశలలో గుండా ప్రయాణిస్తాడు. కనుక జీవుడు స్వయంజ్యోతియే గాక అసంగుడు. 175

విశే॥ 1. విశ్వుడు - స్థూల భోగములు; తైజసుడు - స్వప్న భోగములు; ప్రాజ్ఞుడు - సుషుప్తిభోగమును అనుభవించును. "సుఖంగా నిద్రించును" అన్న ఆనందభోగం సుషుప్తిలో అనుభవసిద్ధము. వీటన్నింటిలో జీవుడసంగుడయి జరగుతుంటాడు. లేదా అవే జరుగుతుంటాయి. కనుకనే జీవునకు మృత్యువు గూడా లేదు.

2. జీవుడు అసంగుడు. అతను స్వప్నంలో కర్తకాడు. అపుడు క్రియాకారక ఫలాలు లేవు. ఒకవేళ ఉన్నా అవి రజ్జు సర్పం వలె భ్రాంతిరూపములు. మిథ్యలు. "న తత్ర రథారథ యోగాః" అని శ్రుతియే అవి మిథ్యలని చెప్పింది. సుషుప్తిలోను కుదరదు. అచ్చట క్రియాదులు లేవు. ఇక జాగరణంలో అంటారా? అచ్చటనయినా శరీరమే కర్తగాని ఆత్మకాదు. అధ్యాస వలన ఆత్మ కర్తగా అనిపిస్తుంది. అది భ్రాంతి. చూడండి గీత. "అనాదిత్వాన్నిర్గుణత్వాత్ పరమాత్మాయమవ్యయః. శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే" కనుక కర్తకాడు. భోక్త కాడు. లేదంటే ఆత్మ పుట్టవలసినదే. ఫలమనుభవించి చావవలసినదే. లేదంటే కర్మక్షయం కాదు. "న జాయతే మ్రియతే వా విపశ్చిత్" కదా! కనుక ఆత్మ కర్తకాదు. జన్మలేదు. చేసేది శరీరమే. అది జడమయినా చైతన్యాభాసం వలన (అయస్కాంతం - సూది) పని చేస్తుంది. శరీరం నష్టమయినా (సంకల్పరూపమయిన అసలు కర్తృత్వం గల) లింగ శరీరం ఉంటుంది. చేసిన కర్మ నష్టమయినా అపూర్వం వాసనా రూపంగా ఫలానుభవం దాకా లింగ శరీరమును అంటుకొని యుంటుంది. కనుక లింగ శరీరమే కర్త, భోక్త, జనన మరణ సంసారి అవుతుంది.

3. స్వప్నములో పాపపుణ్యములను కష్ట సుఖములను గమనించి జీవుడు - అని శ్లోకంలో చెప్పారు గదా! దాని అర్థమేమి? - సమా - గమనించటం - అంటే గమనించటమే. సాక్షిగా ఉండటమే. అందుకే అసంగుడు అన్నాము. సుఖదుఃఖభోగములు లింగశరీరానివే.

4. స్థానత్రయంలో జీవసంచారం చెప్పినా ఆ స్థాన త్రయంలో అతనికి సంబంధములేదు. (తామరాకులో నీరు నడిచినా దానికి సంబంధం లేదు గదా!) ఉండటం అన్న సంబంధమయినా ఉన్నది కదా! క్రమంగా స్థానత్రయం చేరటం ఉన్నది గదా! – సమా – జీవుడు సర్వవ్యాపి. అతడు ఒకచోటనుంచి ఒకచోటకు పోవటం ఉండదు. గమనాది కర్త బుద్ధియే అదే లింగశరీరం. దానితో అధ్యాస వలన ఆత్మకు ఆ దశలున్నట్లు కనబడుతున్నాయి. కనుకనే "ధ్యాయతీవ లేలాయతీవ" అని శ్రుతి. కనుక ఈ దశలు మూడు బుద్ధి ధర్మమలులే కాని జీవధర్మములు కావు. జీవుడు నిర్ధర్మకుడు. అసంగుడు. అతని వలననే బుద్ధి ప్రకాశం కలిగి యీ దశలలో నడుస్తున్నది. కనుక బుద్ధి స్వయం ప్రకాశం కాదు – జడము. ఈ దశలకు సాక్షి ఆత్మ. "సాక్షీ చేతా" ఈ సాక్షియే తురీయుడు. అతడే బుద్ధి తాదాత్మ్యంతో విశ్వాది రూపత్రయంతో ఉంటాడు.

5. బుద్ధి తాదాత్మ్యం అనేది అధ్యాసయే కనుక అది జీవునకు బుద్ధితో సంగం కాదు. కనుక అసంగత సరయినదే. బుద్ధితో తాదాత్మ్యం వలన బుద్ధ్యాద్యాకారం వస్తుంది కనుక ఆత్మకు సంగం వచ్చిందనుకోనవద్దు – బుద్ధి వృత్తి ఘటాకారంగా పరిణమించి ఘటాన్ని తెలియజేస్తుంది. సూర్య ప్రకాశమూ అంతే. కాని ఆత్మ ప్రకాశం అట్లు కాదు. ఇది నిరవయవము. విషయాకారంగా మారదు. కేవలం సాక్షిగా అవభాసనం చేయటమే. అలా అయితే భాస్యభాసక రూప సంబంధమయినా ఉంటుంది గదా! అనవచ్చు. కాని ఆ సంబంధం కల్పితము. మిథ్య అయిన ప్రపంచంతో అట్టి సంబంధమూ కల్పితమే. మిథ్యయే కదా! "ఏకమే వా ద్వితీయం బ్రహ్మ" "నేహనానాస్తి కించన"

6. "నేహనానాస్తి –" అంటే అసలు లేదని, ప్రపంచం శశవిషాణం వంటిదని అనరాదు. దాని అస్తిత్వం మాయవలన వచ్చినది. (మాయవలన గూడా శశవిషాణం లేదు గదా!) విజ్ఞానవాది అయిన బౌద్ధుడు బాహ్య ప్రపంచం అసలు లేదంటాడు. అద్వైతి బాహ్య ప్రపంచం మాయా ప్రభావంతో ఉన్నదని చెప్తాం. "మిథ్య" అంటాం. 'అసత్' అనం. "తస్మాన్న విజ్ఞాన మృతేస్తి కించిత్ క్వచిత్ కదాచిత్ ద్విజవస్తుజాతం" అన్న పరాశర (విష్ణుపురాణ) వాక్యము పరమార్థతః తత్త్వరీత్యా జగత్తుకు వాస్తవికత లేదనటమే. అసలు లేదని కాదు. లేదా, ఆత్మయందు మాయాకల్పిత మయిన యీ జగత్తు ఆత్మకు భిన్నంగా లేదు. రజ్జువుకన్న భిన్నంగా భ్రాంతి సర్పం లేదు అని పరాశర భావము. కనుక చైతన్యం ఒకటే మాయచేత జగదాకారంగా కనబడుతున్నది. కనుక మాయా కల్పిత జగత్తుతో కల్పిత సంబంధమే గాని వాస్తవ సంబంధం ఉండదు గనుక పురుషుడు అసంగుడే. బాలుడు ఆకాశం నల్లగా ఉన్నదన్నంత మాత్రమున నలుపు రాదు గదా!

**శ్లో॥ కూలద్వన్ద్వమివానుయాతి బలవాన్మత్స్యోఽయమన్తద్వయం**
**కామాత్కర్మవశాచ్చ నీడమివ తత్సాయం శ్రమార్తో ద్విజః ।**

**అన్తర్ద్వన్ద్వవిహారతోఽభ్రవిహృతేరన్తం తృతీయం స్వయం**
**ధావత్యేవ న యత్ర పశ్యతి పుమాన్ స్వప్నం చ కామఇ్చ కమ్ ॥176**

భావ॥ బలవంతమయిన తిమింగిలము నదిలో రెండు తీరమును ఒరసికొంటూ తిరిగినట్లు ఈ జీవుడు నిద్రాజాగరదశలను ఒరసికొంటూ జీవించుచుండును. కామం వలన కర్మలవలన ఇలా తిరిగి తిరిగి పగలంతా ఎగిరి ఎగిరి సాయంకాలానికి శ్రమతో గూటికి చేరి "డేగ" విశ్రమించినట్లు, జాగర స్వప్నముల మధ్య అలసి తృతీయమయిన సుషుప్తిలోకి పురుషుడు చేరును. అచ్చట అతనికి స్వప్నములు కామములు ఏవీ కనబడవు. 176

విశే॥ 1. స్వప్నంలో వలెనే సర్వపదార్థములు జాగరణంలో మిథ్యకనుక స్వప్నంలాగానే జాగరణమును గూడా సుషుప్తిదశలో కనుగొనము. సుషుప్తిలో ప్రపంచ ప్రతీతి లేదని అర్థం. కామం గూడా ఉండదు. కనుక జీవుడు అసంగుడు. జాగరణంలో కర్తృత్వం, స్వప్నంలో కామిత్వం సుషుప్తిలో అసంగత్వం ఉంటాయి కనుక కర్మ కామ బంధాలు సుషుప్తిలో ఉండవు. అందువలననే అచ్చట ఆనందము. కామ కర్మలు దుఃఖకరములు. కామం రాలేదని దుఃఖం. వస్తే పోతుందేమో నని దుఃఖం. కర్మ శ్రమకరము. కనుక సుషుప్తి వీటికి భిన్నమయిన సుఖరూపం.

**శ్లో॥ నాడ్యస్సన్తి హితాస్సహస్రమిహ నుః సూక్ష్మాః కచాగ్రాదలం**
**నీలశ్వేతకడారలోహితహరిద్వర్ణైరసైః పూరితాః ।**
**లిఙ్గం సప్తదశాత్మకం చ సతి తాస్వత్యచ్ఛముద్వాసనం**
**స్త్రీహస్త్యశ్వరథాదిరూపకలితం భాతి స్వయం స్వప్నకే ॥ 177**

భావ॥ నరునిలో హిత మొదలయిన నాడులు సహస్ర సంఖ్యలో నున్నవి. అవికేశాగ్రం కన్న అత్యంత సూక్ష్మమయినవి. నీల శ్వేత పింగళ లోహిత హరిత వర్ణములయిన రసములు వాటియందున్నవి. వాటియందు 17 తత్త్వములతో గూడిన లింగశరీరము కలదు. అది స్వచ్ఛమయినది. వాసనాశ్రయమయినది. అది స్వప్నములో స్త్రీ, గజములు, గుఱ్ఱములు, రథాలు మొదలయిన రూపములతో భాసించును. స్వప్న ప్రపంచం వాసనామయం. 177

విశే॥ పంచప్రాణాలు, దశేంద్రియాలు, మనస్సు, బుద్ధి - 17.

**శ్లో॥ సుప్తః పశ్యతి వాసనాత ఇతి యచ్ఛత్రూన్ ఘ్నతస్తస్కరాన్**
**వ్యాఘ్రాదీన్సుషిరే పతన్తమపి చ స్వం ప్రత్యయోఽయం మృషా ।**
**యజ్జాగ్రద్భయమేష పశ్యతి పున స్స్వప్నే తదేవేక్షతే**
**భీహేతావసతీదమేవ సకలం జాతం హ్యవిద్యావశాత్ ॥ 178**

భావ॥ నిద్రించు పురుషుడు వాసనా ప్రభావం వలన కలలో తనను చంపవచ్చే శత్రువులను, దొంగలను, వ్యాఘ్రాది క్రూర జంతువులను, తనే గొయ్యిలో పడుతున్నట్లు,

కనుగొనును. ఇదంతా మిథ్యయే కదా! జాగరణంలో పొందిన భయాదులనే స్వప్నంలోనూ చూస్తున్నాడు. కాని అచ్చట భయహేతువు లేకపోయినా ఇదంతా అవిద్య వలన జరుగుతున్నది. కనుక స్వప్నం అవిద్యా మయం. అవిద్యలో జాగరణాది వాసనలుంటాయి. 178

**శ్లో॥ యోఽయం జాగ్రతి దేవమాకలితవాన్ స్వప్నే స తం వీక్షతే**
**రాజా జాగ్రతి యస్స పశ్యతి పుమాన్ స్వప్నే ప్రభుం స్వం పునః ।**
**బుద్ధి ర్జాగ్రతి యస్య సోఽహమితి స స్వప్నేఽపి పశ్యత్యజం**
**సర్వాత్మానమసావముష్య సహజస్సర్వాత్మభావో విభోః ॥ 179**

భావ॥ అందువలననే పురుషుడు జాగరణంలో ఉపాసించిన దేవతనే స్వప్నంలో చూస్తున్నాడు. జాగరణంలో రాజయినవాడు స్వప్నములోనూ తననే ప్రభువుగా గమనించి కొంటాడు. అలాగే ఎవడయితే జాగరణంలో "అహం బ్రహ్మాస్మి" అని నిరంతరం భావిస్తాడో, అతడే స్వప్నంలో గూడా 'అహం బ్రహ్మాస్మి' అనుకొంటాడు. సర్వాత్మ భావంతో ఆత్మదర్శనం పొందుతాడు. అతనికా సర్వాత్మభావము సహజము. 179

**శ్లో॥ విద్యా యస్య గతేతి దార్ఢ్యమభయం మోక్షం స యాయాద్బుధో**
**లోకోఽయం పరమోఽస్య యస్య తు గతా కాష్ఠామవిద్యా పరామ్ ।**
**మూఢస్స స్వమయత్యపూర్ణమివ తత్కామీ భృశం ఖిద్యతే**
**స్తమ్బాన్తాం చ గతిం ప్రయాత్యపరమో లోకోఽయమస్యోచ్యతే ॥180**

భావ॥ ఎవనికయితే ఈ విధముగా విద్య దృఢమయినదో అతడు మోక్షమును తప్పక పొందును. వానికి మోక్షమే పరమలోకము. ఎవనికి అవిద్యా పరాకాష్ఠను చేరినదో అట్టి మూఢుడు పూర్ణమయిన ఆత్మను ఖండమయిన దానినిగా పొందును. అందువలన కామియై మిక్కిలి ఖేదపడి చివరికి తృణాది జన్మలను పొందును. అదే వీనికి అధమలోకమని చెప్పబడును. 180

విశే॥ 1. అవిద్య ఆగంతుకము. విద్య స్వాభావికము. జీవుడు స్వభావతః బ్రహ్మం కదా! స్వప్నం భ్రాంతి గనుక అవిద్య సిద్ధం కావచ్చును. జాగరణం భ్రాంతి కాదు. అయినా అదియును మాయామయం కనుక అవిద్యా సిద్ధమనియే చెప్పాలి. నిర్వికారం, పరిపూర్ణం, నిరవయువం, నిర్ధర్మకం అయిన ఆత్మకు సంసారం ఎలా కుదురుతుంది? కేవలం మాయాకల్పితమయితేనే కుదురుతుంది. కనుక జీవునకు సంసారం మాయామయమే. మాయ ఆగంతుకము. విద్య స్వాభావికము. కనుక ఆగంతుకము పోయి తీరవలసినదే.

2. ఆగంతుకమయిన ఈ అవిద్య మధ్యలో ఎలా వచ్చింది? – స్వయంగానే వచ్చింది. "మాయా చా విద్యాచ స్వయమేవ భవతి" అని శ్రుతి. అంతమాత్రాన అది స్వాభావికం కాదు. అవిద్య స్వయంగానే ఎలా వస్తుంది? – ఇది మిథ్యా పదార్థము – మాయ. దీనిని గురించి

వాస్తవ పదార్థం గురించి శంకించినంతగా శంకించి చర్చించరాదు. అసలీ అవిద్య ఆత్మయందు త్రికాలములయందును వాస్తవంగా లేదు. వ్యవహారతః మాత్రం కనబడుతూనే ఉన్నది. రజ్జు సర్పంలాగా కనబడుతున్న దీన్ని కాదనలేము. రజ్జుజ్ఞానం వలన సర్పభ్రాంతి పోయినట్లు ఆత్మజ్ఞానం వలన ప్రపంచభ్రాంతి సమూలంగా నశిస్తుంది. కనుక జీవునకు మోక్షము. మోక్షానికి జీవునకు అవిద్యయే అడ్డుగోడ. ఎందుకంటే మోక్షం అనగా జీవుడు తన అసలు స్వరూపంలో ఉండటమే.

అజ్ఞానంతో బాలుడు ఆకాశం నీలం అనుకొన్నట్లు, మూఢుడు సచ్చిదానంద స్వరూపుడయిన ఆత్మను అవిద్య వలన సంసారిగా అనుకొంటాడు. కనుక అవిద్యా నిర్మూలనానికి ప్రయత్నం చేయాలి. ఆ ప్రయత్నం ఉపనిషదర్థ విచారణయే.

**శ్లో॥ నార్యా కామితయా స్వయం భువి పుమానాలిఙ్గితః కాముకో**
**బాహ్యం వేద న నాన్తరఞ్చ పరమానన్దాబ్ధిమగ్నో యథా ।**
**తత్రప్రాజ్ఞేన పుమాన్ సుషుప్తిసమయే స్వేనాత్మనాఽఽలిఙ్గిత-**
**స్తత్కామాఘవివర్జితఞ్చ విభయం రూపం పరస్యాత్మనః ॥ 181**

భావ॥ తాను ప్రేమించిన కామినీ పరిష్వంగంలో ఉన్న కాముకుడు బాహ్య - ఆంతరములు తెలియకుండా పరమానంద సముద్రములో మునిగి యుండును. అట్లే సుషుప్తి సమయంలో ప్రాజ్ఞాత్మచేత ఆలింగితుడయిన పురుషుడు కామ పాప రహితమయిన భయ శూన్యమయిన పరమాత్మ స్థితిని పొంది బాహ్యాంతరజ్ఞాన శూన్యుడై పరమానందమగ్నుడగును. 181

విశే॥ 1. ఈ విజ్ఞాన రూపము స్వాభావికము. అది సుషుప్తిలో తెలుస్తుంది. కనుక లేదని శంకించవలదు.

2. బాహ్యాభ్యంతరములు తెలియవనటం వలన సుషుప్తిలో అజ్ఞానం ఉన్నదిగాని విజ్ఞాన రూపం ఎలా తెలుస్తుంది? - సమా - బాహ్యాంతర విషయాల విశేషజ్ఞానం ఉండదని అర్థం. అట్టి "విశేషజ్ఞానం లేదన్న" జ్ఞాన సామాన్యం ఉంటుంది. అనగా అజ్ఞానం ఉన్నదన్న జ్ఞానం ఉంటుంది. కనుకనే నిద్ర లేచినవాడు "నాకసలు ఒళ్లు తెలియదు" అని అంటాడు.

3. ప్రియురాలు లాగా ప్రాజ్ఞుడు ప్రియునివలె జీవునికౌగిలించటం అంటే ప్రాజ్ఞుడు వేరు జీవుడు వేరు అని ద్వైతము గదా! - సమా - అది కేవలం ఉపమానము. ఆనందంలో మునిగినవాని స్థితికి అది ఉపమానము. అంతేగాని ద్వైతమనికాదు. 'ప్రాజ్ఞుడయిన ఆత్మ' అనటం వలన అద్వైతమే. తనను ఆత్మ అంటాము గాని ఇతరులను కాదు గదా! స్వేనాత్మనా = స్వస్వరూపం అని అర్థము. లేదా, ప్రాజ్ఞుడయిన ఆత్మచేత స్వయంగా ఆలింగితుడయి - అని అర్థము. అంతేగాని జీవునే శరీరంగా చేసికొని అందులో ఆత్మగా ఉన్న ప్రాజ్ఞుడనబడు ఈశ్వరుడు -

అని "ప్రాజ్ఞేనాత్మనా" అన్న శ్రుతికి అర్థం చెప్పరాదు. అలా అయితే జీవుడు ఈశ్వరాలింగనంలో ఉన్నట్లు కాదు. (ఈశ్వరుడే జీవుని ఆలింగనంలో ఉన్నట్లవుతుంది.) ఎందుకనగా, శరీరి శరీరమునెలా కౌగిలించికొనును. శరీరంలో ఉండటమే శరీరి శరీరమును కౌగిలించినట్లుగా చెప్పటమూ కుదరదు. అది సహజస్థితి. కనుక సుషుప్తిలోనే అలా ఉన్నట్లు చెప్పటం ఎలా? సుషుప్తిలో ఏమయినా ప్రత్యేకంగా అలా ఉంటాడని చెప్పటం నిరూపణలేనిది. అలా చెప్పలేము. విశేషాకారమును అంగీకరిస్తే ఈశ్వరుడు వికారి అవుతాడు. అలాగే జీవేశ్వరులు నిరాకారులు కనుక వాస్తవంగా కౌగిలి సాధ్యం కాదు. అవయవాలు ఆకారాలుంటే వారు అనిత్యులవుతారు గదా! ఘటాదులవుతారు.

4. స్థూల శరీరంలోపల అంగుష్ఠపరిమాణమయిన సూక్ష్మశరీరములు రెండు ఉన్నాయి. అందులో ఒకటి ఆదిత్యవర్ణము. ఒకటి కృష్ణ వర్ణము. ఒకటి పురుషాకారం. మఱొకటి స్త్రీ ఆకారము. ఒకదానియందీశ్వరుడు మరొకదానియందు జీవుడు ఉన్నారు – అనవచ్చును గదా! – సమా – దీనికి ప్రమాణం లేదు. యుక్తమూ కాదు. అంగుష్ఠమాత్ర శ్రుతికి అర్థం ఇది కాదు. అటువంటి రూపద్వయం హృదయమునందు దొరకదు. కనుక శ్రుతి జీవప్రాజ్ఞులకు అద్వైతమే చెప్తున్నది. జీవుడు సుషుప్తిలో ప్రాజ్ఞుడుగా ఉంటాడు. ఆ దశకు అభిమాని అయిన జీవుడు ప్రాజ్ఞుడు. సామాన్యముగా అంతటినీ తెలిసికొనువాడు ప్రాజ్ఞుడు. కనుకనే అతడు సర్వజ్ఞుడు, పరిపూర్ణుడు. నిత్యచైతన్యజ్యోతియే ప్రాజ్ఞ స్వరూపము. అది సుషుప్తిలో అవిద్యచేత ఆవృతమయినట్లుంటుంది. కనుకనే అప్పటి ఆత్మానందమునకు స్పష్ట ప్రకాశము లేదు. నిత్యచైతన్య స్వరూపంగా ఉండటమే జీవుడు ప్రాజ్ఞునిచే ఆలింగనం పొందటంగా చెప్పబడినది. అదే పరమానందమగ్నత. ఇది జీవునికి స్వాభావికమే. మోక్షంలోనూ ఉండేదిదే. స్వాభావికమయినది పోదు. అగ్నికి వేడిమిపోదు. సంసారదశలోనూ అది ఉన్నదే. అవిద్యవలన తెలియదు. కనుక సచ్చిదానంద స్వరూపమయిన బ్రహ్మమే జీవుడు. (కుష్ఠువానికి అగ్ని వేడి తెలియదు. అది వాని స్పర్శలోపము. అట్టిది అవిద్య.)

**శ్లో॥ అస్మిన్ హన్త పితాఽ పితా భవతి వా మాతాప్యమాతా తథా**
**బ్రహ్మో బ్రహ్మ సుతోఽసుతోఽరిరనరిర్దేవా అదేవా అపి ।**
**స్తేనోఽస్తేన ఇవాధమోఽ ప్యనధమో లోకా అలోకాస్సమం**
**బ్రహ్మాత్మైవ శుభాశుభాననుగతస్తీర్ణాత్మశోకః పుమాన్ ॥ 182**

భావ॥ సుషుప్తిలో సచ్చిదానంద బ్రహ్మైక్యస్థితిలో అంతా అసంగతమే. తండ్రి తండ్రి గాడు అనగా వానికి అక్కడ సంసారం లేదు గదా! తల్లి తల్లి గాదు. వేదం వేదం కాదు. శత్రువు శత్రువు కాదు. కొడుకు కొడుకు కాదు. దేవతలు దేవతలు కారు. దొంగ దొంగ కాదు. అధముడు

అధముడు కాడు. లోకములు ఆ లోకములు కావు. సమస్తము బ్రహ్మాభిన్నమయిన ఆత్మయే. శుభ–అశుభములు అచ్చట నుండవు. ఆత్మ(మనస్సు)శోకములుండవు. పురుషుడు బ్రహ్మమే. 182

విశే॥ 1. ఆత్మశోకపారంగతుడయిన పురుషుడు సర్వాత్మకమయిన ప్రత్యగభిన్నమయిన ఆత్మ అగును. లేదా, పురుషుడు సమస్తము అగును. ఆత్మ అగును. బ్రహ్మం అగును. సుషుప్తిలో జీవునకు జాగరంలోని పితృత్వ మాతృత్వ శత్రుత్వాది ధర్మాలుండవు. సంసారిత్వం అతని ధర్మం కాదు. అది జాగరంలో అలా కనబడుతుంది. నిజంగా అది ఆతని సహజధర్మమయితే సుషుప్తిలోనూ కనబడేది గదా! అగ్ని ఎపుడయినా ఉష్ణమే కదా! జాగర స్వప్నములలోని సంసారం అవిద్య వలన భ్రాంతి వలన వచ్చినది. వర్షాకాలంలో ఆకాశం నల్లగా ఉండటం వంటిదిది.

2. అసంసారిత్వం జీవుని స్వభావం. అయితే అది జాగరాదులందు కనబడదు. కాని జ్ఞానులకు కనబడుతుంది. కనుక అది ఆగంతుకముకాదు. సంసారిత్వం అజ్ఞానులకు కనబడుతుంది. కాని అజ్ఞానం కనుక అది రజ్జుసర్పం వంటిది. యథార్థం కాదు. జీవునకు సంసారం లేదన్న సంగతి శ్రుతి సమ్మతం. యుక్తి సమ్మతం. అనుభవ సమ్మతం. నేను సుఖిని, దుఃఖిని అనుకొనటం బుద్ధి తాదాత్మ్యం వలన వచ్చిన భ్రమ. ప్రమ కాదు. దుఃఖి కాని ఆత్మను దుఃఖి అనటం భ్రమ. సుఖి కాదు సుఖమే ఆత్మ. దానిని “సుఖి” అనటం భ్రమ. “అయోదహతి” అని (ఇనుపగుండు దహిస్తున్నది) అనటం భ్రమ. దహించేది దాని యందలి అగ్ని గదా! సుఖంగలది మనసు. ఆత్మ అనటం భ్రమ. అగ్నియందు లోహాభిమానము. లోహమునందు అగ్ని – అభిమానము.

3. సుఖదుఃఖములు జీవధర్మములు కావు. అవి మనో ధర్మములు.

“తీర్ణోహితదాసర్వాన్ కామాన్ హృదయస్య భవతి” “సర్వం మన ఏవ” అని కామాదులన్ని మనోధర్మములేనని శ్రుతి చెప్పినది. మనస్సుంటే సుఖి. దుఃఖి. లేకుంటే లేదు. కనుకనే సుషుప్తిలో సమాధిలో (జ్ఞానులకు) సుఖాదులు లేవు. ఇది అనుభవసిద్ధము.

4. జీవాశ్రయమయిన సుఖాదులు సుషుప్తిలో సాధనం లేకపోవటం వలన తెలియటం లేదు. అంతేగాని లేవని కాదంటారా? – సమా – గ్రహింపబడితేనే ఉన్నట్లు లెక్క. గ్రహణం లేనపుడు అవి ఉన్నట్లు ఎలా చెప్తాం. సుఖాది స్వరూపమే అసిద్ధము. అలాగే స్వప్న జాగరణములందయినా జీవ ధర్మములయిన సుఖ దుఃఖాదులను మనస్సు గ్రహించదు. అది సాధనమే గాని కర్త కాదు. అలాగే తనయందలి ధర్మములను తనే మనస్సుతో తెలిసికొనటం కుదరదు. కన్ను తన రూపమును తనే తెలిసికొనదు. తన ఆత్మ మీద తన క్రియ కుదరదు. అలాగే స్వయంప్రకాశుడయిన జీవుడే తన యందలి సుఖాదులను తెలుపడు. తన ఆత్మయందు క్రియ కుదరదు. (అసలు ఆత్మ అక్రియము).

5. జీవభాస్యమయిన సుఖాదులు భాసకుడయిన జీవుని ధర్మములు కావు. సూర్య ప్రకాశనీయమయిన ఘటము సూర్యుని ధర్మము కాదు గదా! ఇవి జీవ ధర్మములయితే జీవుడు వికారి అవుతాడు. కాని "అవికార్యోయ ముచ్యతే" కదా! వికారి అయితే అనిత్యం అవుతాడు. కాని "అజో నిత్యః" కదా! ధర్మము జన్మనాశములు గలదయినా స్వరూపానికి అవిలేవు గనుక జీవుడు నిత్యుడే అంటారా? – కుదరదు. ధర్మము పుట్టకముందు, నశించిన తరువాత ధర్మియే ఉండదు గనుక జీవుడు అనిత్యుడు. ధర్మముంటేనే ధర్మి. లేనపుడు ధర్మి ఎవడు? గంధం లేకపోతే అచ్చట పృథివి లేదు. కనుక జీవుడు ధర్మ రహితుడు నిత్యుడు. బ్రహ్మమే.

**శ్లో॥ సుప్తో యత్పురుషో న పశ్యతి జగత్తత్కిన్ను భావాద్దృశేః**
**కిం దృశ్యస్య న తావదాద్య ఉచితః కల్పో హి నిత్యా దృశిః ।**
**అన్యస్సమ్మత ఏవ సుప్తిసమయే నాన్యద్విభక్తం యతః**
**స్వాత్మబ్రహ్మణ ఈషదప్యపి సమం బ్రహ్మైవ యద్వస్తుతః ॥ 183**

భావ॥ సుషుప్తిలోనున్న పురుషుడు ప్రపంచమును ఎందుకు చూడడు? – జ్ఞానము లేకనా? దృశ్యము లేకనా? జ్ఞానం నిత్యం కనుక అది లేకపోవటం ఉండదు. దృశ్యం లేకపోవటం నిజమే. సుషుప్తి సమయంలో స్వాత్మ రూపమయిన బ్రహ్మం కన్న భిన్నంగా కొంచెమయినను ఉండదు. ఎందుకంటే సమస్తము వాస్తవముగా బ్రహ్మమే కదా! 183

విశే॥ 1. సుషుప్తిలో జీవుడు బ్రహ్మమే అనటం ఎలా? జీవుడు బాగా అజ్ఞుడు కనుక ప్రాజ్ఞుడు. బ్రహ్మమేమో ఈశ్వరుడుగా సర్వజ్ఞుడు. చూడండి. "న బాహ్యం వేద నాంతరం", "స సర్వజ్ఞః సర్వవిత్" – అని ప్రశ్న. **సర్వం సుషుప్తిలో లేదు కనుక జీవునకు ప్రపంచజ్ఞానం లేదని సమాధానం. అజ్ఞత కాదు.**

2. జీవుడు ద్రష్ట అనేది సహజము. అది జాగరంలో ఉన్నది. స్వప్నంలో ఉన్నది. సుషుప్తిలో ఎందుకు లేదు. ద్రష్ట కావటం సహజం కనుక అది ఎపుడయినా ఉండవలసినదే – సమా – **దృశ్యం లేదు. అందువలన ఏదీ తెలియదు. తెలివి ఉన్నది. అదే ద్రష్ట.** తగలబెట్టటం స్వభావంగాగల అగ్ని తగలబడవలసిన పదార్థం లేనపుడు తగలబెట్టదు గదా! సుషుప్తిలో సమస్త ద్వైతము అధిష్ఠానమయిన ఆత్మయందే ఐక్యమయింది. కనుక ఆత్మకన్న భిన్నంగా ఏదీ లేదు. కనుకనే 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ'

3. జాగరాదులలో ప్రపంచం ఉన్నా అది మాయా కల్పితం గనుక మిథ్య కనుక వ్యావహారికమే కనుక పరమార్థతః అద్వైతమే. అట్లే మాయగూడ మిథ్యయే కనుక దానివలన గూడా ద్వైతమునకు భంగం రాదు. నిర్వికల్ప సమాధిలో మాయ ఉండదు. సుషుప్తిలో ఉన్నా అది మిథ్య. కనుక సుషుప్తిలో బ్రహ్మం తప్ప మరేదీ లేదు కనుక ద్వైతజ్ఞానం లేదు. కాని జ్ఞాన పదార్థం ఉన్నది. ద్రష్ట దృశ్యం, దృశి, చైతన్యం అన్నీ ఒకటే, అదే జీవుని స్వరూపం. అది

నిత్యం. ధర్మం కాదు. ధర్మమునే ధర్మిగా వ్యవహారంలో చెప్తున్నాము. దృశియే ద్రష్ట. ద్రష్టయే దృశి. అదే సాక్షి. నిత్యమయిన జ్ఞానం (దృశి) కర్తవ్యం కాదు, క్రియ కాదు. ఘటజ్ఞానం వంటి అనిత్య జ్ఞానాలు క్రియలు కావచ్చును.

4. జ్ఞానం (దృశి) అనిత్యం కాదు. అది అనిత్యం అని గ్రహించే జ్ఞానం ఏదీ లేదు. ఉన్నదంటే దానిని గ్రహించేందుకు మరోజ్ఞానం కావాలి. ఇలా అనవస్థ. తనను తనే గ్రహించటం కుదరదు. తనకుతనే కర్మ కర్త ఎలా అవుతుంది. (పైగా అనిత్యత్వం గ్రహించటం అంటే తన జన్మనాశాలను తనే గ్రహించటం – అది ఎలా కుదురుతుంది?) ద్రష్ట అని గ్రహిస్తున్నాము గదా! అంటారా? – చూపు పుట్టిన తరువాతనే గదా వాడు ద్రష్ట అయ్యేది. కనుక దృశి నిత్యమే. అదే ఆత్మ. "ద్రష్ట యొక్క దృష్టి" అను ప్రయోగమును బట్టి ద్రష్ట, దృష్టి వేరనిపిస్తున్నది గదా! సమా – ద్రష్ట రూపమయిన దృష్టి అని అర్థము. (రాహోః శిరః అన్నట్లు) కనుక ఆత్మ స్వరూపమయిన చైతన్యము నిత్యం అవినాశి. కనుక సుషుప్తిలో అది స్వస్వరూపముతో నున్న బ్రహ్మమే. అది సర్వావభాసకము కనుక సర్వజ్ఞము. సుషుప్తిలోనయినా సర్వం లేకపోయినా పూర్వస్థితిని బట్టి అది సర్వభాసకమనే చెప్పాలి. (నిజానికి జ్ఞానం లేదన్న విషయం, తాను, తన సుఖం భాసిస్తున్నాయి) లేదా సర్వం బ్రహ్మ రూపంగా ఉన్నది గనుక చైతన్యం సర్వ భాసనం చేస్తున్నట్లే.

5. జాగరాదులయందు మనస్సు సర్వావభాసకం అనరాదు. అది జడం. చిదాభాసం వలననే అది పని చేస్తుంది. మరయితే **బ్రహ్మం సుషుప్తిలో తనను తానే తెలుపుకొనటం కుదరదు గదా! తనకు తనే కర్మ కర్త కాదు గదా! సమా – అది కేవలం ఔపచారికం.** (ఒకడు జీవితంలో స్వయంకృషితో తట్టుకొని నిలబడితే వానిని మనం వాడు చాల జాగ్రత్తగా తనను తాను నిలబెట్టికొన్నాడు – అనటం వంటిది) కనుక జీవుడు సుషుప్తిలో స్వప్రకాశచైతన్యరూపంతో నుండును. ఇది సారాంశము.

**శ్లో॥ శబ్దాదిం విషయం సహాశ్రయమయం బాహ్యన్తథాఽభ్యన్తరం**
**జానన్నేవ తదా న వేద పురుషో నిత్యావగత్యాత్మకః ।**
**బాహ్యాభ్యన్తరసాధనైశ్చ రహితో యస్మాత్తత స్సర్వవి-**
**ద్బ్రహ్మైవాయమితీరయన్తి కతిచిన్మన్దా బుధా భూతలే ॥ 184**

భావ॥ ఆకాశాది ఆశ్రయములతో గూడిన బాహ్యమయిన శబ్దాది విషయములను, ఆంతరమయిన సుఖాదులను పురుషుడు గ్రహిస్తూనే ఉంటాడు. అతడు నిత్య విజ్ఞాన రూపుడు గదా! అయితే బాహ్య సాధనములయిన ఇంద్రియాలు ఆంతరసాధనమయిన మనస్సు పనిచేయక పోవటం వలన శబ్దాదులు విశేషంగా తెలియవు. సామాన్యంగా మాత్రమే గ్రహిస్తాడు. కనుక

పురుషుడు సర్వవిత్ సర్వజ్ఞుడు అయిన బ్రహ్మమే - అని కొంతమంది మందమతులు అంటారు. 184

విశే॥ 1. సుషుప్తిలో ద్వైతం లేదనటం తప్పు. ద్వైతం ఉన్నది. కనులు మూసినంత మాత్రమున రూపం లేదనగలమా? మనకు కనబడనంతమాత్రమున స్వర్గాదులు లేవా? శయ్యమీద పరుండిన పురుషునకు శయ్య తెలియదా? కప్పుకొన్న దుప్పటి తెలియదా? అయితే ఇంద్రియ లీనత వలన బాగా తెలియదు. కాని పురుషుడే విజ్ఞాన రూపుడు గనుక స్వతః విజ్ఞానం గలవాడు కనుక సామాన్యంగా అతనికి తెలుస్తుంది. విశేషంగా తెలియదు. జీవుడు సామాన్యాకారంగా సర్వజ్ఞుడే. సర్వవేత్తయే. ప్రాజ్ఞుడు సర్వజ్ఞుడే. బ్రహ్మమే - **అని మందుల మతము.**

2. అందువలన సామాన్యతః సర్వజ్ఞుడు విశేషంగా ప్రాజ్ఞుడు. సామాన్యతః శబ్దస్పర్శాదులు తెలుసు. విశేషతః తెలియదు.

**శ్లో॥ జాగ్రత్స్వప్నయుగే పుమాన్ భవతి సోఽద్వితోఽ ప్యవిద్యావశా-**
**ద్ద్రష్టైకోఽచ్ఛతరోఽమ్బువజ్జగదివ స్వాపే భవత్యద్వయః ।**
**పుంసామేష పరాయణం చ పరమాత్మా బ్రహ్మలోకః పరా**
**సమ్పత్తిః పరలోక ఏవ పరమానన్దశ్చ సజ్కీర్తితః ॥ 185**

భావ॥ జాగరణ స్వప్నములలోను పురుషుడు అద్వితీయుడే. కాని అవిద్యవలన అతడు ద్రష్టగా ఉన్నాడు. అతడు జలమువలె స్వచ్ఛమయిన ద్రష్టయే. (సలిల ఏకో ద్రష్టా) మరల సుషుప్తిలోనూ అతడు అద్వితీయుడే. జాగరణాదులలో జగత్తున్నట్లు కనబడుతుంది. సుషుప్తిలో అదీ ఉండదు. ఇతడు పురుషులకు పరాయణము. పరమాత్మ. బ్రహ్మలోకము పరమయిన సంపత్తి, పరలోకము పరమానందము అని ఇతడే చెప్పబడును. 185

విశే॥ 1. ఏకమేవాద్వితీయం బ్రహ్మ కదా! సద్వితీయుడని మీరు చెప్పిన ప్రాజ్ఞుడు బ్రహ్మభిన్నుడు కాడు. కనుక పైశ్లోకంలోని మందమతుల వాదము కుదరదు. బ్రహ్మభేదం చెప్పవలెనంటే ద్వైతం ఉండటం, దాని సామాన్యజ్ఞానము కుదరవు. అసలు సుప్త పురుషునకు ద్వైతం కనబడటం అనుభవరహితం. జాగరణ ద్వైతము భ్రాంతి సిద్ధం. రజ్జు సర్ప భ్రమ వలన సర్పం సత్యం కాదు గదా!

2. జాగరణ స్వప్నములలోని ప్రపంచం వాస్తవం కాదు. మిథ్య. అద్వైతం అని నిరూపితమయినది. ఏ రకంగానూ ద్వైతం కాదు. వెలుగు చీకటి కాదు. ద్రష్ట దృశ్యం కాదు. వెలుగు, వెలుగు చేత వెలుగవలసిన ఘటం కాదు గదా! కనుక అవిద్యాకృతమయిన ద్వైతము భ్రాంతి సిద్ధమే. సుషుప్తిలో విక్షేపరూపమయిన అవిద్య లేదు. అందువలన ద్వైతభ్రాంతి లేదు.

ఆవరణ రూప అవిద్య ఉన్నది. అందువలన ఏదీ ఆసమయంలో తెలియదు. కాని పునః జాగరణంలోకి వస్తాడు. అవిద్య రెండు రకాలు.

3. 1) ఆవరణశక్తి 2) విక్షేపశక్తి అందు ఆవరణశక్తి బ్రహ్మజ్ఞానం లేకుండా చేస్తుంది. విక్షేపశక్తి విషయసృష్టి ద్వారా ద్వైతభ్రాంతి కలిగిస్తుంది. ముందు ఆవరణం దాని ఆధారంగా విక్షేపం వస్తాయి. అధిష్ఠానమయిన రజ్జువు కనబడక పోతేనే కదా! సర్పం అనే విక్షేపం వస్తుంది. కనుక బ్రహ్మం ఆవృతమయితేనే ప్రపంచము కనబడుతుంది. ఈ ఆవరణశక్తినే బీజమని కారణశరీరమని అజ్ఞానమని అంటారు. ఇదే ప్రాజ్ఞుని ఉపాధి. అందువలన ప్రాజ్ఞునకు అహంబ్రహ్మ అను భావన రాదు. అవిద్యగూడా మిథ్య. అది శక్తి. అది ప్రాజ్ఞునికన్న భిన్నమని చూపలేము. కనుక సుషుప్తిలో ద్వైతం లేదు. అందువలననే పురుషునకు ద్వైతజ్ఞానం లేదు. శయ్యాజ్ఞానం సుప్తపురుషునకుండదు. చూచే వానికి మాత్రమే తెలుస్తుంది. పురుషుడొక్కడే కదా! సుప్త, అసుప్త భేదం ఎలా వచ్చిందంటారా? - అవిద్యవలన వచ్చింది. సుప్తునకు ఏదీ తెలియదు. జాగృతునకు అవిద్యవలన "నేను మేల్కొన్నాను, వీడు నిద్రించుచున్నాడు" అని తెలుస్తుంది. కనుక ద్వైతమంతా అవిద్యామయమే. అవిద్య ఉంటే ద్వైతం అవిద్య లేకుంటే ద్వైతం లేదు. (అవిద్య అంటే విక్షేపశక్తి) సుషుప్తి సమాధులలో అదే అనుభవం కదా! మనస్సుంటే అవిద్యామయమే. కనుక మనస్సుంటే ద్వైతం, లేదంటే ద్వైతం లేదనవచ్చును. కనుక అద్వితీయ సచ్చిదానంద రూప బ్రమ్మమే ప్రాజ్ఞుడు.

4. స్వర్గం మొదలయినవి పరమగతులు కావు. వాటినుంచి పునర్జన్మ సంభవము. మోక్షము నుంచి పునరావృత్తి లేదు. " న స పునరావర్తతే". ఆత్మ తాత్త్వికము. దేహేంద్రియాదులు తాత్త్వికములు కావు. అందువలన ఆత్మ పరమము. "పరమాత్మేతిచాప్యుక్తః దేహేస్మిన్ పురుషః పరః" - గీత. ఆత్మ బ్రహ్మం కనుక ఇదే బ్రహ్మలోకం. స్వర్గాదులు కావు. ఇతర సంపదలు మిథ్య. బ్రహ్మ సంపత్తి శాశ్వతము.

"అజో నిత్యః శాశ్వతః" గదా! విషయానందములు క్షణికములు. కనుక పరమములు కావు. ఆత్మ నిత్య నిరతిశయానంద స్వరూపుడు.

**శ్లో॥ ఆనన్దస్య కలాం సమే తనుభృతో హ్యస్యోపజీవన్త్యమీ**
**తస్మాదేష సమాధికానవధికానన్దః పరః కీర్తితః ।**
**రాజ్ఞస్సర్వమనుష్యభోగభరితస్యానన్ద ఆస్తే తు యో**
**మర్త్యానన్ద ఇమే శతం పితృతతేరానన్ద ఏకః పరమ్ ॥ 186**

భావ॥ సర్వప్రాణులు ఈ ఆనందుని యొక్క అంశనే అనుభవించుచు ఆనందించు చున్నారు. అందువలన ఈ ఆనందుడు సర్వాధికమయిన పరమానందముగా చెప్పబడినాడు.

సర్వమనుష్యభోగములచే భరితుడయిన మనుష్య రాజుయొక్క ఆనందమునకు 100 రెట్లు పితృ-దేవతానందము. (సాధారణ మనుష్యానందం అతి తక్కువదని చెప్పవలసిన పని లేదు) 186

విశే॥ విషయేంద్రియసంబంధంవలన వచ్చే ఆనందం అవిద్యాజన్యం. అది ఆ పరమా-నంద ప్రతిబింబము. **ఇష్ట లాభంవలన మనోవృత్తిలో ప్రతిబింబితమయిన బ్రహ్మానందం విషయా-నందంగా అనుభవంలోనికి వస్తుంది.** అది బ్రహ్మానంద సముద్రములోని బిందువుల వంటిది.

**శ్లో॥ ఆనన్దః పితృగోచరశ్శతగుణో గన్ధర్వలోకాశ్రయా-**
**నన్దస్స్యాత్స భవేచ్చ కర్మవిబుధానన్దశ్శతాంశాధికః ।**
**తేషాఞ్చాపి శతేన శుద్ధవిబుధానన్దస్సమోఽయం శతా**
**వృత్తిస్సమ్భవతి ప్రజాపతిగతానన్దస్స ఏకః పునః ॥ 187**

భావ॥ పితృదేవతానందము కన్న శతగుణమయినది గంధర్వలోకానందము. దానికన్న శతగుణమయినది కర్మదేవతల ఆనందము. దానికన్న 100 రెట్లు శుద్ధదేవతల (ఆజాన దేవతలు) ఆనందము. దీనికి 100 రెట్లు ప్రజాపతి ఆనందము. ప్రజాపతి = విరాట్టు. 187

విశే॥ జ్యోతిష్టోమాది కర్మలవలన దేవతలుగా అయినవారు కర్మదేవతలు. అచ్చటనే దేవతలుగా పుట్టినవారు ఆజాన దేవతలు. ఆజాన = ఆజన్మ.

**శ్లో॥ ప్రాజాపత్యపదాశ్రయాశ్శతమథానన్దా ఇమే బ్రహ్మణో**
**లోకే వేధస ఏక ఏవ పరమానన్దః స్మృతో వైదికైః ।**
**నిష్కామావృజినాహతాగమవిదోఽస్యానన్ద ఏషోఽధికో**
**యత్ర బ్రహ్మణి సమ్ప్రసాదవిషయే సర్వేఽపి యాన్త్యేకతామ్ ॥ 188**

భావ॥ విరాట్టును ఆశ్రయించిన ఆనందములు 100 అయితే బ్రహ్మలోకములలోని హిరణ్యగర్భుని ఆనందము (ఆదిత్యాంతర్వర్తి అయిన హిరణ్యగర్భుడు కాదు) ఈ హిరణ్యగర్భుని ఆనందము గలవాడు అకామ హతుడయిన అపాపహతుడయిన వేదవేత్త అయిన శ్రోత్రియునకు గలదు. ఈ ఆనందము సుషుప్తి లభ్యమయిన బ్రహ్మరూపమయిన ఆనందమునందు సముద్రంలో జలబిందువుల వలె కలిసి పోవును. 188

విశే॥ 1. శ్రోత్రియుని ఆనందము బ్రహ్మానందమే. అందులో హిరణ్యగర్భుని ఆనందముతో సహా అన్ని ఆనందములు కలిసిపోవును. అనగా నిష్కాముడై ముక్తి పొందిన వాని ఆనందము హిరణ్యగర్భానందమును మించిన నిరతిశయ బ్రహ్మానందము. దీనిలో హిరణ్యగర్భానందము కలిసియున్నదంటే అర్థము 100 రూపాయిలలో 10 రూపాయిలున్నాయి అన్నట్లు.

2. బ్రహ్మానందమునకు లెక్కలు లేవు. అది మహామహా సముద్రం. శతగుణితం సహస్ర గుణితం అంటూ లేదు. భూమికన్న ఆకాశం ఎన్నిరెట్లు అని ఎలా చెప్పగలము? హిరణ్యగర్భ

పదవీ కామం గూడా లేని వాని ఆనందం హిరణ్యగర్భానందమును మించినది. "యచ్చ కామ సుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్ తృష్ణాక్షయసుఖస్యైతే నార్హతః షోడశీం కలామ్"

3. సుషుప్తిలో బ్రహ్మానందము కలిగినా అది అదని తెలియదు. మనం అజ్ఞానులం కనుక. నిష్కాముడయిన శ్రోత్రియుడు సమాధిలో బ్రహ్మానందమును సాక్షాత్కరించికొంటాడు కనుక అది బ్రహ్మానందమని తెలుసును. లేదా, సమాధి లేకున్నా తృష్ణా క్షయం వలననే ఆ ఆనందం అనుభవం లోనికి వస్తుంది. అయితే సమాధి/తృష్ణాక్షయం/సుషుప్తి వీటిలోని ఆనందం ఒక్కటే - బ్రహ్మానందము. ఒకే బ్రహ్మానందం సుషుప్తి మొదలగు వానిలోను, భాసిస్తున్నది. అయితే మనుష్యానందాదులు విషయభోగజన్యములు కనుక అవి నశ్యములు. బ్రహ్మానందంతో సమానమయినవి కావు. బ్రహ్మానందం నిత్యం. అజన్యం. సుషుప్తి మొదలగు వానిలో మనస్సు ఆగటం వలన నిత్యబ్రహ్మానందమే వ్యక్తమవుతుంది. మనస్సు జాగరంలో ఆగదు. సుషుప్తిలో ఆగదు. మబ్బులు తొలగితే సూర్యుడు కనబడినట్లు మనస్సు తొలగితే బ్రహ్మానందము. అదే నిత్యం. మిగిలినదంతా తుచ్ఛము. అసత్యం. "తత్సత్యమతోన్యదార్తమ్".

**శ్లో॥ పశ్యత్యత్ర పుమాన్న కిఞ్చిదపి యన్నో వా శృణోతి స్వయం**
**నో జానాతి న జిఘ్రతి స్పృశతి నో న స్వాదయత్యేవ తత్ ।**
**భూమానన్ద ఉదీరితోఽయమమృతో మర్త్య స్త్వితోఽల్పః పరః**
**సత్యోఽసావత ఏక ఏవ నిఖిలం తస్మాదసత్యం పరమ్ ॥ 189**

భావ॥ ఈ ఆనందమున నిలిచిన వాడు దేనినీ చూడడు. దేనినీ వినడు. దేనినీ తెలిసికొనడు. దేనినీ వాసన చూడడు. దేనినీ స్పృశించడు. దేనినీ ఆస్వాదించడు. అదే భూమానందమని అంటారు. ఇది అమృతం. మర్త్యానందము దీనికన్న అల్పమయినది. అందువలన బ్రహ్మానందం ఒక్కటే సత్యము. దానికన్న భిన్నమయినదంతా అసత్యము. 189

విశే॥ భూమానందస్థితిలో మిథ్యా ప్రపంచం అసలు ఉండదు. రజ్జు ప్రత్యక్షదశలో సర్పం ఉండదు. కనుక బ్రహ్మణ్యుడయిన యోగికి బ్రహ్మదశ తప్ప మరేదీ ఉండదు. గోచరించదు. ఇది భూమ. కనుకనే అమృతము. బ్రహ్మయే ఆ ఆనందము "యో వై భూమా తదమృత మథయదల్పం తన్మర్త్యం" "తత్సత్య మతోన్యదార్తం","ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" విషయానందం భిన్నం అల్పం. నశ్యం. ఇది సుషుప్తిలోనూ, నిష్కాములయిన శ్రోత్రియులకున్ను ప్రత్యాక్షానుభవం.

**శ్లో॥ ఆరూఢం ప్రభుణా సమాహితమనః కశ్చిద్వ్రజత్యుద్ధ్వన-**
**ద్గ్రామం తద్విలపన్ స ఏష పురుషః ప్రాజ్ఞేన చ స్వాత్మనా ।**
**అన్వారూఢ ఇమాం తనూం పరిహరన్ క్వా ప్యూర్ధ్వముచ్ఛ్వాసవా-**
**న్యాతి ప్రాక్క్షణభావనోపకలితోద్బోధాత్మకర్మావశః ॥ 190**

భావ॥ రథికుడెక్కిన బండి ఆ రథికుడు పోదలచిన గ్రామమునకు చప్పుడు చేయుచు వెళ్లును. అట్లే ప్రాజ్ఞుడయిన ఆత్మచేత అధిష్ఠితుడయిన యీ జీవుడు ఈ శరీరమును వదలుచు ఎక్కడికో పోబోవుచు ఎగశ్వాస పీల్చుచూ మరణమునకు ముందే స్మరణకు వచ్చి పూర్వజన్మ కర్మ వలన అవశుడై బయలుదేరును. 190

విశే॥ 1. పురుషునకు అవిద్యవలన బంధము. అవిద్యానాశము వలన మోక్షము. అందులో బంధము అనునది జాగరణ స్వప్నములలో అనుభవసిద్ధము గదా! మోక్షం అనుభవ సిద్ధం కాదు. కనుక దానిని సుషుప్తి ద్వారా ఉదాహరించి సాధించాలి. అజ్ఞాన బీజమున్న సుషుప్తివలన వచ్చిన ఆనందము బ్రహ్మానందమే. అదే బీజ (అజ్ఞానం)రహిత మయినచో మోక్షము. అందువలన వైరాగ్యం కోసం ఈ నిర్యాణవర్ణన.

2. అజ్ఞానియొక్క మరణబాధను వర్ణించటం ద్వారా అందుకు కారణమయిన శరీరాధ్యాసతో జీవుడు మరలమరల జనన మరణాలు పొందటం జనన మరణ వేదనలు పడటం తప్పించికొనాలని యీ వర్ణన. యౌవనములోనే జ్ఞానసాధన అవసరమని చెప్పబడినది.

“కౌమార ఆచరేత్ ప్రాజ్ఞః ధర్మాన్ భాగవతానిహ. దుర్లభంమానుషం జన్మ తదప్యధ్రువ మర్థదమ్” భాగవతంలో ప్రహ్లాదుడు. కనుక కూపస్థ మండూక న్యాయంతో సంసారంలోనే పడియుండరాదు.

**శ్లో॥ పిణ్డోఽయం జరయా రుజా చ కృశతాం యత్రైతి లిఙ్గీ తదా**
**వృన్తాదామ్రఫలం యథా చలదలం వౌదుమ్బరం ముచ్యతే ।**
**పాకాన్తే శ్రుతిచక్షురాద్యవయవవ్యూహా దితో ముక్తవా-**
**నేవం ప్రాణవిశేషభోగకృతయే దేహాన్తరం గచ్ఛతి ॥ 191**

భావ॥ దేహరూప పిండము ముసలితనంచేత గాని రోగము చేతగాని చిక్కినపుడు లింగశరీరుడు పండిన మామిడి పండుగాని, దాని ఆకుగాని, అత్తిపండుగాని రాలిపడినట్లు నేత్ర కర్ణాది - ఇంద్రియ వ్యూహాత్మకమయిన యీ శరీరమునుండి బయలుదేరి ప్రాణవిశేష భోగములయిన అన్నపానాలకోసం మరో దేహమునకు వెళ్లును. 191

**శ్లో॥ ఆయాన్తం నృపతిం యథా విషయగసూతాదిరన్నైర్జనః**
**పానైరావసథైః ప్రతీక్షత ఇతి ప్రాప్నోత్యయం భూపతిః ।**
**ఏవం పూరుషమాపతన్తమఖిలం కర్మప్రయుక్తం జగ-**
**త్సిద్ధైః కర్మఫలోపభోగకరణైర్బ్రహ్మేదమాగచ్ఛతి. 192**

భావ॥ ఒక గ్రామానికి రాజుగారు పర్యటనకు వచ్చే సందర్భములో ఆ గ్రామంలోని కరణం మొదలయిన ప్రముఖులు అన్న పాన గృహాదులు సిద్ధము చేసి ఆయనకు స్వాగతం

చెప్తారు. రాజుగారు వస్తారు. అలాగే దేహమును వదలి బయలుదేరి వచ్చుచున్న లింగశరీరుని కొఱకు మన భోక్త కర్త అయిన ప్రభువు వచ్చుచున్నాడని కర్మ ఫలానుగుణమయిన నేత్రాదీంద్రియ-ములతో శరీరమును సిద్ధముచేసి యీ జగత్తు (భూమి ఆదిత్యుడు మొదలయినవి) ఎదురు చూచును. 192

**శ్లో॥ ప్రాణాన్ సమ్ముఖమాగతానయమజో గృహ్ణన్ ప్రయాస్యన్నితో**
**హృత్పద్మం ప్రవిశత్యపేతపురుషే లిఙ్గాత్మనైక్యం గతే ।**
**శ్రోత్రాదౌ కరణవ్రజేన పురుషో రూపాణి చష్టే న వా**
**జిఘ్రత్యేష శృణోతి నో స్పృశతి నో నో వక్తి నో మన్యతే ॥ 193**

భావ॥ మరణ విధానమునే మరల చెప్పుచున్నాడు. ప్రస్తుత శిథిల దేహమునుండి బయలుదేరిన జీవప్రభువు తనకెదురు వచ్చిన ప్రాణాదులను తీసికొని హృదయపద్మమున ప్రవేశించును. నేత్రాది - ఇంద్రియ సమూహము లింగ శరీరములో ఐక్యమయినది. అంతట మరణ సమీపముననున్న పురుషుడు రూపములను చూడడు. విషయములను, వినుట, వాసన చూచుట, స్పృశించుట చేయడు. పలుకడు. ఆలోచించడు. 193

**శ్లో॥ స్వప్నే వా హృదయామ్బరస్య సహసా ప్రద్యోతతేఽగ్రస్తదా**
**ప్రద్యోతేన స ఏష తేన పురుషో నిష్క్రామతి స్మావశః ।**
**దృక్తో మూర్ధపదాచ్ఛ్రుతేశ్చ వదనాన్నాసాన్తరాద్వా గుదా-**
**దుత్క్రామన్తమనూత్పతత్యమమసుః ప్రాణాశ్చ సర్వేఽప్యసుమ్ ॥194**

భావ॥ స్వప్న సమయంలోలాగా మరణసమయంలో గూడా హృదయాకాశం యొక్క నాడీముఖం హఠాత్తుగా వెలుగుతుంది. ఆ తేజస్సు వలన పురుషుడు అవశుడై శరీరమునుండి బయటకు పోవును. ఆ నిర్యాణము మాడునుండి గాని నేత్రమునుండిగాని, ముక్కునుండిగాని పాయువునుండిగాని జరుగవచ్చును. అట్లు బయటకు పోవుచున్న ఆ జీవుని అనుసరించి ప్రాణము దానివెంబడి ఇంద్రియాదులు శరీరమును వీడిపోవును. 194

విశే॥ 1. నేత్రమునుండి - సూర్యలోకము, మాడునుండి - హిరణ్యగర్భలోకము, చెవి మొదలగు వానినుండి - ఇతరలోకములు, గుదమునుండి - నరకం చేరును.

2. జీవుడు సర్వవ్యాపి. అతను నిర్గమించడు. ఇంద్రియప్రాణాలతో లింగశరీరము నిర్గమించును. అది చూచి జీవుడనుకొనటం అధ్యాస వలన వచ్చిన భ్రాంతి. లోకములోగూడా ప్రాణాలు పోయినవని వ్యవహారము. జీవుడు నిర్గమించాడని అంటారు. కారణం ప్రాణ జీవుల మధ్య తేడా గుర్తించకపోవటం.

3. హృదయాగ్రం వెలుగుతుంది. అనగా తేజోమాత్రను స్వీకరించటం ద్వారా వాసనారూప

మయిన ప్రాప్యమయిన ఫలవిషయానికి సంబంధించిన బుద్ధి వృత్తి రూపమయిన తన వెలుగు అనగా చైతన్యజ్యోతి చేత హృదయాగ్రము వెలుగును.

4. సుషుప్తి మరణములలో జీవునకు విశేష విజ్ఞానముండదన్నారు గదా! మరణంలో స్వప్నంలో లాగా విశేష విజ్ఞానమున్నదంటారు – ఎలా? – సమా – మరణకాలంలో ఏ జ్ఞానమూ లేదు. దానికి కాస్తముందు – స్వప్నములోలాగా విశేష జ్ఞానం ఉంటుంది. సుషుప్తికి ముందు స్వప్నం ఉండవచ్చుగదా! కనుక ఆ విశేష భావనను బట్టి అందుకు అనుకూలమయిన దేహాంతర లోకాంతరములు వచ్చును. ఈ జ్ఞానము గూడా స్వప్న జ్ఞానమువలె జాగరణ సంస్కారం వలన వచ్చేదే. కాని ఇది మనచేతిలోనిది కాదు. నేను ఇవ్వాళ కలలో ఫలానాది చూడాలని ఎవడు స్వప్నదృశ్యం ముందుగా నిశ్చయించలేడు గదా! కర్మానురూపంగా ఏ విజ్ఞానం వస్తుందో తెలియదు. కనుక వ్యక్తి "యాంతేమతి స్సాగతిః" కనుక జాగరణ, జీవిత దశలలో దేవతోపాసనాదులతో చిత్తమును శోధించినచో ఆ సంస్కార వశమున మరణ కాలమునకు శుభమయిన విశేషజ్ఞానము రాగలదు. దానివలన పుణ్యజన్మ రాగలదు. యోగాభ్యాసం వలన నయితే స్వతంత్ర విజ్ఞానం రాగలదు. కనుక యోగాభ్యాసం పరమశ్రద్ధతో చేయాలి (బ్రహ్మజ్ఞానికి ఇవి ఏవీ లేవు. నిర్యాణమే లేదు. అచ్చటనే లయం)

**శ్లో॥ గత్వాఽన్తం స్వతృణస్య చాపరతృణం స్వాక్రమ్య పద్భ్యాం తృణం**
**ప్రాచీనం హి జలాయుకా త్యజతి కౌ దేహీ తథాఽయం పరామ్ ।**
**ఆక్రమ్యైవ తనూం హృదా త్యజతి తాం పూర్వాం తనూం ప్రజ్ఞయా**
**ప్రాక్తన్యా కలితః కృతేన భవతి ప్రాచీనయా విద్యయా ॥ 195**

భావ॥ దేహాంతర స్వీకారం ఇట్లుండును. గడ్డి జలగ తానున్న గడ్డి కొనను వదలేముందు ముందుకాళ్లతో అవతలి గడ్డి కొనను ఆక్రమించి తరువాత పాత గడ్డికొనను వదలును. అట్లే దేహధారి తరువాత రాబోవు శరీరమును ఆక్రమించి పూర్వ శరీరమును వదలును. ముందు జన్మలలోని బుద్ధి, కర్మ, విద్యలతో కలిసియే యుండును. 195

విశే॥ 1. "సుకృతం దుష్కృతం చైవ గచ్ఛంతమను గచ్ఛతి" అని స్మరణం. జన్మతః ఆరోగ్యం, విద్య, ధనం, కళలు, రోగాలు, వికలాంగత రూపం ఇలా ఉండటానికి కారణం పూర్వజన్మార్జితమయిన కర్మ, బుద్ధి విద్య అని చెప్పాలి. ఈ విచిత్రతకు ఆవిచిత్రతయే కారణం. కనుక జీవద్దశలో సమస్త మానవులు సత్కర్మలు చేయాలి.

**శ్లో॥ పేశస్కృత్ప్రకలయ్య పూర్వమశివం పేశః పరం మఙ్గలం**
**పేశస్స్తనుతే యథా తనుమిమాం జీర్ణాం పరిత్యజ్య నా ।**
**సవ్యమ్మఙ్గలమన్యదేవ కురుతే కర్మానురూప స్తథా**
**రూపం పిత్రమరప్రజాపతివిధిక్ష్మాభ్రాదిలోకాశ్రయమ్ ॥ 196**

భావ॥ పేశస్కృత్ = సువర్ణకారుడు అంతకుముందున్న శిథిలమయిన సొమ్మును, కాల్చి శుద్ధి చేసి కొత్తగా మెరుగుపెట్టినట్లు, లేదా సాలె పురుగు లేదా నేతగాడు, శిథిలమయిన దారములను వదలి కొత్తదారములతో కొత్త గూటిని లేదా వస్త్రములను నిర్మించినట్లు, పురుషుడు మరణ సందర్భమున తన పాత పంచభూతాత్మకమయిన దేహమును వదలి (అందులోని భూతములను నలుగజేసి) క్రొత్తగా కర్మానురూపముగా పితృ, దేవ, ప్రజాపతి, విధి, భూలోకాది గతమయిన రూపములను నిర్మించికొని అందులోకి చేరును. లేదా, ఈశ్వరుడు నిర్మించిన అట్టి రూపములలోనికి చేరును. 196

విశే॥ 1. తృణము నుండి మరో తృణమునకు గడ్డి జలగ చేరినట్లు జీవుడు దేహము నుండి మరో దేహమును చేరును. ఈ క్రొత్త దేహమును పూర్వదేహమును ప్రారంభించిన భూతపంచకమే ప్రారంభించునా? క్రొత్త భూతపంచకమా? అని ప్రశ్న.

2. పాత సొమ్మును కాల్చి శుద్ధి చేసి మెరుగుపెట్టినట్లు అవే భూతపంచకమునకు మెఱుగు పెట్టి మరల ఆభరణము తయారు చేసినట్లు పాత భూతపంచకములనుంచియే క్రొత్త శరీరము మెఱుగులీనుచు తయారగును.

3. జీవుడే జ్ఞానకర్మలద్వారా తన శరీర స్రష్ట అని సప్తాంత బ్రాహ్మణమున చెప్పబడినది.

4. పేశస్కృత్ - పేశస్కారః అనగా సువర్ణకారుడు, సాలెపురుగు, సాలెవాడు మొదటి అర్థంలో పాత సొమ్ముతోనే శుద్ధి ద్వారా క్రొత్త సొమ్ము. రెండవ అర్థములో కొత్త జిగురుతోనే కొత్తగూళ్లు అల్లిక. మూడవ అర్థములో క్రొత్తదారాలతో క్రొత్త వస్త్రము లాగా జీవుని శరీర నిర్మాణము. అందులో జీవుడు తానే చేయటము. లేదా ఈశ్వరుడు శరీర నిర్మాణము చేయటము. ఏదయినా నిర్మాణ సామగ్రి భూతపంచకము. అది పాతది లేదా క్రొత్తది అన్న వికల్పము.

5. జీవుడు పరమాత్మ. తన అవిద్యచేత బయటకు వచ్చిన ప్రాచీన శరీరమును నశింపజేసి క్రొత్తరూపమును నిర్మించును. పరమాత్మయందు కల్పితమయిన భూతపంచకమునుండియే ఈ అవిద్య దేహపరంపరను సృష్టించును.

6. సాలెపురుగు స్వయంగా దారాలను సృష్టించినట్లు జీవుడే దేహపరంపరను సృష్టించును. లేదా, ఈశ్వరుడే సృష్టించిన శరీరములని మరొక పక్షము. ఇది నేతగాని పక్షము. "వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి తదాశరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ"

7. ఏదయినా ఉపాదానం భూతపంచకం. దానినుండి శరీర పరంపర. అన్ని పాంచ-భౌతికములు కదా! అనంతభూతపంచకములను కల్పించటం వ్యర్థం. భారం. భూతపంచకంలో

ఒక భాగం ఉత్తర శరీరం అవుతుంది. ఎందుకంటే ప్రకృతదేహం మనకన్నుల ముందే భస్మం అయినది గదా!

**శ్లో॥ బ్రహ్మైవైష తమోమయో మతిమయస్స్వాన్తాత్మకోఽ స్వాత్మకో**
**దృగ్రూపశ్రుతిరూప ఇన్ద్రియమయః క్ష్మామ్బ్వగ్నివాయ్వాత్మకః ।**
**ఖాత్మా కామమయోఽ ప్యకామ ఇతరుణ్నీరుట్చ ధర్మాత్మకోఽ**
**ధర్మాత్మా తదిదమ్మయస్సమమయశ్చాదోమయస్తన్మయః ॥ 197**

భావ॥ ఈ జీవుడు బ్రహ్మమే. కాని యితనికి సంసారం రకరకాల ఉపాధుల వలన వచ్చినది. కాని అజ్ఞాన ఉపాధివలన అజ్ఞాని అవుతాడు. నేను అజ్ఞానిని అనుకొంటాడు. బుద్ధితో తాదాత్మ్యం పొంది "నేను నిర్ణయం తీసికొన్నాను" అంటాడు. మనస్సుతో తాదాత్మ్యం పొంది నేను సుఖిని దుఃఖిని అనుకొంటాడు. ప్రాణాలతో తాదాత్మ్యం పొంది ఆకలి దప్పికలు పొందుతాడు. ఇంద్రియాలతో అందున నేత్ర తాదాత్మ్యాధ్యాసతో "నేను చూస్తున్నాను" అంటాడు. అలాగే చెవులతో తాదాత్మ్యం పొంది వింటున్నాను అంటాడు. అలాగే ఇంద్రియ తాదాత్మ్యభ్రమతో ఆయా ఇంద్రియానుభవం పొందుతాడు. స్థూల శరీరతాదాత్మ్యం పొంది భూమిమయుడుగా చేపల వలె జలమయుడుగా పక్షివలె ఆకాశ (వాయువు) మయుడుగా, దేవతల వలె తేజోమయుడుగా – అలా అవుతాడు. అలాగే రకరకాల కోరికలతో కామమయుడు అవుతాడు. విరక్తి పొందినవాడే నిష్కాముడు కాగలడు. కామ భంగమయి క్రోధి కాగలడు. శమదమాదులతో అక్రోధుడూ కాగలడు. ఇదంతా మనోమయుని లక్షణాలుగా చెప్పబడినవి. (ధర్మి అధ్యాస = మనోమయుడు ధర్మ్యధ్యాస కామమయుడు క్రోధమయుడు) అలాగే ధర్మమయుడు, అధర్మమయుడు వాటికారణంగా మరల మనుష్యాది శరీరమయుడు. రాబోయే దేవాది శరీరమయుడు, దూరంగా కనబడే నక్షత్రాదిమయుడున్నూ కావచ్చును. సర్వమయుడున్నూ అగును. జగమంతా ఆత్మయందే కల్పితం కదా! సర్వోపాధులతో తాదాత్మ్యం పొందినది ఒకే చైతన్యము కనక సర్వమయుడు. 197

విశే॥ 1. అజ్ఞానాధ్యాస అనాది – దీనికి కారణం తెలియదు. "జీవ ఈశో విశుద్ధాచిత్ తథా జీవేశయోర్భిదా, అవిద్యా తచ్చితోర్యోగః షడస్మాకమనాదయః" అజ్ఞాన చైతన్యముల మధ్య సంబంధం అనాది. దీనిని కారణాధ్యాస అంటారు.

2. "సర్వేంద్రియాణాం నయనం ప్రధానం" కనుక ప్రత్యేకంగా నేత్రం గూర్చి చెప్పాడు. లేదా దృక్, శ్రుతి అనునవి జ్ఞానేంద్రియ సూచన. ఇంద్రియమయ అనునది కర్మేంద్రియ సూచన. ఈ మొత్తం వలన ఆనందమయ విజ్ఞానమయ మనోమయ ప్రాణమయకోశములు చెప్పినట్లు అయినది. కారణ సూక్ష్మ(లింగ) శరీరముల గూర్చి చెప్పినట్లయినది. తరువాత అన్నమయ

కోశము, స్థూలశరీరముల గూర్చి చెప్తున్నారు. ఈ విధంగా ఆత్మ దేహేంద్రియాది కార్యకారణ సంఘాత రూపమయినది.

**శ్లో॥ కామాత్మా పురుషో యమిచ్ఛతి మమ స్యాదేష ఇత్యశ్నుతే**
**తత్రైవాధ్యవసాయమేవ కురుతే తన్నిశ్చితార్థప్రదమ్ ।**
**కర్మేదం యది పుణ్యమేష పురుషస్సాధుర్భవత్యన్యథా**
**పాపీ తత్ఫలమేతి కామవశతస్సంసార ఏష ప్రభోః ॥ 198**

భావ॥ సంసారమూలం కామము. అనగా శృంగారవాంఛ ఒక్కటే కాదు. సర్వకామములు. పురుషుడు కామమయుడు. ఈ కోరిక తీరవలయునని కోరికొనును. దానియందే నిశ్చయము చేయును. నిశ్చయమయిన వాంఛను తీర్పగల కర్మను చేయును. అది పుణ్యకర్మ అయితే పురుషుడు సజ్జనుడవుతాడు. పాపకర్మ అయితే పాపి అవుతాడు. కనుక సంసారము ప్రభువయిన జీవచైతన్యము యొక్క కామమువలన ఏర్పడును. కనుక కామమే నిర్మూలనీయము. “కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః, మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహవైరిణమ్” కామ భంగం వలన క్రోధం వస్తుంది. కామసాధన కోసం వస్తుంది. కనుక కామ పరిణామమే క్రోధం కనుక తత్త్వతః సంసార మూలము కామము. 198

**శ్లో॥ చిత్తం యత్ర నిషక్తమస్య పురుషస్యాన్తే సమం కర్మణా**
**లిఙ్గం తత్పదమేతి భోగవశతస్తత్ర క్షతే కర్మణి ।**
**తస్మాల్లోకత ఐతి లోకమిమముచ్ఛిష్టేన నా కర్మణా**
**కర్తుం కర్మ కరోతి తత్పునరిహాస్యాన్తే మృతిం గచ్ఛతి ॥ 199**

భావ॥ మరణ సమయమున దేనిమీద పురుషుని మనస్సు లగ్నమయినదో అట్టి శరీరమునకే అతని లింగశరీరము అతని కర్మశేషములతో సహా చేరును. అచ్చట అనుభవం ద్వారా కర్మఫలం క్షయమయిన తరువాత ఆలోకమునుండి మరల యీ లోకమునకు వచ్చును. వచ్చునపుడు కొంత కర్మశేషం “అశయ” రూపంగా నుండును. దానితో మరో కర్మారంభమునకు వచ్చి అట్టి కర్మ చేసి మరల దాని ఫలమును పొందుటకు మరణించును. “క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి” గదా! – గీత. 199

**శ్లో॥ కామాత్మా పురుషస్తదేవమయతే మృత్యుఞ్చ జన్మాసకృ-**
**న్నిష్కామో బుధ ఆప్తకామ ఇతరో యస్త్వాత్మకామః పుమాన్ ।**
**నోత్క్రామన్త్యసవో హి తస్య పరమే లీయన్త ఏవాత్మని**
**బ్రహ్మైవైష భవన్బుధః పునరపి బ్రహ్మైవ సమ్పద్యతే ॥ 200**

భావ॥ ఇట్లు కామమయుడయిన పురుషుడు జనన మరణములను మాటి మాటికి

పొందగలడు. కాని ఆత్మకాముడై అందువలన ఆత్మదర్శనము పొంది ఆప్తకాముడై ఇక నిష్కాముడై, లేదా ఇతర కామరహితుడై ఆత్మకాముడైనవ్యక్తి ఆత్మ దర్శనం వలన ఆప్తకాముడవుతాడు. అట్టి నిర్గుణజ్ఞానియొక్క ప్రాణములు ఉత్క్రమించవు. అది పరమాత్మలో లీనమగును. ఆ జ్ఞాని స్వయంగా బ్రహ్మమై బ్రహ్మములోనే విదేహముక్తిలో లీనమగును. ప్రాణములాత్మ కార్యములు (వివర్తము) కనుక ఆత్మయందే లయమగును. అవిద్యతో వచ్చిన సంసారిత్వం విద్యతో లొంగగా సహజమయిన బ్రహ్మత్వం బయటపడుతుంది. కనుక ముముక్షువు తత్త్వవేత్త కావలయును. 200

**శ్లో॥ ముచ్యన్తే సకలా యదాస్య హృదయే కామాశ్రితా గ్రన్థయో**
**బ్రహ్మాస్మీతి ధియా తదైష పురుషో జీవన్నపి బ్రహ్మతామ్ ।**
**ప్రాప్నో త్యేవ తనావముష్య మమతా నైవాస్త్యహన్తా యతో**
**నిర్మోకే ఫణిపుఙ్గవస్య తు యథా నాకౌ విసృష్టే నిజే ॥ 201**

భావ॥ 'అహం బ్రహ్మాస్మి" అను జ్ఞానముతో జ్ఞానియొక్క హృదయగ్రంథులు, సకల కామములు విముక్తమయిననాడు పురుషుడు నడయాడు బ్రహ్మమే అగును. అనగా జీవన్ముక్తుడగును. అతనికి శరీరము మీద "నేను" అను అహంకారము "నాది" అను మమకారము గాని ఉండవు. ఎలాగంటే, పుట్టలో వదలబడిన కుబుసం మీద సర్పరాజునకు అహంకార మమకారములుండవు గదా! (లేదా, వదలిన పుట్టమీద (స్థూల శరీరం) వదల బడిన కుబుసము మీద (లింగ శరీరం) ఉండవు గదా!) 201

విశే॥ 1. "అశరీరం వా వ సంతం ప్రియా ప్రియే నస్పృశతః" అదే మోక్షము. నేను లావు, ఎరుపు అలాగే కులము ఇవి స్థూల శరీరాభిమానములు.

2. కామ రాహిత్యం వలన శరీరాభిమానం పోతుంది. కామరాహిత్యం అజ్ఞాన నాశం వలన వస్తుంది. అజ్ఞానం "అహం బ్రహ్మాస్మి" అను జ్ఞానం వలన పోతుంది.

3. తత్త్వవేత్త తనదృష్ట్యా జీవుడుగాడు. జీవించడు. బ్రహ్మమే అతడు. అతడు జీవించటం చూసిన లోకము అతనిని జీవన్ముక్తుడంటుంది. జీవన్ముక్తుడు తన శరీరమును విడిచిన కుబుసంగా జ్ఞానదృష్టితో చూస్తాడు. కాని ప్రాణాలున్నంతవఱకు అది కదలుతుంది. ప్రారబ్ధావసానం కోసం అది ఎదురుచూస్తుంది. చూడండి. భాగవతం. "దేహోపి దైవవశగః ఖలు కర్మ యావత్ స్వారంభకం ప్రతిసమీక్షత ఏవ సాసుః" జీవన్ముక్తునకు సంసారం మరల రాదు. కనుక శరీరాభిమానరహితుడు జీవన్ముక్తుడు.

**శ్లో॥ జీవన్నేవ శరీరిభావరహితో యస్సోఽయమస్యాన్తనౌ**
**త్యక్తాయామహినేవ చర్మణి కథం హాహా శరీరీ భవేత్ ।**

**ముక్తోఽసావశరీర ఏవ వపుషా ప్రాణాదిభిశ్చామృత-**
**స్సత్యం జ్ఞానమనన్తమక్షరమజం బ్రహ్మైవ మోదాత్మకమ్ ॥ 202**

భావ॥ జీవించి యున్నను తాను శరీరినన్న భావము లేనివాడు జ్ఞాని. అతను శరీరం మీద తానని తనదని భావము లేకుండా కుబుసము వదలిన పాము వలె విరాగియై ఉంటాడు. ఇక అతను దేహధారి ఎలా అవుతాడు? ఇక శరీరము ప్రాణాదులు పోయిన తరువాత అమృతస్వరూపుడయిన ఆ పురుషుడు సత్యజ్ఞానానందమయము, అనంతము, అక్షరము, అజము అయిన బ్రహ్మమే. "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" గదా! 202

విశే॥ 1. ఇట్టి జీవన్ముక్తునకే విదేహముక్తి కలుగును. శరీరం ఉన్నపుడే విముక్తుడయిన వానికి శరీరనాశం తరువాత బంధమేమియుంటుంది.

2. జీవుడు అసంగుడయినా అపరిచ్ఛిన్నుడయినా అజ్ఞానం వలన వచ్చినట్లున్న శరీరం జ్ఞానం వలన పోయినట్లవుతుంది.

3. జీవించినా శరీరం పోయినా జ్ఞానికి శరీరం మీద అభిమానం లేదు. అందుకే రెండుసార్లు కుబుసం ఉపమానంగా చెప్పటం జరిగింది. ఏదయినా శరీరాభిమానం లేదన్నది నిశ్చయం.

4. **మోక్షం ఆనందాత్మకం. కనుక అద్వైతుల మోక్షము పాషాణప్రాయమను ద్వైతివాదము తప్పు. ఆనందమే మనస్వరూపం.** మన అనుభవం. అది స్వయంప్రకాశము. దానికి అనుభవ సాధనములక్కరలేదు.

**శ్లో॥ మోక్షస్యాస్య పురాతనోఽస్తి వితతోఽణుర్జ్ఞానమార్గః పరే**
**శుక్లాద్యాస్త్రిదివాదిలోకగతయోఽవిద్యాకృతే తామసే ।**
**నానన్దస్తమసి త్రివిష్టపముఖస్థానేషు తాపాదికం**
**మోక్షే కోఽపి న దోష ఇత్యభిరతా విజ్ఞానమార్గే బుధాః ॥ 203**

భావ॥ మోక్షమునకు విస్తీర్ణమయిన గహనమయిన జ్ఞానమార్గమున్నది. కాని యోగులు సగుణ బ్రహ్మోపాసకులు చేరు మార్గములు అనేకములు కలవు. శుక్ల నీల హరితాది మార్గములు. ఇవి స్వర్గాది లోకములకు దారులు. అవి అవిద్యరూపమయిన వేదత్రయి చెప్పిన కర్మమార్గములు. తామసములు. అవిద్యయూ తామసమే. తామసమార్గములలో ఆనందము లేదు. ఇంద్రాది లోకములలో మనస్సుకు తాపం ఉంటుంది. మనకన్న గొప్ప కర్మఠుల భోగాలను చూచి తాపము. తన పుణ్యం అయిపోతున్నదన్న భయము. మరణదుఃఖము. కాని జ్ఞానరూపమయిన మోక్షము నందు ఇట్టి దోషములు లేవు. ఎందుకంటే జ్ఞానము బ్రహ్మమే కదా! దీనినుండి పునరావృత్తి

లేదు – బ్రహ్మలోకమునుండి గూడా పునరావృత్తి యున్నది. “ఆ బ్రహ్మభువనాత్ లోకాః పునరావర్తినోర్జునాః” – గీత. కనుక పండితులు జ్ఞానమార్గము నాశ్రయించెదరు. 203

**శ్లో॥ బ్రహ్మైకం ధ్రువమప్రమేయమరజో వ్యోమ్నః పరం సన్మహత్**
**జ్యోతిర్జ్యోతిరజం గుహాహితమిదం చిత్తైకవేద్యం సుఖమ్ ।**
**అద్వైతం శివమస్మ్యహం తదితి యో జానాతి కస్యాప్తయే**
**సన్తప్యేత స విశ్వకృత్స సకలస్యాత్మాఽస్య చాత్మా సమమ్ ॥ 204**

భావ॥ బ్రహ్మం ఒక్కటే ధ్రువం. అప్రమేయం. ఇంద్రియ ప్రత్యక్షం కాదు. రజో రహితం, ఆకాశం కన్న పరమయినది, మహత్తు ఆదిత్యాది నేత్రాది జ్యోతులకు జ్యోతి. హృదయ గుహయందున్నది, అనుభవైక వేద్యము, ఆనంద రూపము, అద్వైతము, మంగళము అయిన ఆ పరోక్షమయిన ఈశ్వరరూప బ్రహ్మము, ఈ అపరోక్షమయిన జీవరూప బ్రహ్మము “అంతయు నేనే” అని ఎరిగిన వాడు దేనికోసం ఏదికావాలని సంతాపం చెందుతాడు. అతడే విశ్వకర్త గదా! అతడే సర్వాత్మ కదా! అంతయు అతని స్వరూపము గదా! 204

విశే॥ 1. తత్ = పరోక్షమయిన ఈశ్వరుడుగా ఉన్న చైతన్యం. ఇదం = అపరోక్షంగా ఉన్న జీవచైతన్యము. లేదా, తత్ = సర్వనామం కనుక సర్వాత్మకమయిన బ్రహ్మం. ఇదం = ప్రత్యగాత్మ అయిన బ్రహ్మం. లేదా తత్ = పరోక్షమయిన జగద్రూపమయిన బ్రహ్మం. ఇదం = ప్రత్యక్షమయిన జగద్రూప మయిన బ్రహ్మం. ఏదయినా “అహం బ్రహ్మాస్మి” అన్నదే జ్ఞానము. బ్రహ్మాత్మ భావము, సర్వాత్మ భావము చెప్పినట్లయినది.

2. శివం = నిర్దోషం కనుక. ద్వైతం లేదు కనుక నిర్దోషం. ఏకం కనుక నిర్మలం (రజస్సు లేనిది) కనుకనే సుఖమయినది. జన్యము కాదు కను అజము, కనుకనే ధ్రువము, (జన్యం అయితే నశ్యము కదా!), వృద్ధి మొదలయిన వికారములు లేవు కనుక సత్యము. నిర్వికారమయినా జడము కాదు. చైతన్యస్వరూపం, అందుకని అల్పమయిన వృత్తి చైతన్యం కాదు. మహత్ – చైతన్యము, ఆకాశం కన్న మహత్ – జ్యాయానాకాశాత్ – గదా! లేదా, ఆకాశం జడం ఇది అజడం, లేదా, భూతకారణమయిన ఆకాశమునకున్ను కారణమయినది – ‘ఆత్మన ఆకాశః’ కదా! ఇంద్రియ గ్రాహ్యం కాకపోయినా శుద్ధచిత్తమున కందుతుంది. చిత్తమున కందటానికి కారణం చిత్తగుహలోనే ఆత్మ లభ్యమవుతుందుండటం. లేదా, బుద్ధి గుహలో ప్రతిబింబించటం. అనగా బ్రహ్మసాక్షాత్కారం ప్రత్యగాత్మగానే జరుగుతుంది. “ఇహ ప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః” అని సర్వశరీరగుహావ్యాప్తం అనవచ్చును.

3. ఆత్మయందే సర్వం కల్పితం కనుక ఆత్మరూపుడయిన జ్ఞాని సర్వమునకు ఆత్మ కావచ్చును. రజ్జువు రజ్జుసర్పమునకు ఆత్మ కదా! కాని యీ సర్వం ఆత్మజ్ఞానికి ఆత్మకావటం

ఏమిటి? సమా – కనబడేదంతా బ్రహ్మమే గదా! సర్వం వస్తుతః రజ్జువే కదా! **కనుక జ్ఞాని బ్రహ్మకు ఆత్మ. బ్రహ్మం జ్ఞానికి ఆత్మ – అని బ్రహ్మ ప్రత్యగాత్మల అభేదం ఇచ్చట తాత్పర్యము.** వీరు భిన్నులు కారు గదా! ఉభయులూ సచ్చిదానందరూప పరబ్రహ్మములే. ఉపాధివలన భిన్నతా భ్రాంతి. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" కదా! అట్టి బ్రహ్మాత్మైక్య జ్ఞానమే మోక్షహేతువు. భిన్నాత్మ జ్ఞానము భయహేతువు. తన కన్న అధికుడయిన ప్రభువయిన ఈశ్వరుడు భయహేతువు గదా! "భీషాస్మాద్వాతః పవతే" "ద్వితీయాద్వైభయం భవతి" "మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" అని గదా! కనుక ముముక్షువు అద్వైతజ్ఞానమునే సంపాదింపవలయును.

**శ్లో॥ ప్రాజ్ఞం పాపమిమం కృతం తపతి నో పుణ్యఞ్చ నైవాకృతం**
**నిత్యోఽయం మహిమా కృతేన విదుషో వృద్ధిం క్షయఞ్చైతి నో ।**
**ఏవంవిత్ క్షితిశాన్తిదాన్త్యుపరతిశ్రద్ధాసమాధానవా-**
**నాత్మానం సమవైతి చాత్మని బహిశ్చాత్మానమేతత్సమమ్ ॥ 205**

భావ॥ జ్ఞానికి కర్మశేషం ఉండదు. చేసిన పాపమయినా చేయని పుణ్యమయినా అతనిని బాధింపదు. అద్వైత జ్ఞానియొక్క మహిమ నిత్యమయినది. ఇది కృతమయిన కర్మలవలన పెరుగదు. తరుగదు. ఇలా తెలిసిన జ్ఞాని క్షమ, శమము, దమము, ఉపరతి, శ్రద్ధ, సమాధిగల వాడై, తనయందే ఆత్మస్వరూపమును గమనించును. బాహ్యమయిన ఈ ప్రపంచమంతా ఆత్మరూపంగా గ్రహిస్తాడు. "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" భిన్నమయినది లేదు. "నేహ నానాస్తి కించన" 205

విశే॥ 1. సంచిత పుణ్యపాపములన్ని జ్ఞానాగ్ని చేత భస్మమయినవి. పుణ్యం బంధకం కనుక అది చేయలేదని అతనికి దిగులు లేదు. లేదా, ఆత్మ అక్రియం కనుక, పాపపుణ్యాలు అంటవు కనుక వాటికి సంబంధించిన సంతాపము లేదు. లేదా, ఆత్మతప్ప మిగిలినదంతా మిథ్య కనుక పాపపుణ్యములు లేవు. కనుక జ్ఞానికి పాపపుణ్య విషయమయిన సంతాపము లేదు.

2. శుభకర్మవలన వృద్ధి పాపకర్మలవలన క్షయం గాని జ్ఞానికి లేవు. వృద్ధి క్షయములున్నట్లయితే జ్ఞానం లేదా మోక్షం అనిత్యం అవుతుంది. కనుక "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" – గీత. నిషిద్ధ కర్మలను వదలి విహిత కర్మలను చేసి శుద్ధ చిత్తుడయిన వాడే జ్ఞానమార్గమునకు వస్తాడు. కనుక అతనికి ఇంక కర్మలతో పనిలేదు.

3. క్షితి = క్షమ, ద్వంద్వం ఓర్చుకొనటం, ద్వంద్వం = శీతోష్ణ, సుఖదుఃఖాదులు, శాంతి = అంతరింద్రియములనిగ్రహం, దాంతి = బహిరింద్రియ నిగ్రహము, ఉపరతి = కర్మ సన్న్యాసము. శ్రద్ధ = ఆస్తికత, సమాధానం = చిత్త – ఏకాగ్రత.

**శ్లో॥ ముఖ్యం సాధనమత్ర వేదగదితస్సన్న్యాస ఏవైషణా-**
**త్యాగాత్స్వస్థమతిర్యదఙ్చతి యతిస్స్వాత్మానమత్రాద్వయమ్ ।**
**యస్సర్వం పురుషాత్మకం కలయతే కుర్యాత్కథం కర్మ స**
**ప్రాప్తస్తద్విదుషోఽ ప్రయత్నవశతస్సన్న్యాస ఏవోత్తమః ॥ 206**

భావ॥ జ్ఞానమునకు ముఖ్యమయిన అంతరంగ సాధనము - సన్న్యాసము. అది వేద ప్రోక్తము. వాంఛాత్యాగం వలన స్వస్థత గల బుద్ధి గలవాడయిన ముముక్షువు ఈ సన్న్యాసం వలననే అద్వితీయమయిన ఆత్మరూపమును దర్శింపగలడు. సమస్తప్రపంచమును బ్రహ్మస్వరూపం గా ఆత్మస్వరూపంగా గ్రహించిన జ్ఞాని కర్మలు చేయలేడు. వానికి సన్న్యాసం సహజంగానే వస్తుంది. కనుక అదే సన్న్యాసం అతనికి ఉత్తమ ఉపాయము. 206

విశే॥ జ్ఞానికి సన్న్యాసం సహజం కావచ్చును. జిజ్ఞాసువుకు సన్న్యాసం ఎలా సిద్ధిస్తుంది? సమా - "ఆత్మైవేదం సర్వం" అని అపాతతః తెలిసిన వాడయినా ఆతనికి సాధ్య సాధనములకు సంబంధించిన వాంఛలు లేవు కనుక కర్మసన్న్యాసం అవసరం అవుతుంది. లేదా, జిజ్ఞాసువుకు జ్ఞానం కోసం సన్న్యాసం ప్రయత్నసిద్ధం, జ్ఞానికి సహజం. అది అనివార్యం. (అవధూతల స్థితి అదేగదా!) **కనుక వివిదిషా సన్న్యాసం కన్న విద్వత్సన్న్యాసం ఉత్తమం అని తేలుతున్నది**. కనుక ఆత్మజ్ఞానం సాధించటానికి తరువాత ఆత్మసాక్షాత్కారానికి గూడా ముముక్షువునకు సన్న్యాసమే ముఖ్యము.

**శ్లో॥ పాప్మా నో తరతి ప్రచేతసమముం నో వా తపత్యేష వై**
**పాప్మానం తరతి ప్రభుస్తపతి చాపాపోఽ రజస్సంశయః ।**
**జన్మవ్యాధిజరాన్తభీతిరహితస్సాక్షాదయం బ్రహ్మవి-**
**చ్చాత్మా బ్రాహ్మణ ఏవ చిత్సుఖమయం తద్బ్రహ్మ లోకోఽ ప్యయమ్ ॥207**

భావ॥ ఉత్తమ మానసుడయిన యీ బ్రహ్మవేత్తను సంచితములు ప్రారబ్ధములు-ఏవియు తాకవు. బాధించవు. జ్ఞాని అయిన యీ జీవప్రభువు పాపపుణ్యములను దాటును. అతడు పాపరహితుడు, రజోరహితుడు సందేహరహితుడు అయిన జ్ఞాని జన్మమరణ జరావ్యాధిభయాదులు లేనివాడై సాక్షాత్తుగా బ్రహ్మమే అగును. బ్రహ్మవేత్తయే నిజమయిన బ్రాహ్మణు డవుతాడు. అతడే ఆత్మ. చిదానంద మయమయిన ఆ బ్రహ్మమే యీతడు. బ్రహ్మలోకమేయీతడు. 207

విశే॥ 1. జ్ఞాని సర్వకర్మలను సన్న్యసించితే, అతని సంచితకర్మలు ఎలా పోతాయి. నిత్యకర్మాచరణం వలన గదా అవి పోతాయి. నిత్యకర్మలు చేయకపోవటం వలన ప్రత్యవాయం గూడా వస్తుంది గదా! అని ప్రశ్న. కాని జ్ఞానిని ఏ పాపము అంటదు. ఏ పుణ్యమూ అంటదు.

2. పాపం అంటే ఇచ్చట పాపపుణ్యములు రెండూ అర్థము. రెండూజ్ఞానికి కర్మఫలరూపంలో ప్రతిబంధకం కదా!

3. చిత్సుఖమయం = చిదానంద మయమయినది. లేదా జ్ఞానాభిన్నసుఖమయినది. జ్ఞాని అయినవాని ఆత్మ సర్వభాసకము దుఃఖరహితము కదా!

**శ్లో॥ ఏవం దేశికబోధితోऽభయమితశ్శిష్యః ప్రియాయాఖిలం**
**స్వం స్వం స్వం గురవే దిశేజ్జనకరాడ్వా యాజ్ఞవల్క్యర్షయే ।**
**బ్రహ్మైవాభయమద్వయం పరతరం నిత్యం చ నేతీతి స-**
**న్నిర్దిష్టం ధ్రువమప్రమేయమితరత్సర్వం భయాధాయకమ్ ॥ 208**

భావ॥ యాజ్ఞవల్క్య బోధితుడయిన జనకుడు గురుదక్షిణ నిచ్చినట్లు, గురుబోధను పొంది అభయుడైన శిష్యుడు గురుదక్షిణ చెల్లింపవలయును. తన సమస్త సంపదను గురుదక్షిణగా చూపవలయును. అద్వితీయము పరాత్పరము నిత్యం, న,న, అని సకల నిషేధం తరువాత మిగిలే సత్యము, ధ్రువము, అప్రమేయము అయిన బ్రహ్మమే అభయము. బ్రహ్మేతరమయిన ద్వితీయమంతయు భయకారణము. 208

విశే॥ 1. అభయప్రాప్తికి ముందు జ్ఞేయ విశేషములున్నాయి. అవి తెలిసికొని అభయం పొందిన జనకుడు యాజ్ఞవల్క్యునకు ఆ విదేహ దేశమును, తనను, గో సహస్రమును సమర్పించి కొనెను.

2. ద్వితీయాద్వైభయం భవతి. బ్రహ్మం అద్వితీయం. అది ఆత్మ. కనుక అభయం. అప్రమేయం. వాఙ్మనస్సులకు గోచరము కానిది. కనుక 'న,న' అని నిషేధరూపముగా చెప్పబడినది. ప్రమేయం అయితే అనిత్యం. అప్రమేయం కనుక నిత్యం. బ్రహ్మాభిన్నమయినదంతా ప్రమేయం, అనిత్యం, అధ్రువం కనుక భయకరము.

3. కనుక అభయార్థి జ్ఞానమార్గమున అద్వైతమునుపాసింపవలయును. విద్యా, కర్మ మార్గములలో దేవతలన ఉపాసన భయకరము. (వారు ద్వితీయులు. కర్మ ఫలములు అనిత్యములు, క్షీణిస్తాయనే భయం. "తందేవా భక్షయంతి" అని చంద్రలోకాదులలో భయము. "దేవానాంపశుః" అవుతామని భయం.

4. సన్న్యాసి కాని వానికి బ్రహ్మ విద్యాధికారము లేదు. అథాతో బ్రహ్మ జిజ్ఞాసా - వద్ద వ్యాసులే అన్నారు. గృహస్థులయిన జనక, యాజ్ఞవల్క్యులు ఎట్లా బ్రహ్మవిద్యా విచారణ చేశారు? -సమా- సన్న్యాసాధికారం క్షత్రియులకు లేదు. విద్యాధికారం ఉన్నది. కనుక జనకుడు అర్హుడే. యాజ్ఞవల్క్యుడు మహాప్రతిభాశాలి కనుక స్వాధ్యాయభాగమయిన వేదాంతాధ్యయనము చేతనే బ్రహ్మవేత్త అయినాడు. కనుక ఆయనకు సన్న్యాసం లేకపోయింది. అయితే తరువాత యాజ్ఞ వల్క్యుడు అమృతత్త్వం కోసం విహితమయిన సన్న్యాసమును స్వీకరించాడు. "బ్రహ్మ సంస్థోమృతత్త్వ మేతి" గదా! ఇచ్చట నిష్ఠ, సంస్థ అనగా జ్ఞానపరిపాకము. కనుక జ్ఞానం వలననే అమృతత్త్వం.

5. జ్ఞానమాత్రంతోనే జనకునికి బ్రహ్మనిష్ఠ వస్తే గురువయిన యాజ్ఞవల్క్యునికి సన్న్యాసం ఎందుకవసరమయినది? – వారి వారి ప్రారబ్ధ సుకృతమహిమవలన. కొందరికి శ్రవణం చాలు. కొందరికి మననం గూడా కావాలి. ఆత్మ సాక్షాత్కారం జరగలేదు కనుకనే ఆయన దక్షిణ (గో) కోసం జనక సభలో పాల్గొన్నాడు.

6. వాస్తవమయితే ఇది : లోకసంగ్రహం కోసమే యాజ్ఞవల్క్యుడు సన్న్యాసము స్వీకరించాడు. జనకుడు అశ్వమేధాదులు చేశాడు. వారు ముందే జ్ఞానులు. కనుక ఇదంతా లోకసంగ్రహం లోకానుకరణము. **గో, కాముడు కావటం, దక్షిణాస్వీకారం అంతా లోకానుకరణము.** రాముని సీతా వియోగ దుఃఖము వంటిది. ఇంతమాత్రం చేత గృహస్థునకు బ్రహ్మవిచారం చేయటానికి అధికారం లేదు. లోకాతీతవ్యక్తుల ఉదాహరణతో మనము ఏదీ చేయరాదు. ధర్మశాస్త్ర సమ్మతము కావలసినదే. కనుక సన్న్యాసి అయిన బ్రాహ్మణునకే బ్రహ్మ విచారాధికారము.

ఇంతటితో యాజ్ఞవల్క్య బ్రాహ్మణం పూర్ణం.

**శ్లో॥ పూర్ణం బ్రహ్మ జగన్మయం యదభవద్దర్ణోఽహివన్మాయయా**
**తస్మాత్పూర్ణమదో బృహజ్జగదిదం పూర్ణాత్సముద్గచ్ఛతి ।**
**పూర్ణే తిష్ఠతి లీయతేఽపి చ తథా పూర్ణే తతో విద్యయా**
**పూర్ణేఽస్మాత్ప్రవివేచితేఽనృత మిదం పూర్ణం పరం శిష్యతే ॥ 209**

భావ॥ దండం భ్రాంతివలన సర్పంగా కనబడినట్లు పూర్ణమయిన బ్రహ్మమే జగత్తుగా కనబడుచున్నది. కనుక ఇదంతా పూర్ణమయిన బ్రహ్మమే. ఈ ప్రపంచమంతా ఆ పూర్ణ బ్రహ్మమునుండి (వివర్తంగా) ఏర్పడినది. ఇది ఆ పూర్ణము నందే ఉన్నది. పూర్ణమునందే లయమగును. విద్యద్వారా ఈ పూర్ణతత్త్వమును విశ్లేషించి చూచినచో ఈ ప్రపంచము అనృతం మిథ్యగా తేలును. పరమయిన పూర్ణమే సత్యముగా మిగులును. 209

విశే॥ 1. ఉపాసనల కోసం సోపాధిక బ్రహ్మవిద్యను ప్రస్తావించుచు పాత విషయములను తడవుచున్నాడు.

2. పూర్ణవస్తువు ద్రష్ట దృశ్య భేదంతో పరిచ్ఛిన్నమయి జగత్తుగా పరిణమించలేదు. రజ్జు సర్పన్యాయంతో ఇది వివర్తంగా అయినది. మాయకు అన్నీ సాధ్యమే. భ్రాంతి సిద్ధం. కనుక జీవబ్రహ్మభేదం తేలినది. ప్రపంచం భ్రాంతి కనుక అది బ్రహ్మవివర్తమే కనుక తత్త్వతః బ్రహ్మమే అని తేలినది. బ్రహ్మం కాదంటే మిథ్య అవుతుంది.

3. ప్రత్యక్షమయిన ఈ ప్రపంచము (చేతన అచేతన, ద్రష్ట – దృశ్య భేదం గలదంతా) పరోక్ష బ్రహ్మమే. ప్రత్యక్షమయిన ప్రపంచమును పరోక్షమయిన బ్రహ్మముగా ఎలా చెప్తారంటారా?

– బ్రహ్మ పరోక్షమనుకొన్న వానికి అది పరోక్షబ్రహ్మ. వస్తుతః అయితే అది అపరోక్షబ్రహ్మమే. "యత్సాక్షాదపరోక్షాత్ బ్రహ్మ" గదా! జ్ఞానికి బ్రహ్మం ఆత్మగా నిత్యం అపరోక్షమే గదా! లేదా, ఇంద్రియగమ్యం కాదు కనుక పరోక్షం అంటాము. ఇంద్రియగమ్యం అయితే ప్రత్యక్షం అంటాము. కనుక జగత్తు ప్రత్యక్షం. బ్రహ్మం పరోక్షం.

4. సుఖిని, దుఃఖిని నేను అనటం ద్వారా జీవుడు అనగా సంసారి జీవుడు మనోవేద్యుడు. కనుక ప్రత్యక్షం. జగత్తు ఇంద్రియగమ్యం. అయితే బ్రహ్మంగా అది ఇంద్రియగమ్యం కాదు. కాని మాయవలన జగత్తుగా అయి ఇంద్రియ గమ్యం అయింది. కనుక సర్పాభాసం వాస్తవంగా దండము అయినట్లు జగత్తు బ్రహ్మమే. "తత్త్వమసి" మొదలగు శ్రుతులను బట్టి జీవబ్రహ్మలకు అభేదం కావచ్చును. ప్రపంచము బ్రహ్మం ఎలా అభిన్నం అవుతాయి – రజ్జు సర్పము వద్ద సర్పం రజ్జువుతో అభిన్నం అయినట్లు.

5. లేదా, మాయావచ్ఛిన్నమయిన బ్రహ్మం జగత్తుకు కారణం. కనుక సలక్షణమయిన (సగుణం) బ్రహ్మం 'మట్టి – కుండకు' కారణమయినట్లు జగత్తుకు కారణం కనుక అభేదం. లేదా, సంసారిజీవుడు – అచేతన జగత్తు – ఈ రెండిటికి అసంసారి, చేతనము అయిన బ్రహ్మంతో అభేదం – ఎలా అంటే అన్ని బ్రహ్మకార్యములు కనుక "అగ్ని – స్ఫులింగ న్యాయంతో" మట్టికి కార్యమయిన ఘటంతో మట్టికి అభేదం లాగా అభేదం కుదురుతుంది. ఈ పక్షంలో **సంసారిరూపంగా జీవుడు అనిత్యం. చైతన్యరూపంగా నిత్యం** – ఇది "అజో నిత్యః" అను శ్రుతికి సమన్వయం. సంసారిగా **అగ్ని – స్ఫులింగరూపంతో జన్యత్వం. చైతన్యాత్మనా నిత్యత్వం.** లింగ శరీర సంబంధమయిన జనన మరణములు ఉంటాయి. కనుక కృతానుభవం ఉంటుంది. సంసారం అనాది.

6. వస్తుతః, అజమయిన బ్రహ్మమునుండి జీవుడుకాని దేహాది ప్రపంచము కాని పుట్టదు. దృష్టాంతము లేదు. జాతమయిన బ్రహ్మము నుండి పుట్టుందంటే అనవస్థ. కనుక జీవుడుకాని జగత్తుగాని జన్మించటం వంటివి అబద్ధమే. కనుకనే మాయవలన అని చెప్పాము. కనుకనే బ్రహ్మతత్త్వం విశ్లేషణ చేస్తే ప్రపంచం మాయికం. మిథ్య అని తేలుతుంది. మట్టి – ఘటం విశ్లేషిస్తే ఘటం అసత్యం మట్టి సత్యం అని తేలుతుంది గదా!

7. సారాంశము : లింగ శరీరధారి అయిన ద్రష్ట అయిన జీవునియందు, దృశ్యమయిన ప్రపంచము నందు బ్రహ్మం యొక్క అంశత్రయం కలిసివస్తుంది. సత్ చిత్ ఆనందం. అందు

జీవునిలో అహమస్మి (సత్) ; అహం భామి (చిత్); అహం ప్రియః (ఆనందం) అని భావం.

జగత్తులో ఇదం అస్తి ; ఇదం భాతి ; ఇదం ప్రియం – అని భావన.

ఇందులో అహం, ఇదం అను జీవ జగత్తులను విడదీస్తే మిగులునది సచ్చిదానంద రూపమయిన బ్రహ్మమే. అట్లే లింగశరీరంతో గూడిన జీవచైతన్యము లింగశరీరమునుంచి దూరమయితే చైతన్యమే మిగులుతుంది. కనుక బ్రహ్మాతీతంగా ద్రష్ట, దృశ్యం లేవు. పూర్ణ బ్రహ్మం ఒక్కటే.

8. ప్రత్యక్షమయిన జగత్తు రజ్జు సర్పం వంటి భ్రాంతి ప్రత్యక్షం. దృశ్యమయిన జగత్తు లేదంటే దాని ద్రష్ట గూడా లేడు. ద్రష్టృత్వం లేని ద్రష్ట ఉండడు. ఘటత్వంలేని ఘటం ఉండదు. ఇక ఉన్నది ద్రష్టృత్వాదులు లేని బ్రహ్మమే. దానిని లేదనలేము. అన్నియు నశ్యములు మిథ్యలు లేనివి. కాగా ఉన్నదదే. అది నిషేధావధి. అవధిలేకుండా "ఇది బ్రహ్మం కాదు" అన్న నిషేధం కుదరదు కదా!

9. బ్రహ్మ లేదంటారు కొందరు. అయితే లేదనటానికి లేదని గ్రహించిన సాక్షి ఎవరు? సాక్షి లేదంటే బ్రహ్మ లేడని ఎలా తెలిసింది. సాక్షి ఉన్నాడంటే ఆ సాక్షియే బ్రహ్మము. సాక్షి బ్రహ్మం కాదు జీవుడే నంటారా?–

తప్పు. నీవు బ్రహ్మయొక్క అభావమును చూడలేదు. నీవు జగద్రూపమయిన బ్రహ్మమును చూచుచున్నావు. సుషుప్తిలో అజ్ఞాన సుఖరూపమయిన బ్రహ్మమును పొందుచున్నావు. అయితే కార్యమయిన జగత్తుద్వారా కారణమయిన బ్రహ్మమును చూచుచున్నావు. కుండ రూపంలో మట్టిని చూస్తాం గదా! ప్రపంచం కార్యమే – వృక్షాదులు కార్యములే. పంచభూతములు కార్యములే. సావయవ పదార్థాలన్నీ కార్యములే. ఘటం వంటివవి. ఆకాశం గూడా సావయవము. అది ఘటాదులచే పరిచ్ఛిన్నమవుతుంది. ఘట కుడ్యములున్నచోట ఆకాశము లేదు గదా! అయితే బ్రహ్మం గూడా ఘటము హృదయ గుహ మొదలయిన వాటి వలన పరిచ్ఛిన్నము కదా! అది నిరవయవం కాదనాలి గదా! అంటారా? – కాదు. పరమార్థ సత్తలోని బ్రహ్మం దృష్ట్యా ఘటాదులు శరీరాదులు మిథ్య. కనుక అది పరిచ్ఛిన్నం కాదు. అలాగయితే గగనానికి గూడా పరిచ్ఛేదం లేదనవచ్చును గదా! – సమా – గగనం సత్యం కాదు. మిథ్య. అది రజ్జు సర్పంవలె దృశ్యమయినది. కాదంటే గగనం లేదనాలి. గగనం ద్రష్టకాదు. అది అచేతనం గదా! ద్రష్టకాని బ్రహ్మం గూడా అచేతనమంటారా! చేతనుడవయిన నీవే ఆ బ్రహ్మము. నీవు బ్రహ్మము కాదనటానికి హేతువులేదు. ఉపాధినిబట్టి బ్రహ్మం "ద్రష్టవయిన నీవు" అవుతుంది. సర్వజ్ఞమయిన బ్రహ్మం మాయా సహితమే. శుద్ధము కాదు. ఆ బ్రహ్మమే నీవు. లింగశరీరం స్థూలశరీరం మాయ అవిద్య వీటి మధ్య విరోధం లేదు. కనుక మాయి లింగి ఒక్కరే. **సోపాధిక బ్రహ్మమే ఉపాధి లేని దశలో నిరుపాధికము.** ఆకాశం ఒక్కటే ఘటం ఉంటుంది ఉండదు. అలాగే ఉపాధి ఆగంతుకం. సహజం కాదు నిత్యం కాదు. కనుక నిరుపాధిక బ్రహ్మం సాధ్యమే. ఉపాధి, సమవేతంగా ఉండదు. అది ఉండవచ్చు. ఊడవచ్చును. అట్టి బ్రహ్మము నీవే. లింగివయితే

సోపాధిక బ్రహ్మం అవుతావు. లింగ శరీరం పోతే (జ్ఞానం వలన) నిరుపాధిక బ్రహ్మం అవుతావు. లింగశరీరం ఘటం వంటిది. చైతన్యం ఆకాశం వంటిది. లింగ శరీరం పోయేరకమే. జ్ఞానంతో పోతుంది. సుషుప్తిలో అది విడిపోతుంది గదా! లింగ ద్రష్ట వయిన నీవు లింగ శరీరం కన్న భిన్నం కదా! (స్థూల శరీర ద్రష్ఠవయిన నీవు స్థూలంకన్న భిన్నమయినట్లు) లింగ శరీరదర్శనమనగా "నా మనస్సు, నా ప్రాణము" మొదలయిన అనుభవము. సుషుప్తిలోనూ నా అజ్ఞానం (నాకు ఏమీ తెలియలేదు) అన్న అనుభవంలో అజ్ఞాన ద్రష్టగా నీవున్నట్లే గదా! అనగా అజ్ఞాన సాక్షి అని అర్థము. అంతేగాని ఇంద్రియాలతో బ్రహ్మం లేదా ఆత్మ అజ్ఞానాన్ని చూస్తుందని కాదు.

10. ఇంద్రియాదులతో పనిచేసే నేను బ్రహ్మనా? నీవు ఇంద్రియాదులను గమనిస్తావు గదా! బ్రహ్మవే. అల్పజ్ఞుడనునేను సర్వజ్ఞ బ్రహ్మనా? సుషుప్తిలో నీవు సర్వజ్ఞుడవే కదా! సంసారిని నేను బ్రహ్మనా? సంసార ద్రష్టవు కనుక నీవు బ్రహ్మవే, బ్రహ్మ గూడా సంసార ద్రష్టయే. లేదంటే బ్రహ్మం సర్వజ్ఞత పోతుంది. అసలు బ్రహ్మం అసర్వజ్ఞం కదా! అవును నీవూ అంతే. ఎందుకని సర్వం అనబడే ప్రపంచం వాస్తవం కాదు గదా! అయితే బ్రహ్మ జ్ఞాన స్వరూపం కాదా? ప్రపంచం లేనపుడు తెలియబడేది, తెలియటం లేదు గదా! అవును జ్ఞాన స్వరూపం కాదు. అందుకే "న,న" అని చెప్పబడినది. మరి "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అన్నమాటకు అర్థమేమి? - అది లాక్షణికము. అలాగయితే బ్రహ్మమును వ్యవహారంలో గుర్తించేదెలా? - **మాయవలన ఆయన వ్యవహార విషయం అవుతాడు**. కాలత్రయంలోనూ బ్రహ్మం అనిర్వచనీయం. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ". అట్టి బ్రహ్మమును భ్రాంతివలన జీవుడని, ఈశ్వరుడని, ప్రపంచమని భావిస్తాము. చీకటిలో రజ్జువును చూచి పామని, కఱ్ఱలని, నేలలోచార అని అనుకొంటాము. భ్రాంతి కారణం మాయ. అది విద్యతో నశిస్తుంది. అపుడు బ్రహ్మమొక్కటే మిగులుతుంది. భ్రాంతి తొలగితే రజ్జువే మిగులుతుంది.

**శ్లో॥ ఓం ఖం బ్రహ్మ పురాణ ఏవ పరమాకాశోఽత్ర ఖం కైశ్చన**
**వ్యోమేదం ఖమితి ప్రగీతమపరం తద్బ్రహ్మ యద్వా పరమ్ ।**
**ధ్యాయేదోమితి వైదికా విదురముం వేదోఽయమిత్యాగమో**
**యచ్చైతత్ప్రభవో విదన్త్యపి యతశ్చైనేన వేద్యం సమమ్ ॥ 210**

భావ॥ ఓం అనగా ఆకాశాభిన్నమయిన బ్రహ్మము. ఇచట 'ఖం' ఆకాశము అనగా అనాది అయిన పరమాకాశమయిన ఆత్మయే. 'ఓం' కారము పరబ్రహ్మమునకు చాల దగ్గరదయిన పేరు. కౌరవ్యాయణీ పుత్రుడు మొదలయిన ఋషులు మామూలు ఆకాశమునే బ్రహ్మముగా చెప్పారు. అపుడు ఆకాశోపాధిగాగల బ్రహ్మమే ఓంకారము. కాగా "ఓంకారము" పరబ్రహ్మకు అపర బ్రహ్మకు సంకేతము. నామధేయము గూడా. వైదికులు బ్రహ్మమును "ఓం" అని

ధ్యానింతురు. వేదములన్నియు దీనినుండి పుట్టినవి కనుక దీనిని వేదమే యని అందురు. అంతేకాక దీనివలన సమస్తమును తెలిసికొనగలము కనుక దీనిని వేదము అందురు. 210

విశే॥ 1. వాచ్యవాచకములకు అభేదం కనుక ఓంకారమే పరబ్రహ్మము.

2. ముఖ్యార్థమును వదలి గౌణార్థంతీసి కొనటం సరికాదన్న భావముతో కౌరవ్యాయణీ పుత్రుడు మొదలయిన ఋషులు 'ఖం' అనగా మామూలు ఆకాశమని అర్థం చెప్పి అది ఉపాధిగాగల బ్రహ్మమును చెప్పారు. "గౌణముఖ్యయోః ముఖ్యే కార్య సంప్రత్యయః" అనంతం సురవర్మ ఖం అని ఖం = మామూలు ఆకాశము కనుక పరమాకాశరూపమయిన ఆత్మ అని చెప్పక ఆకాశోపాధిగల బ్రహ్మం అన్నారు.

3. సోపాధికమయిన కార్యబ్రహ్మం అపరం నిరుపాధికం పరబ్రహ్మం ఓంకారం పర అపర బ్రహ్మలిద్దరికీ వాచకం. అపర బ్రహ్మధ్యానంలో క్రమముక్తి. పరబ్రహ్మ ధ్యానంలో సాక్షాన్ముక్తి.

4. ఓం – దీని అర్థముగా బ్రహ్మమును ధ్యానం చేయుట ముఖ్యపద్ధతి. 'ఓం' ను ప్రతీకగా – సాలగ్రామమును విష్ణువుగా ధ్యానించుట రెండవపక్షము. ఆరోపణ చేసినది ప్రతీకము. అన్న, ప్రాణ, గగనాదులు ప్రతీకలు. "మనో బ్రహ్మేత్యుపాసీత". బ్రహ్మ నారాయణాదులు బ్రహ్మమునకు పేర్లు. (మన కల్పితములు)

**శ్లో॥ పుత్రా న్దే త్యదిశత్ప్రజాపతిరితాన్దేవా న్నరాం శ్చాసురా-**
**న్ప్రత్యేకం త ఇమే క్రమేణ చ దమం దానం దయామ్భేజిరే ।**
**అద్యత్వేపి దదేతి తేన జనతా మేఘాత్మనా శాస్యతే**
**తస్మాత్త్రయమభ్యసేచ్ఛుభతమాం యో వష్టి గన్తుం గతిమ్ ॥ 211**

భావ॥ తనవద్దకు తత్త్వోపదేశార్థం వచ్చిన దేవతలకు నరులకు అసురులకు వారి తండ్రి అయిన ప్రజాపతి "దదద" అని యుపదేశించెను. అందువలన దేవతలు 'ద' అనగా దమము అనగా ఇంద్రియ నిగ్రహం ముఖ్యమనుకొనిరి. నరులు ద అనగా దానము ముఖ్యమనుకొనిరి. అసురులు "ద" అనగా దయ ముఖ్యమనుకొనిరి. నేటికిని మేఘరూపము దాల్చిన ప్రజాపతి ప్రజలకు "ద" "ద" అని ఉరుము చున్నాడు. కనుక మంచి గతిని పొందవలెనని కోరుకొనువాడు "ద ద ద" అనగా దమ దాన దయలను అభ్యసింపవలయును. 211

విశే॥ 1. "దమయత, దత్త, దయధ్వం' అని 'ద' సంకేతంతో చెప్పిన ఉపదేశములు. దేవతలు తమలో దమములేదని ప్రజాపతి గ్రహించి దమమునుపదేశించెనని, నరులు తమలో లోభము గలదని భావించి దానమునుపదేశించెనని, అసురులు తాము హింసామయులు కనుక దయనుపదేశించెనని భావించిరి. తమలో ఉన్న దుర్గుణములను గమనించిన ప్రజాపతి అట్టివి

వదలించికొని అందుకు విరుద్ధమయిన యీ సద్గుణములను అలవాటు చేసికొనుడని ప్రజాపతి యుపదేశముగా వారు భావించిరి.

2. లేదా, మనుష్యులలోనే దమములేనివారు దేవతలు, లోభం గలవారు మనుషులు, క్రౌర్యము గలవారు అసురులని సంకేతంగా చెప్పినట్లు, శాస్త్రం సాధారణంగా మనుష్యుల కోసం గదా! దద అని రెండు సార్లు అనటం సంభ్రమమును లేదా, దృఢత్వమును చూపును. కనుక ఉపాసకునకు దమ దానదయలు ఆవశ్యకములని అర్థము.

**శ్లో॥ ఏతత్తద్ధృదయం ప్రజాపతిరిదం బ్రహ్మేదమేవాఖిలం**
**యోఽస్మిన్ వేద హృవర్ణమస్య హరతే స్వోఽన్యో బలిం సన్తతమ్ ।**
**యో దం వేద దదత్యముష్య సకలాశ్చాన్యే స్వకీయా బలిం**
**యోఽయం వేద తదేకమక్షరమసౌ స్వర్గం ప్రయాయాత్పదమ్ ॥212**

భావ॥ హృదయోపాసన ఇలా చేయవచ్చును. ఈ హృదయం అనగా బుద్ధియే ప్రజాపతి. అదే ద్రష్ట గదా! అదే బ్రహ్మ. బృహత్ కనుక. అదే సమస్తము. అంతా దాని కల్పన కదా! హృదయ పదమునందలి 'హృ' అను పదమును తెలిసికొనిన వానికి తనవారు పరాయివారుగూడ కానుకలు సమర్పించెదరు. ఎవరికి "ద" అను అక్షరము తెలిసినదో వారికిన్ని తన, పర - అందరూ కానుకలను చెల్లించెదరు. ఎవనికి "య" అను అక్షరము తెలిసినదో వాడు స్వర్గమును పొందును. 212

విశే॥ 1. హృదయరూప ప్రజాపతికి సర్వేంద్రియములు ప్రాణములు బలిని యిచ్చెదరు. హృదయం గూడా భోక్తలకు బలి సమర్పించును. కనుక 'హృ' ఉపాసన వలన పురుషుడు అట్టి బలి పొందగలడు. అలాగే హృదయ బ్రహ్మకు తన కరణములు ఇతర విషయములు తమతమ బలములను ఇచ్చును. హృదయముకూడా భోక్తకు బలము నిచ్చును. (భోక్త = జీవుడు)

2. నామాక్షరాలు ప్రత్యేకంగా ఉపాసన చేస్తేనే ఇంత ఫలం. ఇక 'హృదయం' మొత్తమును ఉపాసిస్తే ఎంత ఫలమో ఏమి చెప్పగలము.

**శ్లో॥ సత్యం తద్ధృదయం బభూవ హృదయం తత్సత్యమేవేతి య-**
**త్సత్యం బ్రహ్మ మహచ్చ యక్షమితి యో వేదైష లోకాన్ జయేత్ ।**
**శత్రుం చైష జయేదితి ప్రథమజం సత్యం విజానన్ పుమాన్**
**సత్యం బ్రహ్మ యతస్తతః ఫలమిదం విద్యానురూపం విదః ॥ 213**

భావ॥ హృదయ బ్రహ్మను సత్యంగా భావించి ఉపాసన చేయాలి. సత్యము హృదయ మయినది. హృదయము సత్యమయినది. సత్యమయిన బ్రహ్మము మహాయక్షం అని గ్రహించి ఉపాసించిన వాడు లోకములను జయించును. శత్రువులను జయించును. ప్రథమ జాతమయిన

యీ మహాయక్షము సత్యమే అని తెలిసిన ఉపాసకుడు శత్రువును జయించును. సత్యమే బ్రహ్మము కనుక సత్యబ్రహ్మజ్ఞానికి విద్యానురూపమయిన పూర్వోక్తఫలము కల్గును. 213

**శ్లో॥ ఆపో వా ఇదమగ్ర ఆసురస్సృజన్ తాస్సత్యసఙ్జం మహ-**
**ద్యక్షం సోఽ పృసృజత్ప్రజాపతిమసౌ దేవాన్ సదోపాసతే ।**
**సత్యం బ్రహ్మ త ఏతదాదిచరమౌ వర్ణౌ తు సత్యౌ సయౌ**
**మధ్యస్తోఽనృత ఏష చాప్యుభయతస్సత్యావృతస్సత్యతి ॥ 214**

భావ॥ సృష్టికి పూర్వము ఈ నామరూప వికారాలు పొందిన జగత్తు లేదు. ఇదంతా జలరూపంగానే ఉన్నది. ఆ నీరు సత్యమను నామము గల ఒక మహాయక్షమును సృజించెను. ఆ మహాయక్షము ప్రజాపతిని, ప్రజాపతి దేవతలను సృజించెను. వారందరు నిత్యం సత్యమును బ్రహ్మముగా ఉపాసించుచున్నారు. ఈ "సత్య" పదములో స, య వర్ణములు సత్యములు మధ్యలోని 'త' వర్ణము అనృతం. ఈ వర్ణము రెండు వైపుల సత్యములయిన 'స, య' వర్ణముల చేత ఆవృతమయి యున్నది. అది సత్యము వలె కనబడును. 214

విశే॥ 1. ప్రపంచము నీరుగా ఉన్నది. లేదా ఈ ప్రపంచసృష్టికి ముందు నీరున్నది. అయితే **"ఆపః" అంటే నామరూపములతో వ్యాకృతముగాని అవ్యక్తమయిన కర్తృసహితమయిన పదార్థము. అంతేతప్ప జలం కాదు**. ఇది నామరూప వికృతం కదా? పైగా ఆకాశం తరువాత పుట్టినది గదా! అలాగే ఈ జలము (ఆపః) అవ్యాకృతము అచేతనము కనుక ప్రపంచసృష్టి చేయగలది కాదు. అందువలన కర్త అయిన బ్రహ్మముతో కూడిన జలము అని చెప్పబడినది. కాగా అవ్యాకృత - ఉపాధికమయిన ఈశ్వరుడే ఇచ్చట 'ఆపః' అని చెప్పబడెను.

2. యక్షుడు = హిరణ్యగర్భుడు, మహత్ = మహత్తత్త్వము. మహత్తత్త్వమే సమష్టి రూపము. ఇతడు కార్య బ్రహ్మ. కారణ బ్రహ్మ మాత్రమే సత్యం. 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' కదా! కృతకమయిన కార్యం అసత్యమే. సత్యం కాదు. మరి 'సత్యం' అను సంజ్ఞ దీనికెలా వచ్చింది - సమా - సత్ అమూర్తమయిన వాయ్వాకాశములు.

త్యత్ = మూర్తమయిన తేజో జల భూములు. కనుక పంచభూతములు కలిసి 'సత్యం' అవుతాయి. ఇదే మనస్సును, ఇంద్రియాలను సృష్టించి మొత్తం 16గా లింగశరీరం అవుతుంది. కనుక లింగశరీరం "సత్యం". అదే హిరణ్యగర్భుడు. సమష్టి లింగమయిన మహత్తత్త్వము హిరణ్యగర్భుడు. కనుక హిరణ్యగర్భుడు సత్యం. మరియు కారణరూపంగా హిరణ్యగర్భుడు సత్యమే. కారణం సత్యం కార్యం కారణంకన్న భిన్నం కాదు కనుక హిరణ్యగర్భుడు బ్రహ్మ రూపంగా సత్యమే. మరియు నిరపేక్ష సాపేక్ష సత్యం అవుతుంది కదా! కనుక "సత్యసంజ్ఞ" వచ్చింది.

3. ప్రజాపతి ద్వారా దేవతా సృష్టిచేయించిన హిరణ్యగర్భుడు “మహాన్”. దేవతలు అందుకనే తమ పిత అయిన విరాట్ - ప్రజాపతిని వదలి హిరణ్యగర్భునే సత్యముగా ఉపాసించెదరు. దేవ పూజ్యుడు కనుకనే “యక్షుడు” అయినాడు. కాగా **హిరణ్యగర్భుడు ప్రథమజుడు, మహత్తత్త్వము, యక్షుడు.**

4. త = మృత్యురూపము. మృత్యు సత్యములయందు ‘త’ సమానం కనుక -

5. అందువలన సర్వమునందు సత్యం ఎక్కువ, అనృతం (మృత్యువు) తక్కువ. ఏమీ చేయలేని అసమర్థమయినది - అని తెలిసిన జ్ఞానిని పొరపాటున వచ్చిన అనృతమయినను బాధింపదు.

**శ్లో॥ సత్యం బ్రహ్మ తదక్షి దక్షిణ ఇనే పుంసశ్చ మూర్ధాఽస్య భూ-**
**ర్బాహూ ద్వౌ చ భువస్సువస్తు చరణౌ నామాహమిత్యప్యహః ।**
**అన్తర్హృద్యపి హృన్మయోఽస్తి పురుషో బ్రహ్మాత్మకో భాస్వర-**
**స్సూక్ష్మో వ్రీహియవాదివత్స సకలస్యేశః పతిశ్శాసకః ॥ 215**

భావ॥ సత్యమయిన ఆ బ్రహ్మం ఉండే స్థానాలను బట్టి ఉపాసనలు -

ఆ బ్రహ్మం దక్షిణ నేత్రమునందు, సూర్యునియందునున్నది. దీనికి భూః = తల, భువః - రెండు బాహువులు. సువః = పాదములు. దక్షిణనేత్రపురుషునకు ‘అహం’ అని పేరు. సూర్యమండలపురుషునకు “అహః” అని పేరు. హృదయ పుండరీక మధ్యంలో మనోమయుడయిన భాస్వరుడయిన పురుషుడున్నాడు. అతడే బ్రహ్మ స్వరూపుడు. వ్రీహియ వాదులవలె అత్యంత దుర్లభుడు. ఆయనయే సకలేశ్వరుడు సకలపతి సకల శాసకుడు. 215

విశే॥ 1. భూః - ఒకే అక్షరము. తల ఒకే అఖండ అవయవము. కనుక తల = భూః భువః = రెండు అక్షరాలు కనుక రెండు బాహువులు.

2. భాస్వరః = అనగా చిన్మయుడు. జ్ఞానం ప్రకాశం కదా! మనోమయత్వాది విశిష్ట పురుషరూపంతో హృదయమున హిరణ్యగర్భుడున్నాడు. కనుక మనోమయుడు మొదలయిన పురుషులను హిరణ్యగర్భునిగా ధ్యానింపవలయును.

**శ్లో॥ విద్యుద్బ్రహ్మ తమోవిదానత ఇతి ప్రాహుస్తతో విద్యుది-**
**త్యేతద్బ్రహ్మ విచిన్తయన్తి పురుషా యే తే విధూతాంహసః ।**
**ఆయుర్బ్రహ్మ విచిన్తయన్తి కతిచిత్తాన్ పూర్ణమాయుర్వ్రజే-**
**ద్వాచా కిం బహునా యథాగుణమిదం ధ్యాతుర్విధత్తే ఫలమ్ ॥ 216**

భావ॥ తమస్సును చీల్చే "విద్యుత్తు" ను బ్రహ్మంగా చెప్తారు. కనుక విద్యుత్తును బ్రహ్మంగా భావించు పురుషులు పాపరహితులగుదురు. కొంతమంది ఆయువును బ్రహ్మముగా భావించి ఉపాసించువారు పూర్ణాయుర్దాయము కలవారగుదురు. ఇన్నిమాటలేల? **ఈ బ్రహ్మము తనను ధ్యానించు విధానమున కనుగుణముగా ఫలము నిచ్చును. ఏ గుణము కలదానినిగా ఉపాసించితే బ్రహ్మం ఆ గుణములను ఫలముగా ఇచ్చును.** 216

**శ్లో॥ స్వాహా హన్త వషట్స్వధేతి సురభేర్వాచస్స్తనా బ్రహ్మణ-**
**శ్చత్వారో విబుధోపజీవనమతస్స్వాహావషట్చ ద్వయమ్ ।**
**హన్తే త్యేష నరాయనం పితృతతేర్నూనం స్వధా జీవనం**
**ప్రాణోఽస్యా ఋషభస్తు వత్సతి మనస్తాద్భావ్యమస్మా ద్భవేత్ ॥ 217**

భావ॥ బ్రహ్మాభిన్నమయిన వాగ్ధేనువుకు 4 స్తనములు గలవు. 1. 'స్వాహా' 2. హంత, 3. వషట్ 4. స్వధా, అందులో స్వాహావషట్టులు దేవతాజీవన ప్రదములు. హంత అనునది నరులకు, స్వధా అనునది పితరులకు జీవనము. వాగ్ధేనువుకు ప్రాణము వృషభము. మనస్సు దూడ. ఈ ఉపాసన వలన సాధకుడు వాక్కు ఉపాధిగా గల బ్రహ్మం అగును. 217

విశే॥ 1. ఇది **వాక్ - బ్రహ్మోపాసన**. వాక్కు బ్రహ్మాభిన్నము. బ్రహ్మకుపాధి. దానియందు బ్రహ్మదృష్టి చేస్తాం.

2. "వాగ్బ్రహ్మేత్యుపాసీత" స్వాహా, వషట్‌ల చేత దేవతలకు హవిస్సు ఇస్తాం కనుక అవి వారికి జీవన ప్రదములు. 'హంత' అని మనుష్యులకు, అలాగే స్వధా అని పితరులకు కవ్యదానం. కనుక వారికవి జీవనప్రదములు.

3. వాక్కు ప్రాణాధీనం. కనుక ప్రాణం ఎద్దు. మనస్సువలన వాక్కు మాటకు సిద్ధ మవుతుంది. అనగా చేపుతుంది. కనుక మనస్సు దూడ. మనస్సు ఆలోచించిన దానిని గదా! వాక్కు చెపుతుంది. దేవతలు మొదలగువారు పిదికిన పాలు త్రాగే బాలకుల వంటి వారు.

**శ్లో॥ పిణ్డస్యాన్తరవస్థితః పచతి యో నానావిధాన్యోదనా-**
**న్యైభిస్సుజ్జిళితాని యస్య పిహితే కర్ణే ధ్వనిశ్శ్రూయతే ।**
**జీవద్భిర్జలమిన్ధనం భవతి వా వైశ్వానరం తం శుచిం**
**బ్రహ్మేతి ప్రతిచిన్తయన్ బుధవరస్తాద్భావ్యమాపద్యతే ॥ 218**

భావ॥ ఈ సత్యబ్రహ్మకే మరొక ఉపాసన చెప్తున్నాడు. అది <u>వైశ్వానరోపాసన</u>. ప్రాణాలు తిన్న నానావిధ - ఆహారములను శరీరాంతర్భాగమున నుండి ఆయనయే పచనము చేయుచున్నాడు. చెవులు మూసినపుడు చెవులలోపల ఆయన ధ్వనియే వినబడును. ఆయనకు జలము ఇంధనమగును. వైశ్వానరుడను పేరుగల ఆ అగ్నిని బ్రహ్మముగా నుపాసించినవాడు

వైశ్వానరుడుపాధిగనున్న బ్రహ్మోతాదాత్మ్యమును పొందును. "అహం వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహమాశ్రితః, ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్" - గీత. 218

**శ్లో॥ విద్వాన్ ప్రేత్య గతోఽనిలం త్వరినభశ్ఛిద్రేణ తస్యోర్ధ్వమా-**
**క్రామన్భానుమితస్తదీయసుషిరాత్తల్లమ్బరాభ్రోపమాత్ ।**
**ఆయన్నూర్ధ్వముపేత్య చన్ద్రమముతః ఖాద్దున్దుభేః ఖోపమా-**
**ద్గచ్ఛన్నూర్ధ్వముపైత్యశోకమహిమం లోకఞ్చిరన్తిష్ఠతి ॥ 219**

భావ॥ **సగుణ బ్రహ్మోపాసకుల ఉత్కృష్టఫలము**, వారి గతి చెప్పబడుచున్నది. సగుణ బ్రహ్మోపాసకుడయిన జ్ఞాని మరణానంతరం ప్రారబ్ధపూర్తి వలన శరీరమునువదలి అంతరిక్షము నందున్న వాయువును చేరి ఆ వాయువు యొక్క రథచక్రరంధ్రము వంటి మార్గము ద్వారా ఊర్ధ్వగమనము చేయుచు బ్రహ్మలోక మార్గమునకడ్డుగా సూర్యుని భేదించుకొని అచ్చట లంబర (ఒక వాద్యము) రంధ్రమువంటి అభ్ర ఆదిత్యరంధ్రమునుండి పైకి పోవుచు చంద్రమండలము చేరి (మనం చూచే మామూలు చంద్రుడు కాదు) అచ్చట దుందుభిచ్ఛిద్రం వంటి చంద్రమండల రంధ్రము గుండా ముందుకు పోవుచు శోకరహితము, శరీర దుఃఖ (హిమం) రహితము - అయిన శాశ్వత బ్రహ్మలోకమును చేరును. (ఈ మార్గములో వాయువు మొదలగు దేవతలు ఉపాసకునకు స్వయముగానే రంధ్రములవంటి యీ దారులను ఇచ్చెదరు.) 219

**శ్లో॥ వ్యాధిగ్రస్తతమః పుమాన్ యదధికం సన్తప్యతే తత్తథా**
**ప్రేతస్యానయనం శ్మశానధరణీమగ్నౌ చ తత్క్షేపణమ్ ।**
**మర్త్యానాం పరమం తపస్సుతపసాఽనేన ప్రధూతాంహసో**
**మర్త్యా యాన్తి పరఞ్చ లోకమితి యో వేదైష యాయా త్స చ ॥220**

భావ॥ **అబ్రహ్మోపాసన చేసిన వారి గతులు చెప్పబడుచున్నవి. వ్యాధిగ్రస్తుడు అధికముగా సంతాపం చెందటం ఒక తపస్సు.** ప్రేతను శ్మశానమునకు తేవటం ఒక తపస్సు. దానిని అగ్నియందు దహనము చేయుట ఒక తపస్సు. మామూలుగా సంతాప, అరణ్యగమన, అగ్ని మధ్య ప్రవేశములు తపస్సులో భాగములు గదా! **ఇవి అట్టివిగా భావన చేయుట. ఈ తపస్సు చేత మరణ శీలురయిన మానవులు, పాపక్షయం పొందిన వారయి**, స్వర్గాది పరమలోకములను పొందెదరు. ఇట్టి విషయమును తెలిసినవారు అట్టి లోకములకు ఏగెదరు. 220

**శ్లో॥ అన్నం ప్రాణమృతే న తిష్ఠతి ఋతే ప్రాణోఽన్నతశ్శుష్యతీ-**
**త్యన్నం ప్రాణ ఇదం పృథఙ్న చ బృహద్బ్రహ్మైవ యుక్తం ద్వయమ్ ।**
**విష్ఠం సర్వమిహేతి వీతి నిగదన్త్యన్నం రమన్తేఽత ఇ-**
**త్యన్యం రం య ఇతి ప్రవేద రమతే సర్వం విశత్యత్ర చ ॥ 221**

భావ॥ "అన్నం బ్రహ్మ" అను ఉపాసన చెప్పబోవుచున్నాడు. 'అన్నం బ్రహ్మ" అని కొందరు 'ప్రాణం బ్రహ్మ" అని కొందరు అంటున్నారు. రెండూ సరికాదు. ప్రాణం లేకుండా అన్నం నిలువదు. అన్నం లేకుండా ప్రాణం ఉండదు. ఎండిపోతుంది. కనుక అన్నం ప్రాణము వేరయినవికావు. ఇవి ప్రత్యేకంగా బ్రహ్మలు కావు. రెండు కలిసి బ్రహ్మమనటం యుక్తము. బ్రహ్మం వినాశి కారాదు గదా! రెండూ కలిస్తే వినాశులు కావు. అన్నమునందే సమస్త ప్రాణులు విశేషంగా నిలిచియుండును. గనుక అన్నమును "వి" అనెదరు. ఈ ప్రాణం వలననే అందరూ ఆనంద (రమ్) పడెదరు గనుక ప్రాణమును 'రః' అనెదరు. ఈ విధంగా గుర్తించిన ఉపాసకునియందు అందరు ప్రవేశించెదరు. సంతోషించెదరు. 221

**శ్లో॥ ధ్యాయేత్ప్రాణమథోక్థమిత్యయమిదం సర్వం యదుత్థాపయ-**
**త్యస్మాదుక్థవిదస్సుతోఽ ప్యనుగుణో వీరస్సముత్తిష్ఠతి ।**
**విద్యాతారతమత్వతో వివిదయం సాలోక్యముక్థస్య వా**
**సాయుజ్యం ప్రతిపద్యతే పునరిదం యో వేద సోఽప్యశ్నుతే ॥ 222**

భావ॥ అన్నప్రాణద్వయోపాసన పూర్వం చెప్పబడినది. ఇపుడు ప్రాణములనే ఉక్థమను (యజ్ఞంలోని) శస్త్రవిశేషముగా ఉపాసించు విధానము చెప్పబడుచున్నది. ప్రాణమును ఉక్థమని ధ్యానింపవలెను. అట్టి ఉపాసనకు అనుగుణంగా వీరుడయిన పుత్రుడు కలుగును. ఇట్టి విశేషజ్ఞాని విద్యా తారతమ్యమువలన ఉక్థరూపమయిన ప్రాణము యొక్క సాలోక్యమునో సాయుజ్యమునో పొందును. ఈ మహిమనెరిగిన వాడయినా అట్లే పొందును. 222

**శ్లో॥ తత్ప్రాణం యజురిత్యయేత్సమమయం యస్మాన్మిథో యోజయ-**
**త్యస్మై సర్వమిదం బుధాయ భువనం శ్రైష్ఠ్యాయ చోద్యచ్ఛతే ।**
**సామేత్యేన మయేత్సమఞ్చతి యతః ప్రాణే సమస్తం జగ-**
**త్తస్మిన్ సర్వమిదం సమఞ్చతి బుధే శ్రేష్ఠశ్చ సర్వేషు సః ॥ 223**

భావ॥ ప్రాణమును 'యజుః' అని ఉపాసించవలయును. ఎందుకనగా, ఈ ప్రాణమే సమస్త భూతములను (శరీరాది రూపమున) కలిపి యుంచును. ఇట్లు తెలిసిన జ్ఞానిని ఈ లోకమంతా శ్రేష్ఠునిగా చేయును. ఇట్టి యజుః ప్రాణోపాసకునికి దానితో సాయుజ్యాదికం లభించును. అట్లే ప్రాణమును సామముగా నుపాసింపవలయును. ఎందుకంటే, ప్రాణమునందే యీ సమస్త ప్రపంచము కలియును. ఇదంతయు ఆ జ్ఞానియందే కలియును. కనుక అతడు సర్వశ్రేష్ఠుడు. 223

**శ్లో॥ ప్రాణం క్షత్రమితి ప్రవేత్తు విబుధో యస్మాత్ క్షతాత్త్రాయతే**
**ప్రాణః పిణ్డమతో భవత్యయమితి క్షత్త్రం య ఏవం విదన్ ।**

**ధ్యాయేత్స ప్రతిపద్యతే పునరిమం క్షత్త్రం బతాత్రం పరం**
**ప్రాణం వేద య ఏవమేష స భజేత్ క్షత్త్రస్య సాయుజ్యకమ్ ॥ 224**

భావ॥ ప్రాణమును క్షత్త్రముగానుపాసన చేయవలయును. ఎందుకంటే, ఇది క్షతమునుండి (శస్త్రాదుల వలన అయిన గాయమునుండి - దానిని మాన్పి) యీ శరీరమును రక్షించును గదా? ఇట్లు భావించియుపాసించినవాడు అట్టి క్షత్త్రమయిన ప్రాణమును పొందును. ఇట్లు తెలిసినవేత్త క్షత్త్రప్రాణ సాయుజ్యమును పొందును. (అత్రం = ఇతరుల చేత రక్షింపబడని)224

**శ్లో॥ గాయత్ర్యాః ప్రథమే పదే వితనుయాత్త్రైలోక్యదృష్టిం బుధో**
**ద్వైతీయీకపదే పునర్వితనుయాత్త్రైవిద్యదృష్టిం తథా ।**
**తార్తీయీకపదే పరం వితనుయాత్ప్రాణత్రయీదర్శనం**
**తుర్యే సా చ పదే పరోరజసి సంయాతా ప్రతిష్ఠామ్పరామ్ ॥ 225**

భావ॥ గాయత్రీ ప్రథమ పాదమయిన "తత్సవితుః వరేణ్యం" నందు జ్ఞాని త్రిలోకదృష్టితో భావన చేయవలయును. అందు

1. తత్ సవితుః వరేణ్యం = 8 అక్షరములు. భూమి అంతరిక్షం ద్యౌః (దివ్) 8 అక్షరములు (ద్యౌః దివ్ యొక్క రూపం కనుక రెండు అక్షరములు 'ద,య' అనునవి)

ద్వితీయ పాదమునందు వేదత్రయీ దృష్టి చేయవలనును.

2. భర్గో దేవస్య ధీమహి - '8' అక్షరములు. ఋచః యజూంషి సామాని - 8 అక్షరములు.

3. తృతీయ పాదమునందు ప్రాణత్రయ భావన చేయవలయును. "ధియో యోనః ప్రచోదయాత్" 8 అక్షరములు. (యాత్ - ఒకటే అక్షరం)

ప్రాణః అపానః వ్యానః - 8 అక్షరములు. (వ్యా - రెండు(వయ))

తురీయ పాదమున ఈ త్రిపద గాయత్రి పరోరజస్సు అయిన బ్రహ్మమునందు పరమ ప్రతిష్ఠ పొందినది. కనుక "పరో రజసి సావదోమ్" తురీయ పాదము.

ఇది గాయత్రి అను ఉపాధితో బ్రహ్మను ధ్యానించుట. వీటికి త్రైలోక్య జయము, త్రివిద్యా జయము, ప్రాణత్రయ జయము. గాయత్రి = ఉపాధి గాగల బ్రహ్మత్వం ఫలములు. 225

**శ్లో॥ ఆదిత్యస్స పరోరజాః ప్రతిగతస్సత్యే ప్రతిష్ఠాం పరాం**
**సత్యం చక్షురిదం బలే బలమితి ప్రాణస్తదేవం బలే ।**
**గాయత్రీ తదియం నిగద్యత ఇతి ప్రాణో భజన్త్యేకతాం**
**దేవాః కర్మఫలాని యత్ర జగతస్సాఽఽత్మా ప్రతిష్ఠా యతః ॥ 226**

భావ॥ రజోమయలోకములకన్న పరముడయిన సర్వేశ్వరుడయిన ఆ ఆదిత్యుడు సత్యమునందు పరమ ప్రతిష్ఠ పొందెను. ఈ నేత్రము సత్యము. నేత్ర దృష్టమయినది సత్యమన్న భావన ఉంటుంది గదా! ఈ నేత్రం బలములో ప్రతిష్ఠిత మయినది. బలమనగా ప్రాణము. ఈ గాయత్రి ఆ ప్రాణమునందు ప్రతిష్ఠితురాలు గనుక గాయత్రి ప్రాణమని చెప్పబడినది. ప్రాణరూపమయిన యీ గాయత్రి యందు ప్రాణములు వేదములు సమస్త కర్మఫలములు కలిసియున్నవి. అట్టి ప్రాణరూపగాయత్రి ప్రపంచమునకు ఆత్మ అగును. 226

**శ్లో॥ త్రాణాత్ప్రాణతతేరియం ప్రతిగతా గాయత్ర్యభిఖ్యాం గయాః**
**ప్రాణా వాఙ్ముఽఖరా హి శబ్దకరణాదాచార్య ఏనాన్తు యః ।**
**సావిత్రీమనువక్తి యస్య స వటోస్తస్యాఖిలాంస్త్రాయతే**
**ప్రాణాంస్తన్నరకాదిసన్నిపతనాద్బ్రాహ్మణ్యమస్యా వశమ్ ॥ 227**

భావ॥ ప్రాణతతిని రక్షించటం వలన ఈ గాయత్రి "గాయత్రి" అనుపేరును సంపాదించికొన్నది. గయాః = గాన శీలమయిన వాక్కు మొదలయిన ప్రాణములు శబ్దములు చేయుట వలన 'గయములు'. అట్టి గయములయిన ప్రాణములను రక్షించుటవలన 'గాయత్రి' అగును. ఈ సూర్యదేవతాకమయిన సావిత్రి అయిన గాయత్రిని వటువునకు ఉపదేశించు ఆచార్యునకు ఈ గాయత్రి సమస్త ప్రాణములను రక్షించును. నరకాది పతనము నుంచి కాపాడును. బ్రాహ్మణత్వము ఈ గాయత్రికి అధీనము. 227

విశే॥ గయాన్ త్రాయతే = గాయత్రీ. గాయంతి = గయాః. "గాయత్ర్యా బ్రాహ్మణ మసృజత, త్రిష్టుభారాజసం, జగత్యావైశ్యం" అని శ్రుతి.

**శ్లో॥ సావిత్రీం ప్రదిశన్తి కేచన బుధా ఆనుష్టుభీం సాహసా-**
**చ్ఛిష్యేభ్యోఽనువదామ ఏవ వయమిత్యేభ్యో గిరం భాషిణః ।**
**గాయత్ర్యైవ వితీర్ణయా వటుతతేర్వాగాదికం హ్యర్పితం**
**సర్వం తద్గురుణేతి యుక్తమిదమేవాన్యన్మృషైవోదితమ్ ॥ 228**

భావ॥ కొందరు పండితులు తమ శిష్యులకు అనుష్టుప్ ఛందస్సులోనున్న సావిత్రీ మంత్రమును ఉపదేశించెదరు. అది సాహసము. గురువు వటువుకు గాయత్రీ మంత్రం చేత ఇవ్వబడిన వాక్కు మొదలయినవే సమర్పితమవుతాయి. **అనుష్టుప్ ద్వారా చెప్పిన గాయత్రీ మంత్రము మిథ్యయే.** 228

విశే॥ తత్సవితుః వృణీమహే వయందేవస్యభోజనమ్ । శ్రేష్ఠం సర్వధాతమం తురం భగస్య ధీమహి" ఇది అనుష్టుప్పులో సావిత్రి.

**శ్లో॥ గాయత్ర్యాః ప్రథమం ప్రతిగ్రహకృతాల్లోకత్రయస్యైనస-**
**స్త్రైవిద్యస్య పదం ద్వితీయమపరం ప్రాణస్య రక్షేద్విదమ్ ।**
**తుర్యం తత్పదమప్రతిగ్రహసమం సర్వోత్తమం సత్ఫలం**
**గాయత్రీతి మహానుభావకలితా సర్వైరుపాస్యా బుధైః ॥ 229**

భావ॥ గాయత్రి ఉపాసకునికి ప్రతిగ్రహకృతమయిన దోషం రాదు. ప్రథమ పాదము లోకత్రయ ప్రతిగ్రహ జన్యం అయిన పాపం, ద్వితీయ పాదం వలన వేదత్రయీ ప్రతిగ్రహ జన్యమయిన పాపము, తృతీయ పాదము వలన ప్రాణప్రతిగ్రహకృతమయిన పాపము నశించును. తురీయ పాదము ప్రతిగ్రహ సమానం కానిది. సర్వోత్తమమయినది, సత్ఫలమయినది. కనుక ఇట్లు మహాప్రభావ కలితమయిన గాయత్రి ఉపాసనీయము. 229

విశే॥ త్రైలోక్యప్రతిగ్రహం అసాధ్యం(వామనునికి తప్ప). (విద్యాత్రయ ప్రతిగ్రహం ఎందుకో దోషం కదా? గురువు చెప్పవలసినదే గదా అది? ప్రాణత్రయ పరిగ్రహం ఎలా సంభవము?) కనుక ఇది సర్వవిధ ప్రతిగ్రహదోషాలకు విరుగుడని చెప్పటంలో తాత్పర్యం. కనుక పైన చెప్పిన పరిగ్రహాలు కల్పితాలు.

**శ్లో॥ గాయత్ర్యేకపదీ జగన్మయపదేనాసి త్రివిద్యాపదే-**
**నాస్యేవ ద్విపదీ త్రిపద్యపి పదా ప్రాణాదిరూపేణ చ ।**
**ఆదిత్యేన చతుష్పదీ పరపదేనాపి స్వతోఽపద్భవ-**
**స్యస్మై తేఽస్తు నమః పదాయ చరమాయాభీష్టసన్ధాయినే ॥ 230**

భావ॥ గాయత్రీ నమస్కారము. జగన్మయ ప్రథమ పదముతో నీవు ఏకపదివి. త్రివిద్యా ద్వితీయ పాదముతో ద్విపదివి. ప్రాణాది రూప తృతీయ పాదముతో త్రిపదివి. ఆదిత్య రూపమయిన తురీయపాదముతో చతుష్పదివి. కాని బ్రహ్మరూపముగా పాదరహితవు. అనగా అఖండరూపవు. అభీష్టసంధాయి అయిన నీ చరమ పాదమునకు నమస్కారమగుగాక! 'న, న' అని సర్వపాద రూప ప్రపంచనిషేధావధి అయిన నిరుపాధిక బ్రహ్మరూపం కనుక గాయత్రి తత్త్వతః "పాదరహిత". 230

**శ్లో॥ గాయత్ర్యా ముఖమగ్నిరేవ దహనస్సర్వం యథైధో దహ-**
**త్యాత్మస్థాపితమేవమేవ సకలం గాయత్ర్యభిజ్ఞః కృతమ్ ।**
**దగ్ధ్వా కల్మషమాప్య శుద్ధిమధికాం పూతోఽగ్నివన్నిర్జరో**
**నిర్వృత్యశ్చ భవన్ క్రమేణ పరమం బ్రహ్మైవ సమ్పద్యతే ॥ 231**

భావ॥ గాయత్రీ మంత్రమునకు అగ్ని ముఖము. అగ్ని తనలో వేసిన ఇంధనమును దహించి వేసినట్లు, తనయందు పడిన పాపములనన్నింటిని దహించి వేయును. కనుక గాయత్రీ

జ్ఞాని కల్మషమును దహించి అధిక శుద్ధిని పొంది అగ్నివలె పవిత్రుడై జరామరణములు లేనివాడై క్రమంగా పరమమయిన బ్రహ్మమును చేరును. గాయత్రి – ఉపాసకుడు గాయత్రీ రూపు డగును. 231

**శ్లో॥ పాత్రేణేవ హిరణ్మయేన పిహితం బిమ్బేన సత్యం పదం**
**తత్త్వం తూర్ణమపావృణు ప్రియకృతే సత్యాత్మనో మే రవే ।**
**ఏకర్షే యమసూర్యరశ్మినిచయం పూషన్ జహీహి త్విషాం**
**సఙ్కోచం కురు వా తథా తవ పదం వీక్షేయ భవ్యం యథా ॥ 232**

భావ॥ **జ్ఞానకర్మసముచ్చయకారి అయినవాడు** మరణకాలమున గాయత్రీ తురీయ పాదమయిన ఆదిత్యునిట్లు ప్రార్థించుచున్నాడు. ఇష్టమయిన వస్తువును హిరణ్మయపాత్రలో దాచి ఉంచినట్లు, నీ లోని సత్యస్థానమయిన బ్రహ్మము హిరణ్మయ బింబముచేత కప్పివేయబడినది. ఓ సూర్యదేవా! సత్యస్వరూపుడనయిన నా కొఱకు ఆ అచ్ఛాదనను కొంచెము తెఱచియుంచుము. ఓ ఏకర్షీ! యమా! సూర్య! పూషదేవా! నీ కిరణ సమూహమును వదలికొనుము. లేదా, కొంచెము సంకోచ పఱచుము. అపుడు భవ్యమయిన నీ పదమును చూడగలిగెదను. 232

విశే॥ తూర్ణం = త్వరగా అనగా మరణం సన్నిహితంగా ఉన్నది కనుక. ఏకర్షీ = అసహాయంగా ఆకాశమున సంచరించువాడు. లేదా, సర్వజగత్తుకు ఆయనయే నేత్రం కనుక సర్వజగత్సాక్షి అని అర్థము. (ని)యమించువాడు కనుక యముడు. సూర్య = ప్రేరకుడు. పూషన్ = పోషకుడు. సహజ కిరణ సమూహం వదలటం కుదరదు కనుక సంకోచం కోరబడినది.

**శ్లో॥ వ్యాహృత్యఙ్గధరోఽస్తి యోఽత్ర పురుషో బ్రహ్మ హిరణ్యోదరః**
**సోఽహం చాస్మ్యమృతో మమైతు పతితే సత్యస్య దేహేఽనిలమ్ ।**
**ప్రాణో ఽన్యా అపి దేవతా విదధతు స్వస్వప్రకృత్యాత్మతాం**
**భస్మాన్తఞ్చ శరీరమేతదయతాం సాయుజ్యముర్వ్యాస్తథా ॥ 233**

భావ॥ భూః భువః సువః అను వ్యాహృతులే శరీరముగా గల హిరణ్యగర్భుడయిన పురుషుడే బ్రహ్మం. అతడే నేను. నేను అమృతుడను. నా దేహము మరణం వలన పడిపోయిన తరువాత ఈ దేహమునందలి ప్రాణవాయువు వాయువులో చేరుగాక! మిగిలిన ఇంద్రియాధిదేవతలు తమతమ ప్రకృతులలో లీనమగుగాక! ఈ శరీరం భస్మముగా భూమితో సాయుజ్యమును పొందెదరు గాక! అని సాధకుడు భావించవలయును. 233

**శ్లో॥ ఓమగ్నే! స్మర మే క్రతో స్మర కృతం మాం శోభనేనాధ్వనా**
**దివ్యేనాపునరాగమేన మహతో లోకం నయ బ్రహ్మణః ।**

**సర్వేషాం వయునాని వేత్సి భగవం స్త్వం ప్రాణినాం కల్మషం**
**సర్వం నాశయ సేవితుం న కుశలస్త్వామద్య కుర్వే నతిమ్ ॥ 234**

భావ॥ ఓం. ఓ అగ్నీ సంకల్పరూప! కనుకనే క్రతురూపా! నేను చేసిన యజ్ఞాదులను స్మరింపుము. నన్ను పునరావృత్తి రహితమయిన దేవయానరూప, శోభన మార్గములో మహత్తత్త్వ స్వరూపుడయిన హిరణ్యగర్భునిలోకమునకు తీసికొనిపొమ్ము. సర్వప్రాణుల జ్ఞానముల (కర్మలు) నీకు తెలిసినవే. నేను చేసిన పాపములను దహించివేయుము. నిన్ను గొప్పగా సేవింపగల కుశలుడను కాకపోతిని. నేడు అందుకు గాను నీకు నమస్కరించుచున్నాను. "అగ్నిః దేవో ద్విజాతీనాం" "అగ్ని మీళే పురోహితమ్" కనుక ఉత్తరమయిన అర్చిరాది మార్గమును ప్రారంభించువాడు అగ్ని. కనుక మరణసమీపమున నున్నవాడు ఇట్లు అగ్నిని ప్రార్థించును. 234

**శ్లో॥ జ్యేష్ఠశ్రేష్ఠవసిష్ఠసమ్పదయనోత్పత్తిప్రతిష్ఠాత్మకో-**
**గాయత్రీతి నిగద్యతే స హి మహాన్ ప్రాణో న వాగాదయః ।**
**ప్రాణత్యక్తమిదం వపుర్భవతి యత్పాపిష్ఠమన్యైర్న వా**
**యో వేదేతి స యాతి తం గుణగణం ప్రాణాశ్రయం స్వాశ్రయః ॥235**

భావ॥ జ్యేష్ఠుడు శ్రేష్ఠుడు. వసిష్ఠుడు (శరీరంలో బాగా ఉండువాడు) సంపత్తు, ఆయతనము, ఉత్పత్తి, ప్రతిష్ఠ అయినందును ఆ ప్రాణమే గాయత్రి. అయితే వాక్కు వసిష్ఠమయినను, చెవి సంపద అయినను, హృదయం ఆయతనమయినను, వీర్యము ఉత్పత్తి అయినను, నేత్రము ప్రతిష్ఠ అయినను, అవి గాయత్రి మాత్రం కాలేనివే. ఎందుకంటే ప్రాణమే వాటికన్న శ్రేష్ఠము. ప్రాణము వదిలిన శరీరం క్రుళ్లి పోతుంది. వాగాదులు వదలిన శరీరం అలా పోదు. ఇలా ఉపాసించినవాడు ఆ ప్రాణముయొక్క శ్రేష్ఠత్వాది గుణములను పొందును. 235

**శ్లో॥ ప్రాణస్యాన్నమిదం సమస్తమవనౌ యద్భుజ్యతే ప్రాణిభి-**
**ర్వాసస్తస్య తు పీయతే యదుదకం తద్బ్రాహ్మణాశ్శ్రోత్రియాః ।**
**ప్రాక్పశ్చాదపి భోజనాచ్ఛుభజలం స్వాచమ్య తన్మన్వతే**
**ప్రాణం వస్త్రధరం దధామ ఇతి యో వేదాన్నవస్త్రే భజేత్ ॥ 236**

భావ॥ మరొక ప్రాణోపాసన - దాని ఫలము: ప్రాణులు తినే ఆహారములన్నియు ప్రాణమునకు ఆహారమే. త్రాగు నీరు ఆ ప్రాణమునకు వస్త్రము. అందుకని శిష్టులయినవారు భోజనమునకు ముందు వెనుక ఆచమనము చేసి ప్రాణమునకు దిగంబరత్వమును తప్పించి వస్త్రధారణ చేసినట్లు భావించెదరు. **అట్టి ఉపాసకులు తామున్ను అన్నవస్త్రములు గల వారగుదురు.** 236

శ్లో॥ ద్యుభ్రక్ష్మాపురుషాఙ్గనా ఇతి మతాః పఞ్చాగ్నయో దేవతాః
శ్రద్ధాసోమకవర్షకౌదనరసాంస్తేషు క్రమాజ్జుహ్వతి ।
జాయన్తే పురుషాస్తతో విదురిదం యే శ్రద్ధయా కాననే
సత్యం సమ్యగుపాసతే చ విబుధా యాయుః పదం తే విధేః ॥ **237**

భావ॥ ద్యులోకము, పర్జన్యుడు, భూలోకము, పురుషుడు, స్త్రీ – ఇవి "5" అగ్నులు. వీటియందు క్రమముగా శ్రద్ధ, జలము, సోమము, వర్షజలము, అన్నము, వీర్యము – వీటిని హోమము చేసినట్లు భావన. దీనివలన పురుషులు జన్మించెదరు. ఈ విషయము నెరిగి శ్రద్ధగా అరణ్యములో ఉపాసన చేసిన వారికి హిరణ్యగర్భ లోకము లభించును. 237

శ్లో॥ అర్చిర్వహ్నిసితోత్తరాయణసురస్థానార్కవిద్యుత్పదా–
న్యాక్రమ్య క్రమశో విధేః పదమిమే సన్మానసేనాపితాః ।
తిష్ఠన్త్యత్ర పరాః పరార్ధయుగలావచ్ఛిన్నకాలావధి–
ర్ధాతా తిష్ఠతి యావదాగతిమితో నో వా లభన్తే పునః ॥ **238**

భావ॥ బ్రహ్మలోకమార్గము అర్చిరాది మార్గము. అదే దేవయానము. అర్చి, అగ్ని, శుక్లపక్షము, ఉత్తరాయణము, దేవలోకము, సూర్యలోకము, విద్యుల్లోకములను దాటి క్రమముగా మనో రూప బ్రహ్మముచేత సృష్టింపబడిన బ్రహ్మలోకమును చేరెదరు. అచ్చట 2 పరార్ధముల కాలము బ్రహ్మమున్నంత కాలముండి ఆయనతోనే ముక్తి చెందెదరు. పునరావృత్తులు కారు. 238

శ్లో॥ ఇష్టాపూర్తకృతోఽథ ధూమరజనీకృష్ణాంశ్చ సవ్యాయనం
పైత్ర్యం చాన్ద్రముపేత్య దేవపశవః ప్రత్యాగతాస్తత్పునః ।
ఆకాశానిలవృష్టికూరధిగతా భూత్వాఽన్నమాప్తా రసం
హూయన్తే స్త్ర్యనలే భవన్తి పురుషా అన్యే తు కీటాదయః ॥ **239**

భావ॥ కర్మఠులయిన వారి మార్గము ధూమమార్గము. పితృయానము. ఇష్టాపూర్తములు చేసిన వారు ధూమము, రాత్రి, కృష్ణ పక్షము, దక్షిణాయనము, పితృలోకము, చంద్రలోకము లను చేరి అచ్చట దేవతలకు కింకరులై పశుప్రాయులై, మరల జన్మకు వచ్చెదరు. ఆకాశము వాయువు, వర్షము, భూమి, అన్నము, వీర్యము – ఈ మార్గముల ద్వారా తిరిగి వచ్చి స్త్రీ అను అగ్నిలో హోమద్రవ్యమై పురుషులగుదురు. ఈ రెండు మార్గములను పొందలేనివారు కీటాది జన్మలను పొందెదరు. 239

శ్లో॥ ప్రాణోపాసక ఆత్మశుద్ధికరసత్కర్మాచికీర్షుర్మహో
విత్తోపార్జనకృన్మహత్త్వకృతయే మన్థాఖ్యకర్మాచరేత్ ।

**పుణ్యాహే క్వచనోత్తరాయణగతే శుక్లే పయో భక్షయన్**
**స్మృత్యుక్తం విధిమాభృతోపకరణస్సన్ ద్వాదశాహం వ్రతీ ॥ 240**

**శ్లో॥ కంసే వా చమసేఽ ప్యదుమ్బరమయే సర్వౌషధీనాం ఫల-**
**స్తోమస్యాపి నిధాయ సాధు మధునా దధ్నా చ మన్థం ఘృతైః ।**
**ఆసిచ్యావసథానలే ప్రజుహుయాద్యావన్త ఇత్యాదిభి**
**ర్మన్త్రైర్మన్త్రమయం స్పృశన్నపి గిళేద్గాయత్రపాదైః ఖిలమ్ ॥ 241**

భావ॥ శ్రేష్ఠ జ్యేష్ఠమని చెప్పబడిన ప్రాణమునుపాసించువాడు చిత్తశుద్ధికరమయిన సత్కర్మలను బాగా చేయదలచినవాడై, అందుకొఱకు కావలసిన బహుద్రవ్యము కొఱకు, అట్టి ధన మహత్త్వముకొఱకు "మంథం" అను కర్మ చేయవలయును. ఎట్లనగా పుణ్యదినమున ఉత్త రాయణమున, శుక్ల పక్షమున 12 రోజులు పయోభక్షణ చేయుచు, స్మృతిలో చెప్పబడిన విధి ప్రకారము సర్వసామగ్రితో "మంథకర్మ" చేయవలయును. (ఇట్టిదే పయోవ్రతము చేసి అదితి వామనుని కని పూర్వ సంపదలు తిరిగి పొందినది - చూడండి. భాగవతం వామనావతారకథ)

ఆ రోజులలో సర్వౌషధుల యొక్క ఫలముల యొక్క "మంథమును" ఉదుంబర (మేడి) మయమయిన కంచములో లేదా చమస పాత్రలో, తేనెతో పెరుగుతో నేయితో కలిపి గార్హపత్యాగ్నిలో హోమము చేయవలయును. "యావంతః - " మొదలయిన మంత్రములతో ఆ హవనము చేయవలయును. మంత్రమయమయిన ఆ "మంథశేషమును" తాకుచు గాయత్రిపాదములతో భక్షించవలయును. 240-241

**శ్లో॥ మన్థస్యాస్య సమాగమాదపి తరుశ్శుష్కః ప్రరోహేత్పునః**
**కిం వక్తవ్యమముష్య సజ్గిళనజం భూయో మహత్త్వం నృణామ్ ।**
**కర్మోద్దాలకయాజ్ఞవల్క్యమధుకాద్యాచార్యసన్తానత-**
**స్సమ్ప్రాప్తం భువమారచయ్య తదయం లోకో మహాన్ జాయతామ్ ॥242**

భావ॥ ఈ మంథం తగిలినట్లయితే ఎండిన చెట్టు గూడ మరల చిగురించును. ఇక దీనిని తినటం ద్వారా మనుష్యులకు వచ్చే అధిక సంపదల గురించి ప్రత్యేకముగా చెప్పనవసరం లేదు. ఉద్దాలకుడు, యాజ్ఞవల్క్యుడు మధుకుడు మొదలయిన ఆచార్యుల పరంపరనుండి యీ లోకమునకు ప్రాప్తమయిన ఈ 'మంథం' అను కర్మను ఆచరించి లోకము 'మహాన్' అగుగాక! 242

**శ్లో॥ భూతానాం ధరణీ రసశ్చ ధరణేరాపోఽప్యపామోషధి**
**స్తస్యాః పుష్పమిదం రసోఽస్య తు ఫలం తేషాం పుమాన్వై రసః ।**
**రేతస్తస్య రసః ప్రజాపతిరధాత్తస్య ప్రతిష్ఠాం స్త్రియం**
**సృష్ట్వా సోఽథ ఉపాస్త తత్త్రి స్త్రియముపాసీతాధునా సాధు నా ॥ 243**

భావ॥ పైన చెప్పినది శ్రీమంధకర్మ. ఇదిచేసిన వానికే పుత్ర మంధకర్మలో అధికారము. చరాచరభూతములకు భూమి సారము. భూతములకు పృథివి మధు అని చెప్పబడినది గదా! భూమికి జలము, జలమునకు ఓషధులు, ఓషధులకు పూలు, పూలకు ఫలము, ఫలమునకు (అన్నము) పురుషుడు, పురుషునకు వీర్యము సారము. ఇట్లు అత్యంత రసతమమయిన వీర్యమునకు ప్రతిష్ఠగా ప్రజాపతి స్త్రీని సృజించెను. ఆయన ఆ స్త్రీని సేవించెను. అందువలన పురుషులందఱు స్త్రీని చక్కగా సేవింపవలెను. అనగా దాంపత్యము నాచరింపవలయును. "యద్యదాచరతి శ్రేష్ఠః తత్త దేవేతరోజనః" – గీత. 243

**శ్లో॥ ప్రాఇ్చం స వ్యదపూరయత్ర్పజననం గ్రావాయితం చేన్ద్రియం**
**నార్యా వ్యఞ్జనమాత్మనః ప్రతి మహానస్యా ఉపస్థః పునః ।**
**వేది ర్లోమ చ బర్హిరాధిషవణే ముష్కౌ సమిద్ధోఽనలో**
**మధ్యే చర్మ చ వాజపేయమఖినో లోకానిదంవిద్వ్రజేత్. 244**

భావ॥ పశుకర్మ అయిన మైథునమునుపదేశించట మేమిటి? అని ప్రశ్న – వాజపేయ మఖంతో సమానత్వం కోసం చెప్పబడినది. మహాత్ముడయిన ప్రజాపతి సోమం పిండే రాయితో సమానమయిన తన రేత – ఇంద్రియమును స్త్రీలింగమునందు పూరించెను. అనగా స్త్రీని కలిసెను. నారీ యోని భాగము అగ్ని వేదిక. రోమములు దర్భలు. వృషణములు ఆధిషవణములు అనగా సోమరసఫలకములు. మధ్యలో దీప్తమయిన అగ్ని గలదు. రహస్య దేశము నందలి చర్మము సోమఖండనార్థం అవసరమయిన ఎద్దు చర్మము. కనుక మైథునమున ఈ విధముగా వాజపేయయాగభావన చేసిన వానికి వాజపేయయాజి గతులు కలుగును. కనుక **మైథునమే గదా యని తక్కువగా చూడరాదు.** 244

**శ్లో॥ యో విద్వానితి కామినీపరిషదా చాథోపహాసం చర–**
**త్యేష స్త్రీనివహస్య సర్వసుకృతం వృఙ్క్తే స్వయం మానవః ।**
**యోఽ విద్వానథ కామినీపరిషదా చాథోపహాసం చర–**
**త్యస్య స్త్రీనివహస్సమస్తసుకృతం వృఙ్క్తే స్వయం దుర్మతేః ॥ 245**

భావ॥ (అథోపహాసం = మైథునం) ఈ విధమయిన జ్ఞానము పొందిన విద్వాంసుడు ఇట్టి వాజపేయ భావనా సహితమయిన మైథున కర్మతో ప్రవర్తించినచో అట్టి స్త్రీల సమస్త సుకృతమును తాను భేదించును. ఈ భావన లేక మైథునమాచరించవాని సుకృతమునే ఆ స్త్రీలు హరించెదరు. **కనుక అజ్ఞానంతో మైథునకర్మ చేయువాడు పాపియే.** 245

**శ్లో॥ స్వాపే జాగ్రతి వాత్మనోఽల్పమధికం రేతో యది స్కన్దతి**
**ప్రాజ్ఞస్తత్పరిమృశ్య యన్మ ఇతి చామన్త్ర్య భ్రువోరన్తరే ।**

**నిర్మృజ్యాత్తనయోస్తథా ఋతుమతీం స్నాతాం స్వభార్యాం ధనై-**
**ర్వస్త్రైరాభరణైర్విధాయ చ వశాం స్వస్మిన్ సకామాం తతః ॥ 246**

**శ్లో॥ ఆయాచ్యోరుయుగం వియోగమభితస్సంస్పృశ్య వారత్రయం**
**విష్ణుర్యోనిమితీరయన్నిజముఖం కృత్వా ప్రియావక్త్రగమ్ ।**
**విద్వాన్మన్మథసున్దరో మమ సుతో భూయాదితి ప్రార్థయన్**
**రేతోఽస్యా జుహుయాదుపస్థదహనే జాయేత తస్మా త్సుతః ॥ 247**

భావ॥ జాగరణంలోగాని స్వప్నంలోగాని వీర్యం స్ఖలనం అయినచో ప్రాజ్ఞుడు దానిని గ్రహించి 'యన్మే-' అను మంత్రముతో మంత్రించి భ్రూమధ్యమున గాని ఛాతీమధ్యమున గాని ధరించవలయును. అట్లే తరువాత ఋతుమతి అయిన భార్యను ధన వస్త్రాభరణాదులతో తనయందు కోరిక గలిగించి వశము చేసికొనవలయును.

అడ్డముగా నున్న ఊరుయుగమును విడిపొమ్మని ప్రార్థించవలయును. "విష్ణుర్యోనిం-" మొదలగు మంత్రముతో మూడుసార్లు భార్యను సర్వాంగములయందు స్పృశింపవలయును. ఆమె ముఖము మీద తనముఖమును పెట్టి యా మంత్రములను (విష్ణుర్యోనిం-) చదువవలెను. ఆతరువాత తనకు 'విద్వాంసుడు మన్మథసుందరుడు అయిన కొడుకు కలగవలెనని ప్రార్థించుచు రేతస్సును స్త్రీయోనిలో హోమము చేయువలయును. దానివలన మంచి పుత్రుడు కలుగును. 246-247

**శ్లో॥ కుర్యాద్వేద ఇతి ప్రియస్య తనయస్యాఖ్యాం రహస్యాం పితా**
**జాతోఽయం యశసా శ్రియా పితృతతేర్భూయాన్నవేత్తేజసా ।**
**లోకానేష పితుర్దిశేదపి పరానేనేన సఞ్జీయతే**
**లోకోఽయం చ పరస్తు పారమయమేత్యేనేన నో సంసృతేః ॥ 248**

భావ॥ తన ప్రియతనయునకు తండ్రి "వేదః" అని, గోప్యమయిన పేరు పెట్టవలయును. అలా పుట్టిన యీ పుత్రుడు తేజస్సుతోనూ, కీర్తితోనూ, సంపదతోనూ, పితరులకు పెన్నిధి కాగలడు. ఇతడు ఉత్తర క్రియల ద్వారా తండ్రికి పరలోకములను జయించి పెట్టగలడు. అతనివలన తండ్రి యీలోకమును గూడా జయించగలడు. కాని యీ పుత్రుని వలన సంసారసముద్ర పారమును మాత్రము దాటలేడు. 248

**శ్లో॥ నాహం బ్రహ్మధియా నిమగ్న ఇహ యస్సంసారపాథోనిధౌ**
**బ్రహ్మైవాహమితి ప్రభామయమృతే తం సన్తరేద్వా కథమ్ ।**
**ఆత్మైవాస్య తతః పితా చ తనయో మాతా చ బన్ధుర్గురు-**
**ర్దేవః పాలక ఈశ్వరశ్చ పరమం మిత్రం పరా వా గతిః ॥ 249**

భావ॥ 'నేను బ్రహ్మమును కాను' అన్న అజ్ఞానముతో నుండుట వలన సంసార సముద్రమున మనిగిన వాడు "నేను బ్రహ్మమునే" అన్న జ్ఞానం వస్తే తప్ప ఎలా? సంసారమునుండి తరింపగలడు? అతనికి ఆత్మయే తండ్రి. తల్లి, కొడుకు, బంధువు, గురువు, దేవుడు, పాలకుడు, ఈశ్వరుడు, పరమ మిత్రము, పరమగతి. అజ్ఞానికి కర్మబంధము తప్పదు గనుక ముక్తి రాదు. పుత్రుని వలన అందులో మార్పురాదు. పుత్రుడు జ్ఞాని అయినా తండ్రికి జ్ఞానము లేనిదే ముక్తిరాదు. 249

**శ్లో॥ కాన్తాయోనిబిలేఽ ప్రవేశ్య తదిదం రేతోఽన్ధకూపే యథా**
**స్వాత్మానం శిరసి ప్రధార్య విజనే క్వాపి స్థితస్సన్ యతిః ।**
**ఏకాగ్రేణ హృదా హృదన్తరగతం దివ్యం నభశ్చిన్తయన్**
**సద్బ్రహ్మైతి పుమాన్ పదం పరతరం తస్మాచ్చ నావర్తతే ॥ 250**

భావ॥ తనను తాను అంధకూపములో పడవేసికొన్నట్లు తన బలాది హేతుభూతమయిన **వీర్యమును స్త్రీయోనిగతం కాకుండా ఊర్ధ్వగతం చేసికొని బ్రహ్మచారియై సన్న్యసించి,** ఆత్మ చింతన మొదలుపెట్టి నిర్జన ప్రదేశమున నుండి ఏకాగ్రమనస్సుతో హృదయగుహాంతరమందున్న దివ్యాకాశ రూపుడయిన పరమాత్మను ధ్యానింపవలయును. అట్టి పురుషుడు పరబ్రహ్మమును పొందును. ఇక ఆ జ్ఞాని తిరిగి రాడు. పునర్జన్మ లేదు. 250

విశే॥ గృహస్థు అయితే ఋతువులో దారగమనం విధి గదా! కనుక యతి కావాలి. ఇతనికి బ్రహ్మలోకకామం ఉన్నచో బ్రహ్మాత్మసాక్షాత్కారం ఉండదు. సత్యలోకము వెళ్లును. అది పునరావృత్తి రహితం. కనుక జ్ఞాన సంపాదన ద్వారా "ఉద్ధరేదాత్మనాత్మానమ్" – అని భావము.

బృహదారణ్యకోపనిషత్తు సమాప్తము.

శ్రీః

# ఐతరేయోపనిషత్

**శ్లో॥ సృష్టేః ప్రాగిదమేక ఏవ సమభూదాత్మైవ నాన్యత్కిమ-**
**ప్యాసీల్లోకచయం సృజేయమహమిత్యాదావసావైక్షత ।**
**లోకాన్ స వ్యసృజద్దివం ఖమవనీం పాతాలమప్యైక్షత**
**స్రష్టుం లోకపతీం స్తతోఽద్భ్య ఉదగాదణ్డం కిమప్యద్భుతమ్ ॥ 251**

భావ॥ పూర్వశ్లోకంలో హృదంతరగతమయిన పరమాకాశము అదే దివ్యాకాశము పరబ్రహ్మమని చెప్పబడినది. అదే ఎట్లో వివరింపబడును.

సృష్టికి ముందు ఈ ప్రపంచము ఏకముగా ఉన్నది. స్వగతభేదం గాని సజాతీయ విజాతీయ భేదం గాని లేదు. ఇది తప్ప వేరుగా ఏమియు లేదు. కేవలం ఆత్మయే ఉండెను. అది పంచభూతములను సృజించిన తరువాత లోక సమూహమును సృజింపవలయునని సంకల్పించెను. అతడు వెంటనే సంకల్పపూర్వకంగానే మహరాది లోకములను, ద్యావాపృథివులను, అంతరిక్షమును, పాతాలాది లోకములను మొత్తం చతుర్దశ లోకములను సృజించెను. వాటి పరిపాలనావ్యవస్థకొఱకు లోక పాలకులను సృజించెను. అంతట నీటినుండి ఆశ్చర్యకరమయిన విరాట్ రూపమయిన అండము పుట్టెను. “తస్మా ద్విరాడజాయత”. 251

విశే॥ “ఏకమేవాద్వితీయం ...” అను విషయంలో చెప్పవలసినదంతా ఛాందోగ్యంలో చెప్పాము. అచ్చటచూడవలసినది. శ్లోకం సంఖ్య 338 (పూర్వార్ధము)

**శ్లో॥ సఙ్కల్పాదుదభిద్యతాథ పురుషస్యాణ్డస్య వక్త్రన్తతో**
**వాగాసీదనలస్తతస్సమభవన్నాసే విభిన్నే తతః ।**
**నాసాభ్యాముదభూదసుస్తదసుతో వాయుర్విభిన్నే తతో**
**నేత్రే చక్షురభూత్తదక్షియుగలాత్తస్మాచ్చ సూర్యోఽభవత్ ॥ 252**

భావ॥ పురుషుని సంకల్పమువలన ఆ అండము పక్షి గ్రుడ్డువలె పగులు చూపెను. ఆ నోటినుండి వాక్కు వచ్చెను. దానినుండి అగ్ని వచ్చెను. తరువాత ముక్కులు విచ్చికొనెను. ఆ ముక్కులనుండి ప్రాణము వచ్చెను. (అనగా ఘ్రాణేంద్రియం). ఆ ప్రాణమునుండి నేత్రములు విచ్చికొనెను. దానినుండి నేత్రేంద్రియము ఏర్పడెను. దానినుండి సూర్యుడు ఆవిర్భవించెను. 252

విశే॥ 1. వాక్కుకు ముఖమునకు ఇచ్చట కార్యకారణ భావము లేదు. ఇంద్రియములు పంచీకృతము కాని పంచ భూతకార్యములు. అండము పంచీకృతమయిన పంచభూతకార్యము. అందువలన వక్త్రం అధిష్ఠానము. వాక్కు దానియందున్న అధిష్ఠేయం. అదే సంబంధము. ఇతరత్ర గూడా మిగిలిన వాటికిన్ని ఇదే సంబంధము. అదే కారణము. అగ్ని వాగింద్రియాధిష్ఠాన దేవత. ప్రాణము అనగా ఘ్రాణేంద్రియము అని అర్థము. వాయువు సూర్యుడు ఆయా ఇంద్రియాలకు అధిష్ఠాన దేవత.

**శ్లో॥ భిన్నం కర్ణయుగం తతస్సమభవచ్ఛ్రోత్రం తతోఽభూద్దిశా**
**నిర్భిన్నా త్వగథ త్వచస్సమభవన్ లోమాని తేభ్యోఽభవన్ ।**
**ఓషధ్యశ్చ వనస్పతిశ్చ హృదయం భిన్నం తతోఽభూన్మనః**
**శీతాంశుర్మనసోఽభవద్విధివశాన్నాభిస్తతోఽభిద్యత ॥ 253**

భావ॥ అదే వరసలో ఆ అండమునకు చెవులు ఏర్పడినవి. వాటినుండి శ్రవణేంద్రియము వచ్చెను. దానినుండి దిక్కులు (దేవతలు) ఏర్పడెను. తరువాత చర్మము ఏర్పడెను. దానినుండి రోమములు, వాటినుండి ఓషధులు, వనస్పతులు (వాయుదేవత) ఉద్భవించెను. తరువాత హృదయం పొడచూపినది. దానినుండి మనస్సు ఏర్పడినది. దానినుండి చంద్రుడు వచ్చెను. అలాగే ఈశ్వరసంకల్పము వలన 'నాభి' ఆవిర్భవించెను. 253

విశే॥ చంద్ర సూర్యులనగా వారి మండలములు కావు. ఆ దేవతలు అని 'అర్థము'. నాభి అనగా గుదమూలమని అర్థము. నాభివద్దనుంచి క్రింద ఉన్న ఇంద్రియం అది.

**శ్లో॥ తస్మాన్నాభిపదాదపాన ఉదభూన్మృత్యుస్తతోఽభూదథో**
**భిన్నం శిశ్నమభూత్తతస్సమభవద్రేతస్తదాపోఽభవన్ ।**
**తా ఏతా బత దేవతా స్సమపతన్ సంసారపాథోనిధౌ**
**మృత్యువ్యాధిజరామహామకరగేఽ పారే చ దుఃఖోదకే ॥ 254**

భావ॥ ఆ నాభిపదమునుండి అనగా గుదమూలమునుండి అపానము ఉద్భవించెను. దానినుండి మృత్యువు పుట్టెను. తరువాత లింగము (స్త్రీ పురుష) ఏర్పడెను. దానినుండి రేతస్సు ఏర్పడెను. దానినుండి జలము అనగా పంచభూతోపాధికుడయిన ప్రజాపతి పుట్టెను. అయ్యో పాపం! ఈ దేవతలందరూ మృత్యువ్యాధి జరా రూపమయిన తిమింగిలములు గల అపారమయిన దుఃఖజలభరితమయిన సంసార సముద్రమున పడిరి. 254

**శ్లో॥ తృష్ణావాతసమీరణోత్థితమహానర్థోర్మిమాలాకులే**
**హాహాకారమహారవే క్వచ నిరాలమ్బేఽపజన్మక్షయే ।**
**దానక్షాన్తిదయాదిసద్గుణసమిత్పాథేయసంవిత్ప్లవే**
**సత్సఙ్గాఖిలహానమార్గయుగలే మోక్షప్రతీరాఞ్చితే ॥ 255**

భావ॥ తృష్ణావాత పరంపరలతో మహానర్థములను తరంగమాలికలు గలది యీ సంసార సముద్రము. హాహాకారములు దీని హోరు. ఎక్కడ తీరం దొరకదు. ఆధారం ఆశ్రయము లేదు. ఆది – అంతము కనబడవు. కాని దీనిలో అచ్చటచ్చట దానం, దమం, దయ మొదలయిన సద్గుణ సమూహం పాథేయంగా (దారిలో తినదగినది) గల ఒక జ్ఞానమను నావ మాత్రం దొరకుతుంది. దీనియందు రెండు మార్గములు గలవు. సత్సంగము, కర్మసన్న్యాసము. దీనికి తీరము మోక్షము. ఇట్టి సముద్రములో పడినారు. 255

**శ్లో॥ క్షుత్తృడ్భ్యాం స యుయోజ పూర్వముదితం పిణ్డం విభుః పూరుషం**
**యస్మాత్తత్ప్రభవా ఇమాస్సమభవన్ తత్పీడితా దేవతాః ।**
**స్రష్టారం చ పితామహం సమవదంస్తం సంవిధత్స్వ ప్రభో!**
**దేహం నో యమధిష్ఠితా వయమదామాన్నం తతోఽదాత్స గామ్ ॥256**

భావ॥ ఈశ్వరుడు తాను తయారుచేసిన ఆ ప్రధమ విరాట్పురుష పిండమునకు ఆకలి దప్పికలు ఏర్పఱచెను. ఆ విరాట్టులోనే పుట్టిన ఈ దేవతలందరు ఆకలి దప్పికలతో బాధపడిరి. తమను సృష్టించిన స్రష్ట వద్దకు వెళ్లి దేవతలు ప్రార్థించిరి. ఇంతపెద్ద శరీరమునకు ఆకలి దప్పికలు తీర్చలేము. కనుక ఆకలి దప్పికలు తీర్పగల అల్ప దేహములనిచ్చినచో మేము అన్నపానీయముల స్వీకరింపగలము. అపుడు ఈశ్వరుడు వారికి 'గోవు'ను సృష్టించి చూపెను. 256

**శ్లో॥ నాస్మాకం పరమేశ! గౌరలమితి ప్రోక్తస్తతో దైవతై–**
**రశ్వం సోఽహరదత్ర చ ప్రతిహతే తాన్సోఽనయత్పౌరుషమ్ ।**
**ఔచంస్తాస్సుకృతం బతేతి పురుషం తుష్టాస్తదా జ్ఞాపితాః**
**స్వం స్వం చాయతనం యథోక్తమవిశన్ దేహీ తతః పౌరుషే ॥ 257**

భావ॥ పరమేశ్వరా! మాకీ గోవు చాలదు. అన్నారు. (రెండు వరసల దంతములు లేక పోవుట వలన) తరువాత వారికి అశ్వమును ఇచ్చెను. వారు అదీ చాలదన్నారు. (దానికి జ్ఞానము లేక పోవుట వలన) అపుడు పురుషని సృష్టించి చూపెను. అపుడు బాగా చేశావని బ్రహ్మను ప్రశంసించిరి. ఆయన ఆజ్ఞతో వారందరు ఆ శరీరములలో తమతమ స్థానాలలో చేరిరి. ఆ దేహం తమకు కారణమయిన విరాట్పురుషుని దేహముతో సమముగానున్నదని సంతసించిరి. 257

విశే॥ పురుష శరీరము సర్వపుణ్య కర్మలకు హేతువు కనుక (స్వయంగా ఆహారాది సంపాదన చేయగలది కనుక మంచి సౌకర్యమయినది గనుక) ఈ దేహమును ప్రశంసించియుండ వచ్చును.

**శ్లో॥ వాగ్భూత్వాఽగ్నిరముష్య వక్త్రమవిశత్ప్రాణోఽభవన్నాసికే**
**వాయుః ప్రావిశదక్షిణీ దినకరశ్చక్షు ర్భవన్ ప్రావిశత్ ।**
**భూత్వా శ్రోత్రమథాస్య కర్ణయుగలం దిగ్దేవతాః ప్రావిశన్**
**భూత్వా లోమగణో ద్రుమౌషధిగణస్తస్య త్వచం ప్రావిశత్ ॥ 258**

భావ॥ విరాట్పురుషునిలోని అవయవములు, ఆ దేవతలు ఈ శరీరములందును అదే విధముగా ప్రవేశించిరి. అగ్ని వాక్కుగా అయి వక్త్రమునందు, వాయువు ప్రాణముగా అయి, ముక్కులలోను, సూర్యుడు కన్నుగా అయి నేత్రగోళములందును, దిగ్దేవతలు శ్రోత్రేంద్రియముగా అయి చెవిలోనూ ప్రవేశించెను. వనస్పతులు ఓషధులు రోమములుగా అయి చర్మము లోనికి ప్రవేశించెను.

ఇంద్రియాలు తప్ప దేవతలు మనకు తెలియరు. కాని దేవతలు శక్తి రూపంగా అధిష్ఠించక పోతే ఇంద్రియాలు విషయగ్రహణం చేయలేవు. కనుక దేవత, కరణము రెండూ లేదా దేవతాధిష్ఠితమయిన ఇంద్రియాలు వాటి వాటి స్థానములలో ప్రవేశించినట్లు. 258

**శ్లో॥ భూత్వా స్వాన్తమథేన్దురాప హృదయం మృత్యుర్హ్యపానోఽభవ-**
**న్నాభిం ప్రావిశదస్య శిశ్నమవిశన్నాపో భవన్త్యో రసః ।**
**క్షుత్తృడ్దైవతయుగ్మమాసు భగవాంశ్చక్రేఽర్థితో భాగవత్**
**స్రష్టుం సోఽన్నమథైక్షతైష పురుషస్తల్లోకపానాం కృతే ॥ 259**

భావ॥ చంద్రుడు మనస్సుగా హృదయమునందు, మృత్యువు అపానముగా నాభియందు, నీరు రసముగా (శుక్ర, శోణితములు) అయి జననేంద్రియములందు ప్రవేశించెను. బ్రహ్మ ఆకలి దప్పికలకు అగ్ని మొదలగు దేవతలలోనే భాగమును కల్పించెను. విరాట్ పురుషుని యందున్న అవి అట్లే దేవతలలోనే చేరినాయి గదా! కనుక దేవతాహవిస్సులలో వారికి భాగముంచబడినది. ఆ తరువాత పరమేశ్వరుడు దయగల వాడై అగ్ని మొదలగు లోకపాలకులకు అన్నమును సంకల్పించెను. లేదంటే ఆకలి దప్పికలు వారిని బ్రతుకనీయవు. 259

**శ్లో॥ అద్భ్యోఽన్నం తపసా చరాచరమభూద్యాతో గ్రహే తస్య వాక్**
**ప్రాణోఽక్షిశ్రవణం త్వగిన్ద్రియమిదం చిత్తం చ శిశ్నం క్షమమ్ ।**
**నైవాసీత్పురుషో జిఘృక్షురథ సోఽపానేన సాధ్వగ్రహీ-**
**దన్నం వాయురయం యతో భవతి చాన్నాయుస్తతోఽన్నగ్రహః ॥260**

భావ॥ ఈశ్వర సంకల్పరూపమయినతపస్సుతో పంచభూతములనుండి చరాచర

రూపమయిన అన్నము బయలుదేరెను. తమను తినకుండా తప్పించుకొని పారిపోవుచున్న జంతు జలరూపమయిన ఆహారమును పట్టికొనుటకు వాక్కు, ప్రాణము, కన్ను, చెవి, చర్మము, చిత్తము, జననేంద్రియములు అశక్తములయినవి. కాని అన్నం గ్రహించదలచిన పురుషుడు ముఖములోపలికి పోగల "అపానము" అను వాయువు ద్వారా ఆ అన్నమును గ్రహించగలిగెను. ఎందుకంటే ఈ వాయువుకు అన్నమే ఆయువు కనుక అన్నాయువు అంటారు. కనుక ఇది అన్నమును పట్టికొనగలదు. 260

**శ్లో॥ న స్యాదేవ ఋతే మయా తనురియం వాగాదిదేవాశ్రితా**
**నాపానః కరణం స్వతోన్నఽగిళనే శక్నోతి నాన్నం వినా ।**
**దేహస్తిష్ఠతి దేవతాశ్చ తదహం దేహం విశేయం కయా**
**ద్వారేత్యేష విదార్య శీర్షమవిశద్ద్వారా విదృత్యాఖ్యయా ॥ 261**

భావ॥ సంఘాత రూపమయిన దేహం నేను లేకుండా ఉండదు. దీనిలో వాగాది దేవతలున్నారు. వారూ నిరాశ్రయులవుతారు. అపానం స్వయంగా అన్నమును మ్రింగలేదు. అన్నం లేనిదే దేహము నిలువదు. దేహ దేవతలు నిలువలేరు. కనుక నేనీ దేహములో ఉండక తప్పదు. ఈ దేహము లోనికి నేను ఎలా ప్రవేశించవలెను? - అని ఆలోచించి శిరస్సును చీల్చికొని దానిద్వారా శరీరమునందు ప్రవేశించెను. ఆ ద్వారమునకు 'విదృతి' అను పేరు కలిగెను. 261

విశే॥ 1. సాధనములు చేతనాధిష్ఠితమయి పనిచేయును. కనుక నేను లేనిదే అపాన మయినా అన్న గిలన సాధనమయినా ఆపని చేయలేదు.

2. శరీరమున భృత్యులయిన ఇంద్రియదేవతలు ప్రవేశించిన ద్వారములు తొమ్మిది కలవు. మిగిలినవి ప్రపదం (అరికాలు) శిరస్సు. ప్రపదం తగదు. శిరస్సు తగును. అదే బ్రహ్మరంధ్రము అంటారు. అలా జీవరూపంలో హృదయమున ప్రవేశించిన జీవుని బ్రహ్మగా ధ్యానింపవలయును.

**శ్లో॥ జీవస్సన్ పురుషో యయాఽవిశదిదం సా బ్రహ్మరన్ధ్రాత్మనా**
**ఖ్యాతా మూర్ధ్ని శిశోశ్చ దృశ్యత ఇయం తన్నాన్దనం దేహినః ।**
**భిత్త్వైనామనయా ప్రయాతి పురుషో యః ప్రాప్య న బ్రహ్మణః**
**స్థానం సద్భువి జన్మనే నను పునర్నావర్తతే ముచ్యతే ॥ 262**

భావ॥ బ్రహ్మము జీవుడయి ఏరంధ్రము ద్వారా ఈ దేహములో ప్రవేశించెనో అది బ్రహ్మరంధ్రమని అంటారు. ప్రతిశిశువునకు అది మాడున కనబడుతుంటుంది. అదే దేహికి ఆనందకరమయిన స్థానము. మరల పురుషుడి యోగశక్తితో ఆ ద్వారము గుండా ప్రయాణించినచో

అతడు బ్రహ్మలోకమునకు (హిరణ్యగర్భ)పోవును. వాడు మరల జన్మకొఱకు ఈ లోకమునకు రాడు. ముక్తుడగును. 262

విశే॥ 1. కనుకనే ఈ ద్వారము నందనం ఆనందకరము. మిగిలిన ద్వారాలు ముక్తి దాయకములు కావు. అందువలన నందనములు కావు.

2. సర్వవ్యాపి అయిన పరమాత్మ దేహవ్యాపియే గదా! మరల ఈ ప్రవేశించటం ఏమిటి? జీవుడు వేరు కాదు గదా! బ్రహ్మమే కదా! విభువే కదా! నిత్యచైతన్యస్వరూపుడయిన పరమాత్మయే జీవుడు కదా! లింగశరీర రూప ప్రవేశం అనటం గూడా కుదరదు. అవి జీవుని ప్రవేశమునకన్న ముందే శరీర ప్రవేశం అయినవి కదా!

సమా – పరమాత్మ ప్రవేశం చెప్పిన శ్రుతులు అదే తాత్పర్యముగలవి కావు. శ్రుతుల తాత్పర్యం జీవబ్రహ్మాభేదము. అంతమాత్రాన బ్రహ్మరంధ్రము వ్యర్థం కాదు. అది గర్భశిశువుకు తల్లి తిన్న అన్నరసగ్రహణానికి పనికి వస్తుంది. యోగులు దానిద్వారా బ్రహ్మలోక ప్రయాణం చేయగలరు.

3. లింగ శరీరాత్మకమయిన వాగాది సముదాయము నిలవాలంటే అంతర్యామిగా జీవుని ఉనికి అవసరము. అట్టి అవసరం వాటికి లేకుంటే జీవుడు తరువాత ప్రవేశించి యుంటాడని చెప్పవచ్చు. కాని నిర్యాణంలో ప్రాణాదులతో సహా వెళ్లే జీవుడు అదేవిధంగా 'సహితంగా' ఇందులో ప్రవేశించి యుండాలి.

4. రేతస్సులో ప్రాణం లేకుంటే అది శరీరాకారంగా పరిణమించదు. ప్రాణం లేనిదానిలో భావవికారాలు జరగవు. "పురుషోహ వా అయమాదితో గర్భో భవ" – అని శ్రుతి. దేహములో వాగాది ప్రవేశం గూడా అసంభవమే. రేతస్సునందు వాగాదులకు అధిష్ఠానమయిన వక్త్రం మొదలగు అవయవములుండవు. కాని అలా ఉన్నట్లు చెప్పటం అసత్యప్రాయమే. పిండమునకు వక్త్రాది – అవయవములు ఉత్పన్నమవుతాయి కనుక వాగాదులుండటం స్పష్టం – ఈ అభిప్రాయంతోనే వక్త్రాదులందు వాక్కు మొదలగునవి ప్రవేశించినట్లు చెప్పబడినది. కనుక రేతస్సులో లింగ సహిత జీవుడున్నాడు. అదే రేతస్సు శరీరాకారంగా పరిణతమవుతుంది. దానికి ముఖం మొదలగు అధిష్ఠానాలు ఏర్పడుతాయి. **అచ్చట ఉండే ముందుగా ప్రాణం పని మొదలు పెట్టుంది. క్రమంగా ఇంద్రియాదులు పనిలోకి వస్తాయి.**

5. ఈ పరిస్థితిని బట్టి ఆలోచించితే పరమాత్మ ప్రవేశం అనేది జీవేశ్వరాభేదమును చెప్పునట్టి మాట మాత్రమే. జీవుడు అంతకుముందే ఉండగా మరల పరమాత్మ ప్రతిబింబరూపంగా ప్రవేశించాడనటం కుదరదు. ప్రతిబింబంతో కలిసి అంతఃకరణం ముందుగానే అచ్చట ఉన్నది.

6. పరమాత్మయే జీవుడయితే ఆయన సంసారి ఎలా అవుతాడు? – కనుకనే సంసార

సముద్రములో దేవతలు పడినారని చెప్పబడినది. కనుక సంసారం సంఘాత ధర్మం. జీవ ధర్మం కాదు. ఆయనయే కర్తగదా? సంసారం లేకపోవటం ఏమిటి? సాక్షిగా ఉండటమే ఆ కర్తృత్వము. ఆయన వ్యాపార రహితుడయితే ఇంద్రియాలు ఎలా పనిచేస్తాయి? - ఆయస్కాంతం సాక్షిగా ఉన్నా ప్రక్కనున్న లోహం కదులుతుంది గదా! అంతా సాక్షి సన్నిధి చాలు ఇంద్రియాలు పనిచేస్తాయి.

7. ఈశ్వరుడే జీవుడయితే అందరూ మరణానంతరం స్వతంత్రంగా బ్రహ్మరంధ్రం భేదించికొని వెళ్లారెందుకు? - లేదా నేరుగా పరమానంద రూపమయిన బ్రహ్మభావమును చెందవచ్చుగదా! - అలా చెందితే యీ మోక్షశాస్త్రము వ్యర్థముగదా! అలాగే యోగశాస్త్రమూ వ్యర్థము కావచ్చు కదా! - సమా - పైన చెప్పిన జ్ఞానం కోసం మోక్ష శాస్త్రం అవసరం. అది సాధ్యంకానివారికి సగుణబ్రహ్మలోకం కోసం యోగ శాస్త్రం అవసరమే.

8. సర్వలోకవ్యాప్తుడయిన పరమాత్మ అయిన జీవుడు బ్రహ్మలోకం వెళ్లటమేమిటి? ఏమిటంటే లింగశరీరాధ్యాస వలన అలా వెళ్లినట్లు కనబడుతాడు. సర్వజ్ఞునకు అధ్యాస అనబడు భ్రాంతి ఎలా కలుగుతుంది? - సరే! ఆయనకు ప్రపంచ సంకల్పం కలిగినట్లే. ఈశ్వరునకు మాయ వలన సృష్టి సంకల్పము, అవిద్య వలన అధ్యాస కలుగుతాయి. సర్వజ్ఞునకు మాయ ఉండవచ్చు. అవిద్య ఎలా ఉంటుంది? అవిద్య జ్ఞానాభావరూపమయితే ఉండదు. కాని అది జ్ఞాన విరుద్ధమయిన ప్రత్యేక భావపదార్థం కనుక (దీపానికి మసిలాగా) ఏర్పడవచ్చును. అలా అయినా జ్ఞానం ఉన్నపుడు దానికి విరుద్ధమయిన అజ్ఞానం ఎలా ఏర్పడుతుంది? - దానిని ఛేదించే వృత్తిరూపమయిన బ్రహ్మజ్ఞానం లేకపోవటం వలన ఏర్పడుతుంది. అజ్ఞానం లేదంటే ఆ అజ్ఞాన కార్యమయిన బుద్ధివృత్తిగూడా ఉండదు. బుద్ధి మాయాకార్యం కదా అంటారా? - మాయ అజ్ఞానం ఒక్కటే గదా! కనుక వాస్తవంగా అధ్యాస కుదరక పోయినా పరమాత్మయందు మాయవలన అది కుదురుతుంది.

**శ్లో॥ త్రీణ్యేతస్య పదాని సన్తి హృదయం కణ్ఠశ్చ చక్షుస్తథా**
**తిస్రశ్చాస్య దశాస్సుషుప్తిరితి చ స్వప్నస్తథా జాగరః ।**
**స్వప్నా ఏవ భవన్తి తే త్రయ ఇతి స్వామ్యేష సఙ్ఘాతవా-**
**నాత్మార్థం పురుషార్థమేవ న పునస్సఙ్ఘాత ఆచేష్టతే ॥ 263**

భావ॥ జీవునకు హృదయము కంఠము, కన్ను అని మూడు స్థానాలున్నాయి. ఆ స్థానాలలో అతని దశలు క్రమముగా సుషుప్తి, స్వప్నము, జాగరణము అని మూడున్నాయి. కాని ఇవన్ని గూడా స్వప్నమువలె మిథ్యలే. ప్రభువయిన జీవుడు సంఘాతవంతుడు అవుతాడు. (సంఘాతం = శరీరం) అది తనకోసమే. సంఘాతము గూడా పురుషుని కొఱకే పనిచేస్తుంది. 263

విశే॥ 1. స్థానత్రయంలో ఉండి దశాత్రయం అనుభవించటమే సంసారము.

2. మిథ్య అయిన సంసారం వలన బంధం మాత్రం ఎలా ఏర్పడుతుంది? కల్పితమయిన నీలత్వంవలన గగనం నిజంగానే నీలమవుతుందా? – ఏర్పడదు.

3. జీవుడు సంఘాతమును (శరీరం) స్వీకరించుట ఎందుకు? – సమా – ఆత్మజ్ఞానం కోసమే. సంఘాతమునందుండియే జీవుడు ఆత్మసాక్షాత్కారము పొందగలడు. కనుక పరమాత్మ సంఘాతములోనికి ప్రవేశించటం వలన జీవుడు 1) ఆత్మ దర్శనం పొందగలడు. 2) వాగాది వ్యవహారములు నడుస్తాయి. కార్యకరణ సంఘాతమయిన ఆ శరీరం పురుషునికోసమే పనిచేస్తుంది. అది అచేతనం కనుక దానికి స్వార్థప్రవృత్తి ఉండదు.

4. కనుక వాగాది వ్యవహారసిద్ధికొఱకు ఆత్మ బోధ కొఱకు పరమాత్మ జీవరూపంతో శరీరమునందు ప్రవేశించి సాక్షిగా ఉన్నాడు. ఆయనయందు సంఘాత ధర్మములు అవిద్యచేత ఆరోపింపబడినవి.

**శ్లో॥ జాతః సోఽథ పుమానవైక్షత పరో భూతాని కిం వా పరం**
**స్యాదత్రేతి తమేతమేవ పురుషం పూర్ణం పరం బ్రహ్మ సత్ ।**
**దృష్ట్వాఽపశ్యమిదన్తదిత్యచకలత్తస్మా దిదన్ద్రః పుమా–**
**నిన్ద్రం తం బ్రువతే పరోక్షవిధయా దేవాః పరోక్షప్రియాః ॥ 264**

భావ॥ జాగరం మొదలయిన సంఘాత ధర్మములను జీవుని యందారోపించి యిక వాటిని నిషేధించటం మొదలుపెట్టబడినది.

ఇలా జన్మించిన ఆ పరమాత్మ పురుషుడు ఇలా ఆలోచించాడు. ఇవి కేవల భూతములేనా? అంతకన్న మించిన దేదయినా ఉన్నదా? అని. తరువాత వేదాంతాది పరిశీలనలు గురూపదేశములు మహావాక్య మననాదికము వలన ఈ పురుషునే పూర్ణమయిన పరబ్రహ్మ తత్త్వముగా కనుగొనును. "ఇదం" ఈ తత్త్వమును చూచినానని పలుకును. అందువలన "ఇదంద్రః" అని పిలువబడును. దేవతలు పరోక్షప్రియులు కనుక ఆయనను "ఇదంద్రః" అనకుండా 'ఇంద్రః' అందురు. 264

విశే॥ 1. "నేహ నానాస్తి కించన" మొదలయిన వేదాంత వాక్యముల వలన "సత్తా, భాన" స్వరూపమయిన బ్రహ్మం తప్ప ఈ భూతములలో మరేదియు లేదు – అని నిర్ణయించి కొనును.

2. తన ఆత్మనే ప్రత్యగాత్మనే బ్రహ్మగా తెలిసికొనును. "ఇదం దృష్టవాన్ = ఇదంద్రః" అని నిర్వచనము.

3. మనం గూడా శాస్త్రి, శర్మ, అమాత్య, ఆచార్య మొదలయిన యోగ్యతా నామములతో పిలిపించికొంటాము. అదేవిధంగా పరమాత్మను ఇదంద్ర అనకుండా 'ఇంద్ర' అంటాము. ఇది

4. పరమేశ్వరునికే ఈ పేరు. అజ్ఞదశలో జీవుడయినా విజ్ఞదశలో పరమేశ్వరుడే కదా!

5. ఇది = పరమైశ్వర్యము కనుక అధాతు వ్యుత్పత్తి ప్రకారము అర్థం చెప్పాలి కదా! నిజమే, కాని స్వతః ప్రమాణమయిన వేదము సొంతంగా ఈ వ్యుత్పత్తి చెప్పినది. స్వపితి వద్ద గూడా "స్వం అపీతః" తనయందే లీనమయిన అని అర్థము చెప్పింది. కనుక ఇదంద్ర అంటే జీవుని పేరు. కాని ప్రసిద్ధిని బట్టి ప్రత్యగభిన్నమయిన అపరోక్ష బ్రహ్మమని తేలినది. బ్రహ్మం ప్రత్యగ్భిన్నమయి, పరోక్షమయితే అది ఘటం వలె జడమే అవుతుంది. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" కదా! కనుక జడం కాదు. జ్ఞాన రూపం. జ్ఞాత అయిన జీవుడు గూడా జ్ఞాన స్వరూపుడే. ఎలాగంటే; జ్ఞాత జ్ఞానస్వరూపుడు కాకపోతే, అతనిని తెలిసికొనటానికి మరోజ్ఞానం కావాలి. ఆ జ్ఞానమునకు జ్ఞాతయే కర్త అయితే ఒకే జ్ఞాత కర్త కర్మగూడా కావలసివస్తుంది. వేరే జ్ఞాత ఉన్నాడంటే వాడికి మరల వేరే జ్ఞాత - అని అనవస్థ.

6. అందుకని జ్ఞాత జ్ఞేయుడు కాడు. అంటారా? కుదరదు. ఎందుకంటే జ్ఞాతకు తాను తెలియునా? తెలియదా? తెలుసునంటే జ్ఞేయం అవుతాడు. తెలియదంటే 'జ్ఞాత' ఉన్నట్లా? లేనట్లా? జ్ఞాత స్వయంప్రకాశుడనటం గూడా కుదరదు. జ్ఞానమే స్వయంప్రకాశము. రెండూ స్వప్రకాశములేనంటే అనవసరభావము. శ్రుతులలో అలా లేదు కనుక శ్రుతి విరోధము. జ్ఞాత మాత్రమే స్వప్రకాశం జ్ఞానం కాదంటే జ్ఞానం దేనినీ తెలియపరచలేనిదవుతుంది. అప్రకాశమయినది దేనినీ ప్రకాశింపజేయలేదు. కనుక జ్ఞానమే స్వయం ప్రకాశము. దానితో అభేదం వలన జ్ఞాత అయిన ఆత్మగూడా స్వప్రకాశం. కనునకనే "తమేవ భాంతమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి" అను శ్రుతి కుదురుతుంది. తస్య భాసా - అతని యొక్క జ్ఞానం అనటం భేదంగా ఉన్నది. అదే జ్ఞానం కదా! - సమా - 'రాహోః శిరః' అన్నట్లు "రాహువే తల". అదే అతని తల - అలా కుదురుతుంది. కనుక జ్ఞానస్వరూపుడయిన బ్రహ్మమే జ్ఞానము.

**శ్లో॥ సర్వాఙ్గాత్పురుషస్య సమ్భృతతమం తేజో హి వీర్యం బిభ-**
**ర్త్యాత్మానం స్వత ఏవ తేన పురుషస్తావత్సగర్భో భవేత్ ।**
**స్త్రీయోనౌ తదిదం నిషిఞ్చతి పుమాన్ రేతస్సజీవం స్వయం**
**జన్మేదం ప్రథమం పరస్య పురుషస్యౌపాధికస్య శ్రుతమ్ ॥ 265**

భావ॥ అధ్యారోపాపవాదములతో ఆత్మతత్త్వం నిరూపణ అయినది. తత్త్వజ్ఞానానికి అవసరమయిన వైరాగ్య లాభం కోసం జీవావస్థలను చెప్పుచున్నాడు. పురుషుని సర్వాంగముల

నుండి సారముగా అవతరించిన వీర్యము ఆత్మను తనలో నిలుపుకొన్నది. ఆ విధముగా రేతోవంతుడయిన పురుషుడు గూడా గర్భవంతుడే. అతడు ఆ వీర్యమును యోనిలో ప్రవేశ పెట్టినపుడు సజీవమయిన ఆ రేతస్సునకు అది ప్రధమ జన్మ. **అనగా యోనిపాతము మొదటి ఆవిష్కరణము. అదే పురుషునకు ప్రధమమయిన ఔపాధిక జననము.** 265

విశే॥ ధూమయానం ద్వారా చంద్రుని చేరి తిరిగి సృష్ట్యాదిక్రమములో వర్షాదుల ద్వారా ఓషధుల ద్వారా అన్నంగా అయి దాని ద్వారా "రేతస్సిక్" (యువకుడు) అయిన పురుషునిలో మాంసశోణిత రసాదిక్రమముతో రేతస్సుగా అయిన జీవుడు నిర్గమం వఱకు పురుష దేహకోశమునందే ఉండును **గనుక పురుషుడు సూక్ష్మగర్భవంతుడు.**

**శ్లో॥ వక్షోజాదినిజాఙ్గవన్మృగదృశః ప్రాప్యాత్మభూయం స్వయం**
**వీర్యాత్మా న హినస్తి మాతరమయం గర్భో వ్రణగ్రన్థివత్ ।**
**నారీ స్వోదరమధ్యవర్తినమవేక్ష్యాత్మానమాత్మేశితు-**
**ర్గర్భస్యోచితభక్తపేయగిళనాద్వృద్ధిం విదధ్యాన్ముదా ॥ 266**

భావ॥ ఈ గర్భము పురుష శరీరమునుండి వచ్చిన అన్య పదార్థమయినా, అది ఆమె శరీరములోని వక్షోజము నితంబము వంటి భారమయిన సొంత అవయవముల వలెనే ఉండును. ఒక వ్రణగ్రంధి లాగా అది బాధింపదు. తన భర్త యొక్క ఆత్మరూపమయిన ఈ గర్భమును తన ఉదర మధ్యమున భరించుచు దానికనుకూలమయిన అన్నపానాదుల ద్వారా సంతోషపూర్వకంగా వృద్ధినందించవలెను. (ఆత్మా వై పుత్రనామాసి – గదా!) 266

**శ్లో॥ భర్తారం నిజగర్భభూతమితి సా సమ్భావయన్తీ వధూ-**
**ర్భర్త్రా సాధ్వభివర్ధితా భవతి సమ్పూర్ణస్స గర్భస్తతః ।**
**హస్తాఙ్ఘ్ర్యాస్యశిరోముఖైరవయవైః క్లేశేన మాసాన్దశ**
**స్థిత్వా యోనిబిలాద్వినిస్సరతి సన్ పుత్రస్తదన్యజ్జనుః ॥ 267**

భావ॥ భర్తయే తన గర్భములో నున్నాడని భావించుచు ఆ ఇల్లాలు ఆ భర్త వలన బాగా పోషణ పొందుతుంది. అందువలన గర్భము సంపూర్ణమయి ప్రసవం జరుగుతుంది. దశ మాసముల తరువాత పాణి పాదాది అవయవములుగలిగిన ఆ బిడ్డ ప్రసవ వేదన ద్వారా బయటకు వచ్చును. పుత్రుడయి భూమి మీద బడును. **ఇది రెండవ జన్మ.** 267

**శ్లో॥ ప్రత్యాధాయ స చేహ పుణ్యకృతయే గౌణాత్మభూతం సుతం**
**నిర్యోగాదకృతార్థ ఏవ చ మృతో భూయః క్వచిజ్జాయతే ।**
**ఏతజ్జన్మ తృతీయమస్య బహవో యాతాస్తదేవమ్భవా**
**యాస్యన్త్యపృత దుర్లభన్తు భువనే మానుష్యజన్మార్థదమ్ ॥ 268**

భావ॥ ఆ తండ్రి లేదా ఆ పుత్రుడు తనకు అపరకర్మాదికము చేయటానికి తన గౌణాత్మ అయిన సుతుని నియోగించి (ఆయుర్దాయానంతరము) జ్ఞానయోగము లేనందున కృతార్థుడు కాక పోవటం వలన మరణించిన తరువాత మరొకచోట మరల పుట్టును. **ఇది మూడవ జన్మ.** ఇట్లు అనేక జన్మలు జరిగిపోయినవి. జరుగగలవు. కాని మనుష్యజన్మ దుర్లభమయినది. అది చాల ప్రయోజనవంతము. కనుక దానిని సార్థక పరచ వలయును. మరల మనుష్య జన్మ వచ్చేటట్లు ప్రయత్నించవలయును. 268

విశే॥ 1. ఇది తృతీయ జన్మ అనటం ఎందువలన? తండ్రి జన్మ కొడుకు జన్మ గా ఎలా అవుతుంది. "ఆత్మా వై పుత్రనామాసి" కనుక పుత్ర జన్మ అయినా పితృజన్మ అయినా అభేదంగా భావించాలి.

2. మనుష్యజన్మ సర్వార్థ సాధకము. అందువలన అది ఇతరజన్మలకన్న వాంఛనీయము. చూడండి "లబ్ధ్వా సుదుర్లభమిదం బహుసంభవాంతే మానుష్య మర్థదమనిత్యమపీహధీరః తూర్ణంయతేత సపతేదనుమృత్యుయావన్నిశ్శ్రేయసాయ విషయః ఖలు సర్వతఃస్యాత్"

**శ్లో॥ గర్భే సన్నహమన్యదేవజననీస్సర్వాస్సుఖేనాగమం**
**మామావేష్ట్య రరక్షురాయసపురప్రాయా హి దేహాశ్శతమ్ ।**
**వేగాచ్ఛ్యేన ఇవాగతో వపురహం భిత్త్వేహ జాలం ధియా**
**విద్వానిత్యధిగత్య నిర్వృతిమజేఽభూద్వామదేవోఽమృతః ॥ 269**

భావ॥ జనన మరణ ప్రవాహము అవిద్యా సంబంధం చేత గలుగుతుంది. ఇదంతా ఇంతవఱకు చెప్పి విరక్తుడయిన వానికి విద్య వలననే మోక్షము అను విషయమును తెలపటానికి **వామదేవుని** భావన చెప్పబడుచున్నది. నేను గర్భము లోపల నుండియే ఇతర దేవతల ఉత్పత్తులను గమనించితిని. అనగా ఆత్మనుండియే అవి అన్నీ పుట్టినవని గ్రహించెను. ఇదంతా జన్మాంతర కృతమయిన వేదాంత శ్రవణ మననాదులవలన ప్రతిబంధములు నశింపగా వామదేవునకు ఈ జన్మలో లభించిన ఫలము. తనను ఆవేశించి ఇనుప పురముల వంటి అజ్ఞానమయ దేహములు వందలకొలది రక్షణగా నున్నవి. ఆ పంజరము నుండి వేగముగా డేగవలె నేను నా బుద్ధి శక్తితో బయటపడి వచ్చితిని – అని జ్ఞాని అయిన వామదేవుడు పరమాత్మయందు చేరి తృప్తి పొందెను. ఆ విధముగా ఆయన అమృతుడయ్యెను. అనగా ప్రారబ్ధనాశానంతరం విదేహముక్తిని పొందెను. 269

**శ్లో॥ యద్వేదైష స పూర్వబుద్ధివిభవాద్గర్భే శయానోఽపి సన్**
**యస్తద్వేద గురూపదేశవిభవాద్బ్రహ్మాహమస్మీతి సః ।**

**ఊర్ధ్వస్సన్ స ఇవాజ్ఞభేదవశతస్సూత్క్రమ్య సంసారతః**
**స్వర్గం లోకముపేత్య కామమఖిలం ప్రాప్యామృతస్స్యాద్ధ్రువమ్ ॥270**

భావ॥ పూర్వబుద్ధి మహిమ వలన వామదేవుడు గర్భమునందుండియే ఏ తత్త్వమును అనుభవించెనో అదే తత్త్వమును గురూపదేశ వశమున అనగా తత్త్వమసి అను గురూపదేశము వలన "అహం బ్రహ్మాస్మి" అని విద్వాంసుడు తెలిసికొనవలయును. అనుభవించవలయును. ఆ వామదేవుని వలెనే వీటికన్నింటికి అందనంత ఎత్తుగా సంసారము నుండి మరణానంతరము ఉత్క్రమించి ఆనందకరమయిన బ్రహ్మలోకమును పొందును. పూర్ణకాముడగును. అమృతుడగును. లేదా, జీవన్ముక్తి దశలో సర్వకామములను పొందును. ఎందుకంటే అతను 'సర్వాత్మ' కదా! 270

**శ్లో॥ శబ్దం యేన శృణోతి జిఘ్రతి యతో గన్ధం చ యేనేక్షతే**
**రూపం యేన వచాంసి వక్తి చ రసం జానాతి యేనైష నా ।**
**తత్ప్రజ్ఞానముదీర్యతే శ్రుతిగణైరాత్మేతి సఞ్జ్ఞానవి-**
**జ్ఞానాజ్ఞానమనోధృతిక్రతుమతిప్రష్ఠాభిధానం చ తత్ ॥ 271**

భావ॥ శబ్దము వినుట, గంధమును ఆఘ్రాణించుట, రూపమును చూచుట, మాటలాడుట, రుచి చూచుట – వీటన్నింటికి ఏది కారణమో **అదే ప్రజ్ఞానము "అదే ఆత్మ"** అని శ్రుతులు చెప్పుచున్నవి. ఆ జ్ఞానమునే సంజ్ఞానము, విజ్ఞానము, ఆ జ్ఞానము మనస్సు, ధృతి, క్రతువు, మతి మొదలగు అనేక నామములు గలది. 271

విశే॥ 1. దీనివలన పురుషుడు కర్త అని, అతని యొక్క కరణములయిన ఇంద్రియ సమూహము 'ఆత్మ' అని తేలినట్లున్నది. కాని కుదరదు – ఇంద్రియాలన్ని ఆత్మలంటే దేహంలో అనేకాత్మలు అవుతాయి. మొత్తం సముదాయం ఆత్మ అనాలంటే కుదరదు. సముదాయం వస్తువు కాదు – ఒకే ఇంద్రియం ఆత్మ అనాలంటే ఏ ఇంద్రియమును ఆత్మ అనాలి. ఏదికాదు? దానికి నియమం లేదు. సరే పోనీ; అన్నీ ఆత్మలే అందామంటే, ఘటం చూచిన ఆత్మ ఒకటి దానిని తెచ్చే ఆత్మ ఒకటి అవుతాయి. నేను చూచిన ఘటమునే ఇపుడు తెస్తున్నాను – అని అనుకొనటం కుదరదు. ఆత్మలు భిన్నం కదా!

2. ఇంద్రియాత్మవాదం వదలుదాం. అంతఃకరణం ఒక్కటే ఆత్మ. అదే ఇంద్రియాది గోళముల ద్వారా సాధనంగా పనిచేస్తుంది. అనవచ్చు. కాని అదీ సరికాదు. అంధులు మొదలయినవారి గోళకములనుండి అలా పనిజరగటం లేదు. కనుక తప్పక గోళకములు కాదు. వాటియందు తప్పక ఆయా ఇంద్రియాలుండాలి. కనుక అన్ని కరణములు – అన్నీ ఆత్మలు అవుతాయి.

3. కరణములు చాల కనుక చాల ఆత్మలవుతాయి. అది కుదరదు. కర్త ఆత్మ అని

శ్రుతి చెప్పలేదు. మరి ఎవరు ఆత్మ? సమా – జ్ఞానమే ఆత్మ. అది కర్త కర్మ కరణం కాదు. అయితే జ్ఞానం క్రియకదా! క్రియ మాత్రం ఎలా ఆత్మ అవుతుంది? జ్ఞానం క్రియ కాదనరాదు. ఎందుకంటే దాని కర్త కరణం కర్మ ఉంటాయికదా! చెక్కటం ఒక క్రియ. వడ్రంగి కర్త చెక్క కర్మ "ఉలి" సాధనము. అలాగే – ఈ క్షణం అన్నా క్రియయే. ధాత్వర్థం కదా! ప్రజ్ఞానం కరణమయితే కరణం కర్తకు అధీనం కనుక ప్రజ్ఞాన రూపమయిన ఆత్మగూడా పరతంత్రమే. పరతంత్రమయితే ఆత్మ అచేతనమవుతుంది.

4. సమా – **ఇచ్చట చెప్పిన ప్రజ్ఞానం మామూలు విషయజ్ఞానము కాదు. ఆత్మ స్వరూపమయినది.** అది నిత్యము. శబ్దాది సర్వవిషయములను అవభాసనం చేయును. కనుక ఇది ఆత్మ. మరి జీవుడు స్వరూపజ్ఞానంలోనే సర్వవిషయాలను అవభాసనం చేయును. అంటే, జీవుడు తనకు తనే కరణం ఎలా అవుతుంది? – కాదు – కాని "దేవదత్తః స్వయం గచ్ఛతి" అన్నట్లు, జీవుడు స్వయంగా అవభాసనం చేస్తున్నాడు అని అర్థము. అనగా జీవుడు తనస్వరూపచైతన్యముతోనే అవభాసనం చేస్తున్నాడు అని అర్థము. (దీపం తన స్వరూపమయిన వెలుగుతో అన్నింటిని వెలిగించినట్లు)

5. పశ్యతి శృణోతి మొదలయినవి "ప్రకాశింపజేయటం" అనే అర్థాన్ని ఎలా ఇస్తాయి? – ఇస్తాయి. రూపాదులను బట్టి చూడటం వినటం మొదలయినవి అంటాము. కాని అదంతా అవభాసనం "ప్రకాశనం" అవుతుంది. రూపగంధాదులను తెలిసికొనటం – అనే గదా తాత్పర్యార్థం. అవభాసనం అవబోధనం, జ్ఞానము అంతా సమానార్థకములే. ఈ అవభాసనం మాత్రం ప్రజ్ఞానం కాదు. ప్రజ్ఞానం యొక్క క్రియయే, సూర్యాదుల వెలుగు ఘటాదులను ప్రకాశింపజేస్తుంది – ఇది క్రియయే గదా! ప్రజ్ఞానం గూడా శబ్దాదులను వెలిగిస్తుంది – అని ప్రకరణార్థము.

6. అసలీ శబ్దావభాసనం శ్రోత్రాదీంద్రియాలు గదా చేసేది? – ప్రజ్ఞానం ఎలా చేస్తుంది? సమా – ఇంద్రియాలు జడాలు. అవి అవభాసనం చేయవు. సూర్యప్రకాశమయినా నేత్రాది సహాయం లేకుండా అవభాసనం చేయదు. ఆ నేత్రం గూడా మనస్సు అచ్చట లేనిదే అవభాసనం చేయలేదు. మనస్సువెలుతురు ఎన్ని కలిపినా ఈ జడసముదాయము అవభాసనం చేయలేదు – తప్పక దానికి 'చేతనం' ఉండాలి.

7. మనస్సు జడం కాదు. అది చేతనమే. దానివలననే మిగిలినవి గూడా చేతనము లవుతున్నాయి అంటారా? – సమా – ఎ) కామసంకల్పాది మనోధర్మములే కేవల మనస్సుతో వెలుగవు. బి) మఱొక వస్తువు చేతనే మనస్సు దాని ధర్మాలు వెలుగుతాయి. సి) స్వప్నములో రథాది రూపంగా పరిణమించి మనస్సు అవభాసింపబడుతున్నది డి) జాగరణంలోనూ కోరికలుగా మారిన మనస్సు మరొకదానిచేతనే వెలుగుతుంది. ఇ) సుఖదుఃఖాకారంగా పరిణమించిన

మనస్సు మరొక దానిచేతనే వెలిగింపబడుచున్నది. కనుక పరప్రకాశ్యమయినది అచేతనమే. ఏది స్వయంప్రకాశమో అదియే చేతనము. కనుక మనస్సు అచేతనమే. సూర్యుడు చీకటిని పోగొట్టటం వలన మనకు కళ్లుకనబడతాయి. అందువలన సూర్యకాంతి అవభాసకమని గౌణంగా అంటాము. నేత్రమయినా దానినుంచి వెలువడిన అంతఃకరణవృత్తి జ్ఞానం వలననే రూపావభాసకం.

8. అంతఃకరణవృత్తి వలననే అజ్ఞాన నాశం చెప్పవచ్చుగదా! ప్రజ్ఞానం ఎందుకు? – సమా – వృత్తి జడము. విషయాలు జడము. కనుక విషయజ్ఞానం ఎలా వస్తుంది? కనుక విషయములను కరణములను అంతఃకరణమును, వృత్తులను, ఘటాద్యావరణమయిన అజ్ఞానమును, చీకటిని, వెలుగును అన్నింటిని ప్రకాశింపజేసేది "ప్రజ్ఞానమే". అదే స్వయంప్రకాశం, ఇతర ప్రకాశకం. అదే జీవుని స్వరూపం. అదే ఆత్మ.

9. సూర్యకాంతికి వస్తు ప్రకాశనంలో నేత్ర సహాయం కావాలి. అలాగే ప్రజ్ఞానానికిన్ని కావాలి. అందులన అది ఇతరాపేక్ష కలది కనుక స్వయంప్రకాశం కాదు. కనుక అది జడము – సమా – సూర్య ప్రకాశం విషయంలో అది జడమన్నమాట నిజమే. కాని ప్రజ్ఞానం అలా కాదు. అది అన్ని వ్యాపారములకు సూర్యకాంతికి చీకటికి గూడా అది సాక్షి. కనుకనే అవి మనకు తెలుస్తున్నాయి. స్వప్న ప్రపంచములో మనస్సు ఇంద్రియాలు లేకుండానే స్వప్న వృత్తాంతాలు తెలుస్తున్నాయి. జాగరణంలో నేత్రాదులను గూడా ప్రజ్ఞానమే వెలిగిస్తుంది.(అది లేనిదే అవి పనిచేయవు). దానికి వాటి సహాయం కావాలనటం హాస్యాస్పదము. అది సర్వవ్యాపకం. ఆంతర బాహ్య విషయాలను తెలుపుతుంది. నేత్రాది సహాయం అవసరంలేదు. అలా అయితే అంధ బధిరులకు రూప శబ్ద జ్ఞానం కలుగాలి గదా! అంటారా? – సమా – సుషుప్తిలో మనస్సు ఇంద్రియాలు లేకున్నా ప్రజ్ఞానం వలననే జ్ఞానం కలుగుతుంది. వారికి స్వప్నంలో కాశీ మొదలగు పట్టణ దర్శనము, కోలాహల శ్రవణము జరుగును. అందువలన జాగరణ దశలోనూ వారికట్టి రూపశబ్దాది అనుభవం కలుగుతుంది. అందుకు కారణం ప్రజ్ఞానమే. ఇదంతా ఇంద్రజాలం అనిపించవచ్చును. అవును. ప్రపంచమంతా మాయామయము.

10. మరయితే, అంధ బధిరులకు ఏమీ కనబడలేదు వినబడలేదు – అన్న అనుభవం ఉన్నది గదా! దానినెలా కాదంటారు? – అలాగే సుషుప్తిలో సర్వజ్ఞానములు లేవుగదా! ఈ అనుభవాలను ఎలా కాదంటారు? – సమా – ప్రత్యక్ష సిద్ధమయిన ప్రపంచమునే శ్రుతి తీసిపారేసింది. "నేహ నానాస్తి కించన" అన్నది. వేదవాక్యం అప్రమాణం అనలేము. దానికి వేరే అర్థం కల్పిద్దామన్నా కుదరదు. ఇది అర్థవాద కాదు. వాస్తవమయిన ఉపదేశము. పైగా స్వప్నంలో అంధ బధిరులకు దర్శన శ్రవణాదులు అనుభవంలో నున్నాయి కదా! స్వప్నం భ్రమ

అయితే వ్యావహారికంగూడా మిథ్యయే గదా! అచ్చట ఇచ్చట పదార్థాలు దర్శనాదులు భ్రమలే. అస్థిరములే.

11. స్వప్నంలో అంధుడు అనంధుడు కావటం భ్రమయే గదా! కాదు. ఆత్మ అనంధము కనుక అనంధుడన్న బుద్ధి ప్రమయే. ఇంకా జాగరణంలో ఆత్మను అంధుడను కొనటం అధ్యాస జన్యమయిన భ్రమ. అలా అయితే ఆత్మ కర్త శ్రోత భోక్త కావటం గూడా భ్రమ అవుతుంది గదా! అవును అదే మా సిద్ధాంతము.

12. అయితే ప్రజ్ఞానం సర్వావభాసకం ఎలా అవుతుంది? - సమా - ఆత్మకు దర్శన శ్రవణాదులు నిత్యములా? నేత్ర శ్రవణ తాదాత్మ్యా ధ్యాసమున వచ్చినవా? మొదటిదయితే అది జన్యము కాదు. రెండవదయితే మాకూ సమ్మతమే. **జీవుని నిత్య దృష్టి నిత్య శ్రవణము - అనునవి స్వరూప భూతమయిన ప్రజ్ఞానమే. ఇవి అన్ని జ్ఞానములే. ఉపాధిని బట్టి భేదములు.** ఆత్మది నిత్య దృష్టి అనగా నిత్యజ్ఞాన స్వరూపము. "నహి ద్రష్టుః దృష్టేః విపరిలోపోదృశ్యతే" కదా!

13. దృష్టి అనిత్యమన్న సంగతి ఏ దృష్టికి (జ్ఞానమునకు) తెలుస్తుంది. ఆ దృష్టి కేనా? వేరే దృష్టికా? అదే దృష్టికయితే వ్యాఘాతము. మరో దృష్టితో అంటే అనవస్థ. కనుక దృష్టి ఎపుడూ నిత్యమే. స్వయం ప్రకాశమే. అది ప్రజ్ఞానమే. **అయితే అసలు అనిత్యదృష్టియే లేదంటారా? ఉన్నది. అది బుద్ధివృత్తి రూపమయిన జ్ఞానము - అది అనిత్యం. ఎందుకంటే వృత్తి జడము, అనిత్యము. అందులోని జ్ఞానమును బట్టి వృత్తినే జ్ఞానము అంటాము.** వృత్తి అనిత్యమయితే వృత్తిజ్ఞానం అనిత్యము అంటాము. **కనుక కేవలజ్ఞానము ఎపుడూ నిత్యమే. "ఏకమే వాద్వితీయం బ్రహ్మ"**, "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ"

14. ప్రజ్ఞానం నిత్యమయితే మరి జాగరాదులు ఎలా? - సమా - ప్రజ్ఞానం నేత్రాదులు కలిసి అవభాసనం జరిగేదశ - జాగరణం ఇంద్రియరహిత దశలో మనస్సు ప్రజ్ఞానం కలిసి అవభాసనం చేసే దశ 'స్వప్నం'. ఇవి ఏవియు లేకుండా మాయామాత్రం అనగా అజ్ఞానమాత్రం ఉండి ఆ అజ్ఞానం ఆనందం తెలిసే సమయం సుషుప్తి. (కేవలం ప్రజ్ఞానం ఉండే దశ నిర్వికల్ప సమాధి)

15. నిజానికి ఈ దశలు ఏవీ పరమాత్మకు లేవు. అంతయు మాయాజన్యమే - ఇంద్రజాలము. గగనంలో ఏర్పడే గంధర్వనగరాలు. మాయవలననే ఈ ప్రజ్ఞానం సత్యమయినా అనిత్యంగా, వ్యాపక మయినా ఆంతరమాత్ర స్థితంగా, నిర్విశేషమయినా సవిశేషంగా అజ్ఞులకు కనబడుతుంది. కనుక స్వతంత్రము, సర్వభాసకము, నిత్యము, స్వరూపమూ అయినదే 'ప్రజ్ఞానము'. అదే చైతన్యము. అదే ఆత్మ.

16. అయిననూ జీవుడు అవిద్యాకృతదేహాభిమానంతో తాను అంధుడనని, బధిరుడనని, అల్పజ్ఞుడనని, సంసారినని అనుకొంటాడు. కనుక అవిద్య లోనే ఇట్టి భేదాలు విశేషాలు. విద్యలో అంతా ఒక్కటే ప్రజ్ఞానము.

17. ఈ ప్రజ్ఞానం అనేక విధాలుగా వ్యవహారంలో ఉన్నది.

1. సంజ్ఞానం : అంతఃకరణవృత్తి. దీనివలననే జంతువు చేతనుడు. ఇది సర్వశరీరవ్యాపి. 2. విజ్ఞానం : 64 కళల వలన వచ్చు లౌకిక జ్ఞానం. 3. అజ్ఞానం : అజ్ఞత, ఈశ్వరత్వం. 4. మనః : సంకల్పము 5. ధృతి : శరీరేంద్రియాదుల ధారణ వాటిని ధైర్యంగానిలిపేది (దమ్ము) 6. క్రతువు : అధ్యవసాయం 7. మతి : మననం ఇంకా మరికొన్ని 8. ప్రజ్ఞానము : ప్రజ్ఞ – తాత్కాలికం 9. వేద : గ్రంథధారణ 10. దృష్టి : ఇంద్రియం ద్వారా విషయలబ్ధి 11. మనీషా : మనః స్వాతంత్రము 12. జూతిః : మనస్సు యొక్క దుఃఖరోగదశ 13. స్మృతిః : స్మరణం 14. కామః : తృష్ణ 15. అసుః : జీవనక్రియా నిమిత్తక వృత్తి 16. వశః : స్త్రీ సంగాభిలాష

ఇవన్నీ అంతఃకరణ వృత్తి విశేషములు. వీటివలన ప్రజ్ఞానం కనబడుతున్నది. కనుక వీటినే ప్రజ్ఞానములనటం ఔపచారికము. ఈ అంతఃకరణవృత్తులలో ఈ ప్రజ్ఞానం అధిరోహించటం వలన ప్రజ్ఞానానికి ఆ పేర్లు. వ్యాపకమయిన జ్ఞానం అవచ్ఛిన్నం ఎలా అవుతుందంటే, కూటస్థమయిన ఈ అజ్ఞానము అంతఃకరణోపహితం కనుక, అంతః కరణపరిణామమే వృత్తి కనుక, ఘటంలో ఆకాశంలో లాగా ఆ వృత్తిలో ఈ ప్రజ్ఞానం అవచ్ఛిన్నమో ప్రతిబింబితమో అవుతుంది. ఏది అయినా అవి అన్నీ మిథ్యలే కనుక ప్రజ్ఞానం అఖండ మన్నదే సిద్ధాంతం.

18. వ్యవహార రీత్యా చెప్పండి. **అవచ్ఛేదవాదమా? ప్రతిబింబవాదమా? ఏది సత్యము? రెండూ సత్యమే. రెండూ శ్రుతి సిద్ధమే. వ్యావహారికంగా ఉపయోగమే. అంతా మాయాకృతమే.**

19. కనుక ఒకే ప్రజ్ఞానం అంతఃకరణంలో ఉంటే ప్రమాత, వృత్తిలో ఉంటే ప్రమాణం, విషయంలో ఉంటే ప్రమేయం. (చెఱువు – కాలువ – పొలము) ఇవన్ని మాయా మయమయిన ఉపాధులు. లేదంటే అంతా జ్ఞానమే. (అంతా నీరే) (ఘటాకాశం మఠాకాశం) (ఉపాధి లేదంటే ఆకాశమే) అలాగే ఘట జ్ఞానం, పట జ్ఞానం, లేదంటే జ్ఞానం. వృత్తులనేకం. ఉపాధులనేకం. జ్ఞానం మాత్రం ఒక్కటే. ఘటాన్ని బట్టి ఘటాకారవృత్తి. పటాన్నిబట్టి పటాకారవృత్తి. అందులోని జ్ఞానం ఒకటే. కనుక ఏకము సత్యము, స్వప్రకాశము, సర్వావభాసకము, చైతన్యము అదే ప్రజ్ఞానం. అదే ఆత్మ.

**శ్లో॥ బ్రహ్మేంద్రేశహరిప్రజాపతిరవిస్కన్దేన్దువస్వాదయో**
**దేవాః స్వర్నిలయా ధరామ్బుశుచివాయ్వాకాశతారాగ్రహాః ।**

**భూతాన్యత్ర జరాయుజాణ్డజననిస్వేదోద్భవోద్భిద్భవా-**
**న్యద్ర్యాదీని విచేతనాని సకలం ప్రజ్ఞానమేతజ్జగత్ ॥ 272**

భావ॥ ప్రజ్ఞానం ఆత్మ అని చెప్పాము. ఇక అదే బ్రహ్మం అని చెప్తాము. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' (ప్రజ్ఞానం ఏకం) "ప్రజ్ఞానం బ్రహ్మ" కనుక రూపబ్రహ్మం యొక్క ఉపాధికృత నానారూపావిష్కరణం అయితీరాలి కదా! కనుక బ్రహ్మ, ఇంద్రుడు, ఈశ్వరుడు, హరి, ప్రజాపతి, రవి, స్కంద, చంద్ర, వసువు మొదలగు దేవతలు గంధర్వులు, పంచభూతములు, తారలు, గ్రహాలు, జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజ్జములు, పర్వతములు మొదలయిన జడ-పదార్థములు – ఈ జగత్తంతా ప్రజ్ఞానమే. 272

విశే॥ 1. బ్రహ్మ = చతుర్ముఖుడు, హిరణ్యగర్భుడు, రజోగుణ ప్రధాన మాయావచ్ఛిన్నుడు, సమష్టి లింగోపాధి,

2. ఇంద్రుడు = స్వర్గపతి, మాయోపాధిగల పరమేశ్వరుడు, మాయావచ్ఛిన్నుడు

3. ఈశ = త్రినేత్రుడు, ప్రేరకుడయిన అంతర్యామి, తమోగుణ ప్రధాన మాయావచ్ఛిన్నుడు

4. హరి = చతుర్భుజుడు, స్థితికర్త, స్థూల సమష్టి ఉపాధి గల పరమేశ్వరుడు, సత్త్వగుణ ప్రధాన మాయావచ్ఛిన్నుడు

5. ప్రజాపతి = మనువు, హిరణ్యగర్భుడు విరాట్పురుషుడు, స్వాయంభువుడు.

6. స్కందుడు = కుమారస్వామి, సనత్కుమారుడు

N.B: ప్రజ్ఞానం ఒక్కటే మాయోపహితమయి ఈశ్వరుడు, సత్త్వంలో విష్ణువు, రజస్సులో బ్రహ్మ, తమస్సులో శివుడు, లింగ సమష్టిలో హిరణ్యగర్భుడు, స్థూల సమష్టిలో విరాట్, అజ్ఞాన సమష్టి (మాయ)లో ఈశ్వరుడు,

7. జరాయుజ : మావితో పుట్టేవి. మనుష్యాదులు

అండజ : పక్షి, పాము

స్వేదజ : ఆవిరివలన పుట్టేవి – పేలు

ఉద్భిజ్జ : తరులతాదులు

**శ్లో॥ ప్రజ్ఞానాత్సకలం జగత్ప్రభవతి ప్రజ్ఞానతో జీవతి**
**ప్రజ్ఞానే ప్రవిలీయతే తత ఇదం ప్రజ్ఞాననేత్రం మతమ్ ।**
**ప్రజ్ఞానం బృహదేవ వేద య ఇదం ప్రజ్ఞానమస్మీత్యయం**
**ప్రజ్ఞానాత్మత ఉన్నిపత్య వపుషః ప్రజ్ఞానమేత్యామృతః ॥ 273**

భావ॥ "వ్యాకృత – అవ్యాకృత" ప్రపంచం అంతా ప్రజ్ఞానం నుంచి వచ్చినదే. మాయ ప్రజ్ఞానజన్యమే. అనాది అయినా అది జన్యమే. "మాయాచా విద్యా చ స్వయమేవ భవతి" బ్రహ్మమునందే మాయ అధ్యస్తమయినది. ప్రజ్ఞానంలోనే ప్రపంచం బ్రతుకుతున్నది. ప్రజ్ఞానము నందే లీనమగుచున్నది. కనుక ఇది ప్రజ్ఞాన స్వరూపమయినది. కార్యం కారణ స్వరూపము కదా! కనుక ప్రజ్ఞానమే బ్రహ్మం "యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి, య త్ప్రయంత్యభిసంవిశంతి, తద్ బ్రహ్మ" కనుక ఈ ప్రజ్ఞానము నేనే అని గ్రహించు జ్ఞాని ప్రజ్ఞానస్వరూపుడై శరీరమునుండి లేచి ప్రజ్ఞానమునే పొంది అమృతుడగును. "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" కదా! 273

విశే॥ 1. ఒకే ప్రజ్ఞానము మాయవలన సవిశేషంగా కనబడుతున్నది. అది వస్తుతః నిర్విశేషము, దీనియందే ప్రపంచ బీజమయిన మాయ లీనమయియున్నది. అదే ప్రజ్ఞానము మాయారహితం కనుక నిర్విశేషమయిన బ్రహ్మం. మాయవలన వచ్చినవి మాయపోతే నశిస్తాయి. మాయ పోవటం మోక్ష సమయంలో జరుగుతుంది. "తమః పరే దేవ ఏకీ భవతి" అని శ్రుతి. కార్యం కారణంతో కలిసి ఏకమయి పోవటం లయం. కార్యం కారణ రూపంగా ఉండటమే నాశం. లయం = నాశము. కారణం కార్యంగా కనబడటం ఉత్పత్తి. కార్యంగా కారణంగా కావటం నాశము. కారణం సత్యం. త్రికాల సంభవం. కార్యం అనిత్యం – ఆత్మరహితం – తత్త్వంకాదు. మిథ్య. ఘట కాలంలోని మట్టి పూర్వపరకాలములలోను మట్టియే. కనుక కారణం సత్యం నిత్యం. కనుక నిర్విశేషమయిన ప్రజ్ఞానం ఒక్కటే అందులో భేదాలు మిథ్యలు. వ్యవహారం వలన భ్రాంతివలన కనబడ్డాయి. ప్రజ్ఞానం తప్ప ఈ ప్రపంచమను విశేషము నిజంగా ఉన్నది కాదు. కనుక "ఏకమేవాద్వితీయం బ్రహ్మ", "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ". త్వం = ఆత్మ, తత్ = బ్రహ్మ, అసి = రెండూ ఒకటే.

ఇ త్యైతరేయోపనిషద్వ్యాఖ్యాతా

ఇతి వ్యాఖ్యాతా దశోపనిషదః

శ్రీః

# కైవల్యోపనిషత్

**శ్లో॥ శ్రద్ధాభక్తిసమాధిభిర్దృఢతరైస్సన్న్యాసయోగేన చ**
**ప్రాప్యా బ్రహ్మకలా యయా కలశవద్దీపేన పశ్యన్తి తమ్ ।**
**సర్వమ్పాపమపోహ్య తామసమివ ప్రాజ్ఞా గుహాయాం స్థితం**
**సర్వస్మాత్పరమం పురాణపురుషం విభ్రాజమానం స్వయమ్ ॥ 274**

భావ॥ దృఢతరమయిన శ్రద్ధాభక్తి సమాధుల వలన సన్న్యాసయోగముచే పొందదగినది బ్రహ్మకల. దీపముతో కడవను చూచినట్లు ప్రాజ్ఞులు ఆ బ్రహ్మవిద్యచేత ఆపరబ్రహ్మమును హృదయగుహలో చూచెదరు. దీపము చేత చీకటిని పోగొట్టినట్లు ప్రాజ్ఞులు సమస్త పాపమును పోగొట్టికొని చూచెదరు. ఆ పురుషుడు సర్వము కన్న అతీతుడు, పురాణపురుషుడు – స్వయం–ప్రకాశుడు. బ్రహ్మాకారవృత్తితో అజ్ఞానావరణధ్వంసము చేసి ఆ స్వయంప్రకాశుని యోగులు కనుగొనెదరు. 274

విశే॥ 1. ప్రత్యగభిన్న బ్రహ్మ సాక్షాత్కారమునకు ఉపాయము, ఉపాయ సాధనములను చెప్పుచున్నాడు. శ్రద్ధ = ఆస్తికత్వం. భక్తి = ఏకాగ్ర మయిన తాత్పర్యము. సమాధి = ఇతర విషయాలను వదలి అదే బ్రహ్మ విషయమును తలచుట. సన్న్యాసం = సర్వకర్మ పరిత్యాగం. బ్రహ్మకల = బ్రహ్మ విద్య. దానికి సాధన చతుష్టయం అవసరం. కర్మ, ప్రజ, ధనం, పనికిరావు. బ్రహ్మ విద్య = బ్రహ్మాకారాంతః కరణవృత్తి. బుద్ధిలోనే దొరకుతాడు గనుక బుద్ధిగుహలో నున్నాడన్నారు. పురాణం = పూర్వమునుంచి నవమయిన వాడు. పురుషః = పురమునందు (దేహము)న్నవాడు. పూర్ణమయినవాడు. అంతటికీ అతీతుడు – ఇలా అని పోల్చటానికి కుదరదు. జడముకాదు. స్వయంజ్యోతి. దానిని ఆవరించు అజ్ఞానము నశించటానికి బ్రహ్మ విద్య అవసరం.

ఎలా చూస్తారు. అంటే. 'ప్రజ్ఞానం బ్రహ్మో హమస్మి' అని. చూడటం అనగా జ్ఞానము. అతీంద్రియుని గ్రహించుటమే దర్శనము. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ..." అని సాధారణ అసంస్కృత మనస్సునకు అందదు. "మనసై వానుద్రష్టవ్యం" అనగా సంస్కరింపబడిన శుద్ధ చిత్తమునకు అందును.

ప్రాజ్ఞుడు ద్రష్ట – పురాణపురుషుడు దృశ్యం. వీరిమధ్య అభేదం ఎలా? – సమా – "నన్ను నేను చూచుచున్నాను" అన్నట్లు కుదురుతుంది. కాని చూచేవాడు జీవుడు, చూడబడేది అనాత్మ అయిన దేహము. కనుక కుదురుతుంది. ఆత్మ – అనాత్మ వివేకం లేనందువలన ఆ మాట అలా అంటారు. శాస్త్రంలో అలా ఎలా? – సమా – శాస్త్రంలోనూ లోకవ్యవహారమునుబట్టి అలా భేదవ్యవహారం సులభజ్ఞానం కోసం శాస్త్రం చెప్పింది. వస్తుతః అయితే అంతః కరణావచ్ఛిన్నమయిన చైతన్యము ప్రమాత. జీవుడు అంతఃకరణంలో ఉన్నా/లేని చైతన్యం స్వరూపమయిన ఆత్మ. ప్రమాత ఈ ఆత్మను చూస్తాడని చెప్తాము. కాని చూడటం అనగా 'అహం బ్రహ్మాస్మి' అని ప్రాజ్ఞులు తెలిసికొంటారు. కనుక బ్రహ్మం ప్రత్యగాత్మయే. దర్శనోపాయం బ్రహ్మ విద్య. సాధనలు శ్రద్ధా భక్తి జ్ఞాన సన్న్యాసములు.

**శ్లో॥ వేదాన్తానధిగత్య విష్ణురహమిత్యాత్మానమత్రైవ యః**
**సాక్షాత్పశ్యతి విష్ణుమేష లభతే కైవల్యమజ్ఞాత్యయే ।**
**బ్రహ్మాస్మీతి పరోక్షమత్ర పురుషం యో వేత్తి స బ్రహ్మణః**
**స్థానప్రాప్య సమం చ తేన లభతే కల్పక్షయే బ్రహ్మతామ్ ॥ 275**

భావ॥ వేదాంతములను తెలిసికొని "అహం విష్ణుః" అని భావించినవాడు ఇచ్చటనే విష్ణుసాక్షాత్కారము పొందును. శరీరపతనం తరువాత అతను కైవల్యమును పొందును. కాని ఎవడయితే విష్ణువును పరోక్షబ్రహ్మగా భావించునో అతడు హిరణ్యగర్భలోకమును పొంది ఆయనతో సహా కల్పక్షయకాలములో బ్రహ్మత్వమును పొందును. 275

విశే॥ 1. వేదాంత శ్రవణం వలననే "అహం బ్రహ్మాస్మి' అని ప్రత్యక్ష జ్ఞానము కలుగును. బ్రహ్మలోకం కావాలన్న కోరికలు గలవాడు కైవల్యం పొందలేడు. బ్రహ్మలోకాదులనే పొందును. అది క్రమముక్తి.

2. విష్ణు – సర్వవ్యాపి అయిన బ్రహ్మమని అర్థము. వైకుంఠ పతి కాదు.

**శ్లో॥ తిష్ఠన్ పూతవివిక్తభూషు సుఖదే చేలాజినాద్యాసనే**
**కణ్ఠం చాపి శిరస్సమం దరిధరన్నత్యాశ్రమస్థో యతిః ।**
**రుద్ధప్రాణహృదిన్ద్రియో నిజగురుం భక్త్యా ప్రణమ్యాన్తరే**
**హృత్పద్మే విమలే ఽరజస్యనుదినం సఞ్చిన్తయేదీశ్వరమ్ ॥ 276**

భావ॥ సమాధి విధానమిది. యతి అయినవాడు పవిత్రమయిన ఏకాంతస్థలములందు ఉండవలెను. సుఖప్రదమయిన వస్త్రం చర్మం వంటివి ఆసనముగా అమర్చుకొనవలయును. కంఠమును శిరస్సును నిలువుగా ఒకే సరళరేఖలో నుంచవలయును. ప్రాణములను మనస్సును ఇంద్రియములను నిరోధించిన యీ అత్యాశ్రమి తనగురువును భక్తితో నమస్కరించి విమలము, రజోరహితము అయిన హృదయపద్మమున ఈశ్వరుని ప్రతిదినము ధ్యానింపవలయును. "అహమస్మి" అని అభేదం ధ్యానింపవలయును. 276

విశే॥ 1. యతిః = యత్నశీలుడు

2. ముందు దర్భాసనం, దానిపైన అజినాసనం, దానిపైన వస్త్రాసనం – అలా మెత్తగా ఉండాలి.

3. అరజసి – రాగాది హేతువయిన రజోగుణములు లేని మనస్సునందు – విమలే – తమోమలం లేనిది.

**శ్లో॥ శుద్ధస్ఫాటికసన్నిభం సుఖమయం స్మేరాననం చిన్మయం**
**శాన్తం శ్రీలలనాకటాక్షలహరీసిక్తాఖిలాఙ్గం శివమ్ ।**
**యద్వాఽచిన్త్యమనన్తమద్భుతరసం చావ్యక్తమేకం పరం**
**చిద్రూపం చ సుఖం ప్రశాన్తమమృతం నీరూపముద్భావయేత్. 277**

భావ॥ ఈశ్వర ధ్యానము రెండు విధములు. సగుణము. నిర్గుణము. ఈశ్వరుడయితే సగుణము. శుద్ధ బ్రహ్మమయితే నిర్గుణము. ముందు సగుణంతో కుశలుడయి నిర్గుణధ్యానం చేయగలుగుతాడు. అందువలన ముందు సగుణేశ్వరధ్యానము. శుద్ధ స్పటికమువలె నిర్మలుడు, ఆనందస్వరూపుడు, దరహాసవదనుడు, జ్ఞానస్వరూపుడు, శాంతుడు, శ్రీ అనగా లక్ష్మి లేదా పార్వతి యొక్క కటాక్షలహరీ సక్తమయిన సర్వాంగ శోభగలవాడు, మంగళకరమయినవాడు, – "ఏకోదేవః కేశవోవా శివోవా". ఇది సగుణ ధ్యానము. తరువాత ఇక నిర్గుణధ్యానము.

అచింత్యుడు, అనంతుడు, ఆశ్చర్యకరుడు, అవ్యక్త స్వరూపుడు, ఏకరూపుడు, పరముడు, జ్ఞానానంద స్వరూపుడు ప్రశాంతుడు అమృతుడు దృశ్యరూపరహితుడు అయిన పరమాత్మను ధ్యానింపవలయును. అనగా అభేద చింత చేయవలయును. 277

విశే॥ 1.అసంస్కారమనస్కులకు అందడు కనుక అచింత్యుడు, అనంత = దేశకాలముల వలన అంతము లేనివాడు.

2. శుద్ధ స్ఫటికమువలె నుండువాడు 1) హయగ్రీవుడు. 2) శివుడు. (3) సత్యనారాయణ స్వామి – శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం –")

3. రసోవై సః – కనుక అద్భుత రసరూపుడు.

4. అహం బ్రహ్మాస్మి - ఇది సంకల్ప సమాధి.

"అహం - బ్రహ్మ" రెండు వికల్పాలు. నిర్వికల్ప సమాధిలో "అహం బ్రహ్మాస్మి" అను బుద్ధి వృత్తి గూడా ఉండదు.

**శ్లో॥ ధ్యాత్వా తం మునిరేతి యోనిమఖిలస్యైతస్య వా సాక్షిణం**
**మాయాసిన్ధుపరప్రతీరనిలయం బ్రహ్మే చ యశ్శఙ్కరః ।**
**ఇన్ద్రో విష్ణురపి స్వరాట్చ పరమో యశ్చాక్షరోఽగ్నిర్యమ-**
**శ్చన్ద్రోఽర్కస్సమయశ్చ విశ్వమఖిలం భూతం భవద్భావి యః ॥ 278**

భావ॥ ధ్యాన ఫలం ఇది. అట్టి పరబ్రహ్మమును ధ్యానించి యోగి అఖిలయోని అఖిల సాక్షి మాయా సముద్ర పారంగతుడు - అయిన బ్రహ్మమును పొందును. "స బ్రహ్మ స శివ స్స హరిః-' అన్నట్లు ఆ బ్రహ్మమే బ్రహ్మ. శంకరుడు, ఇంద్రుడు, విష్ణువు, స్వరాట్ (స్వయం జ్యోతి) పరముడు, అక్షరుడు, అగ్ని, యముడు, చంద్రుడు, అర్కుడు, కాలస్వరూపుడు, అఖిల ప్రపంచము అతడే. భూత వర్తమాన భవిష్యత్తులు అతడే. "ఏకం సద్విప్రాబహుధా వదంతి" గదా! 278

**శ్లో॥ జ్ఞాత్వా తం విబుధోఽతియాతి మరణం నాన్యా గతిర్ముక్తయే**
**స్వాత్మానం సకలాన్తరస్థితమిదం పశ్యన్ సమం చాత్మని ।**
**విద్వాన్బ్రహ్మ పరం ప్రయాతి న పునర్హేత్వన్తరేణేత్యతో**
**జ్ఞానాయైవ యతేత ముక్తిలలనాసమ్భోగకామః పుమాన్ ॥ 279**

భావ॥ 'అయమహం అస్మి అయమాత్మా బ్రహ్మ" అని ఆ ఈశ్వరుని గ్రహించిన బుధుడు మరణమును అతిక్రమించును. మోక్షమునకు ఇంతకు మించి మరో గతిలేదు. సకల ప్రపంచమునకు తనను ఆత్మగాను, ఆత్మయందే సకల ప్రపంచమున్నట్లు గాను తెలిసికొనిన జ్ఞాని పరబ్రహ్మమును చేరును. మరో హేతువు చేతకాదు. అందువలన ముక్తికావాలనుకొనువాడు జ్ఞానం కోసమే ప్రయత్నింపవలయును. (ఆకాశము ఘటములయందున్నట్లు ఆకాశమునందు ఘటములున్నట్లు నేను ఆత్మగా ఈ ప్రపంచమునందు, ప్రపంచమే నాయందున్నదను భావన) - అనగా సర్వజీవాత్మ తాను సర్వజగత్తుకు అధిష్ఠానము తాను - అని అర్థము. అనగా సర్వజగత్తుకు "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" అన్నట్లున్నవాడు. 279

**శ్లో॥ స్వస్యాన్తఃకరణేఽరణౌ తమధరే కృత్వోత్తరం చారణిం**
**వేదాదిం బృహదస్మ్యహన్తదితి నిధ్యానాత్మకం మన్థనమ్ ।**
**ఆధాయాథ తతః ప్రభూతపరమబ్రహ్మాత్మసాక్షాత్కృతి-**
**జ్ఞానాత్మజ్వలనేన సంసృతిమయం పాశం దహేత్పణ్డితః ॥ 280**

భావ॥ "అహం బ్రహ్మాస్మి" అను న్యాయబుద్ధిగల పండితుడు తన మనస్సును క్రింది అరణిగను. వేదాది అయిన ఓంకారమును ఉత్తరారణి అనగా కవ్వముగను చేసి "నేను బ్రహ్మమును" అని ధ్యానరూపమయిన మంథనము (చిలుకుడు) చేయవలయును. అంతట పర బ్రహ్మాత్మ సాక్షాత్కార రూపమయిన జ్ఞానాగ్ని పుట్టును. దానివలన సంసార రూపమయిన మానసిక పాశము భస్మమగును. 280

**శ్లో॥ సత్యజ్ఞానసుఖాత్మకోఽస్తి పురుషో ముక్తోపసృప్యః పరో**
**యస్సర్వాత్మక ఏష ఏవ స విభుస్తేజోమయో మాయయా ।**
**జీవస్సన్మనుజోఽస్మి మే తనురసావిత్యాస్థితోఽఙ్గత్రయం**
**కుర్వన్ సర్వముపైతి జాగ్రతి సుఖం స్త్ర్యన్నాదిభోగైరకమ్ ॥ 281**

భావ॥ సంసారి అయిన జీవుడు "అహం బ్రహ్మాస్మి" అనుకొనటం భ్రాంతి. ప్రమ కాదు - కనుక దానివలన ముక్తి రాదు - సమా - బ్రహ్మయే మాయవలన జీవత్వం పొందాడు. (భిల్లరాజకుమారన్యాయం) (రాధేయ కౌంతేయ న్యాయము) రజ్జువు సర్పమయినట్లు జరిగినదిది. అందువలన అసలు పురుషుడు సచ్చిదానంద స్వరూపుడు. ముక్తులకు మాత్రమే అందుకొనదగినవాడు. పరుడు. సర్వాత్మకుడయిన తేజోమయుడయిన ఆ విభువే మాయచేత జీవుడయినాడు. "నేను మనుజుడను, నా శరీరమిది" అని అహంకార మమకారములతో శరీరత్రయమును అధిష్ఠించి యున్నాడు. ఈ విధముగా జాగరణమునందు, అన్న, స్త్రీ భోగాదులు దొరకినచో సుఖములను, దొరకనిచో దుఃఖమును పొందును. 281

విశే॥ 1. విభుః = వ్యాపి, తేజోమయః = స్వప్రకాశుడు, లేదా ప్రచురమయిన జ్ఞానము గలవాడు సర్వజ్ఞుడు,

2. మాయ ఒకటే. అదే ప్రకృతి, శక్తి. అది గుణములను '3' గా పనిచేస్తుంది. అందులో శుద్ధ సత్త్వం = పరమేశ్వరోపాధి, మలిన సత్త్వం = అవిద్య - జీవోపాధి, తమః ప్రధాన = ప్రకృతి జగత్తుకు ఉపాదానం. కనుక బ్రహ్మమే జగత్తుగా జీవుడుగా ఈశ్వరుడుగా అయినది. అంతా మాయయే. కనుక వాస్తవం కాదు.

3. నేను గ్రుడ్డిని చెవిటిని, సుఖిని, దుఃఖిని మొదలయినవిగూడా శరీరాభిమానములే. ఇంద్రియ మనస్సులమీద అభిమానములు. అభిమానం అనగా అవి తానే అని భావించుట. అహంకారము. నామనస్సు, నా అజ్ఞానం, నా చెవి, నా కన్ను - మొదలయినవి మమకారములు.

**శ్లో॥ వాగాదీన్ద్రియసఙ్ఘయే వ్యవహృతిశ్రాన్త్యోపరామఙ్గతే**
**స్వావిద్యారచితాద్భుతార్థకలితే స్వప్నే పుమాన్ క్రీడతి ।**

**స్వాన్తేన ప్రతిపద్యతే చ సుఖదుఃఖాద్యాత్మికాం సంసృతిం**
**శాన్తే శ్రాన్తివశా న్మనస్యయతి కం బ్రహ్మస్వరూపం స్వయమ్ ॥ 282**

భావ॥ జాగరణంలో లోక వ్యవహారం వలన ఇంద్రియ సంచయం బాగా అలసిపోతుంది. ఆగిపోతుంది. అంతటితో నిద్రా సహాయంతో అవిద్య రకరకాల ఆశ్చర్యకర విషయాలను (రథాదులను) విక్షేపిస్తుంది. అదే స్వప్నం. అందులో జీవుడు క్రీడిస్తాడు. ఆ తరువాత స్వప్న వ్యవహారం వలన గూడా అలసిన మనస్సు ఎటువంటి సుఖదుఃఖరూపమయిన సంసారమున్ను లేనిదై బ్రహ్మ స్వరూపమయిన ఆనందమును స్వయముగా పొందును. లేదా, స్వీయమయిన సుఖ రూపములను బ్రహ్మ స్వరూపమును పొందును. 282

విశే॥ **సుషుప్తి యందు సంసారము లేదు కనుక సంసారం ఆత్మ ధర్మం కాదని మనోధర్మమని స్పష్టము. స్వధర్మమయితే నిత్యం సమవేతంగా ఉండాలి.** లేకపోవటం ఉండరాదు. అగ్ని ఎపుడూ ఉష్ణమే. అంతఃకరణం సుషుప్తిలో లీనం కనుక సంసారం ఉండదు. కనుకనే జీవుడు బ్రహ్మము ఒక్కటే.

**శ్లో॥ స ప్రారబ్ధకృతేర్వశాదనుభవన్నానన్దపాథోనిధౌ**
**స్వాత్మబ్రహ్మణి ఖేలనం చ పునరాయాతి ప్రబుద్ధో జగత్ ।**
**జాగ్రత్స్వప్నసుషుప్తిషు త్రితనుషు ప్రక్రీడతో మాయయా**
**జీవాదాత్మన ఏవ సర్వమిదముద్భూతం విచిత్రం జగత్ ॥ 283**

భావ॥ సుషుప్తిలో ఆనందసముద్రమయిన ఆత్మ రూపమయిన బ్రహ్మమునందు విహరించుచున్న జీవుడు ప్రారబ్ధ కారణంగా మరల జాగరణానికి రాక తప్పదు. అందువలన అంతట ఆనందమునుండి బయటకు రాక తప్పదు. జాగరణం, స్వప్న, సుషుప్తులలో స్థూల సూక్ష్మ (లింగ) కారణ శరీరములలో మాయతో విహరించు ఈ జీవుడెవరో కాదు. ఈశ్వరుడే. ఆత్మయే. బ్రహ్మమే. ఈ విచిత్ర జగత్తును సృష్టించినది ఈయనయే. 283

విశే॥ జీవుడే జగత్కారణం అనటం వలన జీవబ్రహ్మలమధ్య అభేదం వ్యక్తమవుతుంది. అయితే మనము సాంఖ్యులవలె కేవలము జీవుని అంగీకరించి ఈశ్వరుని వదలము. ప్రాణధారణమున ఈశ్వరుడే జీవుడయినాడు. కనుక ఈశ్వరుని అంగీకరించినాము. ఆ ఈశ్వరుడే మాయవలన జీవుడు కనుక అద్వైతమునకు భంగము లేదు. కనుక ఈశ్వరుడున్నాడు. అతను జీవునకన్న భిన్నంకాదు. కనుక ఈశ్వరుడే జీవుడు. అద్వైతము. మాయవలన ద్వైతము.

**శ్లో॥ సర్వస్యాస్య చరాచరస్య జగతో బ్రహ్మాదికీటావధి-**
**ప్రాణివ్రాతమయస్య ఖానలమరుద్భూవార్మయస్యాశ్రయః ।**
**ఆనన్దస్సతతైకరూపపరమస్వద్యోతబోధో విభు-**
**ర్యో యస్మింశ్చ పురత్రయం ప్రవిలయం సర్వోఽపి లోకోఽయతే॥284**

భావ॥ సచ్చిదానందమయుడయిన యీ జీవుడు అనృత జడ దుఃఖరూపమయిన ఈ ప్రపంచంగా పరిణమించలేదు. రజ్జు సర్పంవలె ఈ ప్రపంచం వివర్తము. పంచభూతమయ మయినది. బ్రహ్మాది కీటపర్యంతం ఉన్న ప్రాణిసమూహ స్వరూపంగా కనబడే యీ చరాచర ప్రపంచమునకు అంతటికి కల్పనాధిష్ఠానముగా (ఈ రజ్జుసర్పం వంటి వివర్తమునకు) ఆశ్రయమయినది బ్రహ్మమే. ఈ బ్రహ్మము ఆనందస్వరూపము, నిత్యం, ఏకము, ఏకరసము, పరమము, స్వయంప్రకాశము, విభువు. దీనియందే పురత్రయము అనగా దేహత్రయము సమస్త లోకత్రయమున్ను లీనమగును. అదే పరబ్రహ్మం పరమాత్మ. 284

విశే॥ 1. చరాచరస్య - ఇందులో బ్రహ్మాది - అనటంలోనే చరం వచ్చింది. మరల చరం అనటం వ్యర్థం. అయినా అది దోషం కాదు. **సంగ్రహ విస్తరోక్తి న్యాయంతో** చర అనటానికి వివరణగా చెప్పినట్లు. లేదా, చరం = పోయేది, అచరం = ఆగమనం చేసేది అనగా పుట్టేది. అనగా జన్మ నాశములు గల - అని అర్థము.

2. చరాచరమునకు జన్మస్థితినాశములకు అధిష్ఠానము. బుద్ధిని ఉపాధిగా పురత్రయము నందు జీవుడు వ్యాపకుడే. కనుక ఆయనయందు పురత్రయము లీనము కావచ్చును. స్వప్నంలో ప్రపంచము జీవునియందే లీనము. ఉత్పన్నము స్థితము. లేదంటే రథములు రథ పదములు ఎక్కడివి. మరో అధిష్ఠానము ఎవరున్నారు? అదే ఉదాహరణతో జాగరణ ప్రపంచము గూడా జీవునియందేర్పడిన వివర్తమే.

**శ్లో॥ ప్రాణాః పఞ్చ దశేన్ద్రియాణి హృదయమ్భూతాని పఞ్చా ప్యమీ**
**లోకాస్సప్త చ భౌతికాశ్చ వివిధా అప్రాణినః ప్రాణినః ।**
**జాయన్తే ప్రతికల్పమేవ చ యతో జీవన్తి యేనేశ్వరః**
**సర్వాత్మా పరమో మహానణుతరస్స బ్రహ్మ తత్త్వమ్పరమ్ ॥ 285**

భావ॥ త్వం పదార్థం వివరింపబడినది. ఇక "తత్" నిరూపింపబడును.

పంచప్రాణములు దశేంద్రియములు, హృదయం, పంచభూతములు, సప్తలోకములు, భౌతికమయిన చరాచరములు, ప్రాణులు, అప్రాణులు, ఈ పరమాత్మనుంచియే ప్రతికల్పమున పుట్టుచుండును. ఈయన కారణముగానే బ్రదుకుచుండును. ఆయనయందే లయమగును. అట్టి సర్వాత్మకుడు, పరముడు మహాన్ అత్యంత దురవగాహ తత్త్వంగల ఈశ్వరుడే ఆ బ్రహ్మము. ఆ పరతత్త్వము నీవే. 285

విశే॥ 1. సర్వాత్మ = సర్వమునకు ఆత్మ, లేదా, సర్వస్వరూపుడు, మహత్తుకన్న మహాన్ అణువుకన్న అణువు. ఈశ్వరుడు = మాయావచ్ఛిన్న చైతన్యము.

2. జీవేశ్వరులు ఇద్దరూ బ్రహ్మమే. ఘటాకాశం వంటివాడు జీవుడు. మఠాకాశం

వంటివాడు ఈశ్వరుడు. ఆకాశం వంటివాడు బ్రహ్మం. ఉపాధిభేదమే కాని జీవ, ఈశ్వర, బ్రహ్మలమధ్య వస్తుభేదము లేదు. అందరూ సచ్చిదానందరూపులు. కనుక ఏ పేరు పెట్టినా "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అన్నదే సిద్ధాంతము.

3. అయ్యా! నిర్విశేష బ్రహ్మం జగత్కారణం కాదు. ఈశ్వరుడయిన బ్రహ్మం పురత్రయంలోని జాగరణాది దశలను పొందదు. "పురత్రయే క్రీడతి యస్తు జీవః తతస్తుజాతం సకలం విచిత్రమ్" శ్రుతి. జీవుడూ కాడు. "తత్ సృష్ట్వా తదేవానుప్రావిశత్" అని సృష్టి తరువాతనే ఈశ్వరుడు జీవుడయినాడు. "అనేన జీవేనాత్మనాను ప్రవిశ్య –" అని మరొక శ్రుతి గూడా అదే చెప్పింది. కనుక జీవుడు సృష్టికర్త ఎలా అవుతాడు?

4. సమా – ఎ) నిర్విశేష బ్రహ్మ, మాయానిర్మితమైన యీ జగత్తుకు (అధ్యాసకు) అధిష్ఠానం కనుక జగత్కారణం అవుతుంది.

బి) నిర్విశేష బ్రహ్మ మాయచే తనే జగదాకారంగా పరిణమించినట్లు కనబడుతున్నది. కనుక బ్రహ్మం జగత్కారణం. జీవబ్రహ్మములొక్కటే కనుక, జీవునియందు (ప్రత్యగాత్మ) జగత్తు కల్పితమనిగూడా అనవచ్చును. బ్రహ్మగా ఉన్నపుడే కల్పితమా? జీవభావంలో ఉన్నపుడు ప్రపంచం ఆయనమీద కల్పితమా? – అన్న మీమాంస అవసరము లేదు. బ్రహ్మమున కిన్ని 'భావములు' వస్తుతః లేవు. "పిందె, కాయ, పండు" వంటి వికారములుంటే బ్రహ్మం అనిత్యం అవుతుంది. ఘటం కపాలం లాగా అది భావములు మారదు. ఎపుడూ బ్రహ్మమే. మట్టి ఎపుడు మట్టియే. ఘటమైనను "మట్టిదనం" పోదు. ఘటత్వం అనునది కల్పితం మిథ్య. మరియు,

5. మట్టిదనం పోకుండా ఘటత్వం వచ్చింది. కాని పిండత్వం పోయి ఘటత్వం వచ్చింది. చూర్ణత్వం పోయి పిండత్వం వచ్చింది. చూర్ణం కన్న భిన్నంగా మట్టి లేదంటే మట్టి సావయవం కనుక ఈ పరిణామాలు వికారాలు ఉండవచ్చు. కాని బ్రహ్మ అవికారి. కనుక బ్రహ్మం జీవుడు కావటం, ఈశ్వరుడు కావటం అన్ని పరిణామాలు లేవు. వికారాలు రావు. అపరిచ్ఛిన్నం అఖండం అయిన బ్రహ్మం అంతఃకరణంతో పరిమితము కాదు. అది నిరవయవము. అవచ్ఛేద్యము కాదు. అవచ్ఛేదకమయిన మరో వస్తువూ లేదు. అంతఃకరణం మిథ్య కదా! "నేహ నానాస్తి కించన", "ఏకమేవాద్వితీయం" కదా! ఉపాధియే మిథ్యకనుక జీవత్వమూ లేదు. ఈశ్వరత్వమూ లేదు. ఇదంతా పరమార్థతః

6. **వ్యవహారతః అయితే మూడు పక్షములూ ఉన్నవే.**

ఎ) నిర్విశేష బ్రహ్మమునందు మాయ తన కార్యంతో సహా అనాదిగా అధ్యాస చెందినది. కనుక నిర్విశేష బ్రహ్మమే మాయకు జగత్తుకు కారణం.

బి) మాయావచ్ఛిన్నమయిన బ్రహ్మం ఈశ్వరుడు. ఆయనయందే మాయాకార్యం అయిన జగత్తు అధ్యాస చెందినది. మాయ అధ్యాస చెందలేదు కనుక ఈశ్వరుడు జగత్కారణము.

సి) అంతఃకరణావచ్ఛిన్న బ్రహ్మమయిన వాడు జీవుడు. అతనియందు మాయ అంతః కరణము తప్ప మిగిలిన ప్రపంచం అధ్యాస చెందినది కనుక జీవుడూ జగత్కారణమే. లేదా,

7. నిర్విశేష బ్రహ్మ జగత్కారణం కాదు. అది నిర్విశేషం కదా! "న తస్య కార్యం కరణం చ విద్యతే" – శ్రుతి. **ఇది పరమార్థదశలోని బ్రహ్మం.** ఈ దశలో ప్రపంచమే లేదు. మాయావచ్ఛిన్న మయిన ఈశ్వరనామక బ్రహ్మమే ఉపాదానం కనుక నిమిత్తం కనుక జగత్కారణము. "తదైక్షత సచ్చత్యచ్చాభావత్" శ్రుతి. అంతఃకరణావచ్ఛిన్నమయిన జీవనామక బ్రహ్మమునందు జగత్తు కల్పితం కనుక, ఇది అధిష్ఠానంగా జగత్తుకు కారణమయినది. జాగర ప్రపంచమంతా వీనియందే కల్పితం కదా! స్వప్న ప్రపంచం గూడా జీవునియందే గదా! ఈశ్వరుడు కల్పించినది. కనుకనే ప్రపంచం మనోమయం అంటారు. మనస్సుంటే ప్రపంచం. మనస్సులేక పోతే ప్రపంచంలేదు.

8. ఈశ్వరుడే ప్రపంచమునకు అధిష్టానం అయితే, సుషుప్తిలో గూడా ప్రపంచం కనబడాలి. జీవుడే అధిష్ఠానం అయితే ప్రపంచం లోపలనే కనబడాలి కాని బయట కనబడదు గదా! – నిజమే! లోపల కనబడే స్వప్న ప్రపంచం గూడా బయటనున్నట్లే కనబడుతుంది కదా! అలాగే జాగరంలోనూ లోపలిదే బయటలాగా కనబడుతుంది.

9. లేదా, ఈశ్వరుడే జగదధ్యాసకు అధిష్ఠానం. జీవుడే జగత్తుకు ఉపాదానం నిమిత్తం. **సప్తాన్న బ్రాహ్మణమున జీవుడే జ్ఞానకర్మలతో జగత్తును సృజించుచున్నాడని చెప్పబడినది.** జీవావచ్ఛేదకమయిన అనగా **జీవునిలోకలిసి ఉన్న అంతఃకరణమే జగత్తుగా పరిణమించింది.** కనుక జీవుడు ఈశ్వరునియందు జగత్తును కల్పించి నందువలననే అది బయట కనబడుతున్నది. ఎవని ప్రపంచం వానిదే. ఒక జీవుడు ముక్తుడయినా మరో జీవునికి వాని ప్రపంచం వాని కుంటుంది.

**ఈ పక్షములన్ని ప్రాచీనుల గ్రంథాలలోనివే, ఇందులో ఏదీ అసత్యమనలేము. "ఏకమే వాద్వితీయం బ్రహ్మ" అన్నదొకటే సత్యం.** ఈ పక్షములు వారివారి బుద్ధికి నచ్చిన దానిని బట్టి ఆచరించవచ్చు. దానిద్వారా జ్ఞానం సంపాదించవచ్చు. "**యయా యయా భావేత్పుంసా వ్యుత్పత్తిః ప్రత్యగాత్మని, సాసైవ ప్రక్రియా జ్ఞేయా సాధ్వీసాచానవస్థితా**"

10. ఈ పక్ష కల్పనల వలన మరోవిషయం బలపడుతుంది. "ప్రపంచం మిథ్య" అని. అన్ని సహేతుక కల్పనలే. ఎందుకంటే;

ఎ) జీవ ప్రారబ్ధము, కోరికలు, అవిద్య వలన ప్రపంచం ఏర్పడినది కనుక జీవుడూ ప్రపంచకారణమే.

బి) మనసా ఊహించరాని జగత్తుకు సర్వజ్ఞ సర్వశక్తిమంతుడయిన యీశ్వరుడే కారణ మనటం న్యాయమే.

సి) అధిష్ఠానం లేకుండా (వివర్తం) భ్రమ కలుగదు కనుక అధ్యాస చెందిన ప్రపంచమునకు బ్రహ్మమే కారణమనటం న్యాయమే.

11. కనుక జీవరూపమయిన ఆత్మకు భోగమోక్షములకోసం ఈశ్వరుడు జీవాదృష్ట సహకారంగల మాయతో బ్రహ్మమునందు జగత్తును కల్పించెననటం మంచి సమన్వయ మార్గము.

**శ్లో॥ జాగ్రత్స్వప్నసుషుప్తివిశ్వకవిరాడాదిప్రపఞ్చం సమం**
**యన్నిత్యప్రతిభాసయత్యపి న యద్వస్త్వన్తరం భాసయేత్ ।**
**తత్తేజోమయమద్వితీయమమృతం సత్యం పరం కేవలం**
**బ్రహ్మైవాహమితి ప్రపద్య పురుషో బన్ధైస్సమైర్ముచ్యతే ॥ 286**

భావ॥ శిష్యుడిట్లు మననం చేయవలయును. జాగరణం, స్వప్నం, సుషుప్తి, విశ్వుడు, విరాట్టు మొదలయిన ప్రపంచమును అంతటిని నిత్యం భాసింపజేస్తూగూడా ఏ చైతన్యము మరో వస్తువును అనగా కర్తను కర్మగా భాసింపజేయదో – ద్రష్టను దృశ్యంగా భాసింపజేయదో అట్టి తేజోమయమయినది అద్వితీయమయినది, అమృతమయినది సత్యము పరమము కేవలము అయిన బ్రహ్మమును నేనేయని ఎఱిగిన పురుషుడు బంధవిముక్తుడగును. 286

విశే॥ 1. తేజోమయ = చిద్రూపుడు, సర్వ ప్రకాశకమయిన స్వయంప్రకాశ పదార్థము. సత్యము – త్రికాల స్థితము. అద్వితీయము = తనవంటివి, తనకుభిన్నజాతివి, తనలోని భేదములు – ఏవీ లేనిది (సజాతీయ, విజాతీయ స్వగత భేదము లేనిది)

2. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" "ఏకమేవాద్వితీయం, అహం బ్రహ్మాస్మి" ఇట్టి మననం ఎలా చేయాలి? – సమా – ఇట్లు భావించవలెను.

"నేను జాగరణాది – దశలను, ఆ దశలోని స్థూల, స్వప్న, ఆనందాని భోగ్యములను భాసింపజేస్తున్నాను. ఎందుకంటే నేను వాటికి ద్రష్టను కదా!" "విశ్వతైజస ప్రాజ్ఞులు విరాట్ హిరణ్యగర్భుడు ఈశ్వరుడు అను ముగ్గురిని నేను భాసింపజేస్తున్నాను. ఎందుకంటే నేను వారికి ద్రష్టను గదా!"

"నన్ను ఎవరూ భాసింపజేయుటలేదు, నేను జ్ఞాతను, జ్ఞేయమును కాను","కనుక నేను జ్ఞాన స్వరూపుడను, బ్రహ్మము జ్ఞాన స్వరూపమే, కనుక నేను బ్రహ్మమునే" అని.

**శ్లో॥ ప్రత్యక్షీకృతతత్త్వమర్థపరమానన్దప్రకాశః పుమాన్**
**ప్రత్యేతీతి యదస్తి భోగ్యమపి యో భోక్తా చ భోగశ్చ యః ।**

**జాగ్రత్స్వప్నసుషుప్తిషు త్రిషు పదేష్వస్మాత్సమస్మాదహం**
**భిన్నశ్చిన్మయ ఈశ్వరస్సుఖమయస్సాక్షీ పరాత్మా శివః ॥ 287**

భావ॥ "తత్త్వమసి" యొక్క అర్థమయిన పరమానంద ప్రకాశమును అనుభవించిన జ్ఞాన పురుషుడు జాగరణ స్వప్న సుషుప్తులలోనున్న "భోక్త, భోగ్యము, భోగము" అను మూటికన్న ఆ దశలకన్న అన్నింటికన్న తాను భిన్నుడనని, జ్ఞానస్వరూపుడనని, ఈశ్వరుడనని, ఆనందమయుడనని, సాక్షినని, పరమాత్మనని, మంగళుడనని భావించును. 287

విశే॥ 1. ప్రత్యక్షంగానున్నను అవిద్య వలన ప్రత్యక్షం కానట్లున్న ఆత్మ తత్త్వం విద్యవలన ప్రత్యక్షం అవుతుంది.

2. అవన్నియు జడము - తాను చిన్మయుడు, తాను భాసకుడు, అవి, భాస్యములు. లేదా జీవునిగూడా భాసింపజేయు ఈశ్వరుడు, స్వతంత్రుడు. స్వయంజ్యోతి, లేదా, జీవుడానందమయుడు. అందుకే ఈశ్వరుడు, జ్ఞానానందరూపుడు కనుక మంగళుడు. దేహాదులకన్న పరముడు. దేహాదులు భ్రాంతివలన ఆత్మలు. కాని అనాత్మలు.

3. తత్, త్వం అను వాటి అర్థము, అసి వలన వాటి ఐక్యం తెలిసిన వానికి పరమానందము.

**శ్లో॥ మత్తో జాతమిదం జగత్స్థితమిదం మయ్యేవ లీయేత వా**
**మయ్యేవేదమతస్తదద్వయమహం బ్రహ్మైవ సర్వాత్మకమ్ ।**
**యోఽణీయానణుతో మహాంశ్చ మహతోఽనాదిశ్చ తేజోమయః**
**సర్వేశః పురుషశ్శివస్సకలవిత్సోఽహన్తథాహఞ్చ సః ॥ 288**

భావ॥ ఈ ప్రపంచము నానుంచి (ఆత్మ)పుట్టినది. నాయందే ఉన్నది. నాయందే లీనమగును. కనుక అద్వితీయము, సర్వాత్మకము అయిన బ్రహ్మము నేను. అణువుకన్న అణుతరుడు, మహత్తుకన్న మహత్తరుడు, ఆద్యంతరహితుడు, చిన్మయుడు, సర్వేశ్వరుడు, పురుషుడు, శివుడు, సర్వవేత్త అయిన ఆ బ్రహ్మము నేనే. నేనే ఆ బ్రహ్మము. 288

విశే॥ విశ్వమంతా వ్యాపించి యుండుటవలన అణుతరుడు, మహత్తరుడు. సర్వేశః = సర్వనియంత, శివః = మంగళుడు.

**శ్లో॥ నో పాణీ మమ చాదదామి సకలం పాదౌ న గచ్ఛామ్యహం**
**నో కర్ణౌ సకలం శృణోమి న దృశౌ పశ్యామ్యహఞ్చాఖిలమ్ ।**
**నో స్వాన్తం సకలం మనోమి న మతిస్సర్వం విజానామ్యహం**
**తస్మాదద్భుతశక్తిరస్మి మమ నో వేత్తాఽస్త్యహం చిత్స్వయమ్ ॥ 289**

భావ॥ "నాకు (చైతన్యమునకు) పాణిపాదములు లేవు. కాని స్వీకరింపగలను.

నడువగలను. చెవులు లేవు. వినగలను. కన్నులు లేవు. సర్వము చూడగలను. మనసు లేదు. అంతా ఆలోచించగలను. బుద్ధి లేదు. అన్నియు తెలిసికొనగలను. కనుక నేను అద్భుత శక్తులు గల వాడను" నాకు జ్ఞాత లేదు. నేను స్వయంగా జ్ఞానస్వరూపుడను. "నాన్యోతోస్తి ద్రష్టా"289

**శ్లో॥ ప్రాణ్యప్రాణి చ సర్వమేతదహమేవాహం హి సర్వాత్మకో**
**వేద్యశ్చాప్యహమేవ సర్వనిగమైర్వేదాన్తకృద్వేదవిత్ ।**
**నో పుణ్యమ్మమ నాస్తి పాపమపి నో నాశో న జన్మవ్యయౌ**
**నో దేహేన్ద్రియబుద్ధయో న ధరణిర్నామ్బ్వగ్నివాతా న ఖమ్ ॥ 290**

భావ॥ నేనే ఈశ్వరుడను. "విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్" – గీత. అలాగే చైతన్యరూపుడనయిన నేనే ఈ సమస్తమయిన ప్రాణి – అప్రాణి, చరం – అచరం అన్నియునేనే. నేను సర్వాత్మను. సమస్త వేదములు నన్నే తెలుపును. వేదాంత కర్తను నేను, వేదవేత్తను నేను, నాకు పుణ్యము లేదు. పాపము లేదు. నాశము లేదు. జనన మరణములు లేవు. దేహ, ఇంద్రియ బుద్ధులూ లేవు. ఈ పంచభూతములున్నూ లేవు.

"వేదైశ్చ సర్వైరహమేవవేద్యో వేదాంతకృద్వేదవిదేవచాహమ్" నేను చైతన్యరూపం కనుక ఈశ్వరకృత్యములు లక్షణములన్నియు ప్రపంచాపేక్షయూ నావే. 290

విశే॥ 1. దేహాదులందు మమకారములేని వానికి అహంకారము లేదని చెప్పవలసిన పనిలేదు. కనుక జీవుడు "నాహం దేహోనేంద్రియాణ్యంతరంగో నాహంకారః ప్రాణవర్గో న బుద్ధిః" "అథాత ఆదేశో నేతి నేతి" "అహం బ్రహ్మోస్మి" "ఇదం సర్వం యదయమాత్మా" కనుక నిర్విశేషమయిన బ్రహ్మమే.

2. బ్రహ్మమే మాయవలన జీవుడు కావచ్చును. అందువలన జీవునకు "అహం బ్రహ్మోస్మి" అను భావన న్యాయమే. అది ప్రమ. కాని, "అహ మీశ్వరః" అనుకొనటం భ్రమయే. ఎందుకంటే పరమార్థతః ఈశ్వరుడు లేడు. బ్రహ్మమే. వ్యవహారతః ఈశ్వరుడు ఏనుగయితే జీవుడు దోమ. పరతంత్రుడు కర్మవశుడు, దుఃఖి, సంసారి, అల్పజ్ఞుడు, అల్పశక్తి. ఇక పరమేశ్వరుడు అన్ని విధముల గొప్పవాడు. సర్వజ్ఞుడు, సర్వశక్తుడు, కల్యాణగుణుడు, ఆనందరూపుడు మొదలగునవి. వీరిమధ్య ఐక్యము భ్రమయే–? – ఇది పూర్వపక్షము.

3. సమా – జీవేశ్వర భేదం కుదరదు. ఎ) చార్వాక దృష్ట్యా అయితే అసలు ఈశ్వరుడే లేడు. జీవుడూ లేడు. కనుక వారికి భేదం అభేదం లేవు.

బి) జ్ఞానులదృష్ట్యా జీవభిన్నంగా ఈశ్వరుడే లేడు.

సి) తార్కికాదుల దృష్ట్యా జీవేశ్వరులున్నారు గనుక వారిదృష్ట్యా భేదం చెప్పాలి. కాని వారు భ్రాంతులు, కనుక జ్ఞానులు కారు. వారివాదం లోక ప్రసిద్ధమయినను శ్రుతి విరుద్ధము.

శ్రుతి అభేదమునే చెప్పింది. ప్రత్యక్ష విరుద్ధమయిన అభేదమును శ్రుతి చెప్పినా అంగీకరించము – అంటారా? కాని ప్రత్యక్ష విరుద్ధమయినా శాస్త్రం చెప్పినవి కొన్ని గ్రహించాల్సిందే.

ఎ) సూర్య గ్రహణం ప్రత్యక్షంగా కనబడుతున్నా, అది సూర్యగ్రహణం కాదు, సూర్యునితో (అమావాస్యనాడు కలిసిన) కలిసిన చంద్రుని గ్రహణమే అని జ్యోతి శాస్త్రము చెప్తున్నది. ప్రత్యక్షజ్ఞానాన్ని నిరాకరిస్తున్నది.

బి) మబ్బులు పరుగెడుతుంటే చంద్రుడు పరుగిడుతున్నట్లు ప్రత్యక్షజ్ఞానం వస్తుంది. అది విరుద్ధమే కదా! కనుక ఆగమం వలన ప్రత్యక్షం దెబ్బ తినటం ఉన్నది. అయితే భ్రమల వద్దనే అట్లా దెబ్బతింటాయంటారా? – నిజమే. "ఏది భ్రమ ఏది ప్రమ" అన్న విషయం తేల్చ వలసింది శాస్త్రమే. కనుక శాస్త్ర విరుద్ధమయిన ప్రత్యక్షము భ్రమ. ఎందుకంటే వేదం భ్రమ ప్రమాదములు లేని సర్వజ్ఞుడయిన ఈశ్వరుడు అనుగ్రహించినది. సర్వ – ఆస్తికులకు సమ్మతము.

4. ఆగమంకన్న ప్రత్యక్షం బలమని నీకు పట్టుదల అయితే అదీ అంగీకరించి చెప్తాం విను. జీవేశ్వరభేదం సుషుప్తి మృతి మూర్ఛాదులలో కనబడదు. వీటిలో కనబడకుండా జాగరణాదులలో కనబడినను ఆ భేదం మిథ్యయే. సత్యమయితే నిత్యం కనబడాలి. అయితే జాగరాదుల అభేదం లేదు కనుక సుషుప్తి మొదలగువానిలో ఉన్న అభేదము గూడా మిథ్య అనవచ్చు గదా! అని వాదించరాదు. అభేదవాదం శ్రుతి సమ్మతం. భేదవాదం శ్రుతి నిషిద్ధం. (స న వేద యథా పశుః). మిథ్య అయినను ఈ భేదం జాగరాదులలో కనబుతుంది. స్వప్నంలో చనిపోయిన పితృపితామహాదులు కనబడతారు గదా! రజ్జు సర్పం కనబడుతుంది గదా! కనుకనే దృశ్యం కనుకనే భేదం మిథ్య. **అభేదం గూడా కనబడుతున్నది గదా! మిథ్య కదా! అంటారు. భేదం యొక్క అనుపలబ్ధి వలన అభేదం తెలుస్తుంది. కాని అది దృశ్యం కాదు. భేదాభావం.** కనబడుతుంది గదా అంటారా? కుదరదు. అభావం భావ పదార్థం కాదు గదా!

5. అసలు అభేదం పరమార్థతః ఉన్నదా? వ్యవహారతః ఉన్నదా? పరమార్థతః నిజమే ఇష్టమే – వ్యవహారతః మాత్రం కుదరదు. భేదం ఉన్నది గదా! సమా – అభేదం సత్యం శాశ్వతం. రజ్జు సర్పం సందర్భంలో గూడా రజ్జువున్నది గదా! సర్పం నిజంగా వేరు గదా! అట్లే ద్వైత ప్రతీతి సమయంలో అనగా వ్యవహారంలో ప్రపంచం కనబడే సమయంలో గూడా అద్వైత బ్రహ్మమే ఉన్నది. (లేనిది ప్రపంచమే. అది కేవలం ప్రతీతియే గదా!) అద్వైతం త్రికాలసత్యం. దానియందే ద్వైతం కల్పితం. రజ్జుసర్పం వంటిదని మిథ్యయని శ్రుతులు చెప్పుచున్నాయి. "తత్సత్య మతోన్యదార్తమ్" గదా!

కనుక అవిద్యాదశలోనే వ్యవహారంలోనయినను ద్వైతం ఉంటుంది. విద్యాదశలో జ్ఞానికి అద్వైతమే కదా! "దూరమేతే విపరీతే విషూచీ" "అవిద్యాయాచ విద్యా" – శ్రుతి.

6. 'అవిద్యా దశ" అనగా "అదికానిదానిని అది అనుకొనటం" "అతస్మిన్ తద్బుద్ధి రధ్యాసః". దీనికి హేతువు అజ్ఞానం అవిద్య. ఈ దశలో చైతన్యం తాను శరీరముతో అధ్యాస పొంది నేను లావు, నేను బ్రాహ్మణ, ఇంద్రియములతో అధ్యాస పొంది నేను గ్రుడ్డిని, నేను చెవిటిని, మనస్సుతో అధ్యాస చెంది నేను సుఖిని, దుఃఖిని – అని అనుకొని చిదాభాసమై స్థూలవిశ్వంతో వ్యవహరిస్తుంది.

విద్యాదశ అనగా, 'ఆత్మ – అనాత్మ' వివేకం కలుగుతుంది. "అహం బ్రహ్మాస్మి" అనుకొంటుంది. 'నభూమ్యగ్నితోయం" అనుకొంటుంది. కనుక గత 4 శ్లోకాలలో చెప్పిన విధంగా తన స్వరూపమును తెలిసికొంటుంది. కనుక అవిద్యాదశలోనే జీవేశ్వరభేదం కృతార్థమవుతుంది.

7. ఆత్మ అనాత్మలు వాటి ధర్మాలు – అన్యోన్యాధ్యాసచేయటం ద్వారా జీవునకు అవిద్యలో తాపత్రయం కలుగవచ్చును. విద్యలో అధ్యాస పోతుంది కనుక సచ్చిదానందరూపబ్రహ్మత్వం ఎలా వస్తుంది? – సమా – ఒక చక్రవర్తి తన రాజ్యంలో మండలానికి గూడా అధిపతియే కదా! సర్వాత్మక మయిన బ్రహ్మత్వం పొందినవాడు ఈశ్వరత్వం పొందడా? **బ్రహ్మయొక్క ఏకదేశమున (పాదోస్య సర్వాభూతాని) నే గదా! యీ ఈశ్వరత్వ జీవత్వ ప్రపంచముల గొడవ.** కనుక ఒకే చైతన్యం లేదా అదే చైతన్యము రకరకాల ఉపాధులలో ఉన్నది. మాయలో, సమష్టి – అంతఃకరణంలో సమష్టి, స్థూలంలో వ్యష్టి – అంతఃకరణాలలో వ్యష్టి స్థూలములలో నున్నది. అదే చైతన్యము ఉపాధులను బట్టి ఈశ్వర, హిరణ్యగర్భ, విరాట్ (వైశ్వానర) జీవ, దేవతా నామములతో నున్నది. కనుక "నేను ఆ చైతన్యమునే" అను జ్ఞానము కలుగుతుంది. అది ప్రమయే.

8. సర్వోన్నతుడయిన ఈశ్వరుడెక్కడ? అల్పుడయిన జీవుడెక్కడ? – సమా – చైతన్యమాత్రులయిన వారికి గుణదోషములు లేవు. గుణదోషములన్నియు, ఉపాధులయిన భూత సమూహమునకు సంబంధించినవి. శరీరానికి శీతోష్ణములు సోకితే జీవుడు తాను బాధపడతాడు. **అంతఃకరణసంబంధమయిన అల్పజ్ఞానమును తనకు ఆపాదించికొని నేను అల్పజ్ఞుడనని బాధపడతాడు.** శ్రీకృష్ణాదుల శరీరధర్మములయిన శక్తులను శ్రీకృష్ణుని చైతన్యమునకు అంటిస్తారు. కాని ఆత్మ మాత్రము సర్వత్ర ఒక్కటే. అదే సర్వావభాసకం. స్వతంత్రము. సర్వవ్యాపకం, పరమానంద చిద్రూపం. కనుక భేదానికి అవకాశము లేదు.

**శ్లో॥ జ్ఞాత్వైవం పరమాత్మరూపమమలం స్వాత్మానమేవాద్వయం**
**విద్వాన్ సర్వగుహాశయశ్చ వికలం త్రైలోక్యసాక్షిప్రభమ్ ।**
**భావాభావవివర్జితం పరశివం శుద్ధం సమస్తాత్పరం**
**యాత్యేవాక్షరమప్రతర్క్యమమృతం నావర్తతేఽస్మాత్పునః ॥ 291**

భావ॥ పైన చెప్పిన విధముగా నిర్మలము, అద్వితీయము అయిన పరమాత్మరూపమును తన ఆత్మగా తెలిసిన జ్ఞాని సర్వగుహావ్యాపి, నిష్కలుడు, త్రిలోకసాక్షి అయిన జ్యోతీరూపుడు, భావాభావములు లేనివాడు, పరమశివుడు, శుద్ధుడు, సర్వాతీతుడు, అక్షరుడు, అచింత్యుడు, అమృతుడయిన పరమాత్మను పొంది పునర్జన్మకు రాడు. 291

విశే॥ 1. తన ఆత్మయే పరమాత్మ. పరమాత్మాభిన్నము. సచ్చిదానందం. ఆత్మలు అనేకం కాదు. ఒక్కటే. అందువలన ఆత్మ పరమాత్మ అభిన్నమే.

2. జీవులు చాలమంది – అన్నపక్షంలో, జీవులకు భిన్నంగా ఒకే ఈశ్వరుడు. జీవుడొక్కడే – అన్నవాదములో ఈశ్వరుడు లేడు. అంతా జీవుడే. గుహలు = బుద్ధులు.

3. ఒకే జీవుడు, ఒకే ఈశ్వరుడు – అని ఏల చెప్పరాదు? వారుభిన్నులే అనాలి. "గుహాం ప్రవిష్టే పరమే పరార్ధ్యే" శ్రుతి. కనుక ఇద్దరు సర్వగుహాశయులు కావచ్చును. భోక్త జీవుడు. సాక్షి ఈశ్వరుడు. అయినా ఒకే చైతన్యమే. భావం – పుట్టటం ద్వారా ఉనికి. అది లేనివాడు అజుడు.

4. జ్ఞానం రాక ముందయినా జీవుడు బ్రహ్మ రూపమే. అయితే అది అజ్ఞానం వలన తెలియదు. సంసారికన్న భ్రమను పోగొట్టటానికి జ్ఞానం ఆవశ్యకము.

ఇతి కైవల్యోపనిష ద్వ్యాఖ్యాతా.

శ్రీః

# శ్వేతాశ్వతరోపనిషత్

శ్లో॥ కిం బ్రహ్మాస్య నిమిత్తకారణముతోపాదానమజ్ఞోభయం
కిం వైకం కిము వా సహాయకలితం కిం కారణం నైవ వా ।
కిం కాలః ప్రకృతిర్ను కిన్ను నియతిః కిం వా యదృచ్ఛా ను కిం
కిం క్షోణీజలముఖ్యభూతవితతిః కిం వా పుమాంశ్చేతనః ॥ **292**

శ్లో॥ కిం కాలప్రముఖార్థసంయుజిరథో సంసృష్టకాలాదయః
కస్మాదావిరభూమ కేన తు వయం జీవామ ఏవం భువి ।
క్వాస్మాకం ప్రలయే స్థితి ర్నియమితా వర్తామహే కేన కే
దుఃఖే వేతి విచారమారచితవాన్ వేదార్థవిజ్ఞో జనః ॥ **293**

భావ॥ పరమాత్మజ్ఞానం వలన జ్ఞాని అమృతత్త్వమును పొందును. కాని పరమాత్మ అనేవాడున్నాడా? ఉంటే ఏల దొరకడు? జగత్తు వలన దానికి కర్తగా అతనిని ఊహించాలా? జగత్తు మరోరకంగా కాలాదులవలన ఏర్పడియుండగూడదా? – అన్నీ ప్రశ్నలే. కాని శ్వేతాశ్వతరం **జగత్కర్త అయిన పరమాత్మనే ప్రతిపాదించింది**. విచారణ విధాన మిది.

ఈ ప్రపంచమునకు బ్రహ్మము నిమిత్తకారణమా? ఉపాదాన కారణమా? అభిన్న నిమిత్తోపాదాన కారణమా? (సాలెపురుగులాగా) బ్రహ్మం ఒక్కటే ఒంటరిగా సృష్టించిందా? ఇతర పదార్థ సహాయం తీసికొన్నదా? అసలు కారణమే లేదా? కాదా? ఋతువులు వలె కాలమే కారణమా? లేక ఆయా పదార్థములు స్వభావము లాగా (నీరు పల్లానికి పోయినట్లు) ప్రకృతి అనగా స్వభావమే సృష్టి కారణమా? నియతి – కారణమా? (అనగా చంద్రోయంలో సముద్రముల ఆటుపోటులులాగా, ఋతువులలోనే గర్భధారణలాగా) కాకతాళీయంగా అలా

ఏర్పడినదా? (యదృచ్ఛా), పంచభూతములు కారణమా? ఎవరయినా చైతన్యవంతుడయిన పురుషుడు కారణమా? లేక, కాలము మొదలయిన పదార్థముల సంయోగము కారణమా? సంసర్గం చెందిన కాలాది పదార్థములు కారణమా? దేనివలన మనము ఆవిర్భవించాము? దేనిచేత మనము భూలోకంలో బ్రతుకుతున్నాము? ప్రలయమునందు మనస్థితి ఏది? ఎవరు మనలను సుఖదుఃఖాలలో నియమిస్తున్నారు? అని వేదార్థ వేత్తలయినవారు పూర్వం చాల విచారణలు చేసినారు. వస్తు నిరూపణకు విచారధార అవసరం కదా! 292-293

విశే॥ నిమిత్త కారణం = కుండకు కుమ్మరి

ఉపాదాన కారణం = కుండకు మట్టి (సమవాయి కారణము)

**శ్లో॥ ధ్యాత్వా యోగదృశా వ్యలోకత గుణైర్దేవాత్మశక్తిం త్రిభి-**
**ర్గూఢాం తాం యదుపాధి యాతి జగతో ద్వేధా బృహద్ధేతుతామ్ ।**
**కాలాదీని జడాని చేతనమపి స్వాతంత్ర్యహీనం విభు-**
**ర్మాయావానధితిష్ఠతీతి పరమశ్చిన్త్యోఽయమాత్మా బుధైః ॥ 294**

భావ॥ వేదార్థ వేత్తలయినవారు వేదసూచితమయిన యోగ విచారదర్శనముతో ధ్యానించి సత్యమును కనుగొనిరి. అది మాంసమయ నేత్రాదుల కందనిది. వారు జ్ఞానరూప కాంతిశీలుడయిన సచ్చిదానంద పదార్థము యొక్క మాయాశక్తిని కనుగొనిరి. అది తన గుణములయిన కార్యరూపమయిన సత్తరజస్తమో గుణములలో దాగి ఉన్నది. కుండ ఆకారంలో మట్టి, ఏనుగు ఆకారంలో చెక్క దాగి ఉన్నాయి గదా! ఆ మాయ ఉపాధిగా బ్రహ్మము ఈ ప్రపంచమునకు ఉపాదానముగాని నిమిత్తముగాను ఉభయకారణమయినది. కాలాదులు జడములయినవి. అవి స్వతంత్రంగా కారణములు కాలేవు. చేతనుడయినను, జీవుడు సంసారి. పరతంత్రుడు. అతడూ కారణము కాలేడు. కనుక ఈశ్వరుడు మాయాసహితుడై సృష్టి కధ్యక్షుడై యున్నాడు. ఆ విధముగా బుధులు పరమాత్మను విచారింపవలసినది. 294

విశే॥ 1. బ్రహ్మం “నేనే బహురూపము కావలయున”ని సంకల్పించెను. భూతములన్ని జగత్తులోనివి కనుక బ్రహ్మమే నియామకము. కర్త భర్త హర్త.

2. సాంఖ్య తార్కిక వాదములు ప్రధాన, పరమాణువాదములు, సృష్టికారణములని చెప్తాయి. అవి అవైదికములు. పరమాణువులు ప్రధానము లేవు. కల్పితములు. “ప్రధాన క్షేత్రజ్ఞ పతిః” అని ఈ ఉపనిషత్తులో చెప్పిన ప్రధానం పరతంత్రం. అది సాంఖ్యులు చెప్పిన స్వతంత్ర ప్రధానం కాదు. కార్యమునందున్న కారణ ధర్మాలనుబట్టి కార్యమిది కారణమిదని నిర్ణయం చేస్తాము. ఘటమునందు మట్టి, చెట్టునందు విత్తనాలు కనబడ్తాయి గదా! జగత్తునందు ఈశ్వర ధర్మములయిన సచ్చిదానందములు లభిస్తున్నాయి. ప్రపంచం ఉన్నది (సత్) కనబడుతున్నది

(భాతి) ప్రపంచం శరీరాదికం ఇష్టం (ప్రియం = ఆనందం). కనుక ఈశ్వరుడే – జగత్కారణమని చెప్తాము. ఈశ్వర ధర్మవిరుద్ధములయిన "అనృత, జడ, దుఃఖములు గూడా జగత్తులో నున్నాయి. అవి ఈశ్వరోపాధి అయిన మాయాధర్మములు. (సుషుప్తిలో అజ్ఞానం మాయ, ఆనందము ఈశ్వర ధర్మము) అయితే ప్రాణులలో అప్రాణులలో పంచభూతధర్మాలు కనబడుతున్నాయి. అందువలన అవే సృష్టికర్తలు అనరాదు. అచేతనములకు స్వతంత్రత కర్తృత్వము లేదు. పృథివ్యాదుల సంయోగం కారణం కాదు. అది గుణమే కాని వస్తువు (ద్రవ్యం) కాదు. సంయోగించిన భూతములయినా కారణం కావు. అవి అచేతనములు. స్వయంగా సంయోగము కుదరదు. ఈశ్వరుడే వాటినలా కలిపినట్లు పంచీకరణము, త్రివృత్కరణము చెప్తున్నాయి. కనుక మాయా సహితుడయిన పరమేశ్వరుడే ఆకాశాది మహాభూతాలుగా తనను చూపించుచు భౌతిక ప్రపంచంగా కనబడుతున్నట్లు చెప్పబడినది. అందువలన ఆయనయే ఉపాదాన నిమిత్త కారణము.

**వ్యా. ఆత్మైకోఽవ్యయ ఏష సత్యసుఖచిద్రూపః పురాణః పరో**
**మాయాయా వశతో విభాతి బహుధా సంసారచక్రాత్మనా ।**
**సైకా నేమిరముష్య యా ప్రకృతిరిత్యామ్నాయతే షోడశా-**
**న్తోఽయం చ త్రివృతో బిభర్తి చ శతార్ధారం పరం దుస్తరమ్ ॥ 295**

భావ॥ సచ్చిదానందరూపమయిన ఆత్మ ఒక్కటే. అది అవ్యయము. పురాణము. పరమము. ఆ అఖండాత్మ మాయవలన సంసారచక్ర రూపంగా బహు – ఆకారాలతో కనబడుతుంది. రజ్జువు భ్రాంతివలన దండంగా, సర్పంగా, భూగర్తంగా కనబడుతున్నది గదా! ఇదంతా బ్రహ్మావివర్తము. ప్రకృతి ఈ సంసారచక్రమునకు నేమి అనగా పట్టా. 16 పదార్థములు దీని అంచు. దానికి సత్త్వాది గుణత్రయము పొఱలు. 50 ఆకులు ఉన్నాయి. 295

విశే॥ 1. 16 పదార్థములు = 11 ఇంద్రియాలు, పంచభూతాలు = 16 వికారాలు

2. త్రివృతః = త్రి = గుణత్రయం

3. 50 ఆకులు = ఎ) అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము అభినివేశము – 5 క్లేశములు.

బి) 11 ఇంద్రియాల వికలత్వం వలన వచ్చే అశక్తులు 11 + నవతుష్టులు లేకపోవటం వలన వచ్చిన అశక్తులు – 9 + అష్టసిద్ధులు లేనందువలన వచ్చే అశక్తులు 8 మొత్తం 11+9+8 = 28

నవ తుష్టులు = 9.

ప్రకృతి తుష్టి – ప్రకృతి పరిజ్ఞానం వలన వచ్చేది.

ఉపాదాన తుష్టి – సన్న్యాసంవలన వచ్చే తుష్టి

కాలతుష్టి – కాలక్రమంలో ముక్తి వస్తుందనే తుష్టి

భాగ్యతుష్టి – అదృష్టం ఉంటే మోక్షం ఈ లోకంలోనే రావచ్చుననే తుష్టి

పంచతుష్టులు - శబ్ద తుష్టి, రూపతుష్టి, ఇలా శబ్ద స్పర్శ రూప రస గంధ తుష్టి పంచకం

అష్ట సిద్ధులు - 8

వేదాంత శ్రవణం, అర్థ మననం, నిదిధ్యాసనం, బ్రహ్మవిద్యను శిష్యులకుపదేశించటం, గురుప్రాప్తి, అధ్యాత్మిక తాపనివృత్తి, అధిదైవిక తాపనివృత్తి, అధిభౌతిక తాపనివృత్తి - 8.

కాగా 5 క్లేశములు. అశక్తులు - 28, తుష్టులు - 9, సిద్ధులు - 8 = 50

**శ్లో॥ షడ్భిస్సుజ్గతమష్టకైర్భ్రమియుతం తం వింశతిప్రత్యరం**
**విశ్వాకారగతైకపాశకలితం భిన్నత్రిమార్గాన్వితమ్ ।**
**ద్వౌ హేతూ సుఖదుఃఖయోర్విదధతం పుణ్యం చ పాపం నృణాం**
**విద్వానైక్షత చైకమోహమనఘస్సంసారచక్రేశ్వరమ్ ॥ 296**

భావ॥ ఆఱు అష్టకములు గలది, భ్రమణములు గలది, ఇరువది ఆకులుగలది, సమస్త – ఆకారములందు అనుస్యూతంగా నున్న కామ పాశము కలది, భిన్నమయిన మూడు మార్గములు గలది, సుఖ దుఃఖహేతువులయిన పుణ్యపాపములుగలది, "ఆత్మ - అనాత్మ" అభిమాన రూపమయిన మోహముగలది అయిన సంసార చక్రరూపమయిన ఈశ్వర స్వరూపమును జ్ఞాని గమనించెను. ప్రపంచం బ్రహ్మ వివర్తం గదా! 296

విశే॥ 1. అష్టకములు - 6.

1. అవ్యక్తం, మహత్, అహంకారము, శబ్దాపంచతన్మాత్రలు - 8 - కారణాష్టకం.

2. యమనియమాసనప్రాణాయామ, ప్రత్యాహార ధారణా ధ్యాన సమాధులు - 8 - యోగాష్టకం

3. ఊహ, శబ్ద, అధ్యయన, దాన, సుహృత్ప్రాప్తి, దుఃఖత్రయ (3) నివృత్తి - 8 - సిద్ధ్యష్టకం

4. అణిమ, మహిమ, లఘుమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వం - 8. భూత్యష్టకం

5. ఘ్రాణ, వాక్, రసన, నేత్ర, శ్రోత్ర, మనః, హస్త, త్వక్ - 8, గ్రహాష్టకం

6. గంధ, వక్తవ్య, రస, రూప, శబ్ద, కామ, కర్మ, స్పర్శ - 8 - అతిగ్రహాష్టకమ్.

7. వింశతి = 10 ఇంద్రియాలు, వాటి విషయాలు 10 = 20

8. త్రిమార్గములు = దేవయాన, పితృయాన, 'జాయస్వ మ్రియస్వ"యానము

**శ్లో॥ ప్రాజ్ఞాస్తామధియన్తి సంసృతినదీం పఞ్చేన్ద్రియామ్బుం మహా-**
**భూతైః పఞ్చభిరాదిగాఞ్చ కుటిలాముగ్రాం మనస్సమ్భవామ్ ।**
**పఞ్చప్రాణమయోర్మిపఞ్చవిషయావర్తాం శతార్ధం భిదాః**
**పఞ్చాకౌఘరయాంశ్చ పఞ్చ దధతీం క్లేశాఖ్యపర్వాణి వా ॥ 297**

భావ॥ సంసారమొక అంతులేనిది. పంచేంద్రియములు నీరు. పంచమహాభూతముల నుంచి యీనది పుట్టినది. కుటిలము, ఉగ్రము. మనస్సునుండి పుట్టినది. పంచప్రాణములు దీనియందలి అలలు. పంచ విషయాలు శబ్ద స్పర్శాదులు దీనిలోని సుడులు. 50 ఆకులుగా పూర్వం చెప్పబడినవే దీని పాయలు. పంచేంద్రియ భిన్నమయిన దుఃఖవేగములు గలది. పంచక్లేశములు పంచ పర్వములు. అట్టినదిని సంసారమని చెప్పెదరు. 297

విశే॥ 1. మనస్సు లేదు గనుక సుషుప్తి మొదలగు వానియందు సంసారం లేదు. మనస్సున్న జాగర స్వప్నములలో సంసారం ఉన్నది. కనుక సంసారం మనోమయం.

2. తమస్సు, మోహము, మహామోహము, తామిస్రం, అంధతామిస్రము - పంచక్లేశములు.

**శ్లో॥ సర్వాజీవనసర్వసంస్థితిమతి బ్రహ్మాత్మచక్రే బృహ-**
**త్యస్మిన్ భ్రామ్యతి హంస ఏష వివశో దేహాద్యనాత్మాత్మధీః ।**
**ఈశోఽన్యోస్మ్యహమన్య ఇత్యభిమనన్ సంసారమాప్తః పున-**
**ర్జుష్టస్తేన తతోఽమృతత్వమయతే బ్రహ్మాహమస్మీత్యయమ్ ॥ 298**

భావ॥ హంసః = జీవుడు. లింగశరీరముతో, దేహాత్, దేహాంతరం చేరువాడు (హంతి = గచ్ఛతి) అయిన జీవుడు మాయావివశుడై దేహం వంటి అనాత్మలనే ఆత్మలుగా భావించికొనుచు సర్వజీవన సర్వస్థితి హేతువు అయిన బ్రహ్మమయ విశాల సంసార చక్రమునందు వివశుడై తిరుగుచున్నాడు. ఈశ్వరుడు వేరు, తాను వేరు అని అభిమానపడుచు సంసారములో పడిన యీతడు మరల "అహం బ్రహ్మాస్మి" అను జ్ఞానముతో ఈశ్వరునితో ఏకత్వమును పొంది అమృతత్వమును పొందును. 298

విశే॥ 1. తత్త్వవేత్తను ఈశ్వరుడున్ను సేవించును. (కుచేల - కృష్ణ) విదుర, అక్రూర - కృష్ణ) జుష్టః = ఈశ్వర ప్రీతి విషయుడై. ప్రారబ్ధ నాశం తర్వాత గాని దేహం పోయిన తర్వాత గాని, అమృతుడగును.

**శ్లో॥ ఉద్గీతం పరమం తదేతదమృతం బ్రహ్మాత్ర సంస్థం త్రయం**
**తస్మాద్బ్రహ్మ సదక్షరం భవతి చైతస్య ప్రతిష్ఠా పరా ।**
**జ్ఞాత్వా బ్రహ్మవిదస్తదాన్తరమిదం సర్వస్య లీనా ఇహ**
**బ్రహ్మణ్యాత్మని తత్పరా విగళితా యోనేర్భవన్తి ధ్రువమ్ ॥ 299**

భావ॥ శ్రుతుల చేత గొప్పగా చెప్పబడినది. ఉత్కృష్టమయినది, పూర్వోక్తమయిన మాయా సహిత బ్రహ్మ అమృతము. సద్రూపము. ఆనందరూపము గదా! దీనియందు త్రిపుటీ రూపమయిన ద్వైతం ఉన్నది. (కర్త కర్మ క్రియ) కనుక సత్ అయిన బ్రహ్మ అక్షరమయినది. ఈ ద్వైతమునకు అదే పరమ - అధిష్ఠానము. ఆధారము. బ్రహ్మవేత్తలు బ్రహ్మమును సర్వవివర్తమునకు ఆంతరముగా నున్నదని సాక్షాత్కరించికొని ఆత్మయందే నిర్వికల్పక సమాధి ద్వారా లీనులగుదురు. బ్రహ్మానంద తత్పరులయి వారు పునర్జన్మ నుంచి విముక్తులగుదురు. ఇది నిశ్చయము. 299

**శ్లో॥ సంయుక్తం క్షరమక్షరం జగదిదం ధత్తే మహేశః స్వయం**
**వ్యక్తావ్యక్తమనీశ్వరస్తు పురుషో భోక్తృత్వతో బధ్యతే ।**
**జ్ఞాత్వా సంస్కృతమానసేన పురుషః స్వాత్మానమీశం పరం**
**సచ్చిన్మోదమయం విభేదమఖిలైర్నిర్ముచ్యతే బన్ధనైః ॥ 300**

భావ॥ జీవేశ్వర విభాగం వ్యవహారంలోనిది. లయము గూడా వ్యవహారములోనిదే. పరమార్ధదశలో ఇదేదీ లేదు. క్షర, వ్యక్త అక్షర సంయుక్తమయిన యీ ప్రపంచమును పరమాత్మ స్వయంగానే భరించుచున్నాడు. జీవుడు అసమర్ధుడు కనుక భోక్తగా బంధింపబడుతున్నాడు. సంస్కరింపబడిన శమదమాది శుద్ధమయిన మనస్సుతో పురుషుడు తన ఆత్మ అయిన సచ్చిదానంద స్వరూపుడయిన ఈశ్వరుని గ్రహించి సర్వ బంధములనుండి విముక్తుడగును. 300

**శ్లో॥ జ్ఞాజ్ఞౌ ద్వౌ పురుషావజౌ సువిదితౌ జీవేశ్వరాభిఖ్యయా**
**భోక్త్రాద్యర్థమయాకృతిః ప్రకృతిరిత్యేకాస్త్యజా కామినీ ।**
**తత్రైకోఽక్రియ ఈశ్వరోఽన్తవిధురో విశ్వాకృతిర్మున్మయో**
**జీవస్తద్విపరీత ఏతి తు యదా బ్రహ్మత్రయం బ్రహ్మ నా ॥ 301**

భావ॥ జీవేశ్వరాదులను పేర్లతో జ్ఞుడు, అజ్ఞుడు అయిన ఇద్దరు పురుషులు ప్రసిద్ధులు. వారు అజులు. భోక్త భోగ్యం మొదలగు ఆకారము కల ప్రకృతి ఉన్నది. అది అజ. అనాది. అది కామిని. భోక్త అంతఃకరణము. భోగ్యం విషయ సమూహం. జీవేశ్వరులలో ఈశ్వరుడు అక్రియుడు. అనంతుడు. విశ్వరూపుడు. ఆనందమయుడు. అభోక్త. జీవుడు భోక్త, సక్రియుడు, సాంతుడు, దుఃఖరూపుడు. అంతఃకరణ తాదాత్మ్యం వలన ఇట్లగును. కనుక ఇతడు చిదాభాసుడు. ఈ త్రయము బ్రహ్మమేనని తెలిసిననాడు పురుషుడు బ్రహ్మమే అగును. 301

**శ్లో॥ విద్యన్తేక్షర మక్షరం హర ఇతి త్రీణ్యత్ర కార్యం క్షరం**
**యత్తత్కారణమక్షరం ద్వయమిదం యచ్ఛన్ హరస్త్వీశ్వరః ।**
**ధ్యానాత్తస్య చ యోజనాచ్ఛుభధియో ను స్తత్త్వభావాద్ధ్రువే-**
**ద్ధ్యయోఽన్తే సుఖదుఃఖమోహమయనిశ్శేషాత్మమాయాక్షయః ॥ 302**

భావ॥ జీవేశ్వర వైలక్షణ్యము చెప్పబడినది. ప్రధానేశ్వరుల భేదం చెప్తున్నారు. "క్షరము అక్షరము హరుడు" అని మూడు వస్తువులున్నవి. కార్యమయిన పృథివి మొదలగు వస్తువులు క్షరము. అక్షరమనగా కారణము, ప్రధానము, మాయ శక్తి అను పర్యాయనామములు గల వస్తువు. ఈ రెంటిని నియమించువాడు హరుడు. అనగా ఈశ్వరుడు. కనుక ప్రధానం నియామ్యం. ఈశ్వరుడు నియామకుడు. శుభమతిగల సాధకుడు ఆ ఈశ్వరుని ధ్యానము వలన యోజనం వలన (జీవ - పరసంయోగం వలన) తత్త్వజ్ఞానం వలన చివరకు సుఖదుఃఖ మోహమయ మయిన సమస్త మాయ తరిగిపోవును. బ్రహ్మాత్మైక్యము తెలియును. 302

విశే॥ 1. ప్రారబ్ధం పూర్తయ్యేంతదాకా జ్ఞానికయినా దగ్ధపటములాగా మాయ ప్రభావరహితంగా ఉంటుంది. దేహాంతంలో పూర్తిగా నశిస్తుంది.

2. ఇందులో కార్యకారణ - ఈశ్వరులను చెప్పటం జరిగింది. కాని జీవుని గురించి చెప్పలేదు. కారణం జీవేశ్వరులొక్కటే గదా! ఆ అభేదమే. అయితే జీవునకు ఈశ్వరధ్యానం వలన ముక్తి అని చెప్పటం కుదరదని భయం లేదు. ఎందుకంటే ఈశ్వరుడే అనాత్మలతో అధ్యాసవలన తాదాత్మ్యం వలన జీవుడయినాడు. అతనికి ఆత్మ జ్ఞానం వలన ముక్తి. మాయవలన ఇలా జరుగుతుంది. ఈశ్వరుడు జీవుడవుతాడు. ఆకాశం నీలంగా కనబడుతుంది. త్రాడు పామవుతుంది. ఎడారిలో (ఎండమావులు) నదులు కనబడతాయి. చూడండి. భాగవతము. "భగవానేక ఏవైష సర్వక్షేత్రేష్వవస్థితః అముష్య దుర్భగత్వం వా క్లేశోవాకర్మభిః కృతః" అని విదురుడు ప్రశ్నిస్తే అందుకు మైత్రేయుని సమాధానమిది.

"సేయం భగవతో మాయా యన్నయేన విరుధ్యతే, ఈశ్వరస్య విముక్తస్య కార్పణ్యముత-బంధనమ్" "యధార్థేన వినా పుంసః మృషైవాత్మ విపర్యయః, ప్రతీయత ఉపద్రష్టుః స్వశిర-శ్ఛేదనాదినా"

3. క్షరము, ప్రధానము అక్షరము జీవుడు - అని చెప్పటం కుదరదు. అలా అయితే "అక్షరం" అని నపుంసక లింగముతో చెప్పదు. కనుక ప్రధానమే అక్షరము. భగవద్గీతలో వ్యాసమహర్షియే ఇట్లు చెప్పెను. "క్షర స్సర్వాణి భూతాని కూటస్థోక్షర ఉచ్యతే ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః" కనుక "అక్షరః" అని పుంలింగంలో చెప్పబడెను.

4. ఇంకా వివరములు కావలసినచో నా (రచయిత) భగవద్గీతా భాష్యార్క ప్రకాశమున చూడవలయును.

**శ్లో॥ జ్ఞాత్వా దేవమసావహం స ఇతి విత్వాశైర్విముక్తోఽఖిలై-**
**ర్మాయాకామముఖైస్సుఖాసుఖకరోత్పత్తిప్రణాశాతిగః ।**
**ధ్యానాదస్య పుమాంస్తు యాతి పరమం భేదే తృతీయం తనో-**
**ర్విశ్వైశ్వర్యమముత్ర కేవల ఇదం జ్ఞాత్వాఽఽత్మకామో భవేత్ ॥ 303**

భావ॥ ముక్తి దాయకమయిన అజ్ఞానం ఇది. మాయ, కామము మొదలగు పాశములతో బద్ధుడయిన వాడు "తానే బ్రహ్మమునని" తెలిపిన తరువాత అఖిల పాశములనుండి విముక్తుడగును. ఈ ఈశ్వరునిధ్యానము వలన పురుషుడు దేహపాతానంతరము పరమమయిన ప్రపంచైశ్వర్యమును పొందగలడు. అది విరాట్ హిరణ్యగర్భులకన్న అధికమయిన తృతీయ (క్రిందనుంచి) స్థానము. అవ్యాకృతోపాధిలో నున్న ఈశ్వరునితో సాయుజ్యమును పొందును. ఈ ఈశ్వరభావమునందు బ్రహ్మజ్ఞాని అయిన ఆత్మకాముడై నిరుపాధిక పరబ్రహ్మ సాయుజ్యమును పొందును. 303

**శ్లో॥ నిత్యం జ్ఞేయమిదం సదాత్మనిహితం నాతః పరం కిఞ్చన**
**జ్ఞేయం చోదకమీశ్వరం తదమృతం భోగ్యం చ భోక్తా విదన్ ।**
**బ్రహ్మేదం త్రివిధం సమస్తమితి నిశ్శేషాప్రపఞ్చామృత-**
**బ్రహ్మజ్ఞానవశేన తిష్ఠతి పుమాన్ సాక్షాత్పరాత్మాత్మనా ॥ 304**

భావ॥ ఆత్మయందున్న ఈ "సత్" అయిన బ్రహ్మము నిత్యము జ్ఞేయము. ఇంతకుమించి తెలియదగినదేదియు లేదు. జీవుడు చోదకుడయిన ఈశ్వరుని, అమృతం అనగా అక్షరమును ప్రధానమును, భోగ్యమని క్షరమును - ఈ మూడు రకముల వస్తువులను బ్రహ్మముగానే భావించు విద్వాంసుడు నిర్విశేషము, ప్రపంచరహితం, అమృతము అయిన బ్రహ్మమును తెలిసికొనుట ద్వారా సాక్షాత్ పరమాత్మ స్వరూపంగా నిలుచును. 304

**శ్లో॥ వహ్నేర్యోనిగతస్య మూర్తిరిహ నో సన్దృశ్యతే మన్థనాత్**
**ప్రాగ్లిఙ్గస్య న చైవ నాశ ఉదయః పశ్చాద్భవేదేధసా ।**
**హంసస్యాఙ్గగతస్య మూర్తిరితి నో సన్దృశ్యతే ధ్యానతః**
**ప్రాగ్లిఙ్గస్య లయో న చ ప్రణవతః పశ్చాత్తు దృశ్యేత సా ॥ 305**

భావ॥ యోని అనగా కారణమయిన అరణికాష్ఠమునందున్న అగ్ని మథనమునకు ముందు కనబడదు. అంతమాత్రమున వహ్నియొక్క సూక్ష్మశరీరము అందులో నశించిందని చెప్పలేము. మథనం తరువాత అరణిద్వారా అగ్ని కనబడును గదా! అట్లే శరీరగతమయిన జీవునియొక్క మూర్తి ధ్యానమునకు ముందు కనబడక పోవచ్చును. అంతమాత్రమున లింగశరీరము లయమయినదని చెప్పరాదు. తరువాత ఓంకారధ్యానం ద్వారా ఆ హంసమూర్తి కనబడుచున్నది కదా! 305

**శ్లో॥ స్వం వర్ష్మాధరముత్తరం తమరణిం కృత్వాఽఽగమాదిస్వరం**
**ధ్యానాఖ్యం మథనం విధాయ పురుషం పశ్యేన్నిగూఢం కవత్ ।**
**తైలం వా తిలసఞ్చయే దధిని వా సర్పిర్వ కం స్రోతసి**
**ప్రాయేదేనముపాయతస్సుతపసా సత్యేన దేహే పుమాన్ ॥ 306**

భావ॥ తన శరీరము క్రింది అరణి, ఓంకారమును కవ్వముగాను, ధ్యానమును మధనముగాను చేసి పురుషుని గూఢమయిన అగ్నిని వెలికి దెచ్చినట్లు ఆ పురుషుని కనుగొనవలయును. నువ్వుల రాశి నుండి నూనెను పెరుగునుండి నేతిని ప్రవాహమునుండి నీటిని పొందినట్లు ఉపాయముచేత సత్య తపస్సుచేత పురుషుడు ఆ పరమాత్మను కనుగొనవలయును. అట్లు మథనం పీడనం మొదలగునవిచేసినట్లు తీవ్రధ్యానమువలన ఆ పరమహంస దొరకును. 306

**శ్లో॥ సర్వవ్యాపినమేనమమ్బరనిభం యస్త్వాత్మవిద్యాతపో-**
**మూలం సర్పిరివ స్థితం పయసి సమ్పశ్యేదుపాయాత్పుమాన్ ।**
**సద్బ్రహ్మోపనిషత్పదం సుఖమయం స్వాత్మానమాత్మన్యయం**
**సద్బ్రహ్మైవ భవేదనన్తమమృతం సత్యం పరం శాశ్వతమ్ ॥ 307**

భావ॥ సర్వజగత్తులో వ్యాపించినవాడు, అయినను ఆకాశమువలె గుణదోషము లంటనివాడు, ఆత్మ విద్యా తపస్సులకు మూలమయినవాడు, పాలలో నేయివలె నున్నవాడు, ఉపనిషత్తులందు గమ్యమయినవాడు, ఆనందమయుడూ, సత్యబ్రహ్మము అయిన ఆత్మను తన ఆత్మయందే ఉపాయముల ద్వారా చూడవలయును. అట్లు కనుగొన్నవాడు అనంతము, అమృతము, సత్యము, పరమూ, శాశ్వతమూ అయిన బ్రహ్మమే అగును. 307

**శ్లో॥ యుఞ్జానః ప్రథమం పరాత్మని మనస్తత్త్వాయ పశ్చాద్ధియో**
**జ్యోతిః కస్య నిచాయ్య సాధు సవితా కుర్యాత్పృథివ్యాం యదా ।**
**యుక్తేనాస్య తదా హృదా ప్రసవితుస్సాధ్వీమనుజ్ఞాం వయం**
**శక్త్యా సమ్ప్రభవామ ఏత్య మహతే స్వర్గేయమోదాయ చ ॥ 308**

భావ॥ (కస్య = హిరణ్యగర్భుడు, సుఖస్య) పరమాత్మ ఆత్మ విద్యా తపోమూలమని చెప్పిన విషయమే నిరూపింపబడుచున్నది. పరమాత్మ ముందుగా తన భక్తులకు అనగా జిజ్ఞాసువులయిన జీవులకు బ్రహ్మాభావము కొఱకు పరమాత్మయందు మనస్సునులగ్నము చేయును. తరువాత "అహం బ్రహ్మాస్మి" అను నిశ్చయము కలిగించును. హిరణ్యగర్భుని గూడా ప్రకాశింపజేయు ఆ ఆనందజ్యోతిని ఈ బుద్ధియందు ప్రత్యగాత్మగా చూపును. ఈ ఈశ్వరుని యొక్క అనుజ్ఞను పొంది యోగముగల మనస్సుతో దేవతా శ్లాఘనీయమయిన ఆనందమును

పొందగలిగెదము. ఈశ్వరతత్త్వమును అందికొనగలము. ఈశ్వరానుగ్రహం వలన ముందు యోగము తరువాత ధ్యానము, తరువాత అసలయిన జ్ఞానము దానివలన ముక్తి కలుగునని అర్థము. "ఈశ్వరానుగ్రహాదేవ పుంసా మద్వైతవాసనా", "దదామి బుద్ధియోగంతంయేన మామనుయాంతితే" 308

**శ్లో॥ దేవాన్ స్వర్గముపేయుషశ్చితి హృదా సంయోజ్య బుద్ధ్యా బృహత్**
**జ్యోతిర్భాత్కలయిష్యతస్స సవితా సఙ్ప్రోదయత్యేష తాన్ ।**
**విప్రా ఆత్మని యుఞ్జతే సతి మనోబుద్ధీశ్చ హోత్రా విభుః**
**సర్వజ్ఞో విదధే య ఏక ఇతి తత్స్తోత్రం విధేయం బుధైః ॥ 309**

భావ॥ ముముక్షువులయిన జ్ఞానులను అనుగ్రహించటం భగవంతుని స్వభావము. సత్యాది - ఊర్ధ్వ లోకములను పొంది ఉన్న బ్రహ్మ రుద్రాది దేవతలయినా, స్వయంప్రకాశమయిన ఆ బ్రహ్మజ్యోతిని పొందునట్లు ఆయనయే అనుగ్రహించును. కనుక ఇక్కడ భూలోకమందయినా ఈశ్వరానుగ్రహమువలననే సత్యమయిన ఆత్మయందు మనోబుద్ధులను కలిపెదరు. ఆ పరమాత్మయే సృష్ట్యాది క్రియలను చేసినాడని గ్రహించి ఆయనను స్తుతించవలయును. 309

**శ్లో॥ హృద్బుద్ధీ! పరమాత్మని స్వయమహం వాం యోజయామ్యేతు మే**
**శ్లోకో బ్రహ్మ నమోభిరాదిరహితం సన్మార్గగస్తుర్యథా ।**
**ప్రాజ్ఞస్యామృతసూనవస్తమఖిలావ్యాప్తం విశృణ్వన్తు తే**
**యే ధామాని మహన్తి పుణ్యనిచయైర్దివ్యాని చాధ్యాసతే ॥ 310**

భావ॥ ఓ మనోబుద్ధులారా! నేను స్వయముగా మిమ్ములను ఆ పరమాత్మయందు నిలుపుచున్నాను. సజ్జనుని కీర్తివలె నమస్కారసహితమయిన నా స్తోత్రము ఆద్యంతరహితుడయిన బ్రహ్మమును చేరుగాక! పుణ్యములతో దివ్యధామములనలంకరించిన అమృతపుత్రులందరు నా స్తోత్రమును ఆలకించెదరు గాక! 310

**శ్లో॥ యత్రాగ్నిః పరిమధ్యతేఽనలసఖో యత్రాధిసంరుధ్యతే**
**సోమో యత్ర విరిచ్యతేఽ బుధమనస్తత్రైవ సఞ్జాయతే ।**
**పూర్వం బ్రహ్మ జుషేత తత్ప్రసవతో దేవస్య ధాతుర్బుధో**
**నిష్ఠాన్తత్ర దధీత వా పునరముం పూర్తం చ నైవాక్షిపేత్ ॥ 311**

భావ॥ అగ్ని మంధనము చేయు ఆధానాదులందు వాయుసంరోధము చేయబడు ప్రవర్గ్యాదులందును (సవిత ప్రేరణవలన శబ్దము చేయును) సోమరసముపయోగించబడు క్రతువులందును అజ్ఞాని మనస్సు ఇష్టపడి ప్రవర్తించుచుండును. కనుక జ్ఞాని దేవాజ్ఞవలన సనాతనమయిన బ్రహ్మమునే సేవింపవలయును. బ్రహ్మనిష్ఠనే చేయవలయును. అట్టి బుధుని

పూర్వకృతమయిన కర్మ బాధించి సంసారమున పడవేయకుండుగాక! జ్ఞానాగ్నితో అజ్ఞానంతో సహా కర్మ నశిస్తుంది గదా! 311

**శ్లో॥ వర్ష్మాస్థాప్య సమం త్రిషూన్నతమిదం సర్వేన్ద్రియాణ్యాత్మనా**
**హృద్యావేశ్య బుధో భయావహనదీర్బ్రహ్మోడుపేనాతరేత్ ।**
**ప్రాణానత్ర నిపీడ్య సంయతకలః క్షీణేషు తేషూచ్ఛ్వసన్**
**నాసాభ్యామివ దుష్టవాహనరథం విద్వాన్మనో ధారయేత్ ॥ 312**

భావ॥ శరీరమును ఛాతీ, మెడ, తల సమానముగా వచ్చునట్లు నిలిపి మనస్సుతో సహా సర్వేంద్రియములను హృదయమునందు నిలిపి జ్ఞాని భయంకరమయిన సంసారనదులను ఓంకార నావతో దాటవలెను. ప్రాణములను పూరక రేచకాదులతో మధించి క్రియారహితుడై ముక్కుతో మాత్రమే గాలిని పీల్చివదలుచు దుష్టాశ్వములు లాగు రథము వంటి మనస్సును పట్టి నిలిపి యుంచవలయును. 312

**శ్లో॥ దేశేఽల్పోపలవాలుకాగ్నిరహితే శుద్ధే సమే హృద్రమే**
**రిక్తే శబ్దజలాశ్రయాదిభిరదృక్పీడే నివాతే గిరేః ।**
**దర్యాదౌ నివసన్ ప్రమాదరహితో యోగం విదధ్యాద్యతి-**
**శ్చిత్తస్యాత్మని చిన్మయే పరతరే సర్వాన్తరే బ్రహ్మణి ॥ 313**

భావ॥ యోగం ఆచరించవలసిన ప్రదేశం ఇది. చిన్న చిన్న రాళ్ళు ఇసుక అగ్ని మొదలయినవి లేకుండా శుద్ధంగా సమంగా మనోహరంగా, శబ్దము చెరువులు మున్నగునవి లేకుండా కన్నులకు ఉద్వేగం లేకుండా, ఉన్న పర్వతగుహల వంటి ప్రదేశములలో నివసించుచు, సావధానుడుగానుండి, యతియై సాధకుడు తన మనస్సును చిన్మయుడు, పరాత్పరుడు, సర్వాంతరుడు అయిన బ్రహ్మమునందు నిలుపవలయును. 313

**శ్లో॥ నీహారానలకేత్వినానలమరుత్ఖద్యోతసౌదామనీ-**
**శుద్ధస్ఫాటికనిట్కృతాం విదధతే రూపాణి యోగే జనిమ్ ।**
**ఏతాన్యేవ పురస్సరాణి మహతోఽభివ్యక్తికారీణి త-**
**ద్రూపాణాముదయో యదా ఖలు భవేద్యోగస్య సిద్ధిస్తదా ॥ 314**

భావ॥ యోగసిద్ధ చిహ్నములు ఇవి: మంచు, పొగ, సూర్యుడు, అగ్ని, గాలి, మిణుగురు పురుగు, మెఱుపు, స్ఫటికము, చంద్రుడు ఇట్టి రూపములు యోగసమాధిలో కనబడును. ఇవి రాబోవు పరమాత్మ సాక్షాత్కారమును ముందుగా సూచించు చిహ్నములు. దీనివలన యోగసిద్ధి జరుగును. 314

శ్లో॥ పృథ్వ్యమ్బ్వగ్న్యనిలామ్బరే సముదితే వృత్తే చ పఞ్చాత్మకే
సమ్యగ్యోగగుణే సమాగతవతో దేహం శుభం యోగినః ।
యోగాగ్న్యాత్మకమస్య రుఙ్న న జరా నాకాలమృత్యుర్భవే-
దారోగ్యం లఘుతాప్యకామహతతా వర్ణప్రసాదో భవేత్ ॥ **315**

భావ॥ యోగం వలన వచ్చే అవాంతర సిద్ధులు ఇవి - చక్కగా కలగలిసిన పంచీకృతమయిన పాంచభౌతికమయిన యీ శరీరమునందు యోగగుణం బాగా సాగగా ఈ దేహము యోగాగ్ని స్వరూపమగును. ఇట్టి దేహమును పొందిన యోగికి రోగం రాదు. ముసలితనము రాదు. అకాలమృత్యువు రాదు. ఆరోగ్యం ఉండును. లాఘవము కలుగును. కామలోలుపత్వము పోవును. చక్కని ప్రసన్నమయిన ఛాయ వచ్చును. 315

శ్లో॥ జాయేత స్వరసౌష్ఠవం శుభతమో గన్ధోఽల్పవిణ్మూత్రకం
యోగస్య ప్రథమాం వదన్తి విబుధా ఏనాం ప్రవృత్తిం పునః ।
మృల్లిప్తం విమలీకృతం రుచిమయం బిమ్బం యథా భ్రాజతే
తద్వత్తత్త్వమవేక్ష్య కోఽపి భవతి హ్యేకః కృతార్థోఽనకః ॥ **316**

భావ॥ మరికొన్ని యోగిలక్షణాలు ఇవి - స్వరం చక్కగా వస్తుంది. శరీరవాసనలు శుభముగా నుండును. మలమూత్రములు అల్పముగా నుండును. **ఇది యోగంలో ప్రథమ సిద్ధి లక్షణము.** అట్టి యోగి మట్టితో రుద్ది తెల్లగా జేయబడిన వెండి లేదా బంగారం వలె మెఱయుచుండును. అలా తత్త్వజ్ఞానం పొందిన వాడు దుఃఖరహితుడయి కృతార్థుడగును. అవిద్యతో జీవత్వమును పొందిన పురుషుడు విద్యతో పరమేశ్వరత్వము పొందును. 316

శ్లో॥ యుక్తో దీపనిభేన పశ్యతి యదాత్రైవాత్మవత్త్వేన స-
త్తత్త్వం బ్రహ్మణ ఈశ్వరస్య తు తదా తత్త్వైస్సమస్తైస్స్వతః ।
ముక్తం దేవమజం ధ్రువం శివతమం జ్ఞాత్వాఽఖిలైర్ముచ్యతే
పాశైరేష పుమాన్ ముముక్షురనఘం యోగం శనైరభ్యసేత్ ॥ **317**

భావ॥ దీపం వంటి ఆత్మజ్ఞానముతో కూడినవాడై ఈశ్వరుడయిన బ్రహ్మం యొక్క అసలు తత్త్వమును గుర్తించినవాడు సమస్త తత్త్వరహితుడు, అజుడు, శాశ్వతుడు, పరమ మంగళుడు అయిన ఆయనను తెలిసికొని అఖిలపాశములనుంచి విడివడును. అందువలన యోగమును మెల్లగా జాగ్రత్తగా అభ్యసింపవలయును. 317

శ్లో॥ దేవోఽయం హి దిశోఖిలాః ప్రథమతో జాతస్స ఏవాన్తరే
గర్భస్యాస్త్యుదితస్స ఏవ భగవానుత్పత్స్యమానోఽపి సః ।

**ప్రత్యఙ్తిష్ఠతి సర్వతోముఖ ఇమాన్ లోకాన్ జలేఽగ్నౌ మహీ-**
**జాతేష్వోషధిసఞ్చయేఽవిశదిదం విశ్వం చ తస్మై నమః ॥ 318**

భావ॥ ఆ దేవుడే యీ దిక్కులు, ఆయనయే ప్రథమజాతుడు, ఆయనయే గర్భములోపల పిండరూపముగానున్నాడు. పుట్టబోవు శిశువు గూడా ఆయనయే. సర్వతోముఖుడు. సర్వప్రాణిముఖములు ఆయన ముఖములు. సర్వవ్యాపి. ఈ జనాలను కలియు ప్రత్యగాత్మ. ఆయనయే జలమునందు, అగ్నియందు, వనస్పతులయందు, ఓషధులయందు ప్రవేశించెను. ఆయనయే ఉండెను. ఈ ప్రపంచమునందంతా ఆయనయే ప్రవేశించెను. అట్టి దేవునకు నమస్కారము. 318

**శ్లో॥ లోకాన్ యస్సకలాన్ స్వశక్తిభిరిమానీష్టేఽద్వయో జాలవా-**
**నుద్భూతావపి సమ్భవేఽపి విలయే సంసృజ్య గోపా భవన్ ।**
**ప్రత్యఙ్ సన్నపి సఞ్చుకోప భగవానేకో హి రుద్రో విదు-**
**ర్యే త్వేనం తమనన్తమాదిపురుషం దేవం బుధాస్తేఽమృతాః ॥ 319**

భావ॥ జాలము అనగా మాయ, మాయాశక్తి చేత ఆ అద్వితీయ పరబ్రహ్మమే ఈ సకల లోకములను తన శక్తులతో పరిపాలించు చుండెను. సృజించును. పోషించును. లయించును. దీనికి రక్షకుడగును. ఆయన ప్రత్యగాత్మ అయినను అంతకాలమున కోపించి లయము చేయును. ఆయనయే రుద్రుడు. ఏకప్రభువు. ఇట్లు ఈ అనంతుడయిన ఆదిపురుషుని తెలిసికొన్న బుధులు అమృతులగుదురు. 319

**శ్లో॥ చక్షూంష్యస్య ముఖాని దోంషి చరణా వా విశ్వతో జాగ్రతి**
**ద్యావాభూమియుగం మహాన్స్రజనయన్దేవోఽయమేకోఽవతి ।**
**బాహుభ్యామిదమేష సన్ధమతి వా పత్రైస్సమస్తాధిపో**
**దేవానాం ప్రభవోద్భవో ద్రుహిణసూర్బుద్ధిం శుభాం నో దిశేత్ ॥320**

భావ॥ ఈ దేవుని యొక్క నేత్రములు, కన్నులు, ముఖములు, చేతులు కాళ్ళు అంతటా ఉన్నవి. ఈ దేవుడు ఒక్కడే భూలోకద్యులోకములను పుట్టించి రక్షించుచున్నాడు. సమస్తాధిపతి అయిన రెక్కల చేత లేదా బాహువుల చేత ఈ భూమ్యాకాశములను సంయోగపరచినాడు. సర్వదేవతలకు సృష్టిస్థితికారణుడయిన ఆ సర్వేశ్వరుడు, హిరణ్యగర్భ జనకుడు, మనకు శుభమయిన బుద్ధిని ఇచ్చుగాక! 320

**శ్లో॥ యా తే రుద్ర! శివా తనూర్విజయతేఽఘోరాఽఘహృత్కాశినీ**
**తన్వాఽస్మాన్ గిరిశన్త! సఙ్కలయ భో! ఆనన్దమయ్యా తయా ।**

**క్షేప్తుం యామిషుమీశితః కలయసే హస్తే శివాం తాం కురు**
**త్వం మాపీడయ భో గిరిత్ర! పురుషం కృత్స్నం జగచ్చాత్మనా ॥ 321**

భావ॥ శాంతమయినది మంగళమయినది, పాపహరమయినది, ప్రకాశముగలది – అయిన నీ శరీరము సర్వాధికమయినది. ఆనందమయిన నీశరీరముతో ఓ గిరిశంతా! (హిమవంతునకు శుభకరుడు, వాక్యమునందు శుభకరుడు) మమ్ములను కాపాడుము. స్పృశింపుము. ప్రయోగించుటకు సిద్ధముగా నున్న నీ చేతి బాణము మాకు మంగళ ప్రదమగుగాక! ఓ గిరి రక్షక! మమ్ములను మా ప్రపంచమును నీవు పీడింపకుము. మా పశుభృత్యాదికమును పీడింపకుము. 321

**శ్లో॥ తస్మాద్బ్రహ్మ పరం బృహన్తమమలం భూతేషు గూఢం స్థితం**
**సర్వేష్వత్ర యథానికాయమమృతం విశ్వస్య చైకం విభుమ్ ।**
**ఈశానం పరివేష్టితారమహమిత్యజ్ఞానదూరస్థితం**
**జ్ఞాత్వా భాస్కరవర్ణమాదిపురుషం మృత్యుం సమత్యేతి నా ॥ 322**

భావ॥ సగుణ తత్త్వమును చెప్పి నిర్గుణ తత్త్వమును వర్ణించుచున్నాడు. కనుక ఈ విశ్వమయుడయిన సగుణ శరీరునికన్న పరాత్పరమయినది, విశాలమయినది, అమలమయినది, బ్రహ్మమని పిలువబడునది, దేహములననుసరించి యున్నదియును, వ్యాపకము, విశ్వమునకు ఈశానము, సర్వమును చుట్టియున్నదియు, అజ్ఞానమునకు అవతలదూరముగా నున్నదియు, భాస్కరవర్ణమయినదియు అగు ఆ ఆదిపురుష తత్త్వము తనే అని తలచిన వాడు మృత్యువును దాటి వెడలును. 322

**శ్లో॥ యస్మాన్నాస్తి పరం న చాపరముతాణీయో న కిఞ్చిత్పరం**
**న జ్యాయో దివి భూమిజాత ఇవ యః స్తబ్ధః పరం తిష్ఠతి ।**
**తేనైకేన పరీతమేతదఖిలం పుంసా తతస్తూత్తరం**
**నీరూపం తదనామయం విదురిదం యే తే లభన్తేఽమృతమ్ ॥ 323**

భావ॥ ఆ వస్తువుకన్న అధికమయినది లేదు. తక్కువదియు లేదు. దానికన్న అణువయినది లేదు. మహత్తయినదీ లేదు. నేలమీద పుట్టి నిటారుగా పెరిగిన చెట్టువలె ఎత్తుగానిలబడి యున్నది. ఆ వస్తువు చేత ఈ ప్రపంచమంతా వ్యాపించియున్నది. కనుక ప్రపంచమునకు బాగా అతీతము, రూపరహితము తాపత్రయ రహితము అయిన బ్రహ్మమును తెలిసికొన్న వారలు అమృతులగుదురు. 323

**శ్లో॥ అన్యే యాన్తి తు దుఃఖమేవ న తతః పన్థా విముక్తేః పరో**
**జ్ఞానాదస్తి మహేశ్వరస్య సకలగ్రీవాస్యమస్తస్స తు ।**

**సర్వప్రాణిగుహాశయః సకలగః పూర్ణః సమస్తేరణ**
**శ్చేశానః ప్రభురవ్యయో ద్యుతిమయః శ్రీమాన్మహాన్వై శివః ॥ 324**

భావ॥ బ్రహ్మవేత్తలుకానివారు సంసార దుఃఖమునే పొందెదరు. జ్ఞానం కన్న భిన్నమయిన పంథా లేదు. అదే మోక్ష మార్గము. మహేశ్వరుని జ్ఞానమే ఆ మార్గము. ఆ ఈశ్వరుడు, సకల గ్రీవుడు, సకల ముఖుడు, సకల శీర్షుడు, సర్వప్రాణులను బుద్ధిగుహలో నుండువాడు, సర్వవ్యాపి, పూర్ణుడు, సమస్త ప్రేరకుడు, అంతర్యామి, ఈశానుడు, ప్రభువు, అన్యుడు, కాంతిమయుడు, శ్రీమంతుడు, శివుడు. మాయావి. 324

**శ్లో॥ అఙ్గుష్ఠప్రమితః పురాణపురుషః సర్వాన్తరాత్మా సదా**
**భూతానాం హృదయే స్థితో ధిషణయా హృత్సంస్థయా భాసితః ।**
**సర్వాత్మా స సహస్రశీర్షనయనాఙ్ఘ్ర్యాదిర్ధరాం విశ్వతో**
**వృత్వాఽతీత్య దశాఙ్గులం స్థిత ఇదఙ్జ్ఞాన్తి యే తేఽమృతాః ॥ 325**

భావ॥ అంగుష్ఠ ప్రమాణం గలవాడు, పురాణ పురుషుడు, సర్వాంతరాత్మ, సదా భూత హృదయములలో నుండినవాడు, హృదయము నందున్న బుద్ధికల చేత భాసించువాడు, సర్వాత్మకుడు, సహస్రశీర్షుడు, సహస్ర నేత్రుడు, సహస్ర పాదుడు, సహస్ర సర్వావయవుడు అయిన ఆ పరమపురుషుడు ఈ భూమిని అన్ని వైపుల చుట్టికొని దశాంగుల ప్రమాణము మించియున్నాడు. ఈ పురుషుని తెలిసికొన్న వారలు అమృతులగుదురు. 325

**శ్లో॥ భూతం భవ్యమిదం సమం చ పురుషో మోక్షస్య కార్యస్య చ**
**స్వామీ పాణిపదాక్షిశీర్షవదనశ్రోత్రాదయోఽస్యాభితః ।**
**విద్యన్తే భువనే సమస్తమభిసంవ్యాప్యైష తిష్ఠత్యయం**
**సర్వైరిన్ద్రియతద్గుణైర్విరహితస్తద్వానివాభాసతే ॥ 326**

భావ॥ భూత వర్తమానభవిష్యత్తులు అన్నియు అతడే. మోక్షమునకు ప్రపంచమునకు అతడే స్వామి, ఈ ప్రపంచమున ఆయనకు సర్వత్ర పాణిపాదనేత్ర శిరోవదనాదులున్నాయి. ఈ సమస్తమునందు ఆయన వ్యాపించియున్నాడు. ఇంద్రియాలు, ఇంద్రియగుణాలు ఆయనకు వాస్తవంగా అంటవు. కాని ఉన్నట్లు కనబడతాడు. 326

**శ్లో॥ ఈశానశ్శరణం సుహృద్బృహదయం సర్వస్య లోకస్య వ-**
**శ్యఙ్చత్యేవ బహిఃపురే స తనుమాన్ హంసో నవద్వారిణి ।**
**ఆదాతాప్యకరోఽపదోఽపి జవనో ఽచక్షుశ్చ పశ్యత్యప-**
**శ్రోత్రో హన్త శృణోతి వేద్యమఖిలం వేత్త్యస్య వేత్తా తు నో ॥ 327**

భావ॥ ఈశ్వరుడు శరణము, రక్షకుడు, మిత్రుడు, బ్రహ్మము. సర్వలోకములను వశములో

ఉంచికొన్నవాడు. ఈయనయే హంస. దేహధారి. బుద్ధివృత్తిరీత్యా విషయగ్రహణానికి బయట సంచరించును. నవద్వారసహితమయిన యీ శరీరపురమున నుండును. ఇతనికి చేతులు లేవు. కాని తీసికొనగలడు. చెవులు లేవు, వినగలడు. అన్నియు తెలిసికొనగలడు, కాని జ్ఞాత లేడు. ఉన్నాడంటే అనవస్థ. జీవుడు ఈశ్వరుని తెలిసికొంటాడన్నాను. కాని జీవేశ్వరులు ఒక్కటే కనుక జ్ఞేయుడు గాడు. 327

**శ్లో॥ అగ్ర్యోఽయం పురుషోఽ ప్యణోరణుతరో జ్యాయానపి జ్యాయసో**
**భూతానాం నిహితో గుహాసు విబుధస్తం యోఽ క్రతుం పశ్యతి ।**
**ఆత్మానం మహిమానమీశమకలం ధాతుః ప్రసాదాద్విభుం**
**సర్వాత్మానమవిక్రియఞ్చ విజరం స ధ్వస్తశోకో భవేత్ ॥ 328**

భావ॥ సనాతనుడయిన ఈ పురుషుడు అణువుకన్న అణువు, మహత్తుకన్న మహత్తు, ప్రాణులబుద్ధిగుహలో నున్నవాడు. ఆయన నిష్క్రియుడు. అట్టి నిష్కలుడు, ఈశ్వరుడు, కర్మనిమిత్తమయిన వృద్ధి క్షయములు లేని మహితుడు జరారహితుడు, అయిన పురుషుని ఆత్మగా గుర్తించిన జ్ఞాని శోకరహితుడగును. 328

**శ్లో॥ యోఽ వర్ణో బహుధైక ఏవ విదధే వర్ణాననేకాన్యతః**
**శక్త్యాఽఽదౌ విలయే హరిష్యతి నిజే రూపే బిభర్త్యద్య చ ।**
**దేవోఽసౌ స ధియా యునక్తు శుభయా నః స్వాశ్రయాన్ సోఽనలః**
**సూర్యశ్చానిల ఇన్దురమ్బు చ విరాట్ శుక్రం చ తద్బ్రహ్మ వా ॥ 329**

భావ॥ నీలపీతాది వర్ణములుగాని బ్రాహ్మణాది వర్ణములు కాని నామములుగాని బ్రహ్మచర్యాది - ఆశ్రమములుగాని లేని ఆ పరమాత్మ వీటినన్నింటిని తన మాయాశక్తితో సృష్టించెను. తనరూపమునందు వీటిని భరించును. లయకాలమున హరించును. అట్టి దేవుడు ఆయనయే ఆశ్రయంగా నున్న మనకు శుభమయిన బుద్ధిని ప్రసాదించుగాక! ఆయనయే అగ్ని, సూర్యుడు, గాలి, చంద్రుడు, నీరు, విరాట్టు, శుక్రము అనగా మెరయుచున్న నక్షత్ర మండలము. ఆయన బ్రహ్మ లేదా బ్రహ్మదేవుడు. 329

**శ్లో॥ త్వం స్త్రీ త్వం పురుషః కుమారక ఉమేట్! త్వం వా కుమారీ భవ-**
**స్యాజీర్ణస్త్వమసి త్వమఞ్చసి శనైర్దణ్డేన జాతోఽసి చ ।**
**నీలస్త్వం హరితః పతఙ్గ ఉదధిస్త్వం లోహితాక్షస్తటి-**
**ద్గర్భశ్చర్తుమయోఽస్యనాదిరఖిలం త్వత్తః ప్రసూతం విభోః ॥ 330**

భావ॥ అయ్యా! సర్వవ్యాపి అయిన ఓ సర్వాత్మా! నీవు స్త్రీవి, నీవు పురుషుడవు,

కుమారుడవు. ఓ మాయాపతీ! కుమారివి, వృద్ధుడవు, కఱ్ఱపట్టికొని నడచెదవు. అపుడే పుట్టిన శిశువువు. నీవు నీలమయిన పక్షివి. అనగా తుమ్మెదవు. ఆకు పచ్చని పక్షివి (చిలుకవు). నీవు సముద్రుడవు. ఎఱ్ఱని కన్నులు గల పక్షివి (కోకిల) . మెఱుపులతో నిండిన మబ్బువు. ఋతు రూపుడవు. అనాదివి, అఖిలం నీవే. అఖిలము నీనుండివచ్చినదే. కార్యములన్ని కారణముకన్న భిన్నమయినవి కావు గదా! 330

**శ్లో॥ ఏకాం లోహితశుక్లకృష్ణగుణగాం బహ్వీః సరూపాః ప్రజాః**
**కుర్వాణామవశాదజాం పరిభజన్ శేతేఽజ ఏకోఽత్ర హి ।**
**తామేనాం ప్రజహాత్యజస్తదితరస్సముక్తభోగామజాం**
**ద్వావేతౌ పురుషౌ ద్విజావివ తరౌ దేహే సఖాయౌ స్థితౌ ॥ 331**

భావ॥ పరవశురాలయిన లోహిత శుక్ల కృష్ణ వర్ణములు గల ఒక అజ (మేక/గొఱ్ఱె). అది తనతో సమానమయిన ఆకారముగల సంతానమును చాల కన్నది. అట్టి అజను పట్టికొని ఒక పురుష చ్ఛాగము దానిదగ్గర పడియున్నది. జీవభుక్తమయిన ఆ అజను వదలి స్వతంత్రముగా మఱొక అజమున్నది. వీరే చెట్టుమీద రెండు పక్షుల వలె ఈ దేహమునందు మిత్రులుగా నుండిరి. 331

విశే॥ 1. సాంఖ్యుల ప్రధానం స్వతంత్రం. అది పరతంత్రంగా సృష్టి చేయదు.

2. ప్రకృతి పురుషుడు ఈశ్వరుడు అని మూడు పదార్థాలున్నాయి. మూడు అనాదులు. ప్రకృతి పురుషులు పరతంత్రులు. ఈశ్వరుడు స్వతంత్రుడు. జగత్తు అంతా ప్రకృతి కృతము. వీటితో తాదాత్మ్య భ్రమ వలన జీవుడు దేహాదులు తాననుకొని సంసరిస్తున్నాడు. అట్టి భ్రమ లేదు గనుక ఈశ్వరుడు నిత్యముక్తుడు. ఈ ఇద్దఱు దేహమునందే ఉన్నారు. దేహం ప్రకృతి మయము. ఈశ్వరానుగ్రహం వలననే జీవుడు ముక్తుడవుతాడు. వీరిద్దఱు సఖులు. నిజానికి ఒకటే పదార్థము. దృక్ – ద్రష్ట. అయితే అంతఃకరణంలో ఉన్నవాడు జీవుడు. మాయావిశిష్ట అంతఃకరణంలో ఉన్నవాడు ఈశ్వరుడు. ఆయనయే ప్రత్యగాత్మ. – ఇది అద్వైతము.

**శ్లో॥ ఏకః పిప్పలమత్తి తత్ర పురుషః పశ్య త్యనశ్న న్పరో**
**భోక్తాఽసౌ భవసాగరే పరవశో మగ్నః పరం శోచతి ।**
**మూఢోఽప్యేవమయం యదా స్వసుహృదం సర్వేశ్వరం పశ్యతి**
**స్వాత్మానం మహిమానమస్య చ తదా స్యాద్వీతశోకః స్వయమ్ ॥332**

భావ॥ జీవేశ్వరులలో ఒకరు పిప్పలం అనగా కర్మఫలమును (భావార్థము) తినును. కాని ఈశ్వరుడు, కర్మఫలమును తినకుండా సాక్షిగా నుండును. అందులో భోక్త అయిన జీవుడు భవసాగరములో మగ్నుడై పరవశుడై మిక్కిలి దుఃఖపడును. ఇతడు మూఢుడయినను తన

మిత్రుడు, సర్వేశ్వరుడు తన ఆత్మను ఆయన యొక్క సచ్చిదానంద రూపమయిన, పాపరహిత - మహిమను, స్వయంగా గ్రహించునో ఆ క్షణమునుంచి అతడు శోకరహితుడగును. తన యందు అజ్ఞానము దానికార్యమయిన శోకమున్ను లేవు గదా! 332

**శ్లో॥ యస్మిన్ వ్యోమ్ని ఋచో౽క్షరే చ పరమే తిష్ఠన్తి దేవాస్సమే**
**యస్తం నైతి ఋచా కరిష్యతి స కిం యో వేద సో౽యం కృతీ ।**
**ఛన్దోయజ్ఞయమక్రతూన్నిగదితం వేదైరతీతం భవ-**
**ద్భావ్యస్మాన్నిజమాయయేట్కలయతే రుద్ధస్తయా తత్ర నా ॥ 333**

భావ॥ అక్షరమయిన ఆత్మరూపమయిన పరమాకాశమునందు ఋక్కులు, సమస్తదేవతలు ఉండెదరు. ఎవరయితే అర్థరూపమయిన ఆ పరమేశ్వరుని ఋక్కు ద్వారా తెలిసికొనలేరో వారు ఆ ఋక్కుతో ఏమి చేయగలరు? అది బాగా తెలిసినవాడు చాల కుశలుడు. కృతార్థుడు. ఆ ఈశ్వరుడు ఛందస్సులను, యజ్ఞములను, నియమములను, క్రతువులను, వేద విషయములను, భూతవర్తమాన భవిష్యత్తులను తన మాయతో సృష్టించును. జీవుడు ఆ మాయచేత వశుడై అడ్డగింపబడినాడు. కనుక ఆ జీవుడు జగత్కారణము కాదు. 333

**శ్లో॥ మాయాన్తు ప్రకృతిం మహేశ్వరమముం విద్యాత్తు తం మాయినం**
**తస్య వ్యాప్తమశేషమప్యవయవైరేతజ్జగన్మాయినః ।**
**యోనిం యోనిమధిష్ఠితస్స భగవాంస్తస్మిన్నిదం లీయతే**
**తస్మాజ్జాయత ఏవ శాన్తిమయతే౽త్యన్తం తమఙ్చన్ పుమాన్ ॥ 334**

భావ॥ మాయయే ప్రకృతి. ఈశ్వరుడు మాయాసహితుడు. ఆ మహామాయాపతియొక్క అంశ ప్రాయులయిన జీవులే ఈ ప్రపంచమంతా నిండియున్నారు. ఆ భగవంతుడే సర్వకారణ పదార్థములయిన ప్రకృతి మహదహంకార పంచతన్మాత్రలను చైతన్యముగా అధిష్ఠానమై ఆక్రమించియున్నాడు. ఆయనయందే యీ ప్రపంచమంతా లీనమగును. ఆయననుంచియే అంతా జన్మించును. అట్టి మహాపురుషుని గ్రహించిన పురుషుడు శాంతిని పొందును. 334

**శ్లో॥ ఈశానం వరదం తమీడ్యమనఘం దేవాధిపఞ్చేశ్వరం**
**మర్త్యానాఞ్చ చతుష్పదాం సుహవిషా సద్భిస్సమాసేవితమ్ ।**
**సూక్ష్మాత్సూక్ష్మతమం స్థితఞ్చ కలిలస్యాన్తే కమేకం జగ-**
**త్కర్తారం బహురూపమేత్య విబుధో ముక్తిం శివం గచ్ఛతి ॥ 335**

భావ॥ ఈశ్వరుడు, వరదుడు, అనఘుడు, దేవాధిపతి, నియామకుడు, మానవులకు అలాగే చతుష్పాదులకు అధిపతి, సజ్జనులచేత హవిస్సులద్వారా సేవింపబడువాడు, సూక్ష్మముకన్న అనగా ఆకారాదికము కన్న అత్యంతసూక్ష్మమయినవాడు, అజ్ఞానంయొక్క అవతలనున్నవాడు,

సుఖస్వరూపుడు ఒకడు, జగత్కర్త, అందువలన విశ్వరూపధారి అయిన ఆ శివుని పొంది జ్ఞాని ముక్తిని పొందును. అదే సంసార విరామరూపమయిన శాంతి. 335

**శ్లో॥ గోప్తారం భువనస్య కాలవశతో విశ్వాధిపం సర్వతో**
**గూఢం బ్రహ్మవిదగ్రణీభిరయితం బ్రహ్మాదిభిర్దైవతైః ।**
**సూక్ష్మం మణ్డమివామృతాత్పరమముం దేవం మహర్షిం శివం**
**రుద్రం సర్వగతం నిరీక్ష్య విబుధః పాశైర్విముక్తో భవేత్ ॥ 336**

భావ॥ కాలమునుబట్టి లోకమును (స్థితికాలములో) రక్షించువాడు, విశ్వాధిపతి, సర్వతః రహస్యముగా అంతర్యామిగా లేదా అధిష్ఠానంగా నున్నవాడు, బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠులయిన బ్రహ్మాది దైవతములచేత పొందబడినవాడు, నేతిపైన కట్టిన సూక్ష్మమయిన 'తఱక' వంటివాడును, పరాత్పరుడు, ద్రష్ట, మహర్షి, సర్వజ్ఞుడు, మంగళమూర్తి, రుద్రుడు, సర్వవ్యాప్తుడు – అయిన పరమాత్మను పొంది జ్ఞాని అవిద్య కామము కర్మలు మొదలయిన పాశములనుండి విడివడును. 336

**శ్లో॥ నాస్తే యత్ర తమో దివా న న నిశా నో సన్న చాసన్ శివో**
**దేవః కేవల ఏక ఏవ సవితుర్నిత్యం వరేణ్యస్తు తత్ ।**
**తస్మాత్సత్తమసమ్ప్రదాయవశతః ప్రజ్ఞా పురాణీ సృతా**
**గృహ్ణీయాన్న దిశాసు కశ్చన పుమానేనం న చాస్యోపమా ॥ 337**

భావ॥ ఏ దశలో జ్ఞానికి పరమాత్మ సాక్షాత్కారం కలుగుతుంది? సమా – అజ్ఞానం లేని సమయం, (సుషుప్తిలో అజ్ఞానం ఉంటుంది) ఎక్కడ పగలు లేదో అనగా జాగరణాది ప్రపంచ వ్యవహారం లేని సమయం. రాత్రి అనగా స్వప్నము లేని సమయం. సత్ అనగా కనబడే కార్యప్రపంచము, అసత్ అనగా కనబడని కారణ ప్రపంచము గాని లేనసమయం, అట్టి సమయం నిర్వికల్ప సమాధి. కేవలుడు, అనగా సజాతీయ, స్వగత భేదము లేనివాడు, స్వయంజ్యోతి, అయిన పరమాత్మ సమాధిలో స్ఫురించును. ఆ తత్త్వము నిత్యము సేవింపదగినది. ఈశ్వరునివలన హిరణ్యగర్భాదుల ద్వారా నడచిన సంప్రదాయము వలన అనాది అయిన ఈ బ్రహ్మ విద్యా పరంపరగా సాగినది. అతీంద్రియుడయిన ఈశ్వరుడు మనకు కనబడడు. దిక్కులందు కనబడడు. ఈయన అసమానుడు. 337

**శ్లో॥ నామైతస్య మహద్యశోఽస్య న పదం చక్షుష్పథే తిష్ఠతి**
**హ్యేనం తద్భువి కోఽపి పశ్యతి న వా యః కోఽపి హృత్థ్సం హృదా ।**
**ఏనం వేత్తి య ఏవమేనమయతే సమ్పద్యతే సోఽమృత–**
**స్తస్మాత్కోఽప్యజ ఇత్యహం భవదవత్రస్తః ప్రపద్యే పరమ్ ॥ 338**

భావ॥ పేరే ఆయన కీర్తి. ఆయన కనబడడు. అందువలన హృదయమునందున్న ఈ ఈశ్వరుని ఎవడు హృదయముతో గ్రహించునో యీ పరమాత్మను పొందునో, కలియునో, అట్టివాడు అమృతుడగును. కనుక ఎవడో ఒక అజుడు శరణ్యుడున్నాడని సంసారారణ్య భీతుడనయిన నేను ఆ పరమ పురుషుని శరణుగోరెదను. 338

**శ్లో॥ యత్తే దక్షిణమాననం శివ! శివం మాం పాహి తేనానిశం**
**నాశం మాకురు పుత్రపౌత్రపశుభృత్యాయుర్ముఖానామ్మమ ।**
**క్రుద్ధస్సన్ యదహం యుతస్సుహవిషా రక్షాకృతే త్వాం సదా**
**బ్రహ్మేన్ద్రాదివదాహ్వయామి కృపణోఽనాథో జగన్నాయకమ్ ॥ 339**

భావ॥ శివ! నీదక్షిణముఖంతో నన్ను నిత్యము రక్షించుము. నా పుత్ర పౌత్ర పశుభృత్యాదులను ఆయువులను క్రోధముతో చెడగొట్టకుము. కృపణుడను, అనాధుడను, నేను మంచి హవ్యములతో నారక్షణకొఱకై జగన్నాధుడవయిన నిన్ను బ్రహ్మేంద్రాదులను పిలచినట్లు ఆహ్వానించెదను. 339

**శ్లో॥ ద్వే స్తో బ్రహ్మపరేఽక్షరేఽన్తరహితే విద్యేత్యవిద్యేతి చా**
**విస్పష్టం నిహితే తయోస్తదమృతం విద్యా త్వవిద్యాక్షరమ్ ।**
**ఈష్టే తద్ద్వితయన్తు యః స హి పరస్తాభ్యామ్మహేశ శ్శివ-**
**స్సోఽయం సర్వమధిష్ఠితః కపిలభృద్జ్ఞానైర్విచష్టే ఽఖిలమ్ ॥ 340**

భావ॥ హిరణ్యగర్భ బ్రహ్మకన్న పరమైన అక్షరమయిన అనంతమయిన బ్రహ్మమునందు విద్య అవిద్య అనునవి గూఢముగా నున్నవి. అందులో విద్య అక్షరము. అవిద్య క్షరము. అది క్షరమయిన సంసారమునకు కారణము కదా! ఈ రెంటిని నియమించు వాడు మహేశ్వరుడే. కనుక ఆ అవిద్యవిద్యలకన్న పరుడయిన శివుడు హిరణ్యగర్భునికి గూడా ప్రభువు. ఆయన యీ సర్వమును అధిష్ఠించియున్నాడు.

(కపిల= హిరణ్యగర్భ) కనుక విద్య అవిద్య ఈశ్వరవశం కనుక ముముక్షువు ఈశ్వరుని సేవించినచో అవిద్య తొలగును. విద్య కలుగును. 340

**శ్లో॥ ఏకైకం బహుధా చిరాయ భగవాన్ జాలం వికుర్వన్నయం**
**క్షేత్రేఽస్మిన్నుపసంహరత్యథ పునః సృష్ట్వా మరీచ్యాదిమాన్ ।**
**లోకానాం చ పతీంస్తథైష కురుతే సర్వాధిపత్యం మహాన్**
**సర్వం సాధ్వవభాసయన్నరుణవద్విభ్రాజతే చ స్వయమ్ ॥ 341**

భావ॥ సంసారబంధనిర్మిత అయిన భగవంతునే బంధవిమోచనకు ప్రార్థింపవలసి యుండును. ఈశ్వరుడు అనాదికాలమునుండి ప్రతిప్రాణికి ఈ సంసారమను వలను పన్ని

ఆయా ప్రారబ్ధ ములననుసరించి సుఖదుఃఖములను ఇచ్చుచున్నాడు. మరల ఈ మాయామయ మయిన బ్రహ్మక్షేత్రమునందే ఉపసంహరించుచున్నాడు. అలాగే ఈశ్వరుడు మరీచి మొదలగు ప్రజాపతులను సృజించి సర్వాధిపత్యమును కలిగియున్నాడు. ఈ మహాత్ముడు సూర్యునివలె ఈ ప్రపంచమును చక్కగా భాసింపజేయుచు స్వయంగా భాసించును. ఆయన స్వయంజ్యోతి గదా! 341

**శ్లో॥ యో దేవః పచతి స్వభావమపి యః ప్రాచ్యాన్ పదార్థాన్నయే-**
**త్సచ్ఛక్త్యా పరిణామమస్య జగతో యోనిర్య ఏకః పుమాన్ ।**
**సర్వం సాధ్వతితిష్ఠతి స్వయమయే యో వా నియుఙ్క్తే గుణాన్**
**తం గుహ్యోపనిషత్సు గూఢమితవాన్ విద్బ్రహ్మయోనిం విధిః ॥ 342**

భావ॥ అగ్నికి వేడిలాగా జీవునకు సంసారము స్వభావము గదా! అదెలా తొలగుతుంది? – సమా – సర్వపదార్థములకు ప్రత్యేక స్వభావమును నియమించిన ఈశ్వరుడు తన మాయాశక్తితో పూర్వోత్పన్నములయిన ఆకాశాది పదార్థములను పరిణమింపజేసినాడు. ఆవిధముగా ఆయన ఈ జగత్తును నిర్మించాడు. కనుకనే ఆ ఒంటరిపురుషుడే యీ జగత్తుకు మూలము. ఈ సర్వమునకు ఆయనయే అధిష్ఠానము. ఆయనయే గుణములను ఏర్పరచును. రహస్యమయిన ఉపనిషత్తులలోనున్న ఆ హిరణ్యగర్భ కారణుడయిన ఈశ్వరుని తెలిసికొన్నవాడు బ్రహ్మయే. 342

**శ్లో॥ దేవాస్తం ప్రతిపద్య దేవమృషయః పూర్వేఽభవంస్తన్మయా-**
**స్తస్మాదద్య చ నా ముముక్షురమృతం ప్రాప్తుం ప్రపద్యేత తమ్ ।**
**జీవోఽయం హి గుణాన్వయః ఫలకృతే కర్తా కృతీనాం ఫల-**
**స్యాభోక్తా బహురూపగస్త్రిగుణగో వర్త్మత్రయోపాశ్రయః ॥ 343**

భావ॥ ఆ యీశ్వరుని పొంది పూర్వ ఋషులు, దేవతలు, తన్మయులయిరి. అనగా బ్రహ్మ స్వరూపులయిరి. అందువలన ఇపుడు గూడా మోక్షకాముడు అమృతత్వమును పొందుటకు ఆయననే పొందవలయును – ఈ జీవుడు ఫలాలకోసం కర్మలు చేస్తాడు. కర్మ జ్ఞాన జన్యములయిన వాసనామయ గుణములతోను, నీల పీతాది గుణములతోను సంబంధము గల దేహధారి. కర్మఫలములను పూర్తిగా అనుభవిస్తాడు. బహురూపధారి. దేవ పశు పక్ష్యాదిరూపధారి. సత్త్వం మొదలయిన గుణత్రయము గలవాడు. అనాత్మలతో తాదాత్మ్యం పొందటం వలన ఆ గుణాలు తనకున్నట్లున్నవాడు. దేవయానం, పితృయానం, జన్మమరణయానం, అలాగే ధర్మ, అధర్మ, జ్ఞాన రూప మార్గములు గలవాడు. 343

**శ్లో॥ ప్రాణేశో నిజకర్మవశ్యచరణోఽఙ్గుష్ఠప్రమాణోఽర్కవ-**
**ద్భారూపః పరవానహఙ్కృతియుతః సఙ్కల్పయుక్తోఽపి చ ।**

**బుద్ధేః స్వస్య గుణేన చైష నవరస్త్వారాగ్రమాత్రస్తథా**
**కేశస్యాయుతధా కృతస్య చ భవన్ భాగోఽప్యనన్తః స్వతః ॥ 344**

భావ॥ ఈ జీవుడు ప్రాణమునకు అధిపతి. తన కర్మలకు అధీనుడయి సంచరిస్తాడు. అంగుష్ఠప్రమాణుడు, సూర్యునివలె స్వయంప్రకాశుడు, చిన్మయుడు. పరతంత్రుడు, అహంకారం గలవాడు. (శరీరాభిమానముగలవాడు), సంకల్ప సహితుడు. బుద్ధిలోను గుణములలోను, ఈశ్వరునికన్న అల్పుడు, ఆరాగ్రమాత్ర ప్రమాణుడు (ఆరా = సూది), కేశములో సహస్ర భాగ సమానుడు, అయినను, స్వతః అనంతుడు.

(బుద్ధి కుశాగ్రం ఆరాగ్రం = సూది మొన అంతటిది. అందులో దొరకేవాడు కనుక జీవుడు గూడా అంతటి వాడు) (అనంతుడు - అనగా అపరిచ్ఛిన్నుడు. బుద్ధి - అను ఉపాధివలననే అణువుగా కనబడును.) 344

**శ్లో॥ నాయం స్త్రీ న పుమాన్న షణ్ణ ఉత యద్యద్వర్ష్మ గృహ్ణాత్యయం**
**తత్తద్ధర్మగతో భవత్యథ తనుగ్రాహేఽస్య సఙ్కల్పనమ్ ।**
**స్పృష్టిర్దృష్టిహుతే తమశ్చ భవతి గ్రాసామ్బువృష్టిః కృతం**
**చేతీదం హి నిమిత్తమస్య వశతో దేవాదిదేహానయేత్ ॥ 345**

భావ॥ జీవుడు స్త్రీ కాదు, పురుషుడూ కాదు. నపుంసకుడు కాదు. ఏయే శరీరం లేదా చొక్కా గ్రహిస్తాడో ఆయా ధర్మములను పొందును. అట్టి శరీరములను గ్రహించుటలో అతని సంకల్పము నిమిత్తము. అట్లే ఇంకను నిమిత్తములు గలవు. స్పర్శ, దర్శనము, హోమము అనగా ఆత్మాగ్నియందు పై వ్యాపారములను సమర్పించటం – ఎలా అంటే నేను సంకల్పించెదను. నేను తాకుచున్నాను. నేను చూచుచున్నాను. ఇలా– అజ్ఞానము, అన్నాదికాలు, దానము, అట్లే వాపీకూప తటాకాదుల నిర్మాణము యజ్ఞాదులు, పాపాచరణము – అంతా ఈ శరీర గ్రహణానికి నిమిత్తము. దీనిని బట్టి దేవాది దేహములను పొందును. 345

**శ్లో॥ దేహ్యేష స్వగుణైర్వృణోతి పురుషః స్థూలాని సూక్ష్మాణి వా**
**రూపాణి క్రమశో బహూన్యసుగుణైరప్యాత్మనోఽయం గుణైః ।**
**తేషాం సఙ్గతిహేతుతాం సమయతే మాయావివత్సంసర–**
**న్నేవం దైవవశేన గచ్ఛతి పుమాన్ లబ్ధాత్మవిద్యోఽమృతమ్ ॥ 346**

భావ॥ దేహధారి అయిన ఈ పురుషుడు తన కర్మజ్ఞానాదుల చేత క్రమముగా స్థూల సూక్ష్మములయిన బహురూపములను స్వీకరించును. ప్రాణగుణములయిన కర్మలచేత (ప్రాణం క్రియాశక్తి) ఆత్మగుణము అయిన జ్ఞానముల చేత గారడీవానివలె ఈ జీవుడు వీటినన్నింటిని కలిపి సంసారమును నడపును. గారడీవాడు మంత్ర శక్తితో ఓషధీశక్తితో నానారూపములు

దాల్చినట్లు జీవుడున్ను కర్మజ్ఞానములతో నానాదేహములు దాల్చును. ఇతడు ఈశ్వరానుగ్రహం వలన ఆత్మ విద్యను పొందినవాడయి అమృతత్వమును పొందును. 346

**శ్లో॥ ఆద్యన్తాన్తరవర్జితం త్రిభువనస్రష్టారమన్తఃస్థితం**
**సంసారస్య బహుస్వరూపమభితస్సంవ్యాప్య సంస్థం శివమ్ ।**
**భావగ్రాహ్యమనీడమక్షరపరం దేవం కలోత్పాదకం**
**యో జానాతి స ముచ్యతే హి నిఖిలైః పాశైశ్శరీరం త్యజన్ ॥ 347**

భావ॥ ఆదిమధ్యాంతములు లేనివాడు, త్రిలోక నిర్మాత, సంసారమునకు మధ్యనున్నవాడు, బహు స్వరూపుడు, అంతట వ్యాపించియున్నవాడు, మంగళస్వరూపుడు, సంస్కారయుక్త మనస్సుకు మాత్రమే అందువాడు, శరీర రహితుడు, అక్షరమయిన మాయకు పరమయినవాడు. దేవుడు, ప్రాణాది కలా జనకుడు – అయిన పరమాత్మను గుర్తెరింగినవాడు సమస్త పాశములతో సహా ఈ శరీరమును వదలించికొని ఆపరమాత్మను చేరును. 347

విశే॥ ఈ ఉపనిషత్తులో చాల విషయాలు మరల మరల చెప్పబడినాయి. ఇది జిజ్ఞాసువుల సౌకర్యం కొఱకు, విషయం దృఢంగా నిలవటానికి అవసరం. విషయం కఠినమయినది ప్రత్యక్ష వ్యవహారంలో అసంభవమనిపించునట్టిది. తర్కాది శాస్త్రజ్ఞులే సందేహించి నట్టిది. జీవాభిన్నమయిన బ్రహ్మమును తెలిసికొనటం వలననే ముక్తి అన్నదే యీ సిద్ధాంతము. (అసలీ ఉపనిషత్తు విచారణ చేయటం లేదు. పిండితార్థమునే మాటిమాటికి చెప్తున్నది.)

**శ్లో॥ హేతుం కేచన సజ్గిరన్తి కవయః సృష్టేః స్వభావం పరే**
**కాలాదీన్పరిమోహితా భగవతో మాయామహిమ్నా త్విదమ్ ।**
**చక్రం భ్రామ్యతి నిత్యమావృతమిదం సర్వేశ్వరేణామునా**
**సర్వజ్ఞేన చ కాలచక్రమకృతక్ష్మాద్యాత్మకం కర్మ చ ॥ 348**

భావ॥ జగత్కారణముగా ఈశ్వరుడున్నాడని కొందరందురు. కొందరు అది అంగీకరింపరు. ప్రకృతి అనగా స్వభావమే సృష్టికి కారణమందురు. మరికొందరు కాలము మొదలగు సృష్టికి కారణమందురు. వారందరు భగవంతుని మాయకు మోహితులయి ఇట్లు ఆలోచించుచున్నారు. ఆ సర్వేశ్వరుని చేత ఆవృతమయి ఈ సృష్టిచక్రము ఇట్లు నిత్యము భ్రమలతో భ్రమించుచున్నది. ఆ సర్వజ్ఞుడే పంచభూతాత్మమయిన ఈ చక్రమును కర్మను సృజించెను. 348

విశే॥ 1. జగత్కారణము పరమాణువులని వైశేషికులు, పంచభూతములని కొందరు బౌద్ధులు, స్వభావమని కొందరు, శూన్యమే నని మరికొందరు బౌద్ధులు, కాలమని జ్యౌతిషికులు, కర్మ అని మీమాంసకులు, హిరణ్యగర్భుడని హైరణ్యగర్భులు, శివుడని శైవులు, విష్ణువని వైష్ణవులు, గణపతి అని గాణపతులు, కుమారుడని కౌమారులు, సూర్యుడని సౌరులు, శక్తి అని శాక్తేయులు,

ప్రధానమని సాంఖ్యులు, అన్నమని కొందరుపాసకులు, ప్రాణమని, మనస్సని, బుద్ధియని, జీవుడని చెప్పుచున్నారు.

2. సమా - పరమాణ్వాదులు అచేతనములు - అస్వతంత్రములు. కనుక స్వయంగా సృష్టించలేవు. బ్రహ్మ, విష్ణు, రుద్రాదులయిన జీవులు కనుక అస్వతంత్రులే. శరీరం జీవలక్షణం. అశరీరత ఈశ్వర లక్షణము. నిజానికి జీవుడున్ను అశరీరుడే. అయినా శరీరం ఉంటుంది. దానితో తాదాత్మ్యాధ్యాసవలన శరీరం గలవాడవుతాడు. 'అస్వతంత్ర మయిన శరీరంతో తాదాత్మ్యం వలననే జీవునకు అస్వతంత్రత లభించింది.

3. ఈశ్వరుడు జగత్కారణమే. అయినా మాయతో కలిసియే. అందువలన ఈశ్వరలక్షణాలు మాయాలక్షణాలు కలిసియున్నాయి. కనుక కార్యకారణ నియమం ప్రకారం కారణ లక్షణాలు సృష్టిలోనికి వచ్చినవి. కాని ఆ మాయ జడం కాబట్టి అచ్చంగా అది కారణం కాదు. ఈశ్వరుడే దానికి ప్రేరకుడు. కాలంగూడా ఈశ్వరప్రేరణ వలన సంవత్సరచక్రాది రూపంతో తిరుగుతున్నది. ప్రకృతి గతమయిన స్వభావాదికం గూడా ఈశ్వరాధ్యక్షతనే జరుగుచున్నది.

**శ్లో॥ కృత్వా కర్మ తదా నివృత్య పురుషస్తత్త్వస్య తత్త్వేన వా**
**యోగం ప్రాప్య బతైకకేన నితరాం ద్వాభ్యాం త్రిభిశ్చాష్టభిః ।**
**కాలేనాత్మగుణైశ్చ భావనివహం సఞ్చిత్య తాద్రూప్యతో**
**భావే తస్య కృతక్షయే సమయతే ముక్తిం పర స్తత్త్వతః ॥ 349**

భావ॥ పురుషుడు శరీర త్రయాభిమానంతో విహిత కర్మను చేసి ఈశ్వరప్రీతి కోసం నిష్కామంగా సమర్పించి చిత్తశుద్ధిని పొంది కర్మలను పూర్తిగా వదలి, ఒకటే అయిన గురూపదేశంతో, గురుభక్తి, ఈశ్వర భక్తులతో, (ద్వాభ్యాం) శ్రవణ మనన నిదిధ్యాసనలతో (త్రిభిః) యమనియమప్రాణాయామప్రత్యాహారధ్యానధారణా సమాధుల(8) చేత అధికారసంపత్తిని కలిగించేకాలముచేత, దయ, క్షమ, శౌచము, మాంగల్యము, నిష్కామత, అకార్పణ్యము, అనాయాసము, అనసూయ అను ఆత్మగుణములచేత జ్ఞాన యోగ్యుడై, తత్ - త్వం అభేదములను గ్రహించి భూత భౌతిక విషయములను బ్రహ్మరూపముగా గ్రహించి ప్రధానమహదాది తత్త్వముల కతీతుడై అనాత్మలయిన ఆతత్త్వములతో ఇంతకు ముందున్న తాదాత్మ్య గ్రంథిని వదలించికొని ప్రారబ్ధావసానమున మరణంతో విదేహ కైవల్యమును పొందును. 349

**శ్లో॥ తం సంయోగనిమిత్తకారణమముష్యాదిం త్రికాలాత్పరం**
**దేవం స్వాత్మగతం సమీడ్యమకలం విశ్వస్వరూపం భవమ్ ।**
**భూతం పూర్వముపాస్య భూజసమయాకృత్యన్యమంహోనుదం**
**త్రైలోక్యం పరివర్తయన్తమమృతం ధర్మావహం సత్పదమ్ ॥ 350**

**శ్లో॥ ఈశానాం పరమం మహేశమధికం విష్ణుం పతీనాం పతిం**
**దేవానామపి దైవతం పరతరం జ్ఞాత్వా తతో ముచ్యతే ।**
**కార్యన్తస్య న విద్యతే న కరణం నో తత్సమో నాధికః**
**శక్తిర్జ్ఞానబలక్రియా చ వివిధా స్వాభావికీ శ్రూయతే ॥ 351**

భావ॥ అన్నింటికన్న ఈశ్వరోపాసన గొప్ప ముక్తి సాధనము.

ఈ జీవునకు సమ్యగ్యోగములకు, గురూపదేశాది నిమిత్తములకు, శరీరసంయోగమునకు, అందుకు నిమిత్తమయిన కామ్యకర్మలకు కారణమయినవాడు, ప్రపంచమునకు ఆదికారణమయిన వాడు, కాల పరిచ్ఛేదములేనివాడును, ప్రకాశరూపుడు, బుద్ధిగతుడు, స్తవనీయుడు, ప్రాణాది కలలు లేనివాడు, విశ్వస్వరూపుడు, భవుడు, పురాణపురుషుడు, సిద్ధ పురుషుడు, సంసారవృక్ష కాలాదుల కన్న విలక్షణమయినవాడు, పాపహరుడు, త్రిలోకీ భ్రామకుడు, అమృత ధర్ముడు, సుకృత దాయకుడు, దృశ్యమయిన (సత్), జగత్తుకు స్థానము, మహేశ్వరుడు, ప్రభువులకు ప్రభువు, పరదైవతము, వ్యాపకుడు, అయిన బ్రహ్మమును ప్రత్యగభిన్నముగా సాక్షాత్కరించి కొన్నవాడు ముక్తిపొందును. ఆ ఈశ్వరునకు కార్యము లేదు. నేత్రాదికరణములు లేవు. అతనికి సముడు అధికుడు లేడు. అతనికి స్వాభావికమయిన జ్ఞాన బలక్రియాత్మకమయిన శక్తి గలదని తెలస్తున్నది. సర్వజ్ఞత జ్ఞానశక్తి సర్వనియమనం బలశక్తి, సర్వకర్తృత్వం క్రియాశక్తి. 350-351

**శ్లో॥ నో కశ్చిత్పతిరస్తి తస్య భువనేనైవేశితానాధిపో**
**నో లిఙ్గం న చ కారణం జనయితా నైవోర్ణనాభిర్గుణైః ।**
**ఆత్మానం స్వయమావృణోతి పరమో దేవః ప్రధానోద్భవై-**
**ర్భావైర్యః కరణాధిపేద్దిశతు మే బ్రహ్మాప్యయం స ప్రభుః ॥ 352**

భావ॥ ఆయనకు ఈలోకమున మరొక ప్రభువు లేడు. శాసకుడు రక్షకుడు లేడు. వహ్నికి ధూమం వలె ఆ పరమాత్మకు గట్టి సూచన లేదు. కారణము లేదు. జనకుడూ లేడు. సాలెపురుగువలె ఆయనయే స్వశక్తిజాతములయిన ఆకాశాది పదార్థములతో తనను తానే చుట్టుకొనుచున్నాడు. ఆయన ఇంద్రియాధిపతులయిన సూర్యాదిదేవతలకు ఈశ్వరుడు. ప్రభువు. అట్టి దేవుడు నాకు బ్రహ్మ సాయుజ్యమును కలిగించు గాక! 352

**శ్లో॥ దేవః కేవల ఏక ఏష నితరాం భూతేషు గూఢోఽఖిలే-**
**ష్వన్తర్యామ్యఖిలస్య సర్వభువనవ్యాపీ సమస్తాశ్రయః ।**
**అధ్యక్షోఽఖిలకర్మణామపగుణస్సాక్ష్యక్రియాణాం వశీ**
**నానాచేతయితా కరోతి బహుధైకం బీజమాత్మేచ్ఛయా ॥ 353**

భావ॥ అద్వితీయుడు, కనుక ఏక స్వరూపుడు, నిత్యం అపరోక్షుడు, అఖిల భూతములందు

నిగూఢంగా ఉన్నవాడు, సర్వలోకవ్యాపి, సమస్తమునకు అధిష్ఠానమయినవాడు, అఖిల కర్మలకు సాక్షి, నిర్గుణుడు, క్రియారహితులయిన జీవులకు అనగా సన్న్యాసులకు స్వతంత్రమయిన సాక్షి, చైతన్యదాత, అట్టి ఈశ్వరుడు, బీజరూపములయిన ఒకే అవ్యక్తమును తన సంకల్పములతో నానాజగద్రూపముగా పరిణమింపజేయును. కనుక చేతనుడయిన ఈశ్వరుడే జగత్కారణము. అచేతనమయిన ప్రధానము కాదు. 353

**శ్లో॥ నిత్యానామపి నిత్య ఏవ భువనే యశ్చేతనానాం స్వయం**
**దేవశ్చేతన ఏక ఈడ్వితరతి స్మేష్టాన్బహూనాం వరాన్ ।**
**తం హేతుం హృది సాఙ్ఖ్యయోగసుగమం సంస్థం విదిత్వాపరం**
**ముక్తాః పాశచయేన యాన్తి విబుధా నిత్యం సుఖం నేతరే ॥ 354**

భావ॥ ఈ లోకములలో నిత్యములలోకెల్ల నిత్యమయినది చేతనములకెల్ల చేతనమయినది స్వయంప్రకాశుడు, అద్వితీయుడయిన ఆ ఈశుడు అనేకమందికి ఇష్టమయిన అనేక వరాలను ఇచ్చెను. అట్టివాడు జగత్కారణము, హృదయస్థితుడు, సాంఖ్య (ఆత్మవిద్య), యోగ (ఆత్మధ్యానం) ములచేత పొందదగిన పరమేశ్వరుని తెలిసికొని, విద్వాంసులు పాశములచేత విముక్తులయి నిత్యమయిన బ్రహ్మానందమును పొందెదరు. అవిద్వాంసులు పొందలేరు. 354

విశే॥ 1. భౌతిక పదార్థాలదృష్ట్యా భూతాదులు కాలాదులు నిత్యములు. ఈశ్వరాపేక్షయా అనిత్యములు. ఈశ్వరుడు సర్వాపేక్షయానిత్యుడు. లేదా, రకరకాల సిద్ధాంతములు నిత్యము నిత్యము అని చెప్పుకాలము, అణువులు మొదలగు వానిలో ఈశ్వరుడే నిత్యుడు. మిగిలినవినిత్యములు కావు. అవి నిత్యములనటం ఆయా సిద్ధాంతకర్తల భ్రాంతి మాత్రమే. అవి జన్మ మరణములుగలవి. కనుక అనిత్యములు. సత్యమయిన వస్తువు నిత్యమే. అది కాలత్రయంలోను ఉండితీరును. కనుక ఈశ్వరుడే సర్వధా నిత్యుడు. మిగిలినవన్నియు సాపేక్షమయిన నిత్యములు. అయితే జీవులూ నిత్యులే. "అజోనిత్యః శాశ్వతోయం పురాణః" అంతమాత్రమున వేరే నిత్యులమనరాదు. వారు ఈశ్వరులే కదా! అందువలన నిత్యులు. సంసారిగా మాత్రము జీవుడు నిత్యుడు కాడు.

2. ఘటాదులను బట్టి శరీరం చేతనం. కాని ఈశ్వరదృష్ట్యా అచేతనము. లేదా, చేతనమయినవిగా ఇతరులంగీకరించిన దేహాదులలో అసలయిన చేతనుడు ఈశ్వరుడే. దేహాదుల చేతనత్వం ఇతరానుగ్రహం వలన వచ్చినది. ఈశ్వరునకది సహజసిద్ధము. ఈశ్వర చైతన్యం వలననే మనస్సు మొదలయినవన్ని చేతనములయినవి. జీవుడు గూడా "తత్త్వమసి" వలన ఈశ్వరుడే. "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి–" గీత. జీవుడు ఈశ్వరుని ప్రతిబింబము – అన్నమతంలోనయినా బింబ ప్రతిబింబములు ఒకటే కనుక జీవేశ్వరులకు అభేదము.

3. జీవుడు సహజంగా సచ్చిదానందరూపుడయిన ఈశ్వరుడు కాని అవిద్యవలన అనాదిగా దేహాది – అనాత్మలతో తాదాత్మ్యాధ్యాసవలన నానా సంసారులుగా అవుతున్నాడు.

**శ్లో॥ సూర్యస్తత్ర న భాసతే న హిమగుర్నాగ్నిర్నతారోత్కరో**
**నో శమ్పాస్తమనుప్రభాతి నిఖిలం భాన్తం తదేతత్పరమ్ ।**
**భాసా తస్య విభాతి సర్వభువనం హంసస్స ఏకోఽన్తరే**
**లోకస్యాగ్నిరవస్థితోఽప్సు పురుషో జ్ఞాత్వా తమేవాఽమృతః ॥ 355**

భావ॥ ఆ పరమాత్మ ముందర సూర్యుడు వెలుగడు. చంద్రుడు వెలుగడు. అగ్ని వెలుగదు. మెరుపులు మెఱవవు. ప్రకాశించుచున్న ఆ పరమాత్మననుసరించి ఇదంతయు భాసించును. ఆయన ప్రకాశము చేతనే సర్వలోకము ప్రకాశించును. లోకమధ్యంలో ఆ హంసుడు ఒక్కడే యున్నాడు. జలములందున అగ్ని పురుషుడున్నాడు. అతనిని ఎరిగినవాడు అమృతుడగును. 355

విశే॥ 1. పరమాత్మను సూర్యుడు ప్రకాశింపజేయడు. మఱియు పరమాత్మ ఒక్కడే పరమార్థము కనుక ఆ దశలో సూర్యాదులుండరు. కనుక సూర్యుడు ప్రకాశించడు. ఘటాది పదార్థములను భాసింపజేసే సూర్యాది జ్యోతులు పరమాత్మను ప్రకాశింపజేయవు. కనుక పరమాత్మ ఇతర భాస్యుడు కాడు. స్వయంజ్యోతి. అది ఇంద్రియాలకు భాసించదు. అతీంద్రియము రూపరసాది రహితము గదా! మనస్సుకూ అందదు. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ" గదా! పరమాత్మవలననే వీరంతా వెలుగుతారు. కనుక ఆయన సర్వభాసకుడు. కాగా సారాంశము పరమాత్మ 1) సర్వభాసకుడు 2) ఇతర – అభాస్యుడు 3) స్వప్రకాశము.

2. సూర్యాదులు మనకు నేత్రభాస్యులు. పరమాత్మ రూపరహితుడు గదా! ఆయనకు కాంతి ఎలా? – 'భా' అంటే జ్ఞానము. జ్ఞానమే పరమాత్మ స్వరూపము. గుణము కాదు. కనుక అతని 'భా'తో అనగా ఆయన యొక్క స్వరూపచైతన్యంతో అని అర్థము. "రాహువు యొక్క తల" అన్నట్లు (తలమాత్రమే మిగిలిన రాహువు విషయంలో రాహువుయొక్క తల అన్నట్లు. అదే స్వరూపం అదే అవయవం)

3. జ్ఞాన స్వరూపం కనుకనే ఆత్మ స్వయంజ్యోతి. జ్ఞానం స్వప్రకాశం. అదే ఘటాదులను తెలుపుతుంది. మరొకటి జ్ఞానాన్ని తెలిపేది లేదు. జ్ఞానేతరమయినది జడము గదా! మరో జ్ఞానం లేదు. ఉందంటే ఈ జ్ఞానాన్ని వెలిగించేందుకు మరో జ్ఞానం – అలా అనవస్థ ఏర్పడుతుంది. కనుక ఒకటే ఆత్మ, జ్ఞానం ఒక్కటే కదా! జీవేశ్వరభేదం ఉపాధివలన వచ్చినదే. సహజం వాస్తవం కాదు. కనుక స్వయంప్రకాశజ్ఞానరూపమయిన చేతనుడయిన ఆత్మ ఒక్కటే – అని నిష్కర్ష.

4. అగ్ని = వృత్తిచైతన్యంగా ఉన్న చైతన్యము. అగ్నివలె అవిద్యను, దానికార్యములను తగలబెట్టుంది కనుక అగ్ని. "జ్ఞానాగ్ని" హంతి - సంసారమును కొట్టును కనుక 'హంస'

5. అప్సు = దేహాకారంగా పరిణమించిన, భూతమాత్రయందు అనగా దేహములందు

6. జీవేశ్వరులకు భేదం ఉంటే వారిలో ఒకరు స్వయంజ్యోతి కారాదు. కాని వారిది అభేదమే. ఈశ్వరుడే జీవుడుగా ఇచ్చట ప్రవేశించాడు కదా! "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" అందువలన వారొక్కరే. వారి స్వరూపం జ్ఞానమే. జ్ఞానం ఒక్కటే కనుక జీవభేదం గూడా లేదు. జీవులు కాదు. ఒకడే. ఉపాధివలననే భేదము.

**శ్లో॥ సర్వజ్ఞస్స సమస్తకృద్గుణపతిర్జ్ఞః కాలకాలో గుణీ**
**క్షేత్రజ్ఞప్రకృతీశ్వరః సకలగః స్వాత్మస్థితస్తన్మయః ।**
**సంసారస్థితిబన్ధమోక్షణకరో విశ్వస్య గోప్తాఽమృతో**
**లోకస్య ప్రభురీశనాయ నియమే నాన్యోఽస్తి హేతుర్న హి ॥ 356**

భావ॥ సర్వజ్ఞుడు, సమస్తమునకు కర్త, సత్త్వాది గుణములకు ఈశ్వరుడు, చేతనుడు, కాలమునకే కాలుడు అనగా కాలాధీనుడు కానివాడు, క్రూరుడు కాదు గుణవంతుడు, క్షేత్రజ్ఞుడయిన జీవునకు, ప్రకృతికి నియామకుడు, సకల వ్యాపి, జీవోపాధి అయిన మనసునందున్నవాడు, మనోమయుడు, సంసార స్థితి, బంధ, విమోచనకరుడు, అమృతుడు, సర్వదా రక్షకుడు, విశ్వ–రక్షకుడు, లోకప్రభువు. లోకములను నియమించుటకు ఇంతటి ప్రభువు మరొకడు లేదు. కనుక సర్వాత్మ సర్వేశ్వరుడు బంధమోక్ష కారణము ఈయనయే. ఈయన యొక్క జ్ఞానమువలననే ముక్తి. 356

విశే॥ 1. సర్వజ్ఞుడే సర్వకర్త కాగలడు. అచేతనమయిన సత్త్వాది గుణములు జగద్రక్షణ చేయలేవు. వాటికి నియామకుడయిన చేతన పరమేశ్వరుడే రక్షకుడు. జ్ఞః = సామాన్యజ్ఞానము గలవాడు. సర్వజ్ఞం, విశేషజ్ఞానము గలవాడు, కనుక పునరుక్తి లేదు - 'సర్వజ్ఞః సర్వవిత్ - లాగా' లేదా, జ్ఞః = జ్ఞానరూపుడు.

2. జ్ఞాత అయిన జీవుడు కాలపరతంత్రుడు. స్వప్నజాగరములలో తెలివి ఉంటుంది. సుషుప్తిలో ఉండదు. కాని ఈశ్వరుడు కాలమునకే కాలుడు. కాలము గూడా ఈశ్వరాజ్ఞవలననే నడుస్తుంది. కాలచక్ర ప్రవర్తకుడాయనయే. లేదా, జ్ఞానస్వరూపుడు. కాని క్షణిక జ్ఞానరూపుడయి కాల పరిచ్ఛేదం పొందలేదు. కాలపరిచ్ఛేదములేని నిత్యజ్ఞాన స్వరూపుడు. అందుకని క్రూరుడు కాడు. సకల కల్యాణగుణపూర్ణుడు. నిర్గుణుడయిన మాయవలన సగుణుడుగా కనబడతాడు. లేదా, నిర్గుణుడయినా తమోగుణస్వరూపుడయి కాలాదులను నాశనం చేస్తాడు. కనుక గుణి. ఆయన దయాదిగుణముల వలన జీవుడు కాడు. సత్త్వాదిగుణముల వలన ప్రకృతియు కాడు.

వాటికిన్ని నియామకుడు. క్షేత్రజ్ఞునకున్ను నియామకుడే. సకల గతుడయినా అజ్ఞానము వలన దేహ పరిమితునివలె ఉంటాడు.

3. జీవుడున్నచోట గూడా ఈయన ఉంటాడు. కనుక స్వాత్మస్థితః – అంతఃకరణంలో అసంగుడై ఉండి ఉపలభ్యుడవుతాడు గదా! కనుక సకలదుడు కనుక ఆత్మస్థితుడు, కనుక అందరికీ దగ్గరవాడు, ఆకాశమువలె సకల గతుడు, కానిదానివలె పరతంత్రుడు గాదు. తనుగా నిలబడినవాడు "స్వే మహిమ్ని ప్రతిష్ఠితః" గదా! అనగా తనస్వరూపమునందే ఉన్నవాడు, కార్యము కారణమునందే గదా! ఉంటుంది. కారణమూ కారణమునందే ఉంటుంది. ఘటం మట్టియందు నిలుస్తుంది. మట్టి మట్టియందే నిలుస్తుంది. దానికి మరొక ఆధారము లేదు. అందుకే ఈశ్వరుడు ఆత్మయోని.

4. తన్మయః = మనోమయుడు. "మనోమయోయం భారూపః" సంస్కారయుక్తమయిన మనస్సుకు అందువాడు, లేదా, మనస్సు ఉపాధిగా గల ప్రత్యగాత్మ. లేదా, విశ్వమయుడు, ఆయన సకలవ్యాప్తుడే కాదు సకలమూ ఆయనయే. మనోమయుడయినను, సంసారస్థితి బంధములకు లొంగడు. వాటిని జీవులకు గూడా వదలించగలడు. అందువలననే ఆయన క్షేత్రజ్ఞునకు గూడా నియామకుడు.

5. విశ్వమునకు స్వర్గాది సంసార సౌఖ్యముల నిచ్చుట ద్వారా బ్రహ్మానందరూప మోక్షము నిచ్చుట ద్వారా జగద్రక్షకుడు. అమృతుడు కనుక సర్వకాల రక్షకుడు. మామూలు రాజులవలె కొంతకాలము పరిపాలకుడు కాదు.

**శ్లో॥ యో బ్రహ్మాణమధాత్పురా శ్రుతిగణం తస్మై దిదేశాపి య–**
**స్తం హ్యాత్మప్రతిభాప్రకాశకమహం దేవం ముముక్షుః పరమ్ ।**
**సర్వేశం శరణం ప్రయామ్యమృతతస్సేతుం పరం నిష్కలం**
**శాన్తం నిష్క్రియమఙ్గనాఘరహితం దగ్ధేన్ధనం వాఽనలమ్ ॥ 357**

భావ॥ హిరణ్యగర్భుని ఉపాసన వలన జ్ఞానము వలన మోక్షము రాదు. అట్టి హిరణ్యగర్భుని గూడా పూర్వము సృష్టించి ఆయనకు వేదసమూహమును ఇచ్చిన ఈశ్వరుని కొలుచుటయే మోక్షదాయకము. అట్టి ఆత్మజ్ఞాన ప్రకాశకుడయిన పరమాత్మను నేను మోక్షార్థినయి శరణువేడుచున్నాను. మోక్షమునకు సేతువయిన వాడు, లేదా, జ్ఞానం లేనిదే మృతము కాని సంసారమును దాటించు వంతెన అయినవాడు, ప్రాణేంద్రియాది కలలు లేనివాడు, నిరవయవుడు, అక్రియుడు, కట్టెలు లేక శాంతించిన అగ్నివలె నిర్వికారుడును, ఎటువంటి పాపములు అంటని వాడును, స్వయంప్రకాశరూపుడును అయిన ఆ సర్వేశ్వరుని శరణు వేడెదను. 357

విశే॥ హిరణ్యగర్భ పదవి కోసం కర్మాచరణం చేసిన జీవునకు (ఆంజనేయ స్వామివలె) తరువాత కల్పములో హిరణ్యగర్భునిచేసి కావలసిన జ్ఞానమును వేదరూపముగా ఇచ్చినవాడు. “తేనే బ్రహ్మ హృదాయ ఆదికవయే”

**శ్లో॥ మర్త్యాశ్చర్మవదమ్బరం భువి యదా సంవేష్టయిష్యన్తి త-**
**న్న ప్రజ్ఞాయ మహేశ్వరం ఖలు తదా దుఃఖావధిం ప్రాప్నుయుః ।**
**తచ్ఛ్వేతాశ్వతరో విదన్ గురుముఖాద్బ్రహ్మేదమత్యాశ్రమి-**
**వ్రాతాయర్షిసమూహజుష్టమవదత్కానుగ్రహాత్తాపసః ॥ 358**

భావ॥ అజ్ఞానము తత్కార్యమయిన సంసార దుఃఖమును పోగొట్టుకొనవలెనంటే ఈశ్వరానుగ్రహము తప్పనిసరి. ఈశ్వరానుగ్రహము లేకుండానే ఇలా చేయగలవారు ఎవరయినా ఉంటే వారు ఆకాశమును తమ శరీరమునకు చర్మంలాగా వస్త్రంలాగా చుట్టుకొనగలరు. అనగా రెండూ అసంభవము. అని **శ్వేతాశ్వతరుడను మహర్షి** ఈశ్వరానుగ్రహము చేతను, గురుముఖము నుండియు, అత్యాశ్రములయిన వారికొఱకు ఋషిసమూహ సేవితమయిన యీ బ్రహ్మమును గూర్చి చెప్పెను. అత్యాశ్రములనగా పరమ హంసలు అవధూతలు. వారేగదా! విద్యాధికారులు. 358

**శ్లో॥ వేదాన్తే పరమం ప్రచోదితమిదం గుహ్యం హి కల్పే పురా**
**నాశాన్తాయ చ నాసుతాయ విదుషాఽశిష్యాయ దేయం న వా ।**
**భక్తిర్యస్య పరాత్పరేఽస్తి చ గురౌ తస్యోదితా ధీమతో**
**భాసన్తే త ఇమే సమే శుభతమా అర్థాః ప్రశాన్తిప్రదాః ॥ 359**

భావ॥ పూర్వకల్పమున వేదాంతమునందు చెప్పబడిన ఈ పరమ రహస్యమయిన ఉపనిషత్తును అశాంతుడు, అపుత్రుడు, అశిష్యుడు అయిన వానికి చెప్పరాదు. ఎవనికి గురువునందు పరాత్పరునియందు భక్తిగలదో అట్టి మహానుభావునకు మాత్రమే యీ చెప్పిన విషయాలు అనుభవంలో స్ఫురిస్తాయి. శుభమయిన యీ విషయములు ప్రశాంతిని కలిగిస్తాయి. (అపుత్రునకు అనగా పుత్రుడు కాని వానికి అని అర్థము. పుత్రులు లేనివానికి - అని అర్థము కాదు) 359

ఇతిశ్వేతాశ్వతరోపనిషద్వ్యాఖ్యాతా.

శ్రీః

# అద్వైతప్రశంసా

**శ్లో॥ వేదాన్తాస్సకలా అపీతి భువనే బ్రహ్మాత్మభేదాసహా**
**మన్త్రా అప్యఖిలాః పరోక్షవిధయా చాద్వైతసంవాదినః ।**
**గీతాసూత్రపురాణభాగవతసద్గ్రన్థైస్సముద్ఘోషితం**
**చాద్వైతం పరమార్థసత్యమితి తత్సన్తో రమన్తేఽత్ర చ ॥ 360**

భావ॥ సహస్రశాఖారూపమయిన వేదములకు అన్ని ఉపనిషత్తులు కలవు గదా! అవన్నియు బ్రహ్మాత్మలమధ్య అభేదమునే చెప్తున్నాయి. భేదమును సహించవు. అఖిలమంత్రములు గూడా పరోక్షముగా అద్వైతమునే చెప్పుచున్నాయి. గీత, బ్రహ్మసూత్రములు, పురాణములు, భాగవతము మొదలయిన సద్గ్రంథములన్నియు అద్వైతమునే అసలయిన సత్యముగా చెప్పుచున్నాయి. కనుక సజ్జనులు అద్వైతమునందే ఆనందించెదరు. 360

విశే॥ 1. ఈశకేనకఠప్రశ్న ముండమాండూక్యతిత్తిరిః, ఛాందోగ్యంబృహదారణ్య మైతరేయం–' అని 10 ఉపనిషత్తులు – శంకరాచార్యస్వామి వారిచేత భాష్యము వ్రాయబడినవి. నేను కైవల్య శ్వేతాశ్వతర ఉపనిషత్తులను గూడా వ్యాఖ్యానించితిని. పూర్వార్ధమున 8 ఉపనిషత్తులు. 424 శ్లోకాలున్నవి. ఉత్తరార్ధమున బృహదారణ్య ఐతరేయ కైవల్య శ్వేతాశ్వతరములు వ్యాఖ్యానించినాను. ఇవి 359 శ్లోకములు. మొత్తము కల్పి 783 శ్లోకములు. మిగిలిన అనేక ఉపనిషత్తులయినా బ్రహ్మాత్మ – ఐక్య పరముగానే ఉన్నాయి. ఉంటాయి. "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" "తత్త్వమసి" కనుక ఇతర – ఉపనిషత్తుల వ్యాఖ్యానం అత్యవసరమయినది కాదు.

2. మంత్రాలలో, అద్వైతము –

ఎ) "నారాయణాయనమః" నారాయణుడు – పరమాత్మ ,అయనతో అభేదంగల జీవుడు.

నమః = నమ్రుడయ్యేవాడు జీవుడు. అతను నారాయణునికొఱకు అనిఅర్థం. యూపాయదారు = యూపము కొఱకు దారువు. అనగా యూపదారువుల మధ్య తాదాత్మ్యము, వివర్తము కనబడుతున్నాయి.

బి) రామమంత్రము : ర = తేజోమయుడయిన ఈశ్వరుడు (ర = అగ్ని బీజము), మ = జీవుడు, ఆ= ఐక్యము. (ఇదంతా పరోక్షంగా బ్రహ్మాభేదము చెప్పటము) ఇట్లే ఇతర మంత్రములనూహించాలి. ఇదంతా రామోపనిషత్తులో ఉన్నదే. కనుక ప్రమాణమే.

3. **అద్వైతం శంకరాచార్య భ్రాంతికృత వ్యాఖ్య కాదు**. గీతా పురాణాదులన్నియు స్పష్టంగా (విష్ణు పురాణం గూడా) అద్వైతమునే చెప్తున్నాయి. సద్గ్రంథాలు అనగా అధ్యాత్మ రామాయణము, జ్ఞానవాశిష్ఠము మొదలగునవి. అంతేగాదు వామదేవాది విద్వాంసులు గూడా అద్వైతమును అనుభవించుచున్నారు.

**శ్లో॥ అద్వైతం తదిదం బృహద్బుధజనై రామేతి సఞ్చిన్త్యతే**
**రామబ్రహ్మశివామృతాక్షరహరప్రజ్ఞాననారాయణాః ।**
**విష్ణుద్రష్టృవిధాతృశఙ్కరహరిశ్రీకణ్ఠలక్ష్మీపతి-**
**ప్రాణేన్ద్రాచలజీవవిశ్వపురుషశ్రీశాదయస్తద్వదాః ॥ 361**

భావ॥ అద్వైతమయిన ఆ బ్రహ్మమునే బుధులు "రామ" అని చింతించెదరు. రామ, బ్రహ్మ, శివ, అమృత, అక్షర, హర, ప్రజ్ఞాన, నారాయణ, విష్ణు, ద్రష్ట, విధాత, శంకర, హరి, శ్రీకంఠ, లక్ష్మీపతి, ప్రాణ, ఇంద్ర, అచల, జీవ, విశ్వ, పురుష, శ్రీశ మొదలయిన పదములు ఆ అద్వైత బ్రహ్మమునే చెప్పగలవు. 361

విశే॥ "రమంతే యోగినోఽనంతే చిదానందే పరాత్మని" కనుక రాముడు అనగా పరబ్రహ్మమే. అలాగే "ప్రజ్ఞానం బ్రహ్మ" (విశ్వం నారాయణః పరః) "అమృతాక్షరం హరః" "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" "సహస్ర శీర్షా పురుషః" 'శివ ఏవ కేవలః' "తదక్షరమ్" – మొదలయిన ఉపనిషత్తులు ఆయా పదములను బ్రహ్మసూచకముగా వాడినవి. దేవ, హంస, భూమ, వామన, సంయద్వామ – ఇట్టివి గూడా.

**శ్లో॥ జీవోఽహం జగదేతదీశ ఇతి కోఽప్యాస్తే పరోక్షో మహా-**
**నేవం సమ్ప్రతిపద్యతేఽబుధజనో యావద్ధ్యవిద్యావశాత్ ।**
**తావద్ద్వైతమిదన్తు సత్యమివ భాత్యభ్రాదినైల్యాదివ-**
**త్తద్ద్వైతం వ్యవహారసత్యమితి ధీమన్తో రమన్తేఽత్ర నో ॥ 362**

భావ॥ అజ్ఞానులు ఇలా అనుకొంటారు. నేను జీవుడను. ఇది జగత్తు, ఈశ్వరుడని ఒకడు ఉన్నాడు. ఆయన మనకు పరోక్షుడు. మహాత్ముడు. అవిద్యవలన వారు ఇట్లు భావించెదరు.

అవిద్య ఉన్నంతవఱకు ఈ ద్వైతమంతా సత్యముగానే కనబడుచున్నది. ఆకాశం నీలం అనిపిస్తుంది. నిజంగా కాదు. అందువలన ద్వైతం వ్యవహారసత్యం కనుక జ్ఞానులు దీనియందు ఆనందించరు. ఎందుకంటే ఇది పరమార్థతః సత్యంకాదు. రజ్జుసర్పం వంటిది. రంగరజతం వంటిది. 362

**శ్లో॥ సత్యాసత్యపదార్థసంవిభజనాశక్తాస్తు మందాశయా**
**మాయాకాలముఖాన్ బ్రువన్తి కతిచి త్సత్యాన్ పదార్థాన్నరాః ।**
**ప్రత్యక్షశ్రుతివిద్విషశ్చ త ఇమే నక్తఞ్చరాః సంసృతౌ**
**సిన్ధా వన్ధపరమ్పరానయవశాన్మజ్జన్తి హా సన్తతమ్ ॥ 363**

భావ॥ సత్యమిది. అసత్యపదార్థమిది – అని విభజించుటచేతగాని మందమతులు, మాయను, కాలమును, ద్వైతమును – ఇలా ఎవరికి నచ్చిన వాటిని వారు సత్యపదార్థములుగా చెప్తుంటారు. **ప్రత్యక్ష శ్రుతులకు వారు శత్రువులు**. రాక్షసులు. సంసార సముద్రమున అంధపరంపరగా నడుచుచు వారు మునిగి ఇతరులను ముంచుచున్నారు. వారు రజ్జువును సర్పంగానే చూస్తున్నారు. "శతాంధాః కూపం ప్రవిశంతి" అన్నట్లున్నది. 363

**శ్లో॥ ప్రాగ్జన్మాయుతసత్కృతాచరణతస్సన్తోషితస్యేశితుః**
**శ్రీవిష్ణోస్సదనుగ్రహాన్నరవరస్యాద్వైతధీర్జాయతే ।**
**దైవీం సమ్పదమాశ్రితాన్ స భగవానద్వైతినో రక్షతి**
**క్షిప్రం సంసృతిసాగరే క్షిపతి తాన్ యే ద్వైతినో రాక్షసాః ॥ 364**

భావ॥ పూర్వజన్మ సహస్రములలో చేసిన పుణ్యఫలముగా ఈశ్వరుడు సంతోషించి ఆ సర్వవ్యాపి అద్వైత బుద్ధిని అనుగ్రహిస్తాడు. దైవీ – సంపదను ఆశ్రయించిన శాంతచిత్తులయిన ఆ అద్వైతులను భగవంతుడు జ్ఞానము కలిగించి సంసారము నుంచి కాపాడుతాడు. ద్వైతులయి రాక్షససంపదతో అశాంతిలో నుండు వారలకు భగవంతుడు సంసార సారమున పడవేయును. 364

విశే॥ 1. "ఈశ్వరానుగ్రహాదేవ పుంసా మద్వైతవాసనా" రాజాజ్ఞ ననుసరించినవాడు రాజుకు ప్రీతిపాత్రుడగును. భగవదాజ్ఞలయిన శ్రుతులు చెప్పిన ప్రకారము నడచువాడు భగవదనుగ్రహము పొందును. పూర్వజన్మలో భాగ్యము లేనందువలన తార్కికాదులు ద్వైతులుగా నిలుచుచున్నారు.

**2. విశిష్టాద్వైతులు ప్రచ్ఛన్నద్వైతులు. వారి కయినను సంసారము తప్పదు.**

**శ్లో॥ యే దేవా ఇహ మానవాశ్శమదమశ్రద్ధాముముక్షాయుతాః**
**సన్న్యస్యాఖిలమాశ్రితాః పరశివాద్వైతం హృదబ్జాన్తరే ।**

**ఆత్మానం సగుణఞ్చ నిర్గుణమపి ధ్యాయన్త ఆనన్దథుం**
**సంయాన్తి ప్రదిశత్యపారమహిమా తేషాం పదం స్వం హరిః ॥ 365**

భావ॥ దేవతలు గాని మానవులుగాని శమ, దమ, శ్రద్ధలు, ముముక్ష గలవారై సర్వ సన్న్యాసము చేసి పరశివాద్వైతమును ఆశ్రయించినవారై తమ హృదయ పుండరీకమధ్యమున సగుణంగాను నిర్గుణంగాను ధ్యానించి ఆనందమును పొందెదరు. అపారమహిమశాలి అయిన ఆ పరమాత్మ వారికి తన స్వరూపమునిచ్చును. 365

విశే॥ 1. ముందు సగుణధ్యానం, అందులో పట్టుచిక్కిన తరువాత నిర్గుణమును ధ్యానించవలయును. సగుణం ధ్యానించినను వస్తుతః అది నిర్గుణమేనన్న స్ఫురణ ఉండగలదు.

2. వస్తుతః జీవుడే బ్రహ్మమగుచు, అజ్ఞానం వలన తనను సంసారిజీవునిగా దలచి జ్ఞానము వలన మరల తాను బ్రహ్మమునే యని భావించి తనయందు జీవభ్రాంతిని తొలగించికొనును. కనుక అవిద్యా నివృత్తియే మోక్షము.

**శ్లో॥ భారద్వాజసగోత్రరామకవిహృత్పద్మాన్తరస్థో హయ-**
**గ్రీవో రామముఖేన సత్కృతిమిమాం వేదాన్తముక్తావలీమ్ ।**
**కృత్వాఽఽత్మీయగళే నిధాయ ముదితోఽస్యాపాఙ్గముక్తావలీ**
**మాలక్ష్యాత్మని సఙ్గతాం ప్రముదితో రామః పరఞ్చాభవత్ ॥ 366**

భావ॥ ఉపనిషత్తుల విషయమంతటిని ముక్తావళీరూపముగా వ్రాసిన కవి యీ ముక్తావళిని ఆ హయగ్రీవునికి గ్రీవాలంకారముగా సమర్పించుచున్నాడు.

భారద్వాజస గోత్రుడయిన బెల్లంకొండ రామకవి హృదయములోని హయగ్రీవుడు రాముని ముఖము ద్వారా ఈ వేదాంతముక్తావళిని తయారు చేసికొని తన మెడలో అలంకరించికొని ఆనందపడిన వాడై ఈ బెల్లంకొండ రామునివైపు కటాక్ష ముక్తావళిని ప్రసరించెను.

రామకవి బ్రహ్మానందభరితుడయ్యెను. గ్రంథావసానమున ఆనందము కలిగిన సంగతి యున్నది కనుక అధ్యేతలకు అనుపాఠకులకు అందరికి ఆనందము కలుగునని మంగళము సూచింపబడినది. 366

సమాప్తా వేదాన్తముక్తావలీ.

మేళ్లచెర్వు వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రి

రచితమయిన ఆంధ్ర వేదాంతముక్తావళి

ఉత్తరార్ధముతో సర్వం సమాప్తము.

***